# శ్రీ శివ మహా పురాణము

## శ్రీ వేదవ్యాస మహర్షి ప్రణీతము
## తెలుగు వచనము


*వచన రచన :*

"సాహిత్య కళానిధి"

శ్రీ విశ్వనాథం సత్యనారాయణ మూర్తి





**రామకృష్ణ మఠం**

దోమలగూడ, హైదరాబాదు – 500 029

# ప్రవేశిక

కరాన త్రిశూలమూ, ఉరాన ఎముకల పేరూ, శిరాన నెలవంకా ధరించి లీలాతాండవలోలుడైన పరమశివునికి శిరస్సు వంచి భక్తి పురస్సరంగా ప్రణామం చేస్తున్నాను అని భాగవతంలో పోతానామాత్యుడు పరమశివుణ్ణి ప్రార్థించాడు. నిర్గుణ నిరాకార, నిర్మోహితుడైన ఆ పరబ్రహ్మమే సాకారరూపుడైన పరమశివుడుగా రూపం దాల్చాడు. 'హర హర మహాదేవ....' అంటూ భక్తి ప్రపత్తులతో తనను స్మరించే ప్రతీ జీవికి ముక్తి మార్గాన్ని ప్రసాదించే పరబ్రహ్మమే మహాశివుడు. ధ్యానయోగమే ముక్తికి రాజమార్గంగా తెలియజేసి తాను కైలాసపతి మహేశ్వరుడుగా ధ్యానయోగంలో లయించి బోధించే పరమగురువు మహాశివుడు. అట్టి పరమశివుని వర్ణనతో కూడినదే 'శివ మహాపురాణం'.

వేదములే మూలములుగా గల అష్టాదశ పురాణాలు ఉన్నాయి. ఆ వేదములు చతుర్ముఖ బ్రహ్మకు పరమశివుడే ఉపదేశించాడు. కనుక వేదములు, వాటి నుండి వెలువడిన శ్రుతి, స్మృతులు, పురాణాలు అన్ని ప్రప్రథమంగా శివుని చేత బ్రహ్మదేవునికి తెలుపబడింది. కాబట్టి మహాశివుడే మొట్టమొదటి పురాణ కథానాయకుడనీ మహాభారతం శాంతిపర్వంలో అష్టాదశ *పురాణానాం దశభిః కథ్యతే శివః* అని పేర్కొనబడింది. అష్టాదశ పురాణాలలో పది పురాణాలు శివుని కథలతో నిండినవని స్పష్టంగా తెలియబడుచున్నది. సర్వవ్యాపకుడు, సర్వాధారుడు, నిర్వికారుడు, నిరంజనుడు అని బ్రహ్మ విష్ణ్వాది దేవతల చేత కీర్తించదగ్గ మహాశివుని లీలా మాహాత్మ్యాన్ని తెలిపేదే ఈ శివ మహాపురాణం. ఈ శివ మహా పురాణం మహా పుణ్య ప్రదాలైన పన్నెండు సంహితలను కలిగి ఉంది. లక్ష శ్లోకాలతో కూడినది. అయితే కలియుగ జీవులు అల్పాయుష్కులని గ్రహించి వ్యాసమహర్షి ఏడు సంహితలు, ఇరువది నాలుగు వేల శ్లోకాలలో సంక్షిప్తం గావించారు. ఈ శివ మహా పురాణం అష్టాదశ పురాణాలలో నాల్గవది. ఏడు సంహితలలో నాల్గవదైన కోటి రుద్ర సంహితలో ద్వాదశ జ్యోతిర్లింగాల ప్రాదుర్భావ చరిత్ర పొందుపరచబడింది.

పురాణాలలో సాగే సంభాషణలలో ఆధ్యాత్మిక సాధకుల సాధనా మార్గాలు తేటతెల్లమవుతాయి. ఉదాహరణకు శివ మహా పురాణం రుద్ర సంహితలో దాక్షాయణి పరమశివుని సమీపించి నివృత్తి మార్గాన్ని ఉపదేశించమని కోరింది. జీవుడు ఏ తత్త్వాన్ని ఎరిగి సంసార

దుఃఖాన్ని దాటగల్గుతాడో ఆ మోక్షసాధనను తెలియజేయమని కోరింది. పరమశివుడు భక్తిమార్గాన్ని బోధించి ముల్లోకాలలో భక్తి కంటె సులభమైన మార్గం లేదని వివరించాడు. ఈ పురాణంలో ప్రతీ ఘట్టం జీవులకు మేలైన సాధనా మార్గాన్ని ప్రతిపాదిస్తుంది.

పురాణ గ్రంథకర్త సాహిత్య కళానిధి శ్రీ విశ్వనాథం సత్యనారాయణ మూర్తి గారు. వీరు పాఠక లోకానికి రామకృష్ణ మఠం ద్వారా ఇది వరలో ప్రచురించబడిన 'సంపూర్ణ హనుమత్ చరిత్రము' ద్వారా సుపరిచితులే. సాహిత్య పఠనమే తపస్సుగా భావించే వీరిని మేము కోరినదే తడవుగా ఈ మహత్తర పురాణ వచన రచనకు అంగీకరించి, మనోహరంగా వ్రాసి ఇచ్చినందుకు వారికి మా హృదయపూర్వక ధన్యవాదాలు. *పఠనాచ్ఛ్రవయా దస్య భక్తి మా న్నర సత్తమః, సద్యః శివపదప్రాప్తిం లభతే సర్వసాధనాత్* – భక్తితో శివపురాణం పఠించే మానవులూ, ఆ పురాణమును భక్తిశ్రద్ధలతో ఆలకించెడివారూ, శివుని భక్తిప్రపత్తులతో ఆరాధించే నరులు, మానవోత్తములై ఇహ లోకంనందు సుఖసౌఖ్యాలను, పరలోకమునందు శివసాన్నిధ్యాన్ని పొందగలరని ఈ పురాణమే చెబుతోంది. మఠం ద్వారా ప్రథమంగా వెలువడుతున్న ఈ శివ మహా పురాణాన్ని తెలుగుపాఠకులు ఆదరిస్తారని ఆశిస్తూ...

– ప్రకాశకులు



శ్రీ

శ్రీ గణేశాయ నమః

శ్రీ గౌరీ శంకరాభ్యాం నమః

## ఇదంతా... శ్రీ పరమేశ్వర కరుణా కటాక్షం....!!!

**శ్లో॥ దిక్కాలాద్యన విచ్ఛిన్నానన్త చిన్మాత్ర మూర్తయే ।**
**స్వానుభూత్యేకమానాయ నమశ్శాన్తాయ తేజసే ॥**

(భర్తృహరి సుభాషిత త్రిశతి)

**తా॥** దేశకాల వస్తు పరిచ్ఛేదములు లేనిది, పరిమితి లేనిది, జ్ఞానమాత్ర స్వరూపమైనది, అనుభవించి తెలిసికొన తగినది, మిక్కిలి ప్రసన్నమైనది, జ్యోతి స్వరూపమైనది అగు బ్రహ్మమునకు నమస్కారం.

మహాత్ముడు, సర్వార్థవిదుడు, పరమ కారుణికుడు, యోగీశ్వరుడు ఐన భర్తృహరి లోక వ్యవహారాన్ని పరిశీలించి పరమార్థదూరులై సంచరిస్తూన్న లోకుల నడవడికను చూసి శోకవ్యాకులిత చిత్తుడై లోకులను ఉద్ధరింపదలచి; నీతి శృంగార వైరాగ్య స్వరూప స్వభావములను వాటి తత్త్వాన్ని కవితా పరిపాకంతో కూడిన మూడు వందల శ్లోకాలలో “సుభాషిత త్రిశతి” అను పేరుతో లోకానికి ఉపదేశించాడు. నేను పైన ఉదాహరించిన శ్లోకం... ఆ మహానుభావుడు తన గ్రంథానికి తిలకాయమానంగా తీర్చిదిద్దిన మంగళాచరణ శ్లోకం! రేణువంత శ్లోకంలో మేరువంత భావాన్ని ఇముడ్చుకున్న శ్లోకం. తాత్త్వికులైన వారికి పరమానందాన్నిచ్చే ఉపనిషత్తుల సారభూతమైన శ్లోకం. నామారూపాదులతో నిమిత్తం లేని నిర్గుణోపాసకులకు మార్గనిర్దేశం చేసి నడిపించే శ్లోకం! కుక్షిలో బ్రహ్మాండములను దాచుకొన్న పరమాత్మను మన మనోయవనిక మీద రంగుల్లేని బొమ్మగా చిత్రీకరించి, హృదయ పుండరీకంలో మెఱుపుగా భాసింప చేసే శ్లోకం! అనుభూతికి వినా ఆ పరమాత్మ తత్త్వం దేనికీ అందదు అని గడుసుగా చెపుతూనే.... పుష్య మాసపు పొగమంచులా స్పష్టాస్పష్టంగా కనులముందు శుద్ధ సాత్త్విక భావారోపణతో ఆ తత్త్వాన్ని నిలబెట్టి మనకు తరుణోపాయాన్ని చూపించిన శ్లోకం!

ఇంతకీ శివ మహాపురాణానికి పీఠిక వ్రాస్తూ భర్తృహరి ప్రశంస ఎందుకంటారా? .... చెపుతున్నా... యోగంలో జ్యోతిస్స్వరూపమైన పరమాత్మను దర్శించి, శుద్ధ నిర్గుణ నిరాకారంగా ఉపాసించి, తన ప్రార్థన శ్లోకంలో అలాగే వస్తు నిర్దేశం చేసిన ఆ పరమ యోగీశ్వరుడైన భర్తృహరి తన వైరాగ్య శతకంలో ఏమంటున్నాడో చూడండి.....

**శ్లో॥ మహేశ్వరేవా జగతామధీశ్వరే**
**జనార్దనేవా జగదన్తరాత్మని ।**
**న వస్తుభేద ప్రతిపత్తి రస్తిమే**
**తథాపి భక్తిస్తరుణేన్దు శేఖరే ॥** (వైరాగ్య శతకం. 84)

**తా॥** జగములకెల్ల అధీశ్వరుడైన శివునియందు గాని, సకల లోకములయందు అంతర్యామియై వ్యాపించి యున్న విష్ణువు యందు గాని నాకు భేద భావంగాని, తారతమ్యంగాని లేదు. అయినప్పటికి సకల లోకాలకు ఆహ్లాదాన్ని కలిగించే చంద్రుణ్ణి శిరోభూషణంగా ధరించిన శివుని యందు, నాకు భక్తి స్వభావ సిద్ధంగా ఉంది.

జగత్కారణమైన సిద్ధ వస్తువును శుద్ధ నిర్గుణ నిరాకారంగా తన ప్రార్థన శ్లోకంలో ప్రతిపాదించిన పరమయోగియైన భర్తృహరి..... ఎంత వైరాగ్యం ఒంట పట్టిన వాడైనా ఆ తత్త్వాన్ని సగుణంగా సాకారంగా ఉపాసించి దర్శించి ఇక్కడ మనకు ఉపదేశిస్తున్నాడు. ఆ తత్త్వం శివతత్త్వమే. కాబట్టి మనకు శివుని పాదపద్మాలను ఆశ్రయించటం తప్ప "నాన్యాగతిః" వేరే గతి లేదు.

ఇలా మాట్లాడిన వాడు భర్తృహరి ఒక్కడేనా? ఇంకెవరూ లేరా? అంటే ఉన్నారు. మహా మీమాంసా మూర్ధన్యుడు, శతాధిక గ్రంథకర్త అయిన అప్పయ్య దీక్షితులవారు కూడా "మాకు శివకేశవులయందు భేద భావం లేదుగాని ఎందుకో నాచిత్తం శివునియందు చిన్నమెత్తైన మొగ్గు చూపుతున్నది అని స్వభావాన్ని వెల్లడించారు. అంతే కాదు... ".....అపిచ పశుపతి స్సర్వదేవ ప్రకృష్టః". శివుడే సర్వదేవ ప్రకృష్టుడు అని నిష్కర్ష చేసి చెప్పారు. దీనినే మకుటంగా చేసుకొని దీక్షితులవారు చాలా శ్లోకాలను చెప్పారని పండితు లంటారు.

శివ భక్తి యెక్క మాధుర్య విశేషాన్ని వర్ణిస్తూ.....

**తా॥** "ఆవగింజంత బూది మైనలది కొనిన వెలది! గుమ్మడి కాయంత వెట్టి పుట్టు." అంటాడు బ్రాహ్మీదత్త వరప్రసాదుడు, కవిసార్వభౌముడు అయిన శ్రీనాధుడు ... తన హరవిలాసంలో.

ఇంతకీ శివభక్తి విశేషం ఎట్టిదనగా.......

ఈ భూమి మీద జన్మించిన ప్రతిమానవుడు నాలుగు ప్రశ్నలను తనకు తానే సంధానించు కొనాలి. 1. నేనెవరిని?, 2. నేనెక్కడ నుంచి వచ్చాను?, 3. ఇక్కడ నా కర్తవ్యం ఏమిటి? 4. శరీర పతనానంతరం నేనెక్కడికి వెడతాను?

**సమాధానాలు:-** 1. నేను సాక్షాత్తు శివస్స్వరూపుడను.
2. శివుని నుండే వచ్చాను.
3. ఇక్కడ శివజ్ఞానాన్ని పొంది ఆ ఎరుకతో జీవించాలి.
4. సకల జీవులకు గమ్యుడు శివుడొక్కడే.

ప్రశ్నలెన్నైనా సమాధానం మాత్రం శివుడే! సర్వం శివాత్మకం. అదే చివరి మాట. కష్టాలు, సమస్యలు వచ్చినప్పుడు మానవుడు అన్యదైవాలను ఆశ్రయించినా ఆంతర్యంలో మాత్రం అప్పయ్య దీక్షితుల వారు చెప్పినట్లు ముక్తికొరకు అవిభాజ్యమైన అర్ధనారీశ్వర తత్త్వాన్ని ఆశ్రయించక తప్పదు. వరిముల్లంతైనా చిత్తం శివుని వైపు మొగ్గటానికి కారణం ఉండాలిగదా? ఆ హేతువేమిటి? అని అంటే... ఉంది.

దాహార్తిచే కుమిలి పోతున్న పక్షిసైతం జలవనరును వెతుక్కొంటుంది. అలసిన బాటసారి విశ్రాంతిని అన్వేషిస్తాడు. జీవన గమనంలో ఎప్పుడో ఒకప్పుడు కనీసం ప్రొద్దు పడమటకు వ్రాలి నప్పుడైనా ఈ భౌతిక ప్రపంచం పట్ల మానవుడు విరక్తుడు కాక తప్పదు. కాంతా కాంచనాల విషయంలో ఏవగింపు కలుగక మానదు. అలా కలుగక పోతే అదృష్టవంతులైన వారి విషయంలో ఆ సన్నివేశాన్ని ఈశ్వరుడే కల్పిస్తాడు. కామదహనుడైన శివుడొక్కడే పరమ వైరాగ్య సంపన్నుడు. జ్ఞానాశ్రయుడు శంకరుడొక్కడే! ఆయనకు ఏ సేవలు, భోగాలు, ఆడంబరాలు ఇతర వైభోగాలు అక్కర లేదు. బొటనవ్రేలు పరిమాణంలో మట్టితో లింగాన్ని చేసి చెంబెడు నీళ్ళు పోస్తే చాలు! పిలిచావా అని ప్రత్యక్ష మవుతాడు! అందుకే జ్ఞానవైరాగ్య సంపన్నులైన మహానుభావులందరు ఈశ్వరారాధనాశీలురే!

శ్రీ మహా విష్ణువు తానెత్తిన అవతారాలన్నీ దుష్ట సంహారము, శిష్ట సంరక్షణ కొరకే గదా. ఆ అవతారములలో లింగార్చనా విధిని నెరవేర్చేదని గ్రంథాలలో స్పష్టంగా ఉంది. సంహారకర్త రుద్రుడు. ఆయన అనుగ్రహం లేకుండా సంహారక్రియ ఎలా నెరవేరుతుంది? పరమాత్మ కాల స్వరూపుడు. కాలం కంటికి కనుపించదు. ఊహలో బుద్ధికి అందుతుంది.

దివారాత్ర విభాగ రూపమైన దిన ప్రమాణం అర్ధనారీశ్వర స్వరూపం. అందులో పగటి భాగం ధవళాఖిలాంగుడైన మహాకాల స్వరూపం. రాత్రి భాగం కాలవర్ణ స్వరూపురాలైన మహాకాళీ స్వరూపం. ఈ రహస్యాన్ని గుర్తెరిగిన పరమ పూజ్యులైన శ్రీరామకృష్ణ పరమహంస మహాకాళిని ఉపాసించి కృత కృత్యులయ్యారు. ఆ మహా పురుషుడు అన్ని మతాల ఆరాధనా పద్ధతులలోను, ఉపాసనా మార్గాలలోను సాధనచేసి, 'తత్త్వం' ఒక్కటే అని చెప్పిన ఋషి. ఆయన దినచర్యలో ప్రతి నిత్యము భక్తులను కాంతా కాంచనాలకు దూరంగా ఉండమని, దాని వ్యామోహంలో పడ వద్దని హెచ్చరించేవారు. వ్యామోహదూరులు కావటానికి శివభక్తి వినా వేరు మార్గం లేదు. శివజ్ఞాన లబ్ధికి ప్రయత్నించటం మినహా మానవునకు వేరు కర్తవ్యం లేదు..

జీవలోకం అనేది ఒకటున్నది. ఆ లోకంలో అసంఖ్యాక జీవులుంటారు. ఆ జీవులన్నీ ఈ భూమి మీద ఏదో ఒక ఉపాధిని (శరీరాన్ని) పొందాలని తహతహ లాడుతూ ఉంటాయి. వాటి తహ తహను మనం అర్థం చేసికొంటే.... ఈ భూమి మీదగల ప్రాణికోట్లలో మానవ జన్మ ఎంత దుర్లభమో తెలుస్తుంది. అట్టి ఉత్కృష్టమైన జన్మను పొంది కూడ శివజ్ఞాన లబ్ధికై ప్రయత్నించక పోతే అట్టి మానవుని ఎవరు రక్షించ గలరు? పరమేశ్వరుని కంటే అత్యంత ప్రియమైన వస్తువు ఉందా లోకంలో? ఆయనకంటే ఇష్ట సఖుడున్నాడా? ఆయన కథలను వినటంకంటే చదవటం కంటే మరొక వినోదం, మరొక ముఖ్యమైన కార్యం నిజంగా ఉందా మనకు? అలసిన జీవితాలకు ఆయన స్థానాన్ని మించిన విశ్రాంతి స్థానం ఉందా? ఆ మాధుర్యాన్ని రుచి చూచిన ఎందరో భక్తులు ఆ అమృతుణ్ణి గూర్చి ఎంతగానో గానం చేశారు. ఆయన సాన్నిధ్యానికై తహతహలాడేరు. ఎడబాటుకు కుమిలి పోయారు.

జగన్మోహనుడు, మన్మథ మన్మథుడు అయిన శ్రీకృష్ణ సందర్శన కాంక్షాతత్పరలైన గోపికలు విరహాన్ని తట్టుకోలేక "......నిను యెప్పుడు చూడకుండ లక్ష్మీవర! రెప్పలడ్డముగ జేసె ఇదేల విధాత క్రూరుడై!" – అని సృష్టి కర్తను సైతం నిందించారు. ఆహా! ఎంత భక్తి తీవ్రత! దీనినే రామకృష్ణ పరమహంసగారు నీటిలో మునిగిపోతున్న వ్యక్తి దాన్నుండి బయట పడటానికి ఎంతగా తహతహ లాడుతాడో అంత తపన భగవంతుని విషయంలో భక్తునికి ఉండాలంటారు. అంతా శివుడే కనుక అట్టి ఆర్తికూడా శివాను గ్రహం వలన మాత్రమే కలుగుతుందని... అంటుంది ఈ శివ మహా పురాణం.

ఈ శివ మహా పురాణం ఇరవై నాలుగువేల శ్లోక సంఖ్య గలది. పురాణ లక్షణాన్ని ఇలా చెప్పారు పెద్దలు.

**శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।**
**వంశానుచరితం చైవ పురాణం పంచ లక్షణమ్ ॥**

1. సర్గము, 2.ప్రతి సర్గము, 3. వంశము, 4. వంశాను చరితము, 5.మన్వంతరము. 'వంశాను చరితం చైవ' అను చోట 'భూమ్యాదేశ్చైవ సంస్థానం' అని పాఠాంతరం ఉంది.

**1). సర్గము:-** అనగా సృష్టి. ఒకదాని నుండి మరొకటి పుట్టు కొంటూ వచ్చిన అవరోహణ క్రమాన్ని చెప్పుట.
**2). ప్రతి సర్గం :-** ప్రళయం ఆరోహణ క్రమంలో ఎలా జరుగుతుందో చెప్పుట.
**3). వంశము:-** ప్రజాపతుల, బ్రహ్మమానస పుత్రుల, దేవతల, రాక్షసుల, రాజుల ఇత్యాది అనేకుల వంశముల గురించి విస్తరించి చెప్పుట.
**4). వంశాను చరితం:-** ఆయా రాజ వంశాలలో తదనంతర కాలంలో జన్మించిన రాజుల చరిత్రను చెప్పుట.
**5). మన్వంతరం:-** స్వాయంభువాది చతుర్దశ మనువుల గురించి సప్తర్షులు మరియు మునుల గురించి చెప్పుట.

**భూమ్యాదుల సంస్థానం:-** భూమి యొక్క పరిమాణము, భూమి మీద గల ద్వీపములు, పర్వతములు, నదులు, జనులు ఇత్యాది వర్ణన.

పురాణ శబ్దానికి పండితులు ఇలా వ్యుత్పత్తిని చెప్పారు.

పురా భవమ్ అనగా పూర్వం ఇలా జరిగింది.

పురాఽపి నవమ్ అనగా పూర్వం ఎప్పుడో జరిగినా లేదా రచింపబడినా ఎప్పటికి క్రొత్తగానే ఉండునది.

నారద పురాణాన్ని అనుసరించి పద్దెనిమిది పురాణాలలోను గల శ్లోకములను కూడగా నాలుగు లక్షల ఒకవంద (400100) సంఖ్య తేలింది. అలాగే మత్స్య పురాణాన్ని అనుసరించి నాలుగు లక్షల రెండువేల రెండువందల సంఖ్య తేలింది. అలాగే శ్రీ దేవీ భాగవతం ప్రకారం నాలుగు లక్షల పన్నెండు వందల సంఖ్య తేలింది (401200). చరిత్రను

దానితోపాటుగా ఇతర అమూల్యమైన విజ్ఞానాన్ని గ్రంథస్థం చేయటం కొరకు పురాణ ప్రక్రియకు మన పూర్వులు శ్రీకారం చుట్టేరనేది స్పష్టం. అందువల్ల పురాణాలే మన పూర్వ చరిత్ర సంపుటాలు, విజ్ఞానకోశములున్ను. పురాణాలలో ఎన్నెన్నో అమూల్య విషయాలున్నాయి.

**ఉదాహరణకు: తన రాజ్యంలో వర్షం పడక ప్రజలు అల్లాడిపోతుంటే కంసుడు తన బాణాలచే మేఘ గర్భాలను చీల్చి వర్షాన్ని కురిపించినట్లుగా విష్ణు, బ్రహ్మ పురాణాలలో స్పష్టంగా ఉంది.**

❊ ❊ ❊ ❊ ❊

ఇక ప్రస్తుతం శివ మహాపురాణం మీచేతుల్లో ఉంది. ఇందులో ఎన్నో అమూల్యమైన విషయము లున్నాయి అని చెపితే చాలు. ఒక్క విషయం మనవి చేస్తాను. ఈ పురాణం పాపములకు ప్రాయశ్చిత్తాలను చెపుతూ సర్వ పాపములు భిక్షాటనం వలన క్షయమవుతాయి అని చెప్పింది. ఏ కల్మషములేని శివుడే ఆదిభిక్షువు అయ్యాడు. శ్రీరామకృష్ణ పరమహంసగారి దినచర్యను గ్రంథస్థం చేసిన మాస్టర్ యమ్ గారు (మహేంద్రనాథ్ గుప్తా గారు) ఐచ్ఛికంగా కొంతకాలం భిక్షాటన చేసి కొంటూ భిక్షుకుల మధ్య జీవించారని చదివాను. పరమ పూజ్యులైన కరపాత్ర స్వామి వారు భిక్షాటనం చేసికొని జీవించే వారు. అలాగే బుద్ధుడు, షిర్డి సాయి కూడ. త్యాగరాజుగారు ఉంఛ వృత్తితో జీవించారు. ఇలా ఎందరెందరో భిక్షుకులై జీవించారు. వారందరు శివస్వరూపులే. మన సంప్రదాయపు లోతులు, మూలములు పురాణాల్లో ఉన్నాయి. భిక్షాటన అన్ని సందర్భాలలోను లేమికి చిహ్నం కాదు. ఉపనయన సమయంలో వటువు భిక్షాటనం చేస్తాడు. సాక్షాత్తు పరమేశ్వరుడు 'ఆదిభిక్షువు'.

పాపములన్నిటిలోను కృతఘ్నతకు (చేసిన ఉపకారాన్ని మరచిపోవుట) మించిన పాపం లేదని వ్యాస భగవానుడు మహాభారతంలో నాడీజంఘుని వృత్తాంతంలో చెప్పారు. పుణ్యకార్యము లన్నింటిలోను కృతజ్ఞతకు మించిన పుణ్యం లేదని మహా భారతంలో ఇంద్ర–కీర (చిలుక) సంవాదంలో చెప్పారు ఆయనే.

పరమేశ్వరానుగ్రహం ఎప్పుడు ఎవరిమీద ఎలా వర్షిస్తుందో తెలియదు గదా! గతంలో 2007 వ సంవత్సరంలో **"సంపూర్ణ హనుమత్ చరిత్ర"** అనే గద్య కావ్యాన్ని వచనంలో వ్రాసాను. ఆ కావ్యాన్ని హైదరాబాదు, రామకృష్ణ మఠాధ్యక్షులు చాలా పెద్ద మనసుతో సర్వాంగ సుందరంగా ప్రచురించి నన్ను మిక్కిలి ఆదరించారు. ఆ గ్రంథం

తెలుగు వారందరి ప్రశంసలకు పాత్రమైంది. ఆ విధంగా రుద్ర స్వరూపుడైన హనుమ కృపకు పాత్రుడనయ్యాను.

ఇప్పుడు సాక్షాత్తు శివానుగ్రహములో తడిసిముద్ద అయినాను. హైదారాబాదు, రామకృష్ణ మఠాధ్యక్షుల అభిలాష మేరకు ఈ శివ మహాపురాణాన్ని సుందరమైన వచనంలో వ్రాశాను. ఈ సందర్భంలో మఠాధ్యక్షులైన పూజ్య జ్ఞానదానంద మహారాజ్ గారికి నా ప్రణామాలు. వారిని నన్ను ఏదో ఒక అదృశ్యశక్తి కలిపింది. ఆ సమాగమం నా యొక్క రెండు ఆధ్యాత్మిక గ్రంథముల ప్రచురణకు దోహదమై నన్ను చరితార్థుణ్ణి చేసింది.

నాయొక్క ఈ పురాణ రచనకు శ్రీ వేంకటేశ్వర ఆర్ష భారతి ట్రష్టువారు ప్రచురించిన శివ మహాపురాణమే ఆధారం. వారీ గ్రంథాన్ని మూలంతోను తత్త్వ విదానంద సరస్వతీ స్వామి వారు వ్రాసిన తెలుగు తాత్పర్యం తోను ప్రచురించారు. స్వామి వారికి నా ప్రణామాలు. స్వామివారు నా గురువుగారైన బ్రా॥శ్రీ॥ రాణి నరసింహ శాస్త్రిగారి పుత్రులు. శ్రీ శాస్త్రిగారి సన్నిధిలో కొంత శంకరాద్వైత ఉపనిషద్భాష్యాన్ని శ్రవణం చేశాను. ఆ సంస్కారం ఈ గ్రంథరచనలో నాకు బలంగా తోడ్పడింది. ట్రష్టు వారికి నా కృతజ్ఞతలు.

మహాభారతంలో శరతల్పగతుడైన భీష్ముని శ్రీకృష్ణుడు పరామర్శించటానికి వెళ్ళి "శాంతనవా! ఎలా ఉన్నావు?" అని కుశలాదిక మడుగుతాడు. దానికి సమాధానంగా "ఏం చెప్పమంటావు కృష్ణా! 'ఆలుబిడ్డలు లేనట్టి యట్టి వాడ" అని భీష్ముడు కంటినీరు పెట్టు కొంటాడు. పరమేశ్వరాను గ్రహంచే సంసార బంధం లేక పోవటంలో నాస్థితి భీష్ముని స్థితి ఒక్కరూప! నా గ్రంథాలే నా ఆప్తమిత్రులు. సాహిత్య పఠనమే నా తపస్సు. నా రచనలే నా సంతానం. ఏడుపదులు నిండిన ఈ వయస్సులో దాదాపు వేయి పుటల గ్రంథాన్ని చేతి వ్రాత వ్రాయ వలసి వచ్చింది. గ్రంథం పరిసమాప్తి కాగానే నా శివుడు నాకు దూరమై పోతున్నాడే అని దుఃఖం వచ్చింది. దాదాపు సంవత్సర కాలంపైన ఈ గ్రంథ రచనలో తలమున్కలై ఉన్న కారణంగా శివుడు ఆత్మబంధువైనాడు.



తనయులున్నా తల్లిదండ్రుల కష్టసుఖాలను పట్టించుకోని ఈ కాలంలో.... నా కీర్తి ప్రతిష్ఠలే తనవిగా యెంచి మురిసి పోతున్న నా అన్నయ్య సుబ్బారావు, వదిన శాంత గార్లకు నా నమస్కారాలు.

నా సుఖ దుఃఖములే స్వీయానుభవములుగా యెంచి ఆత్మీయంగా సేవలందిస్తూన్న నా సోదర దంపతులు చి॥ విశ్వేశ్వర ప్రసాదు–లలిత గార్లకు, చి॥ శేషగిరి రావు, సూర్య ప్రభ గార్లకు నా ఆశీస్సులు. కుటుంబ సభ్యులందరకు నా కృతజ్ఞతలు.

శివ మహాపురాణ మూల గ్రంథం (తెలుగు తాత్పర్యంలో కలిపి) నాలుగు సంపుటాలు. మూడు నాలుగు సంపుటాలు నాకు లభ్యంకాక ఆందోళన పడుతున్న స్థితిలో తనవద్ద ఉన్నవాటిని నాకిచ్చి ఉపకారం చేసిన నా చిరకాల మిత్రుడు శ్రీ ధూళిపాళ మహదేవ మణికి నా కృతజ్ఞతలు.

ప్రారంభంలో నన్ను రామకృష్ణ మఠం వారికి పరిచయం చేసిన నా ఆప్తమిత్రులు శ్రీ యమ్.వి. రాజశేఖర రెడ్డి, శ్రీ వెలిది శ్రీనివాస రావు గార్లకు నా కృతజ్ఞతలు.

శివానుగ్రహం సర్వులకు ప్రాప్తించును గాక!

ఇంద్ర పాలెం
కాకినాడ –6
16–08–2010

బుధజన విధేయుడు,
సాహిత్య కళానిధి,
**విశ్వనాథం సత్యనారాయణ మూర్తి.**

# విషయ సూచిక





శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## విద్యేశ్వర సంహిత



**శ్రీ గణేశాయ నమః । శ్రీ గురుభ్యో నమః । శ్రీ సరస్వత్యై నమః**

**అథ శివపురాణే ప్రథమా విద్యేశ్వర సంహితా ప్రారభ్యతే ।**

శ్రీ గణేశునకు నమస్కారం. శ్రీ గురుదేవులకు నమస్కారం. శ్రీ సరస్వతికి నమస్కారం. ఇపుడు శివపురాణమందలి మొదటిదైన విద్యేశ్వర సంహిత ప్రారంభింప బడుతూన్నది.

**ఆద్యంత మంగళమజాత సమాన భావ**
**మార్యం తమీశ మజరామర మాత్మదేవమ్ ।**
**పంచాననం ప్రబల పంచ వినోద శీలం**
**సంభావయే మనసి శంకర మంబికేశమ్ ॥**

**తా॥** శంకరుడు ఆద్యంతము మంగళ స్వరూపుడు. ఆయనతో సమానమైన తత్త్వం ఎక్కడనూ లేదు! ఆయనకు జనన మరణాదులు లేవు! సృష్టి, స్థితి, లయ, తిరోధాన అనుగ్రహములనే పంచ కర్మలను ఆయన లీలామాత్రంగా నెరవేరుస్తూ ఉంటాడు. ఆయన పంచముఖుడు. శక్తి స్వరూపిణి ఐన అంబికతో కూడినట్టి ఆ అవిభాజ్య తత్త్వాన్ని, పరమోత్కృష్టమైన దానిని మనసులో ధ్యానిస్తున్నాను.

**శ్లో ॥ ధర్మక్షేత్రే మహాక్షేత్రే – గంగాకాళింది సంగమే ।**
**ప్రయాగే పరమే పుణ్యే – బ్రహ్మలోకస్య వర్త్మని ॥**
**మునయశ్శంసితాత్మాన – సత్యవ్రత పరాయణాః ।**
**మహౌజసో మహాభాగా – మహాసత్రం వితేనిరే ॥**

*వ్యాసుడిలా అంటున్నాడు:*

**రోమహర్షణుడను సూతుని మునులు ప్రశ్నించుట**

ధర్మక్షేత్రము, గంగాయమునా సంగమ స్థానము, బ్రహ్మలోక మార్గము, పుణ్యప్రదము ఐన ప్రయాగ క్షేత్రంలో జితేంద్రియులు, సత్యవ్రతులు, తేజశ్శాలురు, మహాత్ములు ఐన మునులు మహా సత్రయాగాన్ని అనుష్ఠిస్తున్నారు. ఆ వార్త విన్న వ్యాస శిష్యుడు,మహాముని, నిఖిల పురాణ వ్యాఖ్యానవైఖరీ సమేతుడైన సూతుడు మునిర్దర్శన కాంక్షాతత్పరుడై విచ్చేశాడు. అలా వచ్చిన సూత మహామునిని చూచి మునులందరూ హర్షోన్మీలిత సుప్రసన్న మనస్కులై ఆయనను యథావిధిగా పూజించి, వినయంగా దోసిలొగ్గి స్తుతించి ఇలా అభ్యర్థించారు. "ఓ రోమహర్షణా! నీవు సర్వజ్ఞుడవు! నీవు భాగ్యవంతుడవు! రత్నగర్భ ఐన వసుంధర ఇచ్చే అన్ని సంపదల కంటె విద్యా సంపద పరమోత్కృష్టమైనది... అనిగదా పెద్దల సూక్తి. వేద హృదయాన్ని విప్పిచెప్పే పురాణ విద్యను నువ్వు వ్యాస భగవానుని సన్నిధిలో నిర్విశేషంగా గ్రహించావు. సారభూతమైన రత్నాలకు సముద్రుడు స్థానమైనట్లుగా అద్భుతుడైన పరమాత్మ యొక్క ఆశ్చర్యగాథలను వివరించి చెప్పిన పురాణ వాఙ్మయానికి నీవు ఆశ్రయభూతుడవయ్యావు.

ఓ సూత మహామునీ! నీవు త్రికాలజ్ఞుడవు. నీకు విదితం కాని వస్తువు ముల్లోకాలలోను లేదు. నీ రాక మాకు శారద పూర్ణిమా విమల చారుతరోజ్వల చంద్రజ్యోత్స్నలా ఆహ్లాదాన్నిస్తోంది. కోరకుండ వరాన్నిచ్చే దైవసముడవు నీవు. నీ ఆగమనం మాకు అదృష్టపు పంట. పండిన పంట ఫలాన్ని దక్కించుకోని అవివేకి లోకంలో ఉంటాడా? నీవు మాకేదో శ్రేయస్సును అనుగ్రహించు. నీరాక వృథా కారాదు. తత్త్వాన్ని గూర్చి, మానవులకు శుభా శుభాలనిచ్చే విధినిషేధ రూపమైన కర్మలను గూర్చి, గతంలో చాలా విని ఉన్నాం. ఐనా తృప్తి లేదు . ఇంకా వినాలనే కోరిక మిక్కుటంగా ఉంది. పరమేశ్వరుని యందు నిశ్చలమైన బుద్ధిగల ఓ సూతమునీ! నీ నుండి మేమొక విషయాన్ని తెలుసుకోవాలనే కుతూహలాన్ని కలిగి ఉన్నాం. అది రహస్యమే కావచ్చు. మాయందు అనుగ్రహంతో చెప్పు. అదేమిటంటే: రాబోయే కలియుగంలో మానవులందరు దురాచార వర్తనులు, సత్యవాక్య పరాఙ్ముఖులు అవుతారని విన్నాం. అట్టి భయంకరము, పాప భూయిష్టము ఐన కలిలో శీఘ్రంగా పాపాలను తొలగించుకొనే తేలికైన ఉపాయమేది? కలిలో మనుష్యుల ప్రవర్తన ఎలా ఉంటుంది? దానికి తగినట్లుగానే ప్రకృతి ఎలా ఉంటుంది? కేవలం భగవంతుడున్నాడు అనే ఆస్తిక్య

బుద్ధి ఉంటే సరిపోదు గదా! పరమేశ్వరుని స్వరూప, స్వభావాదులెట్టివి? ఆయన తత్త్వ మెట్టిది? మోక్షం అంటే ఏమిటి? దాన్నెలా పొందాలి? ఆయన సగుణుడా లేక నిర్గుణుడా?".

**ఋషుల ప్రశ్నలకు సూతుని సమాధానం**

ఈ విధంగా ఎంతో జిజ్ఞాసతో, ఆర్తితో ప్రశ్నించిన మునులను పరికించి పరమ దయాళువైన సూతుడిలా సమాధానం చెప్ప సాగాడు. "ఓ సత్యవ్రతులైన మునులారా! మీరడిగిన ప్రశ్నలు చాలా జటిలమైనవి. వాటికి సమాధానాలు చెప్పటం కూడా దుష్కరమే. అంత కంటే కూడా కష్టం అర్థం చేసికొనటం. ఇది గూఢం. భగవత్సంబంధమైనదేదీ వార్తా విశేషం కాకూడదు. ఐనా ఆంతర్యంలోని మీ తపనను గ్రహించి, పరమ కారుణ్య మూర్తియైన మా గురుదేవులు వ్యాస భాగవానుని స్మరించి, ఆయన అనుగ్రహ లేశంతో నేనార్జించిన జ్ఞాన భిక్షను మీ కనుగ్రహిస్తున్నాను. శ్రద్ధా భక్తులతో, శ్రవణపేయంగా వినండి.

ఓ అహింసా మూర్తులారా! మీరన్నట్లు కలియుగం చాలా ఘోరమైనది. కలిలో మానవుల ప్రవర్తన నమ్మశక్యం కానట్లుగా ఉంటుంది. పాప పుణ్య వివక్ష ఉండదు. అందరూ దురాచారులే. సత్యభాషణం అనేది అడుగంటి పోతుంది. ఆత్మస్తుతి – పరనిందతో కాలక్షేపం చేస్తారు. అందరూ దోషైకదృక్కులే. పరస్త్రీ, పరధనాలను పటిక బెల్లపు అచ్చులా చప్పరించేస్తారు. ఎక్కడ చూచినా హింస. ఆత్మదృష్టి లేనివారై, దేహతాదాత్మ్య బుద్ధి కలిగి దాన్ని పెంచి పోషించు కొనటంలోనే ఎక్కువ కాలం వెళ్లబుచ్చుతూ ఉంటారు. తల్లిదండ్రుల పట్ల, గురువుల విషయంలోను, జ్ఞానుల విషయంలోను గౌరవం లేనివారై ఉంటారు. స్త్రీలను భోగ సాధనంగా భావించి కామతంత్ర పరాధీనులై ఉంటారు. స్నేహం విషయంలో కాపట్యాన్ని కలిగి ఉంటారు. విప్రులు వేదాన్ని విక్రయిస్తారు. వారు లోభగ్రస్తులు, ఆశాపాశ బంధితులు అవుతారు. ఆకారణంగా బ్రహ్మానందాన్ని అనుభవించే బ్రాహ్మీభూత స్థితి నుండి చ్యుతులౌతారు. జాతి ధర్మాన్ని, కర్మలను విడిచి వర్ణసంకరం చేస్తారు. అహంకార, మమకారాలకు వశులై ఆత్మజ్ఞాన శూన్యులవుతారు. వారిలో సమత్వబుద్ధి ఉండదు. ఇక శీలమనేది శూన్యం. ఈ విధంగా ధర్మాచరణ విషయంలో ధృవ నక్షత్రంలా నిలబడ వలసిన బ్రాహ్మణుడు పతనం కాగానే మిగతావారందరు ఆమార్గంలోనే భ్రష్టులవుతారు. కలిలో క్షత్రియులలో క్షత్రియత్వం ఉండదు. గో, బ్రాహ్మణ రక్షయందు నిష్ఠ ఉండదు. భోగలాలసత్వం అధికంగా ఉంటుంది. క్రయ, విక్రయాలలో కపటం హెచ్చుగా ఉంటుంది.

స్త్రీలలో పాతివ్రత్య ధర్మం ఉండదు. సంపాదనను బట్టి భర్తను గౌరవిస్తారు. అత్త, మామలను ఆదరించరు. స్త్రీలకు కేశములే అలంకారములు. రత్నాభరణాదులు ఉండవు. స్వేచ్ఛావర్తనాన్ని కలిగి ఉంటారు. అధిక సంతానవతు లవుతారు. ఇక పాలకుల సంగతి : ధనవంతుడే పాలకుడవుతాడు. పన్నులు వసూలు చేయటమే కాని ప్రజల బాగోగులు పట్టించుకోరు. క్రూర స్వభావాన్ని కలిగి ఉంటారు. దొంగలు పాలకు లవుతారు. పంక్తి బాహ్యులైన నటులు గౌరవ భాజను లవుతారు. ప్రజల ధన, మాన, ప్రాణాలకు రక్షణ ఉండదు. దేవాలయ వ్యవస్థ సక్రమంగా నడవదు. జనులందరకు జీవనం కష్టంగా ఉంటుంది.

మానవులకు ప్రకృతి పట్ల పూజ్యభావం ఉండదు. ప్రకృతిని శక్తి స్వరూపంగా యెంచరు. భోగ సాధనంగా భావిస్తారు. ఆకారణంగా ప్రకృతి సహకరించదు. ప్రకృతి-పురుషుల మధ్య సామరస్యం లోపిస్తుంది. సమన్వయం ఉండదు. తత్ఫలితంగా ప్రకృతి విజృంభిస్తుంది. గతి తప్పుతుంది. దానికి సూచనగా భూమి నిస్సార మవుతుంది. రసగంధ ద్రవ్యములు పసను కోల్పోతాయి. పువ్వులలో వాసన ఉండదు. పండ్లలో రసముండదు. సమస్తమైన పదార్థాలు రుచిని కోల్పోతాయి. పాలలో జిడ్డు ఉండదు. ఈ సూచనలు రాబోయే విపత్తుకు సంకేతాలనే విషయాన్ని గ్రహించి పాలకులు - ప్రజలు ధర్మాచరణకు ఉపక్రమించక పోతే ప్రళయం తప్పదు.

నరులలో ఇంత దుర్మార్గ ప్రవర్తనగల పాపపు కలియుగంలో సైతం సులువుగా తరించే ఉపాయం లేదా? అంటే ఉంది. దానికి పెద్ద ప్రయత్నం అక్కర లేదు. ఎందుకంటే అది సిద్ధ వస్తువు కనుక! సాధ్య వస్తువుకు ప్రయత్నం గాని సిద్ధ వస్తువుకు ప్రయత్న మేముంటుంది? చిలుక చెట్టుపై వ్రాలి పండును ఆస్వాదించినంత తేలికైన మార్గం అది . ఆ ఉపాయాన్ని ఉపదేశిస్తున్నాను. "పవిత్రమైన అంతః కరణంతో వినండి". అని ఈ విధంగా సూతుడు చెప్పి మనసులో శంకరుని స్మరించి మునులతో ఇలా అన్నాడు.

**శివ పురాణ పరిచయం**

"ఓ తపోధనులారా! ఇంతకు ముందు మీరడిగిన ప్రశ్నలకు, ఇంకా మీ మనస్సులో ఉన్న సందేహాలకు సమాధానంగా "శివమహాపురాణము"ను మీకు పరిచయం చేస్తున్నాను. తార్కిక ప్రధానమైన బుద్ధితో కాకుండా అనుభవప్రధానము, స్పందన శీలము ఐన హృదయంతో, ఆస్తిక్య ప్రధానమైన బుద్ధితో, భక్తి భావంతో, అసూయ లేకుండా ఏకాత్మ భావంతో ఏకాగ్రతతో శ్రవణం చేయండి.

ఈ “శివపురాణం” సకలోపనిషత్సారం. ఇది శ్రేష్ఠమైన పురాణం. సర్వమానవులను ఇహంలో పాపాలనుండి ఉద్ధరించి పరంలో పరమార్థాన్ని చేరుస్తుంది. ఇది కలికల్మష నాశకం. చతుర్విధ పురుషార్థ సాధకం. ఇందులో మహా దేవుని కీర్తి స్వచ్ఛమైన శరత్కాల కౌముదిలా విస్తరించి ఉంది. ఈ పురాణాన్ని అధ్యయనం చేసిన మాత్రాన సర్వులు సద్గతిని పొందుతారు.

ఈ శివపురాణం వ్యాప్తిలోకి రానంత వరకు మాత్రమే లోకంలో పాపాలు ప్రబలి ఉంటాయి. ఘోరమైన ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తాయి. ఇది పరిచయం కానంత వరకు మాత్రమే ఇతర శాస్త్రాలు, పురాణాలు పరస్పరాధిక్యతను నిరూపించు కొనటం కోసం తగవులాడు కొంటూ ఉంటాయి. పుణ్యతీర్థములన్నీ అహమికతో స్పర్థ వహించి ఉంటాయి. ఇతర మంత్రాలన్ని తమ ఆధికత్యను చాటు కొనటం కోసం పోటీ పడుతూ ఉంటాయి. ఇతర పీఠాలు, పుణ్యక్షేత్రాలు దేవతలు వేయేల ఏ ఇతర సిద్ధాంతాలైనా సరే వాటి మహిమ ఈ శివపురాణం ప్రకటితం కానంత వరకు మాత్రమే. సూర్యోదయానంతరం చీకట్లన్నీ పటాపంచలైనట్లే ఈ శివపురాణ పఠనానంతరం మానవులకు అవిద్య, అజ్ఞానం నశించి కల్మషాలన్నీ హరించుకు పోతాయి. మునులారా! మానవునకు మృత్యుభయాన్ని మించిన భయం లేదు గదా! అట్టి మహా భయంకరమైన మరణభయం కేవలం శివ మహాపురాణ శ్రవణం వల్లనే తొలగి పోతుంది. దీని పఠన, శ్రవణాదుల వల్ల వచ్చే మహాపుణ్య ఫలాన్ని సంపూర్ణంగా ఎవరు వర్ణించ గలరు? అనేక లోకా లోకాలతో, బ్రహ్మాండాలతో నిండియున్న ఈ అనంతమైన సృష్టికి కారణభూతులైన శివ–శక్తుల అనంతత్వాన్ని లేశ మాత్రంగా నైనా మనసులో భావిస్తే; ఆ మానవునకు పునర్జన్మ ఎక్కడిది? నిస్సందేహంగా ఆ జీవుడు సాక్షాత్తు శివుడవుతాడు. సాక్షాత్తు మోక్ష లక్ష్మి వచ్చి గుమ్మం ముందు నిరీక్షిస్తుందంటే ఇతరమైన లౌకిక ప్రయోజనాలన్నీ ఇట్టే నెరవేరుతాయి అని వేరే చెప్పాలా?

వేద, శాస్త్రాదులు అధ్యయనం చేస్తే వచ్చే మహాపుణ్యం ఈ పురాణ పఠన, శ్రవణాదుల వల్ల వస్తుంది. తపోధనులైన మునులారా! ఒక్క మాట చెపుతున్నాను. విశ్వాసంతో వినండి. సమస్తమైన వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాస, మంత్ర, తంత్ర, జప, తప, ధ్యాన యోగాదుల సారభూతమైన జ్ఞానం ఏదైతే ఉందో ఆ జ్ఞానం యొక్క స్వరూపం ఈ పురాణం. పాల యొక్క సారం వెన్నకదా! అలాటి వెన్నముద్ద ఇది! క్షీర సాగర సారం అమృతం. అట్టి అమృత భాండం ... ఈ పురాణం. ఈ పురాణాన్ని గృహంలో భద్ర పరిస్తే చాలు వాడు

అమృతు డవుతాడు. ఈ శివ మహా పురాణం లోని ఒక్క శ్లోకాన్ని పఠించినా, కనీసం భక్తితో నమస్కరించినా సర్వ దేవతా పూజాఫలం లభిస్తుంది. ఎవరైతే చతుర్దశి నాడు ఉపవాస ముండి శివ భక్తుల సన్నిధిలో ప్రవచనం చేస్తాడో ఆ ఉత్తమునికి గాయత్రీ మంత్ర పురశ్చరణ ఫలం లభిస్తుంది. రాత్రి జాగరణ చేసి దీనిని పఠిస్తే ఆ పుణ్య పురుషునికి వచ్చే పుణ్యం అంతింత అనరానిది. కురుక్షేత్రం, గయ, ప్రయాగ, ఇత్యాది పుణ్య క్షేత్రాలలో తన బరువు తూగే హిరణ్యాన్ని వ్యాస భగవానునికి దానం చేస్తే వచ్చే పుణ్యఫలాన్ని మించిన తరగనంత అనంత పుణ్యఫలం వస్తుంది.

ఇందులో ఉన్న రుద్ర సంహితను రాగయుక్తంగా అహర్నిశలు గానం చేసిన భక్తుని ముందు ఇంద్రాది దేవతలు వాని ఆజ్ఞకోసం ఎందురు చూస్తూ ఉంటారు. వేల సంవత్సరాలు తపస్సు చేస్తే వచ్చే అంతఃకరణ శుద్ధి ఈ రుద్రసంహితా పఠనం వల్ల సిద్ధిస్తుంది. భైరవ ప్రతిమ ముందుగాని, మర్రి చెట్టు లేక మారేడు చెట్టుకు ప్రదక్షిణం చేస్తూగాని పఠిస్తే ఫలితం కోటి గుణితం అవుతుంది.

ఇక ఇందులో ఉన్న కైలాస సంహిత పరమోత్కృష్టమైనది.

**శ్లో॥ కైలాస సంహితా తత్ర – తతోఽపి పరమా స్మృతా ॥**
**బ్రహ్మ స్వరూపిణీ సాక్షా – త్ప్రణవార్థ ప్రకాశికా ॥**
**కైలాస సంహితాయాస్తు – మహాత్మ్యం వేత్తి శంకరః ॥**
**కృత్స్నం తదర్థ వ్యాసశ్చ – తదర్థం వేద్మ్యహం ద్విజాః ॥**

ఇది సాక్షాత్తు వేదమే. ఈ సంహితలో ప్రణవార్థము, తత్త్వము నిరూపింప బడ్డాయి. దీని మహాత్మ్యం శంకరునకు పూర్ణంగా తెలుసు. వ్యాస భగవానునకు సగం తెలుసు. అందులో సగం నాకు తెలుసు. నేను ఆర్జించిన జ్ఞాన భిక్షను మీకనుగ్రహిస్తున్నాను. ఈ సంహితా తత్త్వాన్ని లెస్సగా బోధ పరచుకొన్న వానికి మరుక్షణంలో చిత్తశుద్ధి కలుగుతుంది. మనసు స్వాధీనమైన వానికి విశ్వమంతా వశమౌతుంది. సాధనలన్నీ మనోలయాన్ని సిద్ధింపచేసికొనుట కొరకే కదా!

ఓ ద్విజులారా! ఈ రుద్ర సంహిత నాశనం చేయలేని పాపం లోకంలో లేదు. ఈ అమృత భాండాన్ని మహాదేవుడు తొలుత కుమార స్వామికిచ్చాడు. ఆ కారణంగానే కుమారుడు జ్ఞానమూర్తి ఐనాడు. మానవుడు తనకు తెలియకుండానే అనేక పాపకృత్యాలను ఆచరిస్తూంటాడు. దుష్టుల నుండి దానాలను స్వీకరించటం, తినకూడని వాటిని తినటం,

దురాలాపాలాడటం ఇత్యాదులు. వాటికి నిష్కృతి ఈ సంహితాధ్యయనమే. కనీసం శ్రవణం చెయ్యాలి. శివాలయంలోని బిల్వవనంలో పఠిస్తే వచ్చే ఫలం అనంతం, పితృకర్మలాచరించే సమయంలో ఈ రుద్ర సంహితను భక్తితో పఠిస్తే వారి పితరులందరు, రుద్రలోకాన్ని పొందుతారు.

**శివ మహాపురాణంలోని సంహితలు, శ్లోక సంఖ్య**

ఈ శివ మహా పురాణం వేద తుల్యం. ఇది తొలుత పరమేశ్వర నిర్మితం. ఇందులో విద్యేశ్వర, రుద్ర, వినాయక, ఉమ, మాతృ, ఏకాదశ రుద్ర, కైలాస, శతరుద్ర, కోటి రుద్ర, సహస్ర కోటి రుద్ర, వాయు, ధర్మ సంహితలు అనే ఖండము లున్నాయి. ఈ పన్నెండు సంహితలు మహా పుణ్యప్రదాలు. వీటిలోని శ్లోక సంఖ్యను చెపుతున్నాను వినండి. విద్యేశ్వర సంహితలో పదివేలు, రుద్ర, వినాయక, ఉమ, మాతృ సంహితలలో ఒక్కొక్క దానిలో ఎనిమిది వేలు, ఏకాదశ రుద్రసంహితలో పదమూడు వేలు, కైలాస సంహితలో ఆరు వేలు, శతరుద్ర సంహితలో మూడువేలు, కోటి రుద్ర సంహితలో తొమ్మిదివేలు, సహస్రకోటి రుద్ర సంహితలో పదకొండువేలు, వాయు సంహితలో నాలుగువేలు, ధర్మ సంహితలో పన్నెండువేలు.... శ్లోకాలున్నాయి. మొత్తం లక్ష శ్లోకాల గ్రంథం ఇది.

త్రికాలవేది ఐన భగవాన్ వ్యాస మహర్షి కలియుగంలో పుట్టబోయే మనుష్యులు అలసులు, మంద బుద్ధులు, అల్పాయుష్కులు అని యెరిగి... ఏడు సంహితలు, ఇరువది నాలుగువేల శ్లోక సంఖ్య కలదిగా ఈ పురాణాన్ని సంక్షేపించారు. ఇది పురాణాలలో నాల్గవది. అసలీ పురాణ వాఙ్మయం యొక్క పుట్టుక ఏమిటంటే పరమేశ్వరుడు సృష్ట్యాది యందు శతకోటి శ్లోక విస్తరమైన ఒకే పురాణాన్ని నిర్మించాడు. క్రమంగా కాలగమనంలో వచ్చే యుగ భేదాల ననుసరించి; పుట్ట బోయే మనుష్యులు అల్పతరాయువులవుతారని జ్ఞాన దృష్టితో పరికించిన మహర్షులు అధ్యయన సౌలభ్యం కొరకు దానిని సంక్షేపించారు. ద్వాపర యుగాది యందు కృష్ణ ద్వైపాయనాది మహర్షులు ఏకపురాణంగా ఉన్నదానిని నాలుగులక్షల శ్లోక సంఖ్యకు సంక్షేపించి పద్దెనిమిది పురాణాలుగా విభాగించారు.

అలా సంక్షేపింప బడిన ఈ శివ మహాపురాణంలో 1) విద్యేశ్వర సంహిత, 2) రుద్ర సంహిత, 3) శతరుద్ర సంహిత, 4) కోటిరుద్ర సంహిత, 5) ఉమా సంహిత, 6) కైలాస సంహిత, 7) వాయు సంహిత అనే ఏడు సంహిత లున్నాయి. అఖండ భూమండలాధిపత్యాన్ని వహించి శాసించే సార్వభౌముని చెంతకు చేరటానికి అందరికి

అవకాశం ఉండదు. ప్రజలు భయ కంపితులవుతారు. వేదానిది సార్వభౌమ స్థానం. అందుకే వేదం ప్రభు సమ్మితమని చెప్పారు ఆప్తులు. పురాణాలు మిత్ర సమ్మితాలు. ఇవి మిత్రునివలే లాలించి హితోపదేశాన్ని చేస్తాయి. పురాణాలన్నీ వేద తుల్యములే. ఈ శివ మహా పురాణం వేదతుల్యం. శ్రేష్ఠ తమం, మోక్షదాయకం. చతుర్విధ పురుషార్థ సాధకం. జీవన్ముక్తి కారకం. ఆధి దైవిక, ఆధి భౌతిక, ఆధ్యాత్మిక దుఃఖ నివారకం. సకల కల్మష హారకం. దురితక్షయ నివారకం. మంగళ ప్రదాయకం, అఖండ అద్వైతానంద ఆత్మ సాక్షాత్కార తారకం."

**సాధ్య-సాధన విచారము**
**శ్రవణ, మనన, కీర్తనలు**

ఎంతో కుతూహలాన్ని రేకెత్తించే సూతుని పలుకులు విన్న ఋషులు అలాటి మహా పురాణాన్ని ఆదరంతో వినిపింపమని కోరగా సూతుడు సుప్రహర్షుడై శంకరుని స్మరించి ఇలా ప్రారంభించాడు.

"ఋషులందరు శ్రీ వర్ధనుడైన శంకరుని ధ్యానింతురు గాక! వేద సారము, పురాణ శ్రేష్ఠము ఐన ఈ "శివ మహాపురాణము" ను ఆలకింతురు గాక! దీనిలో భక్తి, జ్ఞాన, వైరాగ్యములకు సంబంధించిన విషయము లున్నాయి. ఉపనిషత్తుల యందు సిద్ధాంతీకరింప బడిన "సత్ " అనగా పరబ్రహ్మ స్వరూపాన్ని గూర్చి విశేషంగా చెప్పబడింది. పూర్వ కల్పం గతించి ప్రస్తుత కల్పం యొక్క ప్రారంభంలో ఆరు గణాలకు చెందిన మహర్షులు సమావేశ మయ్యారు. వారిలో వారికి పరబ్రహ్మమును గూర్చి చర్చ జరిగింది. సమాధానం దొరకక అది వివాదంగా మారింది. అప్పుడు వారందరు నాశరహితుడైన బ్రహ్మగారిని దర్శించి అంజలి బద్ధులై వినయంతో ఇలా ప్రశ్నించారు. "ఓ పితామహా! నువ్వు సృష్టి కర్తవు! ఆదిజుడవు! కారణములకు కారణమైన వాడవు! సర్వ తత్త్వములకు అతీతమైన తత్త్వమేది? పురాణ పురుషుడు ఎవరు? పరుని కంటే పరుడెవ్వరు? అవ్యక్తానికి సైతం ఆధారభూతు డెవరు?"

బ్రహ్మ గారిలా అన్నారు: "మహర్షులారా! సావధానంగా వినండి. ఎవరిని గూర్చి చెప్పటానికి వాక్కుకు సామర్థ్యం లేదో, ఎవరిని మనస్సు కూడా ఊహించనేరదో, ఇంద్రియములు, పంచ భూతాలతో కూడిన ఈ జగత్తు ఎవనినుండి ఉద్భవిస్తున్నదో, త్రిమూర్తుల కంటే కూడా ఎవరు పూర్వుడో.... అట్టి వాడు మహాదేవు డొక్కడే. ఆయన సర్వజ్ఞుడు. జగదీశ్వరుడు. పరాభక్తితో ఆయనను దర్శించటం కంటే వేరే మార్గం లేదు. రుద్రుడు, హరిహరులు, ఇంద్రాది దేవతలు పరాభక్తి తత్పరులై నిత్యమూ ఆయన దర్శన

కాంక్షాలాలసులై ఉంటారు. శివభక్తి ఒక్కటే మోక్ష కారకం. లోకంలో చెట్టు నుండి విత్తనము, విత్తనం నుండి చెట్టు ఎలా ఉద్భవిస్తున్నాయో అలాగే దైవాను గ్రహం వల్ల భక్తి, భక్తి వల్ల దైవాను గ్రహం లభిస్తాయి. కనుక ఓ ఋషులారా! అట్టి మహాదేవుని అనుగ్రహం కొరకు మీరు భూలోకం వెళ్ళి వేయి సంవత్సరాల దీర్ఘ సత్రయాగాన్ని అనుష్ఠించండి. భూలోకం ఒక్కటే కర్మభూమి. యజ్ఞేశ్వరుడైన శివుని అనుగ్రహం వల్ల మాత్రమే వేదవిద్యాసారమైన సాధ్య సాధనములు తెలుస్తాయి."

మునులు ఇట్లా అన్నారు: "పితామహా! లోకంలో సాధింప వలసిన వాటిలో ఉత్తమమైన సాధ్యమేది? దానికి ఉత్తమమైన సాధనమేది? సాధకుడెలా ఉంటాడు? మాకీ సాధన స్వరూపాన్ని గూర్చి చెప్పండి."

బ్రహ్మగారి సమాధానం: "శివపదమును పొందుట ఒక్కటే సాధ్యము. శివభక్తి ఒక్కటే సాధనము. శివానుగ్రహం చేత సిద్ధించిన సంస్కారం చేత అనిత్యమైన ఇహలోక ఫలములయందు ఆసక్తి లేని వాడే సాధకుడు. వేదోక్త కర్మలను నిష్కామంగా ఆచరించి తత్ఫలాన్ని పరమేశ్వరుని కర్పిస్తే ఆ సాధకుడు సాలోక్య, సామీప్య, సారూప్యాది ఫలాలను పొందుతాడు. భక్తి తీవ్రత ననుసరించి ఫలప్రాప్తి ఉంటుంది. భక్తిలో అనేక సాధనలున్నాయి. వాటిని సాక్షాత్తు ఈశ్వరుడే భోధించాడు. వాటిని సంక్షిప్తం చేసి మీకు సారాన్ని మాత్రం అందిస్తాను. శివపదాన్ని పొందటానికి 'మహాసాధన' మాత్రమే మార్గం. మహామహిమోపేతమైన శివ గాథలను చెవులతో వినటం, ఆయన మహిమను వాక్కుతో కీర్తించటం, ఆయన నెల్లప్పుడు మనస్సులో ధ్యానించటం ఈ మూడు కలిసి 'మహాసాధన' అనబడుతుంది.

ఇది శ్రుతి సమ్మతమైన మార్గం. మీరీ సాధనతో సర్వోత్కృష్టమైన సాధ్యమును పొందగలరు. సర్వార్థ సాధకమైన ఈ సాధనాన్ని తత్పర బుద్ధితో అనుష్ఠించండి. లోకంలో మానవుడు ముందు ఒక వస్తువును కంటితో చూసి తర్వాత తత్ప్రాప్తికి ఉపాయాన్ని అన్వేషిస్తాడు. అప్రత్యక్షమైన వాటి విషయంలో చెవులతో విని ప్రవర్తిస్తాడు. అలాగే జిజ్ఞాసువైన వాడు ముందు గురుముఖతః శ్రవణం చేసి, తరువాత సంకీర్తనను, ఆపై మననమును శ్రద్ధతో చెయ్యాలి. అలా చేస్తే కొంతకాలం పిమ్మట భక్తుడు సాలోక్య, సామీప్యాది క్రమంలో సారూప్యాన్ని పొందుతాడు. ఈ సాధనలో నిమగ్నమైన భక్తుని ఏ రోగాలు సమీపించవు. వ్యాధులన్ని నశిస్తాయి. ఎప్పుడూ ఆనందంలో మునిగి తేలుతూ ఉంటాడు. ఈ సాధన ప్రారంభంలో క్లేశాన్ని కలిగించినా అభ్యాసం వల్ల సాధకుడు తర్వాత అనేక శుభాలను పొందుతాడు".

**శ్రవణ, మనన, కీర్తనముల మహిమ**

ఇంతవరకు శ్రద్ధాళువులై ఆలకించిన మునులు బ్రహ్మ గారినిలా వినయంగా ప్రశ్నించారు. "ఓ కమలోద్భవా! శ్రవణ మనన, కీర్తనముల గూర్చి మాకు సవిస్తరంగా చెప్పండి".

ఋషుల ప్రార్థనను మన్నించి వారి శ్రద్ధా భక్తులను గమనించి పితామహుడిలా చెప్ప సాగాడు. "మహర్షులారా! శివ పూజ, శివ మంత్రజపం, శివుని గుణాలను, రూపమును, లీలలను, ఆయన అనంత కళ్యాణ నామములను వేద సమ్మతమైన యుక్తిగల మనస్సుతో సర్వకాల సర్వావస్థల యందు చింతించుటే మననం. సాధనలన్నిటిలో అత్యుత్తమమైన ఈ సాధన శివానుగ్రహం కలవారికే లభిస్తుంది. శంభుని యొక్క ప్రతాప, గుణ,రూప, లీలావిశేష, నామ వైభవా లన్నింటిని వాద్య సహకారంతో రాగయుక్తంగా గాన రూపంగా కాని, వేదాధ్యయన రూపంగా కాని లేదా దేశభాషలో స్పష్టమైన వాక్కుతో రసవంతంగా కీర్తించటం: కీర్తనం. స్థల, కాల, సందర్భ కారణాలతో నిమిత్తం లేకుండా పరమ శివుని మంగళమైన గాథలను హాయిగా చెవులతో; ప్రియుడు ప్రియురాలి వచనాలను ఎంత ఆదరంతో వింటాడో అంత ఆసక్తితో వినటం శ్రవణం. ఇది లోక ప్రసిద్ధమైనదే. సజ్జన సాంగత్యం వల్ల శ్రవణం సమకూరుతుంది. ఆపై కీర్తన అలవడుతుంది. తరువాత మననం సిద్ధించి, ఈశ్వరానుగ్రహంతో సర్వమూ సిద్ధిస్తుంది."

సూతుడీ మహత్తర విషయాలను ఇంత వరకు చెప్పి సాధన మహిమనుగూర్చి ఇలా చెప్పసాగాడు. మునులారా! అసలీ సాధన లోకంలో ఎలా ప్రవర్తించిందో దాని పూర్వ గాథను చెపుతున్నాను వినండి. పూర్వం పరాశర మహర్షి కుమారుడు, నాకు గురువు ఐన వ్యాస మహర్షి సరస్వతీ నదీతీరంలో ఆశ్చర్యకరమైన తపశ్చర్యలో మునిగి ఉండగా బ్రహ్మ మానస పుత్రుడైన సనత్కుమారుడు భాను ప్రభా భాసమానమైన విమానంలో గగన పథంలో సంచరిస్తూ యాదృచ్ఛికంగా నా గురువును చూచి భూమిపై అవతరించాడు. ధ్యానం నుండి లేచిన నా గురువు ఎదురుగా ప్రత్యక్షమైన సనత్కుమారుని చూచి సంభ్రమాశ్చర్యాలతో, భక్తి గౌరవాలతో నమస్కరించి అర్ఘ్య పాద్యాదులతో పూజించి దేవతాయోగ్యమైన ఆసనాన్నిచ్చి గౌరవించాడు. అందుకు సంప్రీతుడైన సనత్కుమారుడు వినీతుడైన వ్యాసుని ఇలా ప్రశ్నించారు.

"ఓ వ్యాసమునీ! నీవిచట అసహాయుడవై ఉండి దేనిని సాధించాలని తపస్సు చేస్తున్నావు?"

అలా ప్రశ్నించిన సనత్కుమారుని చూచి వెతకబోయిన తీగ కాలికి తగిలి నట్లుగా సంతోషించి వ్యాసుడిలా తన మనసు లోని తపనను వెల్లడించాడు. "సర్వజ్ఞా! వేదచోదితమైన ధార్మిక జీవనంలో చతుర్విధ పురుషార్థములైన "ధర్మార్థ కామ మోక్షాలకు" ప్రత్యేకమైన ఆదరణ ఉంది. మీ దయతో నేను వాటిని విస్తారంగా అనేక విధాలుగా స్థాపించాను. లోక మంతా నన్ను గురువుగా సేవిస్తోంది. ఐనా మోక్ష మార్గాన్ని తెలిసికోలేకుండా ఉన్నాను. ఈ విషయంలో నాకు స్థిరత్వం చిక్కలేదు. చాంచల్యం కలుగుతోంది. చాలా ఆశ్చర్యంగా ఉంది. అశాంతిగా ఉంది. కారణం తెలియటం లేదు. మోక్షార్థినై ఈ తపశ్చర్యకు పూనుకొన్నాను."

వ్యాసుని ఆవేదనను, జిజ్ఞాసను, అంతరంగాన్ని అర్థం చేసికొన్న సనాతనుడైన సనత్కుమారుడు దయార్ద్రదృష్టితో తన అమృత వాక్కులనిలా వినిపించాడు. "కుమారా! వ్యాసమునీ! పూర్వం నేను కూడా మోక్షార్థినై, చిత్త చాంచల్యంతో అనేక ఇతర సాధనాలతో, మందర పర్వతం మీద తపస్సు చేశాను. నా తపస్సు ఫలించి, శివాజ్ఞచే భగవానుడు, దయాళువు, సర్వసాక్షి, ప్రమథ గణాధిపతి ఐన నందికేశ్వరుడు నా యెదుట ప్రత్యక్షమై ముక్తిసాధనాన్నిలా ఉపదేశించాడు. "ఓ బ్రహ్మమానస పుత్రా! వేద సమ్మతమైన శివుని యొక్క శ్రవణ, కీర్తన, మననములే ఉత్తమమైన ముక్తి సాధనాలు. ఇది సాక్షాత్తు పరమేశ్వరుడే నాకుపదేశించాడు. కనుక వెంటనే వాటి ఆచరణయందు ప్రవర్తించు! నీకు మంగళములు సిద్ధించుగాక!" – అని పలుమార్లు బోధించి నందీశ్వరుడు అంతర్హితుడయ్యాడు."

అని ఈ విధంగా సనత్కుమారుడు వ్యాసుని శంకలను తీర్చి, మోక్షోపాయాన్ని చెప్పి పరమ శోభనమైన బ్రహ్మ లోకాన్ని చేరుకొన్నాడు.

ఇంతవరకు విన్న ఋషులు ప్రమోద మానసులై " ఓ సూతా! శివుని శ్రవణ, కీర్తన, మననములనే ఈ మూటిని ఆచరించుట యందు అశక్తుడైన మానవుడు ఏం చేస్తే ముక్తిని పొందుతాడు?" అని లోక కళ్యాణ కాంక్షా తత్పర మానసులై ప్రశ్నించారు.

**లింగము – మూర్తి**

మునుల ప్రశ్నకు సమాధానంగా సూతుడిలా అంటున్నాడు. "మునులారా! 'మహాసాధన' అని చెప్పబడే ఈ మూటిని ఆచరించలేని మానవుడు శివుని లింగమునందు గాని మూర్తియందుగాని శివుని ఆవాహన చేసి నిత్యము అర్చించినట్లైతే భయంకరమైన ఈ సంసార సముద్రాన్ని దాటేస్తాడు. వంచన లేకుండా సంపాదించిన ద్రవ్యంతో, శక్తినిమించి వ్యయం చేయకుండా అర్చించాలి. సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి ఐన మహాదేవునకు మనోనైర్మల్యము, దృఢమైన భక్తి ప్రధానమైనట్లుగా ఇతరములు కావు.

శక్తి ఉంటే శివునకు మండప, గోపుర, తీర్థ, మఠ, క్షేత్ర నిర్మాణాలను చెయ్యాలి. రథోత్సవాన్ని జరిపించాలి లేదా ఉత్సవంలో పాల్గొనాలి. వస్త్ర, గంధ, మాల్య, ధూప, దీప, నైవేద్యాలతో అర్చించాలి. ఛత్ర, చామర, వింజామరాదులతో సేవించాలి. ప్రదక్షిణ, నమస్కారాదులు, జపము శక్తిమేరకు చేయాలి. ఆవాహన మొదలు విసర్జన పర్యంతము భక్తి, శ్రద్ధలతో చేయాలి. పూర్వం ఎందరో మహాత్ములు శివుని ఈ మార్గంలో అర్చించి తరించారు.”

సూతుని ఉపదేశాన్ని విన్న మునులు తమ సందేహాన్ని ఇలా ప్రకటించారు. “ఓ సూతమహా మునీ! సర్వ దేవతలు మూర్తి స్వరూపంలో మాత్రమే అర్చింపబడుతూ ఉండగా ఒక్క శంకరుడు మాత్రం లింగమునందు మూర్తియందు కూడా పూజింపబడటానికి కారణమేమిటి?”

మునుల ప్రశ్నకు సంతసించి సూతుడిలా ఉత్సాహంతో చెప్పసాగేడు. “ఓ ఋషులారా! మీరడిగిన ప్రశ్న చాలా ఉత్తమమైనది. దీనికి సమాధానం చెప్పగల సమర్థుడు మహాదేవుడొక్కడే ఇతరులు కారు. శివునిచే చెప్పబడి క్రమంగా గురుముఖంగా నాకు తెలిసిన విషయాన్ని మీకు చెపుతున్నాను వినండి. శివుడొక్కడే పరబ్రహ్మ స్వరూపుడు. ఆయన నిష్కలుడు, నిరాకారుడు. శివునకు రూపం ఉన్న కారణంగా ఆయన సాకారుడు కూడా. ఆయన నిరాకారుడు కనుక నిరాకారమైన లింగము నందు, సాకారుడు కనుక సాకారమైన మూర్తియందు కూడ ఆరాధింప బడుతున్నాడు. ఆయన ఒకే సమయంలో సకలుడు, నిష్కలుడు కనుక పరబ్రహ్మ శబ్ద వాచ్యుడవు తున్నాడు. ఇతర దేవతలు పరబ్రహ్మ శబ్దవాచ్యులు కారు గనుక వారికి నిరాకారత్వం లేదు. లింగరూపంలో పూజ లేదు. వారు బ్రహ్మ స్వరూపులు కారు జీవులేయగు చున్నారు. శంకరుని యొక్క బ్రహ్మత్వం సకల వేదాంత సారభూతమైన ఉపనిషత్తుల సారంగా, ప్రణవార్థంగా (ఓంకార లక్ష్యంగా) నిరూపింప బడింది.

మునులారా! ఇపుడు మీరు నన్నడిగిన ప్రశ్నను పూర్వం సనత్కుమారుడు నంది కేశ్వరుణ్ణి అడిగేడు. నందికేశ్వరుడు ఈయనకు తాను పరమ శివుని ద్వారా తెలిసికొన్న ఈ రహస్యమైన బ్రహ్మ విద్యా విశేషాన్ని ఉపదేశించాడు. సనత్కుమారుని ద్వారా ఈ బ్రహ్మవిద్యను తెలుసుకొన్న మాగురువు గారైన వ్యాస భగవానులు దానిని నాకుపదేశించారు. నేను మీకుపదేశించాను. మునులారా! మరొక్క రహస్యం చెపుతాను వినండి. బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులు మొదలుగా తక్కిన దేవత లందరు పుట్టినప్పుడే సగుణులు, సాకారులు.

శివుడొక్కడే లింగముగను, మూర్తి స్వరూపంగాను దర్శనమిస్తాడు. పూర్వకల్పప్రళయాంత వేళ మహాత్ములైన బ్రహ్మ – విష్ణువులు పరస్పరాధిక్యత కొరకు కలహించు కొనగా వారి మధ్య నిరాకారమగు స్తంభ రూపంలో పరమశివుడు పత్యక్షమై వారి అహంకార నిర్మూలనం చేశాడు. ఇంకొక్క విషయం చెవుతాను. పూర్వం సనత్కుమారుడు, నందికేశ్వరుణ్ణి లింగము – మూర్తి ఈ రెంటి యొక్క ఆవిర్భావ గాథను చెప్పవలసిందని కోరగా నందీశ్వరుడిలా చెప్పాడు.

**బ్రహ్మ – విష్ణు సంగ్రామం**

పూర్వం విష్ణువు శేషతల్పం మీద శయనించి ఉండగా, బ్రహ్మ వేత్తలలో శ్రేష్ఠుడైన పితామహుడు యాదృచ్ఛికంగా విష్ణువును చూచి ఇలా ప్రశ్నించాడు. " ఓ పురుషుడా నీవెవరవు? నన్ను చూసి కూడా గౌరవంతో లేవకుండా పరుండి యున్నావు. లే! నేను నీకు ప్రభువును ! నాథుడను! పెద్దలు వచ్చినపుడు గౌరవించని మూర్ఖునకు ప్రాయశ్చిత్తం విధి."

బ్రహ్మగారి మాటలను విన్న విష్ణువు ఆంతర్యంలో కోపాన్ని పొంది కూడా బాహ్యంగా శాంతాన్ని ప్రకటించి ఇలా అన్నాడు; "ఓ వత్సా! నీకు శుభమగుగాక! నీకు స్వాగతం! ఇదిగో ఆసనం. స్వీకరించు. నీ ముఖం చింతాగ్రస్తమై ఉంది. చూపులు ప్రసన్నంగా లేవు. కారణం ఏమిటి?"

విష్ణువు యొక్క శాంత వచనాలను లక్ష్యపెట్టక బ్రహ్మగారిలా అన్నారు. "ఓ విష్ణో! అభిమానధనుడ నైన నేను ఏ ప్రమాణానికి (కొలతకు) అందని పితామహుడను! కాలం నాకు ఆటంకంగాదు. నేను కాలాతీతుడను. ఆ వేగంతోనే వచ్చాను. నిన్ను, జగత్తును సృష్టించిన వాణ్ణి, రక్షించే వాణ్ణి నేనే!".

బ్రహ్మగారి అవిద్యా విలసితమైన వచనాలను విన్న విష్ణువు అంతకు మించిన అజ్ఞానంతో ఇలా అన్నాడు. "ఓ వత్సా! ఈ బ్రహ్మాండాలన్నీ నాకుక్షిలో ఉన్నాయి. దొంగతనం చేసిన వాడు బొంకినట్లు నువ్వు చోర భాషణం చేస్తున్నావు. ఈ లోకాలన్నింటిని సృష్టించిన నిన్ను సృష్టించిన వాడను నేనే. నా నాభి కమలం నుండి ఆవిర్భవించిన కమలోద్భవుడవు నీవు. కనుక నా పుత్రుడవు. తెలుసుకో! వ్యర్థాలాపాలు వద్దు."

ఈ విధంగా మోహ విభ్రాంతులైన బ్రహ్మ – విష్ణువుల మధ్య వివాదం ముదిరింది. ఈ సృష్టికి నేనే ప్రభువును అని ఒకరు ... నేనే ప్రభువును అని మరొకరు.... ఇలా వివాదం ముదిరి ఇద్దరూ యుద్ధ సన్నద్ధులయ్యారు. హంస వాహనారూఢుడై బ్రహ్మగారు, గరుడ

వాహనారూఢుడై విష్ణువు యుద్ధం చేస్తుండగా వారి వారి అనుచరగణం కూడా చేతులు కలిపేరు.

పోరు భీకరంగా సాగుతోంది. ఇరువురి మధ్య కుంభ వృష్టిని తలపింప చేసిన బాణయుద్ధం ముగిసింది. జయకాంక్షా తత్పరులై పరస్పరం అస్త్రప్రయోగానికి తలపడ్డారు. ఆ యుద్ధంలో కూడ జయాపజయ నిర్ణయం నిశ్చితం కాకపోయేసరికి విష్ణువు క్రుద్ధుడై మహేశ్వరాస్త్రాన్ని బ్రహ్మపై ప్రయోగించాడు. మహేశ్వరాస్త్ర సంజనిత ధూమానలపాతానికి బ్రహ్మ వాహనమైన హంస వైవర్ణ్యాన్ని పొందింది. బ్రహ్మగారు తన తేజస్సును కోల్పోయాడు. మహా భయంకరమైన మహేశ్వరాస్త్రానికి కొద్దిగా భీతిల్లిన విధాతను జూచి తన రెక్కల చాటున అజ్ఞాతంగా నక్కియుండి రక్షణ పొందవలసిందని హంస పలికిన వెక్కసపు పల్కులకు మిక్కిలి కోపించి దురాసదమైన రౌద్ర వేగానికి శరీరం కంపమొంద, శిఖా బంధనం ముడి వీడి పారాడ, అత్యుగ్రమైన ఆగ్రహంతో వామ హస్తంతో కమండలువును గ్రహించి దక్షిణ పాణితో జలాన్ని ప్రోక్షించి పాశుపత మంత్ర రాజాన్ని స్మరించి, హరి యొక్క వక్షస్థలానికి గురిచూసి విరించి ప్రయోగించాడు.

సహస్ర ముఖము, అత్యుగ్రము, చండవాత భయంకరము ఐన ఆ అస్త్రద్వయం మంటలను పుట్టిస్తూ లోకాలకు భీతిని కల్పిస్తోంది. బృందారకులందరూ భయకంపితులయ్యారు. వారిలో వారిలా ఒక నిర్ణయానికి వచ్చారు. సృష్టి, స్థితి, సంహార, తిరోభావ, అనుగ్రహములనే పంచ కృత్యాలను పరబ్రహ్మ స్వరూపుడైన ఏ పరమేశ్వరుడు అవలీలగా నెరవేరుస్తూ ఉంటాడో, ఎవని యొక్క ఆజ్ఞ లేనిదే లోకంలో గడ్డిపోచ కూడా కదలదో అట్టి త్రిశూలిని శరణు పొందుదాం. ఈ సంక్షోభాన్ని నివారించటానికి ఆయనే సమర్థుడు... అని తలపోసి దేవతలంతా కైలాస శిఖరానికి చేరుకొన్నారు, చేరుకొని మణిప్రభా మండితమైన సభామంటపంలో ఉమాసహితుడై; ప్రమథ గణాలు పరివేష్టించి ఉండగా, భుజవల్లుల కంకణ ఝుణత్కారం తోరంగా ధ్వనింప చామరగ్రాహిణులు వింజామరలు వీస్తూండగా, వేదరాశి పేదయై స్తుతిస్తూండగా కన్నుల పండువుగా కొలువు తీరి యున్న ప్రణవశబ్ద వాచ్యుడైన పరమ శివుని దర్శించి ఆనందంతో కన్నుల ఆనందాశ్రువులు జారగా సాష్టాంగ ప్రణామా లాచరించారు అమరులు. అంత శివుడు మంగళకరము, అర్థ గాంభీర్యముగల మాటలతో దేవతల నిలా క్షేమసమాచార మడిగాడు.

**కూట సాక్ష్యము**

"ప్రియమైన దేవతలారా ! నా శాసనం వలన మీకు అభ్యుదయం కలుగుతూన్నది కదా! జగత్తు, లోకపాలకులు, సకల దేవతా సమూహం... వారి వారి కర్మలయందు సక్రమంగా ప్రవర్తిస్తున్నారు గదా! పరస్పరాధిక్యతా నిరూపణ కొరకు బ్రహ్మ-విష్ణువుల మధ్య నడుస్తున్న యుద్ధం గురించి నాకు ముందే తెలుసు. కలవరపాటుతో మీ రాకవల్ల ఆ విషయమే తిరిగి చెప్పినట్లైంది". ఈ విధంగా మధుర వచనాలతో అంబికాపతి ; తల్లిదండ్రులు తన సంతానాన్ని లాలించిన తీరున పలికి దేవతలను సంతుష్టాంత రంగుల్ని చేసి వందమంది ప్రమథ గణాధి పతులను రణరంగానికి రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

అపుడు శివుని ప్రయాణానికై బహువిధ వాద్యాలంకారాలతో కూడిన వాహనాలు సిద్ధమయ్యాయి. ప్రణవాకారము, పంచమండల మండితము ఐన భద్రమైన రథాన్ని అంబికాపతి అధిరోహించాడు. కుమారులతో, ప్రమథ గణాలతో కూడిన శివుణ్ణి ఇంద్రాది బృందారకులందరూ అనుసరించారు. చిత్రవర్ణ శోభిత ధ్వజాలంకారాలతో, ఛత్ర చామరాదులతో, సంగీత నాట్యమేళాలతో, వాద్యబృందాలతో, ఎడ తెరిపిలేని పుష్పవృష్టి జడివానలా కురియగా పరాశక్తితో కూడి పరమేశ్వరుడు సంగ్రామ రంగానికి బయలు దేరాడు.

గగనాన నిగూఢంగా సమాస్థితుడై బ్రహ్మ-విష్ణువుల యుద్ధాన్ని సమీక్ష చేశాడు శంకరుడు. వాద్య ఘోష సద్దు మణిగింది. గణ కోలాహలం అణిగింది. పరస్పర విజిగీషతో బ్రహ్మ-విష్ణువులు ప్రయోగించిన మాహేశ్వర - పాశుపతాస్త్ర దారుణ మారణాగ్ని కీలలచే ముల్లోకాలు అల్లకల్లోల మయ్యాయి. అత్యుగ్రమైన ఆ అస్త్రాలను శాంతింప చేయ సంకల్పించి శంభుడు మహాద్భుతమైన అగ్ని స్తంభాకారంలో నిలిచాడు. లోక సంహార కారకమైన ఆ అస్త్రద్వయం అగ్నిస్తంభం చేత ఆకర్షింప బడి క్షణంలో దానిలో అంతర్భూత మైంది. ఈ విధంగా అస్త్రద్వయాన్ని తనలో అంతర్భూతం చేసికొని లోకాలకు శాంతిని, కళ్యాణాన్ని కలిగించిన విస్మయావహము, అద్భుతము ఐన ఆ అగ్నిస్తంభాన్ని చూచి దేవతా సమూహం దిగ్భ్రాంతమైంది. అంత వీరులైన బ్రహ్మ - విష్ణువు లిరువురు ఈ అగ్ని స్తంభం ఎక్కడ నుండి పుట్టింది? దీని ఆద్యంతములు ఎక్కడ? దాన్ని మనం పరిశోధించాలి అని నిశ్చయించు కొన్న వారై వారి దేవత్వమునందు వారికి గల అమితమైన విశ్వాసంతోను, అతిశయించిన గర్వంతోను సత్వరంగా పరీక్షార్థం బయలు దేరారు. విష్ణువు సూకర రూపాన్ని ధరించి

ఆదిని, బ్రహ్మ హంస రూపాన్ని పొంది దాని అంతాన్ని కనిపెట్టాలనే పట్టుదలతో బయలు దేరారు. ఎంత దూరం పయనించినా దాని ఆదిని కనిపెట్టలేక మిక్కిలి అలసిన విష్ణువు యథాస్థానానికి వచ్చి చేరాడు ,,,, బ్రహ్మగారి కంటె ముందుగా.

ఇక బ్రహ్మగారు హంస రూపంలో ఆకాశంలో పయనిస్తూ ఉండగా దారిలో జారి పడుచున్న అద్భుతమైన మొగలిపువ్వును చూచాడు. అది అతి సురభిళంగాను, నవనవోన్మేషంగాను ఉండి సువర్ణ ధీధితులను వెదజల్లుతోంది. అది చాలా కాలంగా జారి పడుతూనే ఉంది. బ్రహ్మ-విష్ణువుల అజ్ఞానాన్ని యెరిగి మహాదేవుడైన పరమేశ్వరుడు నవ్వగా ఆ కంపనం వలన శిరస్సు నుండి జారిన పువ్వు అది! బ్రహ్మ – విష్ణువులకే కాదు లోకాలన్నిటికి అనుగ్రహ సూచకమైనది. అలా జారి పడుతున్న మొగలి పువ్వును చూచి బ్రహ్మగారు ఓ పుష్పరాజమా! నువ్వు ఎక్కడనుండి జారి పడుతున్నావు? నిన్ను ధరించినది ఎవరు? అని అడిగాడు. అందుకిలా పుష్పం సమాధానం చెప్పింది. “ఓ! జీవా! అప్రమేయమైన ఈ అరుణ స్తంభం యొక్క అగ్రభాగాన్ని నేనెరుగను. చిరకాలం క్రిందట స్తంభం యొక్క మధ్యభాగం నుండి జారాను. దీని అగ్రాన్ని చూడాలనే ఆశ వదులుకో!” ఆ మాటలను విన్న బ్రహ్మ పుష్పాన్నిలా ప్రార్థించాడు. “ఓ పుష్పరాజమా! నేను సృష్టి కర్తయైన విధాతను. ఈ లింగాగ్రాన్ని సేవించాలనే సంకల్పంతో బయలు దేరాను. నాకొక ఉపకారం చెయ్యాలి. నాతోపాటు విష్ణువు వద్దకు వచ్చి “ఈ బ్రహ్మ లింగాగ్రాన్ని సేవించాడు. అందుకు నేనే సాక్ష్యం అని సాక్ష్యం చెప్పాలి. ఆపత్కాలంలో అసత్యమాడటం తప్పుకాదు.” బ్రహ్మగారి మాటలకు పుష్పం సరేయని అంగీకరించింది. మిక్కిలి శ్రమచెంది దస్సియున్న విష్ణువు యెదుట అలాగే సాక్ష్యం చెప్పింది.

కూట సాక్ష్యాన్ని నమ్మిన విష్ణువు బ్రహ్మగారు నిజంగానే లింగాగ్రాన్ని సేవించాడనే విశ్వాసంతో బ్రహ్మను షోడశోపచారాలతో పూజించాడు. దుర్బుద్ధితో అసత్యమాడిన బ్రహ్మను శిక్షించటానికై ఈశ్వరుడు అగ్ని లింగం నుండి సకలుడై, సగుణుడై, సాకారంగా ఆవిర్భవించాడు. అలా ఆవిర్భవించిన స్వామిని చూచి ముకుళిత హస్తుడై విష్ణువు ఆయన పాదాలను పరిగ్రహించి ఇలా ప్రార్థించాడు. “స్వామీ! ఆద్యంతములు లేని విరాట్ స్వరూపుడవు నీవు! కాని మేమిద్దరం నిన్ను విమర్శ చేయటానికి పూనుకొన్నాం. ఓ కరుణాకర! దయార్ద్ర దృష్టితో చూడు! మా అజ్ఞానాన్ని మన్నించు! ఇదంతా నీ లీల!”.

అలా సత్యాన్ని పలికిన విష్ణువును చూచి ఈశ్వరుడు “ఓ వత్సా! నీవు ఈశ్వరత్వాన్ని కోరిన వాడవై ఉండి కూడా సత్యాన్నే పలికావు. ఆ కారణంగా నీ యెడల చాలా ప్రసన్నుడ నయ్యాను. భూలోకంలో నాతో సమంగా నీకు కూడా పూజా సత్కారాలు లభిస్తాయి. నాకంటె వేరుగా నీకు క్షేత్ర, ప్రతిష్ఠ, ఉత్సవ, పూజాదికాలు నిర్వర్తింప బడతాయి...” అని సకల దేవతాగణం చూస్తూండగా విష్ణువుకు తనతో సమానమైన స్థాయిని కల్పించాడు.

**బ్రహ్మ యొక్క శిరసును ఖండించుట**

అసత్యమాడిన బ్రహ్మగారి దర్పాన్ని అణచాలనే కోరికతో మహాదేవుడు తన భ్రూమధ్యం నుండి భైరవుడనే మహాపురుషుని సృష్టించాడు. ఆ అద్భుత పురుషుడు రణస్థల మందు నిలిచి శివునకు నమస్కరించి “ప్రభో! నే నెవడను? అనామకునిగా ఉండి పోకుండా నాకు నామకరణ సంస్కారం చేసి ఆయుస్సు, వర్చస్సు, వ్యవహార సిద్ధిని కల్పించండి. నే చెయ్యవలసిన కర్తవ్యాన్ని ఆజ్ఞాపించండి?” అని వేడగా శివుడిలా అన్నాడు. “ఓ పూర్ణ పురుషా! నా నుండి ఉత్పన్నమైన నీవు నా పూర్ణ స్వరూపుడవు! “భ” అంటే భరణం. “ర” అంటే రవణం. “వ” అంటే వమనం. భరించే వాడివి, లయించే వాడివి, సృష్టించే వాడివి నీవే గనుక నీకు “భైరవుడు” అని నామకరణం చేస్తున్నాను. భయంకర రూపంలో ఉంటావు కనుక భైరవుడని వ్యవహార నామముంచాను. నిన్ను చూచి యముడు కూడా భయపడతాడు కనుక కాల భైరవుడనే నామంతో కూడా వ్యవహరింప బడుతావు. దుష్టులను సంహరిస్తావు కనుక ఆమర్దకుడని, భక్తుల పాపాలను భక్షిస్తావు కనుక పాప భక్షకుడని పేర్లు. శివభక్తులచే ఆరాధింప బడతావు. ప్రకాశ – విమర్శలు, శివ – శక్తులు, భైరవి –భైరవులు అవిభాజ్యంగా ఉన్న తత్త్వం నీది.

“వత్సా! ఈ బ్రహ్మ లోకాలకు ఆది దైవం. కనుక ఈతనిని వేగంగా నీ నిశిత కరవాలంతో అర్చించు.” వెంటనే భైరవుడు శివుని ఆజ్ఞ మేరకు బ్రహ్మగారి కేశపాశాన్ని గుప్పిట బంధించి అసత్యమాడిన ఆయన పంచమ ముఖాన్ని ఖండించి మెఱపులను కురిపిస్తున్న కరవాలాన్ని అదే వేగంతో త్రిప్పుతూ బ్రహ్మగారి తక్కిన శిరస్సులను కూడా ఖండించ బోయాడు. అంత బ్రహ్మగారు అలంకారములూడ, జుట్టు ముడి వీడ, ఉత్తరీయపు జాడ మరిచి చండ మారుతానికి చలించే లతలా వణికి పోతూ మొదలు నరికిన అరటి చెట్టులా భైరవుని పాద పద్మాలపై పడ్డాడు.

అంత దయాళువైన విష్ణువు దీనుడైన బ్రహ్మను రక్షించాలనే ఉద్దేశ్యంతో మహాదేవుడైన శివుని పాదపల్లవాలను కన్నీట అభిషేకించి, కృతాంజలియై పిల్లవాడు తన తండ్రిని ప్రార్థించి నట్లుగా ఇలా దీనంగా ప్రార్థించాడు. "శంకరా! ఈ బ్రహ్మకు పంచ ముఖాలను ఈశ్వర చిహ్నంగా ఉద్దేశ పూర్వకంగా నువ్వే ఇచ్చావు కదా! అందువల్ల ఆదిజుడైన ఈ బ్రహ్మను క్షమించు. ఈతడు నీ అనుగ్రహ పాత్రుడు. ఇతనిపై ప్రసన్నతను చూపు." ఈ విధంగా అచ్యుతుని చేత ప్రార్థింపబడిన ఈశ్వరుడు దేవగణాలందరు సంతృప్తి చెందేటట్లుగా భైరవుని వెనక్కు పిలిచి బ్రహ్మగారిని దండన నుండి రక్షించాడు. రక్షించి ఇలా మందలించాడు: "ఓ బ్రహ్మా! నువ్వు ఈశ్వరత్వాన్ని పొందగోరి అసత్యం పల్కి మోసానికి పాల్పడ్డావు. సత్యవ్రతాన్ని విడిచిన నీకు లోకంలో క్షేత్రము, దేవాలయము, ఉత్సవము, పూజాదులు లేకుండు గాక."

శివుని ప్రసన్నతకు మిక్కిలి సంతసించిన బ్రహ్మ "స్వామీ! వరదా! నువ్వు మహావిభూతుడవు! నా శిరస్సును ఖండించటాన్ని నేను వరంగా భావిస్తున్నాను. భగవంతుడు, బంధువు, జగత్కారణుడు, సర్వమైన పాపాలను దహించేవాడు, మేరువును ధనస్సుగా కలవాడు, మంగళ ప్రదాయకుడు అగు నీ కొరకు నమస్కారం." – అని స్తుతించగా విని ఈశ్వరుడిలా అన్నాడు.

"ఓ విధాతా! నువ్వు లోక భారాన్ని వహించు. నువ్వు నశిస్తే లోకపాలకుడు లేని కారణంగా అరాజకమై లోకాలన్నీ నశిస్తాయి. ఆ కారణంగా దండార్హుడవైనా నిన్ను క్షమించి విడిచి పెడుతున్నాను. అంతే కాదు. నీకు దుర్లభమైన గొప్ప వరాన్ని ఇస్తున్నాను. అగ్నిష్టోమం, దర్శ మొదలైన యజ్ఞములలో నీది గురుస్థానం. అంగములన్నీ ఉన్నా, దక్షిణలనిచ్చినా, నువ్వు లేని యజ్ఞం నిష్ఫలం".

ఇలా విధాతకు వరాలిచ్చి శివుడు కూట సాక్ష్యం చెప్పిన మొగలి పువ్వును చూచి "ఓసీ దుష్టకేతకమా! నువ్వు కూట సాక్ష్యం చెప్పి మోసం చేశావు. ఇకపై నీకు పూజాదుల యందు స్థానం లేకుండు గాక!" అని శపింపగా దేవతలా పుష్పాన్ని శివుని సన్నిధినుండి దూరంగా తొలగించారు.

శివుని శాపానికి ముఖం ముడుచుకొన్న కేతకి "ఓ నాథా! నీకు నమస్కారం. నీ ఆజ్ఞచే నా జన్మ నిష్ఫలమైంది. తండ్రీ నా పాపాన్ని క్షమించి నా జన్మను సఫలం చెయ్యండి. తెలిసి గాని తెలియక గాని చేసిన పాపం నీ నామస్మరణ చేతనే నశిస్తుంది కదా! అట్టి నిన్ను నే దర్శించాను. ఇక నాకు అనృత దోష మెక్కడ?" అని సభామధ్యమందు స్తుతించగా శివుడిలా అన్నాడు.

'ఓ కేతకీ ఈశ్వరుడనైన నేపలికినది విధి వాక్యం. కావున నిన్ను నే ధరించను. అంతే కాదు. నువ్వు చేసిన తప్పుకు శిక్షగా నువ్వెప్పుడు ముడుచుకొనే ఉంటావు. ఇతర పుష్పాలవలె నీకు వికసనం లేకపోవు గాక! నీకొక్క వరం ఇస్తున్నాను. నా భక్తులు నిన్ను ప్రీతితో ధరిస్తారు! నిన్ను మించిన ఆరోగ్యప్రదమైన పుష్పం భూలోకంలో మరేదీ ఉండదు. ఛత్ర రూపంలో నువ్వు నాపై ఉంటావు." మహాదేవుడైన ఈశ్వరుడు ఈ విధంగా బ్రహ్మ – విష్ణువులను అనుగ్రహించి, కేతకీ పుష్పానికి ఉన్నత స్థానమిచ్చి సర్వదేవతా సమూహం స్తుతింపగా సర్వోత్కృష్టుడై విరాజిల్లుతున్నాడు.

### శివరాత్రి – అరుణాచలం

అట్టి సమయంలో బ్రహ్మ – విష్ణువు లిరువురు శివ – శక్తులను ఉన్నతాసనాసీనులను చేసి అంజలిబద్ధులై కుడి – ఎడమల నిలబడి పవిత్రమైన పురుష వస్తువులతో పూజించారు. మునులారా! దీర్ఘకాలం స్థిరంగా ఉండేవి పురుష వస్తువులు. కొద్ది కాలం మాత్రం మనగల్గేవి ప్రాకృతములని లోక వ్యవహారం. హారములు, నూపురములు, కేయూరములు, కిరీటము, మణికుండలాలు, యజ్ఞోపవీతం, ఉత్తరీయం, పట్టు వస్త్రాలు, ఉంగరాలు, పుష్పములు, తాంబూలం, కర్పూరం, గంధం, అగరు, ధూపం, దీపం, వెల్ల గొడుగు, వింజామరలు, ధ్వజం మొదలగు దివ్య వస్తువులతో అంబికా సహితుడైన పరమేశ్వరుని పూజించారు. ఆ వస్తువుల వైభవం వాఙ్మనో తీతం. ఇతర జీవులకు అలభ్యం. భగవంతుణ్ణి ఎప్పుడూ శ్రేష్ఠతమమైన వస్తువులతోనే కదా పూజించాలి.

ఈశ్వరుడు చాలా ఆనందించి లోకంలో ఒక మర్యాదను స్థాపించాలనే సంకల్పంతో వాటన్నిటిని సభ్యులకు ప్రసాదంగా ఇచ్చేశాడు. దేవతలా వస్తువులను స్వీకరిస్తూండగా పెద్ద కోలాహలం పుట్టింది. కోలాహలం సద్దుమణిగాక ఈశ్వరుడు ప్రసన్నుడై లోకంలో భక్తిని వర్ధిల్ల చేసి లోకులను తరింపజేయాలనే కోరికతో ఇలా ఉపదేశించాడు. "కుమారులారా! మీరు చేసిన పూజకు నేమిక్కిలి సంతుష్టుడనయ్యాను. ఈ రోజు చాలా పుణ్యదినం. చాలా మహత్తరమైనది. ఈ రోజు శివరాత్రి అనే నామంతో ఖ్యాతిని పొంద గలదు. ఈ తిథి నాకు ప్రియమైనది. ఈ తిథినాడు నా లింగాన్ని కాని, మూర్తిని గాని అర్చించిన మానవుడు సృష్టి, స్థితి, లయములను చేయగల సమర్థుడవుతాడు. శివరాత్రి నాడు రోజంతా నిరాహారుడై జితేంద్రియుడై యథా శాస్త్రంగా, యథా శక్తిగా దంభం లేకుండా నన్ను అర్చించాలి. శివరాత్రి నాడు అర్చిస్తే సంవత్సర ఫలం వస్తుంది. పున్నమ రోజున సముద్రం పొంగినట్లు శివరాత్రి నాడు నా దయారసం వెల్లి విరుస్తుంది.

కుమారులారా! నేను ఆర్ద్రా నక్షత్రయుక్త మార్గశీర్ష పున్నమనాడు స్తంభాకారంగా ఆవిర్భవించిన కారణంగా ఆనాడు నన్ను దర్శించినా, అర్చించినా వానికి మహా పుణ్యం లభిస్తుంది. నేనీ యుద్ధ స్థలంలో లింగాకారంగా ఆవిర్భవించాను కనుక ఇది "లింగస్థానము" అనే పేరుతో ప్రసిద్ధి చెందుతుంది. ఆద్యంతాలు లేని ఈ మహా లింగం లోకుల దర్శన, పూజాదికాలకు అనుకూలంగా ఉండే నిమిత్తమై అణుమాత్రంగా (చిన్నదిగా) ఉంటుంది. ఈ లింగం మానవులకు అనేక భోగాల నిస్తుంది. భుక్తి, ముక్తి దాయకం. దీనిని దర్శించి, స్పృశించి, ధ్యానించిన వారికి పునర్జన్మ ఉండదు. ఈ లింగం అగ్ని పర్వతం వలె ఆవిర్భవించిన కారణంగా ఇది అరుణాచలం అని ప్రసిద్ధిని పొందుతుంది. ఇక్కడ గొప్ప తీర్థ నిర్మాణం జరుగుతుంది. క్షేత్ర, రథోత్సవాది మంగళ కార్యాలు జరుగుతాయి. ఈ ప్రాంతమంతా నా భక్తకోటిచే నిండి ఉంటుంది. ఈ క్షేత్రంలో చేసిన దాన, హోమ, జప, తపాది పుణ్యకార్యాలకు కోటిరెట్లు పుణ్యం వస్తుంది. నా క్షేత్రాలన్నిటి లోను ఇది మిక్కిలి మహత్తర మైనది. అత్యంత శోభనమైనది. సర్వ కళ్యాణ సంపూర్ణమైనది. ఇక్కడ స్మరణ మాత్రంచే ముక్తి. అర్చనాదికాలను చేసిన వారికి సాలోక్య, సామీప్య, సాయుజ్యాది పంచకర్మల ఫలితం సిద్ధం. ఇక్కడ అందరి మనోరథాలు సిద్ధిస్తాయి".

భగవానుడైన శంకరుడు విధి – మాధవులను ఈ విధంగా అనుగ్రహించి, యుద్ధంలో హతులైన వారి గణసైన్యాన్ని తన అమృత ధారా రూపమైన శక్తితో పునర్జీవితులను చేశాడు. చేసి వారి మధ్య వైరాన్ని, వారి అజ్ఞానాన్ని పరిహరించాలనే అనుకంపతో తాను సర్వజ్ఞుడు, సాక్షాత్తు వేద స్వరూపుడు కనుక వేదసారాన్ని ఇలా ఉపదేశించాడు. "కుమారులారా! నాకు సకలము(సాకారము), నిష్కలము (నిరాకారము) ఐన రూపాలు రెండున్నాయి. తక్కిన వారికీ రెండు రూపాలు లేవు. నేను తప్ప మిగిలిన వారందరూ సాకారులే! అందువల్ల వారందరూ జీవులే! నేనొక్కడనే ఈశ్వరుడను! నేను ముందు స్తంభ రూపంలో నిరాకారంగాను, తరువాత సాక్షాద్రూపంలోను ఆవిర్భవించాను.

పుత్రులారా! లోకాలకన్నిటికి ఆధారభూతుణ్ణి నేనే కనుక ఈపైన లోకంలో జరిగే గృహ, ఆరామ, క్షేత్రాదులన్నీ స్తంభాగ్రం ఆధారంగానే జరగాలి. స్తంభాలు లేకుండా మానవునికి ఉనికి లేదు. నివాస యోగ్యమైన ఇల్లు అంటే అది శివక్షేత్రమని గుర్తించండి! అంతే కాదు. లోకంలో కొండలు, వృక్షాలు, లతలు ఇత్యాదులన్నీ స్తంభాకారంలో, నిటారుగా, ఊర్ధ్వ ముఖంగానే ఉంటాయి. అవన్నీ నా స్వరూపాలే అని తెలుసుకోండి. కేవలం అవి నా

కేశములు మాత్రమే. అందుకే నాకు హరికేశుడనే నామం వర్ధిల్లుతోంది! బ్రహ్మభావం నిరాకారం. ఈశ్వర తత్త్వం సాకారం.

కేవలం అజ్ఞానంచే మీరిలా ప్రవర్తించారు. ఆ కారణంగానే "నేనే ఈశుడను" అనే గర్వం మీలో బయలు దేరింది. దాన్ని నిర్మూలించి మిమ్ములను కృతార్థులను చెయ్యటం కొరకే నేనిలా ఆవిర్భవించాను. నా అనుగ్రహం చేతనే ఈ లోకాలన్ని ప్రకాశిస్తున్నాయి. ఓ విధి – మాధవులారా! అంతటా వ్యాపించి యున్న కారణంగా నాకు "బ్రహ్మము" అని పేరు. నా విపుల క్రియాశక్తి చేతనే విశ్వం వ్యాపిస్తోంది. సర్వులలో ఏక రూపంగా చైతన్య రూపంగా వ్యాప్తి చెంది ఉన్నాను కనుక నాకు "ఆత్మ" అని పేరు.

ఇతరులందరూ అనాత్మలు, జీవులు అనటంలో సందేహం లేదు. పంచకృత్య పరాయణుడను నేనే. నాయందు అవి స్థిరంగా ఉంటాయి. ఇతరుల యందు లేవు. సర్వానికి ఆశ్రయభూతుణ్ణి ఐన నాకు వేరే ఆశ్రయం అక్కర లేదు. ఐనా లింగ ప్రతిష్ఠ జరిగిన చోట స్థిరంగా ఉంటాను. ఒక లింగ ప్రతిష్ఠ జరిపితే సారూప్యము. అదే వ్యక్తి రెండవ లింగాన్ని కూడా ప్రతిష్ఠి చేస్తే సాయుజ్యమూ లభిస్తాయి. సర్వత్ర లింగం ప్రధానంగాను, మూర్తి అప్రధానంగాను ప్రతిష్ఠ జరపాలి. మూర్తి ఉన్నా లింగం లేనట్లైతే అది క్షేత్రం కాదు."

**పంచకృత్యములు ప్రణవం – పంచాక్షరి**

అంత బ్రహ్మ – విష్ణువులిలా ప్రశ్నించారు. "ఈశ్వరా! సృష్టి మొదలుగా ఐదు జగత్కార్యాలను విపులంగా చెప్పండి." వారి యందు అనుగ్రహంతో శివుడిలా చెప్పసాగాడు.

"కుమారులారా! నా కృత్యముల యొక్క జ్ఞానం ఇంద్రియముల చేత అర్థం చేసికొనటానికి అందనిది. దానికతీతమైనది. 1. సంసార ప్రారంభం *సృష్టి*. 2. దాని ప్రతిష్ఠ (స్థిరముగా ఉండుట) *స్థితి*. 3. సంహారం *లయం*. 4. జీవుల మరణం *తిరోభావం*. 5. మోక్షం అనుగ్రహం ఈ ఐదు నా పంచ కృత్యములు. ఇతరుల యందు ఈ కార్యారోపణ, గోపురం మీది బొమ్మ గోపురాన్ని మోస్తోంది అని అనుకోవటం వంటిది.

సృష్టి మొదలుగా తిరోభావం వరకు ఈ నాలుగూ సంసారాన్ని విస్తరింప చేస్తాయి. ఐదవదైన మోక్షం నాయందు స్థిరంగా ఉంటుంది. పంచ భూతాత్మకమైన ప్రకృతికి ఆధారభూమిగా నిలిచి చైతన్య స్వరూపుడనైన నేను ప్రకృతి ద్వారా నాకృత్యములను నెరవేరుస్తూ ఉంటాను. భూమియందు సృష్టి, ఉదకములయందు స్థితి, అగ్ని యందు లయము, వాయువునందు తిరోభావము, ఆకాశమునందు అనుగ్రహము అనే పంచ కృత్యాలను

నేను ప్రకృతి ద్వారా నెరవేరుస్తూ ఉంటాను. ఈ అనంత విశ్వంలో పంచ భూతములు మినహా ఆరవ భూతం లేదు. దీనిని జ్ఞానులు మాత్రమే గ్రహించ గలరు. ప్రకృతి (మాయ) అనే తెఱ వెనుక ఏముందో అజ్ఞానులు గ్రహించ లేరు.

భూమి సర్వమును సృష్టిస్తుంది. జలం వర్ధిల్లజేస్తుంది. అగ్ని దహిస్తుంది. వాయువు ప్రాణాలను తీసుకొని పోతుంది. ఆకాశం అనుగ్రహ స్వరూపం. ప్రపంచ భవిష్యత్తు, జీవుల సుఖదుఃఖాలు ఖగోళం మీద ఆధారపడి ఉందనే విషయాన్ని పండితులు మాత్రమే గ్రహించ గలరు.

నా ముఖ పంచకం చేత ఈ పంచ కృత్యాలను నెరవేరుస్తూ ఉంటాను. నాలుగు దిక్కులలో నాలుగు ముఖాలు వాటి మధ్యలో ఐదవ ముఖం ఉంది. కుమారులారా! మీ తపస్సుకు సంప్రీతుడనైన నేను సృష్టి – స్థితులనే కార్యద్వయాన్ని మీకనుగ్రహించాను. అది మీ భాగ్య విశేషం. తరువాత కార్యద్వయాన్ని రుద్ర – మహేశులు మీలాగే నిర్వర్తిస్తున్నారు. అనుగ్రహమనే ఐదవ కృత్యం నేను తప్ప ఇతరులు పొందుటకు అనర్హులు. ఈ పూర్వ వృత్తాంతాన్ని మీరు మరిచారు. రుద్ర మహేశులు విస్మరించ లేదు. వారికి రూప, వేష, కార్య, వాహన, ఆసన, ఆయుధాలలో నాతో సమంగా సారూప్యాన్నిచ్చాను.

వత్సలారా! నా ధ్యానాన్ని విడిచి పెట్టటం వల్ల మీకీ అజ్ఞానం ప్రాప్తించింది. నా యధార్థ జ్ఞానాన్ని కలిగియుంటే మీరు కూడా సారూప్యాన్ని పొంది ఉండే వారు. జ్ఞాన సిద్ధికై మీ అహంకార నిర్మూలనకై “ఓం” కార మంత్రాన్ని జపించండి. ఇది సర్వ మంగళప్రదం. గతంలో ఉపదేశించాను. ఈ “ఓం” కారం ప్రప్రథమంగా నాముఖం నుండి పుట్టింది. దాని లక్ష్యార్థం నేనే. అది నన్నే బోధిస్తుంది. ఈ ఓంకారం వాచకం. నేను వాచ్యుణ్ణి. అది నా స్వరూపం. దాని నిత్య స్మరణ నా స్మరణయే అవుతుంది.

ఈ మంత్రం ఉద్భవించిన విధానాన్ని చెపుతున్నాను వినండి. ముందుగా ఉత్తరముఖం నుండి అకారం, పశ్చిమ ముఖం నుండి ఉకారం, దక్షిణముఖం నుండి మకారం, తూర్పుముఖం నుండి బిందువు, మధ్యముఖం నుండి నాదం పుట్టి ఈ మంత్రం ఐదు విధాలుగా విస్తరించి తిరిగి ఏకీభూతమై “ఓం” అనే ఏకాక్షర మంత్రమై నిలిచింది. నామరూపాత్మకమైన ఈ జగత్తును గూర్చిన సత్యాన్ని కుల (దేవి – స్త్రీ) అకుల (దేవ – పురుష) మంత్రాలుగా వేదం చెప్పింది. అవి వేరు వేరుగా ఉన్నాయి. కాని ఈ ఓంకారం మాత్రం శివ – శక్తి బోధకం. స్త్రీ – పురుష శక్తులు రెండూ ఇందులో ఉన్నాయి.

ఈ ఓంకారం నుండి అకారాది వరుస, మరియు నకారాది వరుసలో పంచాక్షరి మంత్రం పుట్టింది. ఇది సగుణుడు, సాకారుడు ఐన భగవానుని బోధిస్తుంది. ఈ పంచాక్షరి నుండే ఐదైదు వర్ణములు గల ఐదు వర్గములతో కూడిన వర్ణమాల పుట్టింది. శిరోమంత్రము అని చెప్పబడే నాల్గవ పాదంతో సహా మూడు పాదాలుగల గాయత్రీ మంత్రం కూడా దీని నుండే పుట్టింది. దాని నుండి సమస్త వేదములు, వేదాల నుండి కోట్లాది మంత్రాలు పుట్టాయి. ఆయా మంత్రాల వలన అంతమాత్రపు సిద్ధి. ఈ ఓంకారోపాసన వలన సర్వసిద్ధులు లభిస్తాయి. తుదకు మోక్షం కలుగుతుంది."

ఇంత వరకు ఉపదేశించి శివుడు నందికేశ్వరుని వైపు చూచాడు. శివాజ్ఞను ఎరిగిన నందీశ్వరుడు బ్రహ్మ - విష్ణువులను ఉత్తర ముఖంగా ఆసీనులను చేసి వారి శిరస్సులపై తన హస్త పద్మాన్నుంచి తిరిగి ఆ మహా మంత్రాన్ని ఉపదేశించాడు. వారిద్దరు ఆ మంత్రాన్ని మూడుసార్లు ఉచ్చరించి యంత్ర, తంత్ర, పూర్వకంగా గ్రహించి గురు దక్షిణగా తమ్ముతామే ఆత్మ సమర్పణ చేసికొన్నారు. అనంతరం చేతులు జోడించి జగద్గురువైన మహాదేవునిలా స్తుతించారు.

**శ్లో॥ నమో నిష్కల రూపాయ - నమో నిష్కల తేజసే**
**నమస్సకల నాథాయ - నమస్తే సకలాత్మనే ॥**
**నమః ప్రణవ వాచ్యాయ - నమః ప్రణవ లింగినే**
**నమః స్సృష్ట్యాది కర్త్రేచ - నమః పంచముఖాయతే ॥**
**పంచ బ్రహ్మ స్వరూపాయ - పంచకృత్యాయతే నమః**
**ఆత్మనే బ్రహ్మణే తుభ్య - మనంత గుణ శక్తియే ॥**
**సకలాకల రూపాయ - శంభవే గురవే నమః**
**ఇతి స్తుత్వాగురుంపద్యై - ర్బ్రహ్మో విష్ణు శ్చనేమతుః ॥**

శంకరా! నిరాకారుడవైన నీకు నమస్కారం. తేజో రూపుడవైన నీకు నమస్కారం. సాకారుడవైన నీకు నమస్కారం. ఓంకార వాచ్యుడవైన నీకు నమస్కారం. ఓంకారం నీకు చిహ్నం. సృష్ట్యాది పంచకృత్యములను ఆచరించు ఐదు ముఖములు గల నీకు నమస్కారం. పంచకృత్యములను చేయు పంచబ్రహ్మ స్వరూపుడవైన నీకు నమస్కారం. ఆత్మరూపుడు, పరబ్రహ్మ స్వరూపుడు, అనంత కళ్యాణగుణ శక్తి యుతుడవైన నీకు నమస్కారం. సాకార, నిరాకార రూపుడైన శివగురువునకు నమస్కారం. ఈ విధంగా బ్రహ్మ-విష్ణువు లిరువురు మంత్రాలతో గురువైన శంకరుని స్తుతించారు.

అంత అంబికా సహితుడైన శంకరుడు ఆనందించి "ఓ కుమారులారా! నా యధార్థ తత్త్వాన్ని మీకు బోధించి నా నిజ స్వరూపాన్ని మీకు తెలియ చెప్పాను. దేవీకృప వలన లభించిన నా ఆత్మ స్వరూపమైన, ప్రణవ మంత్రాన్ని జపించండి. దీని వలన సుస్థిరమైన జ్ఞానం, శాశ్వతమైన భోగ, భాగ్యాలు లభిస్తాయి. ఆర్ద్రా నక్షత్రయుక్త చతుర్దశి నాడు జపిస్తే అక్షయఫలం లభిస్తుంది. సూర్యుడు మహార్ద్రా నక్షత్రంలో ప్రవేశించినప్పుడు చేసిన జపానికి కోటి రెట్లు ఫలం అధికం. మృగశీర్ష యొక్క అంత్యకాలం, పునర్వసు యొక్క ప్రారంభకాలంలో చేసిన పూజా, హోమ, తర్పణాదులకు ఆర్ద్రతో సమమైన ఫలం చేకూరుతుంది. ప్రాతః కాలంలోను, మధ్యాహ్న సంధికాలం లోను నన్ను దర్శించాలి. రాత్రియందు గాని, లేక సంధ్యాకాలమందు గాని చతుర్దశి తర్వాత తిధితో కలిసియున్న కాలం నా దర్శనానికి మిక్కిలి శ్రేష్ఠం.

కుమారులారా! నాలింగము మరియు మూర్తి రెండూ సమాన మైనవే. ఐనా సాధకునకు లింగార్చన శ్రేష్ఠం. మోక్షార్థి ఐన వానికి లింగార్చన శ్రేష్ఠతరం. లింగాన్ని ఓంకార మంత్రం తోను, మూర్తిని పంచాక్షరితోను పూజించాలి. సాధకుడు తాను స్వయంగా లింగ ప్రతిష్ఠ చేసి లేదా ఇతరులచే ప్రతిష్ఠాపన చేయించి షోడశోపచార పూజా విధానంతో అర్చిస్తే నా నివాసమైన కైలాసాన్ని పొందగలడు. ఈ విధంగా లోక పాలకులైన బ్రహ్మ – విష్ణువుల కుపదేశించి సర్వజ్ఞుడైన శంకరుడు అంతర్హితు డయ్యాడు.

**లింగ ప్రతిష్ఠ – ప్రణవం పంచాక్షరి**

సూతుణ్ణి ఋషులిలా అడిగారు. "ఓ సూతా! లింగాన్ని ఎలా ప్రతిష్ఠించాలి? లింగం యొక్క లక్షణాలేమిటి? దానిని ఎలా అర్చించాలి? దేశ, కాలాదుల ననుసరించి దేనితో లింగాన్ని నిర్మించాలి?"

ఋషుల ప్రశ్నలకు సమాధానంగా సూతుడిలా చెప్పసాగాడు. "ఋషులారా! సావధానంగా వినండి. అనుకూలమైన శుభముహూర్తంలో పుణ్యక్షేత్రంలో, నదీ తీరంలో పార్థివ, జల, తేజోమయ లింగాల్లో, మనసుకిష్టమైన లింగాన్ని ప్రతిష్ఠించి నిత్యమూ అర్చించాలి. కల్పంలో చెప్పబడిన విధంగా అర్చించాలి.

చల ప్రతిష్ఠలో చిన్న లింగం, అచల ప్రతిష్ఠలో పెద్ద లింగం శ్రేష్ఠం. సలక్షణాలతో కూడిన లింగాన్ని పీఠంతో సహా స్థాపించాలి. లింగ పీఠం మండలాకారంగా గాని, చతుర్భుజాకారంగా గాని, త్రికోణాకారంగా కాని ఖట్వాంగం వలె మధ్యలో సూక్ష్మంగా గాని ఉంటే మహాఫలం. చల ప్రతిష్ఠలో లింగాన్ని మట్టి, రాయి, లోహం మొదలైన

పదార్థాలతో చెయ్యవచ్చు. పీఠాన్ని, లింగాన్ని ఒకే పదార్థంతో చెయ్యాలి. బాణ లింగానికి ఈ నియమం వర్తించదు. లింగం కర్త యొక్క పన్నెండు వ్రేళ్ళ పరిమాణం ఉంటే ఉత్తమం. ఎక్కువ ఉన్నా దోషం లేదు. చల ప్రతిష్ఠలో లింగ పరిమాణం యజమాని యొక్క వ్రేలంత ఉండవచ్చు.

అచల ప్రతిష్ఠలో ముందు శిల్ప శాస్త్రానుసారంగా దేవాలయాన్ని నిర్మించాలి. అందులో గర్భగుడి సుందరంగాను, ధృఢం గాను, అద్దంవలె స్వచ్ఛంగాను ఉండాలి. నాలుగు దిక్కులలోను నవరత్నాలంకృతమైన నాలుగు ద్వారాలుండాలి. లింగాన్ని ప్రతిష్ఠించు స్థానంలో నీల, రక్త, వైడూర్య, శ్యామ, మరకత, ముక్తకా, ప్రవాల, గోమేధ, వజ్రములనే తొమ్మిది రత్నాలను వేదోక్తపురస్సరంగా ఉంచాలి.

సద్యోజాతాది మంత్రాలచే లింగాన్ని ఐదు స్థానాల్లో పూజించాలి. సాకారుడనైన నాకు, ఇతర దేవతలకు హవిస్సుతో అగ్నిలో హోమం చెయ్యాలి. గురువును, ఆచార్యుని దక్షిణలతో అర్చించాలి. బంధు జనుల కోర్కెలను తీర్చి, అర్థులకు ధన ధాన్యాదులను, పశువులను దానమియ్యాలి. చరాచర జీవు లన్నింటిని ప్రయత్న పూర్వకంగా సంతోష పెట్టాలి. బంగారంతో, నవరత్నాలతో లింగ గర్తాన్ని (గోతిని) పూరించాలి. సద్యోజాతాది మంత్రాలను పఠిస్తూ, మంగళకరుడైన మహాదేవుని ధ్యానించి, ఓంకారంతో దిక్కులు ప్రతిధ్వనింపగా, శంఖనాదం చేస్తూ గర్తంలో లింగాన్ని ప్రతిష్టించి పీఠంతో కలపాలి. ఆపై ధృఢమైన లేపనంతో లింగ పీఠాలను సుస్థిరం చేయాలి. అట్టి దేవాలయంలో ఉత్సవార్థం బయటి పూజలకై పరమ మంగళమయమైన పార్వతీ – పరమేశ్వరులను పంచాక్షరితో స్థాపించాలి. ఆ మూర్తులను గురువుల నుండి గాని, సాధు పురుషులచే పూజింపబడిన దానిని గాని తెచ్చుకోవచ్చు. ఈ విధంగా లింగాన్ని, మూర్తిని అర్చిస్తే శివపదం లభిస్తుంది.

అంతే గాక లింగం రెండు విధాలని చెప్పబడింది. ఒకటి స్థావరం, రెండవది జంగమం. చెట్లు, లతలు ఇత్యాదులు స్థావరాలు. క్రిమికీటకాదులు జంగమాలు. స్థావర లింగాన్ని జల సేవనంతోను, జంగమ లింగాన్ని ఆహారాదులతోను ప్రీతి పూర్వకంగా సంతోష పెట్టాలి. ఇదే శివపూజ. సర్వత్ర పీఠం దేవీ స్వరూపం. లింగం చిన్మయ స్వరూపం. ఏవిధంగా శంకరుడు ఉమాదేవిని ఎల్లప్పుడు తన అంకపీఠంపై అధివసింప చేసికొని ఉంటాడో ఆ విధంగానే లింగం పీఠాన్ని ధరించి ఉంటుంది. ఈ విధంగా మహాలింగాన్ని స్థాపించి ఉపచారాదులతో పూజించి ధ్వజారోహణాది ఉత్సవాలను జరిపించాలి. మానవుడు అచల ప్రతిష్ఠ వలన శివధామాన్ని, చల ప్రతిష్ఠ వలన శివపదాన్ని పొందుతాడు.

లింగాన్ని షోడశోపచార పూజా విధానంతో అర్చించాలి. 1) ఆవాహన. 2) ఆసనం, 3) అర్ఘ్యం 4) పాద్యం 5) ఆచమనం 6) అభ్యంగనం 7) వస్త్రం 8) గంధం 9) పుష్పం 10) ధూపం 11) దీపం 12) నైవేద్యం 13) నీరాజనం 14) తాంబూలం 15) నమస్కారం 16) ఉద్వాసన ఇవి షోడశోపచారాలు. వీటిని యథాశక్తి ఆచరించాలి. కనీసం అభిషేక, నైవేద్య, నమస్కార, తర్పణాలను యథాశక్తి చేసిన వారికి శివపదం లభిస్తుంది.

దేవతలచే, ఋషులచే లేదా ఇతర మానవులచే లేదా స్వయం వ్యక్తమైన లేదా సాధకుడు తాను ప్రతిష్ఠించిన నూతన లింగాన్ని యథావిధిగా అర్చించినా లేదా పూజాద్రవ్యాలను దానమిచ్చినా మరణానంతరం కైలాస ధామాన్ని చేరుకొంటాడు. కనీసం శివాలయానికి వెళ్ళి ప్రదక్షిణ నమస్కారాదులను చేసినా, ప్రతి నిత్యం లింగదర్శనం చేసినా శివసాయుజ్యం లభిస్తుంది. మట్టి, పిండి, గోమయం, పుష్పములు, గన్నేరు పువ్వులు, ఫలాలు, బెల్లం, వెన్న, విభూతి, అన్నం ఈ మొదలైన వాటిలో తన మనసుకు నచ్చిన వస్తువుతో లింగాన్ని చేసి యథావిధిగా శక్తి మేరకు అర్చించాలి. లింగ పరిమాణం విషయంలో నిషేధమేమి లేదు. దేనైన్నా లింగ భావనతో పూజించ వచ్చు. సాధకుని శ్రమకు తగిన ఫలాన్నిచ్చే వాడు శంకరుడే కదా! లింగాన్ని కాని లింగం యొక్క వెలను గాని శ్రద్ధాభక్తులతో శివభక్తునికి సమర్పిస్తే శివపదం లభిస్తుంది.

నిత్యము ఓంకారాన్ని పదివేలు జపించినా లేదా ఉభయ సంధ్యల యందు వేయి చొప్పున జపించినా ఆ భక్తుడు శివ సాయుజ్యాన్ని పొందుతాడు. ఓంకారాన్ని దీర్ఘ మకారాంతంగా జపిస్తే మనశ్శుద్ధి కలుగుతుంది. సమాధి స్థితిలో మానసికం గాను, ఇతర కాలాలలో ఇతరులకు వినపడని విధంగాను చెయ్యాలి. బిందువు (అనుస్వారం) నాదములతో కూడిన ఓంకారం సమాన ప్రణవం.

పంచాక్షరిని నిత్యము పదివేలు లేదా ఉభయ సంధ్యల యందు వేయి చొప్పున జపిస్తే శివపదం లభిస్తుంది. గాయత్రి యందు అధికారం గలవారు పంచాక్షరిని ఆదియందు ఓంకారంతో కలిపి జపిస్తే శ్రేష్ఠం. మంత్రాన్ని ఎప్పుడూ గురువునుండి దీక్షాపూర్వకంగా స్వీకరిస్తేనే సిద్ధి. సత్యముచే పవిత్రమైన అంతఃకరణ గలవాడు, జ్ఞానియైన వాడు మాత్రమే గురువు. పంచాక్షరిని గాయత్రీ మంత్రాధికారులు నమఃపూర్వకంగాను (నమశ్శివాయ) ఇతరులు నమః అంతముగను (శివాయ నమః) జపించాలి. స్త్రీలు కూడ నమః అంతముగా

జపించాలి. బ్రహ్మజ్ఞానులైన స్త్రీలు నమః పూర్వకంగ జపించాలి. ఐదు కోట్లు జపించిన వారెవరైనా శివునిలో ఐక్యమవుతారు. ఒకటి, రెండు, మూడు నాలుగు కోట్లు జపిస్తే క్రమంగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ లోకాలను పొందుతారు. ఒక అక్షరాన్ని వేరువేరుగా అక్షర లక్షలు (ఐదు లక్షలు) లేదా  మంత్రాన్ని అక్షర లక్షలు (ఇరవై ఐదు లక్షలు)జపిస్తే కైలాససిద్ధి కలుగుతుంది. అనంత కోటి మంత్రాలున్నాయి. ఒక అక్షరం మొదలుగా తొమ్మిదివేల తొమ్మిదివందల తొంభై తొమ్మిది అక్షరాలుగల మంత్రాలున్నాయి. ఒకే అక్షరంగల మంత్రాలను ఒక కోటి జపం చెయ్యాలి.

శివాలయంలో పూలతోటలను పెంచినా, ఆలయాన్ని తుడిచి, కడిగి శుభ్రం చేసినా శివుడు ప్రసన్నుడవుతాడు. శివాలయం లేని చోట పండితుడు నివాసముండ రాదు. మానవ ప్రతిష్ఠితమైతే లింగంనుండి వంద బారల దూరం వరకు, ఋషి లేదా దేవతా ప్రతిష్ఠిత క్షేత్రంలో వేయి మూరల వరకు, స్వయంభూ క్షేత్రంలో వేయి ధనస్సుల దూరం వరకు పవిత్ర భూమి అని జ్ఞానుల మాట. గ్రామంలో గల బావులలోని నీరు పానయోగ్యం కాకపోయినా ఆ గ్రామంలో గల శివాలయం లోని బావినీరు మధురంగా ఉంటుంది. అదే పవిత్ర భూమి  అనే మాటకు సాక్ష్యం. మానవుని మరణానంతరం దహనం మొదలుగా ఇతర కర్మలను శివక్షేత్రంలో చేస్తే ఆ జీవుడు ముక్తుడౌతాడు. కోరికలతో శివార్చన చేస్తే వెంటనే ఫలం లభిస్తుంది. నిష్కామంగా చేస్తే జ్ఞానమే దాని లబ్ధి. మహా మహిమోపేత మైన శివక్షేత్రంలో ఏడు, ఐదు లేక మూడు కనీసం ఒక్క రాత్రి నివసిస్తే శివానుగ్రహం తప్పక లభిస్తుంది.

ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలము అని దినం మూడు భాగాలుగా ఉంది. ఉదయం నిత్య కర్మలకు, మధ్యాహ్నం కామ్య కర్మలకు సాయంకాలం శాంతి కర్మలకు తగిన కాలం. రాత్రి యందు కూడా ఇలాటి విభాగమే ఉంది. రాత్రి మధ్యభాగానికి నిశీధమని పేరు. ఆ కాలంలో శివపూజ చేస్తే విశేషఫలం. కలియుగంలో విశేషించి కర్మచేత ఫలసిద్ధి. మానవుడు ధార్మిక ప్రవృత్తి, పాపభీతి కలిగి యథాశక్తి పైన చెప్పిన వాటిలో ఏదో ఒక దానిని ఆచరిస్తే ఫలం అనంతంగా ఉంటుంది."

ఇంత వరకు శ్రద్ధతో విన్న ఋషులు ప్రీత చేతస్కులై సూతుణ్ణిలా అడిగారు. "ఓ సూతా! నీవు యోగులలో శ్రేష్ఠుడవు. మాకు పుణ్య క్షేత్రాల గురించి సంగ్రహంగా చెప్పు. శివక్షేత్రాలను గూర్చి, శివాగమాలను గూర్చి కూడ వివరించు. మానవు లందరు వాటిని దర్శించి సేవించి ధన్యులవుతారు."

## తీర్థములు - క్షేత్రములు

సూతుడిలా చెప్ప సాగాడు. "ఓ మునులారా! దుర్గమ పర్వతారణ్యాలతో కూడిన ఈ విశాలమైన భూమి శివాజ్ఞచే ప్రాణులను ధరించి ఉంది. జగన్నాథుడైన పరమేశ్వరుడు లోకానుగ్రహం కోసం ఆయా స్థలాలలో పుణ్యక్షేత్రాలను కల్పించాడు. ఋషులు నివసించుట వలన కొన్ని, దేవతానుగ్రహం వలన కొన్ని, స్వయంభూలింగావిర్భావం వలన కొన్ని లోకరక్షణార్థం క్షేత్రములయ్యాయి. పుణ్యక్షేత్రాలలో తీర్థస్నానం మహిమోపేతమైనది. క్షేత్రం అంటే భూమి మహిమ. తీర్థం అంటే జల మహిమ.

ముందు తీర్థాలను గూర్చి చెపుతాను వినండి. సరస్వతీ నది అరవై ముఖాలు (ధారలు లేక చిన్న చిన్న ఉపనదులు) గలది. హిమవత్పర్వతంలో పుట్టిన గంగానది వంద ముఖములు గలది. దాని తీరంలో కాశి ఇత్యాది పుణ్యక్షేత్రాలున్నాయి. సూర్యుడు మృగరాశిలో ఉండగా కాశీ నివాసం శ్రేష్టం. గురువు (బృహస్పతి) మృగరాశిలో ఉండగా శోణ భద్రానది శ్రేష్ఠం. దానికి పది ముఖాలున్నాయి. నర్మదా నదికి ఇరవై నాలుగు ముఖాలు, తమసా నదికి పన్నెండు, రేవా నదికి పది, గోదావరికి ఇరవై ఒకటి, కృష్ణవేణికి పద్దెనిమిది, తుంగభద్రకు పది, సువర్ణముఖీ నదికి తొమ్మిది ముఖాలు ఉన్నాయి. ఇరవై యేడు ముఖాలుగల కావేరీ నది సహ్య పర్వతం నుండి పుట్టింది. దాని తీరంలో పవిత్రమైన శైవక్షేత్రాలెన్నో ఉన్నాయి.

గురువు, రవి మేషరాశి యందున్నప్పుడు నైమిషం లోను, బదరిలోను స్నానం చేయ్యాలి. రవి సింహరాశి యందు, కర్కాటక రాశియందు ఉన్నప్పుడు సింధు, కేదారాలలో స్నానం ఉత్తమం. భాద్రపద మాసంలో గురువు సింహరాశిలో ఉండగా గోదావరీ స్నానం, గురువు, రవి కన్యారాశిలో ఉండగా యమునా, శోణ నదుల స్నానం, రవి, గురువులు తులారాశిలో ఉండగా కావేరి స్నానం, మార్గశిర మాసంలో రవి, గురువులు వృశ్చిక రాశిలో ఉండగా నర్మదా నదీ స్నానం అమిత పుణ్యప్రదములు. గురువు, రవి ధనూరాశిలో ఉండగా సువర్ణ ముఖీ స్నానం, మాఘమాసంలో గురువు మకర రాశిలో ఉండగా గంగా స్నానం, గురువు, రవి మీనరాశిలో ఉండగా కృష్ణవేణిలో స్నానం మహాపుణ్య ప్రదాలని పూర్వ ఋషులు చెప్పిన మాట. తామ్రపర్ణి, వేగవతీ నదీ తీరాలలో స్వర్గఫలాన్నిచ్చే దివ్య క్షేత్రాలున్నాయి.

మానవుడెల్లప్పుడు సదాచారము, సద్వృత్తము, సద్భావన కలిగి దయాళువై ఉండాలి. పుణ్య క్షేత్రములయందు, తీర్థములయందు, నదీ సంగమ, తీరముల యందు, గిరి శిఖరముల యందు, అరణ్యముల యందు, వనముల యందు పరమేశ్వర విలాసం తాండవ మాడుతూ ఉంటుంది. అందుకనే అక్కడ చేసిన పుణ్యం వృద్ధి పొందుతుంది. అలాగే పాపం కూడా. పుణ్యం ఐశ్వర్యాన్నిస్తుంది. మనోవాక్కాయ కర్మలచే చేసిన పాపాన్ని హరిస్తుంది.

అన్నింటి కంటే మనస్సుతో చేసిన పాపం వజ్రలేపం వలె కల్పాంతం వరకు వెంటాడుతూనే ఉంటుంది. అది ధ్యానం వలన మాత్రమే నశిస్తుంది. మరో దారి లేదు. వాక్కుతో చేసిన పాపం జపం వల్ల, శరీరంతో చేసిన పాపం తపస్సు వల్ల, ధనంతో చేసిన పాపం దానం వల్ల నశిస్తుంది. మరో మార్గం లేదు. ఈ ప్రాయశ్చిత్త కృత్యాలన్నీ తీవ్రమైన పశ్చాత్తాపంతో చెయ్యాలి. పశ్చాత్తాపం వల్ల సగం పాపం, తిరిగి ఆ పాప కృత్యాన్ని ఎప్పుడూ చెయ్యనందువల్ల మిగతా పాపం నశిస్తుందని జ్ఞాన దృష్టిగల ఋషులు చెప్పిన మాట. పుణ్య పాపాలు రెండింటికి బీజాంశము, వృద్ధ్యంశము, భోగాంశము అను మూడు భాగాలుంటాయి. బీజాంశం జ్ఞానం చేత, వృద్ధ్యంశం పైన చెప్పిన విధంగాను, భోగాంశం అనుభవించటం వల్లను నశిస్తుంది.

పుణ్యక్షేత్ర దర్శనం వల్ల, తీర్థ స్నానం వల్ల, దేవతారాధన వల్ల, మహాత్ముల దర్శన, సేవనాదుల వల్ల పాపం యొక్క బీజాంశం, వృద్ధ్యంశం నశిస్తాయి. భోగాంశం మాత్రం అనుభవించటం వల్ల మాత్రమే నశిస్తుంది. కావున సుఖాన్ని కోరే మానవుడు పాపాలను చెయ్యరాదు."

**సదాచారం – శౌచం – ధర్మానుష్ఠానం**

ఋషులు సూతుణ్ణిలా ప్రశ్నించారు "సూతా! ఉత్తమ లోకాలనిచ్చే సదాచారాన్ని గూర్చి మాకు చెప్పు. స్వర్గ – నరకాదులను ప్రాప్తింప చేసే ధర్మాధర్మాలను గూర్చి కూడా చెప్పు". అప్పుడు సూతుడిలా చెప్పసాగాడు.

"ఋషులారా! ముందుగా బ్రాహ్మణ విధులను గురించి చెపుతాను. విధులన్ని ఎక్కువగా బ్రాహ్మణునికే చెప్పబడ్డాయి. సదాచారం కలిగిన విద్వాంసుడు బ్రాహ్మణుడని, వేదాచార యుతుణ్ణి విప్రుడని ఈ రెంటిలో ఏదో ఒక గుణం కలవాడు ద్విజుడని వ్యవహారం. రాజ సేవ వల్లగాని, వ్యాపారం వల్లగాని, వ్యవసాయం వల్లగాని జీవించే బ్రాహ్మణుడు వరుసగా క్షత్రియ, వైశ్య, కర్షక బ్రాహ్మణులని పిలువబడతారు. ద్రోహబుద్ధి గల బ్రాహ్మణుడు

దుష్ట బ్రాహ్మణుడవుతాడు. భూమిని పాలించువాడు రాజు. ఇతర రాజవంశీయులు క్షత్రియులు. ధాన్యాదులను అమ్మేవాడు వైశ్యుడు. ఇతర వైశ్యకులస్థులు వణిక్కులు, వ్యవసాయం చేసే వారు కర్షకులు. ఇతరులు దస్యులు.

మానవులందరు ఉషః కాలంలో లేచి తూర్పుదిక్కుకు తిరిగి పరమేశ్వరుని ధ్యానించి, ఆ రోజు చెయ్య వలసిన ధర్మాధర్మ కృత్యాలను గూర్చి ఆలోచించి, ఆదాయ వ్యయాలను గూర్చి ఆలోచించాలి. నిద్రను వీడే సమయాన్ని, పద్ధతిని బట్టి మానవుని ఆయుర్దాయం, ఆరోగ్యం, మరణం, పాపం, భాగ్యం, వ్యాధి, పుష్టి మరియు శక్తి ఇత్యాది ఫలాలు కలుగుతాయని గ్రహించాలి. రాత్రి యొక్క చివరి ఝామునకు ఉషస్సు అని దానిలోని సగం భాగానికి సంధి అని పేరు. మానవులందరు ఆ సమయంలో నిద్ర లేవాలి.

దంతధావనం చేసేటప్పుడు చూపుడు వ్రేలును ఉపయోగించరాదు. జలదేవతలకు నమస్కరించి మంత్ర పూర్వకంగా స్నానం చేయాలి. విద్వాంసుడు స్నాన కాలంలోనే దేవపితృ తర్పణాలను చేయాలి. తెల్లని పంచను ఐదు కచ్చలతో కట్టాలి. సర్వ కర్మల యందు సర్వులు ఉత్తరీయాన్ని ధరించాలి. నదులలో గాని, చెరువులలో గాని బట్టలను ఉతక రాదు. గట్టుపై ఉతికి పిండుకోవాలి. ఆ వస్త్రజలం పితృదేవతలకు తృప్తినిస్తుంది.

బ్రాహ్మణుడు జాబాలోపనిషత్తు లోని 'అగ్నిరితి భస్మ' అను మంత్రాన్ని ఉచ్చరించి భస్మతో త్రిపుండ్రాన్ని ధరించాలి. పాప ప్రక్షాళనార్థం 'ఆపో హిష్ఠా' అను మంత్రంతో జలాన్ని శిరస్సుపై చల్లుకోవాలి. 'యస్యక్షయాయ' అనే మంత్రంతో పాదాలపై చల్లుకోవాలి. దీనికి సంధ్యాప్రోక్షణమని పేరు. ఆపోహిష్ఠేత్యాది మంత్రాలతో పాదాన్ని, శిరస్సును, హృదయాన్ని సంప్రోక్షణ చెయ్యాలి. దీనిని మంత్రస్నాన మంటారు. అపవిత్రస్పర్శ కొద్దిగా కలిగి నప్పుడు గాని, స్వస్థత లేనప్పుడు గాని, రాజుకు, రాష్ట్రానికి భయం కలిగి నప్పుడు గాని, యాత్రా కాలంలో గాని ఈ మంత్ర స్నానం చెయ్యాలి. ఉదయం 'సూర్యశ్చ' అను మంత్రంతోను, సాయంకాలం 'అగ్నిశ్చ' అనే మంత్రం తోను నీటిని త్రాగి, మరల మంత్రప్రోక్షణం చెయ్యాలి. ఉదయం తూర్పుదిక్కుకు సాయంత్రం పడమర దిక్కుకు తిరిగి అర్ఘ్యం ఇవ్వాలి. కాలాతిక్రమణం లేకుండా సంధ్యోపాసన చెయ్యాలి.

శివుడు, గౌరి, గుహుడు, విష్ణువు, బ్రహ్మ,ఇంద్రుడు మరియు యముడు ఇత్యాది దేవతల నుద్దేశించి కార్యసిద్ధికై తర్పణాలను ఇయ్యాలి. తర్వాత బ్రహ్మార్పణం, ఆచమనం చేయాలి. విద్వాంసుడు తీర్థానికి దక్షిణంగా పవిత్రమైన స్థలంలో స్థిరాసనంలో నిశ్చలమనస్కుడై

సర్వదేవతా నమస్కారం చేసి ముందుగా ఓంకారాన్ని తరువాత గాయత్రిని జపించాలి. ఓంకారాన్ని జపించేటప్పుడు జీవబ్రహ్మైక్యాను సంధానం విధిగా చెయ్యాలి.

**శ్లో॥ త్రైలోక్య సృష్టి కర్తారం – స్థితి కర్తార మచ్యుతమ్ ॥**
**సంహర్తారం తథా రుద్రం – స్వప్రకాశ ముపాస్మహే ॥**
**జ్ఞాన కర్మేంద్రియాణాం– మనోవృత్తీర్ధియస్తథా ॥**
**భోగ మోక్ష ప్రదే ధర్మే – జ్ఞానేచప్రేరయే త్సదా ॥**

"ముల్లోకాలను సృష్టించిన బ్రహ్మను, స్థితికర్త ఐన అచ్యుతుని, సంహారకర్త ఐన రుద్రుని ఆత్మ ప్రకాశరూపంగా ఉపాసిస్తున్నాను. ఓంకారం మాయొక్క జ్ఞానేంద్రియాలను, కర్మేంద్రియాలను, మనోవృత్తులను, ధీవృత్తులను ఎల్లప్పుడు భోగమోక్షముల నిచ్చు ధర్మము నందు మరియు జ్ఞానము నందు ప్రేరేపించు గాక!" ఈ విధంగా ఓంకారార్థాన్ని బుద్ధితో ధ్యానించు వాడు నిశ్చయంగా పరబ్రహ్మమే అవుతున్నాడు. ఈ అర్థం తెలియక పోయినా కేవలం బ్రాహ్మణత్వాన్ని నిలపెట్టటం కొరకైనా ఓంకారాన్ని జపించాలి.

మూలాధారం మొదలు సహస్రారం వరకు ఆరుచక్రాల లోను విద్యేశ్వర, బ్రహ్మ, విష్ణు, ఈశ, జీవాత్మ, పరమాత్మలను ధ్యానించాలి. "సో–హం (అది నేనే)" అనే పరబ్రహ్మ బుద్ధితో ఆ దేవతలతో ఐక్యభావన చేస్తూ గాయత్రిని జపించాలి. ఆ దేవతలను బ్రహ్మరంధ్రము నందు, దేహానికి బయట కూడా భావన చేయాలి. అనంతకోటి ఉపాధులతో కూడిన ఈ సృష్టి మహత్తత్త్వం నుండి వ్యక్తమైంది. ఒక్కొక్క గాయత్రీ జపంచే ఒకొక్క శరీరాన్ని అతిక్రమించి జీవుణ్ణి పరమాత్మ యందు లీనం చెయ్యాలి. ఇదే జపతత్త్వం . ఈ విధంగా జపం చేసి సూర్యునికి అభిముఖంగా ఉపస్థానం చెప్పాలి. పన్నెండులక్షల గాయత్రిని జపించినవాడు పూర్ణ బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడు ఈ విధంగా డెబ్బైఏండ్ల వరకు నియమ పాలనతో జీవించి ఆపై సన్న్యసించాలి. సన్న్యాసి ఉదయం పన్నెండువేలు ఓంకారజపం చెయ్యాలి.

కోరికలు కలవాడు తత్ప్రాప్తికై వేదోక్త కర్మలను ఆచరించాలి. దానికోసం ధనసంపాదన చెయ్యాలి. కామనలు లేనివానికి ధనంతో పనిలేదు. బ్రాహ్మణుడెల్లవేళలా ముముక్షువై సర్వదా బ్రహ్మజ్ఞానాన్ని అభ్యసించాలి. ధర్మాచరణ వల్ల ధనం, ధనం వలన భోగాలు లభిస్తాయి. ధార్మికంగా సంపాదించిన ధనంతో లభించిన భోగం చివరకు వైరాగ్యానికి హేతువవుతుంది. అధర్మార్జిత ధనంతో అనుభవించిన భోగాలు రాగానికి, రోగానికి, హేతువులవుతాయి. ద్రవ్యధర్మం దేహధర్మం అని ధర్మం రెండు విధాలు. యజ్ఞాదులు

ద్రవ్య ధర్మాలు. తీర్థస్నానమిత్యాదులు దేహ ధర్మాలు. ధనంవల్ల ధనం పుడుతుంది. తపస్సువల్ల దివ్యరూపం వస్తుంది. నిష్కామ ధర్మాచరణవల్ల అంతఃకరణ శుద్ధి, దాని వలన జ్ఞానం కలిగితీరుతుందనటంలో సంశయంలేదు.

కృతయుగంలో తపస్సు, కలియుగంలో ద్రవ్యధర్మం (దానం) ప్రశస్తమైనవి. కృత యుగంలో ధ్యానం, త్రేతలో తపస్సు, ద్వాపరంలో యజ్ఞానుష్ఠానం, కలిలో మూర్తి పూజ వీటి వలన జ్ఞానం కలుగుతుంది. పుణ్య – పాపాలను బట్టి సుఖదుఃఖాలు ఉంటాయి. అధర్మం హింస రూపంలోను, ధర్మం సుఖరూపంలోను ఉంటుంది. దుష్ప్రవర్తన వలన దుఃఖం, సత్ప్రవర్తన వలన సుఖం కలుగుతుంది. కనుక భోగ మోక్ష సిద్ధికై ధర్మాచరణ చెయ్యాలి. కలిలో దానం గొప్పది. విద్య, శీలము, వృత్తము (నడవడిక) కలవానికి దానం చేయాలి. దానం చెయ్యలేని వాడు తపస్సును ఆర్జించాలి. తపస్సు వలన అక్షయ సుఖప్రాప్తి లభిస్తుంది. అదీ చెయ్యలేని వానికి తీర్థ సేవనం ఉత్తమం.

మనుష్యులందరు విధివిహితమైన కర్మలను ఆచరిస్తూ దైన్యానికి తావీయకుండా (తిండికి బట్టకు లోటురాకుండ) అధిక శ్రమకు లోను కాకుండా ధనార్జన జరపాలి. మానవునకు సత్పురుషుల సాంగత్యం ముఖ్యం. దాహానికి నీరు, ఆకలికి అన్నం ఇవి ఉత్తమమైన దానాలు. మానవుడు తన వద్దనున్న ధనాన్ని ధర్మ వృద్ధి, భోగ భాగాలుగా ఏర్పాటు చేసికొని ; ధర్మభాగంతో నిత్య, నైమిత్తిక, కామ్యకర్మలను చెయ్యాలి. వృద్ధి భాగంతో ధనాన్ని వృద్ధి చేసికొని, భోగభాగంతో హితము, మితము ఐన భోగాన్ని అనుభవించాలి. వ్యవసాయార్జిత విత్తంలో పదవ వంతును, వ్యాపారార్జిత విత్తంలో ఆరవ భాగాన్ని దాన ధర్మాలకు ఖర్చుపెట్టాలి.

బ్రాహ్మణుడు తాను పొందిన ప్రతిగ్రహంలో నాల్గవ వంతును, అకస్మాతుగా లభించిన ధనంలో సగాన్ని దానం చెయ్యాలి. అపవిత్రమైన దానాన్ని పట్టరాదు. పాపిష్టిసొమ్ము అని తెలిస్తే సముద్రంలో పడెయ్యాలి. వివేకి అయిన వాడు తనకు తెలిసిన పరుల దోషాలను ప్రకటించ రాదు. ఇతరుల మనసును నొప్పింప రాదు. ఎదుటి వారికి కోపం కలిగేటట్లు మాట్లాడ రాదు. బ్రాహ్మణునకు అగ్న్యారాధన ముఖ్యం. అది చెయ్యలేని వాడు జపాన్ని, అదీ చెయ్యలేని వాడు సూర్య నమస్కారాన్నైనా చెయ్యాలి. ఏనాడూ చల్లారని అగ్నిని అజస్రం అంటారు. బ్రహ్మయజ్ఞ దేవపూజా నిరతులు, అగ్నిపూజా పరాయణులు, గురుపూజారతులు బ్రాహ్మణులను సత్కరించిన వారు వీరంతా స్వర్గంలో భాగస్వామ్యులవుతారు.”

**మూడు యజ్ఞములు – ఏడు వారాలు**

సూతుణ్ణి ఋషులిలా ప్రశ్నించారు. "సూతమునీ! అగ్నియజ్ఞ, దేవయజ్ఞ, బ్రహ్మ యజ్ఞములను గూర్చి, గురుపూజ, బ్రహ్మ తృప్తిని గూర్చి మాకు క్రమంగా చెప్పండి.

*సూతుడిలా చెప్ప సాగాడు:*

"ఓ మునులారా! అగ్ని యందు హోమ ద్రవ్యాన్ని సమర్పించే కర్మకు అగ్ని యజ్ఞమని పేరు. బ్రహ్మచర్యాశ్రమంలో ఉన్నవారు అగ్ని యందు సమిధలను మాత్రమే హోమం చేయాలి. బ్రహ్మచర్యవ్రత నియమాలను పాటించాలి. గృహస్థాశ్రమ స్వీకారంచేసి ఔపాసనకర్మను ప్రారంభించేవరకు అలాగే చెయ్యాలి. హితకరము, పవిత్రము ఐన ఆహారాన్ని మితంగా భుజించుటే వానప్రస్థులకు, యతులకు అగ్ని యజ్ఞమవుతుంది. వారికి వేరే అగ్నిహోత్రం లేదు. ఆత్మయందు సమారోపితమైన అగ్నిహోత్రం గలవారు వారు. ఔపాసనాగ్నిని స్థాపించిన నాటినుండి దానిని ఒకభాండంలో గాని, గర్తంలో గాని ఆరిపోకుండా రక్షించాలి. దానిని 'అజస్రం' అంటారు.

రాజభయం వల్లగాని, లేదా దైవం అనుకూలించక పోవటంవల్ల గాని అగ్నిని సంరక్షించుకోలేని స్థితిలో బ్రాహ్మణుడు ఆత్మయందు లేక అరణియందు ఆ అగ్నిని న్యాసం చెయ్యాలి. దానికి 'సమారోపిత' మనిపేరు. ఉదయకాలంలో అగ్నియందీయ బడిన ఆహుతి ఆయుర్వృద్ధిని, సాయంకాల ఆహుతి సంపత్తిని కలిగిస్తుంది. పగలు అగ్ని సూర్యుని యందు ఉంచబడుతుంది కనుక ఈ ఆహుతులకు 'అగ్నియజ్ఞము' అని పేరు. స్థాలీపాకాది కృతువులలో ఇంద్రాది దేవతల నుద్దేశించి అగ్నిలో చేసే హోమానికి 'దేవయజ్ఞము' అని పేరు. చూడాకరణాది (పుట్టు వెంట్రుకలు తీయటం) కర్మలలో లౌకికాగ్ని యందు చేయబడే హోమం కుడా దేవయజ్ఞమే.

దేవతల తృప్తికొరకు బ్రాహ్మణుడు నిత్యము బ్రహ్మయజ్ఞం చేయాలి. వేదాధ్యయనానికి బ్రహ్మయజ్ఞమని పేరు. ఉదయం నిత్యకర్మను ఆచరించి ఆపై సాయంకాలం వరకు వేదపఠనం చెయ్యాలి. ఇక సాయంకాలానంతరం వేద పఠనానికి విధి లేదు. ఇక అగ్ని లేకుండా చేసే దేవయజనాన్ని వినిపిస్తాను. శ్రద్ధగా వినండి.

సృష్ట్యాది యందు సర్వజ్ఞుడు, కరుణాకరుడు ఐన మహాదేవుడు లోకోపకారార్థమై "వారము" లను కల్పించాడు. సంసారమనే రోగానికి వైద్యుడైన శివుడు ముందుగా ఆరోగ్యాన్నిచ్చే తన వారాన్ని కల్పించాడు. ఆపై సంపత్కరమైన తన మాయ యొక్క వారాన్ని, ఆ తర్వాత

జనన సమయంలో కష్టాలను దాటే నిమిత్తం కుమార వారాన్ని, ఆ వెనుక మానవుల రక్షణ కొరకు రక్షకుడైన విష్ణువు యొక్క వారాన్ని, ఆ మీద ప్రాణుల ఆయుర్దాయాన్ని నిర్ణయించే పరమేష్ఠి ఐన బ్రహ్మ యొక్క ఆయుర్వృద్ధికరమైన వారాన్ని కల్పించాడు. తరువాత పుణ్య పాపాలను నిర్ణయించి ఫలితాలనిచ్చే ఇంద్ర, యములకు వారాలను కల్పించాడు. ఈ రెండు వారాలు భోగ ప్రదము, మృత్యుహరము ఐన శుభకరమైన వారాలు.

మానవులకు సుఖదుఃఖ సూచకాలైన ఆదిత్యాది గ్రహాలను వారాలకు ప్రభువులను చేసి జ్యోతిశ్చక్రంలో పరమేశ్వరుడు ప్రతిష్ఠించాడు. ఆదిత్యుడు మొదలుగా ఆయా దేవతల వారాలలో వారిని పూజించుట వలన వరుసగా ఆరోగ్యం, సంపదలు, వ్యాధి నాశము, పుష్టి, ఆయుర్దాయం, భోగం, అమృతత్వం అనే ఫలాలు కలుగుతాయి. ఆయా దేవతలు సంతోషిస్తే ఆయా వారఫలాలు కలుగుతాయి. ఎవరిని పూజించినా ఫలాన్ని ఇచ్చేవాడు శివుడు మాత్రమే. దేవతాప్రీత్యర్థం పూజ ఐదువిధాలుగా కల్పింపబడింది. అవి మంత్రజపం, హోమం, దానం, తపస్సు, మరియు సమారాధన అనేవి. సమారాధన అంటే వేదిని, ప్రతిమను, అగ్నిని, బ్రాహ్మణుని ఉపచారాలతో పూజించాలి.

నేత్రరోగం, శిరోరోగం, కుష్ఠ ఇత్యాది చర్మరోగ నివారణార్థమై ఆదివారంనాడు సూర్యుని పూజించి బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. అలాగే, సోమవారం నాడు సంపదకొరకు లక్ష్మిని, మంగళవారం నాడు రోగ నివాణార్థం కాళిని, బుధవారం నాడు కుటుంబంలోని వారందరి ఆరోగ్యం, క్షేమం కొరకు విష్ణువును, గురువారంనాడు ఆయువును, ఆరోగ్యాన్నికోరి దేవతలను, శుక్రవారంనాడు భోగముల నిమిత్తం దేవతలను పూజించి వేదవిదులగు బ్రాహ్మణులకు అన్నం పెట్టి దక్షిణలతో సత్కరించాలి. శనివారంనాడు రుద్రాది దేవతలను ఆరాధిస్తే అపమృత్యువు నుండి తప్పించు కొంటాడు. దేవతారాధన నిత్యం చెయ్యాలి. గృహస్థుడు తన గృహంలో శుభకర్మలకు ఆదియందు, అశుభ కర్మలకు అంతమునందు, జన్మతిథినాడు శుభాలనుకోరి ఆదిత్యాది గ్రహాలను ఆరాధించాలి. బ్రాహ్మణులు మంత్రయుక్తంగాను ఇతరులు తంత్రోక్తంగాను దేవయజ్ఞాన్ని చెయ్యాలి.

పేదవాడు తపస్సుతోను, ధనవంతుడు ధనంతోను దేవపూజ చేస్తే అది ఇహపర సాధక మవుతుంది. నీడనిచ్చే చెట్లను పాతుట, చెరువులు త్రవ్వించుట, దేవాలయ, వేదపాఠశాలలను స్థాపించుట ఇత్యాది ధర్మకార్యాలను ధనవంతుడు చేస్తే అనేక భోగ భాగ్యాలను పొంది జ్ఞాన సిద్ధిని కూడా పొందుతాడు.”

**దానము - దేశ, కాల పాత్రలు**

సూతుణ్ణి ఋషులు దేశ, కాల, పాత్రల గురించి దాన విశేషాన్ని గురించి చెప్పమని కోరగా...

*సూతుడిలా అంటున్నాడు:*

"ఋషులారా! దేవయజ్ఞాది కర్మల యందు శుద్ధ గృహం సమఫలాన్ని ఇస్తుంది. ఆపైన గోశాల, జలాశయ తీరం, మారేడు తులసి రావి చెట్ల మూలం, దేవాలయం, తీర్థం, నదీతీరం సప్తగంగా తీరాలు... ఇవన్నీ క్రమంగా ఒకదాని కంటె మరొకటి పదిరెట్లు ఫలాన్నిస్తాయి. గంగ, గోదావరి, కావేరి, తామ్రపర్ణి, సింధు, సరయూ, రేవా నదులకు సప్తగంగలని పేరు. వీటి కంటె సముద్ర తీరం దాని కంటె పర్వత శిఖరం శ్రేష్టమైనవి. మనస్సుకు నచ్చిన స్థలం అన్నింటికంటె గొప్పది. యజ్ఞదానాది కర్మలకు కృతయుగంలో సంపూర్ణ ఫలం, త్రేతలో మూడు వంతులు, ద్వాపరంలో సగం, కలిలో నాల్గవ వంతు, కలిలో సగం పూర్తయ్యాక నాల్గవ వంతు కంటె తక్కువ ఫలం లభిస్తుంది.

పవిత్రమైన అంతఃకరణతో పవిత్ర దినాన పుణ్యకర్మను ఆచరిస్తే సమఫలం లభిస్తుంది. రవిసంక్రమణం నాడు, విషువత్తుల యందు, దక్షిణాయన ప్రారంభంలోను, మకర సంక్రాంతినాడు, చంద్రగ్రహణం నాడు, సూర్యగ్రహణ కాలమందు ఆచరించిన పుణ్యకర్మలకు క్రమంగా ఒకదాని కంటె మరొక దానికి పదిరెట్లు ఫలం అధికం. జన్మ నక్షత్రం వచ్చిన దినం, వ్రతసమాప్తి ఐనదినం ఇవి.... సూర్యగ్రహణ కాలంతో సమమైనవి. మహాపురుష సంగమం కోటి సూర్యగ్రహణాలతో సమానమైనది. తపోనిష్ఠులు, జ్ఞాననిష్ఠులు, యోగులు మరియు యతులు పూజార్హులు. వీరు పాపక్షయ కారకులు. గాయత్రిని ఇరవై నాలుగు లక్షలు జపంచేసిన బ్రాహ్మణుడు సంపూర్ణ భోగభాగ్యాలనిచ్చే పాత్ర అని చెప్పబడుతున్నాడు. మానవుడు పతనం కాకుండా రక్షించే శాస్త్రానికి పాత్రము అని పేరు. మరియు దాతను పాతకముల నుండి రక్షించేవాడు కనుక యోగ్యుడైన ప్రతిగ్రహీత పాత్రము అనబడుతున్నాడు. గానం చేయు వానిని రక్షిస్తుంది కనుక గాయత్రి అని పేరు. లోకంలో ధనంలేని వాడు ఇతరులకు ధనాన్ని దానం చెయ్యలేడు గదా! అలాగే స్వయంశుద్ధుడు కానివాడు ఇతరులను రక్షించ లేడు. గాయత్రీమంత్ర శుద్ధుడు శుద్ధ బ్రాహ్మణుడనబడుతున్నాడు. అలాటి బ్రాహ్మణుడు జప, హోమ, పూజాది సర్వకర్మల యందు దానం చెయ్యటానికి, స్వీకరించటానికి అర్హుడు. ఆకలితో బాధపడుతున్న వారెవరైనా అన్నదానానికి అర్హులే.

మనో నిగ్రహం గల శ్రేష్ఠుడైన బ్రాహ్మణుని చెంత గాయత్రిని మంత్రార్థ పూర్వకంగా సంపూర్ణంగా గాని లేదా కేవల మంత్రాన్ని గాని తెలుసుకొంటే అభీష్టాలన్నీ నెరవేరుతాయి.

అడిగితే ఇచ్చేదానం కంటె అడక్కుండా ఇచ్చేదానం గొప్పది. జాతిమాత్ర బ్రాహ్మణుడై దీనంగా జీవిస్తున్నవాడు, వేదవేత్త ఐన విప్రుడు, గాయత్రీ జపయుక్తుడు, విష్ణుభక్తుడైన విప్రుడు, శివ భక్తుడైన భూసురుడు. వీరందరు దానాన్ని గ్రహించటానికి ఉత్తమమైన వారు.

అన్నదానానికి పది అంగములున్నాయి. 1) ఆదరం 2) ఆహ్వానం 3) అభ్యంగనం 4) పాదసేవ 5) వస్త్రం 6) గంధాదులతో పూజ 7) అప్పములు, పచ్చళ్ళతోకూడిన షడ్రసోపేతమైన భోజనం 8) తాంబూలం 9) దక్షిణ 10) నమస్కారం. ఇలాటి పది అంగాలతో కూడిన యోగ్యమైన అన్నాన్ని అహింసావ్రతుడు, గాయత్రీ మంత్రానుష్ఠాన తత్పరుడు, వేదవేత్త, గుణశీలయుతుడు ఐన బ్రాహ్మణునకు ఆదివారం నాడు పెడితే ఆ దాత వంద సంవత్సరాలు ఆరోగ్యంతో జీవిస్తాడు. అన్నిటా అర్హుడైన బ్రాహ్మణుడు దొరికితే మాత్రం సత్కరించకుండా పంపించ కూడదు.

విద్యనుగోరు మానవులు బాలురయందు బ్రహ్మభావన చేసి అన్నదానం చెయ్యాలి. పుత్రార్థి ఐనవాడు యువకులయందు విష్ణుబుద్ధితో దానం చెయ్యాలి. జ్ఞానార్థి ఐనవాడు వృద్ధులయందు రుద్రబుద్ధితో దానం చెయ్యాలి. సద్బుద్ధిని కోరు మానవులు కన్యలయందు సరస్వతీ భావనను, భోగాలను కోరువారు యువతుల యందు లక్ష్మీబుద్ధితోను, ఆత్మజ్ఞానాన్ని కోరువారు వృద్ధస్త్రీల యందు పార్వతీ భావనతోను దానాలను చెయ్యాలి.

ఋషులారా! సంపాదనా మార్గాన్ని అనుసరించి ఉత్తమం, మధ్యమం, అధమం అని ధనం మూడు విధాలుగా ఉంటుంది. శుద్ధమైన ద్రవ్యాన్నే దానం చెయ్యాలి. దానివల్ల పూర్ణఫలం వస్తుంది. స్త్రీలకు తండ్రి, భర్త ఇచ్చిన ద్రవ్యం ఉత్తమం. గోవు, భూమి, తిలలు, బంగారం, నేయి, వస్త్రములు, ధాన్యము, బెల్లం, వెండి, లవణం, గుమ్మడికాయ, కన్య ఈ పన్నెండు వస్తువులు దానార్హమైనవి. పనస, మామిడి వంటి పండ్లు, మినుము, కంది, పెసర వంటి పప్పులను, మిరియాలు, ఆవాలు, ధనియాలు ఇలాటి శాకోపకరణాలను, దానం చేయాలి. ఇక విద్వాంసుడు ఇతరుల శ్రోత్రాది ఇంద్రియాలకు ఆనందాన్నిచ్చే శబ్దాది విషయాలను దానం చేస్తే ఇంద్రియాధిష్ఠాన దేవతలు సంతోషిస్తారు.

గురుముఖతః వేద శాస్త్రాధ్యయనం చేసి వాటిద్వారా కర్మలకు తగిన ఫలం కలదనే నిశ్చయ బుద్ధిని కల్గియుండుటే ఆస్తిక్యం. ఇతరుల భయంవల్ల ఆస్తిక్యాన్ని కలిగియున్నట్లు నటించుట అధమం. దరిద్రుడు ఏమి లేనివాడే ఐనా వాచిక, కాయిక యజ్ఞాలను చెయ్యాలి. మంత్రస్తోత్ర పాఠం, జపం ఇత్యాదులు వాచిక యజ్ఞం. తీర్థయాత్ర వ్రతాలను ఆచరించుట

ఇత్యాదులు కాయిక యజ్ఞం. ఏదో ఒక ఉపాయం చేత కొద్దిగానైనా దేవతార్పణ బుద్ధితో కర్మను చెయ్యాలి. తపస్సును, దానాన్ని విడిచి పెట్ట కూడదు. ఈశ్వరార్పణ బుద్ధితో చేసిన దానంగాని, ఏకర్మఐనా సరే మోక్షాన్నిస్తుంది."

**పూజావిధానం –పూజాఫలం**

ఋషులు సూతుణ్ణి ప్రార్థివ ప్రతిమా పూజా విధానాన్ని గూర్చి చెప్ప వలసిందని కోరగా...

*సూతుడిలా అంటున్నాడు:*

"ఋషులారా! మీరు చక్కగా అడిగారు. సర్వకాలాల్లోను, సర్వఫలాలను ఇచ్చి, వెంటనే దుఃఖాన్ని పోగొట్టే పూజావిధిని చెపుతున్నాను వినండి. దీనివల్ల అపమృత్యు దోషం, కాలమృత్యు దోషం రెండూ పోతాయి. భార్యా పుత్ర ధనధాన్యాదులు లభిస్తాయి. మట్టిమొదలైన వాటితో చేసిన ప్రతిమలకు ప్రాణప్రతిష్ఠ చేసి పూజిస్తే సర్వాభీష్టాలు సిద్ధిస్తాయి. స్త్రీ – పురుషు లిర్వురకు ఇందులో అధికారం ఉంది. పరిశుద్ధమైన మట్టిని తీసుకొని, మంచి గంధపు పొడిని కలిపి ప్రతిమను చేసి, మంటపంలో ఉంచి పాలతో సంస్కరించి పద్మాసనాన్ని స్థాపించి శ్రద్ధతో పూజించాలి. షోడషోపచారాలతో పూజించి నైవేద్యం పెట్టాలి. వినాయక, ఆదిత్య, విష్ణు, పార్వతీ పరమేశ్వరులను నిత్యం పూజించాలి.

శివాభిషేకంవల్ల చిత్తశుద్ధి, గంధార్పణవల్ల పుణ్యం, నైవేద్యంవల్ల ఆయుర్దాయం, ధూపం వల్ల ధనం, దీపంవల్ల జ్ఞానం, తాంబూలంవల్ల భోగం... లభిస్తాయి. పూజావిధి ఐన తదుపరి నమస్కార, జపములను మరవరాదు. విఘ్నేశ్వరుని పూజించటంవల్ల ఇహలోకంలో సకలాభీష్టములు నెరవేరుతాయి. శుక్రవారంనాడు శ్రావణ, భాద్రపద మాసాలలో శుక్లపక్ష చవితినాడు, ధనుర్మాసంలో శతభిష నక్షత్రం నాడు తప్పక పూజించాలి. తిథి నక్షత్ర, యోగములకు వారమే (రోజు) ఆధారం. వారానికి పెరుగుదల, తగ్గుదల లేదు కనుక వారం పూర్ణ స్వరూపం. సూర్యోదయం నుండి సూర్యోదయం వరకు వారంగా (రోజుగా) లెక్కించాలి.

తిథియొక్క ఆదియందు దేవపూజ ప్రశస్తం. పూర్ణభోగాలు లభిస్తాయి. రాత్రితో కలిసిన తిథియొక్క పూర్వభాగం పితృ దేవతారాధనకు ఉత్తమం. తిథియొక్క ద్వితీయార్థం పగటితోకూడియుంటే దేవపూజకు శ్రేష్ఠం. తిథి ఉదయం వ్యాపించి మధ్యాహ్నం వరకు ఉంటే ప్రశస్తం. పూజా శబ్దానికి వ్యుత్పత్తి ఏమిటంటే "పూః జాయతే అనేన". అనేన ఈ కర్మచేత పూః పూర్ణమైన భోగాలు జాయతే కలుగుతున్నాయి. నిత్య నైమిత్తిక కర్మలు కాలాంతరమునందు, కామ్యకర్మలు వెంటనే ఫలితాన్నిస్తాయి.

ఋషులారా! త్రిమూర్తులకు, ఇంద్రాది దిక్పాలకులకు, తక్కిన దేవతలకు, దేవజాతులైన స్త్రీ – పురుషులకు, దిగ్గజాలకు పాతాళ లోక వాసులైన మహా నాగాలకు, ధన్వంతరి అశ్విన్యాది దేవతలకు వారివారికి ఇష్టమైన తిథి, వార,నక్షత్ర, పక్ష, మాసము లున్నాయి. వాటిని తెలుసుకొని ఆ సమయంలో వారిని పూజిస్తే కోరిన ఫలాలు వెంటనే లభిస్తాయి. కర్మలను నిష్కామంగా చేస్తే జ్ఞానమే దాని సిద్ధి అవుతుంది.

స్థావర జంగమాత్మకమైన ఈ సర్వజగత్తు బిందునాదాత్మకం. బిందువు శక్తి. శివుడు నాదం. శివశక్తి స్వరూపమే జగత్తు. బిందువునకు నాదం ఆధారం. ఈ జగత్తుకు బిందువు ఆధారం. బిందు–నాదాలు రెండూ జగత్తుకు ఆధారాలు. బిందువు నాదంలో కలియటం సకలీకరణం. దాని నుండే జగత్తు యొక్క ఆవిర్భావం. లింగం బిందునాదాత్మకం... కనుక జగత్కారణం. బిందువు దేవి. శివుడు నాదం. లింగం ఉభయాత్మకం. కనుక జన్మరాహిత్యం కొరకు శివపూజ చెయ్యాలి. బిందు రూపిణియగు దేవి తల్లి. నాదరూపుడగు శివుడు తండ్రి. లోకంలో ప్రత్యక్ష పార్వతీ – పరమేశ్వరు లైన తల్లిదండ్రులను పూజిస్తే వారి ఆశీర్వాదంతో మానవునికి పూర్ణాభ్యుదయం కలుగు తుంది. జగత్తుకు కారణభూతులు పార్వతీ పరమేశ్వరులు కాగా, మన ఆవిర్భావ హేతువులు తల్లి – దండ్రులు. వారిని కాదని ఎక్కడో దేవతలున్నారని అనుకోవటం అవివేకం. కనుక ఋషులారా! లింగ రూపంలో ఉన్న పార్వతీ పరమేశ్వరులను తల్లిదండ్రుల రూపంలోను, తల్లి–దండ్రులను పార్వతీ పరమేశ్వర రూపంగాను ఆరాధిస్తే వారిదయవల్ల ఐశ్వర్యం, అభ్యుదయం కలుగుతాయి.

మునులారా! వేదంయొక్క అంతరంగాన్ని. అతి రహస్యమైన దానిని విప్పి చెపుతున్నాను వినండి. 'భర్గుడు' పురుషుడు 'భర్గ' ప్రకృతి వ్యక్తంకాని అంతరధిష్ఠానంగల గర్భమే పురుషుడు అని చెప్పబడు తున్నాడు. లెస్సగా వ్యక్తమయ్యే అంతరదిష్ఠానంగల గర్భం ప్రకృతి. అందువల్ల మొదటి గర్భం పురుషుడే. ఈ జగత్తుకు పురుషుడు తండ్రి కనుక 'గర్భవాన్' అని పిలువ బడుతున్నాడు. పురుష – ప్రకృతుల కలయిక మొదటి జన్మ అని, ప్రకృతి నుండి జగత్తు వ్యక్తమగుట రెండవ జన్మ అని గ్రహించండి. జీవుడు తన జనన మరణాలను, తిరిగి పునర్జన్మను పురుషుని నుండే పొందుతున్నాడు.

మాయా ప్రభావం చేత మరో రూపంలో వ్యక్తమవటమే జన్మ. జన్మించినది మొదలుగా జీర్ణమయ్యే (నశించే) స్వభావం కలవాడు కనుక జీవుడు. "పుట్టింది మొదలు పాశములచే బంధింప బడినవాడు" – అని జీవ శబ్దానికి మరో అర్థం. ఈ జన్మపాశ

నివృత్తికై మాతాపితృ రూపమైన శివలింగాన్ని (జన్మ లింగాన్ని) అర్చించాలి. భం గచ్ఛతీతి భగః. భం = వృద్ధిని గచ్ఛతి ఇతి =పొందునది కనుక 'భగము' అని ప్రకృతికి పేరు. ప్రకృతినుండి ఈ సృష్టి ఇలా వృద్ధి పొందుతూనే ఉంటుంది. పంచభూతాత్మకం ప్రకృతి. ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి...ఇవి పంచభూతాలు. పంచ భూతాల నుండి పుట్టినవే పంచ జ్ఞానేంద్రియాలు. చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు... ఇవి జ్ఞానేంద్రియాలు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు వాటి గుణాలు. ఈ గుణాలను (భోగాలను) ఇంద్రియాలు అనుభవిస్తూ ఉంటాయి. భగానికి (ప్రకృతికి) సంబంధించింది కనుక భోగం. ప్రకృతికి ఆధారభూతుడు పరమాత్మ కనుక... ప్రకృతి జన్యమైన ఇంద్రియాల ద్వారా మనం అనుభవిస్తున్న భోగాలన్నిటికి ఆధారభూతుడు అనగా ఇచ్చేవాడు పరమాత్మ ఐన శివుడే!.

భగము అనగా ప్రకృతికి స్వామియైన భగవానుని ఋషులు 'భర్గుడు' అని పిలుస్తారు. పురుష – ప్రకృతులు రెండూ ... అవిభాజ్య తత్త్వం. లోకాలను ప్రకాశింప చేసే సూర్యుడు ప్రత్యక్ష భగవానుడు. లోకంలో తల్లి బిడ్డకు జన్మనిచ్చినా గర్భకారకుడు తండ్రి. అలాగే ప్రసవ ధర్మంగల ప్రకృతి యందు ఈ జగత్తును సృష్టించే వాడు లింగరూపుడైన శివుడు. లింగం అంటే గుర్తు లేక చిహ్నం. పురుషశబ్ద వాచ్యుడైన పరమాత్మకు చిహ్నమే లింగం.

ఆదివారం నాడు మహాలింగాన్ని పంచగవ్యాలతో ఓం కారంతో అభిషేకించాలి. గోమయం, గోజలం, గోక్షీరం, పెరుగు, నెయ్యి ఇవి పంచగవ్యాలు. ఓం కారానికి ధ్వని లింగమని, స్వయంభు లింగానికి నాదలింగమని, యంత్రానికి బిందులింగమని, ప్రతిష్ఠిత లింగానికి మకార లింగమని, ఉత్సవ మూర్తులకు ఉకార లింగమని గురువు యొక్క శరీరానికి అకార లింగమని పేర్లు. శివభక్తి కలగటానికి సులువైన ఉపాయం చెపుతాను వినండి. మానవుడు రుద్రాక్షధారణ వలన నాల్గవ వంతు భక్తిని, విభూతి ధారణ వలన అర్ధభాగాన్ని, మంత్రజపం వల్ల మూడు వంతుల భక్తిని, పూజిస్తే పూర్ణ భక్తిని పొందుతాడు. పూర్ణ భక్తి కుదిరితే జన్మ రాహిత్యమే దాని ఫలం".

**ప్రణవ పంచాక్షరీ మంత్ర మహిమ – శివలోక వైభవం**

సూతుణ్ణి మహర్షులు ఓంకార మహిమను, ఆరు లింగముల మహిమను, శివభక్తుని పూజించే క్రమాన్ని వివరించ వలసిందిగా కోరగా సూతుడిలా అంటున్నాడు.

"మహర్షులారా! శివుని కృపతో మీకు సమాధానం చెపుతున్నాను వినండి! అందరి రక్షణ భారాన్ని ఆయన స్వీకరించు గాక! ప్రకృతి నుండి పుట్టిన సంసార మహా సముద్రానికి

'ప్రః' అని పేరు. దానిని దాటించే నావ కనుక ఓంకారానికి (ప్ర+నవ) ప్రణవం అని పేరు. ప్రః = ప్రపంచం, న = లేదు, వః= మీకు ఈ అర్థాన్ని బట్టి కూడా ఓంకారానికి ప్రణవమనే పేరొచ్చింది. ప్రః = నిశ్చయంగా, న = (మోక్షమునకు) నడిపించును, వః = మిమ్ములను అనే అర్థంలో కూడా ప్రణవ శబ్దం సిద్ధించింది. మాయాతీతుడు, శుద్ధ చైతన్య స్వరూపుడు ఐన పరమాత్మకు నూతనుడు అనిపేరు. సాధకుడైన వానిని నూతనునిగా చేస్తుంది. కనుక ఓంకారానికి ప్రణవమని పేరు. ప్రణవం స్థూల సూక్ష్మ భేదం చేత రెండు రకాలుగా ఉంది. 'ఓం' అనే ఏకాక్షరానికి సూక్ష్మప్రణవమని పంచాక్షరికి స్థూల ప్రణవమని పేర్లు. సూక్ష్మ ప్రణవంలో అవ్యక్తంగా ఉన్న పంచవర్ణాలు స్థూల ప్రణవంలో సువ్యక్తమయ్యాయి. జీవన్ముక్తుడైన జ్ఞాని సర్వమంత్ర సారమైన సూక్ష్మ ప్రణవాన్ని, ప్రణవ ప్రతిపాద్యమైన పరమాత్మను ధ్యానిస్తూ, దేహ పతన పర్యంతం జపించాలి. అట్టి జ్ఞాని శివునిలో లయమవుతాడు.

అర్థాను సంధానం లేకుండా కేవల మంత్ర జపాన్ని చేసిన వ్యక్తి యోగి అవుతాడు. సూక్ష్మ ప్రణవం తిరిగి హ్రస్వం, దీర్ఘం అని రెండు విధాలు. అకారం, ఉకారం, మకారం, బిందువు,నాదం, శబ్దం, కాలం, కళ... వీటితో కూడినది దీర్ఘ ప్రణవం. ఇది హృదయంలో మాత్రమే ఉంటుంది. అకార, ఉకార, మకారాలతో కూడిన ప్రణవం...హ్రస్వ ప్రణవం. అకారం శివుడు, ఉకారం శక్తి, మకారం శివశక్తుల ఐక్యం. సర్వపాప క్షయాన్ని కోరే సాధకుడు ఈ దృష్టితో హ్రస్వ ప్రణవాన్ని జపించాలి.

ఇక ప్రవృత్తులు అంటే...రక్తి మార్గమైన కర్మమార్గంలో (సంసారంలో) ఉన్నవారు హ్రస్వ ప్రణవాన్ని మాత్రమే జపించాలి. విరక్తి ... అంటే జ్ఞాన మార్గంలో ఉన్న నివృత్తులు దీర్ఘ ప్రణవాన్ని జపించాలి.వేద పఠనానికి ఆదిలోను, ఉభయ సంధ్యల యందు చేసే సంధ్యా వందనంలోను ఓంకారం చేయాలి. తొమ్మిదికోట్ల ఓంకారాన్ని జపించిన పురుషుడు ముందు పరిశుద్ధుడవుతాడు. ఆపై పృథ్వీతత్త్వం మొదలుగా ఆకాశ తత్త్వం వరకు నలభై ఐదుకోట్ల ఓంకారాన్ని జపించాలి. ఈ విధంగానే ఆ పంచేంద్రియ గుణాలైన గంధాదులు మొదలు శ్రవణం వరకు నలభై ఐదు కోట్లు ఓంకారాన్ని జపిస్తే వాటిని జయిస్తాడు. ఇంకొక్క తొమ్మిది కోట్లు జపిస్తే అహంకార తత్త్వాన్ని జయిస్తాడు. మునులారా! ఆపైన ఆత్మసాక్షాత్కార పర్యంతము జపాన్ని కొన సాగించాలి. ఈ విధంగా నూట ఎనిమిది కోట్ల ఓంకారాన్ని జపించిన వ్యక్తి జ్ఞానియై శుద్ధ యోగాన్ని పొంది జీవన్ముక్తుడవుతాడు. మంత్రము

యొక్క ఋషి, చంధస్సు, దేవత ఇత్యాదులను స్మరించి అంగన్యాస, కరన్యాసాలతో జపం చెయ్యాలి. అకారాది హకార పర్యంతము ఆ వర్ణాలతో కూడిన ప్రణవాన్ని తన దేహంలో న్యాసం చేసిన వ్యక్తి ఋషి అవుతాడు.

క్రియాయోగి, తపోయోగి, జపయోగి అని శివ యోగులు మూడు విధాలుగా ఉన్నారు. సంపదను వినియోగించి శివపూజ చేస్తూ సాష్టాంగ నమస్కారాది క్రియాతత్పరుడగు భక్తుడు క్రియాయోగి. మితాహారుడై, బాహ్యేంద్రియాలను జయించి పూజాతత్పరుడై ద్రోహచింత లేనివాడు తపోయోగి. ఈ గుణాలనే కలిగియుండి కామక్రోధాదులను జయించి, శాంత మనస్కుడై సర్వకాలముల యందు జపం చేయు భక్తుడు జపయోగి. ఇలాంటి వారిని పూజించాలి.

ఇప్పుడు జపయోగాన్ని గూర్చి చెపుతాను. తపస్సు చేసుకోవాలనే వారి కొరకు జపం విధించ బడింది. జపం జన్మబంధాన్ని తుడిచి వేస్తుంది. ముందుగా 'నమః' ఉచ్చరించి తర్వాత చతుర్థీవిభక్తిలో శివనామాన్ని చేర్చగా 'నమశ్శివాయ' అను పంచాక్షరి మంత్రం ఏర్పడింది. ఓంకారంతో కలిపి దీనిని జపించాలి. శుక్ల పక్షంలో ప్రారంభించి కృష్ణపక్షాంతం వరకు జపించాలి. మాఘ, భాద్రపద మాసాలు జపానికి ఉత్తమోత్తమ మైనవి. సాధకుడు జపసమయంలో ఒక పూట మాత్రమే భుజించాలి. మితభాషియై, శమదమాదులను కలిగి ఉండాలి. మాతృదేశ సేవ, మాతాపితృ సేవ విడువరాదు. శివుని ఇలా ధ్యానించాలి.

**శ్లో॥ పద్మాసనస్థం శివదం – గంగా చంద్ర కలాన్వితమ్ ॥**
**వామోరు స్థితశక్త్యాచ – విరాజంతం మహాగణైః ॥**
**మృగటంక ధరం దేవం – వరదాభయ పాణికమ్ ॥**
**సదానుగ్రహ కర్తారం – సదాశివ మనుస్మరన్ ॥**

పద్మాసనస్థుడు, శుభాల నిచ్చే వాడు, గంగతో చంద్ర కళతో కూడిన వాడు, వామాంకమందు శక్తితో కూడిన వాడు, ప్రమథగణ పరివేష్టితుడు, మృగధరుడు, త్రిశూలధరుడు, హస్తముల యందు వరద – అభయ ముద్రలను ధరించిన అనుగ్రహ స్వరూపుడు ఐన సదాశివుని స్మరిస్తున్నాను.

సాధకుడెప్పుడూ హృదయంలో గాని, సూర్య మండలమందు గాని శివుని భావన చేసి మానసిక పూజ చేసి తూర్పుముఖంగా కూర్చొని పంచాక్షరిని జపించాలి. ఆపై (జపం పూర్తియైన రోజు) కృష్ణ పక్ష చతుర్థశి నాడు పన్నెండు వేల పంచాక్షరిని జపించి శివభక్తులైన

బ్రాహ్మణ శ్రేష్ఠులను (భార్యలతో కూడియున్న వారిని) వరించి వారియందు ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాత రూపాలను భావన చేసి పూజించాలి. అట్టి శివభక్తుడు కల్పాంతం వరకు శివలోకంలో ఉంటాడు.

మునులారా! ఈ సృష్టి అనంతం. ఇదంతా శివ స్వరూపం. ఇందులో అనంత కోటి శివ లోకాలున్నాయి. వాటిని వర్ణించటం దుర్ఘటం. శివుడు సర్వోత్కృష్టుడు అని తెలుసుకోవటమే శివలోక మహిమానువర్ణన శ్రవణ ఫలం. కనుక శివభక్తిని కలిగి ఉంటే చాలు నరుడు ముక్తుడౌతాడు."

**శివలింగ మహిమ**

ఇంత వరకు శ్రద్ధతో విన్న ఋషులు బంధ – మోక్ష స్వరూపాన్ని వివరంగా చెప్ప వలసిందని కోరగా సూతుడిలా అంటున్నాడు.

'ఓ మునులారా! వినండి. ప్రకృతి, సమష్టి బుద్ధి, సత్వ, రజః తమోగుణాలతో కూడిన అహంకారం, ఐదు తన్మాత్రలు (పంచభూతాల యొక్క సూక్ష్మ రూపం) ఈ ఎనిమిది తత్త్వాలకు ప్రకృత్యాద్యష్టక మని పేరు. ఈ ఎనిమిదింటిచే బంధింప బడిన జీవుడు బద్ధుడు. వాటి నుండి విడుదల పొందిన వాడు ముక్తుడు. దేహం ఈ అష్ట ప్రకృతులచే ఏర్పడింది. దేహం వలన కర్మ, తిరిగి కర్మనుండి దేహం జనిస్తాయి. ఇదీ జన్మ–కర్మల సంబంధం.

స్థూల, సూక్ష్మ, కారణ భేదం చేత శరీరం మూడు విధాలు. స్థూల శరీరం కర్మలను చేస్తుంది. సూక్ష్మ శరీరం ఇంద్రియ భోగాలను, కారణ శరీరం ఆత్మానందాన్ని పొందుతూ ఉంటాయి. పుణ్య, పాప రూపమైన కర్మలు సుఖ దుఃఖ రూప ఫలాలను ఇస్తూంటాయి. ఈ విధంగా జీవుడు కర్మపాశ బంధితుడై సంసార చక్రంలో తిరుగాడుతూ ఉంటాడు. ఇందులోంచి బయట పడాలంటే, సృష్టి కర్త అయిన ఈశ్వరుణ్ణి ప్రార్థించాలి. ప్రకృత్యాద్యష్టకమే ఈ మహా చక్రం. శివుడు దాని కంటె పరుడు. బీజం నీటిని పీల్చి, ఉబ్బి అంకురిస్తుంది. అలాగే చక్రకర్త ఐన ఈశ్వరుడు ఈ అష్టకాన్ని వశం చేసికొని సృష్టి చేస్తూంటాడు.

సర్వము ఆయన వశంలో ఉంటుంది కనుక ఆయన శివుడయ్యాడు. సర్వజ్ఞత్వం, పరిపూర్ణత్వం, తృప్తి, అనాది జ్ఞానం, స్వాతంత్ర్యము, అక్షీణ శక్తి, అనంతత్త్వం..... ఇవి ఆయన మానస ఐశ్వర్యాలు. ఇది వేదానికి మాత్రమే తెలుసు. శివానుగ్రహం చేత ప్రకృత్యష్టకం వశమవుతుంది. అనుగ్రహం పూజవల్ల లభిస్తుంది. విస్పృహుడు, పూర్ణుడు ఐన శివుని ఎలా పూజించాలి అంటే... కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చెయ్యాలి. లింగము నందు, మూర్తి యందు, శివభక్తుని యందు శివభావన చేసి మనోవాక్కాయ కర్మలతో ధనంతో

అర్చించాలి. ఇట్టి భక్తునికి సాలోక్యం లభిస్తుంది. అతడు సాంబుని సామీప్యాన్ని పొందుతాడు. సమష్టి బుద్ధి కూడా వశమవుతుంది. శివక్రియ, శివతపస్సు, శివ మంత్రజపం, శివధ్యానం, శివజ్ఞానం... వీటిని బ్రతికి ఉన్నంత వరకు విడువరాదు.

ఇంక లింగాదుల యందు శివపూజా విధానాన్ని చెపుతాను వినండి. సూక్ష్మ ప్రణవం మొదటి లింగం, స్థూల ప్రణవం రెండవ లింగం. పృథ్వీ వికారాలైన లింగాదులను గూర్చి చెవుతాను వినండి. స్వయం భూలింగం. బిందులింగం, ప్రతిష్ఠిత లింగం, చర లింగం, గురు లింగం... ఇలా ఐదున్నాయి. దేవతల, ఋషుల, భక్తుల తపస్సుకు మెచ్చి భూమి లోపల నాద రూపంలో ఉన్న శివుడు. బీజం భూమిని ఛేదించి అంకురించిన తీరున తనంత తానుగా ప్రకటితమైతే అది స్వయంభూ లింగం. బంగారము, వెండి రేకులపైగాని, భూమి, వేదిపై గాని ప్రణవాన్ని లిఖించి అర్చన చేయవచ్చు. బిందు లింగ, నాద లింగాలు స్థిర, చర భేదాలతో ఉంటాయి. దేవతలచే గాని ఋషులచే గాని స్థాపింప బడిన లింగం పౌరుషలింగం లేక ప్రతిష్ఠత లింగం. శిల్పి నిర్మిత లింగం ప్రాకృత లింగం.

నిత్యమైనది పౌరుషం. అనిత్యమైనది ప్రాకృతం. నాభి, జిహ్వ, నాసికాగ్రం, శిఖ... ఈ క్రమంలో కటి, హృదయం, శిరస్సు ఈ మూడు స్థానాలలోను భావన చేయబడిన లింగం, ఆధ్యాత్మిక లింగం మరియు చరలింగం. కటి బ్రహ్మ లోకం. హృదయం విష్ణు లోకం. శిరస్సు శివలోకం. పర్వతం పౌరుష లింగం. భూమి ప్రాకృత లింగం. వృక్షాదులు, విలువైన ధాన్యం, గోధుమలు అణిమాద్యష్ట సిద్ధులు పౌరుషాలు. గుల్మాదులు, తక్కువ రకం ధాన్యాలు, భార్య, ధనం ... ఇవి ప్రాకృతాలు.

చర లింగాలలో రస లింగం శ్రేష్ఠం. బాణ లింగం రాజులకు, బంగారు లింగం వైశ్యులకు, రాతి లింగం కర్షకులకు శ్రేష్టం. స్ఫటికంతో చేసిన బాణ లింగం, అందరికీ పూజనీయం. భర్త గల స్త్రీలకు పార్థివ లింగం, ప్రవృత్తి మార్గంలో ఉన్న భర్తృహీన లైన వారికి స్ఫటిక లింగం శ్రేష్ఠం. నివృత్తి మార్గంలోని వారికి రసలింగం శ్రేష్టం. వయోనిమిత్తం లేకుండా స్త్రీలకు స్ఫటిక లింగం శ్రేష్టం. ప్రవృత్తి మార్గంలో ఉన్న వారు గురువు సహాయంతో పూజించి నైవేద్యం పెట్టాలి. నివృత్తి మార్గంలో ఉన్న వారు అరచేతిలో లింగాన్ని పూజించి భిక్షాన్నాన్ని నైవేద్యం పెట్టాలి. ఈ మార్గంలోనివారికి సూక్ష్మలింగం శ్రేష్టం. నైవేద్య పర్యంతం పూజంతా విభూతి తోనే!

లోకాగ్నిజము, వేదాగ్నిజము, శివాగ్నిజము, అని విభూతి మూడు విధాలు. లౌకికాగ్ని నుండి పుట్టిన భస్మను పాత్ర శుద్ధికి వాడాలి. వైదికాగ్ని యందు పుట్టినది వైదిక భస్మ. ఆ అగ్నిలో 'అఘోరేభ్యః' అను శివమంత్రాన్ని ఉచ్చరించి మారేడు, జమ్మి, రావి, మోదుగ పుల్లలను శివాగ్ని యందు దహిస్తే లభించే భస్మ 'శివాగ్నిజం'. శివమంత్రాన్ని జపిస్తూ దర్భలజ్వాల యందు పుల్లలను కాల్చి ఆ భస్మను వస్త్రక్షాళితం చేసి, కొత్తకుండలో దాచి ధరిస్తే ఆ వ్యక్తి శోభను పొందుతాడు.

రాజు ప్రజల నుండి సారభూతమైన పన్నును గ్రహిస్తాడు. మనుష్యులు ధాన్యాదులను, వివిధ భక్ష్యాలను పచనం చేసి తిని జఠరాగ్ని సహాయంతో వాటి సారాన్ని గ్రహిస్తారు. అలాగే ఈ ప్రపంచాన్ని సృష్టించిన పరమ శివుడు జగత్తు దహింప బడగా దాని సారమైన భస్మను తన దేహానికి పూసుకొంటాడు. భస్మ మిషతో జగత్సారాన్ని గ్రహిస్తున్నాడని అర్థం చేసికోవాలి. ఆకాశ సారంతో కేశాలను, వాయు సారంతో ముఖాన్ని, అగ్ని సారంతో హృదయాన్ని, జలముల సారంతో నడుమును, పృథ్వీ సారంతో మోకాళ్ళను... ఈ విధంగా జగత్సారాన్ని ఆయన ధరిస్తున్నాడు.

బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు... వీరి సారభూతమైన భస్మను మహేశ్వరుడు లలాటమందు త్రిపుండ్ర రూపంలో ధరిస్తున్నాడు. ఈ విశ్వమంతటిని వంశం చేసి కొన్నాడు కనుక ఆయన శివుడైనాడు. ఏవిధంగా సింహాన్ని వశం చేసికోగల మరో మృగం లేదో అలాగే శివుని వశం చేసికోగల తదన్యుడు లేడు. 'శం' అనగా శాశ్వతానందం. 'ఇ' కారం పురుష బోధకం, 'వ' కారం శక్తిని, అమృతాన్ని బోధిస్తుంది. వీటి కలయికకు శివుడని పేరు. భక్తుడు తన ఆత్మను శివ స్వరూపంగా భావించి పూజించాలి. శివగురువు శిష్యుని గుణత్రయాన్ని నిర్మూలించి ఆపై శివబోధ చేస్తాడు. గురు శబ్దానికి 'గుణాన్ రుంధే' = గుణములను తొలగించు వాడు అని అర్థం. గురు దేహమే గురులింగం. తండ్రి పుత్రుని సంసారం లోకి లాగుతాడు. గురువు శిష్యుని సంసార కూపంనుండి రక్షిస్తాడు. అట్టి గురువును పూజిస్తే శివుని పూజించినట్లే.

ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధిదైవిక బాధలు తొలగాలంటే శివార్చన చెయ్యాలి. అన్న సమారాధన జరపాలి. శివధర్మాలన్నిటిలోను ప్రదక్షిణం గొప్పది. ప్రదక్షిణం ప్రణవమే. శివ భక్తుడు ధనహీనుడైతే భిక్షాన్నంతో జీవించాలి. అట్టి భిక్షాన్నానికి శంభుసత్రమని పేరు. సదా మౌనియై ఉండాలి."

### పార్థివ లింగ మహాత్మ్యం

ఋషులు సూతుణ్ణి పార్థివ లింగ మాహాత్మ్యాన్ని గురించి చెప్పమని కోరగా సూతుడిలా చెపుతున్నాడు.

"ఋషులారా! జ్ఞానానికి ఆధారభూతుడు శివుడొక్కడే. అట్టి శివుని స్మరించి చెపుతున్నాను వినండి. అన్ని లింగాల లోను పార్థివ లింగం శ్రేష్ఠం. కృత యుగంలో రత్న లింగం, త్రేతలో హేమ లింగం, ద్వాపరంలో రస లింగం, కలిలో పార్థివ లింగము శ్రేష్ఠములు. శివుని అష్టమూర్తులలో పార్థివమూర్తి శ్రేష్ఠం. అట్లే పార్థివ లింగం శ్రేష్ఠం. దేవతలలో మహేశ్వరుడు, నదులలో గంగానది, మంత్రాలలో ఓంకారం, మనుష్యులలో వేదాధ్యయన తత్పరుడు, నగరాలలో కాశీ, వ్రతాలలో శివరాత్రి, దేవీ మూర్తులలో శైవీ శక్తి వలె లింగాలలో పార్థివ లింగం శ్రేష్ఠం.

పార్థివ లింగ పూజలో పంచసూత్ర విధానాన్ని గూర్చి విచారించ నక్కర లేదు. పార్థివ లింగం అఖండంగా ఉండాలి. రెండు భాగాలను అతక రాదు. రత్నం, బంగారం, పాదరసం, స్ఫటికం, పుష్యరాగం, మట్టి... వీటితో చేసిన వన్నీ చరలింగాలు. ఇవన్నీ అఖండంగానే ఉండాలి. వేదిక మహావిద్య–లింగం మహేశ్వరుడు. కనుక ప్రతిష్ఠిత లింగం ద్విఖండంగా ఉండవచ్చు. ఇది పార్థివ లింగ మాహాత్మ్యం."

### పార్థివ శివలింగ పూజావిధి

ఋషులారా! ఇక పార్థివ లింగ పూజావిధానాన్ని చెపుతున్నాను వినండి. వైదిక మార్గమే ఇహపర సాధకం. కనుక ఆ మార్గాన్నే బోధిస్తున్నాను. శివభక్తుడు గృహ్య సూత్రాల ననుసరించి స్నాన, సంధ్యావందన, బ్రహ్మయజ్ఞ. పితృతర్పణాది కృత్యాలను ఆచరించి శివనామ స్మరణతో భస్మ, రుద్రాక్షలను ధరించి పరాభక్తితో పార్థివ లింగాన్ని పూజించాలి. పరిశుద్ధమైన మట్టిని గ్రహించి లింగాన్ని చెయ్యాలి. పంచాక్షరి మంత్రంతో పూజా ద్రవ్యాలను ప్రోక్షించి, 'భూరసి' మంత్రంతో పూజా స్థలాన్ని శుద్ధి చేసి, 'ఆపోస్మాన్' మంత్రంతో జల సంస్కారం చేసి, 'నమస్తే రుద్ర' అను మంత్రంతో స్ఫటిక బంధాన్ని రచించాలి.

ఆపై 'నమశ్శంభవే చ' మంత్రతో క్షేత్ర శుద్ధిని చేసి, పంచామృతాలను ప్రోక్షించి, 'నమో నీలగ్రీవాయచ' మంత్రంతో శివ లింగాన్ని ప్రతిష్టించి, 'ఏతత్తే రుద్ర' మంత్రంతో ఆసనాన్ని సమర్పించి 'మానో మహాంతమ్' మంత్రంతో శివుని అవాహన చేసి, 'యాతే రుద్ర' అను మంత్రంతో శివుని ఉపవిష్టుని చెయ్యాలి. 'యామిషుం' అను మంత్రంతో శివునకు న్యాసం చేసి, 'అధ్యవోచత్' అను మంత్రంతో అధివాసాన్ని కల్పించి, 'అసౌ యస్తామ్రః

' అను మంత్రంతో ఇష్టదైవమైన శివుని న్యాసం చేయాలి. 'అసౌయోౖ వసర్పతి' మంత్రంతో సమీపించాలి. 'నమో అస్తు నీలగ్రీవాయ' అను మంత్రంతో పాద్యాన్ని , 'తత్పురుషాయ' అను రుద్ర గాయత్రితో అర్ఘ్యాన్ని, 'త్రయంబకం యజామహే' అను మంత్రంతో ఆచమనాన్ని చేసి, 'పయః పృధివ్యామ్' అను మంత్రంతో క్షీరాభిషేకాన్ని, 'దధిక్రావ్ణ్ణో' మంత్రంతో పెరుగును అభిషేకం చెయ్యాలి. 'ఘృతం ఘృతపావా ' అను మంత్రంతో నేతిని, 'మధువాతా, మధునక్తం, మధు మాన్నః' అను మూడు మంత్రాలతోను మధువును, చక్కెరను కలిపిన నీటిని అభిషేకించాలి. ఈ ఐదు ద్రవ్యాలతో చేసే అభిషేకానికి పంచామృత స్నానమని పేరు.

'మానస్తోకే' అను మంత్రంతో శివునకు కటిబంధనాన్ని, 'నమో ధృష్ణవే' అను మంత్రంతో ఉత్తరీయాన్ని, ' యాతేహేతిః' అను నాల్గు మంత్రాలతో వస్త్రాన్ని సమర్పించాలి. 'నమః శ్వభ్యః' అను మంత్రంతో గంధాన్ని, 'నమస్తక్షభ్యః' అను మంత్రంతో అక్షతలను, 'నమఃపార్యాయ' అను మంత్రంతో పుష్పాన్ని, 'నమః పర్ణ్యాయ' అను మంత్రంతో మారేడు పత్రాన్ని, సమర్పించాలి. 'నమః కపర్దినేచ' మంత్రంతో ధూపాన్ని, 'నమః ఆశవే' మంత్రంతో దీపాన్ని, 'నమో జ్యేష్ఠాయ' అను మంత్రంతో నైవేద్యాన్ని, 'త్ర్యంబకం' అను మంత్రంతో పునరాచమనాన్ని, 'ఇమాగ్ం రుద్రాయ' మంత్రంతో ఫలాన్ని, 'నమో గోష్ఠ్యాయ' మంత్రంతో సర్వాన్ని శివునకు అర్పించాలి.

'మానో మహాంతమ్, 'మానస్తోకే' – అను రెండు మంత్రాలతో ఏకాదశ రుద్రులను అక్షతలతో పూజించాలి. 'హిరణ్య గర్భః' అను మూడు మంత్రాలతో దక్షిణ లియ్యాలి. 'దేవస్య త్వా' అను మంత్రంతో అభిషేకాన్ని చేసి, దీప మంత్రంతో నీరాజనాన్నిచ్చి 'ఇమాగ్ం రుద్రాయ' అను మూడు మంత్రాలతో రుద్రునకు దోసెడు పుష్పాలను సమర్పించి, 'మానో మహాంతమ్' అను మంత్రంతో ప్రదక్షిణం చేసి, 'మానస్తోకే' మంత్రంతో సాష్టాంగ నమస్కారం చెయ్యాలి. 'ఏషతే రుద్ర' అను మంత్రంతో శివ ముద్రను, 'యతో యతః' అను మంత్రంతో అభయ ముద్రను, 'త్ర్యంబకం' అను మంత్రంతో మహా ముద్రను 'నమో గోభ్యః' అను మంత్రంతో ధేను ముద్రను చూపాలి. ఈ విధంగా పంచముద్రలను చూపి, శివ మంత్రాన్ని జపించి శత రుద్రీయాన్ని చదవాలి. తరువాత వేదవేత్త పంచాంగాన్ని పఠించి, 'దేవా గాతు' అను మంత్రంతో శివునికి ఉద్వాసన చెప్పాలి.

మునులారా! ఇంత వరకు శివపూజ యొక్క వైదిక విధానాన్ని సవిస్తరంగా వివరించాను. శివానుగ్రహాన్ని కోరే సర్వ మానవులు శివుణ్ణిలా స్తుతించాలి.

**శ్లో॥ కైలాస పీఠాసన మధ్యసంస్థం భక్తై స్సనందాదిభి రర్చ్యమానమ్ ।
భక్తార్తి దావానల మప్రమేయం ధ్యాయేదుమాలింగిత విశ్వభూషణమ్ ॥
ధ్యాయేన్నిత్యం మహేశం రజత గిరినిభం చారు చంద్రావతంసం
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశు మృగవరా భీతి హస్తం ప్రసన్నమ్
పద్మాసీనం సమంతాత్ స్థితమమర గణైః వ్యాఘ్రకృత్తిం వసానం
విశ్వాద్యం విశ్వబీజం నిఖిల భయహరం పంచవక్త్రం త్రినేత్రమ్ ॥**

**తా॥** కైలాసము నందు సింహాసన మధ్యస్థుడై వెలుగొందు చున్నవాడు, సనందాది భక్తులచే సేవింప బడుచున్న వాడు, భక్తుల దుఃఖానికి దావాగ్ని వంటి వాడు, ప్రమాణాలకు అందని వాడు, ఉమా సహితుడైన వాడు, విశ్వానికి అలంకారమైన వాడు, వెండికొండవలె ప్రకాశించు వాడు, అందమైన చంద్రుని శిరోభూషణంగా ధరించిన వాడు, రత్నాభరణ భూషితుడు, పరశువు, లేడి, వరద, అభయ ముద్రలను ధరించిన వాడు, ప్రసన్నుడు, పద్మాసనాసీనుడు, దేవతా సమూహం చేత కీర్తింప బడుచున్న వాడు, వ్యాఘ్ర చర్మాన్ని ధరించిన వాడు, విశ్వానికి ఆద్యుడు, కారణ భూతుడు, భయా లన్నింటిని తొలగించువాడు, ఐదు ముఖాలు కలవాడు, ముక్కంటి యగు మహేశ్వరుని నిత్యము ధ్యానిస్తున్నాను.

ఈ విధంగా స్తుతించి తరువాత అక్షతలను, పుష్పాలను దోసిట్లోకి తీసుకొని ఆనందంతో, భక్తితో శంకరుని ఈ విధంగా ప్రార్థించాలి.

**శ్లో॥ తావక స్త్వద్గత ప్రాణ – స్త్వచ్చిత్తోఽహం సదా మృడ ।
కృపానిధ ఇతి జ్ఞాత్వా – భూతనాద ప్రసీద మే ॥
అజ్ఞానాద్యది వాజ్ఞానా – జ్జప పూజాదికం మయా ।
కృతం తదస్తు సఫలం – కృపయా తవ శంకర ॥
అహం పాపీ మహానద్య – పావనశ్చ భవాన్మహాన్ ।
ఇతి విజ్ఞాయ గౌరీశ – యదిచ్ఛసి తథా కురు ॥
వేదై పురాణై స్సిద్ధాంతైః – ఋషిభి ర్వివిధైరపి ।
న జ్ఞాతోఽసి మహాదేవ – కుతోఽహం త్వంసదాశివ ॥
యథా తథా త్వ దీయోఽస్మి – సర్వభావైర్మహేశ్వర ।
రక్షణీయస్త్వయాహం వై – ప్రసీద పరమేశ్వర ॥**

**తా ॥** హేమృడ! నేను నీ వాడను. నాజీవితం నీ అధీనంలో ఉంది. నా మనస్సులో సదా నువ్వే ఉన్నావు. హే కృపానిధే! హే! భూతనాథా! ఇది తెలుసుకొని నన్ను అనుగ్రహించు! శంకరా! తెలిసి గాని తెలియక గాని చేసిన జపపూజాదులు నీ కృపచే సఫలమగు గాక! నేను పాపిని! నీవు పావన మూర్తివి! హే! గౌరీశా! నీవు ఈ విషయాన్ని ఎఱిగి నీ చిత్తానుసారంగా చెయ్యి! ఓ మహాదేవా! నిన్ను వేదాలు, పురాణాలు, వివిధ శాస్త్ర సిద్ధాంతాలు మరియు ఋషులు కూడా తెలుసుకోలేక పోయారు. హే! సదాశివ! నీవెక్కడ? నేనెక్కడ? హే! మహేశ్వరా! నేను అన్ని విధాల భావముల చేత నీవాడను! హే! పరమేశ్వరా! నీవు నన్ను అనుగ్రహించి రక్షించు!

ఈ విధంగా పూజించి, ప్రార్థించి పుష్పాలను శివుని శిరస్సుపై ఉంచి నమస్కరించి తర్వాత ఉద్వాసన చెప్పాలి. ఋషులారా లింగాన్ని అర్చిస్తే చరాచర జగత్తును అర్చించినట్లే అవుతుంది. స్త్రీ – పురుష భేదం లేకుండా అందరికి దీనియందు అధికారం ఉంది. శివనైవేద్యాన్ని 'తీసుకోరాదేమో' అనే శంకను వీడి సర్వులు భక్షించవచ్చు. మారేడు చెట్టు మహాదేవుని స్వరూపం. అందువల్ల బిల్వపత్ర పూజ శ్రేష్ఠం. శివనామం గంగ వంటిది. విభూతి యమున. రుద్రాక్ష సరస్వతి. విభూతి, రుద్రాక్షలను ధరించి నిత్యము శివనామాన్ని జపించే శివయోగి త్రివేణీ సంగమం వంటి వాడు.

మునులారా! భస్మధారణ చాలా పవిత్రమైనది. ముప్పై రెండు, పదహారు, ఎనిమిది లేక ఐదు స్థానాలో భస్మను ధరించాలి. లలాటం, రెండు బాహువులు, హృదయం, నాభి ఈ ఐదు స్థానాల్లోను విధిగా ధరించాలి. గంధాన్ని ధరించాలనుకొంటె గంధాన్ని భస్మలో కలిపి ధరించాలి. ముక్కంటిని 'నమశ్శివాయ' అని స్మరించి లలాటమునందు, 'ఈశాభ్యాం నమః' అని పార్శ్వముల యందు, 'బీజాభ్యాం నమః' అని ముంజేతుల యందు, 'పితృభ్యాం నమః' అని శరీర క్రింది భాగమునందు, 'ఉమేశాభ్యాం నమః' అని శరీర పైభాగము నందు, 'భీమాయ నమః' అని శిరస్సుకు వెనుకను భస్మం ధరించాలి."

## రుద్రాక్ష మహిమ

సూతుడిలా అంటున్నాడు : "మునులారా! పూర్వం ఒకానొకప్పుడు రుద్రుడు ఈ రుద్రాక్ష మహాత్మ్యాన్ని పార్వతికి వివరించాడు. దానిని మీకు చెపుతున్నాను వినండి. పరమేశ్వరుడు వేలాది దివ్య సంవత్సరాలు తపోనిష్ఠలో ఉండగా ఆయన మసస్సు భయపడింది. లీలగా కన్ను తెరచాడు. ఆ సుందర నేత్రాల నుండి కన్నీటి బిందువులు జారగా అక్కడ రుద్రాక్ష వృక్షాలు అంకురించాయి. ఇవి

మొదట్లో గౌడ దేశంలో పుట్టాయి. శివ సంకల్పంతో అవి మధుర, అయోధ్య, లంక, మలయాద్రి, సహ్యాద్రి, కాశీ తదితర ప్రాంతాల్లో వ్యాపించాయి. రుద్రాక్ష సాక్షాత్తు శివ స్వరూపమే!

రుద్రాక్షలలో తెలుపు, ఎరుపు, పసుపు నలుపు అని నాలుగు రంగులున్నాయి. ధాత్రీ ఫలం (పెద్ద ఉసిరికాయ) ప్రమాణం కలది శ్రేష్ఠం. రేగి పండు ప్రమాణం కలవి, సెనగ గింజ ప్రమాణం కలవి,... ఇవి కూడా ఉత్తమాలే! మృదు స్పర్శ కలవి దృఢమైనవి, పెద్దవి, కంటకములతో కూడినవి ఐన రుద్రాక్షలు, భుక్తి, ముక్తి ప్రదాలు. పురుగు పట్టినది, పగిలినది, విరిగినది, కంటకములు లేనివి, వ్రణము కలది, వృత్తాకారం లేనిది ఈ ఆరు రకాల రుద్రాక్షలు పనికి రావు. సహజమైన రంధ్రం గల రుద్రాక్షలు పురుషుడు రంధ్రం చేసిన దాని కంటె శ్రేష్ఠం. పంచాక్షరీ మంత్రంతో రుద్రాక్షలను ధరించాలి. రుద్రాక్షను ధరించిన మానవుడు మద్య మాంసాలను, ఉల్లిని, మునగ కూరను ఇతర నిషిద్ధ పదార్థాలను సేవించ రాదు. జీవుని శరీరం మీద రుద్రాక్ష ఉన్నంత వరకు ఆ జీవుణ్ణి అకాల మృత్యువు సమీపించదు. ఈ రుద్రాక్షలలో ఏకముఖి, ద్విముఖి, త్రిముఖి, చతుర్ముఖి, పంచముఖి, షణ్ముఖి, సప్తముఖి, అష్టముఖి, నవముఖి, దశముఖి, ఏకాదశముఖి, ద్వాదశ ముఖి, త్రయోదశ ముఖి, చతుర్దశ ముఖి వరకు మొత్తం పదునాల్గు ముఖాల రుద్రాక్షలున్నాయి.

మునులారా! రుద్రాక్ష ఏదైనా సాక్షాత్తు శివ స్వరూపమే! సందేహం లేదు. ఏదో రూపంలో రుద్రాక్షను ధరించ కుండా మానవుడు ఉండరాదు. కంఠ మాలగా రుద్రాక్షమాలను ధరించటం శ్రేష్ఠం. రుద్రాక్ష ఫలమునిచ్చినట్లుగా ఇతర మాలలేవియును శుభఫలముల నీయవు. రుద్రాక్షల పరిమాణాన్ని అనుసరించి ఫలభేదాన్ని కొందరు చెప్పినా అన్ని రుద్రాక్షలు శుభప్రదములే అని పూర్వ ఋషులు తీర్మానించారు. రుద్రాక్షలను శిరసున కిరీటంగా, యజ్ఞోపవీతంగా మరియు చెవులకు, బాహువులకు, ముంజేతులకు, మణికట్టులకు, నడుముకు, శిఖయందు ధరించిన మానవుడు సాక్షాత్తు ఈశ్వరుడే! రుద్రాక్షలను ధరించటానికి స్త్రీ – పురుష భేదం లేదు. వర్ణ భేదం లేదు. సర్వమానవులు అర్హులే.

ఏకముఖి రుద్రాక్ష భుక్తి ముక్తి ఫలప్రదం. బ్రహ్మహత్యా నివారకం. సకల సంపత్కరం. రెండు ముఖములు కలది సర్వకామప్రదం. గోహత్యా నివారకం. మూడు ముఖములు గలది సాధన సంపత్ప్రదాయకం. సర్వవిద్యా ప్రదాయకం. నాల్గుముఖములు కలది బ్రహ్మ స్వరూపం. నరహత్యాదోష నివారకం. చతుర్విధ పురుషార్థదాయకం. ఐదు ముఖములు

గలది సాక్షాత్తు రుద్రస్వరూపం. దానికి కాలాగ్ని అనిపేరు. సర్వకామములను, ముక్తిని ఇస్తుంది. అగమ్యగమ్య దోషము, అభక్ష్యభక్ష్య దోషము వీటిని నశింప చేస్తుంది. ఆరు ముఖములు గలది సాక్షాత్తు కుమారస్వామి స్వరూపం. దానిని కుడి భుజమునందు ధరించిన వానికి అన్నిట జయసిద్ధి కలుగుతుంది. ఏడు ముఖములు గలదానికి అసంగము అనిపేరు. దీనిని ధరించిన వాడు ఎట్టి దరిద్రుడైనా సంపన్నుడు, సర్వసమర్థుడు అవుతాడు. ఇది వైరాగ్యహేతువు. జ్ఞాన హేతువు కూడాను. ఎనిమిది ముఖములు గలది వసు స్వరూపం. దానికి భైరవము అనిపేరు. ఇది బంగారాన్నిస్తుంది. పూర్ణాయుర్దాయాన్నిస్తుంది. దీనిని ధరించిన వాడు శివసాయుజ్యాన్ని పొందుతాడు. తొమ్మిది ముఖములు కలది భైరవ స్వరూపమని మరియు కపిల మహర్షి స్వరూపమని చెప్పబడింది. తొమ్మిది రూపాలలో భక్తులను రక్షించే దుర్గామహేశ్వరి (నవదుర్గలు) దానికి అధిష్ఠాన దేవత. ఈ రుద్రాక్షను ఎడమ చేతియందు ధరించాలి. పది ముఖాలుగల రుద్రాక్ష జనార్దన స్వరూపం. దీనిని ధరించిన మానవునకు కోర్కెలన్ని సిద్ధిస్తాయి. పదకొండు ముఖములు గల రుద్రాక్ష సాక్షాత్తు రుద్ర స్వరూపమే. ఇది అన్నిటిలోను విజయాన్ని సిద్ధింప చేస్తుంది. పన్నెండు ముఖములు గల దానిని కేశములయందు ధరించాలి. ద్వాదశాదిత్యులు దానియందు ప్రతిష్ఠితులై ఉంటారు. పదమూడు ముఖాలు కలది విశ్వేదేవతల స్వరూపం. ఇది సౌభాగ్యాన్ని, అభ్యుదయాన్ని ఇస్తుంది. పదునాల్గు ముఖములుగల రుద్రాక్ష పరమశివ స్వరూపం. దీనిని శిరస్సున ధరిస్తే పాపాలన్నీ భస్మీపటల మవుతాయి. ఐతే వీటిని మంత్ర పూతంగా మాత్రమే ధరించాలి. భస్మను, రుద్రాక్షలను ధరించిన వాని జోలికి, శివనామాన్ని పంచాక్షరిని జపించిన వాని జోలికి, యముడు సమీపించడంటే తక్కినవాటిమాట చెప్పేదేముంది? అట్టివాడు దేవతలందరికి ఇష్టుడే. అని చెప్పి ముగించాడు సూతుడు.

**శ్రీ శివ మహాపురాణంలో మొదటిదైన**

**విద్యేశ్వర సంహిత**

**సమాప్తం**

**హరిః ఓం తత్సత్**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## రుద్ర సంహిత - సృష్టి ఖండం



శ్లో॥ శ్రీ గణేశాయ నమః । గౌరీ శంకరాభ్యాం నమః ।
అథ ద్వితీయా రుద్ర సంహితా ప్రారభ్యతే ॥

శ్రీ గణేశునకు, శ్రీ గౌరీ శంకరులకు నమస్కారం. ఇపుడు రెండవదియగు రుద్ర సంహిత ఆరంభింపబడుతూన్నది.

శ్లో॥ విశ్వోద్భవ స్థితిలయాదిషు హేతుమేకం
గౌరీపతిం విదిత తత్త్వమనంత కీర్తిమ్ ।
మాయాశ్రయం విగతమాయ మచింత్యరూపం
బోధస్వరూపమమలం హి శివం నమామి ॥

**తా ॥** జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయములకు కారణమైన వాడు, గౌరీదేవికి భర్త ఐనవాడు, తత్త్వముల నెరిగినవాడు, అనంతమైన కీర్తి గలవాడు, మాయకు ఆశ్రయమైన వాడు, మాయచే ప్రభావితుడు కాని వాడు, మనస్సుచే కూడ ఊహించుటకు శక్యముగానివాడు, జ్ఞాన స్వరూపుడు, నిర్దోషుడు అగు శివునకు నమస్కారం.

శ్లో ॥ వందే శివం తం ప్రకృతే రనాదిం
ప్రశాంతమేకం పురుషోత్తమం హి ।
స్వమాయయా కృత్స్నమిదం హి సృష్ట్వా
నభోవ దంతర్బహిరావస్థితో యః ॥

**తా ॥** ప్రకృతికంటే అతీతుడు, ఆది లేనివాడు, శాంతస్వరూపుడు, అద్వితీయుడు పురుషోత్తముడు అగు శివునకు నమస్కారం. ఆయన జగత్తు నంతనూ తన మాయచే సృష్టించి, జగత్తునకు లోపల, బయట ఆకాశమువలె వ్యాపించి ఉన్నాడు.

**శ్లో ॥ వందేతరస్థం నిజగూఢ రూపం ।**
**శివం స్వత స్రష్టుమిదం విచష్టే ॥**
**జగంతి నిత్యం పరితో భ్రమంతి ।**
**యత్సన్నిధౌ చుంబక లోహవత్తమ్॥**

**తా॥** శివుడీ జగత్తును తన స్వరూపము నుండియే సృజించి సర్వమును వ్యాపించి యున్నవాడై తన గూఢ రూపమునందు ప్రతిష్ఠితుడై యున్నాడు. అయస్కాంత సన్నిధిలో లోహశకలములవలె ఈ భువనములు నిత్యము ఆయన చుట్టూ తిరుగుచున్నవి. అట్టి శివునకు నమస్కారం.

వ్యాసుడిలా అంటున్నాడు: ఒకప్పుడు నైమిశారణ్యంలో శౌనకాది ఋషులు సూతుణ్ణి భక్తితో ఇలా ప్రశ్నించారు."ఓ! సూతమునీ! ఇంత వరకు నువ్వు చేసిన విద్యేశ్వర సంహితా ప్రసంగాన్ని మేం విన్నాం. శంకర దివ్యగాథ శ్రవణపేయంగా ఉంది.మాకు సంపూర్ణంగా చెప్పు. ఆయన నిర్గుణుడైనా సగుణుడెలా అయ్యాడు? ఆయన అవ్యక్త రూప మెట్టిది? స్థితి కాలంలో ఆయన కార్య నిర్వహణ ఎలా ఉంటుంది? లయ కాలంలో ఆయన క్రీడ ఎట్టిది? ఆయనెలా ప్రసన్నుడవుతాడు? ఆయన యొక్క ఆవిర్భావాన్ని, ఉమాదేవి ఆవిర్భావాన్ని, వారి వివాహాన్ని, వారి గృహస్థాశ్రమ గాథలను, లీలా విశేష వైభవాలను ఇంకా నీకు తెలిసిన విశేషాలను సవివరంగా చెప్పవలసింది."

మునుల శ్రద్ధకు సంప్రీతుడైన సూతుడిలా చెప్పసాగేడు. "మహర్షులారా! శివుని కళ్యాణ గాథలు గంగాజలం వలె స్వచ్ఛమైనవి. ఇండుప గింజ చిన్నదైనా దాని గంథం జలంలో ఉన్న బురదను తొలగించి ఎలా శుద్ధిచేస్తుందో అలాగే శివ గాథలు మనోమాలిన్యాన్ని తొలగిస్తాయి. ఒకప్పుడు విష్ణు ప్రేరితుడైన నారదుడు తన తండ్రి ఐన బ్రహ్మ గారిని జిజ్ఞాసతో మీరడిగిన ప్రశ్నలనే అడగగా బ్రహ్మ గారిచ్చిన సమాధానాన్ని మీకు చెపుతున్నాను వినండి.

**నారదుని తపస్సు**

ఒకప్పుడు బ్రహ్మ మానస పుత్రుడు, ముని శ్రేష్ఠుడు ఐన నారదుడు తపోదీక్ష యందు నిష్ఠ కలిగి హిమాలయ గిరి భూముల అన్వేషింపగా పరమ సుందరమైన ఒక గుహ కనిపించింది. దాని చెంతనే గంగానది ప్రవహిస్తోంది. ఆ ప్రదేశం మిక్కిలి అనుకూలమని ఎంచి ఆ ముని పుంగవుడు దృఢాసనా బద్ధుడై ప్రాణాయామం చేసి మౌనియై దీర్ఘకాలం తపశ్చర్య కొనసాగించాడు. అతని తీవ్ర తపోనిష్ఠకు స్వర్గాధిపతి

ఐన ఇంద్రుని మనస్సు భయవిహ్వలమైంది. తనకు పదవీ భ్రష్టత్వం సంప్రాప్తిస్తుందనే శంకతో మునితపస్సును భగ్నం చేయ నిశ్చయించి మన్మథుని స్మరించాడు. వెంటనే విచ్చేసిన కందర్పుని రాక చూసి "మిత్రమా! నా రాజ్య సుస్థిరత్వం నీ మీద ఆధారపడి ఉంది. నారదుడు దుస్సహమైన తపస్సులో మునిగి ఉన్నాడు. ఎలాగైనా విఘ్నం చెయ్యవలసింది" అని పరిపరి విధాల కోరగా 'అదెంతపని' అని దర్పంతో కందర్పుడు వసంతుని వెంట తీసికొని బయలు దేరాడు. ఇద్దరూ కలిసి నారదముని తపస్సు చేసుకొంటున్న పవిత్ర భూమికి వచ్చి తమ నేర్పును, చాతుర్యాన్ని, కళా ప్రావీణ్యాన్ని, మాయలను ప్రదర్శించారు.

విరితేనెల కాల్వలతో, రాలిన కుసుమ పరాగపు రాశులతో, నానావిధ పుష్ప పరిమళాలతో, భ్రమరకుల ఝంకారంతో, శుక పిక శారికాది కలకలలతో, అంగనా మణుల కిలకిలలతో, సెలయేరుల గలగలలతో ఆ వనం చతుర్విధ వాద్య సమ్మేళనంతో, నాట్యమేళంతో మహోత్సవంగా సాగిపోతూన్న అద్భుత నర్తన మంటపంలా ఉంది. మన్మథ ప్రతాపం వెల్లి విరుస్తోంది. నారదుడు ధీరుడై ఎట్టి వికారాన్ని పొందక నిర్వికారుడై తన తపస్సును కొనసాగిస్తూనే ఉన్నాడు. మారుడు అహంకార దూరుడై శరచాపాలను వదలి పరాజయ భారంతో సురాధిపతి చెంతకు వెళ్ళాడు.

మునులారా! ఆ స్థలంలో మన్మథ ప్రభావం నిరుప యోగం. ఎందుకంటే ఈశ్వరుడు ఉగ్ర తపస్సు చేసి మన్మథుని దహించిన స్థలం అది. అనంగుడు అలా అమరాధిపతిని చేరి నారద ప్రభావాన్ని విన్నవించి తన స్వస్థలానికి చేరుకొన్నాడు. అమరాధిపతి మనసులో నారదుని ప్రశంసించాడు.

ఈశ్వరానుగ్రహంచే నారదుడు మరికొంత కాలం తన తపస్సును కొనసాగించి, పూర్ణత్వం లభించిందనే విశ్వాసంతో తపస్సును విరమించాడు. ఆయన శివమాయా మోహితుడై పూవింటి వానిపై విజయం తన ప్రభావమే అని భ్రమించాడు. తన మహిమను శివునికి చెప్పి ప్రశంసలను పొందాలనే ఉబలాటంతో వెంటనే కైలాసానికి బయలు దేరాడు. వెళ్ళి రుద్రునకు నమస్కరించి తన విజయ గాథను ఉత్సాహంతో విన్నవించాడు.

దానిని విన్న రుద్రుడు విస్మితుడై వివేకాన్ని కోల్పోయిన నారదునితో "వత్సా! నారదా! నీవు ప్రాజ్ఞుడవు! ధన్యుడవు! ఈ విషయాన్ని ఇతరుల వద్ద చెప్పకు. పరిహాస పాత్రుడ వవుతావు. నీలోనే రహస్యంగా దాచుకో! విష్ణువు వద్ద అసలు ఈ ప్రసంగం చెయ్యకు." – అని పలుమార్లు హెచ్చరించినా నారదుడు చెవిని పెట్టలేదు. మునులారా!

భావి కర్మ  చాలా బలీయమైనది. కర్మ ఎప్పుడూ ఈశ్వర ప్రేరితమే! కర్మప్రేరితుడై ఆ ముని బ్రహ్మ లోకానికి వెళ్ళి పితామహునకు నమస్కరించి తన కామ విజయ గాథను వివరించాడు. పద్మజుడు ఆ మాటలు విని శంకరుని స్మరించి యథార్థాన్ని గుర్తెరిగి, రుద్రుడు చెప్పినట్లే ఆ వృత్తాంతాన్ని ఇతరు లెవరి వద్ద బహిరంగ పర్చ వద్దని తన కుమారుని కోరేడు.

మాయా ప్రభావితుడైన నారదుడు తన తండ్రిగారి మాటలను పెడచెవిని పెట్టి కమల నాభుని దర్శించాడు. నారాయణుడు  సర్వము తెలిసిన వాడే ఐనా నారదునికి స్వాగత సత్కారాలను చేసి "నీరాకలో గల ఆంతర్య మేమిటి?" – అని ప్రశ్నించాడు. కామ విజయ గర్వితాహంకార వర్ధితుడైన నారదుడు యధావత్తుగా తన విజయాన్ని వర్ణించాడు. అప్పుడు సత్యాన్నెరిగిన పద్మనాభుడు చమత్కారంగా ఇలా అన్నాడు;  "ఓ మునిసత్తమా! నువ్వు బ్రహ్మజ్ఞాన కళానిధివి గదా! భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు లేని వానిని అరిషడ్వర్గాలు బాధిస్తాయి కాని నీవంటి నైష్ఠిక బహ్మచారిని, జన్మ ప్రభృతి వికారములు లేని  వానిని బాధించవు గదా! నీకు కామ వికారం లేదు! ఉండదు కూడా!" హరియొక్క పల్కుల లోని ఆంతర్యాన్ని గ్రహించ లేని నారదుడు మరింత గర్వితుడై లోక సంచారానికి బయలు దేరాడు.

**నారదుని మోహం**

నారదునికి తత్త్వ జ్ఞానాన్ని ఉపదేశించాలనే సంకల్పంతో మాయా విశారదుడైన విష్ణువు ముని వెళ్ళే మార్గంలో సుందర నగరాన్ని సృష్టించాడు. అది వైకుంఠాన్ని మించి ఉంది. దానిని శీలనిధి అను రాజు ప్రజారంజకంగా పాలిస్తున్నాడు. ఆ సమయంలో సకల సౌందర్యనిధి ఐన తన కుమార్తెకు స్వయంవరాన్ని ప్రకటించాడు రాజు. ఆ వార్త విని ఎంతో ఉత్సాహంతో వచ్చిన నానాదేశ నరేంద్ర మండలితో శోభిస్తున్న ఆ నగరం నక్షత్ర సమూహంతో ప్రకాశిస్తూన్న వినువీధిలా కనుల పండువుగా ఉంది. ఆ వార్త విన్న నారదుడు మోహ పరవశుడై రాజద్వారాన్ని సమీపించాడు. మహర్షిరాక కంచుకీ జనంచే తెలుసుకొన్న మహారాజు ఎదురేగి అర్ఘ్యపాద్యాదుల పూజించి రత్నసింహాసనాసీనుణ్ణి చేసి తనకుమార్తె ఐన శ్రీమతిని పిలిపించి ఆమెచే మునికి నమస్కారం చేయించాడు. చేయించి "మునీంద్రా! సకలశుభలక్షణ లక్షితాంగి యైన నా కుమార్తెకు రేపే స్వయవరం ప్రకటించాను. త్రికాలజ్ఞులైన మీరు ఆమె భావి శుభాన్ని చెప్పవలసింది" అని కోరేడు. మోహినీ దేవతను మించిన అందచందాలతో అలరారుతూ ఉన్న ఆ సన్నుతాంగిని చూచి మన్మథ భావానికి గురియైన ముని  ఆమెను తానే పొందగోరి ఇలా అన్నాడు: "రాజా! ఈమె జాతకం మంచిది. భవిష్యత్తు గొప్పది. ఈమె  కాలుపెట్టిన చోట సిరులు

పుడతాయి. సర్వసమర్థుడు భక్తి, జ్ఞాన, వైరాగ్య సంపన్నుడు, లోకాలన్నిటిని జయించిన వీరుణ్ణి జయించిన మేటి వీరుడు ఈమెకు పతి కాగలడు" ఇలా చెప్పి తన దారిన తాను వెళ్ళి ఆమెనెలా పొందాలా అనే ఆలోచనలో పడ్డాడు.

ఆలోచించగా మునికొక ఉపాయం స్ఫురించింది. స్త్రీలకు సౌందర్యం చాలా ప్రీతిపాత్రమైనది. సౌందర్యోపేత మైన పురుషుణ్ణి స్త్రీలు వరిస్తారనేది లోకానుభవ సిద్ధమైన మాట. త్రైలోక్యమోహనాంగుడు విష్ణువు. కనుక ఆ రూపాన్ని పొందితే స్వయంవరంలో ఆమె నన్ను వరించటం సిద్ధం అని ఎంచి విష్ణు లోకానికి వెళ్ళాడు నారదుడు. వెళ్ళి ఏకాంతంలో విష్ణువుతో తన మనసులోని భావాన్ని వెల్లడించి విష్ణు రూపాన్ని తనకియ్య వలసిందిగా ప్రార్థించాడు. శంకర మాయను ఎరిగిన విష్ణువు శ్రేష్ఠుడైన వైద్యుడు రోగికి హితాన్ని చేకూర్చినట్లుగా నీకు నేను హితాన్ని సమకూరుస్తాను అని చెప్పి నారదునికి కోతి ముఖాన్ని మిగిలిన దేహానికి తన రూపాన్ని ఇచ్చి అంతర్ధాన మయ్యాడు. ఈ విషయాన్ని ఎరుగని ముని కృతార్థుడనయ్యానని భావించి రాజసమూహంతో కోలాహలంగా ఉన్న స్వయంవర సభకు చేరుకొన్నాడు. ఇంద్ర సభలా ఉన్న ఆసభలో మిగతా రాజనివహం మధ్య ఆసీను డయ్యాడు. బయటవారి కన్నులకు తానెలా గోచరిస్తున్నాననేది నారదు డెరుగడు. శివుని మాయచే ఇద్దరు రుద్రానుయాయులు బ్రాహ్మణ వేషంలో వచ్చి మునివద్దకు వెళ్ళి పరిహాస భాషణం చేశారు. మనసంతా రాజకుమార్తె మీదనే ఉన్న ముని, "ఓహో! కోతి ముఖం వాడా!" అని బ్రాహ్మణులు పల్కిన పరిహాస వచనాలను పట్టించు కోలేదు.

రాజకుమార్తె వచ్చే మార్గం వైపు రెప్ప వేయకుండ చూస్తున్నాడు ముని. ఇంతలో రాకుమారి చెలికత్తెలిర్వురు చెంతనిలువ తక్కిన పరిచారికలు వెంటనడవ బంగారు పూల మాలను చేత ధరించి స్వయంవర సభామంటప మధ్యమందు రత్న పాంచాలికలా నిలబడింది. ఆపై వరాన్వేషణ చేస్తూ సభంతా తిరిగింది. మునిని చూచి ముఖాన్ని త్రిప్పుకొంది. ముని ఖిన్నుడయ్యాడు. విష్ణువు రాజకుమార ఆహార్యంతో వచ్చి ఎవరికి కానరాకుండ సభలో ఆసీనుడై ఉన్నాడు. ఆమె ఆయనను చూచి పూలమాలను ప్రసన్న వదనంతో కంఠానికి అలంకరించింది. వెంటనే హరి రాకుమారిని తీసుకొని అంతర్థానమై తన లోకానికి చేరుకొన్నాడు. రాకుమారు లందరు నిరాశోపహతులు కాగా నారదుడు మాత్రం దైవోపహతుడై స్మరవిహ్వలుడయ్యాడు.

అప్పుడు జ్ఞాన విశారదులైన రుద్రానుచరులిద్దరూ మదనజ్వర పీడితుడైన మునిచెంతకు వచ్చి "ఓ నారదా! స్వర్ణప్రతిమ వంటి ఆ రాకుమారి నిన్ను వరించలేదని కదా దుఃఖంచే బాధపడు తున్నావు. కపిముఖుడ వైన నిన్ను ఆ రాకేందువదన ఎలా వరిస్తుందని తలపోశావు?" అని ఎత్తి పొడిచారు. వారి వచనాలను విన్న ముని ఆశ్చర్యచకితుడై అద్దంలో ముఖాన్ని చూచుకొని వారిపల్కులు సత్యమేఐనా దురాగ్రహంతో "మీరిద్దరూ బ్రాహ్మణుడనైన నన్ను పరిహసించారు కనుక దీనికి ప్రతిఫలంగా బ్రాహ్మణులై జన్మించి రాక్షసరూపాన్ని పొందుతారు" – అని శపించాడు. అంత రుద్రానుచరు లిద్దరూ జరిగినదంతా శివేచ్ఛగా భావించి ఉదాసీనులై రుద్ర లోకానికి వెళ్ళారు.

**నారదునకు విష్ణువు ఉపదేశం**

సూత మహాముని ఋషులతో ఇలా అంటున్నాడు. "మునులారా! ఆ విధంగా నారదుడు శివమాయా మోహితుడై విష్ణువు యొక్క కపట బుద్ధిని గ్రహించి కోపంతో తగిన గుణ పాఠం చెప్పాలనే ఉద్దేశ్యంతో విష్ణు లోకానికి వెళ్ళాడు. వెళ్ళి విష్ణువుతో ఇలా నిందా వచనాలను పలికాడు: "ఓ హరీ! నీవు కపటివి! విశ్వమోహనుడవు! పరుల ఉత్సాహాన్ని సహించే గుణం నీలో లేదు. నువ్వుమాయావివి. మలినాశయుడవు. పూర్వం మోహినీ రూపంలో అసురులకు అమృతం దక్కకుండ చేశావు. క్షీర సాగర మథన సమయంలో కాలకూటాన్ని నీలంకంఠుడు భక్షించకుండ ఉంటే నీ పీడ లోకాలకు విరగడై ఉండేది. అంతే కాదు ఆయన నిన్ను స్వతంత్రునిగా నియమించాడు. విప్రుడనైన నన్ను పరిహాస పాత్రుణ్ణి చేశావు. నీకిది తగని పని. ఇట్టిపని తిరిగి చెయ్యకుండ నీకు తగిన శిక్ష విధిస్తాను. నువ్వు భూలోకంలో మనుష్యుడవై జన్మించి నాలాగే స్త్రీ వ్యామోహం తోను, వియోగంతోను బాధ పడతావు. వానరులు నీకు సహాయకారులవుతారు. ఆ జన్మలో తరచుగా అజ్ఞాన మోహితుడవై ఉంటావు."

విష్ణువు పుట్టుక లేని శివమాయను ప్రశంసించి నారదుని శాపాన్ని రాగ ద్వేషాదులు లేకుండ స్వీకరించాడు. వెంటనే శివమాయ తొలగింది. నారదుడు ఎప్పటి లాగానే తిరిగి జ్ఞానమూర్తి అయ్యాడు. జ్ఞానోదయం కాగానే పూర్వగాథంతా స్మృతికి వచ్చి పశ్చాత్తాప తప్తుడై, తనను తాను నిందించుకొని, శివమాయను ప్రశంసించి విష్ణువు పాదాలపై పడి ఇలా అన్నాడు: "హే ప్రభో! దుర్బుద్ధితో దుష్ట వచనాలను పలికాను. పైగా శపించాను. నాకు నరకం నిశ్చయం. నేను నీకు దాసుణ్ణి! ఈ నరకాన్ని తప్పించుకొనే ఉపాయం చెప్పండి."

అంత విష్ణువు నారదుని పైకి లేపి శిరసు నిమిరి కరుణతో ఇలా అన్నాడు: "వత్సా! దుఃఖింపకు. నువ్వు నా భక్తులలో శ్రేష్ఠుడవు! నా కిష్టుడవు! నీకు నరకం సంప్రాప్తం కాదు. శివుడు నీకు సర్వ మంగళాలను అనుగ్రహిస్తాడు. అంతా శివేచ్ఛయే. ఆయన యే పరబ్రహ్మ. పరమాత్మ. సచ్చిదానంద స్వరూపుడు. ఆయనే త్రిమూర్తుల రూపంలో ఉంటాడు. ఆయన సర్వ సాక్షి. నీకు సర్వపాప క్షయము, భుక్తి, ముక్తి దాయకము ఐన ఉపాయాన్ని చెపుతాను! విను! నువ్వు సర్వదా శివుని యశస్సుని గానం చెయ్యి. వారణాశీ నగరానికి వెళ్ళి విశ్వేశ్వరుణ్ణి సందర్శించు. మృత్యంజయుని గుణగణాలను గానం చెయ్యి. అక్కడ నీకన్నీ శుభాలే కలుగుతాయి. ఆపై నా ఆజ్ఞను సారంగా బ్రహ్మ లోకానికి వెళ్ళి నీ తండ్రి ఐన బ్రహ్మను సందర్శించు. ఆయన నీకు శివ మహాత్మ్యాన్ని చెపుతాడు. నీ దురితాలన్నీ క్షయ మవుతాయి."

**నారదుడు తండ్రిని ప్రశ్నించుట**

మునులతో సూత మహర్షి ఇలా అంటున్నాడు: "మునులారా! విష్ణువు యొక్క ఉపదేశాను సారంగా నారద మహర్షి భూలోకంలో గల శైవ క్షేత్రాలన్నింటిని ప్రీతితో సందర్శిస్తూ, ఆ క్షేత్ర మహిమలను విని పరవశిస్తూ, గానం చేస్తూ కాశీ నగరానికి వచ్చి చేరాడు. దివ్యజ్ఞాని యైన నారదుడు భూలోకంలో శివక్షేత్ర దర్శనం చేస్తున్నాడని విని ఆ రుద్రానుయాయు లైన బ్రాహ్మణు లిద్దరూ కాశీక్షేత్రంలో నారదుని కలిశారు. కలిసి దేవమునికి తలవంచి నమస్కరించి, పాదాలను పట్టుకొని, అనుగ్రహంతో శాప విముక్తిని ప్రసాదించ వలసిందని కోరేరు.

నారదుడు కూడా వారిద్దరి యందు ఆదరం కలవాడై "ఓ మహదేవాను చరులారా! మీరు సత్పురుషులు. అంతా శివేచ్ఛ. నన్ను కూడా మీరు క్షమించ వలసి ఉంటుంది. నా శాపం ఇలా ఫలిస్తుంది. మీరొక ముని శ్రేష్ఠుని బిడ్డలై పుట్టి బలశౌర్యప్రతాప యశోవిరాజితులై రాక్షస ప్రభువు లవుతారు. శివభక్తులై విష్ణువు చేతిలో హతులవుతారు. తిరిగి మీలోకాన్ని చేరుకుంటారు." – అని శాపమోక్షాన్ని అనుగ్రహించాడు. నారదుని ఆదర వాక్కులకు సంతసించి రుద్రానుచరులు తమ స్వస్థానానికి తిరిగి వెళ్ళారు.

నారదుడు కూడా కాశీ నగరంలో అన్ని స్థలాలను సందర్శించి గంగాతీర స్నానఘట్టాలలో తీర్థస్నానం చేసి విశ్వేశ్వరుని సందర్శించి నోరార కీర్తించి, పరమానందంతో శివ తత్త్వాన్ని తెలియ గోరి బ్రహ్మలోకాన్ని చేరుకొన్నాడు. బ్రహ్మను దర్శించి, స్తుతించి శివతత్త్వాన్ని గూర్చి ఇలా అడిగాడు; "హే! తండ్రీ! నీవు స్రష్టవు! నేను గతంలో నీ అనుగ్రహంతో విష్ణు కథలను విన్నాను. ఇప్పుడు శివ గాథలను, శివ తత్త్వాన్ని గూర్చి చెప్పండి. శివుడు

సగుణుడు, నిర్గుణుడు ఎలా అయ్యాడు? సృష్టి, స్థితి, ప్రళయ కాలముల యందు ఆయన లీలా విలాసం ఎలా ఉంటుంది? ఆయనెలా ప్రసన్నుడవుతాడు? ఆయనే ఫలాల నిస్తాడు? త్రిమూర్తుల పుట్టుకను, ఉమ యొక్క ఆవిర్భావాన్ని, వివాహ గాథను, గార్హస్థ్య జీవితాన్ని ఇతర గాథలను చెప్పండి.

**విష్ణువు జన్మించుట**

నారదుని మాటలను విన్న పితామహుడు లోకహితాన్ని కోరి, ప్రశ్నించిన నారదునికి ఇలా చెప్ప సాగేడు. కుమారా! నువ్వు లోకోపకారాన్ని కోరి ప్రశ్నించావు. విను. ఇది సర్వోత్కృష్టమైనది. ఆదిలో (సృష్టికి ముందు) అంతా అంధకార బంధురంగా ఉండేది. సూర్య, చంద్ర, గ్రహ, నక్షత్ర సప్తర్షి మండలాదు లేవీ లేవు. పంచ భూతములు లేవు. దిక్కులు లేవు. కాలం లేదు. వేదంలో 'తత్సద్బ్రహ్మ' అనే వాక్యంచే ప్రతిపాదింప బడిన 'సత్' ఒక్కటి మాత్రమే ఉండేది. ఆ పరబ్రహ్మ స్వరూపాన్ని యోగులు హృదయాకాశంలో సర్వదా దర్శిస్తారు.

అది మూర్తము కాదు, అమూర్తము కాదు. వాక్కుకు అందే విషయం కాదు. మనస్సుకు అందేది కాదు. దానికి నామ రూపాదులు లేవు. దానికే వర్ణం (రంగు, బ్రాహ్మణాది భేదాలు) లేదు. స్థూల సూక్ష్మాది భేదాలు లేవు. అది దృష్టం కాదు– అదృష్టమూ కాదు. అది సత్యము– జ్ఞానము– అనంతమూను. పరమానంద ఘనము, పరంజ్యోతి స్వరూపము ఐన దానిని గూర్చి శ్రుతి 'అస్తి' (ఉన్నది) అని మాత్రమే చెప్పగలుగుతోంది. కుమారా! నారదా! వేదమే చెప్ప లేని దానిని మనమెలా చెప్పగలం?

అది పొడుగూ కాదు– పొట్టి కాదు. అది పెరగదు తరగదు. దానికి చావు– పుట్టుకలు లేవు. అది ఏ ప్రమాణాలకు అందదు. అది స్వతంత్రమైనది. దానికి ఏ ఆధారం లేదు. అది ఏ పరిణామం చెందదు. దానికి ఆకారం లేదు. అది వికల్పాలు, వికారాలు లేనిది. దానికి గుణాలు లేవు. అది లేనిది– ఉన్నది కూడాను. అది దూరము కాదు–దగ్గర కాదు. అది మాయతీతమైనది. దానికి ఆద్యంతాలు లేవు. దానికంటె భిన్నమైన ద్వితీయ వస్తువు లేదు. ఈ విధంగా పరబ్రహ్మమును గురించి స్వరూప తటస్థ లక్షణాలు మాత్రమే ఊహింప బడతాయి. అది చైతన్య ఘనం.

కుమారా! అట్టి పరమాత్మకు ద్వైతంలో కోరిక కలిగింది. నిరాకారుడైన ఆ పరమాత్మ తన లీలచే సర్వైశ్వర్య గుణోపేతము, సర్వజ్ఞాన యుతము, సర్వ మంగళకరము ఐన స్వీయమూర్తిని కల్పించాడు. లీల అంటే తన కంటే వేరైనది అని అర్థం కాదు. ప్రవాహ

రూపమైనది అని అర్థం. అలా కల్పింప బడిన మూర్తియే ప్రధానము, ప్రకృతి, మాయ, త్రిగుణాత్మిక, పరాశక్తి, సమష్టి బుద్ధి తత్త్వానికి జనని, వికృతి వర్జిత, అంబిక, ఈశ్వరి, త్రిదేవ జనని, నిత్య ఇలా అనేక నామాలతో వ్యవహరింప బడుతూ ఉంది. ఆమెయే సర్వ రూపాలను ధరించి సర్వమును చూస్తూ సర్వమును చేస్తూ ఉంటుంది. ఆమె సర్వారాధ్య. సర్వ సంస్కృతులకు మూలం ఆమెయే.

అద్వితీయము, ఆద్యంత రహితము, సర్వవ్యాపకము ఐన ఆ పరబ్రహ్మము యొక్క మూర్తియే సదాశివుడు. సదాశివుడు కల్పించిన మూర్తియే పరాశక్తి లేక ఈశ్వరి.

కుమారా! త్రిమూర్తులకు సైతం తల్లి ఐన ఆ పరాశక్తి ఎనిమిది భుజాలు కలిగి ఉంటుంది. ప్రసన్న వదన. ఆమె ముఖం అనంతకోటి పూర్ణిమా చంద్రుల వెన్నెల వెలుగులతో నిత్యమూ ప్రకాశిస్తూ ఉంటుంది. పరిపూర్ణంగా వికసించిన పద్మాల శోభను ధిక్కరించే ఆమె నేత్రాలు, కరుణారస తరంగితమైన దృక్కులు భక్తుల హృదయాలను ఆహ్లాద పరస్తూనే ఉంటాయి.

ఇక సదాశివుని తలపై మందాకిని. ఆయన బాలచంద్ర ధారి. మూడు కన్నులు, ఐదు ముఖాలు, పది చేతులు కలవాడు. త్రిశూలధారి. ఆయన భస్మోద్ధూళిత ధూసరాంగుడు. ఆ సదాశివుడు శక్తితో కలిసి శివలోకం అనే క్షేత్రాన్ని నిర్మించాడు. ఆ ఉత్తమ క్షేత్రానికి 'కాశి' అని పేరు. అది సర్వ శ్రేష్ఠమైన మోక్షపురి. పార్వతీ పరమేశ్వరులు ప్రలయ కాలంలో కూడా ఆ క్షేత్రాన్ని ఏనాడూ విడువరు. అందువల్లనే దానికి అవిముక్తము అని పేరు. భక్తులకు ఆనందాన్నిస్తుంది కనుక ఆనందవనమని పేరు.

ఆ విధంగా పార్వతీ పరమేశ్వరులు ఆ ఆనంద వనంలో పరమానంద భరితులై రమిస్తూండగా మరియొక పురుషుని సృష్టించి వానియందు సృష్టి భారాన్నుంచి మనమిద్దరము సుఖింతము గాక! అనే కోరిక వారిద్దరికి కలిగింది. ఆ పురుషుడు నా అనుగ్రహం చేతనే సర్వమును సృజించి ప్రళయకాలము నందు సర్వమును ఉపసంహరించు గాక! అని సంకల్పించి తన ఎడమ భాగమునందు అమృతాన్ని చిలికించగా అప్పుడు త్రిలోక సుందరుడైన పురుషుడు ఆవిర్భవించాడు. అతడు శాంతుడు. సత్త్వగుణ ప్రధానుడు. గాంభీర్యుడు. క్షమాయుక్తుడు. ఇంద్రనీల ద్యుతి సన్నిభుడు. పుండరీకాక్షుడు. సువర్ణ పీతాంబర ధారి.

అలా ఆవిర్భవించిన ఆ పురుషుడు శంభునకు నమస్కరించి "స్వామీ నాకు నామ సంస్కారాన్ని చేసి కర్తవ్యాన్ని కూడా ఆదేశించండి" అని కోరగా శివుడిలా అన్నాడు. "కుమారా!

సర్వ వ్యాపకుడవైన కారణంగా నీకు 'విష్ణువు' అనే నామం విఖ్యాతి చెందగలదు. భక్తులకు ఆనందాన్నిస్తావు. ఆ కారణంగా అనేక నామాలు నీకు కలుగుతాయి. నువ్వు దృఢ చిత్తంతో తపస్సు చెయ్యి. నీకు కర్తవ్యం బోధపడుతుంది." అనంతరం శివుడు నిశ్వాసం చేత వేదాన్ని విష్ణువుకిచ్చి అంతర్ధానమయ్యాడు. శివలోకం కూడా అంతర్ధానమైంది.

శివాజ్ఞ ననుసరించి అచ్యుతుడు పన్నెండు వేల దివ్య సంవత్సరాలు కఠోర తపస్సు చేసినా శివ సాక్షాత్కారం కాలేదు. కర్తవ్యం తెలియ లేదు. విష్ణువు సంశయాపన్నుడై ఆదరంతో శివుణ్ణే స్మరిస్తూ కర్తవ్యాన్ని గురించి చింతిస్తూండగా శివుని నుండి "సంశయ నివారణార్థం మరల తపశ్చర్యకు పూనుకోవలసింది" అనే అంతర్వాణి వినవచ్చింది. ఆత్మబోధ ననుసరించి విష్ణువు పరబ్రహ్మను సంధానంతో ఘోరతపస్సాచరించాడు. అనేకవేల సంవత్సరాల తర్వాత, విష్ణువు ధ్యానమార్గంనుండి బయటకు వచ్చి శివునిమహిమను స్మరించి ప్రీతిని, విస్మయాన్ని పొందాడు. ఆ సమయంలో అత్యంత అద్భుతమైన రీతిలో శివమాయా ప్రభావంచే అతని శరీరంనుండి అనంత జల ధారలు బయటికి వచ్చాయి.

సర్వము జలమయమైంది. తపస్సుచే పరిశ్రాంతుడైన విష్ణువు మోహితుడై జలాల పైన యోగనిద్రను పొందాడు. శ్రుతి సమ్మతమైన నారాయణశబ్దం విష్ణువుకు ఆ కారణంగానే కలిగింది. ఆ పురుషుడు తక్క తక్కిన ప్రకృతి వికారాలేమీ అప్పుడు లేవు. ఆ సమయంలోనే ఆ పుణ్యపురుషుని నుండి వివిధ తత్త్వాలు వ్యక్తమైనాయి. పురుషుని నుండి ప్రకృతి, ప్రకృతి నుండి మహత్తు, దాని నుండి సత్త్వరజస్తమో గుణాలు పుట్టాయి. ఈ గుణ భేదంచే మూడు విధాలైన అహంకారం, దాని నుండి పంచతన్మాత్రలు, దాని నుండి పంచ స్థూల భూతాలు, దాని నుండి పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు పుట్టాయి. "నారదా! విను ఆ పుణ్యపురుషుడు తక్క ప్రకృతి నుండి పుట్టిన తత్త్వాలన్ని జడములే. విష్ణువు ఈ ఇరవై నాలుగు తత్త్వాలను ఏకం చేసి దానిని శివుని ఇచ్ఛచే తన ఆంతర్యంలో ఉంచుకొని పరబ్రహ్మ స్వరూపమైన జలములపైనే యోగనిద్రాపరవశుడై నిద్రించాడు."

**విష్ణు బ్రహ్మల వివాదం**

బ్రహ్మగారు నారదునికి చెప్పిన విషయాన్ని సూతుడు మహర్షులకిలా చెప్పసాగేడు. "మునులారా! నారాయణుడు ఆ విధంగా యోగనిద్రా పరవశుడు కాగానే శంకర సంకల్పానుసారంగా అతని నాభినుండి అసంఖ్యాక నాళములుగలిగి అనంతకోటి విస్తీర్ణమైన ఒక మహాపద్మం ఆవిర్భవించింది. అది ప్రాకృత తత్త్వాలన్నింటితో కూడి మహాజ్యోతి స్వరూపంగా దివ్య ప్రకాశమానంగా

ఉంది. అప్పుడు పరమేశ్వరుడైన శంకరుడు తన దేహంయొక్క కుడి భాగం నుండి బ్రహ్మగారిని సృష్టించి తన మాయచే ఆ నాభిపద్మం నుండి ఆవిర్భవింప జేశాడు. నాలుగు ముఖాలతో, ఎర్రని దేహంతో, త్రిపుండ్రాంకిత లలాటంతో ఆవిర్భవించిన హిరణ్యగర్భుడు మాయామోహితుడై తన జన్మ కారణాన్ని తెలుసుకోలేక సంశయగ్రస్తుడై ఇలా తలపోశాడు.

"నేనెవరిని? ఎక్కడ నుండి వచ్చాను? నేనెవరి కుమారుణ్ణి? నా కర్తవ్యం ఏమిటి? ఈ పద్మం ఎక్కడిది? కమల పత్రాలున్న చోట నా జన్మకారకుడుండక పోడు." ఈ విధంగా ఎంచి పితామహుడు పత్రాల మధ్య వంద సంవత్సరాలు పరిభ్రమించాడు. దాని ఆదిని తెలుసుకోలేక నాళాల మధ్య మరో వంద సంవత్సరాలు సంచరించాడు. ఇంతలో "తపస్సు చెయ్యి" అనే అంతర్వాణి ప్రబోధం ద్వారా తపశ్చర్యకు ఉపక్రమించాడు.

ఫలితంగా యోగముద్రా నిద్రాంకితుడైన నారాయణుడు దర్శనమిచ్చాడు. "నీవెవరవు" అని హస్తంతో తట్టి లేపిన హిరణ్యగర్భునితో ఆయనిలా అన్నాడు. "వత్సా! పితామహా! నీకు స్వాగతం! మహా ప్రకాశమానంగా ఉన్నావు. భయపడకు. నీ కోర్కెలన్నిటిని తీరుస్తాను. సృష్టికి మొదటి వాణ్ణినేనే. నా నాభి నుండి ఈ కమలం ఆవిర్భవించింది. ఆ కారణంగా నేను కమల నాభుణ్ణి! నువ్వు ఆ కమలం నుండి జన్మించిన కమలోద్భవుడవు. పరంజ్యోతి స్వరూపమైన పరమాత్మను నేను. నేనే పరబ్రహ్మను. అచ్యుతుణ్ణి! వేయేల ఈ సృష్టికి కర్తను నేనే!"

ఈ విధంగా స్వాగతం చెప్పిన నారాయణుని పల్కులకు కినిసి అహంకారంతో హిరణ్యగర్భుడు నేనే స్వయంభువును. నన్ను వేదం సనాతనుడని, అజుడని, స్వరాట్ అని, పరమేష్ఠి అని ఇంకా అనేక విధాలైన నామాలతో పిలుస్తోంది. అంటూ వివాదానికి తలపడ్డాడు. వాగ్యుద్ధం అస్త్రయుద్ధానికి దారి తీసింది. సృష్టి అల్లకల్లోలమైంది. విధి-మాధవు లిద్దరికి యథార్థాన్ని హితోపదేశం చెయ్యాలనే సంకల్పంతో శంభుడు లింగరూపంలో వారిమధ్య సాక్షాత్కరించాడు. మునులారా! ఆ లింగావిర్భావగాథను మీకు గతంలో వినిపించాను.

**శబ్దబ్రహ్మ**

సూతుడిలా అంటున్నాడు: "మునులారా! శబ్దబ్రహ్మ ఆవిర్భవించిన తీరును చెపుతున్నాను వినండి. అలా సాక్షాత్కరించిన లింగాన్ని చూచి వరాహ రూపంలో విష్ణువు, హంస రూపంలో బ్రహ్మ దాని ఆద్యంతాలను తెలుసుకొనాలనే ఇచ్ఛతో బయలు దేరి విఫలులై ఆ లింగాన్నే ప్రార్థించారు. శివానుగ్రహం వల్ల వారికి ఓం ఓం అనే స్పష్టమగు దీర్ఘమైన నాదం వినిపించింది. దక్షిణ భాగాన మొదటి వర్ణమైన అకారం,

ఉత్తరాన ఉకారం, మధ్యలో మకారం, అంతంలో ఓంకారం వినిపించాయి. అకారం సూర్యుడు, ఉకారం అగ్ని, మకారం చంద్రుడు. ఓంకారానికి పైన సచ్చిదానంద ఘనమైన పరబ్రహ్మతత్త్వం గోచరించింది. అకారం బ్రహ్మ. ఉకారం విష్ణువు. మకారం కంఠమందు నీల వర్ణము, ఇతరత్ర రక్త వర్ణము గల రుద్రుడు. అకారం సృష్టికర్త. ఉకారం మోహింప చేస్తుంది. మకారం అనుగ్రహాన్ని ఇస్తుంది. మకారం బీజి (బీజముకలవాడు) శివుడు. అకారం బీజం బ్రహ్మ. ఉకారం యోని విష్ణువు. మహేశ్వరుని యందు బీజి, బీజము, యోని ఐక్య మవుతాయి.

సృష్టి ప్రారంభంలో బీజి తన ఇచ్ఛచే తనను తాను విభజించుకొని, అకార–ఉకారాలతో కలిసి సువర్ణాండంగా అయింది. దాని లక్షణం అవిదితం. ఆ దివ్యమైన అండం నీటిలో వేల సంవత్సరాలు ఉండి ఈశ్వర సంకల్పం చేత రెండు ముక్కలైంది. పై భాగం (కపాలం) ద్యులోకం. క్రిందనున్న సగభాగం శబ్ద స్పర్శ రూప రసగంధాదులతో కూడిన పృథ్వి అయింది. ఆ అండం నుండే నాల్గు ముఖాలు గల బ్రహ్మ జన్మించాడు. కకారం ఆయన సంజ్ఞ. ఆయన సమస్త లోకాలను సృష్టించాడు. ఈ విధంగా ప్రభువైన మహేశ్వరుడు మూడు రూపాలను ధరించాడు. ఓం కారం పరమేశ్వరుని నిర్దేశిస్తున్నదని యజుర్వేదం అంటోంది. ఋగ్వేద, సామవేద మంత్రాలు కూడా ఆ ప్రతిపాదనను అంగీకరించాయి.

ఇంతలో బ్రహ్మ–విష్ణువు లిరువురు ఐదు ముఖాలు, పది భుజాలు గల పరమేశ్వర స్వరూపాన్ని చూచారు. నాద రూపుడైన ఈశ్వరుడు తన తత్త్వాన్ని తానే ప్రకటించాడు. మునులారా! ఆ స్వరూపాన్ని వివరిస్తాను వినండి. అకారం పరమేశ్వరుని శిరస్సు. ఆకారం లలాటమూను. ఇకారం కుడికన్ను. ఈకారం ఎడమ కన్ను. ఉకారం కుడి చెవి. ఊకారం ఎడమ చెవి. ఋకారం కుడి చెక్కిలి. ౠకారం ఎడమ చెక్కిలి. ఌ, ౡ కారాలు నాసా రంధ్రాలు. ఏకారం పై పెదవి. ఐకారం క్రింది పెదవి. ఓ కారం మరియు ఔకారం దంత పంక్తిద్వయం. అం, అః ఇవి తాలుస్థానాలు.

కవర్గులోని ఐదు అక్షరాలు ఐదు కుడిచేతులు. చవర్గులోని ఐదు అక్షరాలు ఐదు ఎడమ చేతులు. టవర్గ తవర్గులోని అక్షరాలు పది పాదముల వ్రేళ్ళు. పకారం ఉదరం, ఫకారం కుడి పార్శ్వం. బకారం ఎడమ పార్శ్వం. భకారం స్కంధం. మకారం హృదయం. యకారం మొదలు సకారం వరకు ఏడు అక్షరాలు సప్త ధాతువులు (రక్త, మజ్జ, మాంసాదులు). హకారం నాభి. క్షకారం ఘ్రాణేంద్రియం. నాదశరీరుడైన శివుని నుండి బ్రహ్మ విష్ణువు లిద్దరు ఐదు కళలు గలిగి, శుద్ధ స్ఫటిక సంకాశమైన ముప్పై ఎనిమిది అక్షరాలు గల

మంత్రోపదేశాన్ని పొందారు. ఆపై బుద్ధిరూపమైన, సర్వధర్మార్థ సాధకమైన, జయహేతువైన ఇరవై నాలుగు అక్షరాలు గల సర్వశ్రేష్ఠమైన గాయత్రీ మంత్రోపదేశాన్ని పొందారు. ఆపై ఎనిమిది కళలతో కూడి శత్రుసంహారం చేసే ముప్పై వర్ణాలు గల మంత్రాన్ని ఉపదేశం పొందారు. ఆపై మృత్యుంజయ, పంచాక్షరి, చింతామణి, దక్షిణామూర్తి మంత్రాలను పొందేరు. 'తత్త్వమసి' అనే మహా వాక్యాన్ని చివరగా శివుని నోటి నుండి ఉపదేశాన్ని పొంది బ్రహ్మ, విష్ణువు లిద్దరు కృతార్థులయ్యారు. కృతజ్ఞతలతో స్తుతించారు.

వారి స్తోత్రానికి ప్రసన్నుడైన శివుడు, విష్ణువుకు వేదాన్ని శ్వాస ద్వారా ఉపదేశించాడు. అంత వారిద్దరు శివ పూజా విధానాన్ని, ధ్యాన పద్ధతిని, కర్తవ్యోప దేశాన్ని చెయ్యవలసిందని కోరగా శివుడిలా ఉపదేశించాడు.

**శివ తత్త్వం**

"కుమారులారా! ఇపుడావిర్భవించిన లింగానికి ప్రతిరూపంగా ప్రయత్న పూర్వకంగా లింగాన్ని నిర్మించి లింగపూజ చెయ్యండి. నిర్గుణ పరబ్రహ్మను నేనే. ఐనా సృష్టి స్థితి లయ కార్యములను నిర్వహించే నిమిత్తం బ్రహ్మ విష్ణు రుద్ర రూపాలలో అవతరించాను. ఓ పితామహా! నీ లలాటం నుండి నేను రుద్ర రూపంలో ఆవిర్భవిస్తాను. ఆ రుద్రునకు నాకు భేదం లేదు. మీరు ప్రకృతి నుండి జన్మించారు. కాని రుద్రుడు ప్రకృతి నుండి ఉద్భవించడు. రుద్రుడు తామసుడని అంటారు. గుణభేదం నామ రూపాదులందు మాత్రమే ఉంటుంది. తత్త్వంలో ఉండదు. ప్రకృతి వికారమైన అహంకారం మాత్రమే తామసం. రుద్రుడు తామసుడు కానే కాదు. ఓ బ్రహ్మా! నువ్వు సృష్టిని చెయ్యి. ఓ విష్ణు! నువ్వు పాలించు. నా అంశ ఐన రుద్రుడు లయ కార్యాన్ని నెరవేరుస్తాడు.

ఇదిగో! ఈమె పరమేశ్వరి ఐన ఉమాదేవి. ఈమెయే ప్రకృతి! ఈమె నుండి ఒక శక్తి ఉద్భవించి వాగ్దేవీ నామంతో బ్రహ్మకు సృష్టి కార్యంలో సహాయకారి కాగలదు. అలాగే మరొక శక్తి లక్ష్మీరూపంలో విష్ణువుకు సహాయకారి కాగలదు. మరొక శక్తి కాళి అనునామంతో రుద్రునికి తోడుగా ఉంటుంది.

**పరమ శివతత్త్వం బ్రహ్మ మానం**

హే విష్ణో! బ్రహ్మకు అన్నిట సహాయ కారిగా ఉండు. నీకు నే సహాయకారిగా ఉంటాను. నువ్వు స్థితి కార్యంలో అనేక అవతారాలెత్తి నీ కీర్తిని విస్తరించుకో! లోక రక్షణ తత్పరుడవై వర్ధిల్లు. మనిద్దరికి భేదం లేదు. భేదదృష్టి గలవారికి నరకం తప్పదు. ధనాన్ని, ధనం వల్ల వచ్చే భోగ, భాగ్య, రాజ్యాధికారాలను కోరే వారు నిన్నాశ్రయిస్తారు. పరిశుద్ధమైన జ్ఞానాన్ని కోరే

పరమహంసలు నన్నాశ్రయిస్తారు. సారూప్య ముక్తి నీ అధీనం. ఆత్యంతిక దుఃఖ నివృత్తి రూపమైన, పునరావృత్తి రహితమైన పరబ్రహ్మైక్యం నా అధీనం. అంతే భేదం.

ఇప్పుడు త్రిమూర్తుల ఆయుర్దాయాన్ని చెపుతాను వినండి. మానవ కాలమాన రీత్యా వేయి మహా యుగాలు బ్రహ్మకు ఒక పగలు. అంతే కాలం అతనికి ఒక రాత్రి. రెండూ కలిసి ఒక రోజు. అలాటి ముప్పై రోజులు ఒక నెల. పన్నెండు నెలలు సంవత్సరం. అలాటి వంద సంవత్సరాలు బ్రహ్మ యొక్క ఆయువు.

బ్రహ్మ యొక్క ఒక సంవత్సరం విష్ణువుకు ఒక రోజు. ఈ లెక్కలో విష్ణువుకు వంద సంవత్సరాలు ఆయుర్దాయం. విష్ణువు యొక్క సంవత్సరం రుద్రునకు రోజు. ఆ లెక్కలో వంద సంవత్సరాలు రుద్రునికి ఆయుర్దాయం. రుద్రుని వంద సంవత్సరాల ఆయుర్దాయం సదా శివునికి ఒక ఉచ్ఛ్వాశతో సమానం.

మానవుడు మొదలుగా రుద్రుని వరకు సకల ప్రాణికోట్లకు 21,600 ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఒకరోజు. ఆరు ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఒక పలము. అరవై పలములు ఒక ఘటి. అరవై ఘటులు ఒక రోజు. నా ఉచ్ఛ్వాస నిశ్వాసలకు లెక్క లేదు. అందువల్ల నేను అక్షయుణ్ణి.

నా ఆజ్ఞ ప్రకారం మీరిద్దరు మీమీ గుణములను ఆశ్రయించి మీమీ కార్యముల యందు ప్రవర్తించండి. అని ఉపదేశించి శివుడు అంతర్హితుడయ్యాడు.

## రుద్రావతారావిర్భావం

సూత మహర్షి మునులతో ఇలా అంటున్నాడు: "మునులారా! నేనింతవరకు నారద మహర్షి, తన తండ్రిగారైన బ్రహ్మను కోరగా ఆయన చేసిన ప్రసంగాన్నే చెపుతూ వచ్చాను. ఆ ప్రసంగం ఇంకా ఉంది. వినండి! లింగోద్భవం జరిగిన తదుపరి వృత్తాంతాన్ని చెప్పమని నారదుడు కోరగా పితామహుడిలా వివరించాడు. ఆ విషయాన్ని వినండి. అలా శివుడు అంతర్హితుడు కాగానే బ్రహ్మ హంసరూపాన్ని, విష్ణువు వరాహ రూపాన్ని ఉపసంహరించుకొన్నారు. హంస నిశ్చలంగా పైకి ఎగరగలదు. పాలను నీటిని వేరు చేయగలదు. తత్త్వాన్ని అతత్త్వాన్ని వేరు చేయగల సామర్థ్యం కొరకు బ్రహ్మ హంస రూపాన్ని ధరించాడు. వరాహం క్రిందికి దూసుకు పోగలదు. ఆ కారణంగాను తన పేరుతో కల్ప వ్యవస్థను స్థాపించాలనే సంకల్పంతోను విష్ణువు వరాహ రూపాన్ని ధరించాడు.

శివుని ఆజ్ఞానుసారం హిరణ్యగర్భుడు సృష్టి కార్యానికి సంకల్పించి పూర్వం సృష్టింపబడిన దివ్య జలాలను దోసిలితో గ్రహించాడు. ఆ జలాలలో ఇరవై నాలుగు

తత్త్వాలతో కూడిన అండాకారం గోచరించింది. దానిలో జడత్వమే కాని చైతన్యం కానరాలేదు. శంకతోను, విచారంతోను విష్ణువును గూర్చి తపస్సు చేయగా ఆయన ప్రత్యక్షమయ్యాడు. బ్రహ్మ గారాయనతో ఈ అండాన్ని చైతన్య పూరితం చెయ్య వలసిందని కోరగా శంభు వరప్రసాదంచే సర్వవ్యాపకుడైన విష్ణువు అనంత రూపంతో అందులో ప్రవేశించాడు. వెంటనే అది చేతన సహితమైంది.

మహర్షులారా! బ్రహ్మగారు చేసిన సృష్టి క్రమాన్ని వివరిస్తున్నాను. వినండి! ముందుగా తమోగుణ ప్రధానము, పంచ అవిద్యలతో కూడినది ఐన వృక్ష లతాది రూపమైన సర్గాన్ని సృష్టించాడు. తిరిగి శివుని ధ్యానించి గత సృష్టి పురుషార్థ సాధకం కాదని ఎరిగి పశు పక్ష్యాదులతో కూడిన (తిర్యక్ స్రోతస్సు) దుఃఖ బహుళమైన సర్గ సృష్టిని చేశాడు. అది కూడా పురుషార్థ సాధకం కాదని ఎరిగి సత్త్వగుణ ప్రధానము, ఊర్ధ్వ స్రోతస్సు అను పేరు గలది, సత్యగుణము కలది, మిక్కిలి సుఖాన్ని ఇచ్చేది ఐన దేవ సర్గ సృష్టిని చేశాడు. అది కూడా పురుషార్థ సాధకం కాదని ఎరిగి సర్వజ్ఞుడైన శివుని స్మరించి ఆయన ఆజ్ఞచే అర్వాక్ స్రోతస్సు అని ఖ్యాతి గాంచిన దానిని, పురుషార్థ సాధకమైన దానిని, రజోగుణ ప్రధానమైన మానవ సర్గ సృష్టిని చేశాడు. తరువాత శివాజ్ఞచే భూత గణాలను సృష్టించాడు. ఈ విధంగా సృష్టి ఐదు విధాలుగా ఉంది. మరియు ప్రకృతి నుండి మూడు సర్గములు బయలు దేరినాయి. మొదటిది మహత్ (సమష్టి బుద్ధి) సర్గం. రెండవది భూత సూక్ష్మముల సృష్టి. మూడవది పాంచ భౌతిక (వైకారిక) సృష్టి. మొత్తం ఎనిమిది విధాలైన సర్గ సృష్టులు ఉన్నాయి.

తొమ్మిదవది కౌమార సర్గం. ఇందులో ప్రాకృత వైకృత భేధాలున్నాయి. గొప్ప వైరాగ్య సంపన్నులు, దృఢ వ్రతులు, సహజ జ్ఞానులు, శివ ధ్యానైక మానసులు, సంసార విముఖులు ఐన సనక సనందనాది మహర్షుల సృష్టి ఈ కౌమార సర్గం లోనిదే. సంసారమునందు విముఖులై వారు బ్రహ్మ వాక్కును తిరస్కరించారు.

వారిచ్చిన ప్రతివచనాన్ని విన్న పితామహుడు మోహాన్ని క్రోధాన్ని కూడా పొందాడు. ఆ సమయంలో ఆయన కండ్ల నుండి జలజల కన్నీళ్ళు రాలేయి. వెంటనే విష్ణువును స్మరింపగా ఆయన సాక్షాత్కరించి శివుని గూర్చి తపస్సు చెయ్యమని కర్తవ్య బోధ చేశాడు. తపస్సు చేస్తూండగా కనుబొమల నడుమ అవిముక్త స్థానం నుండి పరమేశ్వరుడు పూర్ణాంశతో అర్ధనారీశ్వర స్వరూపుడై సాక్షాత్కరించాడు. ఆయనకు మహా భక్తితో నమస్కరించి వివిధ ప్రజలను సృష్టించమని కోరగా రుద్రుడు రుద్ర గణాలను సృష్టించాడు. తిరిగి ప్రజలను

జన్మ, మృత్యు భయం కలవారిగా సృజించమని కోరగా మహాదేవుడిలా అన్నాడు. "ఓ బ్రహ్మా! జనన మరణ భయ పీడితులు, శోభా హీనులు, కర్మ వశులు, దుఃఖమగ్నులు ఐన ప్రజలను నేను సృజించను. నేను గురుస్థానంలో ఉండి అలాటి వారికి జ్ఞానాన్నిచ్చి ఉద్ధరిస్తాను. అలాటి ప్రజలను నీవే సృజించు. నీకు మాయా బంధం ఉండదు." ఇలా చెప్పి హరుడు అంతర్ధాన మయ్యాడు.

**సృష్టి వర్ణనం**

మునులారా! పితామహుడు చేసిన సృష్టిక్రమాన్ని వివరంగా చెపుతున్నాను వినండి అని ఈ విధంగా సూతుడు చెప్ప సాగేడు. బ్రహ్మగారు శబ్ద స్పర్శ రూప రస గంధాదుల సూక్ష్మ భూతాలను పంచీకరణం చేసి వాటి నుండి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి అనే ఐదు స్థూల భూతాలను సృష్టించాడు. లిప్త మొదలుగా యుగం వరకు కాలాన్ని సృష్టించాడు. స్థావర జంగమాత్మకమైన సృష్టిని, జనన మరణాలు గల ప్రాణులను సృష్టించాడు. ఋషులను సృష్టించాడు. కళ్ళ నుండి మరీచిని, హృదయం నుండి భృగుని, శిరస్సు నుండి అంగిరసుని, వ్యానం నుండి పులహుని, ఉదానం నుండి పులస్త్యుని, సమానము నుండి వసిష్ఠుని, అపానం నుండి క్రతువును, చెవుల నుండి అత్రిని, ప్రాణం నుండి దక్షుని, తొడ నుండి నారదుని, నీడ నుండి కర్దమ మహర్షిని, సంకల్పం నుండి సర్వ సాధనములకు సాధనమైన ధర్మమును సృష్టించాడు.

మునులారా! సంకల్పం నుండి పుట్టిన ధర్ముడు మానవ రూపాన్ని పొందగా సృష్టి సాధకులు దానిని ప్రవర్తింప చేశారు. ఇంకా బ్రహ్మగారి దేహం నుండి లెక్కలేనంత మంది దేవదానవులుద్భవించారు. అటు పిమ్మట అంతర్యామి ఐన శంకరునిచే ప్రేరేపింపబడి తన దేహాన్ని రెండుగా చేసి రెండురూపాలను ధరించాడు. అందులో సగభాగం స్త్రీ సగభాగం పురుషుడు. వీరిద్దరి మధ్య భేదం లేదు. ఆ పురుషుడు ఆ స్త్రీ యందు ఉత్తమమైన జంటను సృష్టించాడు. ఆ జంటలోని పురుషుడు స్వాయంభువ మనువు. స్త్రీ శతరూప. ఆమె యోగిని మరియు తపస్విని. అపురూప సుందరి ఐన ఆమెను మనువు విధివిధానంగా వివాహమాడి స్త్రీసంపర్క జనితమైన సృష్టిని చేశాడు. ఆ జంటకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే కుమారులు ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే పేర్లుగల ముగ్గురు కుమార్తెలు కలిగారు.

ఆకూతిని రుచికి, దేవహూతిని కర్దమునికి, ప్రసూతిని దక్షునకు ఇచ్చి వివాహం చేశారు. వారిలో ప్రసూతి యొక్క సంతానం భూమండల మంతా వ్యాప్తి చెందింది. కర్దమునకు దేవహూతి యందు చాలామంది కుమారులు కలిగారు. దక్షునకు ఇరవైనలుగురు కుమార్తెలు

జన్మించారు. వారిలో శ్రద్ధ, లక్ష్మి, ధృతి, తుష్టి, పుష్టి, మేధ, క్రియ, వసువు, బుద్ధి, లజ్జ, శాంతి, సిద్ధి, కీర్తి ఈ నామాలు గల పదముగ్గురుని ధర్మునకిచ్చి వివాహం జరిపించారు. వారికంటె చిన్నవారైన ఖ్యాతిని భృగువు, సతిని భవుడు, సంభూతిని మరీచి, స్మృతిని అంగిరస్సు ప్రీతిని పులస్త్యుడు, క్షమను పులహుడు, సన్నతిని క్రతువు, అనూరూపను అత్రి, ఊర్జను వసిష్ఠుడు, స్వాహాదేవిని అగ్ని, స్వధా దేవిని పితరులు వివాహ మాడారు. వీరి సంతానంతో భూలోకమంతా నిండింది.

మునులారా! ఈ విధంగా పార్వతీపతి ఆజ్ఞానుసారం, ప్రాణుల కర్మానుసారంగా అనంతంగా జీవులుత్పన్నమైనారు. మరో కల్పంలో దక్షునకు అరవై మంది స్త్రీ సంతానమని చెప్పబడింది. వారిలో పది మందిని ధర్మునకు, ఇరవై ఏడుమందిని చంద్రునకు, కశ్యపునకు పదముగ్గురిని ఇచ్చి దక్షుడు వేదోక్తంగా వివాహం జరిపించాడు. నలుగురు కన్యలను తార్క్ష్యునకు; భృగువు, అంగిరస్సు, కృశాశ్వులకు ఇద్దరిద్దరు కన్యలను ఇచ్చాడు. ఆ దంపతుల ద్వారా స్థావర జంగ మాత్మకమైన ఈ సృష్టి విస్తారంగా వర్ధిల్లింది. దేవతలు, దైత్యులు, ఋషులు, వృక్షములు, పక్షులు, పర్వతాలు, లతలు మొదలైన సృష్టిచేత పాతాళం మొదలుగా సత్యలోకం వరకు నిండిపోయింది.

పూర్వం శంభునిచే తపస్సు కొరకు నిర్మింపబడిన సతిని రుద్రుడు ఎల్లప్పుడు త్రిశూలపు కొనయందుంచి రక్షించాడు. లోక కళ్యాణాన్ని కోరి ఆమెయే భక్తరక్షణార్థం దక్షుని కుమార్తెగా జన్మించి తన లీలా వైభవాలను చూపింది. సతీదేవి సత్త్వ స్వరూపురాలు. సరస్వతి రజోగుణ ప్రధాన, లక్ష్మి తమోమయి. సతీదేవి శంకరుని వివాహమాడి దక్షయజ్ఞంలో శరీరత్యాగం చేసి, దేవతా ప్రార్థన నంగీకరించి పార్వతిగా జన్మించి తిరిగి శివునకు అర్ధాంగి అయింది. ఆమె గుణకర్మలనుబట్టి ఆమెకు అనేక నామాలున్నాయి. కాళిక, చండి, భద్ర, చాముండ, విజయ, జయ, జయంతి, భద్రకాళి, దుర్గ, భగవతి, కామాఖ్య, కామద, అంబ, మృడాని, సర్వ మంగళ ఇలా అనేక నామాలున్నాయి. వీటిలో పార్వతీ నామం ప్రసిద్ధమైనది.

**గుణనిధి చరిత్ర**

మునులతో సూతుడిలా అంటున్నాడు: "మునులారా! మీకింత వరకు నారదుడు ప్రశ్నించగా బ్రహ్మగారు సమాధాన పూర్వకంగా చెప్పిన శివగాథలను చెప్పాను. ఇంకా ఆ ప్రసంగమే నడుస్తోంది. ఒక రోజున నారదుడు తనతండ్రిని సమీపించి శంకరుడు కైలాసానికి ఎప్పుడు వెళ్ళాడు? కుబేరునితో స్నేహం

ఎలా కలిగింది? పరిపూర్ణుడైన శివుని ఇతర లీలావిశేషాలెట్టివి? చెప్పవలసింది అని కోరగా బ్రహ్మగారు చెప్పిన దానిని మీకు వివరిస్తాను వినండి."

కాంపిల్య నగరంలో సోమయాజి కులోద్భవుడైన యజ్ఞదత్తుడనే దీక్షితు డొకాయన ఉండేవాడు. ఆయన స్వయంగా యజ్ఞదీక్షను స్వీకరించిన సోమయాజి. అంతేకాదు శ్రౌతకలాప మందు (వేద చోదితమైన యజ్ఞములను చేయించుట యందు) బహు ప్రజ్ఞావంతుడు. వేదవేదాంగ పారంగతుడు. రాజమాన్యుడు. వదాన్యుడు. కీర్తి భాజనుడు. నిత్యాగ్నిహోత్రి. సుందరుడు.

ఆ యజ్ఞదత్తునికి గుణనిధి అనే కుమారుడున్నాడు. తండ్రి అతనికి ఎనిమిదవ ఏటనే ఉపనయనం చేశాడు. రాజకార్య నిమగ్నుడైన తండ్రి కుమారుని విద్యా వ్యాసంగాన్ని పట్టించుకోలేదు. ఫలితంగా దుష్టసాంగత్యం వల్ల గుణనిధి ద్యూతక్రీడా పరాయణుడయ్యాడు. తల్లితో మాయమాటలు చెప్పి ఆమె నుండి సంగ్రహించిన ధనంతో జూదమాడే వాడు. ఆ వ్యామోహంలో దుర్జన సాంగత్యం చేసి స్నాన సంధ్యాద్యనుష్ఠాలను విసర్జించాడు. అంత మాత్రమే కాదు నీచ సాంగత్యం వలన కలిగిన తుచ్ఛ సంస్కారంతో వేదశాస్త్ర దేవ బ్రాహ్మణ నిందకుడయ్యాడు. స్మృతివిహిత ధర్మాలను విడిచి నిరంతరము గీతవాద్య గోష్ఠులతో కాలం వెళ్ళబుచ్చుతూ వేశ్యాలోలుడయ్యాడు. నటులు, పాషండులు, భండులు (హాస్యగాండ్రు) వీరే అతని కూర్మినెచ్చెలులు.

తండ్రి రాచకార్యాలలోను, గృహ కృత్యములలోను నిమగ్నుడై ఉండి ఎప్పుడైనా తీరిక సమయాల్లో భార్యతో "ఓసి! ఇంటిదానా! నీ కొడుకెక్కడ? ఇంట్లో కనుపించటం లేదు?" అని ప్రశ్నించిన ప్రతిసారి "ఇప్పటివరకు పాఠం చదువుకొని ఇప్పుడే స్నేహితులొస్తే వారితో కలిసి బయటకు వెళ్ళాడు" అని సమాధానం చెప్పి పుత్ర ప్రేమతో గుణనిధి తప్పుడు ప్రవర్తనను కప్పి పెట్టేది.

ఇంట్లో మాత్రం తండ్రి లేనప్పుడు కుమారుని లాలించి హితోక్తులు చెప్పేది. గుణనిధికి పదహారు సంవత్సరాల ప్రాయం వచ్చే సరికి తండ్రి స్నాతక సంస్కారాదులను జరిపి గృహ్యసూత్రోక్త విధానంగా వివాహం జరిపించాడు. వివాహం తర్వాత కూడా గుణనిధి ప్రవర్తనలో మార్పులేదు. ఒక రోజున తల్లి గుణనిధిని కూర్చుండ బెట్టి స్నేహార్ద్ర హృదయంతో, మృదువైన వాక్కులతో, నయంగాను, భయంగాను ఇలా హితవు చెప్పింది.

"కుమారా! నీ తండ్రి కోపిష్ఠి. ఈ చేష్టలు కట్టిపెట్టు. నీ విషయం ఆయనకు తెలిస్తే నిన్ను నన్ను కూడా దండిస్తాడు. ఏదో ఇప్పటి వరకు ఆయనకు తెలియకుండ కప్పిపెడుతూ వస్తున్నాను. వత్సా! నీ తండ్రి ధనంచే గాక కేవలం సదాచారం వల్లనే లోకపూజ్యుడయ్యాడు. బ్రాహ్మణునికి సద్విద్య, సాధు సంగమం ఈ రెంటిని మించిన ధనం లేదు. విప్రునికి ఆస్తి విద్యయే! నీకు వీటియందు ప్రీతి పుట్టక పోవటానికి కారణం ఏమిటి? నీ పూర్వీకులు తాత, ముత్తాతలు మంచి శ్రోత్రియులు. దీక్షితులు, సోమయాజులూను. లోకంలో మన కుటుంబానికున్న పేరుప్రతిష్ఠలను పాడు చెయ్యకు. దుష్ట సాంగత్యాన్ని వదిలెయ్యి. సాధుసంగతిని అలవర్చుకో. సద్విద్యల యందు మనసుపెట్టు. బ్రాహ్మణాచారాలను పాటించు. తండ్రికి తగ్గ కొడుకని అనిపించుకో!

నీకు పందొమ్మిది సంవత్సరాలు. నీ భార్యను చూడు. పదహారు సంవత్సరాల యువతి. ఉత్తమురాలు! నీ మామగారు, మేనమామలు సర్వత్ర గుణశీలయుతులు. నీ తండ్రిగారి శిష్యులను చూడు. వారెంత వినయ సంపన్నులో! నీ విషయం రాజుగారికి తెలిస్తే మీ నాన్నగారి దీక్షితత్వాన్ని తీసేస్తారు. శిక్షిస్తారు కూడా. అప్పుడు మనకు పూటగడవటం కూడ కష్టమవుతుంది."

ఈ విధంగా తల్లి ఎంత బోధించినా గుణనిధి తన ప్రవర్తనను మార్చుకోలేదు. ఇంట్లో ఉన్న వస్తువులన్నింటిని క్రమంగా జూదగాళ్ళకు అర్పించాడు. ఒక రోజున తండ్రియైన దీక్షితుడు వీధిలో ఒక జూదగాని వ్రేలికి ఉన్న తన వజ్రపుటుంగరాన్ని గుర్తించి వాడిని గుచ్చిగుచ్చి అడిగేసరికి వాడిలా బదులిచ్చాడు "ఓ దీక్షిత స్వామీ! దీనిని నేనేమీ చౌర్యంచెయ్యలేదు. నీ కొడుకు దీనిని జూదంలో పోగొట్టుకొన్నాడు. ఇదొక్కటే కాదు ఇంకా చీరలు, సొమ్ములు చాలా ఉన్నాయి. ఆ వరుసలో ఈ నగరంలో అతనితో సమానమైన జూదగాడు లేడు. నీతో సమానమైన శ్రోత్రియుడు లేడు. అసలీ విషయం నీకిప్పటి వరకు తెలియనేలేదంటే అదే ఆశ్చర్యంగా ఉంది."

మొదటి సారిగా తన కుమారుని దుష్ప్రవర్తనను గూర్చి ఒక జూదరి నోటవిన్న దీక్షితుడు సిగ్గుతో తలను, భుజములను కూడా వంచుకొని ఉత్తరీయంతో శిరస్సును కప్పుకొని వడివడిగా అడుగులు వేసికొంటూ ఇంటికి చేరి భార్యను పిల్చి ఇలా అన్నాడు. "ఓసి సోమిదేవమ్మా! ఇలారా! గుణనిధి ఐన నీ కొడుకెక్కడ? సరే ఆ భ్రష్టునితో నాకేం పని? రాజుగారు నాకిచ్చిన రత్నాంగులీయకాన్ని తైలాభ్యంగన వేళ చిరునవ్వులు చిలికిస్తూ గిలిగింతలు

పెట్టి ఏదీ! ఇలా ఇవ్వండి! నే భద్రపరుస్తాను అని తీసుకొన్నావు గుర్తుందా? ఏదీ ఆ ఉంగరం ఇప్పుడెక్కడుంది? వెంటనే తీసుకొనిరా!"

ఆ మాటలను విన్న సోమిదేవమ్మ భయపడి పైకి గాంభీర్యాన్ని నటిస్తూ ఇలా అంది: "నెత్తిమీద సూర్యుడు నిప్పులు కక్కుతున్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలైంది. స్నానానికి ఏర్పాట్లు చేశాను. ముందు స్నానం చేసి అనుష్ఠానం తీర్చుకొని భోజనం చెయ్యండి. ఆ ఉంగరాన్ని ఎక్కడో భద్రంగా దాచాను. వెతుకుతాను. ఇప్పుడు దానికేం తొందర? ఉంటుంది ఎక్కడో!"

కొడుకు చెడు నడతను ఇంకా కప్పిపెడుతూన్న తల్లి అవివేకపు పల్కులకు ఆగ్రహోదగ్రుడైన దీక్షితుడు శిఖను ఝాడించి, పంచె పైకెగకట్టి, ఉత్తరీయాన్ని దులిపి మొలకుచుట్టి, యజ్ఞోపవీతాన్ని సవరించి, దక్షిణ బాహువును పైకెత్తి, అంగుళి స్ఫోటనం చేసి, సోమదేవమ్మ వైపు తిరిగి, తర్జనితో నిర్దేశించి కండ్ల మెరుపులు కురియ, పండ్లు పటపట కొరుకుతూ భార్యతో ఇలా అన్నాడు.

"ఓ సోమిదేవమ్మా! చాలు నీ మాయమాటలు కట్టిపెట్టు. వాణ్ణి గురించి నేనడిగిన ప్రతిసారి నువ్వు అసత్యాన్నే పలుకుతూ వచ్చావు. హంసల బారు అంచు, మామిడి చిగురు రంగుపైటంచు, జలతారు పట్టుచీర ఏది? రాళ్ళు పొదిగిన బంగారు గిన్నె ఎక్కడ? మూడు పేటల పట్టుతో నేసిన నా పట్టుపంచె ఏ జూదరి కట్టుకొంటున్నాడో గదా? దక్షిణదేశం నుండి తెచ్చిన ఇత్తడి పాత్ర, గౌడదేశం నుండి తెచ్చిన రాగిపాత్ర ఎక్కడున్నాయి? జీవకళలుట్టిపడే దంతపుబొమ్మ ఏ వేశ్యామందిరంలో ఉంది? అవన్నీ సరే వివాహ సమయంలో నీ వ్రేలికి అలంకరించిన రత్నాంగుళీయకం తెచ్చి చూపించు? కులస్త్రీవైన నీపై కోపించటం తగదు. కుపుత్రత్వం కంటే అపుత్రత్వం మేలు. నీళ్ళు తీసికొనిరా, వాడికి నువ్వులు, నీళ్ళు ఇప్పుడే వదిలేస్తున్నాను. వాడు నా కొడుకు కాదు, నువ్వు నా సహధర్మచారిణివి కాదు! పునర్వివాహం చేసికొన్నాకనే నా భోజనం."

ఈ విధంగా పలికి స్నాన సంధ్యాద్యనుష్ఠానాలను నెరవేర్చి, ఆ రోజునే మరొక శ్రోత్రియుని కుమార్తెను వివాహమాడి వైదిక ధర్మానుష్ఠాన తత్పరుడయ్యాడు యజ్ఞదత్తుడు.

**గుణనిధి సద్గతిని పొందుట**

తీవ్రమైన ఆగ్రహంతో అలా శపథం చేసిన తండ్రిని చూచి భయపడిన దీక్షిత పుత్రుడు ఇల్లు విడిచి ఉత్తర దిక్కుగా బయలుదేరాడు. ఉత్తరీయంతో శిరసు కప్పుకొని నడక సాగిస్తూ తనలో తానిలా

మథనపడ సాగాడు. "ఆహా! ఏమాశ్చర్యం! దీక్షిత వంశంలో పుట్టిన నాకీ వ్యసనాలెలా అంటుకొన్నాయి? నా వద్ద ధనం లేదు. పోనీ విద్యాగంధం ఉందా అంటే అది ముందే లేదు. దేశాంతర మందున్న వాడికి విద్య ఉత్తమ స్నేహితుడు కదా! ధనహీనునికి సుఖాలు ఆమడ దూరంలో ఉంటాయి. గమ్యంలేని ఈ నడక.... ఎంతవరకు పోగలను?" ఇలా మనస్సులో కుములుతూ కొన్ని రోజులు నడకసాగించాడు. ఒక రోజున తన దుస్థితికి చింతిస్తూ నడక సాగిస్తుండగా ఇంతలో సూర్యాస్తమయం కావొచ్చింది. దూరంగా శివాలయ గోపురం కనిపించింది. వడివడిగా నడిచి ఆలయం వద్దకు చేరుకొని చెరువు గట్టుమీదనున్న చెట్టుక్రింద కూలబడ్డాడు. తెలియకుండానే కునుకుపట్టింది. తెల్లవారింది. ఆరోజు శివరాత్రి. "హర! హర! మహాదేవ! శంభో! శంకర!" అంటూ ఉచ్ఛైస్వరంతో శివనామ స్మరణ చేస్తున్న భక్తుల కోలాహలంతో ఆలయ ప్రాంగణం ప్రతిధ్వనిస్తోంది. ప్రొద్దు కఱకఱలాడింది. గుణనిధి కడుపులో ఆకలి కొఱకొఱ లాడింది. అప్పుడిలా అనుకొన్నాడు: "ఇంట్లో ఉన్నప్పుడు అమ్మ కడుపు తడిమి ప్రొద్దుటే వడపిందెలతో పెరుగన్నం పెట్టేది! ఇప్పుడెవరు పెడతారు? లోకంలో అమ్మవంటి వస్తువు మరొకటి లేదు గదా!" ఇలా అమ్మ చేసిన ఉపచారాలను స్మరించుకొంటూ; తన వంటి సోమరిపోతులు లోకంలో సుఖంగా బ్రతకకుండా, ఆకలిని సృష్టించిన బ్రహ్మ అపచారాన్ని నిందిస్తూ, క్షుద్బాధా నివారణోపాయాలను కళ్ళు మూసుకొని తదేక ధ్యానంతో చింతిస్తూండగా నానావిధ రుచిరపదార్థ పక్వాన్న ఘుమఘుమ వాసనలు గుణనిధి నాసా పుటాలకు సోకాయి. కళ్ళు తెరిచి చూచే సరికి ఒక పరమ మహేశ్వరాచార సంపన్నుడు స్వజనంతోను, పరిచారకులతోను కలిసి అనేక మధుర భక్ష్యాలను శివనైవేద్యం నిమిత్తం తీసికొని వెడుతూ కనుపించాడు. నివేదనానంతరం శివభక్తులు నిద్రించగానే ఆ వంటకాలను పరిగ్రహించవచ్చు కదా అని ఆశించి శివాలయ గర్భగుడి ద్వారం దగ్గర భక్తునిలా శివనామ స్మరణ చేస్తూ పూజయ్యేవరకు చూస్తూ కూర్చున్నాడు. వివిధ నృత్త, నృత్య గీతాలతో శివుని ఆరాధించి మహా నివేదనానంతరం భక్తులు అలసి నిద్రించారు. ఇదే అదనుగా గుణనిధి గర్భగుడిలో ప్రవేశించి మందప్రభతో వెలుగుతున్న దీపకాంతుల మధ్య భక్ష్యాలను గుర్తించలేక ఉత్తరీయాన్ని చించి అంచును వత్తిగా చేసి దీప ప్రకాశాన్ని పెంచి భక్ష్యాలను ఏరి కొంతతిని కొంత మూట కట్టుకొని త్వరగా బయటకు వెడుతూండగా చీకట్లో కాలు తగలగా నిద్రిస్తూన్న వ్యక్తి లేచి "దొంగ! దొంగ!" అంటూ అరిచాడు. ఆ అరుపుకు అందరు లేచి అతణ్ణి పట్టుకొని గట్టిగా మొత్తారు. దెబ్బలకు తాళలేక ప్రాణాలను విడిచాడు దీక్షిత పుత్రుడైన గుణనిధి.

అతడిని యమలోకానికి తీసికొని వెళ్ళే నిమిత్తం పాశ, ముద్గర పాణులై యమ భటులు వచ్చారు. ఇంతలో చిరుగంటల మాలలు, చేతిలో త్రిశూలంగల శివగణాలు అక్కడ సాక్షాత్కరించాయి. వర్ణాశ్రమాచార ధర్మాలను తప్పి సంచరించిన పుణ్యపాప వివక్ష లేని ఈ మూర్ఖుడు యమదండనకు అర్హుడు అంటూ యమభటులు వాదించారు. దానికి ప్రత్యుత్తరంగా శివ దూతలిలా బదులిచ్చారు.

"ఓ యమ కింకరులారా! సూక్ష్మమైన శివధర్మాలను వివరిస్తాం వినండి. ఈతడు శివరాత్రి నాడు ఉపవాసముండి జాగరణ చేశాడు. శివనామ స్మరణ చేస్తూ శివపూజను కళ్ళారా చూశాడు. దీపాన్ని వెలిగించాడు. శివ ప్రసాదాన్ని తిన్నాడు. ఈ కృత్యాలను ఆచరించిన వాడెవడైనా శివ సాలోక్యాన్ని పొంద గలడు. ఈతడు కొంతకాలం శివలోకంలో ఉండి ఆపై పుణ్యఫలంచే కళింగ రాజుగా జన్మిస్తాడు పొండి! ఈ విషయాన్ని మీ ఏలికకు వివరించండి!" ఆ మాటలకు బదులాడలేక యమ దూతలు వెళ్ళి యమునకు విన్నవించగా యముడిలా అన్నాడు: "భటులారా! మీరు శివ భక్తుల జోలికి వెళ్ళకండి! విభూతితో త్రిపుండ్రములను ధరించిన వారిని, శరీరం అంతా భస్మం పూసుకొన్న వారిని, రుద్రాక్ష, జటాధారులను, శివ వేషధారులను మీరు యమ లోకానికి తీసుకొని రాకండి!"

"మునులారా! ఇదీ శివభక్తి మహిమ! తరువాత కథను చెపుతున్నాను వినండి" అంటూ సూతుడిలా చెప్పసాగేడు. ఈ విధంగా శివలోక ప్రాప్తిని పొందాడు గుణనిధి. అక్కడ శివగణాలతో కలిసి శివపార్వతులను చక్కగా సేవించి కొంతకాలం తర్వాత అరిందముడనే పేరుగల కళింగరాజుకు కుమారుడై జన్మించాడు. అతని పేరు దముడు. పూర్వజన్మ సంస్కారం చేత బాల్యం నుండే శివభక్తి అలవడింది. అతను రాజ్యాధికారాన్ని పొందగానే రాజ్యం అంతటా శివధర్మాలను ప్రచారం చేసి, అనేక నూతన శివాలయాలను నిర్మించాడు. వాటిలో నిత్యధూపదీప నైవేద్యాలకు తగిన ఏర్పాట్లు చేశాడు. బ్రతికి ఉన్నంత వరకు శివభక్తి తత్పరుడై పూర్ణజీవితాన్ని అనుభవించిన దముడు మరణానంతరం రత్నదీప కాంతులకు నిలయమైన అలకా నగరానికి ప్రభువై కుబేర నామంతో దిక్పాలకుడయ్యాడు.

**శివునితో కుబేరుని చెలిమి**

సూతుడిలా అంటున్నాడు: "మునులారా! కుబేరునికి శివునితో మైత్రి ఎలా కలిగిందో ఆ వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి. పూర్వం పాద్మ కల్పంలో బ్రహ్మమానస పుత్రుడైన పులస్త్యునకు విశ్రవసుడు అనే కుమారుడు కలిగాడు. అతనికి వైశ్రవణుడు (కుబేరుడు) అని పేరు.

అతడు తన తపస్సుచే శివుని మెప్పించి, విశ్వకర్మ నిర్మితమైన అలకాపురికి రాజై దానిని పాలించాడు. పాద్మకల్పం గతించి మేఘవాహన కల్పం రాగా యజ్ఞదత్తుని కుమారుడైన గుణనిధి కుబేరుడై అలకాధిపతి అయ్యాడు. పూర్వజన్మ సంస్కారంచే శివభక్తి ప్రభావాన్ని ఎరిగిన కుబేరుడు కాశీ నగరాన్ని చేరుకొని అచంచలమైన భక్తితో శివుని గూర్చి తపస్సు చేశాడు. అతని తపశ్చర్యకు ప్రీతుడైన విశ్వేశ్వరుడు విశాలాక్షితో కూడి సాక్షాత్కరించాడు. తపోధనుడైన కుబేరుడు కండ్లు తెరచి ఎదురుగా సహస్రకోటి రవిప్రభాభాసమానమైన ఆదిదంపతులను చూచి ఆ తేజస్సును చూడలేక వెంటనే కనులు మూసుకొని ఇలా ప్రార్థించాడు. "ఓ! దేవదేవా! చంద్రశేఖరా! శంభో! శంకరా! నిన్ను ప్రత్యక్షంగా చూడగలిగే శక్తిని అనుగ్రహించు! అదొక్కటే నిన్ను కోరే వరం."

ఈశ్వరానుగ్రహాన్ని పొందిన కుబేరుడు సూర్యకాంతికి వికసించిన పద్మంలా మెల్లగా రెప్పలెత్తి చూచే సరికి మహా లావణ్య రత్నాకరమైన జగదంబతో కూడిన పరమేశ్వరుడు చిదానంద దరహాసంతో దర్శనమిచ్చాడు. లోకనాథుని చెంత రాకాచంద్ర జోత్స్నా పరిహాస భాసుర దరహాస వదనంతో నిల్చిన ఉమాదేవిని దర్శించి కుబేరుడిలా అనుకొన్నాడు. "ఆహా! ఏమా రూప సౌందర్యం! ఏమి ప్రేమ సౌభాగ్యం! ఏమా శోభ! ఏమా నయన ద్యుతి!" ఇలా శివకామినీ సౌందర్యాన్ని సందర్శించి మితిమీరి అతివేలంగా ప్రవర్తించిన కారణంగా కుబేరునికి ఎడమ కన్ను పగిలి పోయింది.

దానిని పరికించిన పార్వతీదేవి పరమేశ్వరునితో "నాథా! ఏమి ఈ దుష్ట తాపసుడు నా సౌందర్యాన్ని ప్రశంసిస్తున్నాడు? మదనాంతకులైన మీ దర్శన సౌభాగ్యాన్ని పొందాక కూడా ఈ తాపసునిలో కామబీజం నశించ లేదంటే తపస్సంతా వ్యర్థమైనట్లే గదా?" అంది. దానికి శివుడిలా ప్రత్యుత్తరమిచ్చాడు. "దేవీ! ఈతడు దుష్టుడు కాదు. మనకిష్టుడైన కుమారుడు. ఇతడు నీ సౌందర్యాన్ని కాదు సౌభాగ్యాన్ని వర్ణిస్తున్నాడు. నా అర్ధాంగివైన నీ తపస్సంపదను మనసులో మననం చేసికొని మైమరచి పోతున్నాడు."

దేవికిలా ప్రత్యుత్తర మిచ్చి శంకరుడు కుబేరునితో "వత్సా! నీ తపస్సుకు సంతోషించాను. నువ్వు నవనిధులకు నాధుడవవుతావు! గుహ్యకులకు, యక్షులకు, కిన్నరులకు, పుణ్యాత్ములకు ప్రభువుగా ఉంటావు! ఈ పైన నువ్వు నాకు నిత్య సన్నిహితుడవు! నేను నీకు సన్నిహితంగా అలకా నగరానికి సమీపంగా ఉంటాను. లోకపావని ఐన ఈమె నీ తల్లి! ఆమె పాదాలకు నమస్కరించు!" అని దయతో ఆజ్ఞాపించగానే కుబేరుడు ఆమె పాదాలపై పడ్డాడు.

సుప్రసన్న మనస్కురాలైన ఆ తల్లి కుబేరునితో "వత్సా! నిరంతరము నీకు మాయందు భక్తి వర్ధిల్లును గాక! ఈపైన ఎర్రని ఒకే నేత్రం కలవాడ వౌదువు గాక! నాయందు ఈర్ష్యను పొందేవు కనుక కుబేర (కుత్సితమైన బుద్ధి కలవాడు) నామంతో ప్రసిద్ధుడవవుతావు!" అని పలికింది. అలా కుబేరునికి వరాలిచ్చి అలకానగర సమీపంలో ఆదిదంపతులు కైలాసాన్ని నివాసంగా చేసికొని సుఖంగా ఉంటున్నారు.

**శివుడు కైలాసానికి వెళ్ళుట**

బ్రహ్మ తన కుమారుడైన నారదునికి చెప్పిన విషయాన్ని సూత మహర్షి మునులకిలా ఉపన్యసింప సాగాడు. పరమ తపోధనులారా! పరమ శివుడు తన పూర్ణాంశ ఐన రుద్రావతారంలో అనేక కోట్ల రుద్ర గణాలతో కూడి కుబేరుని అలకానగర సమీపాన కైలాసంలో కొలువు తీరిన వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి.

ఉమా సహితుడై పరమేశ్వరుడు తన నిజస్థానానికి వెళ్ళి, కుబేరుని కిచ్చిన ప్రతిజ్ఞా పాలన గురించి ఇలా ఆలోచించాడు. "నా హృదయం నుండి పుట్టిన రుద్రుడు నిర్గుణ పరబ్రహ్మ. హరి బ్రహ్మాది సేవితుడు. నిరంజనుడు, మదభిన్నుడు. నా పూర్ణాంశ కలవాడు. నేను ఆ రూపంతో నా అనుచర గణాలతో కైలాసంలో విహరిస్తాను. అది నా తపోభూమి." అని సంకల్పించగానే రుద్రుడు ఉత్సాహంతో ముందుకు వచ్చి ఉత్సాహ కారకము, సకల దేవతాహ్వాన స్ఫోరకము, గంభీర ధ్వని పూరకము ఐన ఢక్కను నినదించాడు. ఆ నాదాన్ని విన్న బ్రహ్మ విష్ణులు, మునులు, ఆగమాలు, వేదాలు, సిద్ధులు, దేవతలు, రాక్షసులు, ప్రమథులు సర్వులు అక్కడకు చేరుకొన్నారు.

మునులారా! అక్కడకు చేరిన వారి సంఖ్యను చెపుతున్నాను వినండి. ముందుగా గణపతులు: వీరందరు మహాత్ములు. సర్వలోక నమస్కృతులు. శంఖకర్ణుడను గణనాథుడు కోటి గణాలతోను, కేకరాక్షుడు పది, వికృతుడు ఎనిమిది, విశాఖుడు అరవై నాలుగు, పారియాత్రకుడు తొమ్మిది, సర్వాంతకుడు ఆరు, శ్రీమాన్ దుందుభుడు ఎనిమిది, గణశ్రేష్ఠుడైన జాలంకుడు పన్నెండు, సమదుడు ఏడు, వికృతాననుడు ఏడు, కపాలి ఐదు, సందారకుడు ఆరు, కందుకుడు కోటి, కుండకుడు కోటి, విష్టంభుడు ఎనిమిది, చంద్రతాపసుడు ఎనిమిది, మహాకేశుడు వేయి, కుండి, వాహుడు, పర్వతకుడు, కాలుడు, కాలకుడు వీరు ఒక్కొక్కరు పన్నెండు; మహాకాలుడు, అగ్నికుడు సన్నాహుడు, కుముదుడు ఒక్కొక్కరు వంద; అభిముఖుడు, ఆదిత్య మూర్ధుడు, ధనావహుడు ఒక్కొక్కటి; అమోఘుడు, కోకిలుడు, సుమంత్రకుడు ఒక్కొక్కటి;

కాకపాదుడు, సంతానకుడు ఒక్కొక్కరు అరవై; మహాబలుడు, మధుపింగుడు, పింగళుడు ఒక్కొక్కరు తొమ్మిది కోట్ల గణాలతో వచ్చిచేరారు.

నీలుడు తొంభై, పూర్ణభద్రుడు కూడా తొంభై, చతుర్వక్త్రుడు ఏడు, కాష్ఠాగూఢుడు, సుకేశుడు, వృషభుడు ఒక్కొక్కరు అరవైనాలుగు, చైత్రుడు, నకులీశుడు, లోకాంతకుడు, దీప్తాత్మ, దైత్యాంతకుడు, భృంగిదేవుడు, రిటి, అశని, భానుకుడు ఒక్కొక్కరు ఏడు, సనాతనుడు అరవై నాలుగు, మహాబలుడైన నందీశ్వరుడు వంద కోట్లు..... ఇలా అసంఖ్యాక గణాలు రుద్రుని పిలుపుకు వచ్చిచేరాయి. వీరందరు జటాకిరీట ధారులు, చంద్రశేఖరులు, నీలగ్రీవులు, త్రిలోచనులు, ముమ్మూర్తులా, రుద్ర సారూప్యులు. ఈ విధంగా ఇరువది వందల కోటి కోట్ల గణాలతో సర్వేశ్వరుడైన శివుడు కైలాసానికి బయలుదేరాడు. బ్రహ్మ విష్ణువు లిద్దరు వారి గణాలతో పరమేశ్వరుని వెంట బయలుదేరారు.

కుబేరుడు పరమేశ్వరుని, గణనాధులను, తక్కిన వారిని ఆదరంతో పూజించాడు. శంభుడు కుబేరుని ఆలింగనం చేసికొని ప్రీత మానసుడై మూర్ధాఘ్రాణం చేసి అలకానగర సమీపంలో ఉండి విశ్వకర్మను పిలిచి అనుచర గణాలందరికి తగిన నివాసాలను కైలాస పర్వత ప్రాంతాల యందు నిర్మించమని ఆజ్ఞాపించాడు. శివుని ఆజ్ఞను శీఘ్రమే నిర్వర్తించాడు విశ్వకర్మ.

ఒక సుముహూర్తంలో లోకసనాథుడైన విశ్వనాధుడు కైలాసంలో ప్రవేశించి నూత్న రత్నాలంకృత సువర్ణ సింహాసనారూఢుడై మహాతేజో విరాజమానుడై భస్మాలంకృత దేహుడై ప్రకాశించాడు. ఆ సమయంలో కమలనాభ, కమలోద్భవులాదిగా తక్కిన దేవతాగణం విశ్వనాధుని స్తుతించి అభిషేకించారు. ఆయన వారందరిని ప్రీతితో "ప్రాప్తకాములగుదురు గాక!" అని దీవించి నిజస్థానాలకు తరలి పొమ్మని అనుమతించి యోగనిష్ఠుడై, ధ్యానతత్పరుడై ఆత్మరతుడై ఒంటరిగానే కైలాస పర్వతంమీద ఉండి అనేక లీలలను ప్రకటించాడు. ఆ తర్వాత దక్షపుత్రి ఐన సతీదేవిని వివాహమాడి లోకాచార పరాయణుడై క్రీడించాడు.

**శ్రీ శివమహా పురాణం రుద్ర సంహితలోని**

**సృష్టిఖండం ముగిసినది.**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## రుద్ర సంహిత – సతీ ఖండం



### కామ ప్రాదుర్భావం

నైమిశారణ్య వాసులైన ఋషులకు శివమహా పురాణాన్ని సూతుడిలా వినిపిస్తున్నాడు: ‘‘ఓ మునులారా! ఒకప్పుడు నారదమహర్షి బ్రహ్మగారిని ఎంతో కుతూహలంతో ఇలా అడిగాడు: ‘తండ్రీ! శుభావహమైన శంభుని చరిత్రను ఎంత విన్నా తనివి తీరటం లేదు. సతీదేవి యొక్క వృత్తాంతాన్ని సవిస్తరంగా సెలవియ్యండి!’ ఈ మాటలకు సంతోషించి, బ్రహ్మగారు నారదునికి విపులంగా చెప్పిన ఆ శివగాథలన్నిటిని మీకు వినిపిస్తున్నాను వినండి!

శివ దేవునికి రెండు రూపాలున్నాయి. ఒక రూపంలో ఆయన నిర్గుణుడు. శక్తి భేదం లేనివాడు. మరొక రూపంలో ఆయన సగుణుడు. ఉమా సహితుడు. శివానుగ్రహం వల్లనే బ్రహ్మ సృష్టికర్త ఐనాడు. దేవతలను, రాక్షసులను, దక్షాది ప్రజాపతులను సృష్టించాడు. మరీచి, అత్రి, పులహుడు, పులస్త్యుడు, అంగిరసుడు, క్రతువు, వసిష్ఠుడు, నారదుడు, దక్షుడు, భృగువు మొదలైన మహాత్ములైన మానస పుత్రులను సృష్టించాడు. చేసిన సృష్టిని పరికించి మనసులో తాను మహోన్నతుడను అనే అహంకారాన్ని పొందాడు.

మానస సృష్టి ఐన తదుపరి ఆయన మనస్సు నుండి చారురూపిణి, వరాంగన, మనోహరి ఐన ఒక స్త్రీ మూర్తి ఉద్భవించింది. ఆమె పేరు సంధ్య. పగలు క్షీణించి ఉంటుంది. సాయంకాలం సుందరంగా ప్రకాశిస్తుంది. అతిలోక సుందరి. అందరిని వ్యామోహితులుగా చేయగల సౌందర్యం ఆమెది. అట్టి సంధ్య యొక్క శోభను చూచి విధాత లేచి నిలబడి మనసులో తన కుమారులైన ప్రజాపతులను, మరీచ్యాది మహర్షులను స్మరిస్తూండగా ఆయన మనస్సు నుండి మహాద్భుతుడు, ఊహాతీత సౌందర్యోపేతుడు సుకుమారుడు ఐన పురుషుడావిర్భవించాడు.

మేలిమి బంగారం వంటి మేని ఛాయ. పున్నమ చంద్రుని మించిన ముఖం. ముత్యాల వంటి దంత పంక్తి. తీర్చి దిద్దిన కనుబొమలు. సంపెంగ వంటి ముక్కు. తుమ్మెదల్లా నిగనిగలాడే కేశపాశం. విశాలమైన వక్షస్థలం. దిగ్గజంలా దృఢమైన శరీరం. సన్నని నడుము. రక్తవర్ణ శోభితమైన హస్త, పాదాలు. శంఖం వంటి కంఠం. చేప కన్నులు. మకర వాహనుడు, మీన కేతనుడు, పంచ పుష్పాయుధుడు, పుష్ప కోదండ మండితుడు, చంచలమైన దృష్టిపాతం కలవాడు. మనోహరుడు, నీలవస్త్ర ధారి, నానావిధ పుష్ప పరిమళ శరీరగంధ మనః ప్రమోద లోక ప్రియుడు, శృంగారరస సేవితుడు, భావజుడు.

మునులారా! అట్టి శృంగార పురుషుని చూడగానే అక్కడున్న వారందరి నిర్వికారమైన మనస్సుల లోను ఒకానొక వికారం కలిగింది. వారందరు విస్మయాన్ని, ఉత్కంఠను పొందారు. ధైర్యచ్యుతులయ్యారు. ఆ పురుషుడు స్రష్ట, జగత్ప్రభువు ఐన బ్రహ్మను చూచి తలవంచి నమస్కరించి ఇలా అన్నాడు: “హే! బ్రహ్మన్! నన్నెందుకు సృజించావు? నాకు నా కర్తవ్యాన్ని బోధించండి. నా స్థానాన్ని చెప్పండి? నా భార్య ఎవరు? సృష్టి కర్తవు, జగత్పతివి నీవేకదా!

ఆ మాటలను విన్న విధాత విస్మితుడై క్షణకాలం మౌనాన్ని అవలంబించి, సంధ్యాదేవి మీది కామనను నియంత్రించుకొని, మనసును దిటవు పరచుకొని ఆ సుందరునితో ఇలా అన్నాడు: “ఓ పురుషుడా! నువ్వీ రూపంలో ఉండి ఐదు పుష్పాలను బాణాలుగా చేసికొని, స్త్రీ పురుషులను మోహ విభ్రాంతులను చేస్తూ సృష్టి కార్యాన్ని నిరంతరాయంగా కొనసాగించు. ఇదే నీ కర్తవ్యం. స్థావర, జంగమాత్మకమైన ఈ సృష్టిలో నీకు వశం కాని జీవుడు ఒక్కడూ ఉండడు. త్రిమూర్తుల మైన మేము సైతం నీ వశవర్తులమే! ఇతర ప్రాణుల మాట చెప్పేదేముంది? అందరి మనస్సులలోను గుప్తరూపుడవై ఉండి వారి సుఖానికి కారణభూతుడుగా ఉంటూ సృష్టికార్యాన్ని చెయ్యి. నువ్వు ఆవేశిస్తే చాలు వారికి మదం (మత్తు) కలుగుతుంది. ఆ మత్తులో ధర్మాధర్మ విచక్షణ కోల్పోతారు. దాని వల్ల పుణ్యాపాపాలు, తిరిగి దానివల్ల సుఖదుఃఖ రూపమైన స్వర్గ నరకాదులు సంప్రాప్తిస్తాయి. ఈ విధంగా జనన మరణ రూపమైన సంసార చక్రంలో పడి పరిభ్రమిస్తూ ఉంటారు జీవులు.

నీకు నే కర్తవ్యాన్ని ఉపదేశించాను. నా ఈ కుమారులు నీ స్వరూప, స్వభావాలకు అనుగుణమైన నామాలను ఉంచగలరు.” ఈ విధంగా పలికి బ్రహ్మ పద్మాసనాసీనుడయ్యాడు.

**కామ శాపానుగ్రహములు**

అలా ఆసీనుడై దక్షాది ప్రజాపతుల, మరీచ్యాది మహర్షుల ముఖావలోకనం చేయగానే ఆయన

అంతరంగాన్ని గుర్తించిన వారు; ఆ పురుషునకు అనురూపమైన పేర్లను, స్థానాన్ని, భార్యను కల్పించి యుక్తి యుక్తంగా ఇలా పలికారు.

"ఓ మహా పురుషా! నువ్వు పుట్టగానే బ్రహ్మయొక్క, మా యొక్క మనస్సులను మథించావు కనుక లోకంలో మన్మథ నామంతో ప్రసిద్ధి కెక్కుతావు. మనస్సు నీ జన్మస్థానం కనుక మనసిజుడవని పిలువ బడతావు. వివిధ రూపాలలో ఉంటావు కనుక 'కాముడు' అని నీకు పేరు. లోకంలో మాదక ద్రవ్యాలెన్ని ఉన్నా నీతో సమమైనది లేదు కనుక నువ్వు మదనుడవు అవుతావు. దర్పం నుండి పుట్టావు కనుక కందర్పుడవు. దేవతలలో నీతో సమమైన వాడు లేడు. నువ్వు సర్వవ్యాపివి. పురుషశ్రేష్ఠుడవు! ప్రథమ ప్రజాపతి ఐన ఈ దక్షుడు నీకు దాస్యం చేసే కామినిని స్వయంగా ఈయగలడు."

వారి మాటలను విన్న మన్మథుడు మనస్సులో ఇలా అనుకొన్నాడు. "బ్రహ్మ నాకు ఆదేశించిన సృష్టికార్యాన్ని ఇప్పుడే, ఇక్కడే ప్రారంభిస్తాను. వీరి పలుకుల లోని యథార్థాన్ని పరీక్షిస్తాను. నా పరాక్రమానికి ఈ ప్రజాపతులు, ఋషులు సాక్షులు కాగలరు. సంధ్యాదేవి కూడా ఇక్కడే ఉంది. ఈమెయందు వీరిని మోహవిభ్రాంతులను చేస్తాను. హర్షణము, రోచనము, మోహనము, శోషణము, మారణము అనే పేర్లుగల ఈ పుష్పబాణాలను ప్రయోగిస్తాను!"

ఈ విధంగా మనసులో నిశ్చయించుకొని అక్కడున్న వారందరిని లక్ష్యంగా చేసికొని కుడికాలు ముందుకు వంచి, ఎడమకాలు వెనుకకు పెట్టి (ఆలీఢ స్థానం) ధనుస్సును బలంగాలాగి చక్రాకారంగాచేసి బాణప్రయోగం చెయ్యబోయే సరికి దిఙ్మండలమంతా నానావిధ పుష్పపరిమళ పరివ్యాప్తమైంది. బాణప్రయోగం చేసేసరికి బ్రహ్మగారితో కలిపి అక్కడున్న వారందరి హృదయాలలోను ఒక విలక్షణమైన వికారభావం పుట్టింది. వారందరు అణచుకోలేని విరహ తాపంతో సంధ్యను తిరిగి తిరిగి చూస్తూనే మన్మథ భావాన్ని పొందారు. ఆ సమయంలో బ్రహ్మగారి శరీరం నుండి నలభై తొమ్మిది పదార్థాలు పుట్టాయి. సంధ్య కూడా కందర్ప శరపాతానికి లోనై భ్రూకటాక్ష, విక్షేప, హావ, భావ, సంజ్ఞా వరణాది లీలా విలాసాలను అధికంగా ప్రదర్శించింది. ఆ చేష్టలతో అక్కడున్న వారందరి హృదయాలను అల్లకల్లోలం చేస్తున్న సంధ్య లలితతరంగమాలికాడోలికా విన్యాసాలతో నేత్రపర్వంగా ఉన్న మందాకినిలా మనోహరంగా ఉంది. వారందరిలోను సంధ్యను పొందాలనే కోరిక తీవ్రతరం కాజొచ్చింది. బ్రహ్మోద్దిష్టమైన కర్మను లెస్సగా చెయ్యగలననే విశ్వాసం కందర్పునికి కుదిరింది.

అప్పుడు అక్కడ ఉన్న ధర్మువు పాప చింతనతో ఉన్న తండ్రిని, సోదరులను చూచి ధర్మ రక్షకుడైన శంకరుని స్మరించి ఇలా స్తుతించాడు. "హే దేవదేవ! మహాదేవ! ధర్మ రక్షకా! నీకు నమస్కారం. సృష్టి, స్థితి, లయ కర్తవు నీవే! నీవు గుణాతీతుడవు. ఐనా రజస్సును, సత్త్వమును, తమస్సును స్వీకరించి బ్రహ్మ రూపాన్ని, విష్ణు రూపాన్ని, రుద్ర రూపాన్ని పొంది ఉంటావు. నువ్వు నానా లీలా విశారదుడవు. మహాదేవా! వీరందరు పాప చింతనను కలిగి ఉన్నారు. తరింప శక్యంగాని ఈ పాపం నుండి రక్షించు."

ధర్ముని ధర్మ బుద్ధికి ప్రీత చేతస్కుడైన శంకరుడు వృషభ వాహనారూఢుడై ప్రత్యక్షమై వారందరు సిగ్గు పడేటట్లుగా ఇలా అన్నాడు. "ఆహో బ్రహ్మన్! నీ కుమార్తెయందు నీకు కామభావం ఎలా కలిగింది? వివేకి ఐనవాడు తల్లిని, సోదరిని, సోదరుని భార్యను, కుమార్తెను కామభావంతో చూడరాదు. ఇది వేదమార్గ నిర్ణయం. వేదం నీ ముఖంలో ఉంది. అల్పుడైన ఈ కాముడు దానిని నువ్వు విస్మరించేటట్లు ఎలా చెయ్యగలిగాడు? ఓ చతురానన! వివేకాన్ని మేల్కొలుపు. హృదయ దౌర్బల్యం కలవారి మనస్సుల్లో పుట్టే ఈ క్షుద్రమైన కామం నిన్నెలా రంజింప చెయ్యగలదు? నీ మానసపుత్రులైన దక్షమరీచ్యాదులు ఉన్నత భూమికకు చెందిన యోగులు కదా! వారు సదా ఆదిత్య దర్శనం చేస్తూంటారు. అట్టివారు స్త్రీ వ్యామోహాన్నెలా పొందారు? మూర్ఖుడు, కాలస్వరూపాన్ని తెలియనివాడు, అల్పుడు ఐన ఈ కాముడు పుట్టిన వెంటనే పుష్పబాణాలతో మీలో చిత్త చాంచల్యాన్నెలా కల్గించ గలిగాడు? ఎవని మనస్సును స్త్రీ హరిస్తుందో వాని వివేకానికి నింద యగు గాక. విషయ సుఖాల వైపు మనసు మళ్ళినప్పుడు మనుష్యులందరు వివేకం చేతనే దానిని నియంత్రణ చేసుకోవాలి."

శంకరుడీ విధంగా జ్ఞానబోధ చేసేసరికి బ్రహ్మ సిగ్గుపడ్డాడు. సంధ్యను ఆలింగనం చేసికొనాలనే కామ వాంఛను నిగ్రహించుకొన్నాడు. ఆ సమయంలో శరీరమంతా చెమటతో తడిసి ముద్ద అయింది. ఆ చెమట నీటి నుండి అగ్నిష్వాత్తులనే పితృదేవతలు, ఇంకా ఇతర పితరులు జన్మించారు. వారు పద్మపత్రాక్షులు. కాలాంజన సమాన దేహులు. పుణ్యాత్ములు. సంసార విముఖులు. అగ్నిష్వాత్తుల సంఖ్య అరవై నాలుగు వేలు. బర్హిషదుల సంఖ్య ఎనభై ఆరువేలు.

అప్పుడు దక్షుని శరీరం నుండి స్వేదజలం భూమిమీద పడింది. దానినుండి సమస్త గుణసంపన్న, సర్వావయవ సుందరి, నవకాంచన సుప్రభ ఐన శ్రేష్ఠ వనితారత్నం పుట్టింది. మునులను సైతం మోహింప చేయగల ఆమెకు రతి అని పేరు. ఆమెను చూడగానే

క్రతు, వసిష్ఠ, పులస్త్య, అంగిరసులు మాత్రం కామ భావాన్ని పొందారు. మిగతావారు నిగ్రహించుకొన్నారు. వారి బీజం భూపతనమైంది. దానినుండి కొంతమంది పితృగణాలు ఆవిర్భవించారు. క్రతువు నుండి సోమపులు, వసిష్ఠుని నుండి కాలులు, పులస్త్యుల నుండి ఆజ్యపులు, అంగిరసుని నుండి హవిష్మంతులు పుట్టారు. వీరందరికి మానవులు సమర్పించే హవిర్భాగాలను (కవ్యము) అగ్ని అందజేస్తాడు కనుకనే అగ్ని కవ్యవాట్ ఐనాడు.

మునులారా! తదనంతర గాథను చెపుతున్నాను వినండి. బ్రహ్మ కుమార్తె ఐన సంధ్య శంకర సందర్శన భాగ్యం చేతను, ఆయన వాక్కుల చేతను ధర్మకర్మ పరాయణురాలైంది. శంభుడు కూడా వారందరిని అనుగ్రహించి, ధర్మ సంరక్షణ చేసి, వెంటనే అంతర్ధానమయ్యాడు. శంకర వాక్యాలకు లజ్జను పొందిన పితామహుడు క్రుద్ధుడై ఆజ్యాహుతికి భగ్గున నాల్కలు సాచిన అగ్నిలా లేచి మండిపడి కుసుమాయుధుణ్ణిలా శపించాడు “ఓ మదనా! కాల వివేకాన్ని కోల్పోయి, యుక్తాయుక్తాలను మరిచి నీవాచరించిన దుష్కర్మకు ఫలంగా పరమేశ్వరుని విషయంలో నువ్వు సాధించలేని కార్యానికి పూనుకొని విఫలుడవై, ఆయన లలాటాగ్నిచే దహింప బడతావు.”

పితామహుని నోట రోషభీషణ శాప వాక్కులను విన్న మదనుడు భయకంపితుడై, గర్వాన్ని విడిచి, శరచాపాలను దూరంగా విసిరేసి సశరీరంతో సాక్షాత్కరించి పద్మోద్భవుని పాదపద్మాలపై పడి ఇలా ప్రార్థించాడు. “ఓ పితామహా! ఇంత అతి దారుణంగా నన్నెందుకు శపించారు? మీరాచరించే కృత్యాలన్ని దోష రహితంగాను, న్యాయ మార్గానుసారంగాను ఉంటాయి గదా! విధి రూపంలో మీరాదేశించిన విధినే నే నెరవేర్చాను. త్రిమూర్తులు సైతం నీకు వశులౌతారు అని మీరిచ్చిన వాగ్దానాన్ని పరీక్షించాను. ఇందులో నా అపరాధమేముంది? నిరపరాధినైన నన్ను ఇంత దారుణంగా శపించ వచ్చా?”

జగత్పతి ఐన బ్రహ్మ మన్మథుని ధార్మిక వచనాలనువిని తన్నుతాను నిగ్రహించుకొని శాప ప్రతిక్రియా రూపమైన వాక్కులతో అతన్నిలా అనుగ్రహించాడు. “వత్సా! ఈ సంధ్య నా తనూజ. నీ కుసుమశరాలకు నన్ను లక్ష్యం చేసి ఈమె యందు నాకు కామ వికారాన్ని కల్గించావు. ఆ కారణంగా శాపగ్రస్తుడవయ్యావు. ఇపుడు శాంతుడనయ్యాను. ఓ పంచబాణా! నువ్వు భయాన్ని విడిచిపెట్టు! నీకు అభ్యుదయాలు కలుగుతాయి. ఫాలలోచనుని కంటి మంటలచే భస్మీభూతుడవైన నువ్వు శీఘ్రంగా శరీరాన్ని పొందగలవు. హరుడు తనఇచ్ఛచే దార పరిగ్రహం చేస్తాడు. ఆయనే నీకు శరీరానుగ్రహం చేస్తాడు.

తదనంతరం పితామహుడు, ప్రజాపతులు, మునులు, మదనుడు వారివారి నిజ స్థానాలను చేరుకొన్నారు.

**కామ వివాహం**

బ్రహ్మర్షులారా! తరువాత గాథను వినండి. అపుడు దక్షప్రజాపతి విధాత గత వచనాలను స్మరించి మన్మథునితో ఇలా అన్నాడు: "ఓ కుసుమ శరా! మహా లావణ్య తేజోరాశి ఐన ఈ సుందరి నా దేహం నుండి పుట్టింది. ఈమెకు రతి అని నామకరణం చేశాను. రూపంలోనే కాదు సద్గుణాలలో కూడ ఈమెకు సాటి ఎవరూ ఉండబోరు. ఈమెను భార్యగా స్వీకరించు. ఈమె నీకు సహధర్మచారిణిగా ఉంటుంది. నీకన్నివిధాలా తగినది. నీకు సర్వదా వశవర్తినిగా ఉండి ధర్మాన్ని పాలిస్తుంది."

ప్రజాపతులలో పెద్దైన దక్షుని ఆజ్ఞానుసారంగా మన్మథుడు రతీదేవిని పాణిగ్రహణం చేసికొని కృతార్థుడయ్యాడు. రతి రంజితుడైన మన్మథుడు కంఠాశ్లేష ప్రణయిని ఐన రతీ విరహాన్ని క్షణకాలమైనా ఓర్వలేక తన పుష్ప బాణాలచే తానే పీడితుడయ్యాడు. ఆమె సాన్నిధ్యంలో కుసుమశరుడు నిత్యోత్సవ శ్రీలను పొందాడు. ఆమె కనుబొమలను పరికించి 'ప్రజాపతి నా కోదండాన్ని లాక్కొని ఈమె కనుబొమలుగా మలచినాడా ఏమి?' అని సందేహాస్పదుడయ్యాడు. చంచలమైన ఆమె చూపులను చూచి తన బాణప్రయోగం మీది శ్రద్ధను కోల్పోయాడు. సహజ సురభిళ బంధురమైన ఆమె శ్వాసను ఆఘ్రాణించి మలయానిలం మీది శ్రద్ధను విడిచిపెట్టాడు. పూర్ణేందు సదృశమైన ఆమె ముఖంలో సులక్షితమైన కనురెప్పలను చూచి మచ్చగల చంద్రునికి ఆమె ముఖానికి గల భేదాన్ని నిర్ణయం చెయ్యలేక పోయాడు.

పన్నెండు ఆభరణాలతో, పదహారు అలంకారాలతో సర్వలోక మోహిని, దశదిశా ప్రకాశిని ఐన రతిని మన్మథుడు; మహాదేవుడు గంగను స్వీకరించినట్లు స్వీకరించి అపరిమిత ఆనందాన్ననుభవిస్తున్నాడు. మెరుపుతో కూడిన మేఘంలా ఉన్నారు రతీ మన్మథులు. తన కుమార్తె సౌభాగ్యాన్ని చూచి దక్షుడు ప్రీతుడయ్యాడు. యోగి తన హృదయంలో ఆత్మ విద్యను ధరించినట్లుగా మన్మథుడు రతిని తన హృదయంలో పదిలంగా నిలుపుకొన్నాడు. ఇలా మహామోహంలో ఓలలాడి పోతున్న మదనుడు బ్రహ్మ గారిచ్చిన దారుణ శాపాన్ని మరచి మామగారైన దక్షునికి గాని, అతి ప్రియమైన రతికి గాని చెప్పనే లేదు."

**సంధ్య యొక్క చరిత్ర**

మహర్షులతో సూతుడిలా అంటున్నాడు. "ఓ మునులారా! అద్భుతావహము, అత్యంత పవిత్రము ఐన శివ మహాపురాణ గాథను వినండి. నారదుడు ప్రశ్నించగా బ్రహ్మగారు సమాధాన పూర్వకంగా చెప్పిన సంధ్యా

చరిత్రను మీకు చెపుతున్నాను. ఈ చరిత్ర చాలా పవిత్రమైనది. శుభావహమైనది. శ్రవణ మాత్రం చేతనే సకల కిల్బిషాలను తొలగించగల పరిశుద్ధమైనది. దీనిని విన్న స్త్రీలు సాధ్వీమణులవుతారు. సంతతాభ్యుదయాన్ని పొందుతారు.

బ్రహ్మమానస పుత్రికగా జన్మించిన మహా సౌందర్యరాశియైన సంధ్యను చూడగానే మన్మథ ప్రభావంచే తండ్రియైన పితామహునకు, ప్రజాపతులకు, ఋషులకు ఇంకా అక్కడున్న వారందరికి కూడా మనస్సు చలించింది. సంధ్య కూడా కామ పీడితురాలైంది. ధర్ముని ప్రార్థనను మన్నించి శంకరుడు ప్రత్యక్షమై పల్కిన పల్కులకు అక్కడున్న వారందరు లజ్జను పొందారు. సంధ్య కూడా దుఃఖిస్తూ అక్కడ నుండి వెళ్ళి ధ్యానమగ్నురాలై ఇలా విమర్శ చేసికొంది.

"నేను యువతిగా జన్మించిన మరు క్షణంలో నా తండ్రి దోష దృక్కులతో నన్ను వీక్షించాడు. మనసులో కామ భావనను పొందాడు. నా మనస్సు కూడా పాప పంకిలమైంది. ఇదంతా మన్మథ ప్రభావం! దానికి తగిన శిక్షను అందరి ఎదుట మదనుడు పొందేడు. తండ్రి, సోదరుల విషయంలో కామభావాన్ని పొందిన నాకంటె పాపాత్మురాలు ఉండబోదు. పాప పంకిలమైన ఈ దేహంతో నాకు ప్రయోజనం లేదు. ఉగ్రతపస్సు చేసి పాపవినిర్ముక్తురాలనై ఆపై ఈ దేహాన్ని వేదమార్గానుసారంగా అగ్నిలో ఆహుతి చేస్తాను. ఈ దేహం ఇక ఎంత మాత్రము ధర్మసాధనం కాజాలదు. ఈ విధంగా భూమిమీద ఒక మర్యాదను స్థాపిస్తాను. అదేమిటంటే 'ఇక ఈ పైన మానవులు పుట్టుక తోడనే కామ వికారాన్ని పొందకుందురు గాక! దేన్ని సాధించాలన్నా తపస్సుకు మించిన సాధనం లేదు గదా!' ఈ విధంగా చింతించి సంధ్య చంద్రభాగా నదీతీరాన గల శ్రేష్ఠమైన చంద్రభాగా పర్వతానికి వెళ్ళింది. దాన్నెరిగిన బ్రహ్మ నియతాత్ముడు, సర్వజ్ఞుడు, జ్ఞానయోగి, వేదవేదాంగ పారంగతుడు ఐన వసిష్ఠుని పిల్చి ఇలా అన్నాడు: "పుత్రా! వసిష్ఠా! అభిమానవతి ఐన సంధ్య పాప ప్రక్షాళన నిమిత్తం తపస్సు చేయగోరి చంద్రభాగా నదీతీరానికి వెళ్ళింది. ఆమెకు యథావిధిగా దీక్షను ఇయ్యి. తపస్సు గురించి ఆమెకేమీ తెలియదు. నువ్వు ఉపదేశించు. ఆమెకు హితాన్ని కలిగించు. నువ్వు రూపాన్ని మార్చుకో! ఈ రూపంలోనే వెడితే తిరిగి ఏదైనా వికార భావాన్ని పొందవచ్చు."

పితృవాక్య పరిపాలనానువర్తియైన వసిష్ఠుడు 'సరే' అని అన్ని విధాలా మానస సరోవరాన్ని పోలి ఉన్న చంద్రభాగా నదీ తీరానికి వెళ్ళి అక్కడ బృహల్లోహితమనే సరస్సు

చెంత సంధ్యను చూచాడు. వికసించిన కమలాలతో నిండి ఉన్న ఆ సరస్సు ప్రదోష కాలంలో ఉదయించే చంద్రునితోను, నక్షత్రాలతోను శోభిస్తూన్న ఆకాశంలా ఉంది. ఆమెను చూచి ఇలా ప్రశ్నించాడు: "ఓ మంగళ స్వరూపురాలా! ఈ నిర్జనమైన కొండపైకి ఎందుకొచ్చావు? నీ వెవరి కుమార్తెవు? నువ్వేం చెయ్యదల్చుకొన్నావు? రహస్యం కాకపోతే చెప్పు! నీ ముఖం దిగులుగా ఉంది. కారణమేమిటి?

అప్పుడు సంధ్య మూర్తీభవించిన బ్రహ్మచర్యమా అన్నట్లు జటాధారియై అగ్నిలా ప్రకాశిస్తూన్న తపోనిష్ఠుడైన వసిష్ఠునకు ఆదరంతో ప్రణామం చేసి ఇలా అంది: "ఓ పూజ్యుడా! నేనే ప్రయోజనాన్ని కోరి ఈ తపోవనానికి వచ్చానో మీ దర్శన భాగ్యం చేత అది నెరవేరినట్లే భావిస్తున్నాను." పిమ్మట తన వృత్తాంతాన్ని చెప్పి తపస్స్వరూపాన్ని వివరించమని కోరింది. బ్రహ్మవేత్త ఐన వసిష్ఠుడు ఆమె దీక్షకు మనసులో సంతోషించి శంకరుని స్మరించి ఇలా ఉపదేశించాడు. "హే భద్రా! ఎవరు తేజోమూర్తులలోకెల్లా గొప్ప తేజోమూర్తియో, ఎవరు తపోధనుడో, పూజ్యుడో అట్టి శంకరుణ్ణి మనస్సులో ధ్యాన మూర్తిగా నిలుపుకో! చతుర్విధ పురుషార్థాలకు ఏకైక ప్రథమ కారణము, జగత్తుకు ఆది ఐన శంభుణ్ణి సేవించు. 'ఓం నమఃశ్శంకరాయ ఓం' అను ఆద్యంతముల యందు 'ఓం' కారంగల మంత్రాన్ని జపించు. మౌనంగా స్నానం చేసి, మౌనంగా శివుణ్ణి పూజించు! నీకు తపస్సు ఫలిస్తుంది. శీఘ్రంగా శంకరుడు ప్రసన్నుడై ఇష్టార్థాలనిస్తాడు." ఇలా చెప్పి అంతర్ధానమయ్యాడు వసిష్ఠుడు.

**సంధ్య తపస్సు**

మునులారా! వసిష్ఠ వచనానుసారంగా సంధ్య యోగ్యమైన వస్త్రధారణ చేసి సరోవరతీరంలో తపశ్చర్యకు పూనుకొంది. చిత్తాన్ని అన్యధాయత్తం కానీకుండ ఏకాగ్రమైన మనస్సుతో ఆమె తపస్సు చేస్తూండగా ఒక మహాయుగ కాలం గడిచి పోయింది. ఆమె ఉగ్రతపస్సుకు ప్రసన్నుడైన పరమేశ్వరుడు ఆమె ఏ రూపాన్ని ధ్యానం చేసిందో ఆ రూపంతోనే అంతటా ప్రత్యక్షమయ్యాడు. ప్రసన్నవదనుడు, శాంతుడు ఐన శంకరుని చూచి సంతత ధారాపాతంగా కన్నుల అశ్రుధార లొలుక కించిదాశ్చర్యాన్ని, వెరపును పొంది సంధ్య నేనేం మాట్లాడాలి? ఎలా స్తుతించాలి? అని చింతిల్లి కళ్ళు మూసుకొంది.

ఆమె హృదయంలో వెంటనే హరుడు ప్రవేశించి ఆమెకు దివ్యజ్ఞానాన్ని, దివ్య వాక్కును, దివ్య నేత్రాలను అనుగ్రహించగా ఆమె ఇలా వేద సమంచిత వాక్కులతో స్తుతించింది.

మునులారా! ఆనాడు సంధ్య చేసిన ఈ స్తుతి మహా మహిమోపేత మైనది. పవిత్రమైనది, శుభకరమైనది సుమా!

**సంధ్యా స్తుతి:**

**శ్లో॥ నిరాకారం జ్ఞానగమ్యం పరం యన్నైవ స్థూలం నాపి సూక్ష్మం నచోచ్చమ్ ।**
**అంతశ్చింత్యం యోగిభిస్తస్య రూపం తస్మైతుభ్యం లోకకర్త్రే నమోఽస్తు ॥**
**సర్వం శాంతం నిర్మలం నిర్వికారం జ్ఞానగమ్యం స్వప్రకాశేఽవికారమ్ ।**
**ఖాద్వ ప్రఖ్యం ధ్వాంతమార్గా త్పరస్తా ద్రూపం యస్య త్వాం నమామి ప్రసన్నమ్ ॥**
**ఏకం శుద్ధం దీప్యమానం తథా జం చిదానందం సహజం చావికారి ।**
**నిత్యానందం సత్యభూతి ప్రసన్నం యస్య శ్రీదం రూపమస్మై నమస్తే ॥**
**గగనం భూర్దిశశ్చైవ సలిలం జ్యోతిరేవచ ।**
**పునః కాలశ్చ రూపాణి యస్య తుభ్యం నమోస్తుతే ॥**

**తా॥** ఈశ్వరా! నువ్వు నిరాకారుడవు! సర్వాతీతమైన నీ తత్త్వం జ్ఞాన గమ్యం. స్థూల, సూక్ష్మ, ఉన్నత స్థితులకు మించి ఉంటుంది నీ రూపం. సదా యోగుల హృదయంలో భాసించే లోకకర్తవైన నీకు నమస్కారం. సర్వ వ్యాపకము, శాంతము, నిర్మలము, నిర్వికారము, జ్ఞాన గమ్యము, స్వప్రకాశము నందు ఏ వికారములు లేనిది, సంసారమనే తమో మార్గానికి అతీతంగా చిదాకాశంలో యోగులకు ప్రసిద్ధమైనది అగు రూపంగల నీకు నమస్కారం. అద్వయము, శుద్ధము, స్వయం జ్యోతి రూపము, అజాతము, చిదానందము, ఆనంద ఘనము, వికార రహితము, స్వరూప భూతము, శాశ్వతానంద రూపము, సత్యమనే సంపదచే ప్రసన్నమై సంపదల నిచ్చునది అగు రూపంగల నీకు నమస్కారం. ఆకాశము, భూమి, దిక్కులు, నీరు, అగ్ని, కాలము ఇవి నీ రూపాలే! అట్టి నీకు నమస్కారం.

**శ్లో॥ విద్యాకారో ద్భావనీయం ప్రభిన్నం సత్త్వచ్ఛందం ధ్యేయమాత్మ స్వరూపం ।**
**సారం పారం పావనానాం పవిత్రం తస్మై రూపం యస్య చైవం నమస్తే ॥**
**యత్త్వాకారం శుద్ధరూపం మనోజ్ఞం రత్నాకల్పం స్వచ్ఛ కర్పూర గౌరమ్ ।**
**ఇష్టాభీతే శూలముండే దధానం హస్తైర్నమో యోగయుక్తాయ తుభ్యమ్ ॥**
**ప్రధాన పురుషౌ యస్య కాయత్వేన వినిర్గతౌ ।**
**తస్మా దవ్యక్త రూపాయ శంకరాయ నమో నమః ॥**
**యో బ్రహ్మా కురుతే సృష్టిం యో విష్ణుః కురుతే స్థితిమ్ ।**

**సంహరిష్యతి యో రుద్ర స్తస్మై తుభ్యం నమో నమః ॥**
**త్వం పరః పరమాత్మాచ త్వం విద్యా వివిధా హరః ।**
**సద్బ్రహ్మ చ పరం బ్రహ్మ విచారణ పరాయణః ॥**

**తా॥** మిథ్యాజగత్తు కంటె భిన్నమైనది, సత్త్వగుణ ప్రధానమైనది, ప్రత్యగాత్మ కంటె అభిన్నమైనది ఐన నీ రూపం జ్ఞానం చేత మాత్రమే తెలియబడుతుంది. భక్తులచే ధ్యానింపబడునది, సారభూతమైనది, అలౌకికమైనది, పావనమైన తీర్థాలను సైతం పావనము చేయునది అగు రూపంగల నీకు నమస్కారం. నీ రూపం శుద్ధమైనది, మనోహరమైనది, రత్నములచే అలంకరింపబడినది, స్వచ్ఛమైన కర్పూరంవలె తెల్లనైనది. చేతులతో అభయ వరద ముద్రలను, శూలాన్ని, కపాలాన్ని ధరించిన యోగీశ్వరుడవగు నీకు నమస్కారం. ఎవని శరీరం నుండి ప్రధానము, పురుషుడు ఉద్భవించాయో అట్టి ఇంద్రియాతీతమైన రూపంగల శంకరునకు అనేక నమస్కారాలు. బ్రహ్మ రూపంలో సృష్టిని, విష్ణు రూపంలో స్థితిని, రుద్రుని రూపంలో సంహారాన్ని చేసే నీకు అనేక నమస్కారాలు. నీవు సర్వ శ్రేష్ఠుడవు. పరమాత్మవు. వివిధ విద్యలు నీ స్వరూపమే! నీవు హరుడవు! జ్ఞానం చేత మాత్రమే లభ్యమయ్యే సద్ఘనుడవు, పర బ్రహ్మవు నీవే!

**శ్లో॥ నమో నమః కారణ కారణాయ దివ్యామృత జ్ఞాన విభూతి దాయ ।**
**సమస్త లోకాంతర భూతిదాయ ప్రకాశ రూపాయ పరాత్పరాయ ॥**
**యస్యాఽపరం నో జగదుచ్యతే పదాత్ క్షితిర్దిశ స్సూర్య ఇందుర్మనోజః ।**
**బహిర్ముఖా నాభితశ్చాంతరిక్షం తస్మై తుభ్యం శంభవే మే నమోఽస్తు ॥**
**యస్య నాదిర్న మధ్యం చ నాంతమస్తి జగద్యతః ।**
**కథం స్తోష్యామి తందేవం వాఙ్మనోఽగోచరం హరమ్ ॥**

**తా॥** సర్వ కారణ కారణుడు, దివ్యమైన అమృతం వంటి జ్ఞాన సంపద నిచ్చేవాడు, ఇతర పుణ్య లోకాలలో కూడా సంపదనిచ్చే వాడు, ప్రకాశ స్వరూపుడు, పరాత్పరుడు అగు నీకు నమస్కారం. పంచ భూతాలు, దిక్కులు, సూర్యచంద్రులు, మన్మథుడు ఇత్యాది జగత్తు శివుని కంటె భిన్నం కాదని శాస్త్రాలు చెపుతున్నాయి. అంతర్ముఖులే గాక బహిర్ముఖులు కూడా నీ స్వరూపమే. నీ నాభి నుండే అంతరిక్షం ఏర్పడింది. హే శంకరా! అట్టి నీకు నమస్కారం. ఎవనికి ఆది మధ్యాంతములు లేవో, ఎవని నుండి ఈ సృష్టి అంతా వ్యక్తమైందో అట్టి నీకు నమస్కారం. వాక్కుకు, మనస్సుకు గోచరం కాని ఆ దేవదేవుడవైన శంకరా నేను నిన్నెలా స్తుతించగలను?

**శ్లో॥ యస్య బ్రహ్మాదయోదేవా మునయశ్చ తపోధనాః ।**
**న విప్రణ్వంతి రూపాణి వర్ణనీయాః కథాం స మే ॥**
**స్త్రియా మయా తే కింజ్ఞేయా నిర్గుణస్య గుణాః ప్రభో ।**
**నైవ జానంతి యద్రూపం సేంద్రా అపి సురాసురాః ॥**
**నమస్తుభ్యం మహేశాన నమస్తుభ్యం తపోమయ ।**
**ప్రసీద శంభోదేవేశ భూయో భూయో నమోఽస్తుతే ॥**

**తా॥** ఎవని రూపాలను బ్రహ్మాది దేవతలు, తపోనిష్ఠులైన బ్రహ్మర్షులు కూడ వర్ణించ లేరో, అట్టి రూపాలను నేనెలా వర్ణించగలను? హే ప్రభూ! ఎవని రూపాన్ని ఇంద్రాది దేవతలు, రాక్షసులు కూడా తెలియలేరో అట్టి నిర్గుణవైన నిన్ను స్త్రీనైన నేనెట్లా తెలియ గలను? ఓ మహేశ్వరా! నీకు నమస్కారం! ఓ తపోమయా! నీకు నమస్కారం! నాపై దయ చూపు! హే దేవదేవా! నీకు అనంత కోటి నమస్కారాలు!

అర్థ గాంభీర్యం గల వాక్కులతో సంధ్య చేసిన ఈ స్తుతిని విని శంకరుడు పరమానంద భరితుడయ్యాడు. జడలు కట్టిన కేశపాశంతో, నార చీరను, లేడి చర్మాన్ని ధరించి మంచు దెబ్బకు వాడిపోయిన పద్మంవంటి ముఖంతో మూర్తీభవించిన తపస్వినిలా ఉన్న ఆమెను వీక్షించి అపార కృపారసం వెల్లి విరియ శంకరుడిలా అన్నాడు.

"హే భద్రే! నీ తపస్సుచేత, స్తోత్రంచేత కూడ నే సంప్రీతుడనయ్యాను. ఓ శుభకరమైన బుద్ధి కలదానా! వరాన్ని కోరుకో! నీ మనసులో ఉన్న కార్యసిద్ధిని కలిగిస్తాను. నీకు మంగళమగు గాక!"

శంకరుని పల్కులకు పరమానంద భరితురాలైన సంధ్య, పారవశ్యంతో అనేక ప్రణామాల నాచరించి ఇలా అంది. "ఓ మహాదేవా! నేను నీ వరానుగ్రహానికి యోగ్యురాలనైతే, నా పాపం నుండి పరిశుద్ధురాలనైతే, ఈ జగత్తులో సమస్త ప్రాణులు పుట్టుక తోడనే కామం గలవిగా పుట్టకుండు గాక! ఈ వృత్తాంతం లోక ప్రసిద్ధిని పొంది నేను అపకీర్తిని పొందకుందును గాక! ఇది నా మొదటి వరం. ఏ వ్యక్తిపైన కామంతో కూడిన నా చూపు పడకుండు గాక! హే నాథా! నన్ను సతిగా పాణిగ్రహణం చేయబోయే పురుషుడు సుహృదుడై నాకు మంచి స్నేహితుడై ఉండు గాక! నన్ను కామంతో చూచే వ్యక్తి యొక్క పురుషత్వం నశించి వాడు నపుంసకుడగుగాక! ఇది నా రెండవ వరం.

పరిశుద్ధాంతః కరణంతో, లోక హితాన్ని కోరి సంధ్యాదేవి ప్రార్థించిన రెండు వరాలను అనుగ్రహించి శివుడిలా అన్నాడు. "ఓ పతివ్రతా శిరోమణీ! మంగళాంగీ! విను, తపస్సుచే పరిశుద్ధురాలవయ్యావు. నీ పాపం భస్మీభూతమైంది. నీ మీది కోపాన్ని విడిచి పెట్టేశాను. ఈ పైన మానవులు శైశవం, కౌమారం, యౌవనం, వార్ధక్యం అనే నాలుగు దశలను క్రమంగా పొందుతారు. కౌమారావస్థ అంతంలోను యౌవన ప్రాదుర్భావం లోను మాత్రమే కామ భావనను కలిగి ఉంటారు. ఈ పైన ప్రాణులు పుట్టుక తోడనే కామ వాంఛకలవారు గాకుందురు గాక! శుభాంగీ! మూడు లోకాల్లోను ఇతర స్త్రీల కెవ్వరికి లేని పాతివ్రత్య భావాన్ని పొందగలవు. నీ భర్త తప్ప ఇతరులు నిన్ను కామనతో చూస్తే అట్టి వాడు నీవు కోరినట్లే నపుంసకుడు, దుర్బలుడు అవుతాడు. మహాత్ముడు, తపశ్శాలి, రూపవంతుడు ఐన సత్పురుషుడు నీకు పతి కాగలడు. అతనితో కూడి మీరిద్దరూ అన్యోన్యంగా సప్త కల్పాంతాల వరకు జీవిస్తారు.

ఓ పరిశుద్ధురాలా! నువ్వు తపస్సు ప్రారంభించి ఇప్పటికి ఒక మహాయుగ కాలం గడిచింది. కృతయుగం అంతరించి త్రేతాయుగం నడుస్తోంది. నీ పూర్వ జన్మలో ఈ శరీరాన్ని అగ్నికి ఆహుతి చేస్తానని ప్రతిజ్ఞ చేశావు. అది నెరవేరే ఉపాయం చెపుతున్నాను విను. ఇప్పుడు నడుస్తున్న త్రేతాయుగంలోని మొదటి పాదంలో దక్ష ప్రజాపతికి అనేక మంది కన్యలు కలిగారు. వారు మితభాషిణులు, శీలసంపన్నలు. వారందరికి దక్షుడు యథోచితంగా వివాహం చేశాడు. అందులో ఇరవైఏడు మందిని చంద్రునికిచ్చి కళ్యాణం జరిపించాడు. చంద్రుడు ఇతర భార్యలను పరిత్యజించి రోహిణి యందు ప్రీతి మానసుడయ్యాడు. ఆ కారణంగా దక్షుడు కోపించి చంద్రుని శపించగా దేవతలందరు నీవున్న చోటుకు వచ్చారు. కాని నా యందు లగ్నమైన మనస్సుగల నువ్వు వారిని గమనించలేదు.

బ్రహ్మగారు కూడా వచ్చి ఆకాశంవైపు చూచి చంద్రుడు పూర్వరూపాన్ని ఎలా పొందుతాడా అని చింతించి చంద్రశాప విముక్తికై ఈ చంద్రభాగా నదిని సృష్టించాడు. అదే సమయంలో మహా తపస్సంపన్నుడైన మేధాతిథి కూడా వచ్చాడు. ఆయన పన్నెండు సంవత్సరాలు అతి విస్తృతమైన జ్యోతిష్టోమమనే శ్రౌత యజ్ఞాన్ని ప్రారంభించాడు. అదిప్పుడు కొనసాగుతోంది. ఆ శ్రౌతాగ్ని మహా ప్రకాశమానంగా వెలుగుతోంది. నువ్వు వెంటనే అక్కడికి వెళ్ళు. పవిత్రురాలవైన నువ్వు నీ దేహాన్ని ఈ ప్రజ్వలితాగ్నిలో విడిచిపెట్టు. నా

అనుగ్రహించే నీవు అన్యులకు గోచరించవు." ఈ విధంగా శంకరుడు ఆమెకు హితోపదేశం చేసి అంతర్ధానమయ్యాడు.

**అరుంధతీ వృత్తాంతం**

శంకర వచనానుసారంగా సంధ్య మేథాతిథి యజ్ఞశాలకు వెళ్ళి తనకు గతంలో తపశ్చర్యా విధానాన్ని బ్రహ్మచారి రూపంలో వచ్చి ఉపదేశించిన బ్రహ్మమానస పుత్రుడైన వసిష్ఠ మహర్షిని మనసులో భర్తగా స్వీకరించి, ఈశ్వర వర ప్రభావంచే అన్యులకు దృష్టి గోచరం కాకుండా అమ్మహాయజ్ఞ ప్రజ్వలితాగ్ని యందు ఆనందంతో ప్రవేశించి పురోడాశ రూపంలో తక్షణం దగ్ధమైంది. వెంటనే పురోడాశ గంధం సర్వత్రా వ్యాపించినా ఆ గంధహేతువు ఎవ్వరికి తెలియలేదు.

శివుని ఆజ్ఞచే అగ్ని ఆమె శరీరాన్ని దహించి, శుద్ధమైన సూక్ష్మ శరీరాన్ని సూర్యమండల మందు ప్రవేశపెట్టాడు. సూర్యుడామె శరీరాన్ని రెండుగా విభజించి పితరులకు, దేవతలకు ప్రీతిని కలిగించే నిమిత్తం తన రథమందు శాశ్వతంగా స్థాపించాడు. మునులారా ఆ సంధ్యాదేవి యొక్క ఊర్ధ్వ భాగం రాత్రిందివాల మధ్య ప్రాతస్సంధ్య ఐంది. ఈ ఉదయ సంధ్య దేవతా ప్రీతికరం. మిగిలిన భాగం దివారాత్రాల మధ్య సాయం సంధ్య ఐంది. ఇది పితరులకు ప్రీతిని కలిగిస్తుంది.

అప్పుడు దయాళువైన శంకరుడు సంధ్యయొక్క ప్రాణాలను మనస్సుతో కలిపి సూక్ష్మ శరీర నిర్మాణం చేసి, ఆ సూక్ష్మ శరీరంతో ఒక అందమైన బాలికను యజ్ఞవేదిక నుండి సృష్టించాడు. యజ్ఞం పరిసమాప్తం కాగానే యజ్ఞవేదికా మధ్యమందు తప్తకాంచన ప్రభలతో దేదీవ్యమానంగా వెలిగి పోతున్న బాలికను మేథాతిథి మునుల ఆమోదంతో మహదానంతో కుమార్తెగా స్వీకరించి స్నానం చేయించి తన ఒడిలో కూర్చుండ పెట్టుకొని లాలించాడు. ఆమె ఏ కారణం చేత కూడా ధర్మానికి అడ్డుపడదు. ఆ కారణంగా ఆమెకు 'అరుంధతి' అని అన్వర్థ నామాన్ని ఉంచారు మహర్షి.

ఆ బాలిక చంద్రభాగా నదీతీరమందు తాపసారణ్యం అనే పేరుగల మేథాతిథి ఆశ్రమంలో పెరిగి ఆ ప్రాంతాన్నంతటిని పవిత్రీకృతం చేసింది. త్రిమూర్తులతో కూడి దేవతలందరు ఆ బాలికను బ్రహ్మ మానస పుత్రుడైన వసిష్ఠునకిచ్చి వివాహం జరిపించారు. ఆ సమయంలో సుఖవర్ధనమైన గొప్ప ఉత్సవం జరిగింది. ఆ ఉత్సవ వేళ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల కరకంజాతాల నుండి జారిపడిన నీటి నుండి పరమ పావనములైన శిప్ర మొదలగు ఏడు నదులు పుట్టాయి. అరుంధతీ వసిష్ఠులకు శక్తి మొదలగు కుమారులు

కలిగారు." పరమ పవిత్రమైన ఈ గాథను విన్నా, చదివినా వారికి ఇష్టకామ్యార్థ సిద్ధి కలుగుతుందని శంకరుడు వరమిచ్చాడు.

### వసంతుని ఆవిర్భావం

సూతుడు మునులతో ఇలా అంటున్నాడు: "ఓ మహర్షులారా! నారదుడు ప్రశ్నింపగా బ్రహ్మగారు చెప్పిన తరువాత కథను మీకు చెపుతున్నాను వినండి. తన కూతురైన సంధ్య విషయంలో తానే వ్యామోహాన్ని పొందిన పితామహుని ఎదుట ప్రత్యక్షమై హితోపదేశం చేసి అంతర్ధానమైన శంకరుని యందు ఈర్ష్యను పొందేడు బ్రహ్మగారు. ఏ ఉపాయం చేతనైనా సరే శంభుని కాంతా వ్యామోహ పీడితునిగా చేస్తే తప్ప తనకీ అవమాన భారం తొలగదని సంకల్పించి తన కుమారులైన దక్షమరీచ్యాదులను పిలిచి ఇలా అన్నాడు.

"కుమారులారా! విషదగ్ధమైన శరాఘాతంలా శంకరుని పల్కులు నన్ను బాధిస్తున్నాయి. కేవలం కాంతయందు మనసులో అభిలాషను మాత్రమే పొందాను. దానికే శంభుడు నన్ను గర్హించాడు. నన్నే కాదు మిమ్ములను కూడా ధిక్కరించాడు. ఈ అవమాన భారం నన్ను దహిస్తోంది. మీరే ఉపాయం చేతనైనా సరే శంకరుని సంసారపాశ బద్ధుణ్ణి చెయ్యండి. నిరంతర యోగమార్గావలంబియైన శంకరుని మనస్సును చలింప చెయ్యడం దుష్కరం. ఐనా చేసి తీరాలి. ఈ కార్యంలో లోకహితం కూడా ఉంది."

తన కుమారులనిలా ప్రోత్సహించి రతీసహితుడై నిలబడి ఉన్న మన్మథుని చూచి "హే కుమారా! నువ్వు నా పుత్రులలో శ్రేష్ఠుడవు! సర్వదా సుఖదాయకుడవు! సహధర్మ చారిణి ఐన రతితో కూడి ప్రకాశమానంగా ఉన్నావు. మీ జంట పద్మాలతో నిండిన సరోవరంవలె, మెరుపుతో కూడిన మేఘం వలె, చంద్రునితో ప్రకాశిస్తూన్న రాత్రివలె, లక్ష్మీ శోభితుడైన హరివలె మహా శోభాయమానంగా, నయనానంద కరంగా ఉంది. మీ దాంపత్యం శ్లాఘనీయం. నీవలెనే శివుణ్ణి కూడా ఇంటివాణ్ణి చెయ్యి. నామాట విను. పితృవాక్య పరిపాలన పుత్రులకు కర్తవ్యం గదా! ఇది వేద మార్గం. ఇందులో జగద్ధితం కూడా ఉంది. ఈ కార్యం నీ వల్ల మాత్రమే నెరవేరుతుంది. తప్పదు! చెయ్యాలి!" అని విధాత నియంత్రించగా మదనుడిలా అన్నాడు.

"తండ్రీ! నీ ఆజ్ఞను తప్పక నెరవేరుస్తాను. కాని నా మహాస్త్రం స్త్రీ. శంకరుని మోహింప చేయగల అట్టిస్త్రీని సృష్టించు. ముందు శంకరుని ఆపై ఆమెను మోహింప చేస్తాను."

మన్మథుని మాటల్లోని సత్యాన్ని గుర్తించిన విధాత "శివుణ్ణి మోహింప చేయగల స్త్రీ ఎవరా?" అని చింతను చేస్తూ ఒక దీర్ఘ నిశ్వాసను విడిచి పెట్టాడు. దాని నుండి వసంతుడు పుట్టాడు. అతడు పుష్పమాలా విభూషితుడు. శోణ రాజీవ సంకాశుడు. పద్మ దళాయతాక్షుడు. పూర్ణచంద్ర ముఖుడు. శ్యామ వర్ణుడు. సర్వాంగ సుందరుడు. సంపూర్ణ సర్వ లక్షణుడు. కోదండ రేఖా మండిత పాద చిహ్నితుడు.

కుసుమాకరుడైన వసంతుడు పుట్టగానే సుగంధ బంధురమైన మలయానిలం మంద మందంగా వీచింది. తరులన్ని విరులతో మురువు చూపేయి. కోమల కుహూకార పంచమ స్వరంతో కలకంఠాలు కూసినై. నిర్మల జలపూరిత సరోవరాలన్ని ప్రఫుల్ల పద్మాలతో శోభించాయి. అట్టి వసంత ప్రాదుర్భావంతో సకల లోకాలు ఆహ్లాదభరిత మయ్యాయి.

లోకోత్తముడైన వసంతుని చూచి సంతోషంతో పితామహుడు కందర్పునితో ఇలా అన్నాడు: "ఓ మన్మథా! నీతో సమానమైన ఈతడు, నీకు సహచరునిగా ఉండి అనుకూలంగా నీకన్ని కార్యాలను నెరవేర్చగలడు. అగ్నికి వాయువువలె నీకితడు ఉపకరిస్తాడు. ప్రసన్నంగా ఉన్నవారి మనస్సులలో స్త్రీ విషయమైన కామవాంఛను (రతిని) కలిగిస్తాడు కనుకను ఈ పైనుండి నువ్వెప్పుడూ ఇతని యందే ఉంటావు కనుకను ఇతనికి 'వసంతుడు' అని అన్వర్థ నామధేయాన్నుంచాను. మలయ పవనుడు ఈ వసంతునికి సహాయుడుగా ఉంటాడు.

అంతేగాదు 1. భావము, 2. హావము, 3. హేల, 4. మాధుర్యము, 5. ధైర్యము, 6. లీల, 7. విలాసము, 8. విచ్ఛిత్తి, 9. విభ్రమము, 10. కిలికించితము, 11. మోట్టాయితము, 12. కుట్టమితము, 13. బిబ్బోకము, 14. లలితము, 15. కుతూహలము, 16. చకితము, 17. విహృతము, 18. హాసము అనే ఈ పద్దెనిమిది శృంగార చేష్టలు నీకు సహకరిస్తాయి.

కుమారా! వీటికి తోడుగా కర్మాశ్రయాలైన కళలు ఇరవై నాలుగు, ద్యూతాశ్రయాలైన కళలు ఇరవై, శయనోప చారికములైన కళలు పదహారు, ఉత్తర కళలు నాలుగు మొత్తం అరవై నాలుగు కళలు కూడా నీకు సహాయంగా ఉంటాయి. వీరు నీకు స్నేహితులైనట్లే రతికి కూడా ఇష్టులుగా ఉంటారు. వీరందరి సహకారంతో నే చెప్పిన గొప్ప కార్యాన్ని మహోత్సాహంతో సిద్ధింప చెయ్యి. హరుని మోహింప చేయగల సుందరాంగిని మనసులో పరిపూర్ణంగా భావన చేసి ప్రయత్న పూర్వకంగా సృష్టిస్తాను.

బ్రహ్మ పలుకులకు సంప్రీతుడైన మదనుడు అక్కడున్న వారందరి పాదపద్మాలకు నమస్కరించి, వారి ఆశీర్వచనాలను పొంది శివస్థానానికి పయనమయ్యాడు.

**మారగణముల పుట్టుక**

మహావీరుడు, మోహ కారకుడు ఐన మన్మథుడు తన అనుచర గణంతో శివస్థానానికి వెళ్ళగానే అక్కడొక చిత్రమైన వృత్తాంతం జరిగింది వినండి!

మారుడు తన ప్రభావాన్ని విస్తరింప జేసి సకల ప్రాణులను మోహపెట్టాడు. వసంతాగమనంతో వనంలో తరువులన్నీ వికసిత కుసుమ మంజరులతో అతిలోక సుందరంగా తోచాయి. శీతల సుగంధ వాయువులు వీచాయి. శుక, పిక, శారికాది ద్విజ గణాలన్ని కిలకిలారావంతో కలస్వరంతో గానం చేశాయి. కుసుమ పరాగపు రాశులు తిన్నెలై నిలిచాయి. పుష్ప మకరందం వర్షంగా కురిసింది. వెన్నెల విరిసింది. చక్రవాక పక్షుల జంటలు దాంపత్యధర్మ క్రీడా వినోదంతో మురిశాయి. మయూర మిధునాలు శృంగార రసోద్రేక హేతువులై, చిత్రగతుల నర్తనం చేశాయి. లతాపరివేష్టితమైన క్షితిరుహాలన్ని పరస్పరాలింగన సౌభాగ్యంతో పులకించి పోతున్నాయి. అహో! ఏమా దృశ్యం! చేతనా చేతనమైన జగత్తు శృంగారపు పొంగులో నింగి ముట్టింది. సర్వము కామతంత్ర పరాధీనమే!

ఐనా మహాదేవుడు, సర్వజ్ఞుడు ఐన శివునిలోను, ఆయన గణాలలోను ఎట్టి మన్మథ వికారం పుట్టనే లేదు. మన్మథుడు తను పట్టిన పట్టు విడిచి పెట్టనూ లేదు. ఆయన సమాధి స్థితిలో ఉన్నప్పుడూ లేనప్పుడూ లేదా హిమవత్పర్వత ప్రాంత మైదానాలలో సంచరిస్తున్నప్పుడూ ఎక్కడున్నా మదనుడు అదనుచూచి వెంబడించి తన ప్రభావాన్ని ప్రకటిస్తూనే వచ్చాడు.

తన ప్రయత్నాలన్ని నిష్ఫలం కాగా ఖిన్నుడై బ్రహ్మను చేరి గద్గద స్వరంతో ఇలా అన్నాడు: "హే బ్రహ్మన్! యోగనిష్ఠుడైన శంభుని మోహింప చేయటం అసాధ్యం. నేనే కాదు లోకంలో ఎవరివల్ల కాదు. త్రినేత్రుడు, జటాజూట ధరుడు, కాలకంఠుడు ఐన ఆయన ముందు నిలబడ గల్గిన వారెవ్వరు?"

వీరాధి వీరుడైన పుష్పధన్వుని బేల మాటలను విన్న పితామహుని మనస్సు దుఃఖంతో నిండి పోయింది. దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచాడు. ఆ నిశ్వాస మారుతం నుండి అసంఖ్యాకంగా మహాబలులు, భయంకరులు, చంచలులు ఐన గణాలు పుట్టుకొచ్చాయి. వారందరు లేమావి చిగురులవలె నాలుకలు వ్రేలాడగా భేరి, పటహ ఇత్యాది భయంకర వాద్యాలను మ్రోగిస్తూ "చంపండి! నరకండి!" అంటూ అరుస్తున్నారు.

అప్పుడు మారుడు వారందరిని వారించి బ్రహ్మతో ఇలా అన్నాడు: "ఓ విధాతా! వీరందరిని సృష్టించిన వాడవు నీవే. వీరందరికి నామకరణం చేసి, నివాసాన్ని ఏర్పాటు చేసి, కర్తవ్యాన్ని బోధించి, కర్మల యందు వినియోగించండి."

మారుని ఆంతర్యాన్ని గుర్తించిన సృష్టికర్త ఇలా అన్నాడు: "ఓ మీనకేతనా! వీరు పుడుతూనే మారయ (చంపుడు) మారయ అంటూ అరిచారు కనుక వీరు మారులు అని పిలువబడుతారు. నిన్ను అనుసరించి నువ్వు చెప్పిన పని చేస్తారు. నీ పుష్పబాణాలకు వశమైన మానవులకు చిత్త భ్రాంతిని కలిగిస్తారు. జ్ఞాన మార్గంలో ఉన్న వారికి విఘ్నాలను కల్పిస్తారు. వీరే మారగణాలు. వీరి సహాయంతో శివుని మోహింప చెయ్యి!"

బ్రహ్మ మాటలకు మారునిలో కొంత ధైర్యం వచ్చి, ముఖంలో ప్రసన్నత గోచరించింది. ఐనా గతానుభవం దృష్ట్యా నిశ్చయంగా కార్యసిద్ధి అవుతుందని నమ్మకం కలగలేదు. పైగా ముక్కంటి ఐన శంకరుడు తన భయంకర ఫాలాగ్ని కీలలతో భస్మం చేస్తాడేమో అని భయకంపితుడయ్యాడు. ధైర్యంతో కర్తవ్యనిష్ఠకు పూనుకొని రతీవసంతులతో, మారగణంతో శివధామానికి వెళ్ళాడు. వెళ్ళి ఇంతకు ముందు కంటె బహు విధోపాయాలను ప్రయోగించాడు మదనుడు. శివ ప్రభువుకు ఎట్టి మోహము పుట్టలేదు. తేజోహీనమైన ముఖంతో విరించి చెంతకు వచ్చి "పితామహా! శివుని విషయంలో నేను పరాజయాన్ని పొందాను. నా పూర్వ పుణ్య విశేషం వల్ల ఆ లోకపూజ్యుడు నన్ను భస్మం చెయ్యలేదు. మీకంత పట్టుదల ఉంటే మరో ఉపాయాన్ని అన్వేషించండి" అని చెప్పి కుసుమ శరుడు తన నిజస్థానానికి తరలి వెళ్ళాడు.

**బ్రహ్మకు జ్ఞానోదయమగుట**

మన్మథుడు పరాజయాన్ని పొంది అలా స్వస్థాన గతుడు కాగానే బ్రహ్మగారి దుఃఖం రెట్టింపయ్యింది. నిర్వికారుడు, జితేంద్రియుడు, యోగతత్పరుడు ఐన శంకరుడు వివాహమాడే ఉపాయమేది అని తీవ్రంగా ఆలోచించి, తండ్రి ఐన విష్ణువును స్మరించాడు. వెంటనే చతుర్భుజుడు, అరవిందాక్షుడు, శంఖశార్ఙ్గ గదాధరుడు, పీతాంబరధరుడు, నీలమేఘశ్యాముడు, భక్తవత్సలుడు ఐన హరి అక్కడ ప్రత్యక్షమై ఇలా అన్నాడు. "కుమారా! సృష్టికర్తవైన నువ్వు మహా ప్రాజ్ఞుడవు! ధన్యుడవు! నన్ను స్మరించిన కారణం ఏమిటి? నీ దుఃఖాన్ని నివారిస్తాను. సంశయం వద్దు. చెప్పు."

విష్ణువు యొక్క మాటలకు ఉత్సాహాన్ని పొందిన పితామహుడు తన ప్రయత్నభంగాన్ని ఆయన ముందు వెల్లడించి ఉపాయాన్ని చెప్పి దుఃఖోపశమనాన్ని చెయ్యవలసిందిగా కోరేడు. శివ తత్త్వ విశారదుడు! విజ్ఞుడు ఐన విష్ణువు నవ్వి ఇలా అన్నాడు.

"కుమారా! భ్రమ నివారకము, వేద సారము ఐన నామాట విను. వేద ప్రవర్తకుడవైన నువ్వింత అజ్ఞానంలో ఎలా చిక్కుకున్నావు? సృష్టికర్తవైన నీకు ఇట్టి దుర్బుద్ధి ఎందుకు కలిగింది? వేదాలన్ని ఏ పరమాత్మ తత్త్వాన్ని బోధిస్తున్నాయో దాన్ని స్మరించు. నువ్వు జ్ఞాన విస్మృతిని పొంది జడమతివయ్యావు. పరమేశ్వరుడైన రుద్రుణ్ణి కేవలం నీ కుమారునిగానే భావిస్తున్నావు. ఆయన పరాత్పరుడు, నిర్గుణుడు, నిత్యుడు, సర్వవ్యాపకుడు. ఆయన ఆప్తకాముడు, ఆనంద ఘనుడు, సర్వజ్ఞుడు. సృష్టి, స్థితి, లయ కారకుడు ఆయనే! ఆయననే శరణు పొందు. నీకు సుఖాన్ని ఇస్తాడు. శంకరుడు పత్నీవ్రతుడు కావాలనే కోరిక ఉంటే ఉమను ఉద్దేశించి శివుని స్మరిస్తూ ధ్యానించు. ఆ దేవి ప్రసన్నురాలై, సగుణయై అవతారాన్నెత్తి లోకంలో మనుష్యదేహంతో జన్మించి నిశ్చయంగా శివునికి పత్ని కాగలదు. ఆమెను పుత్రికగా పొందుటకు దక్షుని తపస్సు చెయ్యమని ఆజ్ఞాపించు. కుమారా! ఉమాదేవి సతీ నామధేయంతో దక్ష పుత్రికగా తప్పక అవతరిస్తుంది. తపస్సు చెయ్యి." అని కర్తవ్యాన్ని, హితాన్ని పలికి అంతర్ధానమయ్యాడు విష్ణువు.

కమల సంభవునికి మాయ తొలగి, జ్ఞానోదయమైంది. వెంటనే ఈర్ష్యా గర్వాహంకారాలు నశించాయి.

**బ్రహ్మచేసిన దుర్గా స్తుతి**

అనంతరం బ్రహ్మ విష్ణువు యొక్క ఉపదేశానుసారంగా కర్తవ్య నిష్ఠకు పూనుకొని దుర్గాదేవినిలా స్తుతించాడు.

**శ్లో॥ విద్యా విద్యాత్మికాం శుద్ధాం పరబ్రహ్మ స్వరూపిణీమ్ ।**
**స్తౌమిదేవీం జగద్ధాత్రీం దుర్గాం శంభుప్రియాం సదా ॥**
**సర్వత్ర వ్యాపినీం నిత్యాం నిరాలంబాం నిరాకులామ్ ।**
**త్రిదేవ జననీం వందే స్థూల స్థూలా మరూపిణీమ్ ॥**
**త్వం చితిః పరమానందా పరమాత్మ స్వరూపిణీ ।**
**ప్రసన్నా భవదేవేశి మత్కార్యం కురుతే నమః ॥**

**తా॥** విద్యా స్వరూపిణి మరియు అవిద్యా స్వరూపిణి, శుద్ధ పరబ్రహ్మ రూపిణి, జగన్మాత, సర్వదా శివప్రియ ఐన దుర్గా దేవిని స్తుతిస్తున్నాను. సర్వ వ్యాపకురాలు, నిత్య స్వరూపిణి, ఇతర ఆశ్రయము లేనిది, సంసార దుఃఖము లేనిది, ముల్లోకములకు తల్లి, సర్వోన్నతమైనది, పరమార్థ దృష్టిలో రూపం లేనిది ఐన దుర్గకు నమస్కరిస్తున్నాను. అమ్మా! చైతన్యము, బ్రహ్మానందము నీవే! నీవే పరమాత్మ స్వరూపిణివి! ప్రసన్ను రాలవు కమ్ము! నా కార్యాన్ని సిద్ధింపచెయ్యి. నీకు నమస్కారం.

బ్రహ్మనిష్ఠకు ప్రసన్నురాలైన చండిక ఆయన ముందు సాక్షాత్కరించింది. ఆమె రూపం ఇలా ఉంది.

**శ్లో॥ స్నిగ్ధాంజన ద్యుతి శ్చారు రూపా దివ్య చతుర్భుజా ।**
**సింహస్థా వరహస్తా చ ముక్తామణి కచోత్కటా ॥**
**శరదింద్వాననా శుభ్ర చంద్ర ఫాలా త్రిలోచనా ।**
**సర్వావయవ రమ్యా చ కమలాంఘ్రి నఖద్యుతిః ॥**

**తా॥** కాటుకవలె ప్రకాశించునది, సుందర రూపిణి, నాలుగు భుజములు కలది, సింహ వాహన, చేతియందు వరముద్ర కలది, ముత్యములచే ఒప్పు చూడామణితో ప్రకాశించే కేశ భారము కలది, శరత్కాల చంద్రుని వంటి ముఖము కలది, చంద్రుని వలె స్వచ్ఛమైన ఫాల భాగము కలది, మూడు కన్నులు గలది, సర్వాంగ సుందరి, పద్మముల వంటి పాదముల నఖముల కాంతిచే ఒప్పారునది అగు చండిక సాక్షాత్కరించగానే భక్తితో శిరసు వంచి నమస్కరించి పితామహుడిలా స్తుతించాడు.

**శ్లో॥ నమో నమస్తే జగతః ప్రవృత్తి నివృత్తి రూపే స్థితి సర్గ రూపే ।**
**చరా చరాణాం భవతీ సుశక్తిః సనాతనీ సర్వ విమోహి నీతి ॥**
**యా శ్రీస్సదా కేశవమూర్తి మాలా విశ్వంభరా యా సకలం బిభర్తి ।**
**యాత్వం పురా సృష్టికరీ మహేశీ హర్త్రీ త్రిలోకస్య పరాగుణేభ్యః ॥**
**యా యోగినాం వై మహితా మనోజ్ఞా సా త్వం నమస్తే పరమాణుసారే ।**
**యమాది పూతే హృది యోగినాం యా యా యోగినాం జ్ఞానపథే ప్రతీతా ॥**

**తా॥** ఓ తల్లీ! జగత్తులోని ప్రవృత్తి నివృత్తులు నీ స్వరూపమే! జగత్తు యొక్క సృష్టి, స్థితులు నీ స్వరూపమే! స్థావర జంగ మాత్మకమగు ప్రాణులలో నువ్వు శక్తి రూపంగా ఉండి సర్వప్రాణులను మోహింప చేస్తున్నావు. నీవు సనాతనివి నీకు అనేక నమస్కారాలు. కేశవుని వక్షస్థల మందు అలంకారంగా ఉన్న లక్ష్మీదేవివి నీవే. సకలాన్ని భరించి పోషించు విశ్వంభరవు. నీవు సృష్టి చేసిన మహేశ్వరివి. ముల్లోకాలను లయం చేసేది నీవే. నీవు గుణాతీతురాలవు. యోగులు నిన్ను హృదయాలలో దర్శిస్తారు. అట్టి నీకు నమస్కరిస్తున్నాను. పరమాణువుల లోని సారం (శక్తి) నీవే. యమ, నియమాదులచే పవిత్రమైన యోగుల హృదయాలలో నువ్వు ఉండి వారికి ధ్యాన మార్గంలో దర్శన మిస్తావు.

**శ్లో॥ ప్రకాశ శుద్ధ్యాది యుతా విరాగా సాత్వం హి విద్యా వివిధావలంబా ।
కూటస్థ మవ్యక్త మనంత రూపం త్వం బిభ్రతీ కాలమయీ జగంతి ॥
వికార బీజం ప్రకరోషి నిత్యం గుణాన్వితా సర్వజనేషు నూనమ్ ।
త్వం వై గుణానాం చ శివే త్రయాణాం నిదానభూతా చ తతః పరాసి ॥
సత్వం రజస్తామస ఇత్యమీషాం వికారహీనా సమవస్థితిర్యా ।
స త్వం గుణానాం జగదేకహేతుః బ్రహ్మాండ మారంభసి చాత్సిపాసి ॥
అశేష జగతాం బీజే జ్ఞేయజ్ఞాన స్వరూపిణి ।
జగద్ధితాయ సతతం శివపత్ని నమోఽస్తుతే ॥**

**తా॥** ప్రకాశము, శుద్ధి ఇత్యాది గుణాలచే విరాజిల్లు నీకు రాగద్వేషాలు లేవు. సమస్తమైన విద్యలకు ఆలంబనం నీవు. నీ స్వరూపం కూటస్థం (మార్పులకు లోను కానిది), మరియు ఇంద్రియాలకు అగోచరం. నువ్వే అనంత రూపాలలో ప్రకటమయ్యావు. కాల రూపంలో నువ్వే ముల్లోకాలను ధరించి ఉన్నావు. నువ్వు గుణములతో కూడి సర్వమానవులలో నిత్యము వారికి రాగద్వేషాది వికారములకు మూలమైన అవిద్యా రూపంలో ఉన్నావు. హే శివప్రియే! త్రిగుణాలకు ఆశ్రయ భూతురాలవు. నువ్వు గుణాతీతురాలవు కూడా. త్రిగుణాల వికారాలు నీయందు లేవు. ఉనికి నీవే! జగత్తుకు ఏకైక కారణమైన త్రిగుణాత్మక ప్రకృతి నీవే. ఈ బ్రహ్మాండాన్ని సృష్టించి, రక్షించి, భక్షిస్తున్నావు. సర్వ జగత్తుల బీజం నీవే. జ్ఞేయ, జ్ఞానములు నీ స్వరూపమే. హే శివపత్నీ! లోకక్షేమాన్ని కోరి నేను సర్వదా నీకు నమస్కరిస్తున్నాను.

ఇలా జ్ఞాన మార్గంలో పితామహుడు చేసిన స్తోత్రానికి సంప్రీతురాలైన కాళికాదేవి, వత్సా! నీ మనోరథాన్ని తెలుపవలసింది; తప్పక నీ కోరిక నెరవేరుతుంది అని దయతో పల్కగా బ్రహ్మగారిలా అన్నాడు.

"దేవీ! మహేశ్వరీ! సర్వజ్ఞురాలవైన నీకు తెలియంది లేదు. నీ ఆజ్ఞను అనుసరించి నా మనోరథాన్ని ప్రకటిస్తున్నాను. పూర్వం నా లలాటనుండి పుట్టిన భూత నాథుడైన రుద్రుడు కైలాసగిరిపై యోగనిష్ఠలో ఉండి తపస్సు చేస్తున్నాడు. ఆయన భార్యా సహాయం లేనివాడు. నిర్వికారుడు. లోక హితాన్ని కోరి నిన్ను ప్రార్థిస్తున్నాను. ఆయన నిన్ను వివాహమాడుట కొరకు నీవాయనను మోహింప చేయి. నీవు తక్క ఆయన మనస్సును ఆకర్షింప చేయగల వారు మరొకరు లేరు. నువ్వు దక్షప్రజాపతికి కుమార్తెగా జన్మించి

రుద్రుని మోహింప చేసి ఆయనకు సతివై భక్తుల అభీష్టాలను నెరవేర్చి లోకంలోని స్త్రీలందరకు మాంగళ్య సౌభాగ్యాన్ని ప్రసాదించు. ఆ హరుడు విరాగియై ఉన్న స్థితిలో ఈ సృష్టి ఎలా మంగళకర మవుతుంది? ఈ చింత నన్ను పీడిస్తోంది! నేను కష్టంలో ఉన్నాను. కాపాడు!

సృష్టికర్త ఆంతర్యాన్ని గుర్తించిన దేవి మనసులో శివుని స్మరించి ఆయన అనుజ్ఞను పొంది "ఓ బ్రహ్మన్! శంకరుడు భార్యను స్వీకరించనిదే ఈ సనాతన సృష్టి సంపూర్ణం కాబోదని నువ్వు చేసిన ప్రతిపాదన వాస్తవం. నేను దక్షపుత్రికనై సతీదేవి రూపంలో జన్మించి శంకరునికి సహధర్మచారిణిగా ఉంటాను. లోకంలో అందరు పురుషులు భార్యా విధేయులుగా ఉంటున్నట్లుగానే శంకర స్వామి కూడా నాకు వశవర్తియై ఉండుగాక!" అని పలికి దుర్గాదేవి అంతర్హితురాలైంది.

పద్మ సంభవుడు తన నివాసానికి వెళ్ళి కుమారుల ముందు తన కృతార్థత్వాన్ని సంతోషంతో వెల్లడించి దిగులుమాని సుఖంగా ఉన్నాడు.

**దక్షుని తపస్సు - ఉమాదేవి వరం**

సూతుడు మునులతో ఇలా అంటున్నాడు "మునులారా! బ్రహ్మ-నారద సంవాద రూపంలో నడిచిన తదనంతర వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి. కమల భవుడు దక్షుని పిల్చి దుర్గాదేవి వరప్రదానాన్ని చెప్పి "కుమారా! నువ్వు తక్షణం క్షీరసాగర ఉత్తరతీరానికి వెళ్ళి, జగదంబాదర్శన కాంక్షా తత్పరుడవై తపస్సు ప్రారంభించు. నీకు మేలగు గాక!" అని ఆశీర్వదించి ఆజ్ఞాపించాడు. దక్షుడు తండ్రి మాట చొప్పున తత్తీరానికి వెళ్ళి పవన పర్ణాంబు భక్షుడై ఘోరంగా తపస్సు చేశాడు. జగన్మాత ప్రత్యక్షమై దక్షుని వల్ల అతని మనోగత అభిప్రాయాన్ని గుర్తెరిగి ఇలా ప్రసన్నంగా పలికింది.

"దక్షా! శివుడు ఎన్ని రూపాల్లో ఉన్నా నేనే ఆయన దాసిని. నీవు కోరినట్లే నేను నీ కుమార్తెగా ప్రభవిస్తాను. కాని ఒక్క ఆజ్ఞ! ఏ నాడైతే నువ్వు నాయందు ఆదరాన్ని కోల్పోతావో, ఆనాడే నేను నా దేహత్యాగం చేసి స్వస్వరూపంలో ఉంటాను లేదా మరో దేహాన్ని ధరిస్తాను. ఓ ప్రజాపతీ! ప్రతి కల్పంలోను ఈ వర ప్రభావం ఉంటుంది."

దక్ష ప్రజాపతిని అలా అనుగ్రహించి మహేశ్వరి అంతర్ధానమైంది. లోకమాత తన కూతురుగా జన్మించ బోతున్నదనే ఆనందంతో తన ఆశ్రమాన్ని చేరుకొన్నాడు దక్షుడు.

**దక్షుడు నారదుని శపించుట**

ప్రజాపతి ఐన దక్షుడు ఆపై అనేక విధాలైన మానసిక సృష్టిని చేశాడు. ఆ సృష్టిలో ఏ విధమైన అభివృద్ధి లేకపోవటాన్ని గమనించి తండ్రి దగ్గర మొరపెట్టుకొన్నాడు. ఈ ప్రజా సంతతి తమంత తాముగా వృద్ధి పొందే ఉపాయం చెప్పమని కోరాడు. దానికి బ్రహ్మగారిలా అన్నాడు: "వత్సా! నువ్వు శివుని స్మరించు! నీకు శుభం కలుగుతుంది. పంచజన ప్రజాపతికి అసిక్ని అనే అందమైన కూతురుంది. నువ్వామెను భార్యగా స్వీకరించు. ఆమె ద్వారా మైథున ధర్మంచే ఈ ప్రజా సృష్టిని విస్తారంగా చెయ్యగలవు" అని సలహా ఇచ్చాడు. మునులారా! అంతకు ముందు సంకల్ప, సందర్శన, స్పర్శ మాత్రం చేతనే సృష్టి కార్యం నెరవేరేది.

దక్షుడావిధంగానే వీరణుని (పంచజనుని) కుమార్తె యందు హర్యశ్వులు అని పేరుగల పదివేల మంది కుమారులను కన్నాడు. వారందరు పితృభక్తిరతులు, వేద మార్గ ప్రవర్తకులు. దక్షుడు వారందరిని సంతానాన్ని కనమని చెప్పగానే వారు తపస్సు కోసం పశ్చిమ దిక్కుకు వెళ్ళారు. అక్కడ దివ్యమైన సింధు నది సాగర సంగమం చేసే చోట 'నారాయణ సరస్సు' అనే గొప్ప తీర్థం ఉంది. ఆ తీర్థ జలాలలో స్నానం చెయ్యగానే వారి హృదయ మాలిన్యం క్షాళితమై బుద్ధి పరమహంస ధర్మాన్ని పొంది నివృత్తి మార్గంలో పరినిష్ఠితమైంది. వారందరు సంతానం కోసం తపస్సు చేస్తున్నారని తెలిసి నారదుడు వారిని కలిసి ఇలా అన్నాడు.

"ఓ దక్ష పుత్రులారా! భూమి యొక్క ఆద్యంతాలను, విస్తీర్ణాన్ని తెలుసుకో కుండానే సృష్టి కార్యానికి ఎలా సిద్ధపడ్డారు? శాస్త్రం తండ్రి వంటిది. అది నివృత్తి మార్గాన్నే బోధిస్తోంది. అట్టి శాస్త్రాన్ని అధ్యయనం చెయ్యకుండానే త్రిగుణాలను నమ్ముకొని సృష్టి కార్యానికి ఎలా పూనుకొన్నారు?" ఈ విధంగా నారదుడు బోధించే సరికి వారందరు అతనికి ప్రదక్షిణ నమస్కారాదు లాచరించి పునరావృత్తి రహితమైన జ్ఞాన మార్గం లోకి వెళ్ళి పోయారు. కొంత కాలానికి తన పుత్రులు ప్రవృత్తి మార్గంలో లేరని తెలిసి దక్షుడు బాధపడ్డాడు.

నివృత్తి రూపమైన జ్ఞాన మార్గం (సన్యాసం) ఉత్తమమైనదే ఐనా తమ సంతానం ఆ మార్గంలోకి వెళ్ళటం తల్లిదండ్రులకు దుఃఖ కారణ మవుతుంది గదా! తండ్రిచే ఓదార్చబడిన వాడై దక్షుడు అసిక్నియందు తిరిగి శబలాశ్వులను వేయి మంది కుమారులను కన్నాడు. వీరు కూడా నారదోపదేశంచే తమకంటె ముందు పుట్టిన పదివేల మంది హర్యశ్వులు పయనించిన మార్గంలోనే వెళ్ళి మోక్షప్రాప్తిని పొందారు.

ఆ వార్త విన్న దక్షుడు పుత్రనాశానికి శోకించి మూర్ఛాగతుడై, దైవ వశంచేత అక్కడకు వచ్చిన నారదుని పరికించి శోకం చేతను, రోషం చేతను అధరం కంపింపగా 'ధిక్, ధిక్' (నింద) నిందయగు గాక అని పలికి అసహ్యించుకొని ఇలా శపించాడు. "ఓ నారదా! నేను నీకేమి అపకారం చేశానని నా పిల్లలకు భిక్షా మార్గాన్ని (సన్యాసము) చూపించావు. నువ్వు సాధు వేషంలో ఉన్న కపటివి. ఇది సాధు కృత్యం కాదు. వారికింకా మూడు ఋణాల నుండి విముక్తి కలుగలేదు. దేవ, పితృ, గురు ఋణాల నుండి విముక్తి పొందకుండా తల్లిదండ్రులను విడిచి మోక్షార్థియై సన్న్యసించిన వ్యక్తి పతితుడవుతాడు. పిల్లల బుద్ధిని చెడగొట్టి వారి యశస్సును అపహరించావు. వారు ఇహానికి, పరానికి కూడా చెడ్డారు. నువ్వు దయా రహితుడవు! దీనికి ఫలంగా నువ్వు కూడా స్థిర నివాసం లేక లోక సంచారివై తిరుగుతావు" అని శపించాడు. ఇదంతా శివమాయ.

**సతీ ప్రాదుర్భావం - బాల్యం**

విషయాన్ని తెలుసుకొన్న బ్రహ్మ అక్కడకు వచ్చి దక్ష నారదులిద్దరిని ఓదార్చి, వారి మధ్య సఖ్యతను కుదిర్చి, నారదుని తీసికొని తన నిజధామాన్ని చేరుకొన్నాడు. తరువాత దక్షుడు తన భార్య యందు అరవై మంది కుమార్తెలను కన్నాడు. వారిలో పదిమందిని ధర్మునకు, పదముగ్గురిని కశ్యపునకు, ఇరవైఏడు మందిని చంద్రునకు ఇద్దరిని అంగిరసునకు, ఇద్దరిని కృశాశ్వునకు, తక్కిన కన్యలను తార్క్ష్యునకు ఇచ్చి యథావిధిగా వైభవంగా వివాహాలను జరిపించాడు. వారి సంతానంతో ముల్లోకాలు నిండాయి. దక్షుడు సంతోషించాడు. దక్షుని కుమార్తెలలో సతీదేవి పెద్ద కుమార్తె అని కొందరు. మధ్యమ అని కొందరు, కనిష్ఠ అని కొందరు చెపుతారు. కల్పభేదం చేత అవి సత్యములే.

మునులారా! సతీదేవి యొక్క జనన వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి! ఈ గాథ పరమ పవిత్రమైనది. కలికల్మష హరమైనది. స్త్రీలకు సౌభాగ్య, సంతానాల నిచ్చేది. దాంపత్యజీవితంలో సుఖ సంతోషాలను పెంపొందింప చేసేదీను.

దక్ష ప్రజాపతి భార్యతో కలిసి ఏక మనస్కులై క్షీరనీరన్యాయంగా అన్యోన్యంగా ఉల్లాస భరితులై కాపురం చేసికొంటూ ఉండగా ఉమాదేవి దయాన్వితయై దక్షపత్ని హృదయంలో నిలిచింది. ఆ తరువాత వీరిణికి గర్భ చిహ్నాలు ప్రకటితమయ్యాయి. ఉమావాస కారణంగా దక్షపత్ని మహా మంగళ రూపిణిగా కానవచ్చింది. దక్షుడు సంతోషంతో తన కులానికి, సంపదకు, విద్యకు, ఉదారతకు అనురూపంగా ఆమెకు సీమంతాది సంస్కారాలను

జపిరించాడు. వచ్చిన మహర్షులకు మర్యాదలను చేసి వారి మనోరథాల నీడేర్చి పరితృప్తులను చేసి ఆశీర్వచనాలను పొందేడు.

లోకమాత సతీ రూపంలో ఆవిర్భవింప బోతూన్నదని ఎరిగి విష్ణ్వాది దేవతలు హృష్ట మానసులై ఆ తల్లిని స్తుతించి, దక్ష దంపతులను ప్రశంసించారు. నవమాసాలు నిండగానే లౌకిక కర్మలను జరిపించాడు దక్షుడు. పదవమాసం నిండగానే ఉమాదేవి తల్లిముందు ఆవిర్భవించింది. ఆ సమయంలో గ్రహ తారకలు శుభస్థితిలో ఉన్నాయి. ఆకాశం సావకాశంగా ఉంది. దిక్కులు ప్రసన్నంగా ఉండి పరిమళ వాయువులు వీచాయి. దిక్పాలకులు చేమోడ్చారు. దిగ్గజాలు కైమోడ్చాయి. మేఘాలు పూలజల్లులా నీటిని వర్షించాయి.

తేజో మండల పరివేష్టిత యైన ఆ బాలికను చూచి దక్షుడు ఆమె దేవియే అని సంతుష్టాంత రంగుడై ఇలా స్తుతించాడు:

**శ్లో॥ మహేశాని నమస్తుభ్యం జగదంబే సనాతని ।**
**కృపాంకురు మహాదేవి సత్యే సత్య స్వరూపిణి ॥**
**శివా శాంతా మహామాయా యోగ నిద్రా జగన్మయీ ।**
**యా ప్రోచ్యతే వేద విద్భిర్నమామి త్వాం హితావహమ్ ॥**
**యయా ధాతా జగత్సృష్టౌ నియుక్తస్తాం పురాకరోత్ ।**
**తాంత్వాం నమామి పరమాం జగద్ధాత్రీం మహేశ్వరీమ్ ॥**
**యయా విష్ణుర్జగత్ స్థిత్యైనియుక్తస్తాం సదాకరోత్ ।**
**తాంత్వాం నమామి పరమాం జగద్ధాత్రీం మహేశ్వరీమ్ ॥**

**తా॥** ఓ మహేశ్వరీ! జగన్మాతా! నీవు సనాతనివి. నీకు నమస్కారం. ఓ మహాదేవీ! దయచూపు సత్యము నీవే. వేదవేత్తలు నిన్ను శివా, శాంతా, మహామాయా, యోగనిద్రా, జగత్స్వరూపిణీ అని వర్ణిస్తారు. హితములను చేకూర్చు నీకు నమస్కారం. పూర్వం ధాతను సృష్టి కార్యమందు, విష్ణువును జగద్రక్షణ కార్యమందు నియోగించిన దానివి నీవే. నువ్వు పరబ్రహ్మ స్వరూపిణివి! జగన్మాతవు!

**శ్లో॥ యాయా రుద్రో జగన్నాశే నియుక్తస్తాం సదాఽ కరోత్ ।**
**తాంత్వాం నమామి పరమాం జగద్ధాత్రీం మహేశ్వరీమ్ ॥**
**రజస్సత్త్వ తమో రూపాం సర్వకార్య కరీం సదా ।**
**త్రిదేవ జననీం దేవీం త్వాం నమామి చ తామ్ శివామ్ ॥**

**యస్త్వాం విచింతయే ద్దేవీం విద్యావిద్యాత్మికామ్ పరామ్ ।**
**తస్య భుక్తిశ్చ ముక్తిశ్చ సదా కరతలే స్థితా ॥**
**యస్త్వాం ప్రత్యక్షతో దేవి శివాం పశ్యతి పావనీమ్ ।**
**తస్యా వశ్యం భవేన్ముక్తి ర్విద్యాఽ విద్యా ప్రకాశికా ॥**

**తా॥** రుద్రుని జగన్నాశనము కొరకు నియోగించింది నీవే! సత్త్వరజస్తమో గుణాత్మికవగు నీవు త్రిమూర్తుల రూపంలో సర్వ కార్యాలను చేస్తున్నావు. విద్య–అవిద్యలు నీ స్వరూపమే! నిన్ను సేవించు వారికి భుక్తి–ముక్తులు రెండు అరచేతిలో ఉంటాయి.

**శ్లో॥ యే స్తువంతి జగన్మాత ర్భవానీ అంబికేతిచ ।**
**జగన్మాయీతి దుర్గేతి సర్వం తేషాం భవిష్యతి ॥**

**తా॥** ఓ జగన్మాతా! నిన్ను ఎవరైతే భవానీ! అంబికా! జగన్మాతా! దుర్గా! అని స్తుతిస్తారో వారికి సర్వము సిద్ధిస్తుంది.

బుద్ధిశాలియైన దక్షుడు ఇలా స్తుతించగా అక్కడున్న వారెవరికి వినబడని విధంగా దుర్గాదేవి దక్షునితో నన్ను కుమార్తెగా పొందాలనే నీ కోరిక సిద్ధించింది, అని పలికి తిరిగి శిశుభావాన్ని పొంది రోదించింది. ఆ బాలికను చూచి తల్లి ఐన అసిక్నితో పాటు అందరూ ఆనందించారు. దక్షుడు వేదోక్త సంస్కారాలతో పాటు కులాచారాన్ని కూడా అనుష్ఠించాడు. అక్కడ మహోత్సవం ప్రవర్తిల్లింది. ఆమెకు 'ఉమ' అని నామకరణం చేశాడు దక్షుడు. తరువాత ఆమెకు లోకంలో ఇతర నామాలు కలిగాయి. అమ్మవారి నామాలన్ని మహా మంగళకరాలు. విశేషించి నరులకు దుఃఖ నివారకాలు. వచ్చిన వారందరికి చేతులెత్తి నమస్కరించి గౌరవంతో సాగనంపాడు దక్షుడు.

ఆ బాలిక శుక్లపక్ష చంద్రునిలా దినదినాభివృద్ధిని పొందుతూ సకల విద్యలను అధ్యయనం చేసి, సమస్త కళలను అభ్యసించి విద్యా స్వరూపిణి ఐంది. తల్లిదండ్రుల సంతోషానికి మేర లేదు. వెన్నెల వేడికి కూడా కందిపోతుందేమో అనేటంత అల్లారు ముద్దుగా చూసుకొంటున్నారు. ఉమాదేవి కూడా వయోనురూప జ్ఞానాన్ని పొందుతూ, సఖీ జనులతో విహరిస్తూ శివ నామాలనే స్మరిస్తూ, పలుకుతూ, ఆయన గాథలనే వింటూ, ఆయన పాటలనే పాడుతూ, ఆయన లీలలను నృత్యాభినయాల్లో ప్రదర్శిస్తూ, ఆయన రూపాన్నే బహు భంగుల చిత్రీకరిస్తూ శివుణ్ణే ధ్యానిస్తూ పెరిగి పెద్దదైంది.

**సతీదేవి నందావ్రత మాచరించుట**

మునులారా! ఒకరోజున పితామహుడు, నారద మహర్షితో కూడి సతీ దర్శనానికై వెళ్ళాడు. బాలికతో కూడి దక్షుడు వారిద్దరికి నమస్కరించి ఉచితాసనాసీనుల్ని చేసి సత్కరించి సతీదేవిచే కూడా నమస్కరింప చేశాడు. సారభూతమైన ప్రకృతి స్వరూపిణియైన ఆమె లోకలీలను అనుసరించి నమస్కరించింది. అంత బ్రహ్మ గారిలా ఆశీర్వదించాడు: "ఓ శుభకరీ! సర్వజ్ఞుడు, జగత్ప్రభువు ఐన ఈశ్వరుడు నీకు పతియగు గాక! ఆంతర్యంలో నిన్ను పత్నిగా పొందగోరిన ఏ ఈశ్వరుడు అన్య స్త్రీ వ్యామోహితుడు కాకుండా యోగ నిష్ఠలో ఉన్నాడో ఆ శంకరుడు నీకు భర్తయగు గాక!" ఇలా ఆశీర్వదించి, నారద సహితుడై విధాత తన నిజ ధామానికి వెళ్ళిపోయాడు.

సతీదేవి క్రమంగా బాల్యాన్ని దాటి యౌవనం లోకి ప్రవేశించి పున్నమ చంద్రునిలా ప్రకాశింప జొచ్చింది. ఆమె అవతార రూపిణి అని ఎరిగిన దక్షుడు ఆమెను శివునకిచ్చి కళ్యాణం జరిపించుట ఎలాగా? అని ఆలోచింప సాగేడు. సతీదేవి కూడా మనసులో దానినే వాంఛించి కార్యసాధనకు తపస్సే కర్తవ్యమని నిశ్చయించుకొని తల్లి అనుమతితో ఇంట్లోనే నందావ్రతాన్ని ప్రారంభించింది. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమితో ప్రారంభించి భాద్రపద కృష్ణ చతుర్దశి వరకు పండ్రెండు మాసాలు శాస్త్రోక్తంగా నియమాలను పాటించి వ్రత పరి సమాప్తిని చేసింది. అన్ని మాసాలలోను ఆహార నియమాలను పాటించి, ఆయా ఋతువులలో లభించే సస్యాలతో, పుష్పాలతో, ఫలాలతో వ్రత విధానాన్ని నడిపి మంత్రాన్ని జపిస్తూ శివారాధనను ముగించింది.

సతీ వృత్తాంతాన్ని విన్న విధి–మాధవులు ఆమెను సందర్శించి అంజలి బంధంతో నమస్కరించి ప్రసన్నులై; సకలదేవతా సమూహంతో కూడి శివ ప్రభువును దర్శించి ఇలా స్తుతించారు.

**శ్లో॥ నమో భగవతే తుభ్యం యత ఏత చ్చరా చరమ్ ।**
**పురుషాయ మహేశాయ పరేశాయ మహాత్మనే ॥**
**ఆది బీజాయ సర్వేషాం చిద్రూపాయ పరాయచ ।**
**బ్రహ్మణే నిర్వికారాయ ప్రకృతేః పురుషస్యచ ॥**
**య ఇదం ప్రతి పంచ్యేదం యేనేదం విచకాస్తిహి ।**
**యస్మాదిదం యతశ్చేదం యస్యేదం త్వం చ యత్నతః ॥**

**యో౨_స్మాత్పరస్మాచ్చ పరో నిర్వికారీ మహా ప్రభుః ।**
**ఈక్షతే యస్స్వాత్మనీదం తం నతాస్స్మ స్వయంభువమ్ ॥**

**తా॥** భగవంతుడు, పురుషుడు, మహేశ్వరుడు, సర్వేశ్వరుడు, పరమాత్ముడు అగు నీకు నమస్కారం. ఈ జగత్తుకు నువ్వు ఆది బీజం. సర్వ ప్రాణులకు ఆది కారణము, చిద్ఘనము, ప్రకృతి పురుష వికార రహిత పరబ్రహ్మము అగు నీకు నమస్కారం. ఎవడు ఈ జగద్రూపంలో ఉన్నాడో, ఎవనిచే ఈ జగత్తు ప్రకాశిస్తూన్నదో, ఎవని నుండి ఉద్భవించిందో, ఎవనికి సంబంధించి ఉందో, ఎవని యందు లీన మవుతూన్నదో అట్టి పరమాత్మవు నీవే! అట్టి నీకు నమస్కారం. ఇహపరలోకాలకు అతీతుడు, నిర్వికారుడు, మహా ప్రభువు, స్వయంభువు అగు నీకు నమస్కారం. నువ్వు నీ ఆత్మయందు ఈ జగత్తును దర్శిస్తున్నావు.

**శ్లో॥ అవిద్ధదృక్ పరస్సాక్షీ సర్వాత్మా౨_నేక రూపధృక్ ।**
**ఆత్మ భూతః పరబ్రహ్మ తపంతం శరణం గతాః ॥**
**న యస్య దేవా ఋషయ స్సిద్ధాశ్చ న విదుః పదమ్ ।**
**కః పునర్జంతురపరో జ్ఞాతు మర్హతి వేదితుమ్ ॥**
**దిదృక్షవో యస్య పదం ముక్తసంగా స్సుసాధవః ।**
**చరితం సుగతిర్నస్త్వం సలోకవ్రత మవ్రణమ్ ॥**
**త్వజ్జన్మాది వికారా నో విద్యంతే కే౨_పి దుఃఖదాః ।**
**తథాపి మాయయా త్వంహి గృహ్ణాసి కృపయాచ తాన్ ॥**
**తస్మై నమః పరేశాయ తుభ్య మాశ్చర్య కర్మణే ।**
**నమో గిరాం విదూరాయ బ్రహ్మణే పరమాత్మనే ॥**

**తా॥** అమోఘమైన దృష్టిగల వాడు, పరమాత్మ, సాక్షి, సర్వాత్మ, అనేక రూపాలను ధరించు వాడు, అన్నిటికి ఆత్మ ఐనవాడు, పరబ్రహ్మ, తపస్వి ఐన నీకు శరణు. నీ పరమపదాన్ని దేవతలు, ఋషులు, మరియు సిద్ధులు కూడా ఎరుగరు. ఇతర ప్రాణులు నిన్నెలా తెలుసుకోగలరు? నీ స్థానాన్ని చూడగోరిన మానవులు సంగ రహితులై సాధువులవుతున్నారు. నీ చరిత్రయే మాకు మోక్షప్రదం. లోకాలన్ని నీనుండే ఉద్భవించినా నీవు వ్రణం (ఛిద్రం) లేని వాడవు! నీకు దుఃఖాన్నిచ్చే జన్మాది వికారాలు లేవు. కాని మాయచే దయతో వాటిని స్వీకరిస్తున్నావు. పరమేశ్వరుడు, ఆశ్చర్యకరమైన కర్మలను చేయువాడు, మాటలకు అందని వాడు, పరబ్రహ్మ, పరమాత్మ అగు నీకు నమస్కారం.

**శ్లో॥ అరూపాయోరు రూపాయ పరాయానంత శక్తయే ।**
**త్రిలోక పతయే సర్వ సాక్షిణే సర్వగాయచ ॥**
**నమ ఆత్మ ప్రదీపాయ నిర్వాణ సుఖ సంపదే ।**
**జ్ఞానాత్మనే నమస్తేఽస్తు వ్యాపకాయేశ్వరాయచ ॥**
**నైష్కర్మ్యేణ సులభ్యాయ కైవల్య పతయే నమః ।**
**పురుషాయ పరేశాయ నమస్తే సర్వదాయ చ ॥**
**క్షేత్రజ్ఞా యాత్మ రూపాయ సర్వ ప్రత్యయ హేతవే ।**
**సర్వాధ్యక్షాయ మహతే మూల ప్రకృతయే నమః ॥**

**తా॥** రూపం లేని వాడు, పెద్ద రూపం కలవాడు, అనంతశక్తిమంతుడు, ముల్లోకములకు ప్రభువు, సర్వసాక్షి, సర్వమును పొంది ఉన్నవాడు, ఆత్మ రూపుడుగా ఉండి సర్వమును ప్రకాశింప చేయువాడు, మోక్ష స్వరూపుడు, ఆనంద ఘనుడు, జ్ఞాన ఘనుడు, సర్వ వ్యాపకుడు, సర్వమునకు ప్రభువు, సర్వకర్మ సన్న్యాస యోగముచే తేలికగా లభించువాడు, మోక్షము నిచ్చు ప్రభువు, పురుష స్వరూపుడు, సర్వేశ్వరుడు, సర్వము ఇచ్చువాడు, దేహము నందుండే సాక్షి, ఆత్మ రూపుడు, మనోవృత్తులన్నిటికి కారణమైన వాడు, సర్వమునకు అధ్యక్షుడు, సమష్టి బుద్ధి స్వరూపుడు, మూల ప్రకృతి స్వరూపుడు అగు పరమాత్మకు నమస్కారం.

**శ్లో॥ త్రినేత్రాయేషు వక్త్రాయ సదాభాసాయతే నమః ।**
**సర్వేంద్రియగుణ ద్రష్టే నిష్కారణ నమోస్తుతే ॥**
**త్రిలోక కారణాయాథాపవర్గాయ నమో నమః ।**
**అపవర్గ ప్రదాయాశు శరణాగత తారిణే ॥**
**సర్వామ్నాయాగమానాం చోదధయే పరమేష్ఠినే ।**
**పరాయణాయ భక్తనాం గుణానాంచ నమోఽస్తుతే ॥**
**నమో గుణారణిచ్ఛన్న చిదూష్మాయ మహేశ్వర ।**
**మూఢ దుష్ప్రాప రూపాయ జ్ఞాని హృద్వాసినే సదా ॥**

**తా॥** మూడు నేత్రములు గలవాడు, ఎల్లప్పుడు ప్రకాశించు వాడు, ఇంద్రియ గుణములన్నిటికి సాక్షి, కారణము లేనివాడు, ముల్లోకాలకు కారణమైనవాడు, మోక్ష స్వరూపుడు, శీఘ్రముగ మోక్షము నిచ్చువాడు, శరణాగత రక్షకుడు, సర్వవేద శాస్త్రములకు పెన్నిధి, పరమేష్ఠి, భక్తులకు పొందదగిన సర్వ శ్రేష్ఠమైనవాడు, సర్వ సద్గుణ నిధి, త్రిగుణములనే

అరణిచే దాచి ఉంచబడిన చిద్ఘనుడు, మహేశ్వరుడు, మూర్ఖులకు అందనివాడు, జ్ఞానుల హృదయాలలో నిత్య నివాసి ఐన శివునకు నమస్కారం.

**శ్లో॥ పశుపాశ విమోక్షాయ భక్త సన్ముక్తి దాయచ ।**
**స్వప్రకాశాయ నిత్యాయాఽవ్యయా యాజస్రసంవిదే ॥**
**ప్రత్యగ్ద్రష్ట్రేఽవికారాయ పరమైశ్వర్య ధారిణే ।**
**యం భజంతి చతుర్వర్గం కామయంతీష్ట సద్గతిమ్ ॥**
**సోఽభూదకరుణస్త్వం నః ప్రసన్నో భవతే నమః ।**
**ఏకాంతినః కంచనార్థం భక్తా వాంఛంతి యస్య న ॥**
**కేవలం చరితం తేతే గాయంతి పరమంగలమ్ ।**
**అక్షరం పరమం బ్రహ్మ తమవ్యక్తా కృతిం విభుమ్ ॥**
**అధ్యాత్మ యోగ గమ్యం త్వాం పరిపూర్ణంస్తుమో వయమ్ ।**
**అతీంద్రియ మనాధారం సర్వాధార మహేతుకమ్ ॥**
**అనంత మాద్యం సూక్ష్మం త్వాం ప్రణమామోఽఖిలేశ్వరమ్ ।**

**తా॥** జీవుల బంధమును పోగొట్టే వాడు, భక్తులకు సద్రూపమగు ముక్తినిచ్చే వాడు, స్వప్రకాశుడు, నిత్యుడు, నాశములేనివాడు, జ్ఞాన ఘనుడు, ప్రత్యగాత్మ రూపుడుగా ఉండి సర్వమును చూచేవాడు, అవికారుడు, పరమైశ్వర్యమును ధరించి ఉన్నవాడు అగు పరమాత్మకు నమస్కారం. నిన్ను సేవించే వారికి ధర్మార్థ కామ మోక్షములు మరియు కోరిన సద్గతి లభిస్తుంది. అట్టి నువ్వు మాయందు దయను చూపు. మాపై ప్రసన్నతను చూపు. నీకు నమస్కారం. నీ ఏకాంత భక్తులు ఏ వస్తువునైనను కోరరు. పరమ మంగళమైన నీ చరిత్రను మాత్రమే గానం చేస్తారు. అక్షర పరబ్రహ్మ, అవ్యక్త స్వరూపుడు, సర్వవ్యాపి, అధ్యాత్మ యోగంచే పొందబడు వాడు, పరిపూర్ణుడు, ఇంద్రియాలకు గోచరం కానివాడు, ఆధారం లేనివాడు, అన్నిటికి ఆధారమైనవాడు, కారణము లేనివాడు ఐన నిన్ను మేం స్తుతిస్తున్నాం. అనంతుడు, ఆద్యుడు, ఇంద్రియ జ్ఞానానికి అందని వాడు, సర్వేశ్వరుడు ఐన నీకు నమస్కారం.

**శ్లో॥ హర్యాదయోఽఖిలా దేవా స్తథా లోకాశ్చరా చరాః ॥**
**నామరూప విభేదేన ఫల్గ్వాచ కలయా కృతాః ।**
**యథార్చిషోఽగ్నే స్సవితుర్యాంతి నిర్యాంతి చాసకృత్ ॥**

**గభస్త యస్తథాయంవై ప్రవాహో గౌణ ముచ్యతే ।**
**నత్వం దేవోఽసురో మర్త్యో న తిర్యజ్ న ద్విజః ప్రభో ॥**
**న స్త్రీ న షండో న పుమాన్ సదసన్నచ కించన ।**
**నిషేధ శేషస్సర్వం త్వం విశ్వకృద్విశ్వ పాలకః ॥**
**విశ్వలయ కృద్విశ్వాత్మా ప్రణతా స్స్మస్త మీశ్వరమ్ ।**

**తా॥** విష్ణువు మొదలగు సమస్త దేవతలను, లోకాలను, చరాచర జగత్తును నువ్వు నామరూప భేదం కలిగేటట్లుగా అల్ప ప్రయత్నంచే నిర్మించావు. అగ్ని నుండి విస్ఫులింగాలవలె, సూర్యుని నుండి కిరణాల వలె ఈ త్రిగుణ ప్రవాహ రూపమైన జగత్తు నీ నుండి వ్యక్తమై మరల నీలోనే లీనమవుతోంది. ఓ ప్రభూ! నువ్వు దేవ రాక్షస మానవులలో ఎవరివీ కాదు! పశువు కాదు! పక్షివి కాదు! స్త్రీ పురుష నపుంసకుడవు కాదు! సత్ కాదు, అసత్ కాదు! ద్రవ్యం కాదు! సర్వాన్ని నిషేధించగా మిగిలే అద్వయ తత్త్వమే నీవు. సృష్టి, స్థితి, లయ కర్తవు. సర్వేశ్వరుడవైన నీకు నమస్కారం.

**శ్లో॥ యోగరంధిత కర్మాణో యం ప్రపశ్యంతి యోగినః ॥**
**యోగ సంభావితే చిత్తే యోగేశం త్వాం నతావయమ్ ।**
**నమోఽస్తుతేఽసహ్యవేగ శక్తిత్రయ త్రయీమయ ॥**
**నమః ప్రసన్న పాలాయ నమస్తే భూరి శక్తయే ।**
**కదింద్రియాణాం దుర్గేశా నవాప్య పరవర్త్మనే ॥**
**భక్తోద్ధార రతాయాథ నమస్తే గూఢ వర్చసే ।**
**య చ్ఛక్త్యా హం ధియాత్మానం హతం వేద న మూఢధీః ॥**
**తం దురత్యయ మహాత్మ్యం త్వాం నతాః స్మో మహప్రభుమ్ ।**

**తా॥** యోగులు యోగంచే శుద్ధమైన కర్మలు గలవారై, నిర్మలాంతఃకరణంలో యోగీశ్వరుడవైన నిన్ను దర్శిస్తారు. నీ వేగం సహింపరానిది. ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులు చతుర్వేదాలు నీ స్వరూపం. శరణన్న వారిని రక్షించు వాడు, అనంత శక్తిమంతుడు అగు నీకు నమస్కారం. ఇంద్రియ నిగ్రహం లేని వారికి పొంద శక్యం కాని జ్ఞాన మార్గం నీది. భక్తోద్ధారకుడవు! నీ ప్రకాశం గూఢంగా ఉంటుంది. నీ మాయా శక్తిచే మోహాన్ని పొంది, మూర్ఖుడనై నీ మహిమను, నా అసమర్ధతను తెలుసుకో లేకపోయా. నీ మహిమ అపారం. నీకు నమస్కారం.

**బ్రహ్మాదులు ఈశ్వరుని వివాహమాడుమని ప్రోత్సహించుట**

మునులారా! ఆ విధంగా బ్రహ్మాది దేవతలు చేసిన స్తుతికి ప్రసన్నుడైన శంకరుడు వారి రాకలోని ఆంతర్యాన్ని తెలుపవలసిందని కోరగా విష్ణు ప్రేరితుడైన పితామహుడిలా అన్నాడు: "హే శంభో! నువ్వు నిత్యము యోగ పరాయణుడవైతే లోక స్థితి సక్రమంగా నడవదు. నువ్వు జగత్కార్యానికి సహకరించటం ఉత్తమం. నీ వల్ల అనేక మంది దుష్టరాక్షసులు వధింపబడవలసి ఉన్నారు. మన స్వరూపం ఒకటే ఐనా కార్యభేదం చేత మనలో రూపభేదం సిద్ధించింది. నువ్వు కార్య భేదానికి పూనుకొనని నాడు రూపభేదం నిష్ప్రయోజనం కదా! నేను, విష్ణువు కూడా కర్తవ్యంలో భాగంగా వివాహం చేసికొని సంసారులమయ్యాం. నువ్వు కూడా నీకు తగిన స్త్రీని వివాహమాడి గృహస్థువు కావటం అది లోక కళ్యాణమవుతుంది. ఈ విషయమై గతంలో మాకు వరదానం చేశావు. దానిని నెరవేర్చు."

విధాత పల్కులను విన్న విశ్వనాథుడు స్మేరాననుడై ఇలా అన్నాడు: "ఓ బ్రహ్మా! ఓ విష్ణూ! మీరిద్దరు దేవతలలో ప్రముఖులు. నా నిర్ణయాన్ని చెపుతున్నాను వినండి. నేను తపోనిష్ఠుడను. విరాగిని, సదా యోగ మార్గ నిరతుడను. నేనెప్పుడూ పవిత్రమైన నివృత్తి మార్గంలో నిర్వికారంగా ఉండి ఆత్మారాముడనై ఉంటాను. నేను నిరంజనుడను. సదా అశుచినై అమంగళ వేషంలో అవధూత స్వరూపంలో ఉంటాను. అట్టి నాకు వివాహంతో ప్రయోజనం ఏమిటి? హృదయ దౌర్బల్యం కలవారు మాత్రమే వివాహ బంధంలో చిక్కుకొని పరులను కూడా బంధిస్తారు. అది క్షుద్ర కార్యం.

ఐనా లోక కళ్యాణం కొరకు వివాహం చేసికొని మీకిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకొంటాను. యోగ్యమైన మాటను చెపుతున్నాను వినండి. నా తేజస్సును వివేకంతో ధరింపగల, యోగ శక్తి గల, కామరూపిణి ఐన స్త్రీని వివాహమాడుతాను. నేను కామాసక్తుడనైతే ఆమె కూడా కామాసక్తురాలు కావాలి. నా ధ్యానానికి విఘ్నాన్ని కలిగించే స్త్రీ నాచే హతురాలవుతుంది. నా మాటయందు విశ్వాసాన్ని కోల్పోయిన నాడు నేనామెను పరిత్యజిస్తాను. సర్వ కర్మలలోను సదా నన్ననుసరించి ఉండగలిగే భార్యను నాకు చూపించండి."

ఆ మాటలను విన్న బ్రహ్మ విష్ణువులు మనస్సులో ఆనందించి వినమ్రంగా ఇలా అన్నారు: "హే ప్రభో! నువ్వు ఎలాటి స్త్రీని కోరావో సరిగ్గా అవే శుభ లక్షణాలుగల మంగళాంగిని నీకు నివేదించటానికి మేం చాలా సంతోషిస్తున్నాం. పూర్వం ఉమాదేవి

లక్ష్మి, సరస్వతీ రూపాలను ధరించి, విష్ణువుకు నాకు అర్ధాంగి ఐంది. ఆమె ఇప్పుడు సతీదేవిగా దక్షకుమార్తెయై ఆవిర్భవించి నిన్ను భర్తగా పొందగోరి దృఢవ్రతయై తపస్సు చేస్తూవున్నది. శంకరా! ఆమెకు తపస్సిద్ధిని కలుగచేసి ఆమె మనోరథాన్ని నెరవేర్చి లోకాలకు పరమ మంగళాన్ని చేకూర్చు. మీరిద్దరు ఆదిదంపతులగుదురు గాక!"

అప్పుడు బుద్ధిశాలియైన విష్ణువు కూడా, శంకరా! బ్రహ్మ చెప్పిన మాటలను నా మాటలుగానే నెరవేర్చి ముల్లోకాలను కృపాదృష్టితో సనాథులుగా చెయ్యండి అని విన్నవించగానే 'తథాస్తు' అని పలికి శంకరుడు అదృశ్యమయ్యాడు. తక్కిన వారు యథాస్థానాలకు చేరుకొన్నారు. ఇక అక్కడ దక్షుని గేహంలో.

**సతీదేవి ఎదుట శంకర సాక్షాత్కారం**

సతీదేవి ఆశ్వయుజ శుక్ల అష్టమి నాడు ఉపవసించి ఈశ్వరుని భక్తితో పూజించి నందా వ్రతాన్ని పూర్తిచేసింది. నవమి నాడు ఆమె ధ్యానమగ్నురాలై ఉండగా శంకరుడు ప్రత్యక్షమయ్యాడు. ఎదుట సర్వాంగ సుందరుడు, పంచవక్త్రుడు, త్రిలోచనుడు, శితికంఠుడు, చతుర్భుజుడు, మందాకినీ శోభితుడు ఐన శివుణ్ణి దర్శించి సిగ్గుతో శిరసు వంచి ఆయన పాదాలకు నమస్కరించింది.

ఆమె మనోగత అభిప్రాయాన్ని ఎరిగిన వాడైనా కేవలం ఆమె కోమల కంఠ స్వరాన్ని వినాలనే ఇచ్ఛతో శంకరుడు "ఓ దక్షపుత్రీ! నీ వ్రతానికి సంతోషించాను. వరాన్ని కోరుకో" అన్నాడు. భక్తవత్సలుడైన శంకరుని పల్కులకు ప్రేమ మగ్నురాలైన సతి లజ్జచే మాట్లాడలేక పోయింది. తరుణేందుమౌళి త్వరపెట్టగా తనను తాను నియంత్రించుకొని "ఓ వరదా! నీకిష్టమైన అనివారకమైన వరాన్ని ఇయ్యి" అని సతి కోరింది. వెంటనే వృషభధ్వజుడు వాక్యం పూర్తి కాకుండానే "నువ్వు నా భార్యవు కా" అన్నాడు.

తన అభీష్టం నెరవేరి నందుకు అతిశయించిన ఆనందంతో సతి మారు మాటాడలేక సుకుమార హావభావాలతో తన సంతోషాన్ని ప్రకటించింది. వారిరువురి హృదయాలలోను ఏకకాలంలో పుట్టిన శృంగారభావం భ్రూ కటాక్ష విక్షేపాది శృంగార చేష్టలలో ప్రకటితం కాగా కాలాంజన సన్నిభ ఐన సతి స్ఫటికోజ్జ్వల భాసమానుడైన శంకరుని సమీపంలో చంద్రుని చెంత నీలమేఘంలా తోచింది. విజ్ఞురాలైన సతి ఎట్టకేలకు ధైర్యం తెచ్చుకొని "ఓ ప్రభూ! తల్లిదండ్రుల అనుమతితో యథా శాస్త్రోక్తంగా నన్ను వివాహమాడి స్వీకరించండి" అంది. మహేశుడు 'అట్లే అగు గాక' అని పలికి, సతిని విడువలేక విడువలేక వెనుతిరిగి

చూస్తూ హిమాలయ ప్రాంత తన ఆశ్రమానికి వెళ్ళాడు. సతి కూడా శంకరుని ఆజ్ఞను పొంది తల్లి వద్దకు వెళ్ళింది.

శంకరుడు నిజాశ్రమానికి చేరి ధ్యానమగ్నుడయ్యాడు. కాని దాక్షాయణీ విరహంచే ధ్యానం కుదరటం లేదు. వెంటనే పితామహుణ్ణి స్మరించాడు. సరస్వతీ సహితుడై చతుర్ముఖుడు ప్రత్యక్షమయ్యాడు. ఆయనను చూడగానే నిరుపేదకు నిధి దొరికినంత ఉల్లాసంతో ఉబ్బితబ్బిబ్బై ఇలా అన్నాడు శంభుడు. "హే బ్రహ్మన్! నేను సతిని వివాహమాడ గోరి స్వార్థపరుడనయ్యాను. స్వార్థ చింతనయే నా స్వభావ మన్నట్లు, ప్రపంచం అంతా స్వార్థం మీదే నడుస్తోందన్నట్లు అనిపిస్తోందిప్పుడు నాకు. వెంటనే దక్షుని ఇంటికి వెళ్ళు. సతిని నాకిచ్చి పాణిగ్రహణం జరిపేటట్లు అతణ్ణి ఒప్పించు. సర్వవిద్యా విశారదుడవైన నువ్వు ఈ సతీ విరహాన్నుండి నన్ను రక్షించు."

శంకరుని పల్కులకు సంతసించి ఆయన తొందరకు మనసులో నవ్వుకొని "కాలకంఠా! ఈ కార్యంలో నీకే కాదు, నాకు, దేవతలకు కూడా స్వార్థం ఉంది. దక్షుడు స్వయంగానే తన కుమార్తెను నీకిస్తాడు" అని పలికి దక్షనివాసానికి వెళ్ళాడు బ్రహ్మ.

మునులారా! ఇక అక్కడ సతీదేవి మహేశ్వర దత్త వరప్రదాన వృత్తాంతాన్ని తల్లిదండ్రులకు చెప్పగా వారు పరమానందంతో గొప్ప ఉత్సవాన్ని జరిపి ఈ కార్యం నెరవేరుట ఎట్లా అని చింతిస్తూండగా, సరస్వతీ సహితుడై చతుర్ముఖుడు దక్షుని ఇంట్లో సాక్షాత్కరించాడు. ఆదరంతో జరిపిన అతిథి మర్యాదలు పూర్తయ్యాక బ్రహ్మగారిలా అన్నాడు "కుమారా! శ్రద్ధగా విను నీ కుమార్తె చేసిన వ్రతానికి సంతోషించి శంకరుడు ఆమెను వివాహమాడ నిశ్చయించుకొన్నాడు. ఆ క్షణం నుండి అందరికి సుఖాలను పంచిపెట్టే శంకరునికి నీ కుమార్తె యొక్క విరహంచే సుఖమనేది లేకుండా పోయింది. గతంలో మన్మథుడు మహా ప్రయత్నం చేసికూడా ఏ శివుని జయించ లేక పోయాడో ఆ మహాదేవుడు కుసుమ బాణ విదగ్ధుడు కాకుండానే ఆత్మధ్యానాన్ని వీడి, దుఃఖితుడై ప్రాకృత జనునివలె సతీ ధ్యానంలో మునిగి పోయాడు. రుద్రగణాలతో మాట్లాడుతూ మధ్య మధ్యలో 'సతి యెక్కడ? సతి యెక్కడ?' అని దిక్కులు పరికిస్తున్నాడు. అతని వేడి నిట్టూర్పు గాడ్పులకు పూలవనం వాడింది. మలయానిలం వేడెక్కింది, కైలాసగిరి నీరైపారి ఆనవాలు లేకుండా పోయింది. నెత్తి మీదున్న చంద్రుడు నిట్టూర్పు సెగలు సోకి నిప్పులు కక్కుతున్నాడు. సతీదేవి ఏ తీరుగా శంభుని ఆరాధించిందో ఆయనిప్పుడు ఆ తీరుగా సతిని ఆరాధిస్తున్నాడు. గతంలో మనందరం

దేనిని అభిలషించామో అదిప్పుడు నెరవేరింది. శంకరుని కొరకు జన్మించిన సతిని ఆయనకిచ్చి కళ్యాణం జరిపించు. అది లోక కళ్యాణ మవుతుంది. ఆలస్యం చెయ్యకు. కృతకృత్యుడవు కా! నేను నారదుని ద్వారా కన్యాభిక్షను కోరి ఆయనను నీ ఇంటికి రప్పిస్తాను."

వాణీపతి హితోపదేశానికి సరే అన్నాడు దక్షుడు. అందరు తదనంతర కర్తవ్యంలో నిమగ్నమయ్యారు.

**సతీ కళ్యాణం**

మునులారా! పిమ్మట బ్రహ్మ ఈ విషయాన్ని విన్నవించే నిమిత్తం హిమగిరిని చేరి శంకరుని కలుసుకొన్నాడు. అల్లంత దూరాన విధాతను చూచిన శంకరుడు ప్రాకృత జనుని వలె ఎంతో ఔత్సుక్యంతో లోకరీతిగా అనేక ప్రశ్నలను సంధించి ఎంతో ఆందోళనతో ఇలా అన్నాడు: "పితామహా! వెళ్ళిన పని ఏమైంది? నీ కుమారుడైన దక్షుడేమన్నాడు? త్వరగా చెప్పు! సతి ఎలా ఉంది? ఈ విరహం భరింపశక్యం కాకుండా ఉంది. లోకంలో అందరి దుఃఖం నన్ను పట్టుకొని పీడిస్తున్నట్లుంది."

శంకరుని వేగిరపాటుకు జాలిని పొంది, ఆంతర్యంలో ఆనందించి ఇలా అన్నాడు కమలాసనుడు. "ఈ కార్యం సిద్ధించింది. నీ కొరకు తనువెత్తిన సతిని దక్షుడు నీకు పత్నిగా సమర్పించటానికి సిద్ధంగా ఉన్నాడు. ఈ సుముహూర్తం ఎప్పుడొస్తుందా అని ఉవ్విళ్ళూరు తున్నాడు. శుభ ముహూర్తంలో నీ అనుచర గణంతో కలిసి కన్యాభిక్ష కోసం దక్షుని ఇంటికి వెళ్ళు. మేమంతా కూడా వస్తున్నాం."

ఈ మాటలు చెవుల పండువై తోచ రుద్రుడు తన గణంతో సిద్ధమయ్యాడు. లక్ష్మీ సహితుడై నారాయణుడు, సరస్వతీ విలసితుడైన బ్రహ్మ, నారదుడు, మరీచ్యాది ఋషులు, ప్రజాపతులు సకలదేవతా సమూహం ఉత్సాహంతో తన్ననుసరింప రుద్రగణంతో కూడి చైత్ర శుక్ల త్రయోదశి ఉత్తరా నక్షత్రయుక్త ఆదివారం నాడు మహా కోలాహలంగా కన్యావరణ నిమిత్తం బయలు దేరాడు రుద్రుడు. దక్ష గృహాన్ని చేరారు.

వారందిరి రాకను ఎరిగిన దక్షుడు గగుర్పాటుతో ఎదురేగి, సత్కరించి, శివుణ్ణి ఉచితాసనాసీనుణ్ణి చేసి తక్కిన వారికి కూడా యథోచిత మర్యాదలను జరిపి అందరిని పూజించాడు. తదనంతరం అందరిని సంప్రదించి దక్షుడు ప్రీతుడై తండ్రితో "తండ్రీ! ఈ పాణిగ్రహణాన్ని మీరే జరిపించండి" అని కోరగా వేదోక్తంగా కార్యాన్ని నిర్వర్తించాడు బ్రహ్మ. వృషభ ధ్వజుడు యథావిధిగా వివాహ కర్మను అనుష్ఠించి, దాక్షాయణీ పాణిగ్రహణాన్ని చేశాడు. సప్తర్షులు స్వస్తి వాచకాలను పఠింపగా, గంధర్వులు పాడగా, అప్సరసలాడగా

అఖిలజన లోచనోత్సవంగా సతీ శంకరుల కళ్యాణోత్సవం సాగింది. దక్షుడు కృతార్థుడయ్యాడు. ఉమాపరమేశ్వరులు ప్రసన్నులయ్యారు.

**సతీ కళ్యాణం - శివ లీల**

ఋషులారా! అటు పిమ్మట జరిగిన అద్భుత వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి. కన్యాదాన సమయంలో దక్షుడు శివునకు అనేక వస్తువులను సారెగా ఇచ్చి, బ్రాహ్మణులకు భూరి సత్కారాలను పంచిపెట్టాడు. అప్పుడు విష్ణువు లక్ష్మీ సహితుడై శివుని వద్దకు వచ్చి అంజలి ఘటించి వినయంగా ఇలా అన్నాడు: "మహాదేవా! కరుణా సముద్రా! ఈ జగత్తుకు నీవు తండ్రివి, సతి తల్లి. శిష్టరక్షణ దుష్ట శిక్షణ కొరకే మీరవతిస్తారని సనాతనమైన వేదం అంటూన్నది. ఈ సతిని ఎవరైతే అభిలాషతో చూస్తారో వారిని సంహరించు. ఇది నా విన్నపం."

పాణిగ్రహణానంతరం బ్రహ్మ ఆది దంపతులచే అగ్నికార్యం జరిపించి ప్రదక్షిణం చేయించాడు. మునులారా! ఆ సమయంలో సతీదేవి చీర తొలగి లాక్షారంజితము, కుసుమ కోమలము, అలంకార శోభితము, నక్షత్ర శోభాయుత నఖమండితము ఐన పాద ద్వయం కనిపించింది. సకల లోకాశ్రయమైన ఆ పాదాలను చూడగానే బ్రహ్మగారి మనస్సు క్షణంలో వికలమైంది. హర్షంతో, ఉత్కంఠతో శివమాయా మోహితుడై తదేక దీక్షతో వాటివైపే చూచాడు.

అంతే కాదు సతీముఖ సందర్శన కుతూహలంతో అగ్నిహోత్రంలో ఆజ్యాహుతిని అల్పంగాను, పచ్చికర్రలను అధికంగాను వేసి అంతటా పొగ క్రమ్ముకొనేటట్లు చేశాడు. దట్టమైన ఆ పొగకు తాళలేక శివుడు కళ్ళు మూసుకొన్నాడు. అదే సమయంలో సతీదేవి కూడా మేలి ముసుగును తొలగించి అరవిందాల వంటి హస్తాలతో కళ్ళు మూసుకొంది. అదే అదనుగా బ్రహ్మగారు కాంక్షను అణచుకోలేక ధైర్యంతో వంచిన తలను పైకెత్తి సాభిలాషుడై సతీముఖ సందర్శనం చేశాడు. నిగ్రహాన్ని కోల్పోయాడు. వెంటనే మంచు ముద్దవలె నాలుగు బిందువుల పరిమాణం గల శుక్రం జారి పడింది. విస్మితుడై శంకతో అన్యులకు గోచరం కాకుండా దానిని కప్పేశాడు.

భగవానుడైన శంకరుడు దివ్య దృష్టిచే దానిని తెలుసుకొని బ్రహ్మయొక్క జుగుప్సిత కర్మను గర్హించి శూలంతో ఆయనను శిక్షింప బోయాడు. అగ్ని సదృశంగా భయంకరంగా ఉన్న శంకరుణ్ణి చూచి నారాయణుడు, మరీచ్యాది ఋషులు, సర్వదేవ గణాలు భయకంపితులై ఇలా స్తుతించారు.

"హే దేవదేవా! నువ్వు శరణాగత వత్సలుడవు. మీ దంపతులిద్దరు జగత్తుకు తల్లిదండ్రులు. మేమందరం మీ దాసులం. ఆగ్రహాన్ని విడిచిపెట్టు, ఈ బ్రహ్మను రక్షించు." దక్షుడు కూడా "వద్దు! వద్దు!' అని అరుస్తూ ముందుకురికి శూలపాణియైన శివుని చేతిని పట్టుకొన్నాడు. ఆ ప్రాంగణమంతా హాహాకారాలతో దద్దరిల్లింది. కార్యకుశలుడు, బుద్ధిశాలియైన విష్ణువు రుద్రునికి నమస్కరించి వారిస్తూ ఇలా అన్నాడు. "ఓ భూతనాథా! సృష్టికర్త ఐన ఈ బ్రహ్మను సంహరించవద్దు. ఇతణ్ణి సంహరిస్తే సృష్టి కార్యానికి విఘ్నం ఏర్పడుతుంది. అంతపని చెయ్యవద్దు. దక్షపుత్రిక ఐన ఈ సతిని మంచి ఉపాయంతో నీకు భార్య అయ్యేటట్లుగా వ్యవస్థచేసింది ఈయనే కదా! అలా చేసి మరో విధంగా నీకు ప్రాణదానం చేశాడు! కనుక రక్షించు."

ఐనా రుద్రుని కోపం చల్లారలేదు. "పూర్వం నువ్వు చేసిన విన్నపాన్ని మన్నించాను. దాన్నిప్పుడు నెరవేరుస్తాను. మరో సృష్టికర్తను సృష్టిస్తాను." అంటూ నిశిత త్రిశూలాన్ని త్రిప్పాడు. అప్పుడు చిరు నవ్వుతో వివేకశీలి ఐన విష్ణువు సమయోచితంగా ఇలా అన్నాడు: "పరమ పురుషా! ప్రతిజ్ఞాపాలన యుక్తమే కాని ఎవరిని వధిస్తావు? ఈ పితామహుడు నీ నుండి ఆవిర్భవించిన నీ స్వరూపమే గదా! నిన్ను నీవే చంపుకొంటావా? ఆత్మ హత్య మహా పాపం గదా?" ధార్మికమైన విష్ణువు పల్కులకు పరమేశ్వరుడు ప్రసన్నుడై తన ప్రయత్నాన్ని విరమించుకొన్నాడు.

**సతీ సహితుడై శివుడు కైలాసానికేగుట**

మునులారా! ప్రసన్నుడైన పరమేశ్వరుని దర్శించి సర్వులు నిర్భయులై సుఖులయ్యారు. విధాత కూడా తేరుకొని "శంకరా! ఈ పాపశుద్ధి నిమిత్తం ప్రాయశ్చిత్తాన్ని చెప్ప వలసింది" అని వేడగా ఈశ్వరుడిలా అన్నాడు. "పితామహా! భయాన్ని విడిచి నీ తలను నీ చేతితో స్పృశించు." బ్రహ్మ అలానే చేశాడు. వెంటనే అక్కడ వృషభ వాహనుడైన శివుని రూపం గోచరించింది. కమలాసనుడు సిగ్గు పడ్డాడు. అప్పుడు సుప్రసన్నుడైన చంద్రచూడుడిలా అన్నాడు.

"వత్సా! నేను అధిష్ఠించి ఉన్న ఈ రూపంతోనే మదారాధనా తత్పరుడవై తపస్సు చెయ్యి. ఈ పైన లోకంలో నీవు **"రుద్ర శిరస్కుడు"** అనే నామంతో ఖ్యాతికెక్కగలవు. ఈ వీర్యపతనం మానవుల లక్షణం. కనుక నువ్వు మనుష్యుడవై భూలోకంలో సంచరించు. నిన్ను దర్శించిన వారు బ్రహ్మ శిరస్సుపై రుద్రుడున్నాడేమి! అని ఆశ్చర్యమగ్న మానసులౌతారు. ఈ గాథను విన్న వారు 'పరదారాభిలాష' అనే దోషం నుండి ముక్తులౌతారు. జనులు ఈ

గాథను అధికంగా చెప్పుకొని నీయందు దోషారోపణ చేస్తే అంత అధికంగా నీ పాపంతొలగి అది వారికి సంక్రమిస్తుంది. నిన్ను పరిహసించిన వారికి కూడా అదే శిక్ష. ఇదే నీకు ప్రాయశ్చిత్తం.

నీ రేతస్సు నాలుగు బిందువులు భూమిపై పడ్డాయి. వాటి నుండి ప్రళయ కాలంలో సంవర్తకం, ఆవర్తం, పుష్పకం, ద్రోణం అనే నాలుగు మేఘాలు ఉద్భవించి ముయ్యేడు వారాలు కుంభవృష్టిగా కురిసి ప్రళయాన్ని సృష్టిస్తాయి.

శంకరుని పల్కులకు ప్రత్యక్ష సాక్ష్యంగా వెంటనే అంతరిక్షంలో నాలుగు మేఘాలు ఉద్భవించి గర్జిస్తూ అల్ప వృష్టిని కురిపించాయి. వాటిని చూచి అచటి వారందరు భయకంపితులు కాగా దాక్షాయణీ శంకరుల ఆజ్ఞచే అవి వాటి స్థానానికి చేరుకొన్నాయి.

అనంతరం బ్రహ్మగారు మిగిలిన వివాహ కర్మను పూర్తి చెయ్యగానే శంకరుడు లోకగతి ననుసరించి "పితామహా! ఆచార్యుడవై ఈ వివాహ కర్మను లెస్సగా నిర్వహించి పరిసమాప్తి చేశావు. నువ్వు సురజ్యేష్ఠుడవు. ఎంత దుర్లభమైన దానినైనా ఈయగలను. దక్షిణ కోరుకో!" అని ప్రీత చేతస్కుడై పల్కగానే పద్మభవుడిలా ప్రార్థించాడు.

"ఓ దేవదేవా! నువ్వు ఇదే రూపంతో ఈ వేదియందు సర్వదా ఉండి లోకులను పాప వినిర్ముక్తులను చెయ్యి. నేను ఈ వేదికకు దగ్గరలో నా ఆశ్రమాన్ని నిర్మించుకొని నా పాప నివారణార్థం తపస్సు చేసికొంటాను. లోకంలో స్త్రీగాని, పురుషుడుగాని చైత్ర శుక్ల త్రయోదశి ఉత్తరా నక్షత్రయుక్త ఆదివారం నిన్ను భక్తితో సందర్శిస్తారో వారికి మనోభీష్టాలు నెరవేరేటట్లు అనుగ్రహించు. వెంటనే దేవదేవుడు 'తథాస్తు' అన్నాడు.

తరువాత దక్షుని ఆజ్ఞను పొంది సతీ సహితుడై వృషభ వాహనా రూఢుడై హిమవత్పర్వత ప్రాంత కైలాసాశ్రమానికి పయనమయ్యాడు శంకరుడు. స్వాయంభువ మన్వంతరంలో ఈ గాథ జరిగింది. తనను అనుసరిస్తూ వచ్చిన దక్షుని మార్గమధ్యంలో పంపించేశాడు. నిజాశ్రమానికి చేరుకొని వెంటవచ్చిన వారందిరిని సాదరంగా సన్మానించి సాగనంపేడు. అచిరకాలంలోనే నిజమనోరథ ప్రాప్తికి ముదిత మానసుడై శంకరుడు సతీసహితుడై హిమాలయ విహార భూములంతా విహరించాడు.

ఈ కళ్యాణ గాథను ఎవరైతే పఠిస్తారో లేదా శ్రవణం చేస్తారో వారికి చిత్తశాంతి, దేహ స్వాస్థ్యము కలిగి సుఖ సౌభాగ్యాలు కలుగుతాయని శంకరుడు వరమిచ్చాడు.

## సతీ – శంకరుల విహారం

తదనంతర గాథను సూతుడు మునులకిలా వివరించాడు. "మునులారా! తన ఆశ్రమానికి చేరుకొన్న శంకరుడు ప్రాకృత జనుని వలె సతీసహితుడై తన సృష్టిలో తానే రమించిన లీలా విహారాన్ని చెపుతున్నాను వినండి. ముందు వృషభాన్ని దిగి సతికి కేలూత ఇచ్చి దింపి, ఆమె ముఖావలోకనం చేసి మురిసి పోయాడు. గణాలను పిలిచి తనెప్పుడు స్మరిస్తే తక్షణం రావలసిందిగా ఆజ్ఞాపించి వారిని పంపించివేశాడు. సతితో కూడి నవరత్న కాంతి పుంజ శోభా విరాజితమైన తన గిరికందరం లోకి ప్రవేశించాడు. ఆ రహస్య స్థావరంలో దాక్షాయణితో కూడి అనేక లీలలను ప్రదర్శించాడు.

వనంలోకి వెళ్ళి పుష్పాలను కోసి మాలగా కూర్చి ఆమె కంఠాన్ని అలంకరించి నా కపాల మాల బాగుందా – నీ కుసుమహారం బాగుందా అని అడిగే వాడు.

సతి నిలువుటద్దం ముందు నిలబడి తిలకం దిద్దుకొనే వేళ హఠాత్తుగా ఆమె వెనుక ప్రత్యక్షమై తనూ ముఖం చూచుకొని నా త్రినేత్రం బాగుందా నీ తిలకం బాగుందా అని ప్రశ్నించే వాడు.

శిరీష కుసుమ పేశలమైన ఆమె పాదాలను లత్తుకతో అలంకరించి ఫాల నేత్రాగ్ని అరుణ ప్రభలతో మరింత రాగరంజితం చేసేవాడు.

సన్నిహితంగా సతీముఖ సౌందర్యం వీక్షించాలనే కాంక్షతో, పరులాలకించరాదు... రహస్యం, అంటూ చెవిలో చెప్పేవాడు.

అన్యమనస్కురాలై కూర్చున్న ఆమెను వెనుకనుండి వచ్చి కనులు మూసి, నా చేతులు పెద్దవా నీ కన్నులు పెద్దవా అని అడిగేవాడు.

ఆమె సర్వావయవాలను కుసుమ విరాజితం చేసి చైత్రరథంలా ఉన్నావు అనేవాడు.

కైలాస పర్వత ప్రాంత రమ్యలతా గృహాలన్నిటి యందు సతీసహితుడై విహరించాడు. ఆపై కైలాసాన్ని వీడి హిమవత్పరత ప్రాంత రమ్య వన ప్రదేశాలయందు సంచరించాడు. ఇప్పుడు కందర్పుడు దర్పంతో ఎల్లవేళలా శంకరుని చెంత కింకరునిలా నిల్చుంటున్నాడు. ఛాయలా వసంతుడు జంట బాయక వెంట తిరుగుతున్నాడు.

పుష్పిత ద్రుమాలు! వికసిత కుసుమ శోభితాభిరామ లతలు! ప్రపుల్ల పద్మ సమాకీర్ణ నిర్మల జలపూర్ణ సరోవరాలు! సకల జన మోహకారక మలయానిలం! ఎల్లెడలా వసంత వైభవమే!

ఆ సమయంలో శైల శిఖరాగ్రాల యందు, గిరి కందరాల యందు, గోత్ర నిర్ఝరుల యందు, పర్వత ఉపత్యకల యందు, అద్రి నికుంజములయందు, వారి తీరముల యందు, పుష్పవనముల యందు సర్వ సృష్టి ఆయన ఇల్లే కనుక సతితో కూడి పరమేశ్వరుడు యథేచ్ఛగా విహరించాడు. ఆ క్షణంలోనే ఆత్మ బోధ చేస్తున్నాడా అన్నట్లు నిర్విరామంగా సల్లాపాలతో, కృపా వీక్షణాలతో, హాస్య ప్రసంగాలతో, సంభాషణలతో సతితో కూడి లీలా విహారం చేశాడు ఈశ్వరుడు. ఈ విధంగా దివ్యమానంచే ఇరవై ఐదు సంవత్సరాలు వినోదించాడు.

**వర్షఋతు శోభ-సతీ శంకరుల విహారం**

ఓ మునులారా! ఇంతలో వర్షఋతువు ప్రవేశించింది. ఆకాశంలో తిరుగాడుతున్న నల్లని మేఘాలను చూచి దాక్షాయణి శంకరునితో ఇలా అంది. "నాథా! మిక్కిలి దుస్సహమైన వర్ష ఋతువు ఆరంభమైంది. మనకొక నివాసాన్ని ఏర్పాటు చెయ్యండి. అనేక రంగుల మేఘాల గుంపులు తమ గర్జనలతో దిక్కులను, ఆకాశాన్ని ప్రతిధ్వనింప చేస్తున్నాయి. వేగంగా వీచే గాలులు కదంబ పుష్ప పరాగాన్ని ఎగరగొడ్తూ, నీటి ధారలను చెదర గొడ్తూ హృదయానికి భయాన్ని కలిగిస్తున్నాయి. కుండపోతగా జలాలను వర్షిస్తూ, మెరుపు తీగలే పతాకలుగా తీవ్రంగా గర్జిస్తూన్న ఈ మేఘాలను చూస్తే ఎవని మనస్సు భీతావహం కాకుండా ఉంటుంది? మేఘచ్ఛన్నమైన సూర్య చంద్రులు గోచరం కాని కారణంగా, రాత్రి పగలు ఒక్కలా ఉంది.

వాయు సంచలిత గాములైన ఈ మేఘాలు చంచలమైన లక్ష్మివలె ఒక్క చోట ఉండవు గదా! గాలికి కదలుతూన్న మహావృక్షాలు ఆకాశంలో నర్తిస్తూన్నట్లున్నాయి. భీరువులకు భయాన్ని కలిగిస్తున్నాయి. నల్లని మేఘాలు, ఎగిరే తెల్లని కొంగలు యమునా నదిలో నురగల్లా ఉన్నాయి. నల్లని జలధరాల మధ్య ఉదయిస్తూన్న అరుణుడు సముద్రంలో మండుతూన్న బడబాగ్నిలా ఉన్నాడు.

గృహ ప్రాంగణంలోని గింజలు మొలకెత్తాయి. పంట చేలల్లో సస్యాలు పెరుగుతున్నాయని వేరే చెప్పాలా? నాథా! ఈ సౌందర్యం చాలా కుటిల మైనది సుమా! కలిలో లక్ష్మీదేవి సత్పురుషులను వీడి దుష్టులను ఆశ్రయించినట్లుగా కింశుక పుష్పాలను ఆశ్రయించింది. వన సీమల యందు నెమళ్ళు జలధర గర్జనలను విని చాలా ఆనందంతో కేకాధ్వనులను చేస్తూ పింఛాలను పైకెత్తి నాట్యం చేస్తున్నాయి.

మేఘోదయాన్ని చూచి ఉల్లాసాన్ని పొందే చాతక పక్షులకు ఈ వర్ష ఋతువు మనోహరం కావచ్చుకాని ధారాపాతంగా వర్షం పడుతున్నా పథికులు వియోగ తాపాన్నే

అనుభవిస్తారు. ఈ జీమూతాల పొగరును చూడండి! ఇవి వడగళ్ళతో నా దేహాన్ని కప్పేస్తున్నాయి. ఇలాటి విషమ కాలంలో కాకులు, చకోరాలు కూడా గూళ్ళు కట్టుకొంటున్నాయి. నాథా! మనకంటూ ఒక ఇల్లు లేదు గదా? ఎక్కడో ఒక చోట ఇల్లు కట్టే ప్రయత్నం చెయ్యండి.

దాక్షాయణి పల్కులకు తన శిరోభూషణమైన చంద్రుని వెన్నెలకు మెరుగు పెట్టేటట్లుగా ఇందుధరుడు మందహాసం చేసి ఇలా అన్నాడు: “ఓ మనోహరీ! ఎక్కడ నిర్మించమంటావు? హిమాలయ గిరి శిఖరాల మీదనా? మేఘాలు వాటి సానువుల వరకే ఎగరగలవు. పోనీ కైలాస పర్వతం మీదనా? దాని పాదాల వరకు విహరించగలవు. లేక మేరు గిరి శిఖరంపైనా? పుష్కరావర్తకాది వారివాహాలు సైతం ఆ ఛాయలకే రావు. వీటిలో దేనియందు నివాసముండాలనుకొంటున్నావు? చెప్పు.

హిమాలయాలైతే అక్కడ మందమారుతం వీస్తూ ఉంటే బంగారు రెక్కల పక్షులు ఎగురుతూ ఉంటాయి. శ్రవణపేయంగా కలకూజితాలు చేస్తూంటాయి. వాటితో గొంతు కలిపి నువ్వూ పాడుకోవచ్చు. అక్కడి మణి కుట్టిమముల యందు సిద్ధాంగనలు స్వేచ్ఛా విహారం చేస్తూ ఉంటారు. నాగాంగనలు, గిరి కన్యకామణులు, కిన్నెర యువతులు ఆట పాటలలో నీకు సహాయులుగా ఉంటారు. బహుశః నీ సౌందర్యాన్ని చూచి వారికి వారి శరీరం మీద అనాదరం కలుగుతుంది కాబోలు! గుణ రూపాలలో అసమానమైన హిమవంతుని భార్య నీకనుకూలంగా ఉండి నిత్యోల్లాసియై ఉంటుంది.

గిరి సార్వభౌముడైన హిమవంతుని రాజధాని మహా శోభాయమానంగా ఉంటుంది. సిద్ధసేవితమైనది. అక్కడ సంతత వసంతం. అచట చెట్లన్నీ కల్పద్రుమాలే! ఆ ప్రాంతమంతా మహోదారులు, పరమ శాంతులు, తపోధనులు ఐన మునులతో, యతులతో శాంత గంభీరంగా ఉంటుంది. సానువులన్ని స్ఫటిక, స్వర్ణ, రత్న కాంతులతో చిత్రవర్ణ సమాకీర్ణంగా నయనానందంగా ఉంటాయి. మానసాది సరస్సులు అనేకం ఉన్నాయి. అక్కడ బంగారు తూండ్లుగల పద్మాలున్నాయి. అవన్నీ తాబేళ్ళు, మొసళ్ళు, వివిధ జలచరాలతో చూడ ముచ్చటగా ఉంటాయి. సింహాలు, ఎనిమిది కాళ్ళ శరభ మృగాలు, మృగ రూపం పురుష స్వభావం కల పురుష మృగాలు ఇంకా అనేకం ఉన్నాయక్కడ. కస్తూరి, చమరీ మృగాల వంటి అపురూప చతుష్పాత్తులున్నాయి. స్వర్ణపుండరీకాలు, కుంకుమ పువ్వుతోటలకు కొదవేం లేదు. తిత్తిరి, భరద్వాజ, క్రౌంచ, చాతక, చక్రవాక పక్షుల కలకూజితాలు కామోద్దీపనాన్ని కలిగిస్తూ ఉంటాయి.

ఇంద్ర, కుబేర, యమ, వరుణ, అగ్ని, నిర్ఋుతి, వాయు, ఈశానుల రాజధానులన్ని అక్కడే ఉన్నాయి. రంభోర్వశీమేనకాది అప్సర స్త్రీగణ నృత్యగాన విలాసాదులను నువ్వు నిత్యము తిలకించవచ్చు. లేదా కైలాసంలోనే నివాసం ఏర్పాటు చేసుకొందామా? ఇది గుణాలలో మేటి ఐన మేరువు కంటె గొప్పది. అలకాధిపతి పట్టణానికి చెంతనే ఉంటుంది. అక్కడ ఆకాశ గంగలో నిత్యము జలక్రీడలాడుకోవచ్చు. అన్నిటికి మించి అక్కడ చంద్రునికి వృద్ధి క్షయాలు లేవు.

అచట గిరికందరాలన్ని సుస్వరంతో వేదగానం చేస్తూ ఉంటాయి. ఉషనిత్తులు నీకు చెలికత్తెలై సేవిస్తూంటాయి." శ్రవణ మాత్రం చేతనే మనోల్లాసాన్ని కలిగించే శంకరుని పల్కులకు సంతసించి సతీదేవి తన మనోగతాన్ని మెల్లగా ఇలా వెల్లడించింది. "నాథా! హిమవత్పర్వత ప్రాంత కైలాస శిఖరం మీదనే మన నివాసాన్ని ఏర్పాటు చెయ్యండి." శివుడా మాటలకు పరమ మోహితుడై దాక్షాయణితో కూడి హిమాద్రి శిఖరానికి చేరుకొన్నాడు. అచ్చటికి గరుడుడు కూడా వెళ్ళలేడు. మేఘాలన్ని స్ఫటిక కాంతులతో పగలే వెన్నెలను కురిపిస్తూంటాయి. ఈ విధంగా సతీశంకరులు కైలాసాన్నే స్థిరనివాసంగా చేసికొని లోకాలన్నీ సంచరిస్తూ ప్రేమ భావన అనుజలాలతో అనురాగమనే మహీరుహాన్ని వర్ధిల్ల చేశారు.

**శివభక్తి మహిమ**

మునులారా! ఈ విధంగా సతీ శంకరులు పదివేల దివ్య సంవత్సరాలు విహరించారు. ఒక రోజున సతి నివృత్తి భావంతో శివుని సమీపించి "నాథా! అనేక వేల దివ్య సంవత్సరాలు నీతో విహరించి ధన్యురాలనయ్యాను. నా మనసిప్పుడు ప్రవృత్తి మార్గం నుండి మళ్ళింది. పర తత్త్వాన్ని తెలుసుకొనాలను కొంటున్నాను. దేవా! జీవుడు ఏ తత్త్వాన్ని ఎరిగి శీఘ్రమే సంసార దుఃఖాన్ని దాటగల్గుతాడో ఆ మోక్షోపాయాన్ని చెప్పవలసింది" అని కోరగా శంకరుడిలా చెప్పాడు.

"దాక్షాయణీ! మంచి ప్రశ్నే అడిగావు విను. పరతత్త్వం అంటే విజ్ఞానం. ఆ విజ్ఞానం ఉదయించిన జ్ఞాని మనసులో, 'నేనే బ్రహ్మమును' అనే స్మృతి కలుగుతుంది. ఆ జ్ఞానం దుర్లభం. నాయందలి భక్తియే ఆ జ్ఞానం పుట్టటానికి హేతువవుతుంది. ఆ భక్తి తొమ్మిది విధాలు. జ్ఞానానికి భక్తికి భేదం లేదు. భక్తిలేని వానికి జ్ఞానం కలగదు. భక్తుల విషయంలో నాకు తారతమ్యాలు లేవు. కుల, జాతి, వర్ణ భేదాలు లేవు. ఆ భక్తి సగుణ నిర్గుణ భేదంచే రెండు విధాలు. సహజంగా హృదయంలో పుట్టిన భక్తి గొప్పది. కోరికలతో పుట్టిన భక్తి తక్కువది.

ఈ సగుణ, నిర్గుణ భక్తి నైష్ఠికి అనైష్ఠికి భేదం చేత రెండు విధాలు. నైష్ఠికీ భక్తి ఆరు భేదాలు కలది. అనైష్ఠికిలో భేదాలు లేవు. సగుణ నిర్గుణ భక్తి విహితం, అవిహితం భేదంచే బహు భంగులుగా ఉంటుంది. భక్తి ఏదైనా అంగాలు తొమ్మిది. 1. శ్రవణం, 2. కీర్తనం, 3. స్మరణం, 4. సేవనం, 5. దాస్యం, 6. అర్చనం, 7. నమస్కారం, 8. సఖ్యం, 9. ఆత్మార్పణం. వీటికి అనేక ఉపాంగాలున్నాయి. ఈ నవ విధములైన భక్తిని వివరిస్తాను. సమాహిత చిత్తంతో విను.

1. భగవత్కథలను శ్రద్ధాభక్తులతో వినటం శ్రవణం.
2. భగవంతుని లీలలను గానం చెయ్యటం కీర్తనం.
3. సర్వ వ్యాపకుడైన శంకరుని నిత్యము సర్వత్రా దర్శించి లోకంలో నిర్భయుడై ఉండుట స్మరణం.
4. సూర్యోదయం మొదలు అంకిత భావంతో సర్వదా సేవకుని వలె అనుకూలంగా ఉండటం సేవనం.
5. భగవంతుని ప్రియునిగా భావిస్తూ అమృత రూపానందాన్ని అనుభవించటం దాస్యం.
6. పాద్యం మొదలు షోడశోపచారాలతో పూజించటం అర్చన.
7. అష్టాంగములచే భూమిని స్పృశించుట వందనం.
8. అంతా మనమేలు కొరకే అనే దృఢ నిశ్చయం సఖ్యం.
9. దేహం మొదలు సర్వమును భగవానుని ప్రీతి కొరకు సమర్పించటం ఆత్మార్పణ.

ఓ దేవీ! ఇట్టి భక్తి శ్రేష్ఠం. జ్ఞాన వైరాగ్యాలకు తల్లి వంటిది, ముక్తికి దాసి వంటిది ఐన ఇట్టి భక్తి ఉత్తమోత్తమమైనది. సర్వ కర్మల ఫలం భక్తినుండే పుడుతుంది. భక్తియందు నాకు నీపైగల ప్రేమతో సమానమైన ప్రేమ ఉంది. భక్తుడు నాకిష్టుడు. ముల్లోకాలలో భక్తికంటె సుఖావహమైన మార్గం లేదు. కలియుగంలో భక్తి గొప్పది. కలిలో జ్ఞానవైరాగ్యాలు ఉత్సాహం ఉడిగి జవసత్త్వాలు లేనివై ఉంటాయి. వాటిని స్వీకరించేవారు లేని కారణంగా అవి శిథిలావస్థలో ఉంటాయి. కలిలో భక్తి ప్రత్యక్షఫలాన్నిస్తుంది. నా భక్తునికి నేనెప్పుడూ సహాయం చేస్తాను. పూర్వం నా భక్తుని కారణంగానే సూర్యునిపై అతిక్రోధాన్వితుడ నయ్యాను. భక్తుని కారణంగానే పక్షపాతం లేకుండా రావణుని పరిత్యజించాను. చెడు ఆలోచన గల కుమతి ఐన వ్యాసుని, నందిచే దండింప చేసి కాశీ బహిష్కరణ శిక్ష విధించాను."

ఈ విధంగా శంకరుడు సతికి; భక్తికి సంబంధించిన అన్ని విషయాలను బోధించాడు. అంతే కాకుండా యంత్ర సహితంగా తంత్ర శాస్త్రాన్ని, పంచాంగాన్ని, ఇతిహాసాలను, భక్తుల గాథలను, వర్ణాశ్రమ ధర్మాలను, రాజ, పుత్ర, స్త్రీ ధర్మాలను, జీవ సుఖావహమైన వైద్య, జ్యోతిష, సాముద్రిక శాస్త్రాలను చివరగా నాశ రహితమైన తత్త్వాన్ని దయతో స్పష్టంగా ఉపదేశించాడు.

**సతీదేవి శ్రీరాముని పరీక్షించుట**

తపోధనులారా! వినండి! ఒక రోజున సతీ శివులు లీలగా త్రిలోక సంచారం చేస్తూ భూలోకంలో దండకారణ్య శోభను పరికిస్తూండగా సీతా వియోగంతో బాధ పడుతూన్న శ్రీరామచంద్ర ప్రభువు వారికి దర్శనమిచ్చాడు. వెంటనే శంకరుడు ఆయనకు నమస్కరించి తన దర్శనాన్నిచ్చి 'జయ' అని పల్కి ఆశీర్వదించాడు.

ఆ దృశ్యాన్ని చూచిన సతి శివమాయా మోహితురాలై "నాథా! హరి బ్రహ్మాదులు సైతం మీకు నమస్కరిస్తారే! అట్టి మీరు భూలోకంలో ఒక మానవ మాత్రునికి నమస్కరించారు. ఎక్కడైనా భృత్యునికి ప్రభువు నమస్కరించటం ఉంటుందా?" అని ప్రశ్నించింది. శివుడిలా సమాధానం చెప్పాడు.

"దేవీ! ఈ శ్రీరామ చంద్రుడు సాక్షాత్తు విష్ణువే. లక్ష్మణుడు శేషువు. సాధురక్ష కొరకు ఆవిర్భవించిన అవతారాలవి. నీకేమైనా శంక ఉంటే పరీక్షించుకోవచ్చు."

అప్పుడు సతి పతిమాట మీద తనకెంత విశ్వాసం ఉన్నా, సహజంగా స్త్రీలు అనుమాన పీడితలు కనుకను, ఆ సమయంలో శివమాయా మోహితురాలై ఉంది కనుకనూ శ్రీరామచంద్రుని పరీక్షించటానికి పూనుకొని సీతా రూపంలో రామునికి దర్శనమిచ్చింది. మనసులో సత్యాన్నెరిగిన విష్ణువైన రాముడు, శివనామాన్ని జపిస్తూ సతికి నమస్కరించి కుశలమడిగాడు. దానికి ఆశ్చర్యచకితురాలైన సతి జరిగిన దానిని చెప్పి "హే విష్ణూ! మహాదేవుడు సైతం నమస్కరింప తగిన పరమ పదాన్ని ఎలా పొందగలిగావు?" అని ప్రశ్నించింది.

**సతీ పరిత్యాగం**

ఋషులారా! శ్రీరాముడు సాక్షాత్తు విష్ణువే కనుక తన పూర్వ గాథను సతికిలా చెప్పసాగేడు. "తల్లీ! నా శివభక్తికి మెచ్చి శంభుడు ఈ పరమపదాన్ని నాకనుగ్రహించాడు. ఆ పూర్వగాథను చెపుతున్నాను ఆలకించు. పూర్వం శంకరుడు విశ్వకర్మను పిలిచి తన లోకంలో గల గోశాల యందు సుందరమైన భవనాన్ని

నిర్మింప చేశాడు. ఛత్ర, చామరాదులను, సింహాసనాన్ని ఏర్పాటు చేసి బ్రహ్మేంద్రాది సకల దేవతలను, తక్కిన దేవ జాతులను, అప్సరసలను, గాయకులను రప్పించి, అనేక దివ్య వస్తువులను సమకూర్చి స్వయంగా బ్రహ్మాండ మండపంలో నన్ను సింహాసనారూఢుణ్ణి చేసి సార్వభౌమ చిహ్నంగా శిరసున రత్నకిరీటాన్నుంచి, అనేక వరాలిచ్చి, సృష్టిపాలనా కర్తవ్యాన్ని నాకనుగ్రహించాడు. అంతే కాదు సనాతనమైన వేదాలు కూడా నా మహిమను కీర్తించినట్లే నీ గాథలను కూడా వర్ణిస్తాయి అని వరాన్నిచ్చాడు. తన స్వీయ ఐశ్వర్యాన్నంతటిని నాకు ధారపోశాడు. హరిద్వేషులను తను దండిస్తానని శపథం చేశాడు. ఈ గోలోకం సర్వ సమృద్ధమై భక్తులకు పరమపదమై మహోజ్జ్వలమై ప్రకాశించగలదని వరమిచ్చాడు. స్వయంగా తను దోసిలొగ్గి నమస్కరించి అందరిచే నమస్కరింప చేశాడు.

ఆ విష్ణువునే నేను. శివాజ్ఞచే నాలుగు రూపాల్లో అవతరించాను. వారిలో నేను రాముణ్ణి, మిగిలిన వారు భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు."

ఈ విధంగా తన పూర్వ గాథను, వర్తమానాన్ని వివరించి "ఆది దంపతులైన మీ దర్శన భాగ్యంచే సీత నాకు పునర్లబ్ధయగు గాక" అని పలికి వన సంచారానికి వెళ్ళి పోయాడు రాముడు.

భర్త ఐన శంకరుని మాట మీద ఆదరాన్ని కోల్పోయి, స్వతంత్రించి శ్రీరాముని పరీక్షించి, జ్ఞానోదయాన్ని పొందిన సతి శోక వ్యాకులయై, విషణ్ణ వదనంతో భర్తముందు నిలబడింది. తలవంచుకొని నిల్చున్న సతిని చూచి, ధ్యాన మార్గంలో జరిగింది తెలుసుకొని, తన పూర్వ ప్రతిజ్ఞను స్మరించి మనసులో విషాదాన్ని పొందేడు. ధర్మ వక్త, ధర్మ కర్త ఐన శివుడు వేదధర్మ ప్రపాలకుడు కనుక సతిని మనసులో పరిత్యజించి కైలాసానికి వెళ్ళిపోయాడు.

మార్గ మధ్యంలో ఆకాశవాణి శివుని ధర్మనిష్ఠకు మెచ్చి "శంకరా! నీవు ధన్యుడవు. నీతో సమంగా ప్రతిజ్ఞా పాలనను నెరవేర్చుకోగల మహాయోగి మరొకడు లేడు" అని కీర్తించింది. ఆ పల్కులను విన్న సతి కాంతిని కోల్పోయి "నాథా! మీ ప్రతిజ్ఞ ఏమిటో నే వినదగునా?" అని కోరినా శివుడు బదులు చెప్పలేదు. సతి ధ్యానంలో శంకరునే ధ్యానించి సర్వాన్ని తెలుసుకొని నిట్టూర్పులు విడుస్తూ దుఃఖితురాలైంది. ఆమె మనోగతాన్నెరిగిన శంకరుడు ఆమెకనేక గాథలను చెపుతూ ఊరట కలిగించాడు."

**దక్షుడు శివునితో విరోధించుట**

సూతుడు శివ మహాపురాణంలో ప్రధానమైన దక్షుని గాథను మునులకిలా వివరించాడు. "మునులారా! పూర్వం మహాత్ములైన మునులు ప్రయాగలో అధ్వర విధిని నిర్వర్తించారు. అచ్చటకు సిద్ధులు, సనకాది దేవర్షులు, ప్రజాపతులు, దేవతలు, జ్ఞానులు, బ్రహ్మదర్శినులు ఇంకా అనేక మంది మహానుభావులు విచ్చేశారు. సపరివారంగా బ్రహ్మగారు కూడా వచ్చాడు. భవానీ సహితుడై రుద్రుడు తన ప్రమథ గణాలతో కూడి అరుదెంచాడు. రుద్రుని చూచి అక్కడి వారందరూ లేచి నమస్కరించారు. శివుని ఆజ్ఞచే తిరిగి ఉపవిష్టులయ్యారు. ఆ సమయంలో ప్రజాపతులకు పతి, తేజశ్శాలి గర్విష్ఠి ఐన దక్షుడు కూడా వచ్చాడు. బ్రహ్మకు నమస్కరించి ఉచితాసనాసీనుడయ్యాడు. అక్కడి వారంతా అతనికి నమస్కరించి, స్తుతించి పూజించారు. రుద్రుడు లేవ లేదు. నమస్కారం చెయ్యలేదు. దక్షుని అతిశయానికి మనసులో నవ్వుకొన్నాడు.

లేచి నమస్కరించని రుద్రుని చూచి దక్షుడు అప్రసన్నుడై క్రోధాన్ని పొంది, మహా గర్వంతో, క్రూర దృష్టితో రుద్రుని చూచి అందరూ వినేటట్లు ఇలా అన్నాడు. "ఈ దేవ దానవ బ్రాహ్మణ శ్రేష్ఠులంతా నాకు లేచి నిలబడి నమస్కరించారు. కాని ప్రేత, పిశాచ సంవృతుడైన ఈ శ్మశాన వాసి, ఈ లజ్జా పరిత్యాగి, ఈ నీతి విదూరుడు, ఈ వేద బాహ్యుడు, ఈ అమంగళ కరుడు నన్ను ధిక్కరించేటంత గర్విష్ఠి ఎలా అయ్యాడు? ఈతని అనుచర గణమంతా నాస్తికులు, పాపశీలురు. వారు వైదికాచార సంపన్నులైన బ్రాహ్మణులను చూచి పరిహసిస్తారు. ఈ రుద్రుడు భార్యయందు అధిక ప్రేమోన్మత్తుడు. ఇతణ్ణి వధించటానికి నాకు మీరు అనుజ్ఞ ఇవ్వండి! ఈపైనుండి వీడు యజ్ఞ బహిష్కృతుడు. శ్మశానవాసి, వికృతరూపి ఐన వీడితో కూడి దేవతలు యజ్ఞభాగాన్ని స్వీకరింప కుందురు గాక!" అని శపించాడు. దక్షుని మాటల మాయలో పడ్డ భృగ్వాది ఋషులందరు రుద్రుని గర్హించారు.

దక్షుని వాక్యాలను విన్న నందీశ్వరుడు అతిరోషాన్వితుడై, అగ్ని గోళాల వంటి కనుగ్రుడ్లను వేగంగా త్రిప్పుతూ ఇలా అన్నాడు: "రే! రే! శఠ! దుష్టమతీ! ఎవని నామ స్మరణ మాత్రాన యజ్ఞాలు సఫలమవుతాయో, క్షేత్రాలు, తీర్థాలు పవిత్రమవుతాయో, సృష్టిస్థితి లయములు ఎవని ఆజ్ఞచే నిర్వర్తింపబడుతున్నాయో అట్టి మహేశ్వరుడు యజ్ఞభాగస్వామి కాకుండ ఉండటం ఎట్లా సంభవం?"

ఈ విధంగా ఎదుర్కొన్న నందిని దక్షుడిలా శపించాడు "ఓరీ! నందీ! మీ రుద్రగణాల వారందరు వేద బాహ్యులు అగుదురు గాక! నాస్తికులు, శిష్టాచార బహిష్కృతులు, మదిరాపాన నిరతులు; జడలను, భస్మను, ఎముకలను ధరించువారు అగుదురు గాక!"

గర్విష్ఠి ఐన దక్షుని శాపానికి శిలాద కుమారుడు, తేజశ్శాలి, శివప్రియుడు ఐన నంది ఇలా ప్రతిశాపమిచ్చాడు.

"రే! రే! మూర్ఖా! నా స్వామి ఐన శివ తత్త్వాన్ని తెలుసుకోలేక వృథాగా శపించావు. ఇక్కడున్న భృగ్వాది ఋషులు కూడ మహేశ్వరుని పరిహాసం చేశారు. రుద్రుని యందు విముఖత గల వారిని నేను శపిస్తున్నాను. మీరు వేదముల యొక్క అర్థవాదమందు మాత్రమే శ్రద్ధగలవారై వేదతత్త్వ బహిర్ముఖులగుదురు గాక! మీరు కామనలతో కూడిన మనస్సు కలవారై స్వర్గం తప్ప ఇంకేమీలేదనే అజ్ఞానంతో, నిత్యము, సత్యము ఐన పరబ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకోలేక అరిషడ్వర్గాదులచే పీడింప బడుతూ, సిగ్గువీడి నిత్య యాచకులై సంచరింతురు గాక! ధన సంపాదనే ధ్యేయంగా గల దరిద్రులగుదురు గాక!

పరమేశ్వరుని విషయంలో దుష్టమతియై, దేవతలలో ఒకనిగా భావించిన ఈ దక్షుడు తత్త్వవిముఖుడగు గాక! గ్రామ్య సుఖాల యందు ఆసక్తి కలవాడై, కేవలం కర్మ తంత్రాన్ని విస్తరించు వాడై, ఆత్మ జ్ఞానాన్ని విస్మరించి, ఇదే శాశ్వత వేద ధర్మమని భ్రమించి ఈ దక్షుడు పతనమగు గాక! ఇతడు తొందరలోనే మేకముఖం కలవాడగు గాక!" నందీశ్వరుని దారుణమైన శాపానికి అక్కడి వారంతా హాహాకారాలు చేశారు. శివ తత్త్వాన్ని ఎరిగిన బ్రహ్మ, దక్షుని భృగ్వాది బ్రాహ్మణులను మందలించాడు.

నంది శాపాన్ని విన్న సదాశివుడు మధురంగా నందికిలా బోధించాడు. "నందీ! మహాప్రాజ్ఞా! నువ్వు కోపించటం తగదు. నేను దక్షునిచే శపింపబడ్డానని నువ్వు భ్రమించి బ్రాహ్మణులను వృథాగా శపించావు. వేదాలు మంత్రాక్షరాలతో, సూక్తాలతో నిండి ఉంటాయి. సర్వ ప్రాణులు ఆత్మ సూక్తమందు ప్రతిష్ఠితమై ఉంటాయి. కాబట్టి అట్టి ఆత్మ ప్రతిపాదకమగు వేదాన్ని అధ్యయనం చేసిన విప్రులను నిందించటం తగదు. ఎంత మానసిక క్షోభ కలిగినా వేదాలను దూషించరాదు. నేనిపుడు శాపాన్ని పొందలేదు. నువ్వు తత్త్వాన్ని తెలుసుకో. సనకాది మహర్షులకు జ్ఞాన బోధ చేసిన ధీశాలివి. శాంతుడవు కా! యజ్ఞాన్ని, యజ్ఞకర్మను, యజ్ఞాంగాలను, యజమానిని అన్నీ నేనే! యజ్ఞ బాహ్యుడను కూడా నేనే! తత్త్వ దృష్ట్యా అన్నీ నేనే! ఈ బుద్ధితో పరికిస్తే నీ శాపం వ్యర్థమే కదా? ఓ ప్రియమైన నందీ! తత్త్వ జ్ఞానంచే ప్రపంచ రచనను అర్థం చేసికొని ఎప్పుడూ ఆత్మనిష్ఠలో ఉండు!"

శంకరుని ప్రబోధానికి నంది శాంతుడయ్యాడు. రుద్రుడు తన అనుచర గణాలతో కూడి స్వస్థానాన్ని చేరుకొన్నాడు. దక్షుడు మాత్రం శివ ద్రోహమే లక్ష్యంగా కలవాడై, శివ భక్తులను నిందించుటే ధ్యేయంగా పెట్టుకొని శివద్వేషి అయ్యాడు."

**దక్షయజ్ఞ ప్రారంభం**

సూతుడు ఉత్సాహంతో మునులకిలా చెప్పసాగేడు. "తపోధనులారా! దక్షయజ్ఞ గాథను చెపుతున్నాను వినండి. ఒకప్పుడు దక్షప్రజాపతి కనఖల తీర్థంలో గొప్ప యజ్ఞాన్ని ప్రారంభించాడు. సర్వులను ఆహ్వానించాడు. అందరు శివమాయా మోహితులై ఋషులు, దేవతలు ఇంకా అనేక మంది భార్యా, పిల్లలతో ఆనందంగా విచ్చేశారు. అగస్త్యుడు, కశ్యపుడు, అత్రి, వామదేవుడు, భృగువు, దధీచి, వ్యాసుడు, భారద్వాజుడు, గౌతముడు, పైలుడు, పరాశరుడు, గర్గుడు, భార్గవుడు, కకపుడు, సితుడు, సుమంతుడు, త్రికుడు, కంకుడు మరియు వైశంపాయనాది మహర్షులు విచ్చేశారు. సర్వదేవగణాలు, లోక పాలురు, ఉపదేవ గణాలు, దిక్పాలకులు మహోత్సాహంతో నిజవాహనా రూఢులై ఏతెంచారు. సత్యలోకం నుండి బ్రహ్మను, వైకుంఠం నుండి విష్ణువును ప్రార్థించి గొప్ప ఆదరంతో తోడ్కొని వెళ్ళారు.

సహస్ర రూపుడైన అగ్ని స్వయంగా హవిర్భాగాలను స్వీకరించటానికి వచ్చాడు. సాక్షాత్తు సుందరాకారుడైన యజ్ఞపురుషుడు స్వయంగా ఉపస్థితుడయ్యాడు. విశ్వకర్మ తన నైపుణ్యంచే అనేక దివ్య భవనాలను నిర్మించాడు. వచ్చిన వారందరికి దక్షుడు వాటిలో నివాసాన్ని ఏర్పాటు చేశాడు. దిక్పాలకులు ఆయుధ పాణులై ద్వారపాలక స్థానంలో నిల్చున్నారు. పద్దెనిమిదివేల మంది ఋత్విక్కులు హోమం చేశారు. అరవై నాలుగువేల దేవర్షులు ఉద్గాతృ స్థానాలను అలంకరించారు. అంతే సంఖ్యలో అధ్వర్యులు, హోతలు ఉపస్థితులయ్యారు. విష్ణువు అధ్యక్ష స్థానం లోను, పితామహుడు బ్రహ్మ స్థానంలోను ఉండి యజ్ఞాన్ని మహోత్సవంగా నడిపిస్తున్నారు.

నారదాది ఋషులు, సప్తర్షులు, గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, ద్వాదశాదిత్యులు, నాగులు, ద్విజర్షులు, రాజర్షులు, దేవర్షులు, వసువులు, రాజులు, మంత్రులు వీరందరిని వరణ చేశాడు దక్షుడు. దీక్షితుడై, రక్షాబంధనోత్సవాన్ని నిర్వర్తించి స్వస్తి పుణ్యాహ వాచనాన్ని చేసిన దక్షుడు భార్యతో కూడి మిక్కిలి ప్రకాశించాడు. దోషదర్శి ఐన దక్షుడు+ శంభుడు కపాలధారి కనుక యజ్ఞార్హత లేదని నిశ్చయించి, సతీ శంకరులను యజ్ఞానికి ఆహ్వానించలేదు.

ఇంతలో శివ భక్తుడైన దధీచి మహర్షి అక్కడ శంకర ప్రభువు కనుపించక పోవటంతో ఉద్విగ్నుడై ఇలా అన్నాడు. "ఓ దేవర్షి ప్రముఖులారా! నా మాటను వినండి, ఈ యజ్ఞ మహోత్సవానికి శంభుడెందుకు రాలేదు? మునులు, లోకపాలురు, సకల దేవతలు వచ్చారు గదా! శంభుడొక్కడే ఎందుకు రాలేదు? సుఖాలు, శుభాలు ఎవనివల్ల కలుగుతాయని వేదవిదులు చెపుతున్నారో అట్టి శ్రీవర్ధనుడు, నీలకంఠుడు, పురాణ పురుషుడు ఐన శంకరుడు ఇక్కడెక్కడా కనుపించటం లేదే? ఓ దక్షా! ఎవరిని పొంది అమంగళాలు కూడ మంగళాలు అవుతాయో, తన పదిహేను నేత్రాలతో చూచిన మాత్రాన సర్వము పవిత్రీకృత మవుతుంతో అట్టి శివుణ్ణి వెంటనే విష్ణువుచేగాని, విధాతచే గాని ఆహ్వానింపచెయ్యి. సతీ సహితంగా సర్వ ప్రయత్నాలను చేసి సగౌరవంగా తోడ్కొని రండి. ఆయన రాకతో గాని ఈ యజ్ఞం పరిపూర్ణం కాబోదు!"

అపథ్య రోగికి ఔషధం లాగ దధీచి మాటలు దక్షుని బుద్ధికెక్క లేదు. ఆ సమయంలో మూఢ బుద్ధి, క్రోధావిష్టుడు ఐన దక్షుడు చిరునవ్వును నటిస్తూ ఇలా అన్నాడు.

"ఓ దధీచీ! జగత్తుకు విష్ణువే ఆధారం. సనాతన ధర్మం ఆయన యందే ప్రతిష్ఠితమై ఉంది. ఎవని యందు వేదాలు, యజ్ఞాలు, వివిధ కర్మలు, కర్మ ఫలాలు సర్వము ప్రతిష్ఠితమై ఉన్నాయో అట్టి విష్ణువు వచ్చాడు కదా! లోక పితామహుడైన ఈ విధాత వేదోపనిషత్ సర్వశాస్త్ర సమాకలితుడై, ఇక్కడ సమాసీనుడయ్యాడు గదా! బృందారక సంసేవ్యమానుడై ఇంద్రుడు అక్కడ ఉపవిష్టుడయ్యాడు గదా! యజ్ఞానికి యోగ్యమైన వారు, శాంతులు, సత్పాత్రులు, వేదవేదార్థ తత్త్వజ్ఞులు, దృఢవ్రతులు ఐన వీరందరు వచ్చారు గదా! ఇక్కడ రుద్రునితో మనకేం ప్రయోజనం? అతను కుల గోత్రాలు, తల్లిదండ్రులు లేని ఏకాకి. శ్మశాన వాసి. పిశాచాలకు ప్రభువు. ఇక సతీ విషయం అంటావా? తండ్రిగారు కదా అని బ్రహ్మ ప్రేరేపించగా అతనికి కన్యనిచ్చాను అంతే! ఇలాటి మాటలు మరెప్పుడు చెప్పకు! మరెక్కడా కూడా చెప్పకు. మీరందరు కలిసి నా యజ్ఞాన్ని సఫలీకృతం చేసి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి!"

దక్షుని అజ్ఞానపు పల్కులకు చింతించి దధీచి "శివుడు లేని ఈ యజ్ఞం అయజ్ఞంగా మారింది. భవిష్యత్తులో ఇక్కడ వినాశం జరగబోతున్నది" అని చెప్పి అక్కడ నుండి నిర్గమించాడు. అతని వెంట శివ భక్తులంతా నడిచారు.

అప్పుడు దక్షుడు వెకిలిగా నవ్వుతూ ఇలా అన్నాడు: "శివ ప్రియుడైన దధీచి, అట్టివారైన ఇతరులు ఈ అధ్వర ప్రాంగణం నుండి నిష్క్రమించారు. ఇది నాకు శుభం.

మూర్ఖులను, మిథ్యావాదులను, వేద బాహ్యులను, దురాచారులను యజ్ఞకర్మలోకి రానీయకూడదు. మీరీ యజ్ఞాన్ని సఫలం చెయ్యండి." యజ్ఞాహుతులను ఇవ్వటం ప్రారంభించారు ఋషులు.

**దక్షయజ్ఞానికి సతి వెళ్ళుట**

మునులారా! అక్కడలా అధ్వర క్రియ నడుస్తూండగా ఇక్కడ హిమవత్పర్వత ప్రాంత గంధమాదన గిరి మీది ధారా గృహంలో (ఈత కొలను) చెలికత్తెలతో జలక్రీడలాడుతూ సతీదేవి రోహిణీ సహితుడై చంద్రుడు దక్ష యజ్ఞానికి వెళ్ళటాన్ని చూచింది. చూచి తన ప్రాణసఖి ఐన విజయను పిలిచి ఈ రోహిణీ–చంద్రులు ఎక్కడకు వెడుతున్నారో తెలుసుకోవలసిందిగా ఆజ్ఞాపించింది. వారి ద్వారా దక్షాధ్వర సంరంభ వార్తలను విన్న విజయ దుఃఖితురాలై ఆ వార్తను సతికి విన్నవించింది.

సతి విస్మయాన్ని పొంది, కుమార్తె ఐన తనను తల్లిదండ్రులెందుకు ఆహ్వానించ లేదు? అని మథనపడి, యజ్ఞానికి వెళ్ళటానికి నిశ్చయించుకొని కొలువు కూటంలో సభతీర్చి ఉన్న శంకరుని సమీపించింది. బహు గణాలతో, నంద్యాది మహా వీరులతో, గణాధ్యక్షులతో పరివేష్టితుడై ఉన్న పరమేశ్వరుడు ఆదరాశ్చర్యాలతో సతినిలా ప్రశ్నించాడు.

"దాక్షాయణీ! విస్మయంతో, సభా మధ్యం లోకి రావటానికి కారణం చెప్పు!" సతీదేవి ఇలా బదులు చెప్పింది. "ప్రభూ! నా తండ్రి ఐన దక్షుడు గొప్ప యజ్ఞం చేస్తున్నాడని విన్నాను. ఆ యజ్ఞానికి దేవతలు, ఋషులు అందరూ భార్యా సహితులై వెళ్ళారని కూడా విన్నాను. వెళ్ళటానికి మీకెందుకు ఇష్టం కాలేదు? మంచి హృదయం కల వారితో కలిసిమెలిసి ఉండటం ప్రీతిదాయకం కదా! కనుక స్వామీ! మనిద్దరం కలిసి వెడదాం! ప్రయాణానికి తగిన ఏర్పాట్లను చెయ్యండి."

సర్వజ్ఞుడైన ఈశ్వరుడు సతీ వచనాలను విని భవిష్యత్తును ఊహించి అనునయంతో ఇలా అన్నాడు: "దాక్షాయణీ! నీ తండ్రి యజ్ఞానికి వెళ్ళటం నాకూ ఇష్టమే! కాని నీ తండ్రి మనలను ఆహ్వానించలేదు. ఎవరైతే అనాహూతులై ఇతరుల గృహానికి వెళతారో వారు మరణ సదృశమైన దుఃఖాన్ని పొందుతారు. ఆహ్వానం లేకుండా వెళితే ఇంద్రుడైనా తేలికవుతాడు. ఇతరుల విషయం చెప్పేదేముంది? అందుకని నీ తండ్రి యజ్ఞానికి పిలుపు లేకుండా వెళ్ళకూడదు. స్వజన నిందావచనాలచే కలిగేటంతటి దుఃఖం శత్రువు బాణఘాతంచే కూడ కలగదు. నీకు సత్యాన్ని చెప్పాను. తర్వాత నీ ఇష్టం."

పుట్టింటి మీది మమకారంతో సతి శంకరుని హితవును లెక్క చేయక ఇలా అంది: "నాథా! మీ సన్నిధానంచే, నా తండ్రి యజ్ఞం సఫలమవుతుంది. కుమార్తెనైన నన్నెందుకు ఆహ్వానించలేదో నా తండ్రి ముఖతః వినాలనుకొంటున్నాను. అక్కడి కొచ్చిన దేవతల, ఋషుల అభిప్రాయాలను తెలుసుకోవాలను కొంటున్నాను. ఐనా పుట్టింటి వారి విషయంలో పిలిచారని పిలువలేదని పట్టింపు లేముంటాయి? నే యజ్ఞానికి వెళతాను, అనుమతించండి!"

సతి మాటలకు సర్వసాక్షి ఐన శంకరుడు సరే అని అనుమతించి మహారాజోపచారాలతో, అలంకారాలతో, ఛత్రచామరాది వస్త్రాభరణాలతో ఆమెను పుట్టింటికి పంపించాడు. నవరత్న స్థగిత సువర్ణాలంకృతమైన నందిని అధిష్ఠించింది సతి. శివాజ్ఞచే కుతూహలయుతులు, ప్రీతులు ఐన అరవైవేల రుద్రగణం ఆమె వెంట నడిచారు. ఆమె ప్రయాణంలో వామదేవ గణం శివ లీలా విలాసాన్ని గానం చేశారు. ప్రమథగణం ఆడారు. తండువు తాండవ నృత్యాన్ని చేస్తుంటే భృంగి తండువు ననుకరించి తనుకూడా చేస్తూ మధ్యమధ్యలో చేతకాని వానివలె పడిపోతూ లేస్తూ అందరికి నవ్వులు పంచి పెట్టాడు. అందరు భృంగిని అనుకరించారు. దాంతో నవ్వుల కోలాహలం మిన్ను ముట్టంది. అలా మహా శోభాయమానంగా పయనించి పుట్టింటికి చేరుకొంది సర్వమంగళ ఐన జగన్మాత."

**దక్ష యజ్ఞంలో సతి**

యజ్ఞం మహా ప్రభతో కొనసాగుతున్నది. అందరూ ఉత్సాహభరితులై ఉన్నారు. సతి తన వాహనమైన నందిని దిగి ఒక్కతెయే యజ్ఞశాలకు వెళ్ళింది. ఆమె తల్లి అసిక్ని తక్కిన సోదరీ మణులు ఉచిత మర్యాదలను చేశారు. దక్షుడామెను చూచాడు కాని కొద్దిపాటి ఆదరాన్ని కూడా చూపలేదు. దక్షుని వల్ల భయంచే ఇతరులు కూడా ఎట్టి ఆదరాన్ని కనపర్చలేదు. ఈ విధంగా సర్వుల అనాదరణకు గురి ఐన సతి, ఆశ్చర్యంతో తల్లిదండ్రులకు నమస్కరించింది.

ఆ యజ్ఞంలో విష్ణ్వాది దేవతల కిచ్చిన హవిర్భాగాలను ఆమె చూచింది కాని రుద్రునికి మాత్రం భాగం లేదు. పట్టరాని కోపంతో చూపులతో దహిస్తుందా అన్నట్లుగా దక్షుని చూచింది. ఇతరులను కూడా అంత తీక్షణంగాను చూచింది. చూచి తండ్రినిలా నిలదీసింది.

"తండ్రీ! పరమ శోభన మూర్తి ఐన శంభుని నీవెందుకు ఆహ్వానించలేదు. ఆయన ఈ సృష్టి కంతకు చైతన్య స్వరూపుడు గదా! ఆయన యజ్ఞ స్వరూపుడు గదా! ఆయన లేకుండా యజ్ఞమెట్లా సంభవం? ఆయన స్మరణలేని కర్మలన్ని అపవిత్రాలు. రుద్రుణ్ణి ఒక

సామాన్య సురునిగా భావించి అనాదరించావు. ఇక్కడి వారందరికి అధికారిక స్థానాలనిచ్చింది ఆయనే కదా! అట్టి శివుని తెలుసుకో లేకుండ ఉన్నావు! నీ బుద్ధి భ్రష్టమైంది. శంభుదులేని యజ్ఞానికి ఈ దేవతలు, ఋషులు ఎలా వచ్చారు."

తండ్రినిలా మందలించి సతి విష్ణువు నుద్దేశించి క్రోధంతో "ఓ హరీ! సగుణ, నిర్గుణ స్వరూపుడైన రుద్రుని నీవెరుగవా! నువ్వు వరాహాద్యవతారాలను ఎత్తటానికి కారణం ఆయనే కదా? ఐనా నీకు జ్ఞానోదయం కాలేదు. రుద్రుడు లేకుండ తగుదునమ్మా అని యజ్ఞ భాగానికి ఎలా వచ్చావు?" అని ఎత్తి పొడిచింది. అట్టి కోపంతోనే బ్రహ్మ నుద్దేశించి "ఓ పితామహా! ఐదు ముఖాలు గల నువ్వు రుద్రుని ఎదుట గర్వాన్ని చూపగా ఆయన నిన్ను చతుర్ముఖునిగా చేశాడు గదా?" అని నిలదీశింది.

ఓ ఇంద్రా! మహాదేవుని పరాక్రమం నువ్వెరుగవా? హరునిచే నీ వజ్రం భస్మం చెయ్యబడింది గదా? అని ప్రశ్నించింది.

ఓ అత్రి, వసిష్ఠాది మునులారా! పూర్వం దారుకా వనంలో రుద్రుడు భిక్షాటనం చేసినప్పుడు మునులు శపించగా, ఆయన లింగ రూపంలో జగత్తునంతా దహించాడు గదా?" అని బుద్ధి చెప్పింది.

ఈ విధంగా జగన్మాత ఐన సతీదేవి కోపంతో ప్రశ్నించగా అక్కడి వారంతా భయాన్వితులై మిన్నకుండి పోయారు. దక్షుడు కలుగజేసికొని ఇలా అన్నాడు.

"ఓ సతీ! నువ్వు అధిక ప్రసంగం చేస్తున్నావు. నీకిక్కడ ఏం పనుందని పిలువకుండానే వచ్చావు. నీ భర్త అమంగళుడు. వేద బహిష్కృతుడు, అందువల్లనే ఆహ్వానించలేదు. మరి కాళ్ళు కడిగి కన్యాదానం చేశావు గాదా అంటావేమో! దానికి బ్రహ్మ వాక్కు కారణం. కన్న కూతురవు గనుక ఒక్క మాట చెపుతున్నాను విను! ఎలాగా వచ్చావు కనుక యజ్ఞం పరిసమాప్తి అయ్యేటంత వరకు ఉండి వెళ్ళు. ఇక మారు మాటాడకు."

తండ్రి పల్కులకు ఖిన్నురాలైన సతి భర్త వద్దని వారించినా వచ్చిన తన అవివేకానికి తనను తానే నిందించుకొని, తిరిగి భర్తకు తన ముఖాన్నెలా చూపాలా అనే ఆత్మన్యూనతా భావంతో కోపంతో మహా భుజంగం బుసలు కొడుతూన్నట్లు నిట్టూర్పులు విడుస్తూ ఇలా అంది.

"ఎవడు మహాదేవుని నిందిస్తాడో, ఎవడు నిందను వింటాడో వారిద్దరు శాశ్వత నరకంలో ఉంటారు. కనుక ఈ దేహాన్ని అగ్ని పరిత్యాగం చేస్తాను. నా ప్రభువును గూర్చి నిందా వచనాలను విన్న నాకీ దేహంతో పనేమిటి? శక్తుడైన వాడు శంభుని నిందించిన వాని నాలుకను కోసెయ్యాలి! లేదా బుద్ధిమంతుడైతే చెవులు మూసుకొని నిష్క్రమించాలి. నేనీ రెండు చెయ్యలేని అశక్తురాలనయ్యాను." అని ఈ విధంగా చింతించి అక్కడున్న వారినుద్దేశించి ఇలా ధర్మాన్ని బోధించింది సతి.

"తండ్రీ! సకల ప్రాణులయందు సమభావం గల శంభునిపై నువ్వు తప్ప మరెవరు కక్ష కడతారు? నీ వంటి వాడు శివనింద చెయ్యటం శోభావహం కాదు. క్షమార్హం కాదు. మానవుడు 'శివ' అను రెండక్షరాలు ఉచ్చరిస్తే చాలు ముక్తుడవుతాడని జ్ఞానుల మాట. అట్టి శంకరుని నిందించావు. అర్థులకు ఆదరంతో వరాలనిచ్చేవాడు శంభుడు.

వేదం ప్రవృత్తి, నివృత్తి మార్గం చేత కర్మ రెండు విధాలని అంటున్నది. రెండూ పరస్పర విరుద్ధాలు. ఒకే వ్యక్తి రెంటిని ఏక కాలంలో అనుష్ఠించ లేడు. శివుని విషయంలో ఈ రెండు కర్మల సంబంధం లేదు. వృషభ ధ్వజుడు 'దాక్షాయణీ' అని నన్ను ప్రేమతో పిలుస్తాడు. ఈపైన అట్టి సమయంలో నా మనస్సు క్లేశాన్ని పొందుతుంది. నీ శరీరం నుండి ఉద్భవించిన ఈ దేహం శవంవలె అపవిత్రమైనది. కనుక తక్షణం దీనిని విడిచి సుఖాన్ని పొందుతాను." అని శపథం చేసి అక్కడి దేవతలను, మునులను ఉద్దేశించి, మూఢులై అనుచిత కర్మనాచరించిన మీరందరు నిశ్చితంగా కర్మ ఫలరూపాన్ని పొందగలరని శపించి తన ప్రాణ ప్రియుడైన శంకరుని మనసులో స్మరించింది సతి.

### సతీ దేహత్యాగం

అనంతరం సతీదేవి మౌనాన్ని వహించి ప్రశాంత మనస్కురాలై, భర్తను ఆదరంతో స్మరించి, ఉత్తర దిక్కుగా నేలపై కూర్చుండి, జలంతో ఆచమనం చేసి, వస్త్రంతో కప్పుకొని, శుచియై, కండ్లు మూసికొని యోగ మార్గంలో ప్రవేశించింది. ప్రాణాపాన వాయువులను సమానంగా చేసి ఉదాన వాయువును నాభి చక్రనుండి ప్రయత్న పూర్వకంగా ఉత్థాపన చేసి బుద్ధితో కలిపి హృదయమునందుంచి కంఠ మార్గం ద్వారా భ్రూమధ్యానికి చేర్చింది. యోగ మార్గాన్ని అనుసరించి దేహము నందు అగ్నిని వాయువును ధరించింది.

తక్షణం భుజగభూషణు రాణియైన సతీదేవి పాదపద్మములనుండి యోగాగ్ని ఉద్భవించింది. ఎలా ఉన్నాడు ఆ అగ్ని? ఆ మహాదేవి అలంకరణార్థం పాదాలకు

అలంకరించుకొన్న క్రొత్త లత్తుకలా (పారాణిలా) శోభాయమానంగా ఉన్నాడు! కటి మండలం వరకు వ్యాపించి ఆ దివ్య విగ్రహానికి ప్రదక్షిణ నమస్కారాలు చేస్తూన్న వహ్నికెంపులు తాపిన ఒడ్డాణంలా, కనక కాంచీదామకంలా ఆభరణ సదృశంగా ఉన్నాడు. వక్షస్థలం వరకు ఎగబ్రాకిన వైశ్వానరుడు ఆ దాక్షాయణి అంగరాగంగా అలదుకొన్న కుంకుమపువ్వు మైపూతలా అలంకార ప్రాయంగా ఉన్నాడు. ఒక్కసారిగా సప్తజిహ్వాలను సాచి చంద్రశేఖరురాణి లలాటం వరకు వ్యాపించినప్పుడు ఫాలభాగమందు బాలసూర్య ప్రభతో కుంకుమబొట్టులా ఉన్నాడు వీతిహోత్రుడు! సీమంత వీధికి ఎగబ్రాకి సిందూర రజంలా ఉన్నాడు చిత్రభానుడు!

గిరిశిఖరాలవంటి నాలుకలను సాచి చుట్టుముట్టిన సప్తార్చి జిహ్వారూపములైన జ్వాలలమధ్య శంకరపత్ని ఐన సతీదేవి, సప్తగిరుల అంతరాళమందు లోకరక్షాదీక్షను వహించి స్థిరంగా నెలకొన్న లోకపావని ఐన బాలాదేవిలా, పరమోత్కృష్టంగా, మహా తేజో విరాజమానంగా ఉంది. ఆ దృశ్యాన్ని అక్కడున్న వారందరూ దిగ్భ్రాంతులై చేష్టలుడిగి చూస్తూండగానే వెంటనే హత కల్మషురాలైన సతీదేహం ఆమె ఇచ్ఛ ననుసరించి అగ్నిచే భస్మం చేయబడి క్రిందపడింది. ఆ దృశ్యాన్ని చూచిన వారందరు విస్మయాన్ని పొంది పెద్దగా హాహాకారాలు చేశారు. వారందరు దక్షుని నిందించి తమను తాము అపరాధులుగా భావించుకొని వివేకాన్ని పొందేరు.

వెంటనే రుద్రుని సేవకులు, మహాబలశాలురు ఐన అరవైవేల రుద్రగణం మహా రౌద్రంతో హాహాకారాలు చేశారు. ఆయుధాలను పైకెత్తి, వాద్యధ్వనులచే దిక్కులు పిక్కటిల్ల ప్రళయాన్ని సృష్టించటం ప్రారంభించారు. కొందరు వ్యాకులచిత్తులై తమ ఆయుధాలతో తామే ఖండించుకొన్నారు. నశించగా మిగిలిన వారు దక్షుని సంహరించటానికి ముందు కురికారు. ఆ దృశ్యాన్ని చూచి తక్షణం భృగుమహర్షి యజ్ఞనాశకులైన రాక్షసులను సంహరించే యజుర్వేద మంత్రాలతో దక్షిణాగ్ని యందు హోమం చేశాడు. వెంటనే ఋభువులనే దేవతలు వేలాదిగా అగ్నిహోత్రం నుండి పుట్టుకొచ్చారు.

మహర్షులారా! అప్పుడు ప్రమథులకు, ఋభువులకు మహా బీభత్సంగా యుద్ధం జరిగింది. బ్రహ్మ తేజసులైన ఋభువుల పరాక్రమానికి ప్రమథులు పలాయితులయ్యారు. ఇంద్రాది దేవతలు, లోకపాలురు, మరుద్గణాలు, విశ్వేదేవతలు, అశ్వినీ దేవతలు, ఋషులు తూష్ణీం భావాన్ని వహించారు. కొందరు విష్ణువును ప్రార్థించారు. కొందరు విఘ్నంలేకుండా యజ్ఞ పరిసమాప్తికై ఉద్వేగంతో సమాలోచనలు జరిపారు.

బుద్ధిశాలి ఐన హరి మాత్రం సతీదేహ త్యాగం వల్లను, రుద్రగణాలను తరిమి వేయటం వల్లను భవిష్యత్తులో సంభవింప బోయే దుష్ఫలితాన్ని గురించి ఉద్విగ్నమానసుడయ్యాడు.

**ఆకాశవాణి సత్యము పల్కుట**

మునులారా! బీభత్స రస ప్రధానమైన ఈ ఘట్టంలో ఆకాశవాణి అందరు అచ్చెరువొందేటట్లుగా ఇలా పలికింది. "ఓ దక్షా! యథార్థాన్ని తెలుసుకొని నువ్వీ యజ్ఞ క్రియను అనుష్ఠించలేదు. కేవలం దంభాచార పరాయణుడవయ్యావు. శైవ శిఖామణి యైన దధీచి మహర్షి మాటలను పెడచెవిని పెట్టావు. ఆయన మాటలను పాటించి ఉంటే సర్వులకు ఆనందము, శుభము కలిగి ఉండెడిది. సర్వ మంగళయైన సతిని అవమానించావు. బ్రహ్మ పుత్రుడననే గర్వంచే మోహితుడవయ్యావు. పరమేశ్వరుని అర్ధాంగియైన ఆమె పరమ తత్త్వమగు బ్రహ్మ స్వరూపిణి. శంభుడు పరాత్పరుడు. అట్టి జగత్కారణుడైన శివునికి యజ్ఞభాగాన్నియ్యక తప్పు చేశావు.

శేషుడు ఎవని పాద ధూళిని నిత్యము సహస్ర ఫణాలతో ప్రీతితో ధరిస్తున్నాడో అట్టి శివుని శక్తియే సతి. ఓ దేవతలారా! రుద్రుడు లేని ఈ యజ్ఞం ధ్వంసం కాబోతున్నది. మీరంతా వెంటనే స్వస్థానాలకు మరలి పొండి." ఇలా పలికి ఆకాశవాణి అదృశ్యురాలైంది.

**వీరభద్రజననం**

ఆకాశవాణి పల్కులకు అందరూ కింకర్తవ్యతా విమూఢులై లేచి నిలబడ్డారు. ఇక అక్కడ ఋభువులచే తరుమబడ్డ శివగణం రుద్రుని ఆశ్రయించి జరిగిన విషయాన్ని యథా తథంగా విన్నవించారు. దక్షుడు చేసిన నిందను, సతీదేవిపొందిన అవమానాన్ని, ఆమె దేహ త్యాగాన్ని గూర్చి శివగణం నోటవిన్న రుద్రుడు, భగ్గున మండిపడి, భూమి కంపింప పాద తాడనం చేసి ఒక జటను ఊడ బెరికి పర్వతంపై క్రోధావేశంతో విసిరి కొట్టాడు.

మునులారా! ఆ జట రెండు ముక్కలై అందులో నుండి ప్రళయకాల మహా భైరవా రావం పుట్టింది. పూర్వ భాగం నుండి మహా భీముడు, గణాగ్రణి ఐన వీరభద్రుడు జన్మించాడు. పుడుతూనే ప్రళయానల సంకాశుడు, సహస్ర భుజుడు ఐన వీరభద్రుడు భూమండలాన్ని వృత్తంగా చుట్టి ఆపైన పది అంగుళాలు ఆక్రమించాడు. ఆపైన మహా రుద్రుని కోప నిశ్వాసం నుండి వంద జ్వరాలు, పదమూడు సన్నిపాత రోగాలు పుట్టాయి. జట యొక్క ఉత్తర భాగం నుండి భూతకోటి పరివృత ఐన మహాకాళి జన్మించింది. మూర్తిమంతమైన ఆ క్రూర జ్వరాలు సర్వ లోకాలను భయపెడుతూ సర్వాన్ని దహిస్తాయా అన్నట్లున్నాయి.

వీరుడైన వీరభద్రుడు చేతులు జోడించి పరమేశ్వరునకు నమస్కరించి ప్రణామం చేసి వినయంగా ఇలా ప్రార్థించాడు. “మహారుద్రా! నీవతి భయంకరుడవు. సూర్యచంద్రాగ్నులు నీ నేత్రాలు! నా కర్తవ్య మేమిటి? ఆజ్ఞాపించండి. క్షణార్థంలో సముద్రాలను శోషింపచెయ్యనా? పర్వతాలను పిండి చెయ్యనా? బ్రహ్మాండాన్ని భస్మం చెయ్యనా? దేవతలను అవమానించనా? మునులను కినుకతో శిక్షించనా? వాయు సంచారం నిరోధించనా? నీ అనుగ్రహంచే నే చెయ్యలేని పని లేదు. మత్తుల్యుడైన పరాక్రమవంతుడు లేడు. హే శంభో! మీ సంకల్ప మాత్రం చేతనే కార్యాలు నేరవేరుతాయి. అలాటిది మీరు వాక్కుచేత శాసిస్తే నే నెలాటి దుర్ఘటమైన కార్యాన్నైనా నెరవేర్చగలను. స్వామీ! అంతా మీ అనుగ్రహం!”

సర్వ మంగళుడైన రుద్రుడు వీరభద్రుని ఉత్సాహ వచనాలకు సంతసించి ఇలా ఆజ్ఞాపించాడు.

“వీరభద్రా! నా ఆజ్ఞను వెంటనే నెరవేర్చి నాకు సంతోషాన్ని కలిగించు. విను ఖలుడు, మహాగర్వి, మూర్ఖుడు ఐన దక్షుడు యాగం చేస్తున్నాడు. యజ్ఞాన్ని, యజ్ఞ పరికరాలను భస్మం చేయి. అంతే కాదు. దేవ గంధర్వ యక్షులను ఇంకా అక్కడున్న వారిని భస్మం చెయ్యి. అక్కడ విష్ణువు, బ్రహ్మ, యముడు కూడా ఉన్నారు. వారిని పడగొట్టు. దధీచి మహర్షి మాటలను ఉల్లంఘించి ఎవరైతే అక్కడున్నారో వారందరిని భస్మం చెయ్యి. నానాకర్షణ మంత్రాలతో వారందరిని ఒక్క చోటుకు చేర్చి అగ్ని జ్వాలలతో దహించు. హే వీర! దక్షుడు మొదలగు వారి నందరిని, వారి భార్యలను, బంధువులను అవలీలగా భస్మం చేసి జలాలలో కలిపి పానం చెయ్యి. యజ్ఞంలో వేద విధులను పరిరక్షించే ఋత్విక్కులను కూడా వదలకు.”

**వీరభద్రుని యాత్ర**

మహేశ్వరుని వచనాన్ని ఆదరంతో విని ఆయనకు ప్రణమిల్లి, శివుని శాసనాన్ని శిరసున ధరించి యజ్ఞ స్థానానికి బయలు దేరాడు వీరభద్రుడు. ఆయనకు తోడుగా శోభార్థం అరివీర భయంకరులు, ప్రలయాగ్ని సదృశులు ఐన కోట్లాది గణాలను వెంట పంపించాడు శంభుడు. ఆ గణాలు వీరభద్రుని వెనుక ముందట నడిచాయి. కాలకాలులైన వారితో కూడి హరవేష భూషణుడు, సహస్ర భుజుడు, నాగాభరణ శోభితుడు ఐన వీరభద్రుడు ప్రబలాతి భీకరుడై రథస్థుడై బయలుదేరాడు.

ఆ రథం పదివేల చేతుల ప్రమాణం కలది. పదివేల సింహాలు లాగుతున్నాయి. ఇంకా అనేక సింహ, శార్దూల, మకర, మహామీన, గజాదులు పార్శ్వ రక్షక దళాలుగా నడుస్తున్నాయి. కాళి, కాత్యాయని, ఈశాని, చాముండ, ముండ, మర్దిని, భద్రకాళి, భద్ర,

వైష్ణవి. ఈ నవ దుర్గలతో కూడి మహాకాళి భూతగణ సేవితయై దక్ష సంహారానికై బయలుదేరింది. వారితో పాటుగా శాకిని, ఢాకిని, ప్రమథ గణాలు, యక్షులు, కూష్మాండులు, పర్పటులు, చటకులు ఇత్యాది బ్రహ్మ రాక్షసులు కూడా తరలి వెళ్ళారు.

వీరులైన భైరవులు, క్షేత్ర పాలకులు శివాజ్ఞచే నడిచారు. యోగినీ సమూహం అరవై నాలుగు గణాలతో కదిలింది. ఆ గణాధ్యక్షులెవరనగా శంకు కర్ణుడు, కేకరాక్షుడు, వికృతుడు, విశాఖుడు, పారియాత్రికుడు, సర్వాంకకుడు, జ్వాలకేశుడు, సమదుడు, దుద్రభుడు, కపాలీశుడు, సర్వాంకుడు, కోటి కుండుడు, విష్టంభుడు. వీరందరు వివిధ సంఖ్యా గణాలతో బయలుదేరారు. వీరే కాకుండా సంనాదుడు, పిప్పలుడు, ఆవేశనుడు, చంద్ర తాపనుడు, మహా వేశుడు, కుండి, పర్వతకుడు, కాలుడు, కాలకుడు, మహా కాలుడు, అగ్నికృత్, అగ్ని ముఖుడు. ఇత్యాదులు కంటి చూపులతో మంటలు రేపే భయంకరా కారులు కోట్ల సంఖ్యా గణాలతో దక్ష యజ్ఞ ధ్వంసానికై వెంట నడిచారు.

అంతే కాకుండా ఆదిత్య మూర్ధుడు, ఘనావహుడు, సన్నాహుడు, కుముదుడు, అమోఘుడు, కోకిలుడు, కాష్ఠాగూఢుడు, సుకేశి, వృషభుడు, సుమంత్రకుడు, కాకపాదోదరుడు, సంతానకుడు వీరందరు అసంఖ్యాక గణాలతో అట్టహాసంగా వీరభద్రుని అనుసరించారు.

ఇంకా శివాజ్ఞచే తరలి వెళ్ళిన వారెవరనగా పుంగవుడు, మధు పింగుడు, నీలుడు, పూర్ణ భద్రుడు, తాలకేతువు, షడాస్యుడు, పంచాస్యుడు, సంవర్తకుడు, కులీశుడు, స్వయం ప్రభుడు, లోకాంతకుడు, దైత్యాంతకుడు, అశని, భాలకుడు మరియు సహస్రకుడు వీరంతా ఉత్సాహంతో ముందుకు కదిలారు. దేవదేవునికి ఇష్టులైన తండువు, భృంగి, రిటి ఇత్యాదులు ఆడుతూ, పాడుతూ, గెంతుతూ సంతోషంతో నడిచారు.

వీరుడైన వీరేశుడు శివాజ్ఞచే వేయి న్నూట ఇరవై కోట్ల గణాలతో, వేయి కోట్ల భూతాలతో, రోమముల నుండి పుట్టిన మూడు కోట్ల కుక్కలతో అతి సంరంభంతో కదిలాడు. శూల, ముద్గర, గద, పరశు, క్షురిక, ఖడ్గ, ముసలాది ఆయుధాలను ధరించి శంఖ, పటహ, భేరి, కాహళ, మురజ, మర్దళ, శృంగ నాదాది వాద్య ధ్వనులు భూనభోంతరాళాలను కప్పి వేయ రుద్రగణం వీరభద్రుని వెంట కదిలింది.

### దక్షునికి తోచిన ఉత్పాతాలు

వీరభద్రుడలా అతిశయంతో జైత్రయాత్రా సంరంభుడై బయలుదేరగా ఇక్కడ యజ్ఞ శాలలో దక్షునకు మరియు ఇతర దేవతలకు అనేక దుశ్శకునాలు తోచాయి. మూడు విధాల (ఆధ్యాత్మిక, ఆధి భౌతిక,

ఆధి దైవిక) ఉత్పాతాలు కానవచ్చాయి. దక్షుని ఎడమ కన్ను, చేయి, తొడ అదిరాయి. ఇది అశుభ సూచకం. భూమి కంపించింది. మధ్యాహ్న వేళ నక్షత్రాలు కనుపించాయి. దిక్కులన్ని ధూళి ధూసరితమయ్యాయి. సూర్యుడు అనేక రంగులలో, అనేక పరివేష మండలాలతో వింతగాను భయంకరంగాను తోచాడు. విద్యుత్ కాంతులను విరజిమ్ముతూ నక్షత్రాలు నేలకూలాయి. తారా మండలాలు వక్ర మార్గంలో పయనించాయి. వేలాది గ్రద్దలు దక్షుని శిరసును స్పృశించాయి. గద్దల రెక్కల నీడలతో యాగ మండపం రాహుగ్రస్తమైన సూర్య మండలంలా కాంతి హీనమైంది.

యాగశాలా ప్రాంగణంలో నక్కలు ఊలలు పెట్టాయి. అడవి పందులు వికృత ధ్వనులు చేశాయి. తెల్లని తేళ్ళు పుట్టాయి. ఉల్కలు వర్షించాయి. ధూళివర్షాన్ని కురిపిస్తూ తీవ్రంగా గాలులు వీచాయి. సుడిగాలులచే సర్వము కంపించింది. యజ్ఞశాల ఊర్ధ్వంగా పైకెగసింది. మిడతల దండు ఆ ప్రాంతాన్నంతా కప్పేసింది. దక్షాదులు రక్తాన్ని వమనం చేసి కొన్నారు. వారందరూ గాలిలోని దీపంలా వణికి పోతున్నారు. శస్త్రధారాహతుల వలె రోదిస్తున్నారు. రక్తం వర్షంగా కురిసింది. దిక్కులన్ని అంధకారబంధురమయ్యాయి. దిక్కులన్ని అగ్ని జ్వాలలతో నిండి వేడెక్కి పోయాయి. నదీ తీరంలోని చెట్లవలె అందరూ నేలకూలారు. కర్ర దెబ్బలు తిన్న క్రూర సర్పాల వలె చైతన్య రహితులై పడి ఉన్నారు. కొందరు బంతుల్లా పైకి ఎగిరారు. వారి రోదన ధ్వనులు జల పక్షుల కలకలా రావాల వలె ఉన్నాయి. బ్రహ్మ విష్ణువులతో సహా అందరూ తాబేళ్ళ వలె భయంతో ముడుచుకు పోయి దుఃఖితులయ్యారు.

దక్షుడు ఆ మహోత్పాతాన్ని చూచి భయంతో వణికి తన ప్రభువు లక్ష్మీపతి ఐన విష్ణువును ఆశ్రయించి ఇలా ప్రార్థించాడు.

**దక్షునికి విష్ణువు హితవు పల్కుట**

"హే! దేవదేవా! హరే! విష్ణో! దీనబంధూ! కృపానిధీ! నువ్వు నన్ను నా యజ్ఞాన్ని రక్షించాలి. యజ్ఞం నీ స్వరూపం. సర్వ వ్యాపకుడవైన నువ్వు రక్షించక పోతే మరెవరు రక్షించగలరు?" అంటూ పరిపరి విధాల పాదాలను పట్టుకొని ప్రార్థించిన దక్షుని పైకి లేవదీసి మనసులో తన స్వామి ఐన శివుని స్మరించి దక్షునితో ఇలా అన్నాడు విష్ణువు.

"దక్షా! విను. తత్త్వాన్ని తెలుసుకోలేక సకల జగదధీశ్వరుడు పరమాత్మ ఐన శివుని అవమానించావు. శివుని తిరస్కరిస్తే కార్యసాఫల్యం చేకూరదు. ఎక్కడ పూజింపతగిన వారు పూజింపబడక అపూజ్యులు పూజింప బడతారో అక్కడ దారిద్ర్యము, మరణము,

భయము, నాశనము ఇవి సంభవిస్తాయి. ఇప్పుడు మహాభయం సంప్రాప్తమైంది. ఇప్పుడు మేమందరం సమర్థులైనా దీనిని నివారించలేం. ఇదంతా నీ దుర్నయం వలన కలిగింది."

విష్ణువు మాటలకు దక్షుడు చింతాగ్రస్తుడై, వివర్ణవదనుడై కూర్చుండి పోయాడు. ఇంతలో గణ సహితుడై వీరభద్రుడు యజ్ఞస్థలాన్ని సమీపిస్తున్నాడు. రుద్రగణం సింహనాదం చేస్తూముందుకు వస్తూన్నది. ముల్లోకాలు కంపించాయి. ఆకాశమంతా చీకట్లు అలుముకొన్నాయి. సాగరాలన్నీ అల్లకల్లోల మయ్యాయి. సైన్య సంరంభాన్ని చూచిన దక్షుడు భార్యా సహితుడై విష్ణువు పాదాల మీద దండం వలె పడి ఎలాగైనా రక్షించమని ప్రార్థించాడు. అతనికి శివతత్త్వాన్నిలా బోధించాడు విష్ణువు.

"ఓ! దక్షా! విను! ముందు నీ క్రూర బుద్ధిని విడు. నైమిషారణ్య క్షేత్రంలో జరిగిన వృత్తాంతం నీకు గుర్తులేదా? రుద్ర కోపాగ్ని నుండి నిన్ను రక్షించగల వాడెవ్వడూ లేడిక్కడ! ఓ దుర్మతీ! ఏం చెయ్యాలో ఏం చెయ్యకూడదో తెలియని అవివేకివి నువ్వు. కర్మను చేసినంత మాత్రాన అన్ని వేళలా కర్మ ఫలాన్ని ఇవ్వనేరదు. ఏ కర్మాచరణ వల్ల మానవుడు ఉన్నతిని పొందుతాడో అది అతనికి కర్తవ్య కర్మ అవుతుంది. కర్మ ఫలాన్నిచ్చే వాడు ఈశ్వరుడొక్కడే.

ఈశ్వరార్చనను విడిచి కేవల జ్ఞానాన్ని ఆశ్రయించిన జ్ఞానులు గాని, జ్ఞానాన్ని విడిచి కేవల కర్మల నాశ్రయించిన కర్మఠులు గాని ఉత్తమ గతిని పొందలేరు. నీ అవివేకానికి ఫలంగా ఈ ముప్పు సంభవించింది. రుద్రుని కోపాగ్ని నుండి పుట్టిన వీరభద్రుడు అకాల రుద్రుడై యజ్ఞాన్ని, మనలను నాశనం చెయ్యటానికై వస్తున్నాడు. అతనికి అశక్య మనేది లేదు. మనలనందరిని కాల్చి చంపిన తరువాతనే అతను ప్రసన్నుడవుతాడు. దధీచి మహర్షి చేసిన శపథాన్ని భ్రమచే ఉల్లఘించి నేనిక్కడనే ఉన్న కారణంగా నీతోపాటు నాకుకూడ ఈ దుఃఖం అనివార్యమైంది. దక్షా! అతనిని నివారించ గలిగే శక్తి నాకు లేదు. నేను కూడ శివద్రోహం చేశాను. శివద్రోహికి మూడు కాలాల్లోను సుఖం లేదు.

ఈ సుదర్శన చక్రం వీరభద్రుని తగుల్కోదు. ఇది శైవచక్రం. శివభక్తుల జోలికి పోదు. నిజానికి ఈ చక్రం మనల నీపాటికే సంహరించక పోవటాన్ని గొప్ప దయగా భావించాలి. ఈ పైన ఈ చక్రం నా సన్నిధిలో ఉండబోదు. మనం ఇప్పుడు వీరభద్రుని ఆదరాభిమానాలతో పూజించినా మనలను రక్షించడు. అతని చేతిలో మనకు అవమానం తప్పదు. అకాల ప్రళయం వచ్చిపడింది. మనందరం వినాశం యొక్క ముంగిట్లో ఉన్నాం. ముల్లోకాల లోను మనకు శరణిచ్చే వాడేలేదు. శివద్రోహికి రక్షణ ఇచ్చేవాడు లేదు. దధీచి

మరియు సతీదేవి శాపానంతరం నేవెంటనే నిష్క్రమిద్దామనుకొన్నాను. నీ చెడు సహవాసమనే పాపంవల్ల వెళ్ళలేకపోయాను. శ్రీ కాలభైరవుడు పూర్వం కాశీలో బ్రహ్మ యొక్క ఐదవ శిరస్సును కొనగోటితో గిల్లాడు. ఇప్పుడేం చేస్తాడో?" ఇంతలో వీరభద్రుడు ససైన్యంగా వచ్చి చేరాడు.

### విష్ణు వీరభద్ర సంవాదం

హరి పల్కిన హితోపదేశాన్ని గుండె దిటవులేని మాటలుగా భావించి, ఆయనను పరిహసించి, అమరేంద్రుడు వజ్రపాణియై సకలదేవతా సమూహంతో కూడి యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. ఇంద్రుడు ఐరావతాన్ని, అగ్ని మేకను, యముడు మహిషాన్ని, నిర్‌ఋతి ప్రేతాన్ని, వరుణుడు మకరాన్ని, వాయువు లేడిని, కుబేరుడు పుష్పకాన్ని అధిష్ఠించి ఆయుధాలను చేబూని రణానికి సిద్ధమయ్యారు. అష్ట దిక్పాలకుల అనుచర గణమంతా ఆయుధ పాణులై అవక్రపరాక్రమంతో పాలకుల వెంట నిలిచారు. ఒక్కసారిగా శంఖ, భేరీ, పటహ, దుందుభి, డిండిమముల వాద్య ధ్వనులు మొరశాయి. దేవతలకు రుద్రగణాలకు మధ్య పోరుమొదలైంది. శివమాయా మోహితులై దేవతలు రుద్రగణాలను అత్యుత్సాహంతో నొప్పింపజొచ్చారు. బల్లేలతో, బాణాలతో, ఖడ్గ, పరశు, భిండివాల, ముద్గర, తోమరాలతో నానావిధ మారణాయుధాలతో చేతులు నరికి, శిరసులపై మొత్తి, పొట్టల్లో పొడిచి, మెడలు నులిమి, కాళ్ళను విరిచి, కనుగ్రుడ్లు పీకి, పేగులు త్రెంచి రుధిర ధారలను వర్షింప చేసి శివగణాలను యుద్ధ పలాయితులను చేశారు.

దేవతల ఈ ప్రథమ విజయానికి కారణం భృగు మహర్షి యొక్క మంత్రబలం. ఆయన దీక్షితుడైన దక్షుని సంతుష్టుని చెయ్యటానికి మంత్రోచ్చాటనాన్ని చేశాడు. గణాలు వెనుతిరిగి రావటాన్ని చూచిన వీరభద్రుడు తోకచుక్క వంటి తన చేతిని ఊపుతూ, ప్రోత్సాహవచనాలను పలుకుతూ మహాత్రిశూలాన్ని ధరించి పశువుల కాపరి మందను మళ్ళించినట్లు గణాలను తిరగ్గొట్టేడు.

అప్పుడు గణాలు దేవతలను కత్తులతో నరికి, ఇనుపరోకళ్ళతో పొడిచి, గండ్ర గొడ్డళ్ళతో వేటాడి, రంపాలతో కోసి, గుదియలతో మొత్తి, బల్లేలతో గ్రుచ్చి, శూలాలతో తూలించి, త్రిశూలాలతో పేగులు లాగి మహా బీభత్సంగా సంహరించటం మొదలుపెట్టారు. సురానీకం పరాజితులై పలాయన పరాయణులై పరస్పరం పరిత్యజించి భర్గ గణభయాన్వితులై ఆయాసపడుతూ స్వర్గానికి చేరుకొన్నారు. ఆ సంగరరంగంలో మూకంతా పారిపోగా కేవలం

లోకపాలురు మాత్రం వీక దక్కి నిలిచారు. వారిలో వారు సంప్రదించుకొని బుద్ధిమంతుడైన బృహస్పతిని చేరి యుద్ధంలో సిద్ధిని పొందే ఉపాయాన్ని చెప్పి ముప్పు తొలగించమని బ్రతిమాలారు.

అంత దేవగురుడు కరుణాన్వితుడై చిత్తంలో శివుని స్మరించి ఇంద్రునితో ఇలా అన్నాడు. "పూర్వం విష్ణువు చెప్పినదంతా ఇప్పుడు ప్రత్యక్షంగా జరుగుతోంది. ఓ అమరేంద్రా! నే చెప్పేది విను. కర్మలన్నింటికి ఫలాన్నిచ్చే ఈశ్వరుడొకడున్నాడు. ఆయన కూడ కర్మఫలాన్ని కర్తయొక్క కర్మననుసరించే ఇస్తాడు గాని కర్మలేని సందర్భంలో ఫలాన్నియ్యలేడు. ఈ కర్మ యొక్క పోకడ అతి గహనమైనది. సర్వ మంత్రాలు, ఓషధులు, అభిచార కర్మలు, శ్రౌత స్మార్త కర్మలు, పూర్వోత్తర మీమాంసాది తదితర శాస్త్రాలు, వేదాలు, మంత్ర తంత్ర జప ధ్యానాదులు ఇవేవీ కూడ ఆ ఈశ్వరుని సాక్షాత్కరింప చేయలేవని పూర్వర్షులు చెప్పారు. వేదాలను పదివేల సార్లు పారాయణ చేసినా జీవునికి ఈశ్వర దర్శనం లభించదు. 'నీవే తప్ప మరొక గతి లేదు' అని శరణాగతులైన భక్తులకు ఆయన దర్శనమిస్తాడు. ఇది వేద వచనం.

సదాశివుని అనుగ్రహం చేత మాత్రమే శాంతము, శ్రేష్ఠము, నిర్వికారము ఐన దృష్టి లభిస్తుంది. ఆ దృష్టి చేతనే ఆయన తెలియబడతాడు. ఇంద్రా! నువ్వు మాయా మోహితుడవై అజ్ఞానంతో లోకపాలురతో కూడి యజ్ఞానికి వచ్చావు! ఇక్కడేమి విక్రమాన్ని చూపుతావు? ఈ రుద్రగణాలు అధ్వర విధ్వంసానికై వచ్చారు. ఆ పని చేసి వెడతారు. దీన్ని తప్పించే ఉపాయం లేదు! ఇది ముమ్మాటికి సత్యం." అప్పుడు దిక్పాలకులు కర్తవ్యం తోచక చింతాగ్రస్తులయ్యారు.

అదే సమయంలో వీరభద్రుడు చిత్తంలో శివుని స్మరించి దిక్పాలకులతో వ్యంగ్యంగా ఇలా అన్నాడు. "ఓ దిక్పాలకులారా! ఏం తిందామని వచ్చారిక్కడికి? యజ్ఞ భాగాలనా! నా వద్దకు రండి! మీ మీ భాగాలను సమంగా పంచుతాను! ఓ శుక్రా! ఓ అగ్నీ! ఓ సూర్యా! ఓయీ చంద్రా! ఓ కుబేరా! ఓ వరుణా! ఓ వాయూ! ఓ నిర్‌ఋతీ! ఓయీ యమా! ఓయీ శేషా! ఓ దేవతలారా! ఓ రాక్షసులారా! ఓ విద్వాంసులారా! మీరంతా ఇలా రండి! మీకు తృప్తి కలిగేటంత హవిర్భాగాలనిస్తాను. మీరు దుష్టులలో అగ్రగణ్యులు. రుద్రుడు లేని యజ్ఞానికి భద్రంగా తిరిగి వెడదామనే వచ్చారా? క్షుద్రులారా!"

ఇలా వెటకారపు మాటలాడి వీరభద్రుడు ఇంద్రునితో సహా అందరిని జర్జరీభూతులను చేశాడు. వారందరు పారిపోగా యజ్ఞశాలా సమీపానికి వచ్చాడు. అక్కడి ఋషులు అతనిని చూచి భయపడి విష్ణువును సమీపించి రక్షించమని వేడుకొన్నారు. ఋషుల ప్రార్థనను ఆలకించి సర్వము తెలిసిన వాడైన హరి, స్థితిపాలకత్వ కర్తవ్యాన్ని నిర్వహించ గోరి చతుర్భుజుడై ఆయుధాలతో నిలిచాడు. విష్ణువును చూడగానే వీరభద్రునికి పాపిని చూచిన యమునివలె, గజేంద్రుని చూచిన కేసరి వలె కనుబొమలు ముడివడ్డాయి. వెంటనే ఇలా అన్నాడు.

"ఓ హరీ! నువ్వీనాడు మహాదేవుని శపథాన్ని ఎలా ఉల్లంఘించగలిగావు? నీ చిత్తంలో గర్వం ఉంది! నువ్వెందుకు వచ్చావు? నీకు రక్షకుడెవడు? నిన్ను నీవు రక్షించుకో లేని వాడవు దక్ష యజ్ఞానికి రక్షకుడవెలా అవుతావు? దాక్షాయణి ఏమి చేసిందో చూడలేదా? దధీచి మహర్షి హితాన్ని నువ్వు వినలేదా? నీకు నేనిస్తాను యజ్ఞ భాగాన్ని! ఓ హరీ! ఇదిగో నీ వక్షస్థలాన్ని చీల్చి నీకు కూడా భార్య లేకుండ చేసి నా స్వామికి సంతోషాన్ని కలిగిస్తాను. నిన్ను అగ్నిదగ్ధుణ్ణి చేస్తాను. నువ్వు శివద్రోహివి!"

బుద్ధిశాలి ఐన విష్ణువు వీరభద్రుని రోష వాక్కులను విని నవ్వుతూ ప్రీతితో ఇలా అన్నాడు: "ఓ వీరభద్రా! శంకర సేవకుడనైన నన్ను శివద్రోహి అని అనకు. ఈ దక్షుడు నా భక్తుడు. అనేక మార్లు యజ్ఞానికి రమ్మని పిలిచాడు. నేను భక్త పరాధీనుడను. అది నా వ్రతం. అందుకని వచ్చాను. శంకరుడు కూడా భక్తవశంకరుడు కదా! ఓ రుద్రకోప సముద్భవ తేజా! ఇక జగడం అంటావా? నువ్వు నన్ను నివారించు. నేను నిన్ను అడ్డుకొంటాను. ఏం జరగాలో అదే జరుగుతుంది. నా పరాక్రమాన్ని చూపుతాను.

గోవిందుని పల్కులకు మహాభుజుడైన వీరభద్రుడు సంతోషించి వినయంతో నారాయణునకు నమస్కరించి ఇలా అన్నాడు. "ఓ! మహా ప్రభో! నా స్వామి ఐన రుద్రునకు ప్రియుడవని తెలిసి చాలా ప్రీతుడనయ్యాను. నాకు శివుడెట్లో మీరు అట్లే! మీరెట్లో శివుడు అట్లే. వేదాలు మీ ఇరువురి విషయంలోను అలాగే మాట్లాడుతున్నాయి. మేమందరం రుద్ర సేవకులం. హే! లక్ష్మీ వల్లభా! ఇప్పుడిక్కడ నడుస్తూన్న ఘర్షణకు అనుకూలంగా మాత్రమే మాట్లాడాను. నాయందు దయ చూపండి."

వీరభద్రుని మాటలకు విష్ణువు నవ్వి "నువ్వు శంక వీడి యుద్ధం చెయ్యి. నీ అస్త్రపాతంచే నా శరీరం నిండిన తర్వాత మాత్రమే కదులుతాను అని నిశ్చయంగా పలికాడు. ఇద్దరూ తమగణాలతో యుద్ధ సన్నద్ధులయ్యారు.

**దక్షయజ్ఞ ధ్వంసం**

అప్పుడు మహాబలుడైన వీరభద్రుడు శంకరుని స్మరించి రథాన్ని అధిరోహించి అస్త్రాలను ధరించి సింహనాదం చేశాడు. విష్ణువు కూడా పాంచజన్యాన్ని పూరించాడు. ఆ శంఖారావాన్ని విని ఇంతకు ముందు పారిపోయిన దేవతలు కూడా వచ్చిచేరారు. దిక్పాలకులంతా వారి వారి గణాలతో వచ్చి వీరభద్రునితో యుద్ధానికి తలపడ్డారు. రెండు గణాల మధ్య భయావహమైన ద్వంద్వ యుద్ధం జరిగింది. ఇంద్రుడు నందిని ఢీకొని నూరంచుల కత్తితో కొట్టాడు. నంది ఇంద్రుని త్రిశూలంతో వక్షస్థలంపై పొడిచాడు.

అగ్ని, విష్ణుగణాలు, కుబేరుడు బలశాలి ఐన కూష్మాండ పతితో యుద్ధానికి దిగారు. శివగణ శ్రేష్ఠుడైన వీరేశ్వరుడు యమునితో తుముల యుద్ధానికి దిగాడు. చండుడు నిర్ఋతికి ఎదురు వెళ్ళి ఢీకొని అస్త్రాలతో కొట్టి హింసించి పరిహాసం చేశాడు. ముండుడు వరుణుని తోను, భృంగి వాయువు తోను ఇలా ఉభయ పక్షాల వీరులు ద్వంద్వ యుద్ధం చేశారు.

యోగినీ గణ సహితుడైన భైరవీ నాయకుడు దేవతలనందరిని చీల్చి నెత్తురు త్రాగాడు. క్షేత్రపాలుడు, బుభుక్షుడు, కాళి ఇంకా కొంతమంది గణ నాయకులు నిర్జరులను నిలువరించి, గుండెకు గాయం పెట్టి, వెచ్చనెత్తురు త్రావి, వీరనాట్యం చేశారు. అంత హరి తన వారి దైన్యాన్ని చూచి, దిగులొంది, తేరుకొని చక్రాన్ని ప్రయోగించాడు. దిక్కులను మండిస్తూ వస్తూన్న చక్రాన్ని చూచి క్షేత్రపాలుడు దానికెదురేగి నోరుతెరచి చక్కిలంలా మ్రింగేశాడు. ఆపై తిరిగి కక్కేశాడు. ఆ సుదర్శన చక్రం తిరిగి విష్ణువును ఆశ్రయించింది. హరి–వీరభద్రుల మధ్య యుద్ధం రోమహర్షణంగా సాగింది.

దేవదేవుడైన విష్ణువు యొక్క యోగబలంచే హరి సదృశులైన విష్ణుగణం అసంఖ్యాకంగా పుట్టి వీరభద్రుని ఎదుర్కొన్నారు. వీరభద్రుడు శివుని స్మరించి వారందరిని నిశ్శేషంగా భస్మం చేశాడు. చేసి త్రిశూలంతో హరి వక్షస్థలంపై లీలగా పొడిచాడు. శూల ఘాతానికి గాయపడి వెంటనే స్పృహను కోల్పోయి లీలామానుష విగ్రహుడైన విష్ణువు తన ప్రియురాలి అంకతలాన్ని ఆశ్రయించి సేదతీర్చుకొంటున్నాడో అన్నట్లుగా ధరకొరిగాడు. తిరిగి లేచి యుద్ధ సన్నద్ధుడయ్యాడు.

అలాలేచి చక్ర ప్రయోగానికి సిద్ధపడుతూన్న హరిని చూచి చక్రాన్ని, విష్ణువును కూడా స్తంభింప చేశాడు వీరభద్రుడు. పర్వతంలా స్తంభితుడైన విష్ణువు, ఆ స్తంభన శక్తిని

నిర్వీర్యం చేయగోరి, భృగుమహర్షిని పిలిపించి ఆయన మంత్ర శక్తిచే వినిర్ముక్తుడయ్యాడు. వీరభద్రుని చేతిలో తను పొందిన అవమానానికి సిగ్గుపడి క్రుద్ధుడై తన శార్ఙ్గమనే ధనువును, బాణాలను చేత పట్టేడు. ఇంకా బాణప్రయోగం చేయకుండానే వీరభద్రుడు మూడు బాణాలతో కొట్టగా ఆ ధనుస్సు మూడు ముక్కలైంది. అప్పుడు వాణీ బ్రహ్మలు హెచ్చరించగా వీరభద్రుని పరాక్రమం సహింప రానిదని ఎరిగి విష్ణువు అంతర్ధానమయ్యాడు.

విష్ణువు వెంట ఇతర దేవతలంతా వారి వారి స్థానాలను చేరుకొన్నారు. పితామహుడు కూడా పుత్ర శోకంతో బాధపడుతూ సత్యలోకానికి వెళ్ళి తదనంతర కర్తవ్యాన్ని గురించి ఆలోచింపసాగేడు. అలా వారిద్దరు యజ్ఞ భూమిని విడిచి వెళ్ళగానే మిగిలిన దేవతలను, యజ్ఞమే జీవనాధారంగా గల మునులను రుద్రగణాలు జయించాయి. యజ్ఞ పురుషుడు మహా భీతుడై మృగ రూపంతో ఆకాశం వైపుకు పరుగెత్తగా ఆ పురుషుని తల నరికాడు వీరభద్రుడు.

తన స్వామికి జరిగిన అవమానాన్ని, సతీదేవి దేహత్యాగాన్ని మాటి మాటికి గుర్తుకు తెచ్చుకొని మనసు దహించుకుపోగా వీరుడైన వీరభద్రుడు సక్రోధుడై ధర్మ కశ్యప ప్రజాపతులను, బహు పుత్రకుడైన అరినేమిని, ఆంగిరసుని, కృశాశ్వుని, దత్తమహర్షిని పట్టుకొని శిరస్సుపై పాదంతో తన్నేడు. దేవమాత ఐన సరస్వతి ముక్కుకొనను కొనగోటితో గిల్లేడు. పగ పట్టిన త్రాచుపాము వలె కోపావిష్టుడైన వీరభద్రుడు దేవతలను, మహర్షులను అనేక విధాల హింసించి కూడ శాంతించలేదు. ఇంకా ఎవరైనా ఎక్కడైనా దాగి ఉన్నారేమో అని పరికించాడు.

ఇంతలో మణిభద్రుడు భృగు మహర్షిని నేలపైపడేసి, గుండెలపై కాలితో తొక్కిపెట్టి, గడ్డాన్ని, మీసాన్ని పెరికి వేశాడు. దక్షుడు శివుని నిందించిన సమయంలో పళ్ళు కనపడేటట్లు నవ్విన పూషుని (సూర్యుడు) యొక్క దంతాలను చండుడు పీకివేశాడు. అలాగే కనుసైగలతో ప్రోత్సహించిన భగుని నేలపై దొర్లించి నేత్రాలను పెకలించాడు నంది. ఆ యజ్ఞశాలలో ఉపవిష్టులై ఉన్న స్వాహా, స్వధా, దక్షిణా అనే దేవతలను, మంత్ర తంత్రాధిష్ఠాన దేవతలను ఇతరులను అనేక దురవస్థలకు గురి చేశారు. అగ్నివేదిక యందు ఇసుక పోశారు.

అక్కడ భయంచే దాక్కొని యున్న బ్రహ్మపుత్రుడైన దక్షుని రుద్రగణాలు వెతికి పట్టుకొని బలవంతంగా బయటకు లాగి వీరభద్రుని ముందు నిలపెట్టారు. వీరభద్రుడు రౌద్రంతో చెక్కిళ్ళు పట్టుకొని ఖడ్గంతో తల నరకబోగా దక్షుని యోగ మహిమ వల్ల అది

సాధ్యం కాలేదు. శస్త్రాస్త్రాలతో ఆ తలను నరుకుట అసంభవమని ఎరిగి గుండెపై రెండు కాళ్ళతో నిలబడి చేతితో తల పట్టుకొని మెలిపెట్టి తెంపేసి అగ్నిహోత్రంలో పారేశాడు.

చీకట్లను పారద్రోలిన సూర్యుని వలె శత్రు నిర్మూలనం చేసి కార్యాన్ని పూర్తి చేసికొని శూలపాణియై పరమేశ్వరుని ఎదుట నిల్చున్నాడు. మహాదేవుడు ప్రసన్నుడై వీరభద్రుని సర్వగణాధ్యక్షుణ్ణి చేశాడు."

**క్షువ దధీచుల వివాదం**

సూతుడు మునులకిలా చెపుతున్నాడు. "ఓ మహర్షులారా! బ్రహ్మగారీ గాథను ఇంతవరకు చెప్పాక నారదుడు విని రుద్రుడు లేని యాగానికి దేవతలతో కూడి వెళ్ళి విష్ణువు పరాభవాన్ని పొందటానికి కారణమేమిటి?" అని ప్రశ్నించగా పితామహుడు చెప్పిన దానిని మీకు చెపుతున్నాను వినండి.

పూర్వం క్షువుడు అను మహా తేజస్వి ఐన రాజు ఒకడుండేవాడు. చ్యవన పుత్రుడైన దధీచి మహర్షి ఆయనకు మంచి మిత్రుడు. దీర్ఘకాల తపస్సు విషయంలో వారిద్దరికి గొప్ప వివాదం పుట్టింది. ఆ వివాదం అప్పట్లో చాలా అల్లకల్లోలాన్ని రేపింది. దీర్ఘకాల తపస్సు విషయంలో బ్రాహ్మణుడే అందరి కంటె శ్రేష్ఠుడు అని శివభక్తుడైన దధీచి పల్కగా అష్ట దిక్పాలకుల శరీరాన్ని తాను ధరిస్తున్నాడు కనుకను, వర్ణాశ్రమ ధర్మాలను రక్షిస్తున్నాడు కనుకను రాజే శ్రేష్ఠుడు అని క్షువుడు అన్నాడు. ఇంకా ఇలా అన్నాడు: "ఓ చ్యవన పుత్రా! రాజ ధర్మాలను చెప్పిన శ్రుతి 'రాజు సర్వదేవతా స్వరూపుడు' అని అంటోంది. అట్టిదేవతను నేనే! రాజు బ్రాహ్మణుని కంటె శ్రేష్ఠుడు. కనుక నువ్వు నన్ను పూజించాలి."

వేద శాస్త్ర విరుద్ధమైన క్షువుని అభిప్రాయాన్ని విన్న భృగువంశజుడైన దధీచికి కోపం వచ్చి ఎడమ ముష్టితో అతని శిరసుపై కొట్టాడు. దుర్బుద్ధి ఐన క్షువుడు క్రుద్ధుడై దధీచిని కత్తితో చీల్చి 'ఇప్పుడెవరు శ్రేష్ఠుడు?' అని గర్జించాడు. మహర్షి నేలమీద పడి భృగువంశ మండనాయ మానుడైన శుక్రాచార్యుని స్మరించాడు. వెంటనే శుక్రుడు వచ్చి మృత సంజీవనీ విద్యచే చీల్చివేయ బడిన దధీచి దేహాన్ని సంధించాడు. సంధించి శివ భక్తులలో శ్రేష్ఠుడు, మృత్యుంజయోపాసనను లోకంలో ప్రవర్తింప జేసిన వాడు, అసుర గురువు, నీతిశాస్త్ర విశారదుడు ఐన శుక్ర భగవానుడు దధీచికి అత్యంత రహస్యము, పవిత్రము, మహామహిమోపేతము ఐన మహా మృత్యుంజయ మంత్రాన్ని ఇలా ఉపదేశించాడు.

**శ్లో॥ దధీచ తాత సంపూజ్య శివం సర్వేశ్వరం ప్రభుమ్ ।**
**మహా మృత్యుంజయం మంత్రం శ్రౌతమగ్ర్యం వదామితే ॥**
**త్ర్యంబకం యజామహే త్రైలోక్య పితరం ప్రభుమ్ ।**
**త్రిమండలస్య పితరం త్రిగుణస్య మహేశ్వరమ్ ॥**
**త్రితత్త్వస్య త్రివహ్నేశ్చ త్రిధా భూతస్య సర్వతః ।**
**త్రి దివస్య త్రి బాహోశ్చ త్రిధా భూతస్య సర్వతః ॥**
**త్రి దేవస్య మహాదేవ స్సుగంధిం పుష్టి వర్ధనమ్ ।**
**సర్వ భూతేషు సర్వత్ర త్రిగుణేషు కృతౌ యథా ॥**

**తా॥** వత్సా! దధీచీ! శివ ప్రభుని పూజించి వేదోక్తము, సర్వశ్రేష్ఠము ఐన మహా మృత్యుంజయ మంత్రాన్ని నీకు ఉపదేశిస్తున్నాను. *'త్ర్యంబకం యజామహే'* ముల్లోకములకు తండ్రి, రక్షకుడు, అగ్నిచంద్ర సూర్య మండలములను సృష్టించిన వాడు, సత్త్వరజస్తమో గుణములపై సంపూర్ణ ఆధిపత్యము గలవాడు, వాతపిత్త శ్లేష్మములనే మూడు శరీర తత్త్వాలను పాలించువాడు, ఆహవనీయ గార్హపత్య దక్షిణాగ్నులను మూడు అగ్నులను పాలించు వాడు, పృథివి, జలము, అగ్ని అను మూడు బాహువుల వంటి మూడు మూర్త భూతములతో సర్వమును వ్యాపించి ఉన్న వాడు, స్వర్గాది లోక స్వరూపుడు, సుఖదుఃఖ మోహాత్మక మగు జగత్తు నందు సర్వత్ర వ్యాపించి ఉన్నవాడు, త్రిమూర్తి స్వరూపుడు అగు శివుని పూజించెదము.

'సుగంధిమ్' మహాదేవుడు సర్వభూతములలో, సర్వప్రాణులలో, సత్త్వరజస్తమో గుణములలో, సర్వకర్మలలో సుగంధము వలె వ్యాపించి ఉన్నాడు.

**శ్లో॥ ఇంద్రియేషు తథాన్యేషు దేవేషుచ గణేషుచ ।**
**పుష్పే సుగంధివత్సూర స్సుగంధి మమరేశ్వరః ॥**
**పుష్టిశ్చ ప్రకృతేర్యస్మా త్పురుషాద్వై ద్విజోత్తమ ।**
**మహదాది విశేషాంత వికల్ప స్యాపి సుప్రవత ॥**
**విష్ణోః పితామహస్యాపి మునీనాంచ మహామునే ।**
**ఇంద్రస్యచ దేవానాం తస్మాద్వై పుష్టి వర్ధనః ॥**
**తం దేవమమృతం రుద్రం కర్మణా తపసాపివా ।**
**స్వాధ్యాయేన చ యోగేన ధ్యానేన చ ప్రజాపతే ॥**

**తా॥** ఆ దేవదేవుడు పుష్పములలో సుగంధము వలె ఇంద్రియములలో, ఇతర దేవతలలో, శివ గణములలో వ్యాపించి ఉన్నాడు.

'పుష్టివర్ధనమ్' ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా! వ్రత నిష్ఠుడా! మహత్తు మొదలు పరమాణుగత విశేషము వరకు వివిధ కార్యరూపములలో ఉన్న ప్రకృతి యొక్క పుష్టి (బలం) పురుషుడగు శివుని నుండి లభించింది. మహర్షీ! విష్ణువుకు, బ్రహ్మకు, ఇంద్రునకు, దేవతలకు, మునీశ్వరులకు పుష్టిని ఇచ్చుట చేతనే శివుడు పుష్టి వర్ధనుడగుచున్నాడు. ఓ ప్రజాపతీ! అమృత స్వరూపుడైన ఆ రుద్రదేవుని వేద విహిత కర్మానుష్ఠానముచేగాని, తపస్సుచేగాని, వేదాధ్యయనముచేగాని, యోగముచేగాని, ధ్యానముచేగాని ఆరాధించాలి.

**శ్లో॥ సత్యేనాన్యేన సూక్ష్మాగ్రా న్మృత్యు పాశాద్భవ స్స్వయమ్ ।**
**బంధమోక్షకరో యస్మాదుర్వారుక మివ ప్రభుః ॥**
**మృత సంజీవనీ మంత్రో మమ సర్వోత్తమ స్మృతః ।**
**ఏవం జపపరః ప్రీత్యా నియమేన శివం స్మరన్ ॥**
**జప్త్వా హుత్వాభి మంత్ర్యైవం జలంపిబ దివానిశమ్ ।**
**శివస్య సన్నిధౌ ధ్యాత్వా నాస్తి మృత్యుభయం క్వచిత్ ॥**
**కృత్వా న్యాసాదికం సర్వం సంపూజ్య విధివచ్ఛివమ్ ।**
**సంవిధాయేదం నిర్వ్యగ్ర శ్శంకరం భక్తవత్సలమ్ ॥**

**తా॥** సత్యముచే గాని, లేదా ఇతర ఆరాధనా పద్ధతిచేగాని పూజింప బడిన శివ ప్రభువు దోసకాయను తీగనుండి వలె, భక్తుని మిక్కిలి భయంకరమగు మృత్యు పాశము అనుబంధము నుండి విముక్తిని కలిగిస్తాడు. ఈ మృత సంజీవనీ మంత్రం సర్వశ్రేష్ఠమైనది. నువ్వు ప్రీతితో శివుని స్మరిస్తూ నియమంతో దీన్ని జపించు. జపం పూర్తయ్యాక హోమం చెయ్యి. రాత్రింబవళ్ళు నీరు త్రాగినప్పుడు ఆ నీటిని ఈ మంత్రంతో అభిమంత్రించి త్రాగు. దీనిని శివ సన్నిధిలో ధ్యానం చేసిన వానికి ఎప్పుడూ మృత్యుభయం ఉండదు. న్యాసాదికం పూర్తిచేసి భక్తవత్సలుడు, మంగళకరుడు ఐన శివుని యథావిధిగా పూజించి ఈ మంత్రాన్ని జపించి దుఃఖం నుండి విముక్తిని పొందు.

**శ్లో॥ ధ్యానమస్య ప్రవక్ష్యామి యథా ధ్యాత్వా జపేన్మనుమ్ ।**
**సిద్ధమంత్రో భవేద్ధీమాన్ యావచ్ఛంభు ప్రభావతః ॥**

**తా॥** ఈ మంత్రానికి ధ్యాన శ్లోకాన్ని చెపుతున్నాను విను. ఇట్లు ధ్యానించి మంత్రాన్ని జపించిన జ్ఞాని శంభుని అనుగ్రహంచే శీఘ్రంగా మంత్ర సిద్ధిని పొందుతాడు.

**ధ్యాన శ్లోకం**

**శ్లో॥ హస్తాంభోజ యుగస్థ కుంభ యుగళా దుద్ధృత్య తోయం**
**శిరస్సించంతం కరయోర్యుగేన దధతం స్వాంకే సకుంభౌ కరౌ।**
**అక్షస్రజ్ మృగహస్త మంబుజగతం మూర్ధస్థ చంద్రస్రవత్**
**పీయూషార్ద్రతనుం భజే సగిరిజం త్ర్యక్షం చ మృత్యుంజయమ్ ॥**

**తా॥** పద్మముల వంటి రెండు చేతుల యందున్నరెండు కుంభములతో నీటిని పైకి గ్రహించి శిరస్సుపై అభిషేకించుకొనుచున్నట్టియు, రెండు చేతులతో తన ఒడిపై రెండు కుంభములను ధరించినట్టియు, ఒక చేతితో అక్షమాలను మరొక చేతితో మృగమును కలిగి ఉన్నట్టియు, పద్మమునందు ఆసీనుడై ఉన్నట్టియు, శిరస్సుపై నున్న చంద్రుని నుండి జాలువారిన అమృతముతో తడిసిన దేహము కల్గినట్టియు, పార్వతీ దేవితో కూడి ఉన్నట్టియు (పార్వతి వేరుగా ఉండదు. ఆయనలోనే ఉంటుంది) మూడు కళ్ళుగల మృత్యుంజయుని ధ్యానించెదను.

మునులారా! ఈ విధంగా మృత సంజీవని విద్యను ఉపదేశించి శుక్రుడు తన స్థానానికి చేరుకొన్నాడు. దధీచి మహాముని శివ వైభవాన్ని స్మరిస్తూ తపస్సు కొరకు వనానికి వెళ్ళాడు. వెళ్ళి మహా మృత్యుంజయ మంత్రాన్ని యథావిధిగా జపిస్తూ చిరకాలం తపస్సు చేసి పరమేశ్వర సాక్షాత్కారాన్ని పొంది ఆయన నుండి మూడు వరాలను పొందేడు. అవి ఏవనగా వజ్ర సదృశమైన ఎముకలు, అవధ్యత్వం, దైన్యం లేని జీవనం.

వరత్రయాన్ని పొంది సానందుడై దధీచి క్షువ మహారాజు ఉన్న చోటికి వెళ్ళి అరికాలితో శిరస్సుపై తన్నాడు. విష్ణు గౌరవ గర్వితుడైన క్షువుడు మహా రోషంతో దధీచిని కృపాణంతో నరికేడు. శివ వరప్రభావంచే దధీచికి ఎట్టి హాని కలుగలేదు. అవధ్యుడుగ అధీనుడుగ నిలిచియున్న దధీచిని చూచి బ్రహ్మ పుత్రుడైన క్షువుడు విస్మితుడై వెంటనే వనానికి వెళ్ళి హరిని గూర్చి ధ్యానం చేశాడు. అతని భక్తికి, ఏకాగ్రతకు సంతసించి ప్రత్యక్షమైన విష్ణువుతో తను పొందిన అవమానాన్ని గూర్చి విన్నవించుకొన్నాడు క్షువుడు.

క్షువుని మనోగతాన్ని ఎరిగిన విష్ణువు అతనితో "వత్సా! దధీచి చెప్పింది సత్యమే. అతడు భృగువంశ మండనుడు. మహా తపస్సంపన్నుడు. విశేషించి శివారాధనా తత్పరుడు.

అతనికి దుఃఖాన్ని కలిగిస్తే నిన్ను, నన్ను కూడ శపించగలడు. మనిద్దరం కలిసి ప్రయత్నించినా అతనిని జయించలేం. ఐనా నువ్వు నా భక్తుడవు కనుక అతనిపై విజయాన్ని సాధించటానికి ప్రయత్నిస్తాను. ఆ ప్రయత్నం నెరవేరదు. పైగా ఆయన శాపానికి గురై దక్షయజ్ఞంలో శివుని వలన వినాశాన్ని పొంది తిరిగి పునరుత్థానాన్ని పొందుతాను." అని చెప్పి మాయావి ఐన హరి, క్షువుని మనోరథాన్ని నెరవేర్చేప్రయత్నంలో నిమగ్నమయ్యాడు.

**విష్ణు-దధీచుల యుద్ధం**

నిమగ్నమై భక్తవత్సలుడైన హరి బ్రాహ్మణ వేషంలో దధీచుని ఆశ్రమానికి వెళ్ళి అతనిచే అతిథి పూజా సత్కారాల నందుకొని "నీ నుండి ఒక వరాన్ని కోరుతున్నాను. అనుగ్రహించ వలసింది" అని అర్థించాడు. శంకర వరప్రభావంచే త్రికాల జ్ఞాని ఐన మహర్షి వచ్చిన వాడు హరియని ఎరిగి "ఓ భక్తవత్సలా! నువ్వు దుష్టబుద్ధి ఐన క్షువ మహారాజు కోరికను నెరవేర్చటానికి వచ్చిన నారాయణుడవని నాకు తెలుసు. భయాన్ని విడిచి, స్వస్వరూపాన్ని ధరించి, శంకరుని స్మరించి, సత్య ప్రతిజ్ఞ చేసి నిశ్చింతగా అడుగు. శివ భక్తుడనైన నేను దేనికీ భయపడను. అసత్యం పలుకను." అని ప్రతిజ్ఞా పూర్వకంగా అన్నాడు.

దానికి హరి అంతరంగంలో సంతోషించి పరీక్షార్థం ఇలా అన్నాడు "ఓ దధీచీ! శివపూజా ధురంధరుడవైన నీకు సర్వత్ర భయం తొలగిపోయింది. నీకు నమస్కారం! నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను లేదా అభ్యర్థిస్తున్నాను! ఏమైనా అనుకో! నువ్వొక్కసారి క్షువ మహారాజు ఎదుట నిలబడి "నేను భయపడుచున్నాను" అని ఆ ఒక్కమాట అనుచాలు.

మహా మృత్యుంజయ మంత్రసిద్ధి పొందిన దధీచి మహర్షి నారాయణుని మాటలకు నవ్వుకొని ఇలా అన్నాడు: "ఓ హరి! పినాకపాణి ఐన శంభు వర ప్రసాదం వలన ఈ లోకంలో నేను దేనికీ భయపడను."

మహర్షి మాటలకు ఆగ్రహించిన విష్ణువు అతనిని శిక్షించాలని చక్ర ప్రయోగం చేశాడు. ఈశ్వర సంకల్పంచే అది వ్యర్థమైంది. అప్పుడు మహర్షి ఇలా అన్నాడు: "ఓ గోవిందా! ఈశ్వరానుగ్రహం వలన నీకు లభించిన ఆ సుదర్శనం శంకర కింకరుడనైన నాపైకి రావటానికి భయపడుతోంది. కనుక నన్ను శిక్షించటానికి వేరే ప్రయత్నం చెయ్యి."

మహర్షి మాటలకు మరింత కుపితుడై మాధవుడు అనేక శస్త్ర-అస్త్రాలను ప్రయోగించాడు. ఇంద్రాది బృందారకులు వాసుదేవునికి బాసటగా నిలిచారు. శివమాయా మోహితులై తనతో తలపడ్డవారిని చూచి మృత్యుంజయుణ్ణి స్మరించి గుప్పెడు దర్భలను

తీసికొని సమంత్రకంగా ప్రయోగించాడు మహర్షి. ఈశ్వర మహిమచే అది కాలాగ్ని వంటి త్రిశూలమై దేవతలను దహించటం మొదలు పెట్టింది. దేవతల అస్త్రాలన్ని దాని ముందు మోకరిల్లాయి. దేవతలంతా పలాయితులయ్యారు. త్రివిక్రముడైన నారాయణుడొక్కడే నిలిచి తనదేహాన్నుండి కోట్లాది దివ్య గణాలను సృష్టించాడు. వారంతా అనేక అస్త్ర శస్త్రాలతో దధీచితో యుద్ధం చేశారు. దధీచి వాళ్ళందరిని క్షణంలో దహించి అజేయుడై నిలిచాడు.

అప్పుడు మహామాయా విశారదుడైన విష్ణువు, దధీచిని భయభ్రాంతుని చేయగోరి తన విశ్వరూపాన్ని చూపించాడు. విశ్వమంతా అందులో దర్పణంలో ప్రతిబింబంలా గోచరించింది. ఆ రూపాన్ని చూచి జ్ఞానియైన చ్యవన నందనుడిలా అన్నాడు: "ఓ మాధవా! నీ విశ్వరూపానికి నేను భయపడను. ఎందుకంటె విచారణ చేస్తే ఈ విశ్వమంతా దర్పణ దృశ్యమానం. ఇకనీ విశ్వరూపం గురించి చెప్పేదేముంది? ప్రతిబింబాలెన్నైనా ఉంటాయి. బింబం మాత్రం ఒక్కటే ఉంటుంది. మహాదేవుడు, సర్వజ్ఞుడు ఐన ఈశ్వరుడొక్కడే నిత్యుడు. ఇదిగో! నా విశ్వరూపాన్ని వీక్షించు! నీకు దివ్యదృష్టి నిస్తున్నాను." అని శంకర తేజస్సుచే విరాట్ రూపాన్ని ధరించి నిలబడ్డాడు. నిలబడి ఇలా అన్నాడు: "మాధవా! మాయతో గాని మంత్రశక్తితోగాని పని లేదు. ప్రయత్న పూర్వకంగా యుద్ధం చేయి."

హరి సర్వము ఎరిగిన వాడైనా మహర్షి శివభక్తిని పరీక్షింపగోరి తిరిగి యుద్ధ ప్రయత్నాన్ని మొదలు పెట్టాడు. దేవతలంతా వచ్చి చేరారు. ఐనా దధీచి భయపడలేదు. అంతలో బ్రహ్మగారొచ్చి శివ వరప్రసాది ఐన ఈ బ్రహ్మర్షిని భయపెట్టటం ఎవరికీ సాధ్యం కాదని చెప్పి యుద్ధ ప్రయత్నాన్ని విరమింపచేశాడు. అంతా ప్రత్యక్షంగా చూచిన క్షువుడు దీనుడై మహర్షి పాద పద్మాలకు నమస్కరించి, నన్ను క్షమించి నాయందు ప్రసన్నతను చూప వలసిందని ప్రార్థింపగా మహర్షి ప్రసన్నుడయ్యాడు.

ఆపై విష్ణువును, దేవతలను చూచి "మీరందరు దక్షయజ్ఞ సందర్భంగా రుద్రుని కోపాగ్నిచే వినాశాన్ని పొందెదరుగాక!" అని శపించాడు. దధీచి శాపానికి భయభ్రాంతులైన నారాయణుడాదిగా తక్కిన దేవతలంతా మహేశ్వరుని ఆగ్రహం అది తమకు అనుగ్రహమే అని తలచి స్వస్థానాలకు చేరుకొన్నారు. ఈ కథంతా జరిగిన క్షేత్రం స్థానేశ్వరం అనే పేరుతో పుణ్య క్షేత్రమైంది. దానిని దర్శించిన వారు శివ సాయుజ్యాన్ని పొందుతారు."

## దేవతల శివ సందర్శనం

సూత మహర్షి మునులతో ఇలా అంటున్నాడు. "మునులారా! దక్షయజ్ఞ సందర్భంగా విధి, మాధవులతో

సహా దేవతలు, దిక్పాలకులు రుద్రుని వల్ల అవమానాన్ని పొందిన విషయాన్ని, దానికి కారణభూతమైన దధీచి శాపగాథను సవిస్తరంగా వివరించాను. తదనంతర గాథను చెపుతున్నాను వినండి. తదనంతరం గీర్వాణులంతా స్వయంభువు ఐన బ్రహ్మ గారిని దర్శించి దక్షుని పునర్జీవితుని చేసి యజ్ఞాన్ని పరిపూర్తి చేసే ఉపాయాన్ని చెప్ప వలసిందిగా ప్రార్థించారు. పుత్ర శోక పీడితుడైన పితామహుడు ఉపాయం తోచక అమరులతో కూడి నారాయణుని సందర్శించి విషయాన్ని విన్నవించాడు. ఆయన శంకరుని స్మరించి ఇలా అన్నాడు:

"ఓ బృందారకులారా! అభ్యుదయాన్ని కోరే వారు తేజశ్శాలుర జోలికి పోరాదు. వారికి క్షేమం కలుగదు సరిగదా హాని సిద్ధిస్తుంది. యజ్ఞభాగాన్నియ్యకుండ రుద్రుని విషయంలో మీరు తప్పుచేశారు! నేను కూడా ఆయన విషయంలో అపరాధం చేశాను. దుష్టుడైన దక్షుని మాటలచే ఆయన మనస్సు క్షోభించింది. సతీ వియోగంతో కుములిపోతున్న ఆయనను దర్శించి చేసిన అపరాధాలను మన్నించి క్షమించమని వేడుకొందాం! నేను కూడా వస్తున్నాను నడవండి."

అలా విష్ణు ప్రేరితులై వారంతా కైలాసాన్ని చేరుకొన్నారు. నానా మణిమయ శృంగ విరాజమానము, నానా ధాతు వర్ణ విచిత్రము, వివిధ ద్రుమలతా శోభితము, మృగగణాకీర్ణము, బహు ద్విజ సమూహ సేవితము, మధురజల పరిపూరిత సరోవర సుందరము, గంధర్వాప్సరో గణ విహరణమాన సుందర కందరము, సిద్ధగణ పూజ్య మానము ఐన కైలాసం యొక్క శోభకు వారంతా దిగ్భ్రమ చెందారు. దాని సమీపంలోనే సౌగంధిక వనంతో శోభిస్తున్న శివ మిత్రుడైన కుబేరుని అలకా పట్టణాన్ని చూచారు. దాని చెంతనే అలక, నంద అనే రెండు సరస్సులను దర్శించారు.

కైలాసంలో శంభుని యోగ స్థలాన్ని సందర్శించారు. అక్కడ ఒక పెద్ద వటవృక్షం ఉంది. దాని ఊడలన్ని నేలకు దిగి దేనికదే వేర్వేరు వృక్షాల్లా ఉన్నాయి. అది వంద యోజనాల ఎత్తుకలిగి బహు విస్తారమైన నీడనిస్తోంది. అంత ఎత్తుకు పక్షులు ఎగరలేని కారణంగా దాని మీద పక్షుల గూళ్ళు లేవు. ఆ స్థలం మహాపుణ్య ప్రదము, రమ్యము, అతి పావనము, మహోత్తమమూను. మహాయోగులకు మాత్రమే గోచరించే దివ్యమైనది.

ముముక్షువులకు శరణమైనది, మహా యోగాత్మకము ఐన ఆ వటవృక్షం క్రింద ఆసీనుడై ఉన్న శంకరుని చూచారు దేవతలు. మహా సిద్ధులు, శివ భక్తులు, శాంత మూర్తులైన బ్రహ్మమానస పుత్రులు, కుబేరుడు, రుద్రగణాలు ఆయనను సేవిస్తున్నారు. ఆయన

రుద్రాక్షధారియై, భస్మాది విరాజితుడై జ్ఞానముద్రలో యోగ నిష్ఠలో ఉన్నాడు. దేవతలంతా ఆయనకు నమస్కరించారు. ఆయన లేచి శిరసుతో అభివాదం చేశాడు. మహాదేవునుద్దేశించి విష్ణువు ఇతర దేవతలు ఇలా స్తుతించారు.

**దేవతలు శివుని స్తుతించుట**

**శ్లో॥ దేవదేవ మహాదేవ లౌకికాచార కృత్ప్రభో ।**
**బ్రహ్మత్వామీశ్వరం శంభుం జానీమః కృపయా తవ ॥**
**కిం మోహయసి నస్తాత మాయయా పరయా తవ ।**
**దుర్జ్ఞేయయా సదా పుంసాం మోహిన్యా పరమేశ్వర ॥**
**ప్రకృతేః పురుషస్యాపి జగతో యోని బీజయోః ।**
**పరబ్రహ్మ పరస్త్వంచ మనోవాచామ గోచరః ॥**
**త్వమేవ విశ్వం సృజసి పాస్యత్సి నిజతంత్రతః ।**
**స్వరూపాం శివశక్తిం హి క్రీడ న్నూర్ణపటో యథా ॥**

**తా॥** దేవదేవా! మహాదేవా! హే ప్రభో! నీవు పరబ్రహ్మవగు శంభుడవని నీ కృప చేతనే ఎరుగుదుం. తండ్రీ! పరమేశ్వరా! మానవులను మోహింప చేసేది, తెలియ శక్యం కానిది, సర్వోత్కృష్టమైనది ఐన నీ మాయచే మమ్మెందుకు మోహింప చేస్తున్నావు? జగత్తుకు ప్రసవ కారణమైన ప్రకృతి కంటె, బీజమైన పురుషుని కంటె ఉత్కృష్టమైన పరబ్రహ్మము నీవు. మనస్సుకు, వాక్కుకు అందవు! నీవు స్వేచ్ఛ చేతనే నీ స్వరూపమైన శివశక్తిని వశం చేసికొని సాలెపురుగు గూటిని నిర్మించుకొన్నట్లు ఈ జగత్తును సృష్టించి పాలించి లీనం చేస్తున్నావు. ఇది నీ లీల (లీల అనగా ప్రవాహరూపమైనది అని అర్థం)

**శ్లో॥ త్వమేవ క్రతు మీశాన ససర్జిథ దయాపరః ।**
**దక్షిణా సూత్రేణ విభో సదా త్రయ్యభిపత్తయే ॥**
**త్వయైవ లోకేఽవసితాస్సేతవో యాన్ ధృతవ్రతాః ।**
**శుద్ధాన్ శ్రద్ధథతే విప్రా వేదమార్గ విచక్షణాః ॥**
**కర్తుస్త్వం మంగలానాం హి స్వపరం తు ముఖే విభో ।**
**అమంగలానాం చ హితం మిశ్రంవాథ విపర్యయమ్ ॥**
**సర్వకర్మ ఫలానాం హి సదా దాతా త్వమేవహి ।**
**సర్వే హి ప్రోక్తా హి యశస్తత్పతిస్త్వం శ్రుతి శ్రుతః ॥**

**తా॥** ఓ ఈశ్వరా దయానిధివైన నువ్వే యజ్ఞాన్ని సృష్టించావు. ఋగ్యజుస్సామ (త్రయీ) రూపమైన వేదాన్ని లోకంలో ప్రవర్తింప చేయటం కొరకు యజ్ఞాన్ని సృష్టించి దాన్ని దక్షిణ అనుసూత్రంతో బంధించావు. వ్రతనిష్ఠులు, వేదమార్గ నిష్ణాతులు ఐన వేదవేత్తలు లోకంలో నీ చేతనే నిర్మింపబడిన, పరిశుద్ధమైన ధార్మిక నియమాలను శ్రద్ధతో ఆచరిస్తున్నారు. శుభాశుభ కర్మలను ఆచరించు వారికి నువ్వు స్వపర భేదం లేకుండా హిత–అహిత ఫలాలను, మిశ్రమ ఫలాలను కర్మాను రూపంగా ఇస్తున్నావు. ప్రాణులకు కర్మఫలాలనిచ్చే దాతవు నువ్వే. సర్వ మానవులు చేసే ప్రార్థనలన్నీ నీకు మాత్రమే చెందుతాయని వేదం అంటోంది.

**శ్లో॥ పృథగ్ధియః కర్మదృశో౽రుంతుదాశ్చ దురాశయాః ।**
**వితుదంతి పరాన్ మూఢా దురుక్తై ర్మత్సరాన్వితాః ॥**
**తేషాం దైవవధానాం భో భూయస్త్వాచ్చ వధో విభో ।**
**భగవన్పరమేశాన కృపాం కురు పరప్రభో ॥**
**నమో రుద్రాయ శాంతాయ బ్రహ్మణే పరమాత్మనే ।**
**కపర్దినే మహేశాయ జ్యోత్స్నాయ మహతే నమః ॥**
**త్వంహి విశ్వసృజాం స్రష్టాధాతా త్వం ప్రపితామహః ।**
**త్రిగుణాత్మా నిర్గుణశ్చ ప్రకృతేః పురుషాత్పరః ॥**
**నమస్తే నీలకంఠాయ వేధసే పరమాత్మనే ।**
**విశ్వాయ విశ్వ బీజాయ జగదానంద హేతవే ॥**

**తా॥** వేర్పాటు బుద్ధి కలవారు, దుర్బుద్ధిగలవారు, అసూయతో నిండినవారు, ఇతరుల మనస్సును గాయపరచు వారు, కేవల కర్మఠులు ఐన మూర్ఖులు పరుష వచనములతో ఇతరులను బాధిస్తారు. హే విభో! అట్టి దైవ ద్రోహుల ఆగడములు మితిమీరినపుడు వారిని సంహరించాలి. పరమాత్మా! దయ చూపు. శాంతుడు, పరబ్రహ్మ, పరమాత్మ, జటాజూటధారి, మహేశ్వరుడు, మహాజ్యోతి స్స్వరూపుడు అగు రుద్రునకు నమస్కారం. జగత్తును సృష్టించు ప్రజాపతులను నువ్వే సృష్టించావు. సృష్టికర్తవు నువ్వే. సృష్టికర్తకు తండ్రివి నువ్వే. త్రిగుణస్వరూపుడవు నువ్వే. నిర్గుణుడవు నువ్వే. నువ్వు ప్రకృతి కంటె పురుషుని కంటె ఉత్కృష్టమైన వాడవు. నల్లని కంఠముగలవాడు, జగత్సృష్టికర్త, పరమాత్మ, జగత్స్వరూపుడు, జగత్తుకు బీజమైన వాడు. జగత్తుకు ఆనందము కలిగించువాడు అగు నీ కొరకు నమస్కారం.

**శ్లో॥ ఓంకారస్త్వం వషట్కార సర్వారంభ ప్రవర్తకః ।**
**హంతకార స్స్వధాకారో హవ్యకవ్యాన్నభుక్ సదా ॥**
**కృతః కథం యజ్ఞ భంగస్త్వయా ధర్మ పరాయణ ।**
**బ్రహ్మణ్యస్త్వం మహాదేవ కథం యజ్ఞహనో విభో ॥**
**బ్రాహ్మణానాం గవాం చైవ ధర్మస్య ప్రతిపాలకః ।**
**శరణ్యోఽసి సదానంత్య స్సర్వేషాం ప్రాణినాం ప్రభో ॥**
**నమస్తే భగవన్ రుద్ర భాస్కరామిత తేజసే ।**
**నమో భవాయ దేవాయ రసాయాంబు మయాయతే ॥**

**తా॥** ఓం, వషట్, హంత, స్వధా అను యజ్ఞోపయోగి వేద శబ్దములు నీ స్వరూపమే. సర్వ క్రతువులను ప్రవర్తిల్లచేయు వాడవు నువ్వే. హవ్యం (దేవతలకర్పించే అన్నం) కవ్యం (పితృదేవతల కర్పించే అన్నం) ఈ రెంటిని భుజించేది నువ్వే. అలాటి నువ్వు యజ్ఞాన్ని ఎలా భంగపరచావు? ఓ మహాదేవా! వేదస్వరూపుడవైన నువ్వు యజ్ఞాన్ని ఎట్లా ధ్వసం చేశావు? హే విభో! బ్రాహ్మణులను, గోవులను మరియు ధర్మాన్ని రక్షించేది నువ్వే! ప్రభూ! సత్స్వరూపుడు అనంతుడు అగు నువ్వు సర్వ ప్రాణులకు శరణ్యుడవు. ఓ రుద్రా! సూర్యుని కంటె అధిక తేజస్సుకలవాడు, జగద్రూపుడు, ప్రకాశ స్వరూపుడు, జలములలోని రసతన్మాత్ర స్వరూపుడు అగు నీ కొరకు నమస్కారం.

**శ్లో॥ శర్వాయ క్షితిరూపాయ సదా సురభిణే నమః ।**
**రుద్రాయాగ్ని స్వరూపాయ మహా తేజస్వినే నమః ॥**
**ఈశాయ వాయవే తుభ్యం సంస్పర్శాయ నమో నమః ।**
**పశూనాం పతయే తుభ్యం యజమానాయ వేధసే ॥**
**భీమాయ వ్యోమ రూపాయ శబ్ద మాత్రాయ తే నమః ।**
**మహా దేవాయ సోమాయ ప్రవృత్తాయ నమోఽస్తుతే ॥**
**ఉగ్రాయ సూర్యరూపాయ నమస్తే కర్మయోగినే ।**
**నమస్తే కాలకాలాయ నమస్తే రుద్ర మన్యవే ॥**

**తా॥** గంధ గుణం నిత్యంగా గల పృథివీ స్వరూపమైన శర్వునకు నమస్కారం. మహా తేజశ్శాలి, అగ్ని స్వరూపుడు అగు రుద్రునకు నమస్కారం. ఈశా! స్పర్శ గుణము గల వాయువు నీ స్వరూపం. నీకు అనేక నమస్కారాలు. సర్వ ప్రాణులకు ప్రభువు, యజమాన

స్వరూపుడు, సృష్టి కర్త అగు నీకు నమస్కారం. శబ్ద గుణకమగు ఆకాశం స్వరూపంగా గల భీమునకు నమస్కారం. ఉమాదేవితో కూడి జగత్తును రక్షించే మహా దేవుడవగు నీకు నమస్కారం. భయంకరమైన వాడు, సూర్య రూపుడు, కర్మయోగి అగు నీకు నమస్కారం. మృత్యువునకు మృత్యువైన నీకు నమస్కారం. హే రుద్రా! నీ కోపానికి నమస్కారం.

**శ్లో॥ నమశ్శివాయ భీమాయ శంకరాయ శివాయతే ।**
**ఉగ్రోఽసి సర్వ భూతానాం నియంతా యచ్ఛివోఽసి నః ॥**
**మయస్కరాయ విశ్వాయ బ్రహ్మణేహ్యార్తి నాశినే ।**
**అంబికా పతయే తుభ్యముమాయాః పతయే నమః ॥**
**శర్వాయ సర్వ రూపాయ పురుషాయ పరాత్మనే ।**
**సదసద్వ్యక్తి హీనాయ మహతః కారణాయతే ॥**
**జాతాయ బహుధా లోకే ప్రభూతాయ నమో నమః ।**
**నీలాయ నీలరుద్రాయ కద్రుద్రాయ ప్రచేతసే ॥**
**మీఢుష్టమాయ దేవాయ శిపివిష్టాయ తే నమః ।**
**మహీయసే నమస్తుభ్యం హంత్రే దేవారిణాం సదా ॥**

**తా॥** మంగళ స్వరూపుడు, భయంకరాకారుడు, శుభకరుడు అగు నీకు నమస్కారం. నీవు ఉగ్రుడవు, సర్వ ప్రాణులకు అధీశ్వరుడవు, మాకు మంగళముల నిచ్చు వాడవు. కళ్యాణ కరుడు, సర్వ జగద్రూపుడు, పరబ్రహ్మ, ఆపదలను గట్టెక్కించు వాడు, ఉమాపతి అగు నీకు నమస్కారం. ఈశ్వరుడు, దేహమునందు ఆత్మరూపంగా ఉండువాడు, పరమాత్మ, కారణ కార్య భావమునకు అతీతుడు, మహత్తునకు కారణమైన వాడు అగు నీకు నమస్కారం. లోకంలో అనేక రూపాలుగా పుట్టి విస్తరించినవాడు, కంఠమునందు నీలవర్ణం గలవాడు, ప్రశంసనీయుడు, ప్రకృష్ట జ్ఞాన సమేతుడు అగు రుద్రునకు అనేక నమస్కారాలు. భక్తులకు కోర్కెలను వర్షించువాడు, ప్రకాశ స్వరూపుడు, జ్ఞాన ఘనుడు, పరబ్రహ్మ, దేవ శత్రువులను సదా సంహరించువాడు అగు నీకు నమస్కారం.

**శ్లో॥ తారాయ చ సుతారాయ తరుణాయ సుతేజసే ।**
**హరికేశాయ దేవాయ మహేశాయ నమో నమః ॥**
**దేవానాం శంభవే తుభ్యం విభవే పరమాత్మనే ।**
**పరమాయ నమస్తుభ్యం కాలకంఠాయ తే నమః ॥**

**తా॥** ప్రణవ ప్రతిపాద్యుడు, ప్రాణులను తరింపజేయువాడు, నిత్య యువకుడు, తేజశ్శాలి, వృక్షములే కేశములుగా కలవాడు, ప్రకాశ స్వరూపుడు అగు మహేశ్వరునకు నమస్కారాలు. దేవతలకు మంగళములనిచ్చు వాడు, సర్వవ్యాపి, పరమాత్మ, సర్వోత్కృష్టుడు, నీలకంఠుడు అగు నీకు పునః పునః నమస్కారాలు.

**శ్లో॥ హిరణ్యాయ పరేశాయ హిరణ్య వపుషే నమః ।**
**భీమాయ భీమరూపాయ భీమకర్మ రతాయ చ ॥**
**భస్మదిగ్ధ శరీరాయ రుద్రాక్షాభరణాయ చ ।**
**నమో హ్రస్వాయ దీర్ఘాయ వామనాయ నమోఽస్తుతే ॥**
**దూరే వధాయ తే దేవాగ్రే వధాయ నమో నమః ।**
**ధన్వినే శూలినే తుభ్యం గదినే హలినే నమః ॥**
**నానాయుధ ధరాయైవ దైత్యదానవ నాశినే ।**
**సద్యాయ సద్యరూపాయ సద్యోజాతాయ వై నమః ॥**

**తా॥** తేజోమయుడు, తేజోమయమగు దేహము కలవాడు, భయంకరుడు, భయంకరా కారుడు, భయంకరమగు కర్మలయందు అభిరుచి కలవాడు అగు పరమేశ్వరునకు నమస్కారం. భస్మము పూయబడిన శరీరము కలవాడు, రుద్రాక్షలను ఆభరణములుగా ధరించినవాడు, పొట్టివాడు, పొడుగువాడు, వామనావతారుడు అగు నీకు నమస్కారం. ఓ దేవా! దూరాన ఉన్న శత్రువులను మరియు ఎదుట ఉన్న శత్రువులను సంహరించు వాడు, ధనుస్సును, శూలమును, గదను, నాగలిని ధరించిన వాడు అగు నీకు అనేక నమస్కారాలు. అనేక ఆయుధాలను ధరించి దైత్య దానవులను సంహరించువాడు, సత్పురుషులకు ఆశ్రయణీయుడు, సత్పురుషులచే ధ్యానింపబడు దివ్యరూపముకలవాడు స్వయంగా అవ్యక్త స్థితి నుండి వ్యక్త జగత్తుగా ప్రకటమగువాడు అగు నీకు నమస్కారం.

**శ్లో॥ తత్పురుషాయ నాథాయ పురాణ పురుషాయచ ।**
**పురుషార్థ ప్రదానాయ వ్రతినే పరమేష్ఠినే ॥**
**వామాయ వామరూపాయ వామ నేత్రాయతే నమః ।**
**అఘోరాయ పరేశాయ వికటాయ నమో నమః ॥**
**ఈశానాయ నమస్తుభ్య మీశ్వరాయ నమో నమః ।**
**బ్రహ్మణే బ్రహ్మరూపాయ నమస్సాక్షాత్పరాత్మనే ॥**

**ఉగ్రోఽసి సర్వదుష్టానాం నియంతాసి శివోఽసి నః ।**
**కాలకూటాశినే తుభ్యం దేవాద్యవన కారిణే ॥**

**తా॥** 'తత్త్వమసి' ఇత్యాది మహా వాక్యములచే ప్రతిపాదింపబడు ఉపనిషద్ పురుషుడు, జగన్నాథుడు, సనాతనుడు, పురుషార్థముల నిచ్చువాడు, వ్రతనిష్ఠుడు, పరమేష్ఠి స్వరూపుడు అగు నీకు నమస్కారం. సుందరుడు, సుందరాకారుడు, సుందరమగు నేత్రములు కలవాడు, అఘోరుడు మరియు ఘోరుడు, పరమేశ్వరుడు అగు నీకు నమస్కారం. సర్వ జగన్నియంత, చతుర్ముఖ బ్రహ్మరూపుడు, పరబ్రహ్మ, సాక్షాత్ పరమాత్మ, ఈశానుడు అగు నీకు అనేక నమస్కారాలు. నీవు ఉగ్రుడవై దుష్టుల నందరిని దండిస్తావు. మాకు శుభాలనిస్తావు. కాలకూట విషాన్ని భక్షించి దేవతలు మొదలగు వారిని రక్షించిన నీకు నమస్కారం.

**శ్లో॥ వీరాయ వీరభద్రాయ క్షర ద్వీరాయ శూలినే ।**
**మహాదేవాయ మహతే పశూనాం పతయే నమః ॥**
**వీరాత్మనే సువిద్యాయ శ్రీకంఠాయ పినాకినే ।**
**నమోఽనంతాయ సూక్ష్మాయ నమస్తే మృత్యు మన్యవే ॥**
**పరాయ పరమేశాయ పరాత్పర తరాయతే ।**
**పరాత్పరాయ విభవే నమస్తే విశ్వ మూర్తయే ॥**
**నమో విష్ణు కళత్రాయ విష్ణుక్షేత్రాయ భానవే ।**
**భైరవాయ శరణ్యాయ త్ర్యంబకాయ విహారిణే ॥**

**తా॥** వీరుడు, వీరభద్రస్వరూపుడు, శత్రు వీరులను నశింప చేయువాడు, శూలధారి, మహాత్ముడు, పశు (జీవ) పతి అగు మహాదేవునకు నమస్కారం. సర్వ విద్యా ప్రవర్తకుడు, విషకంఠుడు, పినాకమను ధనుస్సును ధరించినవాడు, అనంతుడు, సూక్ష్మరూపుడు, మృత్యు రూపమగు కోపము గలవాడు అగు నీకు నమస్కారం. శ్రేష్ఠమగు వాటన్నింటి కంటె శ్రేష్ఠుడు, తనకంటె పరము లేనివాడు, సర్వవ్యాపి, విశ్వమూర్తి, పరమేశ్వరుడు అగునీకు నమస్కారం. విష్ణువు యొక్క అంశ పత్నిగా గలవాడు, విష్ణువు క్షేత్రముగా గల క్షేత్రజ్ఞుడు, సూర్యరూపుడు, భైరవుడు, శరణాగతి చేయతగినవాడు, లీలా విహారి అగు ముక్కంటికి నమస్కారం.

**శ్లో॥ మృత్యుంజయాయ శోకాయ త్రిగుణాయ గుణాత్మనే ।**
**చంద్ర సూర్యాగ్నినేత్రాయ సర్వకారణ సేతవే ॥**

**భవతాహి జగత్సర్వం వ్యాప్తం స్వేనైవ తేజసా ।**
**పరబ్రహ్మ నిర్వికారీ చిదానందః ప్రకాశవాన్ ॥**
**బ్రహ్మ విష్ణింద్ర చంద్రాది ప్రముఖాస్సురాః ।**
**మునయశ్చాపరే త్వత్తస్సంప్రసూతా మహేశ్వర ॥**
**యతోబిభర్షి సకలం విభజ్య తనుమష్టధా ।**
**అష్టమూర్తి రితీశశ్చ త్వమాద్యః కరుణామయః ॥**

**తా॥** శోక స్వరూపుడు, సత్త్వరజస్తమోగుణ స్వరూపుడు, చంద్రసూర్యాగ్నులు కన్నులుగా గలవాడు, సర్వమునకు కారణమగు ధర్మము తన రూపంగా గలవాడు అగు మృత్యుంజయునకు నమస్కారం. నీవు నీ తేజస్సుచే జగత్తు నంతను వ్యాపించి ఉన్నావు. నీవు ఏ వికారాలు లేని, చిదానంద స్వరూపమైన, ప్రకాశ రూపముగు పరబ్రహ్మవు. ఓ మహేశ్వరా! బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు, చంద్రుడు మొదలైన దేవతలు, మునులు, ఇతరులు నీనుండి పుట్టారు. నువ్వు నీ శరీరాన్ని ఎనిమిది భాగాలుగా విభజించి సర్వ జగత్తును ధరించి ఉన్న అష్టమూర్తివి. ఈశ్వరుడవు, నీవు ఆద్యుడవు, కరుణామూర్తివి.

**శ్లో॥ త్వద్భయాద్వాతి వాతోఽయం దహత్యగ్నిర్భయాత్తవ ।**
**సూర్యస్తపతి తే భీత్యా మృత్యుర్ధావతి సర్వతః ॥**
**దయాసింధో మహేశాన ప్రసీద పరమేశ్వర ।**
**రక్షరక్ష సదైవాస్మాన్ యస్మాన్నష్టాన్ విచేతసః ॥**
**రక్షితాస్సతతం నాథ త్వయైవ కరుణానిధే ।**
**నానాపద్భ్యోవయం శంభో తథైవాద్య ప్రపాహి నః ॥**
**యజ్ఞస్యోద్ధరణం నాథ కురు శీఘ్రం ప్రసాదకృత్ ।**
**అసమాప్తస్య దుర్గేశ దక్షస్య చ ప్రజాపతేః ॥**

**తా॥** నీ భయంచే ఈ గాలి వీస్తోంది. నీ భయంచేతనే అగ్ని దహిస్తోంది. నీ భయం చేతనే సూర్యుడు తపిస్తున్నాడు. మృత్యువు అంతటా పరుగు లెత్తుతోంది. ఓ దయా సముద్రా! మహేశ్వరా! పరమేశ్వరా! కరుణించు. జ్ఞానాన్ని కోల్పోయిన మమ్ములను ఉద్ధరించు. హే నాథా! కరుణానిధీ! నువ్వు మమ్మల్ని ఎల్ల వేళలా ఆపదల నుండి రక్షించావు. హే శంభో! ఈ రోజున కూడా ఆ విధంగానే రక్షించు. నాథా! వెంటనే అనుగ్రహించి సమాప్తం కాని యజ్ఞాన్ని ఉద్ధరించు. దక్ష ప్రజాపతిని కూడా అనుగ్రహించు.

దేవతలీ విధంగా మంత్రపూతమైన వాక్కులచే రుద్రుని మహిమను వేనోళ్ళ స్తుతించి ఇంకా ఇలా వరదానాన్ని ఇమ్మని కోరారు. శంకరా! భగునకు నేత్రములు లభించు గాక! యజమానుడైన దక్షుడు జీవించు గాక! పూషకు దంతములు మొలకెత్తు గాక! భృగు మహర్షికి పూర్వము వలెనే గడ్డము, మీసములు వచ్చుగాక! ఓ శంకరా! నీ ఆయుధములచే, రాళ్ళచే విరుగ గొట్టబడిన అవయవములు గల దేవతలు మొదలగు వారందరికి నీ అనుగ్రహంచే ఆరోగ్యం అన్నివేళలా సమకూరు గాక! మిగిలిన యజ్ఞ కర్మలో నీకు పూర్ణ భాగం లభించు గాక! రుద్రునకు భాగం గల యజ్ఞమే పరిపూర్ణ మవుతుంది అట్లు కాని యజ్ఞం ఎన్నటికి పరిపూర్ణం కాదు. ఇలా ప్రార్థించి ఆ బ్రహ్మ, విష్ణువులు చేతులొగ్గి భూమిమీద దండం వలె పడి, నమస్కరించి క్షమాపణలను చెప్పుకొన్నారు.

**శివుడు దక్షుని బ్రతికించుట**

కరుణా సముద్రుడైన పరమేశ్వరుడు వాళ్ళందరిని ఓదార్చి గొప్ప అనుగ్రహంతో ఇలా అన్నాడు. "ఓ దేవ శ్రేష్ఠులారా! నేను యథార్థాన్ని చెపుతున్నాను. సావధానంగా వినండి. మీరు నాపై చూపిన కోపాన్ని సహించాను. బాలురు చేసిన పాపాలను నే పట్టించుకోను. వారి బాల్యాన్ని మాత్రమే పరిగణిస్తాను. వారు నా మాయాకృష్టులై ఉంటారు కనుక దండాన్ని ప్రయోగించను. దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసింది నేను కాదు. ఇతరుల అభివృద్ధిని చూచి ఓర్వలేని వాడు, ద్వేషించే వాడు తానే స్వయంగా భ్రష్టుడవుతాడు. కనుక ఇతరుల ఉన్నతిని చూచి అసూయ పడరాదు. ద్వేషించరాదు. శిరస్సును కోల్పోయిన దక్షుడు మేక తలను పొందుగాక!

భగుడు మిత్రుని నేత్రంతో యజ్ఞభాగాన్ని దర్శించగలడు. పూషన్ అను దేవతకు దంతములు పోయాయి గదా! ఆయన యజమానుని దంతాలతో మెత్తని పిండి రూపంలో ఉన్న యజ్ఞభాగాన్ని భక్షించగలడు. భృగు మహర్షి మేక యొక్క గడ్డాన్ని పొందగలడు. దేవతలందరూ తమ తమ అవయవాలను యథాపూర్వంగా పొందగలరు. ఇతర ఋత్విక్కులు అశ్వినీ దేవతల బాహువులతో, పూషన్ యొక్క హస్తాలతో యజ్ఞ కార్యాలను చక్కపెట్టగలరు. మీ సంతోషం కొరకే నేనీ కట్టడిని చేశాను.

శంకరుని దయకు దేవతలంతా 'సాధు! సాధు' అని ఆనందంతో అరిచారు. సకల దేవతా ప్రార్థితుడై శంకరుడు ముందు నడవగా, దేవతలందరు ఆయన ననుసరించి దక్షయజ్ఞవాటికను చేరారు. వీరభద్రుడు యజ్ఞాన్ని ధ్వంసం చేసిన తీరును రుద్రుడు స్వయంగా చూచాడు. యజ్ఞశాల చాలా బీభత్సంగా ఉంది. స్వాహా, స్వధా, పూషన్, తుష్టి, ధృతి,

సరస్వతి, ఋషులు, పితృదేవతలు, అగ్నులు యజ్ఞ సందర్శనార్థం వచ్చిన యక్ష గంధర్వ రాక్షసాదులు ఇంకా ఎంతో మంది వికలాంగులై పడి ఉన్నారు. కొందరు మరణించారు.

అలా దయనీయంగా ఉన్న దృశ్యాన్ని చూచి రుద్రుడు వీరభద్రుని పిలిచి "ఓ మహాబాహో! నువ్వెట్టి కర్మను చేశావో చూడు! వీరందరి పైన కఠిన దండాన్ని అమలు చేశావు. దక్షుడు విలక్షణమైన యజ్ఞాన్ని చేసి తత్ఫలాన్ని పొందాడు. అతణ్ణి వెంటనే తీసికొనిరా." అని ఆజ్ఞాపించాడు. వీరభద్రుడు వెంటనే దక్షుని మొండేన్ని తెచ్చి శంభుని ఎదుట ఉంచాడు. తలలేని మొండేన్ని చూచి 'తల ఎక్కడ' అని రుద్రుడు ప్రశ్నించగా "ప్రభువా! ఆ సమయంలో దానిని అగ్నిహోత్రంలో హోమం చేసాను" అని సమాధానమిచ్చాడు వీరభద్రుడు. శివాజ్ఞచే దక్షప్రజాపతికి యజ్ఞపశువు యొక్క శిరస్సును సంధానం చేశారు దేవతలు. శంకరుని కృపాదృష్టి దక్షుని దేహంపై ప్రసరించగానే నిద్రనుండి లేచిన వాని వలె లబ్ధ ప్రాణుడయ్యాడు. తక్కిన భృగ్వాది దేవతలంతా స్వస్థులయ్యారు.

పునర్జీవితుడైన దక్షుడు శివావలోకనంతో నిర్మలాంతః కరణుడై క్షమాపరాధ స్తోత్రాన్ని పఠిద్దామనుకొన్నాడు. కాని మృతురాలైన కుమార్తె స్మరణకు రావటంతో అతని కంఠం గద్గదమైంది. కొంత సేపటికి తేరుకొని లజ్జాసమన్వితుడై, తుష్టుడై లోక శంకరుడైన శంకరునకు ప్రణతులు చేసి ఇలా స్తుతించాడు.

**శ్లో॥ నమామి దేవం వరదం వరేణ్యం మహేశ్వరం జ్ఞాననిధిం సనాతనమ్ ।**
**నమామి దేవాధిపతీశ్వరం హరం సదా సుఖాఢ్యం జగదేక బాంధవమ్ ॥**
**నమామి విశ్వేశ్వర విశ్వరూపం పురాతనం బ్రహ్మ నిజాత్మరూపమ్ ।**
**నమామి శర్వం భవ భావభావం పరాత్పరం శంకర మానతో౽స్మి ॥**
**దేవదేవ మహాదేవ కృపాంకురు నమో౽స్తుతే ।**
**అపరాధం క్షమస్వాద్య మమ శంభో కృపానిధే ॥**

**తా॥** వరముల నిచ్చువాడు, సర్వశ్రేష్ఠుడు, జ్ఞాన సముద్రుడు, సనాతనుడు, దేవ ప్రభువులకు ప్రభువు, పాపాలను హరించువాడు, సర్వదా సుఖ స్వరూపుడు, ప్రాణులకు ఏకైక బంధువు అగు మహేశ్వరునికి నమస్కరిస్తున్నాను. జగత్తునకు అధీశ్వరుడు, జగత్స్వరూపుడు, పురాతనుడు, పరబ్రహ్మయే స్వీయ ఆత్మగా గలవాడు, ప్రాణులను సంహరించు వాడు, జగత్తులోని పదార్థముల ఉనికికి ఆధారమైన వాడు, పరాత్పరుడు ఐన శంకరునికి నమస్కరిస్తున్నాను. ఓ దేవదేవా! మహాదేవా! దయను చూపు. నీకు నమస్కారం శంభో! దయానిధీ! నే చేసిన అపరాధాన్ని క్షమించు.

**శ్లో॥ అనుగ్రహః కృతస్తే హి దండవ్యాజేన శంకర ।**
**ఖలోఽహం మూఢధీర్దేవ జ్ఞాతం తత్త్వం మయా న తే ॥**
**అద్య జ్ఞాతం మయా తత్త్వం సర్వోపరి భవాన్మతః ।**
**విష్ణు బ్రహ్మాదిభిస్సేవ్యో వేదవేద్యో మహేశ్వరః ॥**
**సాధూనాం కల్పవృక్షస్త్వం దుష్టానాం దండధృక్ సదా ।**
**స్వతంత్రః పరమాత్మా హి భక్తాభీష్ట వరప్రదః ॥**
**విద్యా తపోవ్రతధరాన సృజః ప్రథమం ద్విజాన్ ।**
**ఆత్మతత్త్వం సమావేత్తుం ముఖతః పరమేశ్వరః ॥**
**సర్వాపద్భ్యః పాలయితా గోపతిస్తు పశూనివ ।**
**గృహీత దండో దుష్టాంస్తాన్ మర్యాదా పరిపాలకః ॥**

**తా॥** హే శంకరా! నువ్వు నన్ను దండించే మిషతో అనుగ్రహాన్నే చూపావు! దేవా! నేను దుష్టుణ్ణి! మూర్ఖుణ్ణి! నీ తత్త్వాన్ని తెలుసుకో లేకపోయాను. ఇప్పుడు తెలుసుకొన్నాను. నువ్వు అందరికి పైవాడవు. విష్ణు బ్రహ్మాదులు నిన్ను సేవిస్తారు. కల్పవృక్షం వంటి వాడవు. దుష్టులను దండిస్తావు. స్వతంత్రుడవు. భక్తాభీష్ట వరప్రదుడవు, పరమేశ్వరుడవైన నువ్వు నీ ఆత్మ తత్త్వాన్ని లోకంలో ప్రవర్తిల్ల చేయటం కొరకు విద్య, తపస్సు మాత్రమే ప్రధానంగా ఆచరించే బ్రాహ్మణులను నీ ముఖం నుండి సృష్టించావు. పశువుల కాపరి పశువులను పాలించే తీరున నీ భక్తులను రక్షిస్తావు. నువ్వు మర్యాదా పాలకుడవు. దుష్టులపై దండ ప్రయోగం చేస్తావు.

**శ్లో॥ మయా దురుక్త విశిఖైః ప్రవిద్ధః పరమేశ్వరః ।**
**అమరానతి దీనాశాన్ మదనుగ్రహ కారకః ॥**
**స భవాన్ భగవాన్ శంభో దీనబంధో పరాత్పరః ।**
**స్వకృతేన మహోర్వేణ సంతుష్టో భక్తవత్సలః ॥**

**తా॥** నేను దురుక్తులనే బాణాలచే నిన్ను గాయపరచాను. ఐనా నన్ను అనుగ్రహించావు. అలాగే ఈ దేవతలను కూడా అనుగ్రహించు. ఓ దీనబంధూ! శంభో! భక్తవత్సలా! నువ్వు భగవానుడవు! పరాత్పరుడవు! నువ్వు సృష్టించుకొన్న ఈ విస్తారమైన జగత్తులో ఆనంద రూపుడవై ఉన్నావు.

ఈ విధంగా దక్ష ప్రజాపతి మహాదేవుని స్తుతించి మౌనాన్ని వహించాడు. అప్పుడు విష్ణువు దోసిలొగ్గి నమస్కరించి బాష్పవారి సంకులమైన నేత్రాలతో డగ్గుత్తికతో ఇలా స్తుతించాడు.

**శ్లో॥ మహాదేవ! మహేశాన! లోకానుగ్రహ కారక ।**
**పరబ్రహ్మ పరాత్మా త్వం దీనబంధో దయానిధే ॥**
**సర్వవ్యాపీ స్వైరవర్తీ వేదవేద్యయశాః ప్రభో ।**
**అనుగ్రహః కృతస్తేన కృతాశ్చా సుకృతా వయమ్ ॥**
**దక్షోఽయం మమ భక్తస్త్వాం యన్నినింద ఖలః పురా ।**
**తత్క్షంతవ్యం మహేశాద్య నిర్వికారో యతో భవాన్ ॥**
**కృతో మయాపరాధోఽపి తవ శంకర మూఢతః ।**
**త్వద్గణేన కృతం యుద్ధం వీరభద్రేణ పక్షతః ॥**
**త్వం మే స్వామీ పరబ్రహ్మ దాసోఽహం తే సదాశివ ।**
**పోష్యశ్చాపి స దాతే హి సర్వేషాం త్వం పితాయతః ॥**

**తా॥** ఓ మహాదేవా! మహేశ్వరా! లోకానుగ్రహ కారకా! దీనబంధో! దయానిధీ! పరబ్రహ్మవు, పరమాత్మవు నీవే! హే ప్రభో! సర్వవ్యాపి, యథేచ్ఛా సంచారి వేదములచే తెలియదగిన యశస్సుగలవాడు అగు నువ్వు అనుగ్రహాన్ని చూపావు. మేం పాపాలను చెయ్యటానికి ఈ దక్షుడు ప్రేరకుడయ్యాడు. ఈతడు దుష్టుడు. నిన్ను నిందించాడు. నువ్వు నిర్వికారుడవు. ఆ దోషాన్ని మన్నించు. శంకరా! అజ్ఞానంచే నేను కూడా నీయందు అపరాధం చేశాను. నా భక్తుడైన దక్ష పక్షపాతినై నీగణాధ్యక్షుడైన వీరభద్రునితో యుద్ధం చేశాను. నాకు స్వామివి, పరబ్రహ్మవు నీవే. ఓ సదాశివా! నేను నీ దాసుణ్ణి! నువ్వు అందరికి తండ్రివి. నన్ను కూడా సర్వదా రక్షించు.

ఆ తరువాత పితామహుడైన బ్రహ్మ సముచితంగా ఇలా ప్రార్థించాడు. "ఓ దేవదేవ! కరుణా సాగర! నువ్వు స్వతంత్రుడవు, పరమాత్మవు, అద్వితీయుడవు, అవ్యయుడవు. నీకు జరిగిన అవమానాన్ని లెక్కించకుండ నా కుమారునిపై అనుగ్రహాన్ని చూపించావు. ఈ యజ్ఞం ఇలా అసంపూర్ణంగా మిగిలి పోవడం లోకక్షేమ హేతువు కాజాలదు. కనుక దీనిని ఉద్ధరించి పరిసమాప్తిని చెయ్యి. ప్రసన్నుడవై శాపాలను నిరాకరించు. అంతర్యామి స్వరూపుడవైన నువ్వే ప్రేరకుడవు. నివారకుడవు నీవే.

ఆ తరువాత ఇంద్రాది దిక్పాలకులు, బృందారకులు, సిద్ధులు, ఋషులు, ప్రజాపతులాదిగా సర్వమైన సృష్టి, లోక శంకరుడైన శంకరుని ముందు మోకరిల్లి పరాభక్తితో నమస్కరించి స్తుతించారు.

**దక్షయజ్ఞ పరిసమాప్తి**

మునులారా! వారి స్తోత్రాలకు ప్రీతుడైన మహాదేవుడు దక్షునితో ఇలా ప్రసన్నంగా పలికాడు. ఓ దక్ష ప్రజాపతీ! నేను స్వతంత్రుడనైనప్పటికీ నిత్యము నా భక్తుల వశంలో ఉంటాను. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని ఈ నాలుగు విధాల భక్తులు నన్ను సదా సేవిస్తూంటారు. ఇందులో జ్ఞాని నాకత్యంత ప్రీతిపాత్రుడు. నా స్వరూపమే అని శ్రుతులు చెపుతున్నాయి. ఉపనిషత్తుల తాత్పర్యాన్ని తెలుసుకొన్న జ్ఞానులు ఆత్మజ్ఞుడనైన నన్ను జ్ఞానం చేతనే పొందుతారు. కర్మాధీనులగు మానవులు వేదములచేగాని, యజ్ఞములచేగాని, తపస్సుచేగాని, దానములచేగాని నన్ను పొందలేరు. నువ్వు కేవలం కర్మ చేతనే సంసారాన్ని తరింపగోరేవు. అందువల్లనే నేను కోపినై నీ యజ్ఞాన్ని ధ్వంసం చేశాను. దక్షా! ఈనాటి నుండి నన్ను పరమేశ్వరునిగా ఎరిగి, బుద్ధిని జ్ఞానార్జన యందు లగ్నం చేసి శ్రద్ధతో కర్మానుష్ఠానం చెయ్యి.

ఓ దక్షా! మరొక్కమాట మంచి బుద్ధితో విను. నేను నా సగుణ స్వరూపానికి సంబంధించిన విషయాన్ని ధర్మ వృద్ధికై నీకు చెపుతున్నాను. నేనే బ్రహ్మ, విష్ణు రూపుడనై జగత్తుకు పరమ కారణ మవుతున్నాను. నేను ఆత్మను, ఈశ్వరుడను, ద్రష్టను, స్వయం ప్రకాశుడను. అట్టి నేను నా మాయను స్వాధీనంలో ఉంచుకొని జగత్తు యొక్క సృష్టి స్థితి లయములను చేస్తూ ఆయా క్రియలకు ఉచితమైన నామములను ధరిస్తున్నాను. అద్వితీయము, ఆత్మరూపము, ఏకము ఐన పరబ్రహ్మ యందు బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు అనే భేదాలు లేవు. మానవుడు తన దేహ సంబంధమైన అవయవాల విషయంలో భేద బుద్ధిని కలిగి ఉండటం లేదు గదా! ఆ విధంగానే జ్ఞాని యైన నా భక్తుడు ప్రాణుల విషయంలో భేదబుద్ధిని కలిగి ఉండడు. సర్వప్రాణుల ఆత్మలు ఒక్కటే, అనే భావనతో త్రిమూర్తుల యందు భేదభావాన్ని ఎవడు కలిగి ఉండడో వాడు శాంతిని పొందుతాడు.

ఓ ప్రజాపతీ! సృష్టి తత్త్వాన్ని అర్థం చేసికొన్న వాడికే బ్రహ్మ తత్త్వం అర్థమవుతుంది. స్థితి స్వరూపాన్ని అవగతం చేసికొన్న వానికే విష్ణుతత్త్వం గోచరిస్తుంది. సృష్టి, స్థితులు రెండూ నాయందు లీనమవుతున్నాయి. కనుక బ్రహ్మ, విష్ణువులిద్దరు నాయందే ఉన్నారని శ్రుతులు బోధిస్తున్నాయి. నేను లయం చెయ్యలేని సృష్టిని బ్రహ్మను చెయ్యమను. అలాగే

నేను నాశనం చెయ్యకుండా విష్ణువును స్థితిని రక్షించమను. అసంభవం, దక్షా! ప్రళయకాలమందు సర్వసృష్టి నాయందు లీనమై నాలో సురక్షితంగా ఉంటుంది. నేను త్రిమూర్త్యాత్మకుడను.

సుఖకరము, శాంతి దాయకము ఐన పరమేశ్వరుని వచనాలను విని అక్కడి వారంతా ప్రీతులయ్యారు. దక్షుడు శివానుగ్రహంచే యజ్ఞ పరిసమాప్తిని చేసి కృతార్థుడయ్యాడు. అతడు పూర్ణభాగాన్ని శంకరునకిచ్చి, శంకరానుమతితో దేవతలకు వారి వారి భాగాలను ఇచ్చాడు. ఋషులకు, మునులకు, బ్రాహ్మణులకు అనేక దానాలను సమర్పించాడు.

ఆకాశ గంగాప్రవాహంలో ప్రతిఫలించే నిండుపున్నమ వెన్నెల వంటి శంకరుని స్వచ్ఛమైన కీర్తిని గానం చేసికొంటూ, దేవతలంతా స్వస్థానాలకు చేరుకొన్నారు. శంకరుడు కైలాసానికి కదిలాడు. ఆ ప్రభువు లోకరీతిగా తన గణాధ్యక్షులతో దక్షయజ్ఞ వృత్తాంతాన్ని ముచ్చటిస్తూ, సతీ విరహాన్ని ప్రకటిస్తూ చిరకాలం గడిపాడు.

మునులారా! మీకింత వరకు శివ మహా పురాణంలో రుద్రసంహితలోని సృష్టి ఖండాన్ని బ్రహ్మ నారదునికి చెప్పినరీతిగా సవిస్తరంగా వివరించి చెప్పాను. సతీదేవి హిమవంతుని భార్యయైన మేనాదేవి గర్భాన పార్వతియై జన్మించి, తపస్సు చేసి పరమేశ్వరుని పతిగా పొందిన పవిత్ర వృత్తాంతాన్ని ముందు చెప్పబోయే పార్వతీ ఖండంలో వివరిస్తాను.

పరమాద్భుతము, పవిత్రము, పరమ పావనము, దివ్యము ఐన ఈ సతీ వృత్తాంతాన్ని ఎవరైతే భక్తి, శ్రద్ధలతో చదువుతారో, వింటారో వారు ఈశ్వరానుగ్రహ పాత్రులై ఇష్టకామ్యార్థాలను పొంది శివసాయుజ్యాన్ని పొందుతారు."

**శివమహా పురాణంలో రెండవదైన రుద్ర సంహితయందు రెండవదైన**

**సతీ ఖండంలో దక్ష యజ్ఞ పరిసమాప్తి ముగిసినది.**

**శ్రీ సాంబసదాశివార్పణమస్తు**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## రుద్ర సంహిత – పార్వతీ ఖండం



### హిమవంతుని వివాహం

సూతమహర్షి పార్వతీ ఖండాన్ని మునులకిలా చెప్పసాగాడు: "మునులారా! తదనంతర గాథను వినండి. భరత ఖండానికి ఉత్తర దిక్కున 'హిమవాన్' అని ప్రసిద్ధిగాంచిన పర్వతం ఉంది గదా! దానికి స్థావరము (స్థిరమైనది) జంగమము (నడిచేది) అను రెండు రూపాలున్నాయి. ఇందులో సూక్ష్మ రూపమైన ఆత్మగాథను వివరిస్తాను. ఆ పర్వతం తూర్పు పశ్చిమ సముద్రాల వరకు వ్యాపించి భూమిని కొలిచే మానదండమా అన్నట్లుంటుంది. అది శివునకు ప్రియమైనది. తక్కిన దేవ జాతులన్ని ఆ పర్వతాన్నే ఆశ్రయించుకొని దాన్నే సేవిస్తూ ఉంటారు. దానిమీద తపస్సు చేసిన వారికి సిద్ధి నిశ్చయం. అది విష్ణ్వాంశచే ఉద్భవించింది.

ఆ పర్వతుడు కులాన్ని ఉద్ధరించి పితృదేవతల ఋణాన్ని తీర్పగోరి వివాహమాడ సంకల్పించాడు. ఆ సమయంలో దేవతలు ప్రకాశరూపులైన పితృదేవతలను సమీపించి ఇలా ప్రార్థించారు. "ఓ పితృదేవతలారా! బుద్ధిమంతుడైన హిమవంతుడు వివాహం చేసుకొనే ఉద్దేశంలో ఉన్నాడు. మంగళ స్వరూపురాలైన మీ జ్యేష్ఠ కుమార్తె మేనను అతనికిచ్చి వివాహం జరిపించండి. దాని వల్ల దేవకార్యము, లోకహితము కూడా సిద్ధిస్తుంది. దేవతల హితోపదేశాన్ని సావధానంగా విని కుమార్తెల శాపాన్ని స్మరించి మేనాదేవిని హిమవంతునకిచ్చి విధి విధానంగా వివాహాన్ని జరిపించారు పితృదేవతలు. దేవతలు, మునులు ప్రీతిపురస్సరంగా వచ్చి, అనేక బహుమానాల నిచ్చి నూతన దంపతులను ఆశీర్వదించారు. హిమవంతుడు మేనా దేవిని ఇంటికి తెచ్చుకొని ఇష్టక్రీడా వినోదాలతో సుఖిస్తున్నాడు."

## సనత్కుమారుని శాపము

సూతుడు మునులకిలా చెప్పసాగేడు. "మునులారా! మేనాదేవి జన్మ వృత్తాంతాన్ని, శాపగాథను చెపుతున్నాను వినండి. బ్రహ్మమానస పుత్రుడైన దక్ష ప్రజాపతి తన అరవైమంది కుమార్తెల లోను స్వథ అను పేరుగల ఆమెను పితృదేవతలకిచ్చి వివాహం చేశాడు. ఆమెకు సుందరీమణులు, ధర్మమూర్తులు ఐన మేన, ధన్య, కలావతి అనే ముగ్గురు కుమార్తెలు సంతానం కలిగారు. వీరు అయోనిజలు.

ఒకనాడా ముగ్గురు విష్ణు సందర్శనానికై శ్వేత ద్వీపానికి వెళ్ళారు. వెళ్ళి సభా మధ్యమందున్న శ్రీహరిని సందర్శించి అతని ఆజ్ఞచే ఆసీనలయ్యారు. అదే సమయంలో బ్రహ్మసుతులైన సనకాది సిద్ధులు కూడా వచ్చారు. వారిని చూచి అచటి వారంతా లేచి నిలబడ్డారు. కాని శివమాయా మోహితలైన ఆ ముగ్గురు మాత్రం లేచి నిలబడలేదు. ఆ మాయకే శివ సంకల్పమని, ప్రారబ్ధమని ఇంకా అనేక నామాలున్నాయి.

సనకాదులు జ్ఞానులే ఐనా శివమాయా మోహితులై సక్రోధులై ఆ ముగ్గురు సోదరీ మణులనిలా శపించారు: "ఓ స్వథా పుత్రికలారా! మీరు పితృదేవతల పుత్రికలే ఐనా మీకు వేద ధర్మం బోధపడ లేదనేది నిశ్చయం. మీరు లేచి నిలబడి అభ్యుత్థానాన్ని ఆచరించలేదు. మోహితలైన మీరు పెద్దల విషయంలో చూపిన అమర్యాదకు ఫలంగా స్వర్గానికి దూరమై మానవ శరీరాలను పొంది భూలోకంలో సంచరింతురు గాక! ఇది మీ కర్మఫలం.

శాపోపహతలైన ఆ ముగ్గురు భయంతో మునుల పాదాల మీదపడి పశ్చాత్తాపాన్ని ప్రకటించి శాప విముక్తిని ప్రసాదించ వలసిందిగా ప్రార్థించారు. అప్పుడు సనత్కుమారుడిలా అన్నాడు. "ఓ మంగళ స్వరూపులారా! భయపడకండి! ఈ శాపం మీకు సర్వదా సుఖాలనే ఇస్తుంది. మీలో జ్యేష్ఠురాలైన 'మేన' హిమవంతుని భార్యయై పార్వతీ దేవికి జనని అవుతుంది. రెండవది యోగిని ఐన 'ధన్య' సీరధ్వజుడనే జనకునకు భార్యయై మహా లక్ష్మీ స్వరూపమైన సీతకు తల్లికాగలదు. కనిష్ఠురాలైన ఈ 'కలావతి' ద్వాపర యుగాంత మందు వృషభానుడను వైశ్యునకు పత్నియై రాధాదేవికి మాత కాగలదు.

శాపానంతరం మేన భర్తతో కూడి కైలాసాన్ని, ధన్య భర్తతోను సీతతోను కూడి వైకుంఠాన్ని, కళావతి భర్తతోను, రాధతోను కూడి గోలోకాన్ని పొందుతారు. పార్వతి దుష్కరమైన తపస్సు చేసి శంకరునికి భార్యయై జగన్మాత కాగలదు. సీత దశరథ నందనుడైన రామునకు పత్నియై రామునితో కూడి విహరించగలదు. రాధ కృష్ణునకు ప్రియురాలై రహస్య ప్రణయ మూర్తి కాగలదు. పార్వతి, సీత, రాధ ఈ ముప్పురు వారివారి భర్తల విషయంలో వారనుభవించిన విరహవేదన వారికది తపస్సుగా పరిణమించును గాక!"

ఈ విధంగా పల్కి సనకాదులు అంతర్ధానమయ్యారు.

**దేవీ స్తుతి**

మునులారా! సనత్కుమారుని శాప కారణంగా దక్ష ప్రజాపతి కూతురైన స్వధాదేవికి జన్మించిన మేన హిమవంతుని ఇల్లాలైంది. హిమవంతుడు మేనతో కూడి సకల సౌకర్యాలతో కూడిన గృహంలోను, హిమవత్పర్వత ప్రాంత సుందర వనసీమల యందు హాయిగా వన విహారం చేస్తూ, ఇష్ట కథా వినోదాలతో ప్రొద్దుపుచ్చుతూ ఉండగా ఆ సమయంలో విష్ణ్వాది సకల దేవతలు హిమవంతుని దర్శనానికై వెళ్ళారు. ఆయన వారినందరిని చూచి తన భాగ్యానికి తనే మురిసిపోతూ, ప్రణమిల్లి స్వాగతం పల్కి అతిథి సత్కారాలను నెరవేర్చి నన్ను మీ సేవకునిగా తలచి ఉచిత రీతిలో మీ కార్యానికి ఉపయోగించుకొని ధన్యుణ్ణి చేయండి అని కోరగా వారిలా అన్నారు.

"ఓ హిమవంతా! దక్ష పుత్రియైన సతీదేవి గాథ నీకు తెలుసు. ఆ జగన్మాత దేహాన్ని త్యజించి తన ధామానికి వెళ్ళి పోయింది. ఆ కారణంగా జరగవలసిన ప్రయోజనం సిద్ధించలేదు. ఇప్పుడా లోకమాత, ఉమగా నీ గర్భాన జన్మించి, పరమేశ్వర పత్ని కావలసి ఉంది. అలా జరిగితే దేవతలందరికి లోకాలకు గొప్ప మేలు జరుగుతుంది."

విష్ణువిలా చెప్పి, దానికి అవసరమైన విధివిధానాన్నంతా బోధించాడు. తదుపరి దేవతలంతా అక్కడే నిలబడి ఉమాదేవినిలా స్తుతించారు.

**శ్లో॥ దేవ్యుమే జగతామంబ శివలోక నివాసిని ।**
**సదాశివ ప్రియే దుర్గేత్వాం నమామో మహేశ్వరి ॥**
**శ్రీ శక్తిం పావనాం శాంతాం పుష్టిం పరమ పావనీమ్ ।**
**వయం నమామహే భక్త్యా మహదవ్యక్తరూపిణీమ్ ॥**
**శివాం శివకరాం శుద్ధాం స్థూలాం సూక్ష్మాం పరాయణామ్ ।**
**అంతర్విద్యా సువిద్యాభ్యాం సుప్రీతాం త్వాం నమామహే ॥**
**త్వం శ్రద్ధా త్వం ధృతిస్త్వం శ్రీస్త్వమేవ సర్వగోచరా ।**
**త్వం దీధితి స్సూర్యగతా స్వప్రపంచ ప్రకాశినీ ॥**

**తా॥** ఓ ఉమాదేవీ! జగన్మాతా! దుర్గా! మహేశ్వరీ! సదా శివునకు ప్రియురాలవై శివలోకంలో నివసించే నీకు నమస్కారం. పవిత్రమైనది, శాంతి స్వరూపురాలు, పుష్టిని కలిగించేది, మహత్తు, ప్రకృతి స్వరూపంగా గలది అగు శ్రీ శక్తిని మేము భక్తితో నమస్కరిస్తున్నాం. మంగళ స్వరూపురాలు, మంగళములనిచ్చు నామె, శుద్ధ స్థూల రూపిణి,

సూక్ష్మరూపిణి, సర్వశ్రేష్ఠ లక్ష్యము, అంతర్ముఖత్వముచే మరియు అధ్యాత్మ విద్యచే మిక్కిలి ప్రీతిని పొందునది అగు నీకు నమస్కరిస్తున్నాం. శ్రద్ధ నీవే! ధైర్యం నీవే! సర్వప్రాణులలోని శోభ నీవే! సూర్యుని యందలి ప్రకాశం నీవే! నీ స్వరూపమైన ప్రపంచాన్ని నువ్వే ప్రకాశింప చేస్తున్నావు.

**శ్లో॥ యా చ బ్రహ్మాండ సంస్థానే జగజ్జీవేషు యా జగత్ ।**
**ఆప్యాయయతి బ్రహ్మాది తృణాంతం తాం నమామహే ॥**
**గాయత్రీ త్వం వేదమాతా త్వం సావిత్రీ సరస్వతీ ।**
**త్వం వార్తా సర్వ జగతాం త్వం త్రయీ ధర్మరూపిణీ ॥**
**నిద్రా త్వం సర్వ భూతేషు క్షుధా తృప్తిస్త్వమేవ హి ।**
**తృష్ణా కాంతిశ్ఛవిస్తుష్టి స్సర్వానందకరీ సదా ॥**
**త్వం లక్ష్మీః పుణ్య కర్తౄణాం త్వం జ్యేష్ఠా పాపినాం సదా ।**
**త్వం శాన్తిస్సర్వ జగతాం త్వం ధాత్రీ ప్రాణపోషిణీ ॥**

**తా॥** ఏ దేవి బ్రహ్మాండమే దేహంగా కలిగి ఉందో, బ్రహ్మాండంలోని ప్రాణులన్నిటిలో చలన శక్తి రూపంలో ఉందో, బ్రహ్మ నుండి తృణం వరకు గల సర్వప్రాణులను సంతృప్తి పరుస్తూ ఉన్నదో, అట్టి ఉమాదేవిని నమస్కరిస్తున్నాం. గాయత్రివి నీవే. వేదమాతవు నీవే. సావిత్రివి నీవే. సరస్వతివి నీవే. సర్వ ప్రాణులలో జ్ఞానం నీవే. ధర్మ మూలమగు వేదం నీవే. సర్వప్రాణులయందలి నిద్ర, ఆకలి మరియు తృప్తినీవే. ప్రాణుల యందలి తృష్ణ, కాంతి, సౌందర్యము మరియు తుష్టి నీవే. అందరికి ఆనందాన్ని ఇస్తావు. పుణ్యులకు లభించు లక్ష్మివి నీవే. పాపులకు సంప్రాప్తమయ్యే దారిద్ర్యము నీవే. శాంతివి నీవే, ప్రాణులందరిని పోషించే తల్లివి నీవే.

**శ్లో॥ తత్త్వ స్వరూపా భూతానాం పంచానా మపి సారకృత్ ।**
**త్వంహి నీతి భృతాం నీతిర్వ్యవసాయ స్వరూపిణీ ॥**
**గీతి స్త్వం సామవేదస్య గ్రంథిస్త్వం యజుషాం హుతిః ।**
**ఋగ్వేదస్య తథా మాత్రాథర్వణస్య పరాగతిః ॥**
**సమస్తగీర్వాణ గణస్య శక్తిః**
**తమోమయీధాతృ గుణైక దృశ్యా ।**
**రజః ప్రపంచాత్తు భవైకరూపా**
**యానశ్రుతా భవ్యకరీస్తుతేహ ॥**

**తా॥** పంచభూతాలలోని సారతత్త్వం నీ స్వరూపమే. నీతి శాస్త్రజ్ఞుల మరియు నీతిమంతుల నీతి నీవే. నిశ్చయాత్మకమగు బుద్ధి నీ స్వరూపమే. సామవేద మందలి గీతి నీవే. గ్రంథి నీవే. యజుర్వేదంలోని ఆహుతి నీవే. ఋగ్వేదం యొక్క మాత్ర (ఛందస్సు) నీవే. అధర్వణ వేదం యొక్క పరమగతి నీవే. సమస్త దేవతా బృందాల శక్తి నువ్వే. తమస్సు నువ్వే. రజోగుణ రూపిణి వైన నీ నుండే ఈ ప్రపంచం పుట్టింది. మాకు శుభాలనిచ్చే నిన్ను ఇచట వేద వాక్కులచే స్తుతిస్తున్నాం.

**శ్లో॥ సంసార సాగర కరాల భవాంగ దుఃఖ ।**
**నిస్తారకారి తరణిశ్చ నివీతహీనా ॥**
**అష్టాంగయోగ పరిపాలన కేళిదక్షాం ।**
**వింధ్యాగవాస నిరతాం ప్రణమామతాం వై ॥**
**నాసాక్షివక్త్ర భుజ వక్షసి మానసేచ ।**
**ధృత్యా సుఖాని వితనోషి సదైవ జంతోః ॥**
**నిద్రేతి యాతి సుభగా జగతీ భవానః ।**
**సా నః ప్రసీదతు భవస్థితి పాలనాయ ॥**

**తా॥** సంసార సముద్రంలో పుట్టుట అనే భయంకరమగు దుఃఖాన్ని దాటించే పడవ నీవే. అజ్ఞానావరణ నీకు లేదు. అష్టాంగ యోగ పరిపాలన కేళి దక్షురాలు, వింధ్య పర్వత నివాసిని ఐన ఆ దేవిని గూర్చి నమస్కరిస్తున్నాం. ప్రాణులలో జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల యందు, మనస్సు నందు ఓజో రూపంలో ఉండి మరియు ప్రాణుల హృదయ పుండరీకముల యందు నివసించి వారికి సుఖాన్నిస్తున్నావు. సుందరివైన నువ్వు మా యందు నిద్రారూపంలో ఉన్నావు. అజ్ఞాన రూపంలో ఉన్నావు. అట్టి నువ్వు జగత్తును, మమ్ము కూడా రక్షించు.

**దేవతలకు దుర్గాదేవి ప్రత్యక్షమగుట**

దేవతాస్తుతి ప్రీతురాలైన దుర్గ వారి ఎదుట సాక్షాత్కరించింది. రత్నమయము, దివ్యము, పరమాద్భుతము, కింకిణీజాల సంయుక్తము ఐన రథంపై ఆమె ఆసీనురాలై ఉంది. కోటి సూర్యుల కాంతిని గోటితో మీటేసే తేజోరూపంలో ఉంది. ఆమెను చూచి దేవతలంతా పట్టరాని ఆనందంతో అనేక పర్యాయాలు నమస్కరించి విశేషంగా స్తుతించి ఇలా విన్నవించారు.

"ఓ సదాశివ విలాసినీ! శివలోక నివాసినీ! మహామయా! దుర్గా! త్రిలోక జననీ! సర్వార్తి నాశినీ! శర్వాణీ! కళ్యాణీ! మా మొర ఆలకించు మాతా! నువ్వు పూర్వం సతిగా జన్మించి తండ్రి వలన అనాదరణకు గురై దేహ త్యాగాన్ని చేసి నీ లోకానికి చేరుకొన్నావు. ఆ కారణంగా దేవకార్యం నెరవేరలేదు. నువ్వు తిరిగి భూమియందు అవతరించి శంకర పత్నివై లోకాలకు సుఖాలను ఇయ్యి తల్లీ!"

మహేశ్వరీ దర్శన మహదానందంలో మునిగి పోయిన దేవతలు ఇంతవరకు పలికి ఆపైన నోటమాట రాక అశ్రువులొలుక మౌనంగా ఉండి పోయారు. ఉమాదేవి శంకరుని స్మరించి వారితో ఇలా పలికింది.

"ఓ హరీ! ఓ కమలాసనా! దేవతలారా! వినండి! నేను ప్రసన్నురాలనయ్యాను. దక్షుడు – వీరిణి... వీరు నన్ను పుత్రికగా పొందాలని తపస్సు చేశారు. నా మాయ కారణంగానే నా తండ్రి నాయందు అనాదరాన్ని చూపించాడు. పూర్వం హిమవంతుడు, మేన భక్తితో నన్నారాధించారు. మేనాదేవి గర్భాన నా పూర్ణాంశతో నేను ఆవిర్భవిస్తాను. శంకరునకు అర్ధాంగినవుతాను. మేనను తపస్సు చెయ్యమని ఆదేశించండి. నేను నా దేహత్యాగం చేసిన నాటి నుండి కాలాగ్ని అను పేరుగల నా రుద్ర స్వామి నా విరహంచే దిగంబరుడయ్యాడు. యోగి ఐనాడు. ఆనాటి నుండి మలిన వేషాన్ని ధరించి ఉత్తమ సుఖాలను పరిత్యజించాడు. నా శివ స్వామి జ్ఞానియే ఐనా ఏకాకి ఐన కారణంగా ఎక్కడా శాంతిని పొందలేక పోతున్నాడు. ఆయన నా అస్థికలతో మాలను చేసి దానిని మిక్కిలి ప్రీతితో ధరిస్తున్నాడు.

కాముకుల ప్రవృత్తిని లోకంలో ప్రదర్శించగోరి ఆయనలా లీలలను ప్రకటిస్తున్నాడే గాని పరిపూర్ణుడైన నా శివ స్వామి ఏ వికారమూకలవాడు కాడు. ఆ సర్వజ్ఞునికి మోహకామాదులు ఎక్కడున్నాయి? ఆయన నన్ను పత్నిగా పొందగోరి యోగనిష్ఠలో ఉన్నారు. నేను మేన గర్భాన జనించి తపస్సు చేసి శివుని అర్ధాంగినవుతాను. మీరు మీమీ స్వస్థానాలకు వెళ్ళి శివారాధనను చెయ్యండి!" ఇలా వరమిచ్చి ఆ దేవి అంతర్ధానమైంది.

**మేనాదేవి తపస్సు ఉమ ప్రత్యక్షమగుట**

మునులారా! తదనంతరం విధి, మాధవులిద్దరూ మేనకు తపో విధానాన్ని ఉపదేశించి తపస్సును చెయ్యమని ప్రోత్సహించి స్వస్థానాలకు వెళ్ళి పోయారు. వారి మాట చొప్పున పర్వతరాజు, మేనతో కూడి గొప్ప తపస్సు చేశాడు. సంతాన కాంక్షతో మేన చైత్ర మాసంలో ప్రారంభించి ప్రతి దినము శ్రద్ధతో ఉమాదేవిని ఆరాధించింది. అష్టమి నాడు ఉపవాసముండి నవమి

నాడు బ్రాహ్మణులకు అనేక దానాలిచ్చేది. కేవలం జలాన్ని మాత్రమే త్రాగి తపస్సును తీవ్రతరం చేసింది. ఈ విధంగా ఇరవైఏడు సంవత్సరాలు చేసింది.

ఆమె దీక్షకు ప్రీతురాలై పరమేశ్వరి ప్రత్యక్షమై తన బాహువులతో మేనను ఆలింగనం చేసికోగానే ఆమెకు గొప్ప జ్ఞానం కలిగి చండికనిలా స్తుతించింది.

**శ్లో॥ మహామాయాం జగద్ధాత్రీం చండికాం లోక ధారిణీమ్ ।**
**ప్రణమామి మహాదేవీం సర్వకామార్థ దాయినీమ్ ॥**
**నిత్యానందకరీం మాయాం యోగనిద్రాం జగత్ప్రసూమ్ ।**
**ప్రణమామి సదా సిద్ధాం శుభసారస మాలినీమ్ ॥**
**మాతామహీం సదానందాం భక్తశోక వినాశినీమ్ ।**
**ఆకల్పం వనితానాంచ ప్రాణినాం బుద్ధి రూపిణీమ్ ॥**
**సాత్వం బంధచ్ఛేదహేతుర్యతీనాం ।**
**కస్తేగేయో మాదృశీభిః ప్రభావః ॥**
**హింసాయా వాథర్వ వేదస్య సా త్వం ।**
**నిత్యం కామం త్వం మమేష్టం విధేహి ॥**

**తా॥** మహామాయ, జగత్తును పోషించు తల్లి, లోకములను తనసత్తచే ధరించునది, మహాదేవి, కోర్కెలన్నిటిని తీర్చునది, అగు చండికకు నమస్కరిస్తున్నాను. శాశ్వతమైన ఆనందాన్నిచ్చేది, యోగనిద్రా స్వరూపిణి, జగత్తులను కన్నతల్లి, నిత్య సిద్ధురాలు, శుభకరమైన పద్మమాలను ధరించునది అగు మహామాయకు నమస్కరిస్తున్నాను. తల్లులకు తల్లి, నిత్యానంద రూపిణి, భక్తుల శోకాలను నశింప చేసేది, కల్పాంతం వరకు స్త్రీల మరియు ప్రాణుల బుద్ధి రూపంలో ప్రకటమగునది అగు దేవికి నమస్కరిస్తున్నాను. మాతా! యతీశ్వరుల సంసార బంధాన్ని ఛేదించే జ్ఞానం నీవే. నావంటి వారు నీ ప్రభావాన్ని ఎట్లు గానం చెయ్యగలరు? అథర్వవేదం లోని హింసా ప్రయోగం నీ స్వరూపమే. నీవు నిత్యము నా కోర్కెలను సిద్ధింప చెయ్యి.

**శ్లో॥ నిత్యా నిత్యైర్భావహీనైః పరాస్తైః తత్తన్మాత్రై ర్యోజ్యతే భూతవర్గః ।**
**తేషాం శక్తిస్త్వం సదా నిత్యరూపా కాలే యోషా యోగయుక్తా సమర్థా ॥**
**యోనిర్ధరిత్రీ జగతాం త్వమేవ త్వమేవ నిత్యా ప్రకృతిః పరస్తాత్ ।**
**యయా వశం క్రియతే బ్రహ్మరూపం సా త్వం నిత్యామే ప్రసీదాద్య మాతః ॥**

**త్వం జాతవేదే గతశక్తి రుగ్రాత్వం దాహికా సూర్య కరస్య శక్తిః ।**
**ఆహ్లాదికా త్వం బహు చంద్రికాయా తాం త్వామహం స్తౌమి నమామి చండీమ్ ॥**

**తా॥** ఆకారము లేనివి, అగోచరమైనవి, నిత్య–అనిత్యములు అగు భూత సూక్ష్మముల నుండి ఏర్పడిన ఈ పాంచ భౌతిక జగత్తుకు నిత్యరూపిణివైన నువ్వే వాటి యొక్క నిత్యశక్తివై ఉన్నావు. నువ్వు త్రిగుణ సంయోగంతో కూడి ఆయా కాలముల యందు సర్వ సమర్థమగు స్త్రీ రూపంలో అవతరిస్తావు. లోకాలన్ని నీ నుండే పుట్టాయి. పోషించే తల్లివి నీవే. నువ్వు సనాతనురాలవు. నువ్వు ప్రకృతి కంటె ఉత్కృష్టురాలవు. పరబ్రహ్మ స్వరూపం నీ అనుగ్రహం చేతనే తెలియబడుతూన్నది. ఓ తల్లీ! అట్టి శాశ్వతురాలవైన నీవు నాయందు ఈనాడు ప్రసన్నురాలవు కమ్ము. అగ్ని యందలి తీక్షణమైన ఉష్ణశక్తి నీవే. సూర్య శక్తివి నీవే. సర్వత్ర వ్యాపించి ఆహ్లాదింప చేయు వెన్నెల నీవే. ఓ చండీ! అట్టి నిన్ను నమస్కరించి స్తుతిస్తున్నాను.

**శ్లో॥ యోషాణాం సత్ప్రియా చ త్వం నిత్యా త్వం చోర్ధ్వరేతసామ్ ।**
**వాంఛాత్వం సర్వజగతాం మాయాచ త్వం యథా హరేః ॥**
**యా చేష్ట రూపాణి విధాయ దేవీ సృష్టిస్థితా నాశమయీ చ కర్త్రీ ।**
**బ్రహ్మాచ్యుత స్థాణు శరీర హేతుః సాత్వం ప్రసీదాద్య పునర్నమస్తే ॥**

**తా॥** తల్లీ! స్త్రీలు నిన్ను అధిక ప్రీతితో ఆరాధిస్తారు. ఊర్ధ్వరేతస్కులైన యోగుల నిత్య శక్తివి నీవే. సర్వ ప్రాణుల లోని ఇచ్ఛాశక్తివి నీవే. విష్ణుమాయ నీవే, ఓ దేవీ నువ్వు నీ స్వేచ్ఛ చేతనే వివిధ రూపాలను ధరించి జగత్తు యొక్క సృష్టి స్థితి లయములను చేస్తున్నావు. బ్రహ్మవిష్ణురుద్రుల శరీరాలను నువ్వే సృష్టించావు. నీకు అనేక నమస్కారాలు అనుగ్రహించు.

మేన స్తుతికి ప్రీతురాలైన కాలిక నీ వాంఛితాన్ని ఎరుకపరచవలసిందని ఆజ్ఞాపించగా మేనాదేవి ఇలా కోరింది: "హే శివే! ముందుగా నాకు వందమంది పుత్రులు కలిగెదరు గాక! వారు దీర్ఘాయువులు, వీర్యవంతులు, సిద్ధిబుద్ధి సమన్వితులు అగుదురు గాక! ఆ తరువాత రూపవతి, గుణవతి ఐనది పుట్టింటిని, మెట్టిన ఇంటిని కూడా ఉద్ధరించేది, త్రిలోక పూజిత అగు కుమార్తెను కోరుతున్నాను. ఓ చండికా! నువ్వే నా కుమార్తెగా జన్మించి రుద్రపత్నివై లీలలను ప్రదర్శించు. నా మనోభీష్టాన్ని, దేవతల మనోరథాన్ని కూడా నెరవేర్చు."

అంత దుర్గాదేవి ప్రీతురాలై "మేనాదేవీ! నీ కోరిక సఫలమవుతుంది. నీ ప్రథమ పుత్రుడు వీర్య సంయుతుడు, బలవంతుడు అవుతాడు!" అని వరమిచ్చి అంతర్ధానమైంది.

కాళికాదేవి అదృశ్యమైన దిక్కుకు నమస్కరించి, జయశబ్దాన్ని పలుకుతూ తన మనోభీష్టం నెరవేరినందుకు సంతుష్టురాలైన మేన తపః క్లేశాన్ని మరిచి మహోత్సాహంతో గృహోన్ముఖురాలైంది. వచ్చి భర్తతో తన తపస్సు ఫలించిన వైనాన్ని పదేపదే చెప్పింది. ఆమె ముఖ రాగాన్ని బట్టి విషయాన్ని గ్రహించిన హిమవంతుడు ఆమె మాటలను చాలా ఆదరంతో విని ప్రశంసించాడు. ఉమాదేవి యందు స్థిర చిత్తులై ఆ దంపతులు హర్షమానులై కాపురం చేసుకొంటూండగా...

కొంత కాలానికి మేన గర్భవతి ఐంది. బల శ్రేష్ఠుడైన మైనాకుడనే కుమారుడుదయించాడు. అతడు పెరిగి పెద్దవాడై సముద్రునితో స్నేహంచేసి నాగకన్యలతో విహరించాడు. మునులారా! పూర్వ కాలంలో పర్వతాలకు రెక్కలున్న కారణంగా ప్రాణి నాశనం జరిగేది. దానిపై కోపించిన ఇంద్రుడు తన వజ్రాయుధంతో రెక్కలను నరికాడు. కాని మైనాకుని రెక్కలను నరకలేదు.

పుత్రోత్సాహంతో హిమవంతుడు తన రాజధాని ఐన ఓషధీప్రస్థ పురాన్ని అలంకరించి, మహోత్సవాన్ని ప్రకటించి, నృత్యగానాది కార్యక్రమాలను ఏర్పాటు చేసి, వేదవిదులైన విప్రులకు భూరి సంభావన లిచ్చి ఆనంద శిఖరాల నదిరోహించాడు."

## పార్వతి జననం

సూతుడు మహదానందంతో తదనంతర గాథను మునులకిలా చెపుతున్నాడు. "మునులారా! స్మరణ మాత్రం చేతనే కరుణను కురిపించే పరమ పావని ఐన దుర్గ పార్వతీ దేవిగా ఆవిర్భవించిన పవిత్రగాథను చెపుతున్నాను. శ్రద్ధతో ఆలకించండి.

చల్లని చూపుల తల్లి ఐన ఆ ఉమాదేవి మేనకు తాను మున్నిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చగోరి పూర్ణాంశతో హిమవంతుని మనస్సులో ప్రవేశించింది. తుషార స్వచ్ఛ ధవళాంతరంగుడైన హిమవంతుడు, అపూర్వ ద్యుతులతో హుతాశనుని వలె వెలిగిపోయాడు. పరమ శోభనమైన సమయంలో దుర్గాదేవి యొక్క పూర్ణాంశను పరిశుద్ధమైన బుద్ధితో మేనా గర్భమందు ఆధానం చేశాడు. పరమేశ్వరి అనుగ్రహం వల్ల గర్భందాల్చింది మేన. జగన్మాత ఆమె గర్భంలో ఉన్న కారణంగా ఆమెలో తేజస్సు అధికమైంది. క్రమంగా గర్భిణీ లక్షణాలు వృద్ధి అయ్యే కొలది హిమవంతునిలో ప్రమోదం వృద్ధి కాజొచ్చింది.

గర్భం వృద్ధి అయ్యే కొలది మేనకు శక్తి సన్నగిల్లింది. అల్పశక్తి సమన్వితురాలైన ఆమె అసంపూర్ణ భూషణయై, లోధ్రపుష్ప (తెల్లలొద్దుగు) సమాన పాండువర్ణ ముఖియై

రాకా చంద్రుని కాంతి ధావళ్యంలో వెల వెల పోతున్న నక్షత్రాలు గల రాత్రిలా నేత్ర పర్వంగా ఉంది. మృద్గంధ సురభిళమైన ఆమె ముఖం తుషారనిధి ఐన హిమవంతునికి తృప్తి నిచ్చింది. ఆమె దేనిని ప్రీతితో చూచినా దానిని తెచ్చి ఇచ్చేవాడు. వృద్ధి పొందిన అవయవాలతో గర్భక్లేశాన్ని అనుభవిస్తూ నడయాడుతున్న మేన పత్రాధిక్యతతో మలయానిలానికి చలిస్తూన్న తమాల లతలా ఉంది.

హిమవంతుడు గర్భిణీ స్త్రీకి జరుప వలసిన వైదిక సంస్కారాలన్నిటిని యథావిధిగా జరిపించాడు. అనేక దానాలిచ్చాడు. మేనకు నెలలు నిండాయి. వర్షించటానికి సిద్ధంగా ఉన్న జలధరాలతో కూడిన అంతరిక్షంలా ఉన్న మేన సూతికా గృహంలో భిషగ్వర పరిరక్షితయై ఉంది. ఆ సమయంలో విష్ణువు, దేవతలు, మునులు ఇంకా అనేకులు అచటకు వచ్చి గర్భంలో ఉన్న ఉమాదేవి నిలా స్తుతించారు.

**శ్లో॥ దుర్గే జయ జయ ప్రాజ్ఞే జగదంబ మహేశ్వరి ।**
**సత్యవ్రతే సత్యపరే త్రిసత్యే సత్యరూపిణి ॥**
**సత్యస్థే సత్య సుప్రీతే సత్యయోనే చ సత్యతః ।**
**సత్య సత్యే సత్యనేత్రే ప్రపన్నా శ్శరణం చ తే ॥**
**శివప్రియే మహేశాని దేవదుఃఖ క్షయంకరి ।**
**త్రైలోక్యమాతా శర్వాణీ వ్యాపినీ భక్తవత్సలా ॥**
**ఆవిర్భాయ త్రిలోకేశి దేవకార్యం కురుష్వహ ।**
**సనాథాః కృపయా తే హి వయం సర్వే మహేశ్వరి ॥**

**తా॥** ఓ దుర్గా! నీకు జయము! జయము! ఓ మహేశ్వరి! నువ్వు జ్ఞాన ఘనవు. జగన్మాతవు, సత్యము నందు నువ్వు దృఢంగా ప్రతిష్ఠితవై సద్రూపవై ఉన్నావు. సత్యమే నీ స్వరూపం కనుక నువ్వు త్రికాలాలలోను సత్స్వరూపిణివి. నువ్వు సత్యమునందు ఉండి, అవతరించి, సత్యముచే సుప్రీతురాలగుదువు. వ్యావహారిక సత్యమగు జగత్తుకు అధిష్ఠానమైన సత్యము నీవే. నీది సత్యదర్శనం. నిన్ను మేము శరణు పొందుతున్నాం. హే శివప్రియే! నువ్వు దేవతల దుఃఖాన్ని హరిస్తావు. ముల్లోకములకు తల్లివి. శర్వుని పత్నివి. నువ్వు సర్వమును వ్యాపించి ఉన్నావు. నువ్వు భక్తవత్సలవు. ఓ త్రిలోకాధీశ్వరీ! నువ్వు అవతరించి దేవ కార్యాన్ని నెరవేర్చు. నీ దయచే మేమంతా నాథవంతుల మయ్యాం.

తల్లీ! లోకంలో ఉత్తమ సుఖాలను అనుభవిస్తూన్న వారంతా ఆ సుఖాలను నీ నుండే పొందుతున్నారు. నువ్వు లేకుండా ఏదీ శోభించదు. ఇలా ప్రార్థించి వారంతా గృహోన్ముఖులయ్యారు.

జగన్మాత ఆవిర్భవింపబోయే సమయం ఆసన్నమైంది. ఆ శుభసమయంలో...

గ్రహ నక్షత్ర తారకా రాసులన్నీ పరమ శాంతంగా ఉన్నాయి.

ఆకాశం ప్రసన్నంగా ఉంది. దిక్కులన్నీ ప్రకాశిస్తున్నాయి.

జనపద, గ్రామ, పట్టణ, నగర ఇత్యాది జన సంకీర్ణ సాగర పరీవృతమైన మహీమండల మంతా మంగళాలతో నిండి పోయింది.

వాపీ కూప తటాక సర స్రవంతులన్నీ శాంత గంధాన్ని వెదజల్లే ప్రపుల్ల పద్మ షండాలతో శోభాయమానంగా ఉన్నాయి.

సుగంధ శీతల వాతాయనం అన్ని దిక్కుల ఒక్క సారిగా వీచింది.

శరదాగమనంతో జలాలన్ని కలక తేరినట్లు ముని మానసాల కలతలు తీరాయి.

గీర్వాణుల తూర్యత్రయ ఘోష మిన్ను ముట్టింది.

అమర వాహిని కమలాలను, నందనవనం మందారాలను పుష్ప వృష్టిని కురిపించాయి.

గంధర్వులు గానం చేయగా, విద్యాధరలు, అప్సరసలు చతుర్విధాభినయ నాట్యోత్సవాన్ని నెరవేర్చారు.

వసంతఋతువులో మృగశిరా నక్షత్రయుక్త చైత్ర శుక్ల నవమీ తిథినాడు అర్ధరాత్రి సమయంలో సోమ మండలం నుండి మధువు పుట్టినట్లు ఆ దేవి జన్మించింది. వెంటనే బృందారకుల జయ జయ ధ్వానాలతో, కరతాళ ధ్వనులతో చతుర్విధ వాద్యాలతో ఆకాశం మార్మోగింది.

ఆ సమయంలో బ్రహ్మ, విష్ణువులతో కూడి ఇంద్రాది బృందారకులంతా నీలోత్పలదళ శ్యామయైన ఆ బాలికను దర్శించి స్తుతించి వెళ్ళారు.

ఆ బాలిక తన దివ్య రూపంతో మేనకు దర్శనమిచ్చి "నేను గతంలో నీకు కుమార్తెగా జన్మించి నా లీలలను ప్రదర్శించి దేవ కార్యాన్ని నిర్వహిస్తానని వరం ఇచ్చాను. దాని

కిప్పుడు సమయం వచ్చింది. మీ దంపతులు నన్ను పుత్రికా భావంతో పెంచండి" అని పలికి తిరిగి శిశు రూపాన్ని పొందింది.

**పార్వతి బాల్యం**

పొంది లోక రీతిగా ఆ శిశువు రోదించింది. ఆమె చుట్టూ వ్యాపించి ఉన్న దివ్య తేజస్సుచే పురిటింట్లో ఉన్న దీపాలు వెలవెల పోయాయి. గృహంలో ఉన్న స్త్రీలందరు శిశు రోదనాన్ని విని వచ్చిచేరారు. ఆ శుభ వార్తను వెంటనే అంతఃపుర పరిచారకుడు రాజుకు విన్నవించాడు. తక్షణం పురోహితునితో, బ్రాహ్మణులతో కూడి హిమవంతుడు గొప్ప కాంతులతో వెలిగి పోతున్న కుమార్తెను చూచి పరమానందభరితుడై నగరమంతా మహోత్సవాన్ని జరిపించాడు. నామకరణ మహోత్సవ వేళ కాళి ఇత్యాది సుఖ ప్రదమైన నామాలనుంచాడు.

ఆ బాలిక క్రమంగా శుక్లపక్ష చంద్రునిలా పెరుగుతూ, అందరికి ప్రమోదాన్నిస్తూ హిమవంతుని రాజగృహంలో వర్షాకాలంలో గంగలా, శరత్కాల చంద్రికలా ప్రకాశించింది. బంధువులంతా ఆమెను కులోచితంగా 'పార్వతి' అని పిలుస్తూ వచ్చారు. క్రమంగా ఆ బాలిక పెరిగి పెద్దదై తపస్సుకు ఉపక్రమింపగా మేనాదేవి 'ఉమ (అబ్బే, వద్దు)' అని పలుమార్లు నిషేధించిన కారణంగా అప్పటి నుండి ఆ మంగళాంగికి 'ఉమ' అనే పేరు లోకంలో ప్రసిద్ధికి వచ్చింది.

ఆ నగాధిపునికి పుత్రసంతానం ఎంతమంది ఉన్నా సర్వసౌభాగ్యవతి ఐన పార్వతిని ఎంత చూచినా తనివి తీరేది కాదు. మధు మాసంలో ఎన్ని ద్రుమాలు పూచినా తుమ్మెదకు గున్నమామిడి చెట్టు విశేష ప్రీతిదాయకం గదా! వాక్కుచే (విద్యచే) విద్వాంసుడు శోభించినట్లు పార్వతిచే హిమవంతుడు పవిత్రుడై అలంకృతుడై సాటి వారిలో మన్ననలను పొందాడు. నడయాడుతున్న దీపశిఖలా సంచరిస్తూన్న పార్వతితో కూడిన రాజగృహం మందాకినితో కూడిన పాలపుంతలా ప్రకాశించింది. ఉమాదేవి చెలులతో కలిసి గంగా సైకత స్థలాలలో బొమ్మల పెండ్లిండ్లు ఆడుకొనేది. తరువాత విద్యారంభ సమయంలో గురువులైన మునుల యొద్ద మనసును లగ్నంచేసి అన్ని విద్యలను గ్రహించింది.

**హిమవంతుని వద్దకు నారదుడు వచ్చుట**

మునులారా! శివలీలావిదుడు, శివజ్ఞాని ఐన నారదుడు ఈశ్వర ప్రేరితుడై ఒకనాడు హిమవంతుని గృహానికి వెళ్ళాడు. నగాధిపుడు యథావిధిగా అతిథి సత్కారాలాచరించి తన కుమార్తెచే పాదపూజ చేయించి ఆమె భవిష్యత్తును చెప్పమని కోరేడు. ఆమె హస్తరేఖలను, సాముద్రిక లక్షణాలను పరిశీలించిన నారదుడు ఇలా అన్నాడు:

"ఓ పర్వతరాజా! ఈ నీ కుమార్తె సర్వ శుభ లక్షణ లక్షితాంగి. ఈమె ఉభయ కులాలను (పుట్టింటిని మెట్టిన ఇంటిని) ఉద్ధరించగలదు. నారీ లోకానికి ఆదర్శ ప్రాయురాలై, శిరోమణియై పుణ్య స్త్రీలచే పూజలందుకో గలదు. కాని, ఈమె చేతిలో ఒక విలక్షణమైన రేఖ ఉంది. దాని ఫలాన్ని విను. యోగి, దిగంబరుడు, నిర్గుణుడు, వీతరాగుడు, తల్లిదండ్రులు లేనివాడు, అహంకార వర్జితుడు, అమంగళ వేషధారి అగువాడు ఈమెకు భర్త కాబోతున్నాడు."

నారదుని మాటలకు మేన-హిమవంతులు విచారగ్రస్తులయ్యారు. ఆ జగన్మాత ఆ మాటను విని ఆ లక్షణాల ననుసరించి అతడు తప్పక శివుడే అని నిర్ణయించుకొని మనసులో హర్షాతిరేకంతో పొంగి పోయింది. హిమవంతుడు మాత్రం "నారదా! ఆ గీతను అతిక్రమించే ఉపాయం లేదా?" అని అడిగాడు. దానికి నారదుడిలా ప్రత్యుత్తరమిచ్చాడు. "ఓ పర్వతరాజా! బ్రహ్మగీతలను దాటటానికి ఎవరికీ శక్యంకాదు. నేను చెప్పిన లక్షణాలకు ముమ్మార్తుల సరిపోయినవాడు శంకరుడొక్కడే. ఆ వేషం ఆయన లీల. మూర్ఖులకు దోషాలుగా తోచే ఆయన వేష భూషలు, ఆయన విషయంలో అవి అలంకారాలు. కనుక నువ్వు వివేకశీలివై నీ కుమార్తెను శివునికిచ్చి వివాహం చెయ్యటానికి సిద్ధంగా ఉండు. ఆయన తపస్సుచే ప్రసన్నుడవుతాడు. బ్రహ్మవ్రాతను తుడిచి వేయగల సమర్థుడు ఆయనొక్కడే!

కనుక ఓ గిరి సార్వభౌమా! నీ కుమార్తెను వెంటనే తపస్సుకు ప్రేరేపించు. తపస్సుచే ఈ పార్వతి పరమేశ్వరుని పతిగా పొందగలదు. ఆయన కూడా ఈమెను తక్క అన్యస్త్రీ పాణిగ్రహణం చెయ్యడు. వీరిద్దరి ప్రేమతో సదృశమైన ప్రేమ గతంలో లేదు. వర్తమాన కాలంలో లేదు. భవిష్యత్తులో ఉండబోదు. ఈశ్వరుడు ఈ కన్యకు తన శరీరంలోని అర్ధభాగాన్నిచ్చి అర్ధనారీశ్వరుడు కాగలడు. వీరిద్దరి దాంపత్య ఫలితంగా అనేక దేవ కార్యాలు నెరవేర వలసి ఉన్నాయి. ఈ కన్య గౌరీ నామధేయంతో ముల్లోకాలలోను పూజలందుకొంటుంది. బ్రహ్మ, విష్ణు, ఇంద్రాది సకల దేవగణాలన్నీ ఈమెను నిత్యము పూజిస్తారు."

నారదుని హితోపదేశానికి సంతోషించి హిమవంతుడు తన సందేహాన్నిలా వెలిబుచ్చాడు. "ఓ దేవర్షీ! ఆ మహాదేవుడు సర్వసంగ పరిత్యాగి యని, ఆత్మ నిగ్రహం కలవాడని, తపోనిరతుడని, దేవతలకు సైతం అగోచరుడని విన్నాను. పరబ్రహ్మయందు లగ్నమైన మనస్సుగల ఆ శివుడు ధ్యాన మార్గం నుండి ఎలా చ్యుతుడవుతాడు? వినాశము లేనిది, హృదయంలో దీపశిఖలా ప్రకాశించేది, సదాశివ నామధేయం గలది, ఏ వికారములు

లేనిది, జనన మరణములు లేనిది, నిర్గుణము, నిర్విశేషము, ఏ వాసనలు లేనిది ఐన పరబ్రహ్మను ఆయన స్వస్వరూపంగా దర్శిస్తూంటాడు గదా! అసలు బాహ్యదృష్టే లేని ఆయన ఈ వివాహానికి ఎలా సుముఖుడవుతాడు?

నారదా! అంతే కాదు. దక్షపుత్రి ఐన సతిని తక్క అన్య స్త్రీని భార్యగా అంగీకరించనని గతంలో ప్రతిజ్ఞ చేసినాడట! సతి మరణించింది గదా! మరొక స్త్రీని ఎలా వివాహం చేసుకొంటాడు?"

హిమవంతుని అజ్ఞానానికి నవ్వుకొని, త్రికాలజ్ఞాని ఐన నారదుడిలా అతని సందేహ నివృత్తి చేశాడు. "ఓ నగాధిపా! దక్ష పుత్రి ఐన సతీదేవియే నీ ఇంట కాళిగా జన్మించింది. ఈ పార్వతి శివుని పత్ని అవుతుంది అనటంలో సందేహంలేదు. ఈపైన శివుని ఊరువులే ఈమె అధిష్ఠించే సింహాసనం కాగలదు."

నారదుని పలుకులు మేనకు, హిమవంతునకు, వారి కుమారులకు అమితానందాన్ని కలిగించాయి. ఆపై ఎవరి స్వస్థానాలకు వారు చేరుకొన్నారు.

**పార్వతి స్వప్నం**

సూత మహర్షి తదనంతర వృత్తాంతాన్ని మునులకిలా వివరించాడు. "మునులారా! తదనంతరం మేన హిమవంతుని సమీపానికి వచ్చి నమస్కరించి ఇలా అడిగింది. "నాథా! నారదమహర్షి అమ్మాయి వివాహం విషయంలో భవిష్యత్తును గురించి చెప్పి వెళ్ళారు. ఆయన వాక్యాలు నాకు సరిగా బోధ పడలేదు. ఆయనేం చెప్పినా మనకు ఒక్కర్తె అమ్మాయి. సుందరుడైన వరునకిచ్చి వివాహం జరిపించండి. అమ్మాయి సుఖ పడాలి. తల్లిగా నే కోరుకొనేది ఇదొక్కటే! మిమ్ములను ప్రార్థించేది కూడా ఇదొక్కటే!" ఇలా పలికి గ్రుడ్ల నీరు క్రమ్మగా పాదాల మీద పడింది.

హిమవంతుడు ఆమెనుపైకి లేవదీసి "దేవీ! నాకు మాత్రం తెలీదా? సాక్షాత్తు పరమేశ్వరుడైన శంకరుడు మన అమ్మాయికి భర్త కాబోతున్నాడు. ఇది మహర్షి చెప్పిన మాట! ఐతే అది జరగాలంటె అమ్మాయి తపస్సు చెయ్యాలి. దానికి తగిన శిక్షణ ఇయ్యి" అని హితవు చెప్పాడు. ఆ మాటలకు మేన మనసులో సంతోషించినా, తపస్సు అనే సరికి భయపడింది. సుకుమారి ఐన అమ్మాయి కఠినమైన తపస్సుకు ఎలా ఓర్చుకో గలదా అని దుఃఖితురాలైంది.

ఆ దుఃఖంతోనే అమ్మాయి దగ్గరకు వెళ్ళింది. కాని తన అభిప్రాయాన్ని చెప్పలేక పోయింది. తల్లి మనోగతాన్ని గుర్తించిన పార్వతీదేవి ఆమెనోదార్చి ఇలా అంది. "అమ్మా!

తపశ్చర్య నాకిష్టమే. నిన్న తెల్లవారు జామున కలలో తపస్వి ఐన ఒక విప్రుడు ప్రీతి పూర్వకంగా, శంకరుని గూర్చి తపస్సు చెయ్యమని ఆదేశించి అదృశ్యుడయ్యాడు." పార్వతి మాటలను భర్తకు చెప్పింది మేన.

దానికి ఆనందించిన హిమవంతుడు భార్యతో సరిగా అదే సమయంలో తను చూచిన స్వప్నాన్ని ఇలా వివరించాడు. "దేవీ! నారదుడు వర్ణించిన తీరున ఒక యోగి తపస్సు నిమిత్తం మన నగర సమీపానికి వచ్చాడు. నేను అమ్మాయిని వెంట పెట్టుకొని ఆయనను సందర్శించి అమ్మాయి సేవలను అంగీకరించమని కోరాను. మొదట్లో ఆయన అంగీకరించలేదు కాని తరువాత మన అమ్మాయి మాట్లాడి ఆయనను అంగీకరింప చేసింది. అప్పటి నుండి మన అమ్మాయి అక్కడే ఉండి సేవలందిస్తోంది. ఆయన శంకరుడే అని తరువాత తెలిసింది. స్వప్న ఫలం కొరకు మనం కొంతకాలం వేచి చూడాలి. ఇది శుభ స్వప్నం."

**శివుని తపస్సు కుజగ్రహోత్పత్తి**

సతీ వియోగానంతరం శివుడు చిరకాలం సమాధిలో ఉండి తిరిగి బాహ్య ప్రపంచంలోకి వచ్చాడు. అప్పుడు జరిగిన వృత్తాంతాన్ని చెపుతున్నాను. మునులారా! వినండి. ఆ ప్రభువు లలాటం నుండి శ్రమ వలన పుట్టిన చెమట నేలపై పడగా అది వెంటనే శిశువు ఐంది. ఆ శిశువు నాలుగు భుజాలతో, అరుణ వర్ణంతో, దివ్యకాంతులతో సుందరంగా ఉన్నాడు. ఆ శిశువు లోకరీతిగా రోదించాడు. అపుడు భూదేవి శంకరునికి భయపడి సుందర స్త్రీ రూపంలో వచ్చి ఆ శ్రేష్ఠ బాలకుని లేవదీసి ఒడిలో కూర్చుండ పెట్టుకొని, తన ఉపరి తలంపై లభించే పాలను స్తన్య రూపంలో ఆ బాలునికి త్రాగించింది. సతీదేవి లేని కారణంగా ఆ బాలుని తన కుమారునిగా భావించి స్నేహంతో ముద్దాడింది.

అంత జగత్కర్త, అంతర్యామి ఐన శివుడు ఆమె ప్రవృత్తిని చూచి సంతోషించి చిరునవ్వుతో ఇలా అన్నాడు: "ఓ భూదేవీ! నువ్వు ధన్యురాలవు! ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక తాపత్రయాలు లేని ఈ బాలుడు నీ పేరుతో వర్ధిల్లగలడు. నా యొక్క చెమట నీపై పడగా నీ నుండి పుట్టిన ఈ బాలుడు 'కుజుడు' అనే పేరుతో వర్ధిల్లి, భూమిని దానం చేసే గుణవంతుడు కాగలడు. నాకు కూడా ఇతడు సుఖదాత కాగలడు." శివాజ్ఞచే భూదేవి కుమారుని తీసికొని తన స్వస్థానానికి వెళ్ళింది. కుజుడు కాశీ నగరంలో ఉండి చిరకాలం విశ్వేశ్వరుని సేవించి ఆయన అనుగ్రహంచే గ్రహత్వాన్ని పొంది శుక్ర లోకంకంటె శ్రేష్ఠమైన దివ్యలోకాన్ని పొందేడు.

**హిమవంతునితో శివుని సమాగమం**

శక్తి స్వరూపిణి ఐన సతి హిమవంతుని ఇంట్లో పార్వతిగా జన్మించి తల్లిదండ్రులకు, చెలికత్తెలకు చేతో మోదాన్ని చేకూరుస్తూ, క్రమంగా పెరిగి పెద్దయై ఎనిమిది సంవత్సరాల గౌరి ఐంది. అదే సమయంలో శంకరుడు కఠిన తపస్సును చేయగోరి, శాంత స్వభావముగల నందీశ్వరాది గణ పరివృతుడై హిమవత్పర్వత శిఖరమందున్న గంగావతార క్షేత్రానికి చేరుకొన్నాడు. పరమ పావని ఐన గంగ పూర్వం బ్రహ్మపురం నుండి జారి ఇచట పడింది.

జితేంద్రియుడైన శివుడు ఆత్మస్వరూపాన్ని ఏకాగ్రతతో ధ్యానిస్తూ తపశ్చర్యకు ఉపక్రమించాడు. నిత్యము, జ్యోతిస్వరూపము, నిర్దోషము, చిదానంద ఘనము, అద్వయము, సర్వాశ్రయము అగు ఆత్మ మనస్సులో అఖండ ధీరూపంలో గోచరిస్తుంది. ఇదే ఆత్మ స్వరూపం. ఆ ఆత్మయే జగద్రూపంగా వ్యక్తమైంది. శివునితో మిగతాగణాల వారు కూడా ధ్యాన నిమగ్నులయ్యారు. ఓషధీప్రస్థ పురంలో ఉన్న హిమవంతుడు శివుని ఆగమన వార్తను తెలుసుకొన్న వాడై తన పరివారంతో వచ్చి ఆదరంతో చేతులొగ్గి నమస్కరించి ఇలా ప్రార్థించాడు.

**శ్లో॥ దేవదేవ మహాదేవ కపర్దిన్ శంకర ప్రభో ।**
**త్వయైవ లోకనాథేన పాలితం భువన త్రయమ్ ॥**
**నమస్తే దేవదేవేశ యోగిరూపధరాయచ ।**
**నిర్గుణాయ నమస్తుభ్యం సగుణాయ విహారిణే ॥**
**కైలాస వాసినే శంభో సర్వ లోకాటనాయ చ ।**
**నమస్తే పరమేశాయ లీలాకారాయ శూలినే ॥**
**పరిపూర్ణ గుణాధాన వికారరహితాయ తే ।**
**నమోఽనీహాయ వీహాయ ధీరాయ పరమాత్మనే ॥**

**తా॥** దేవదేవా! మహాదేవా! జటాజూట ధారీ! శంకరా! ప్రభో లోక నాథుడవైన నువ్వు ఈ ముల్లోకాలను పాలిస్తున్నావు. హే దేవదేవా! ఈశ్వరా! యోగి రూపుడవైన నీకు నమస్కారం. నిర్గుణుడవైనా సగుణుడవై విహరించు నీకు నమస్కారం. హే శంభో! కైలాస వాసి వయ్యు సర్వలోకాలలోను సంచరిస్తూ లీలచే ఆకారాన్ని స్వీకరించిన శూలధారివగు నీకు నమస్కారం. నువ్వు పరమేశ్వరుడవు. నువ్వు సకలగుణ నిధానమవు. వికారములు లేనట్టియు, కామనలు లేనట్టియు, విశిష్టమైన సంకల్పశక్తి కలిగి నట్టియు, జ్ఞాన ఘనుడైనట్టియు పరమాత్మవగు నీకు నమస్కారం.

శ్లో॥ **అబహిర్భోగ కారాయ జనవత్సలతే నమః ।**
**త్రిగుణాధీశ మాయేశ బ్రహ్మణే పరమాత్మనే ॥**
**విష్ణు బ్రహ్మాది సేవ్యాయ విష్ణు బ్రహ్మ స్వరూపిణే ।**
**విష్ణు బ్రహ్మ కదాత్రే తే భక్తప్రియ నమోఽస్తుతే ॥**
**తపోరత తపస్స్థాన సుతపః ఫలదాయినే ।**
**తపః ప్రియాయ శాంతాయ నమస్తే బ్రహ్మరూపిణే ॥**
**వ్యవహార కరాయైవ లోకాచార కరాయతే ।**
**సగుణాయ పరేశాయ నమోఽస్తు పరమాత్మనే ॥**
**లీలాతవ మహేశానావేద్యా సాధు సుఖప్రదా ।**
**భక్తాధీన స్వరూపోఽసి భక్తవస్యోఽసి కర్మకృత్ ॥**

**తా॥** హే భక్తవత్సలా! నువ్వు అంతర్ముఖుడవు. బహిర్ముఖమైన ఇంద్రియ భోగముల యందు నీకు ఆసక్తిలేదు. త్రిగుణాధీశ! పరబ్రహ్మ, పరమాత్మ ఐన నీకు నమస్కారం. నువ్వు విష్ణు, బ్రహ్మ స్వరూపుడవు. విష్ణు బ్రహ్మాదులు నిన్ను సేవిస్తారు. వారికి ఆనందాన్నిచ్చేది నీవే. నీకు భక్తి ప్రియమైనది. నీకు నమస్కారం. నువ్వు తపోనిరతుడవు, తపోనిధివి, భక్తుల తపస్సుకు ఫలాన్ని ఇచ్చేది నువ్వే. నువ్వు శాంతుడవు. నువ్వు సగుణ రూపంలో ఉండి సర్వేశ్వరుడవై లోకాచారాలను ప్రవర్తిల్ల చేస్తూ, స్వయంగా ఆచరిస్తూ ఉంటావు. ఓ సాధు సుఖప్రదా! నీ లీలలను తెలియుట శక్యం కాదు. నువ్వు భక్తులకు వశంలో ఉండి వారికి అనుకూల మగు కర్మలను చేస్తూ ఉంటావు, వారికి ఆత్మ రూపుడవు.

హిమవంతుడిలా స్తుతించి, ఇంకా ఇలా ప్రార్థించాడు "ఓ శంకరా! నువ్వు ఇక్కడకు రావటం నా మహా భాగ్యం. నీ రాకచే నన్ను సనాథుని చేశావు. నేను నీ దాసుడను. నీకేం కావాలో నన్నాజ్ఞాపించు."

అతని పల్కులకు ప్రీతుడైన వృషభ ధ్వజుడు సమయోచితంగా ఇలా ప్రశంసించాడు. "ఓ గిరి సార్వభౌమా! నువ్వు మహాత్ముడవు. అనేక మంది తపోధనులకు, మునులకు, సిద్ధులకు బ్రాహ్మణులకు ఆశ్రయమై ఉన్నావు. నువ్వు పరోపకారం చేసే ప్రభుడవు. గంగాజలంచే నిత్య శుద్ధుడవు. నేనీ క్షేత్రంలో తపస్సు చేసుకోటానికి వచ్చాను. నా ఏకాంతానికి భంగం కలుగకుండా తగిన ఏర్పాట్లు చెయ్యి."

దానికి సమాధానంగా మీ రాకచే నేను ఇంద్రాధికుడనయ్యానని భావిస్తున్నాను. మీ ఆజ్ఞను తప్పక నెరవేరుస్తానని పల్కి, హిమవంతుడు గృహోన్ముఖుడయ్యాడు. తగురీతి ఏర్పాట్లను చేశాడు.

**పార్వతితో కూడి హిమవంతుడు శివుని వద్ద కేగుట**

ఈ విషయాలన్నింటిని ఇంట్లో చెప్పి ఒకానొక శుభ ముహూర్తాన తగిన పూజా ద్రవ్యాలను సమకూర్చుకొని, గౌరీ సహితుడై శివుని దర్శించి, పూజించి పర్వతరాజు ఇలా ప్రార్థించాడు. "ఓ చంద్రశేఖరా! మిమ్ములను సేవించటానికి మా అమ్మాయి ఉత్సాహ పడుతోంది. అనుమతించండి."

వెంటనే శివుడు ఇందుముఖి, కమలాయతాక్షి, నీలకుంతల, చారుకర్ణ, బింబాధరి, ప్రథమారూఢ యౌవన ఐన పార్వతిని చూచి మనసులో ఇలా అనుకొన్నాడు: "ఈ సుందరి ధ్యాన పంజర నిర్బద్ధయైన ముని మానసాలను సైతం కలత పెట్టగల సౌందర్యాన్ని కలిగి ఉంది. ఈమె కామరూపిణి. సమస్తమైన మంత్రతంత్రాలు ఈమె దేహాన్ని ఆశ్రయించుకొని ఉన్నాయి. అని తలపోసి తక్షణం ఆత్మధ్యాన పరాయణుడయ్యాడు.

శంకరుని మౌనానికి హిమవంతుడు సంశయాత్ముడై మరోసారి స్తుతించి అమ్మాయి సేవలకు అనుజ్ఞ ఇమ్మని కోరేడు. దానికి శంకరుడిలా అన్నాడు. "ఓ నగాధిరాజా! ఈపైన నా దర్శనానికి వచ్చేటప్పుడు నువ్వొక్కడివే రా. అమ్మాయిని వెంట పెట్టుకురాకు. దానికిగల కారణాన్ని చెపుతాను విను. వేద వేత్తలైన విద్వాంసులు స్త్రీ మాయా స్వరూపురాలని చెపుతారు. విశేషించి తపశ్శాలుర విషయంలో యువతి విఘ్నకారిణి అవుతుందనటంలో సందేహం లేదు. నేను తపశ్శాలిని, యోగిని, మాయ ఏనాడూ నా దరికి చేరదు. ఇక్కడ యుక్తులతో పనిలేదు. నాకు స్త్రీతో పనేముంది చెప్పు?

ఓ నగాధిపా! నేను లోక ధర్మాన్ని చెపుతున్నాను విను. స్త్రీ పరిచయం వల్ల విషయముల యందు ఆసక్తి జనించి వైరాగ్యం అదృశ్యమవుతుంది. అప్పుడు తపస్సు భ్రష్టమవుతుంది. ఇంద్రియభోగ లాలసతకు మూలమైన స్త్రీ జ్ఞాన, వైరాగ్యాలను నశింప చేస్తుంది. కావున తపశ్శాలి స్త్రీలతో స్నేహం చెయ్యరాదు. నువ్వు వేద విదుడవు. జ్ఞాన పరుడవు, బుధుడవు."

శంకరుని మాటలకు హిమవంతుడు నిస్పృహ చెంది మిన్నకున్నాడు.

**పార్వతీ పరమేశ్వర సంవాదము**

సూతుడు మునులతో ఇలా అంటున్నాడు. "ఓ మునులారా సాంఖ్య-వేదాంత శాస్త్రాల మీద ఆధారపడి నడిచిన పార్వతీ పరమేశ్వర సంవాదాన్ని చెపుతున్నాను శ్రద్ధతో వినండి. అంత గిరిజాదేవి తండ్రి అనుమతిని పొంది పరమేశ్వరునితో ఇలా మృదువుగా పలికింది.

"ఓ యోగీ! తపశ్శాలివైన నీవు పర్వత రాజుతో పలికిన పలుకులు నీకు ఉచితమైనవేనా? నీవు జ్ఞాన విశారదుడవు! నీ మాటలకు సమాధానం నా నుండి విను. నీవు ప్రధానుడవైన పరమ పురుషుడవు. తపశ్శక్తితో కూడియున్నానని నీవు అంటున్నావు కదా? తపస్సు చెయ్యాలనే బుద్ధి నీలో ఉదయించింది గదా? కర్మలన్ని ఆ శక్తి (బుద్ధి) నుండే పుడుతున్నాయని తెలుసుకో! ఆ శక్తియే సృష్టినంతా రచించి, పాలించి నశింప చేస్తూ ఉంది. అసలు నీవెవరు? సూక్ష్మప్రకృతి అంటే ఏమిటి? హే భగవాన్! ఈ విషయాన్ని విమర్శించి తెలుసుకో. ప్రకృతి లేకుండ మహేశ్వరుడు సగుణ రూపధారి ఎట్లు కాగలడు? ప్రకృతితో కూడి ఉన్న కారణంగానే నీవు సర్వదా ప్రాణులచే పూజింపబడి, నమస్కరింపబడి, ధ్యానింపబడుచున్నావు. ఈ సత్యమును మనసులో ఎరిగి అపుడు గదా మాట్లాడాలి."

పార్వతి పల్కులకు ప్రీతి చెందిన మహేశ్వరుడు చిన్నగా నవ్వి తన లీలను వాక్కులలో ఇలా చూపించాడు. "ఓ హిమగిరి నందినీ! నువ్వు చెప్పిన విషయం జీవులైన బ్రహ్మ విష్ణ్వాదిదేవతల మాట. శంభుడనైన నేను నా గొప్ప తపస్సుచే ప్రకృతిని నాశనము చేయుదునా అన్నట్లు చేయగలను. ప్రకృతి సహాయం లేకుండా ఆత్మ స్వరూపుడనై ఉంటాను! కనుక సత్పురుషులు ఏ కాలమందైనా ప్రకృతిని (స్త్రీని) స్వీకరించరాదు. వారు లోకాచారాలను పరిత్యజించి వికార రహితులై ఉండాలి. ముమ్మాటికి ఇది సత్యం."

శంభుని వచనాలకు కాళికాదేవి నవ్వుకొని ఇలా ప్రశ్నించింది. "హే శంకరా! నీవు ప్రకృతిని జయించినవాడనని, అతిక్రమించిన వాడనని కదా పలికావు! అది యథార్థమైతే ప్రకృతి స్వరూపురాలైన స్త్రీ నీ చెంత ఎందుకుండరాదు? ఉండకూడదు అని నువ్వంటె ప్రకృతికి అతీతుడనని ఎలా చెప్పగలవు? ఈ సర్వము సర్వకాలముల యందు ప్రకృతి చేతనే బంధింపబడి ఉందనే యథార్థాన్ని తెలుసుకో! ప్రకృతి లేనిదే నువ్వు మాట్లాడలేవు. ఏ పనిని చెయ్యలేవు. ఈ జగత్తులోని సర్వవచనములు, సర్వక్రియలు ప్రకృతి నుండి పుట్టాయి. నువ్వు ఏది విన్నా, ఏది తిన్నా, ఏది చూచినా, ఏది చేసినా, ఆ సర్వమూ ప్రకృతి నుండే ఉద్భవిస్తున్నది. కనుక తత్త్వ బుద్ధితో విచారించి మాట్లాడాలి. ప్రకృతిని గూర్చి మిథ్యావచనాలు వద్దు.

హే ప్రభో! నువ్వు ప్రకృతికి అతీతుడవైతే తపస్సు ఎందుకు చేస్తున్నావు? నువ్వీ ఓషధీప్రస్థ నగరానికి ఎందుకు వచ్చావు? నీ ఆత్మ స్వరూపం నీకు తెలియలేదు. అది నీకు విదితమైతే తపస్సెందుకు? నీతో వాదులాట వలన నాకేమి ప్రయోజనం? వస్తువు ప్రత్యక్షంగా కనిపిస్తూంటే అనుమాన ప్రమాణానికి తావులేదు. ప్రాణులు తమ ఇంద్రియాలచే ఎంత వరకు తెలుసుకొనగలరో, స్వీకరించగలరో అదంతా ప్రకృతి నుండే పుట్టింది అని జ్ఞానులు బుద్ధిలో తెలుసుకొంటారు.

ఓ యోగిశ్రేష్ఠా! ఇన్ని మాటలెందుకు? సిద్ధాంతాన్ని చెపుతున్నాను విను. ఆ ప్రకృతి నేనే! నీవు పురుషుడవు. ఇది ముమ్మాటికి నిజం. నువ్వు నా అనుగ్రహం చేతనే రూపాన్నిపొంది సగుణుడవయ్యావు. నేను లేనిదే నీయందు సంకల్పశక్తి ఉండదు. నువ్వు ఏ పనినీ చెయ్యలేవు. జితేంద్రియుడవగు నువ్వు పరాప్రకృతికి అధీనుడవై వివిధ కర్మలను అనుష్ఠిస్తున్నావు. నువ్వు వికారరహితుడవు ఎట్లు కాగలవు? నాతో పొత్తులేకుండ నువ్వు ఏ పనీ చెయ్యలేవు. నీ వలన లోకానికి, దేవతలకు ఏమీ ప్రయోజనం లేదు! నువ్వు నిజంగా ప్రకృతికి అతీతుడవైతే, నా సమీపంలో నువ్వు భయపడవలసిన పనేముంది?"

సర్వజ్ఞుడైన శంకరుడు పార్వతి పల్కులలోని ఆంతర్యాన్ని గుర్తించి ఇలా అన్నాడు. "ఓ హిమగిరి తనయా! నువ్వు సాంఖ్య సిద్ధాంతాన్ని అనుసరించి మాట్లాడావు. నేను వేదాంత సిద్ధాంతాన్ని అనుసరించి ఆ పైమాటను మాట్లాడుతున్నాను విను. నేను మాయా సంసర్గం లేనివాణ్ణి! పరమేశ్వరుడను. ఉపనిషత్తులచే తెలియదగిన పరబ్రహ్మను. ఆ విషయాన్ని త్వరలో తెలుసుకోగలవు. నేను ప్రతి దినము నీ సేవకు అంగీకరించాను."

భక్తరంజనుడైన శంకరుడు ఉమతో ఇలా పలికి హిమవంతుని చూచి "ఓ పర్వతరాజా! నేను ఆత్మ స్వరూపాన్ని దర్శిస్తూ ఈ అతిరమ్యమైన ప్రదేశంలో తపస్సు చేసికొంటాను. అనుజ్ఞ ఇయ్యి." అని కోరగా హిమవంతుడు "స్వామీ ఈ జగత్తు మీ ఇల్లుగదా! ప్రత్యేకించి అనుజ్ఞ కోరవలెనా? నా భాగ్యం. మీ తపస్సు నిర్విఘ్నంగా నెరవేరు గాక!" అని పలికి శంకరానుమతితో ఉమతో కూడి గృహానికి చేరుకొన్నాడు. ఆ తరువాత కుమార్తె ఐన కాళితో కలిసి శంకర దర్శనానికి వచ్చేవాడు. భక్తితత్పరురాలైన కాళి ప్రతి నిత్యము తండ్రి రాకపోయినా ఇద్దరు చెలులతో కూడి శంకర సేవార్థంవచ్చి సేవలు చేసి వెళ్ళేది. నందీశ్వరాది గణాలు వారిని వారించే వారుకాదు.

ఉమాదేవి ప్రతిరోజు తగిన పూజా ద్రవ్యాలతో వచ్చి షోడశోపచారాలతో శంకరుని పూజిస్తూ ఉండేది. తుడవటం, అలకటం, చందనాగరు కస్తూరీ పరిమళ ద్రవ్యాలతో కలయంపి చల్లటం చేస్తూండేది. శివుని మనస్సును ఆకర్షించే విధంగా రంగ వల్లికలు తీర్చి దిద్దేది. చిత్రవర్ణ పుష్పాలతో పూలదండలు కట్టి ఆశ్రమ ప్రాంతాన్ని అలంకరించేది. పూజా ద్రవ్యాలకు ఏలోటు రాకుండా సమకూర్చేది. కలకంఠంతో కమ్మగా రక్తిగా పాడేది.

శంకరుడు ధ్యాన నిమగ్నుడైయున్న తరి, తదేక దీక్షతో ఆయనను, ఆయన అలంకారాలను చూస్తూండేది. నిస్సంగుడు, తపోధనులకు తక్క అన్యులకు లభించనివాడు ఐన శంభుడు; గత జన్మలోని సతీదేవియే ఈ ఉమ అని మనసులో ఎరిగిన వాడైనా వెంటనే భార్యగా స్వీకరించటానికి ఇష్టపడలేదు. ఈ కాళి ఎప్పుడైతే తీవ్రమైన తపస్సులో కృతకృత్యురాలవుతుందో అప్పుడు ఈమెలోని అహంకార బీజం నశిస్తుందని తలచి, ఆమెను తపస్సు వైపుకు నడిపించాలనుకొన్నాడు. తపశ్చర్యానంతరం మాత్రమే ఆమెను వివాహమాడ నిశ్చయించుకొన్నాడు. మునులారా! లోక కంటకుడైన తారకాసురునిచే పీడితులైన దేవతలు, వివాహానికి రుద్రుణ్ణి ప్రేరేపించమని మన్మథుణ్ణి పంపారు. ఆ గాథను చెపుతాను.

### వజ్రాంగుని వృత్తాంతం

మునులారా! బ్రహ్మమానస పుత్రుడు మరీచి. అతని కుమారుడు కశ్యపుడు. దక్షపుత్రికలైన పదముగ్గురిని అతను వివాహం చేసికొన్నాడు. వారిలో దితి పెద్ద భార్య. ఆమెకు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు అని ఇద్దరు కొడుకులు పుట్టారు. వారిద్దరిని విష్ణువు సంహరించాడు. దాంతో దితి దుఃఖితురాలై కశ్యపుని శరణు పొందింది. ఆయన అనుగ్రహంతో గర్భాన్ని ధరించింది. రాబోయే ముప్పును గ్రహించిన ఇంద్రుడు ఒకానొక అనాచార దోషాన్ని కనిపెట్టి దితి గర్భంలో ప్రవేశించి తన వజ్రంతో పిండాన్ని ఛేదించాడు. ఆమె వ్రత మహిమచే ఆ పిండం నశించలేదు సరిగదా నలభైతొమ్మిది ముక్కలై అంతమంది కుమారులు జన్మించారు. వారందరు మరుత్తులను దేవతలై ఇంద్రునకు స్నేహితులయ్యారు.

దితి తన దోషాన్ని గుర్తెరిగి చింతించి భర్తను సేవించి గర్భాన్ని పొంది వజ్రాంగుడనే కుమారుని కన్నది. వాడు పేరుకు తగ్గ బలంకల వాడు. అతను ఇంద్రుని, కొందరు దేవతలను చెరపట్టి దండించి తల్లికి సంతోషాన్ని కలిగించాడు. అతని వల్ల దేవతలు తగిన కర్మఫలాన్ని అనుభవించారు. బృందారకులచే ప్రార్థింపబడిన పితామహుడు చక్కని సామగానంతో వజ్రాంగుని సంతోషపెట్టి దేవతలందరిని విడిపించాడు.

శివభక్తుడు, శుద్ధాత్ముడు ఐన వజ్రాంగుడు బ్రహ్మను చేరి ఇలా అన్నాడు. "ఓ బ్రహ్మా! నాకెవరిపైన రాగద్వేషాదులు లేవు. నా తల్లి ఆజ్ఞ మేరకు నే దేవతలను చెరపట్టాను. నాకు రాజ్యకాంక్షలేదు. నాకు చరమమైన, నిత్య సుఖదాయకమైన ఆత్మసారాన్ని బోధించండి."

అతని మాటలకు ప్రీతుడై "ఒక్కమాటలో చెపుతున్నాను విను. జ్ఞాన వైరాగ్యాది సాత్త్విక భావనలే తత్త్వసారం" అని బోధించి వరాంగి అను శ్రేష్ఠ కన్యను సృష్టించి అతనికిచ్చి వివాహం జరిపించి, తన ధామను చేరుకొన్నాడు బ్రహ్మ. జరిగిన దానికి కశ్యపుడు కూడ ఆనందించాడు. దితి పుత్రుడైన వజ్రాంగుడు పరమ సాత్త్వికభావ సంపన్నుడై వరాంగితో కాపురం చేసికొంటున్నాడు. కాని వరాంగి మాత్రం హృదయంలో సాత్త్విక భావాలు లేనిదై, కోరికలతో భర్తను సేవించేది. వజ్రాంగుడు సుప్రీతుడై ఆమె మనోభీష్టాన్ని తెలుపవలసిందని కోరగా ముల్లోకాలను పరిపాలించగలవాడు, ఇంద్రునిసైతం దుఃఖ పెట్టగలవాడు, పరాక్రమశాలి ఐన పుత్రుడు కావాలని కోరింది.

ఆమె కోరికను విని ఆశ్చర్యాన్ని, దుఃఖాన్ని పొందిన వజ్రాంగుడు తీవ్ర మనస్తాపానికి గురియై ధర్మ సంకటంలో పడి తనకిష్టం లేకపోయినా ప్రియురాలి కోర్కెను తీర్చాలని నిశ్చయించుకొన్నాడు. మునులారా! శివ సంకల్పము, దేవతల కర్మఫలము వరాంగి నోట అలా పలికించి ఉండాలికాని కాకపోతే దితిపుత్రుడైన వజ్రాంగుడు పరమ సాత్త్విక భావ సంపన్నుడగుట యేమి? బ్రహ్మకూతురైన వరాంగి కామనావిలసిత అగుట ఏమి!

త్రిలోకాధి పత్యంవహించగల కుమారుడు బ్రహ్మ వాక్కుచే తక్క కలుగడని నిశ్చయించుకొని తపస్సు చేసి బ్రహ్మచే వరాన్ని పొంది, గృహోన్ముఖుడయ్యాడు వజ్రాంగుడు.

**తారకాసుర వృత్తాంతం**

మునులారా! కొంత కాలానికి వజ్రాంగుని భార్య వరాంగి గర్భవతియై నెలలు నిండగానే మహా కాయుడు, మహావీరుడు ఐన కుమారుని కన్నది. దేవతలందరికి దుఃఖాన్ని కలిగింపబోయే ఆ బాలుడు పుట్టగానే, పీడను కలిగించే మహోత్పాతాలు పుట్టి ద్యులోకమునందు, భూలోకమునందు, అంతరిక్షమందు సర్వ ప్రాణులకు భీతిని కలిగించాయి. వాటిని చెపుతున్నాను వినండి.

పుట్టగానే ఆ బాలుడు చేసిన రోదనానికి ఇంద్రుని సింహాసనం తూలింది. ఉల్కలు వర్షించాయి. పిడుగు చప్పుళ్ళకు చెవులు చిల్లులు పడ్డాయి. క్రూర జంతువులు అధికంగా పుట్టాయి. కుల పర్వత కానన సహితంగా భూమి కంపించింది. దిక్కులు మండినై, సముద్రాలలో క్షోభ పుట్టింది. భీకర వాయువులే సైన్యంగా, ధూళియే ధ్వజంగాగల మారుతుడు

పెద్ద హోరుతో వీచి మహా వృక్షాలను నేలకూల్చాడు. సూర్యచంద్రుల చుట్టూ పరివేష మండలాలు ఏర్పడ్డాయి.

కొండ గుహల్లోంచి రథ శబ్దాలను పోలిన భయసూచకాలైన భూకంపాలు పుట్టాయి. నక్కలు నోట్లోంచి నిప్పులు కక్కుతూ కఠోరంగా అరుస్తూ యథేచ్ఛగా తిరిగాయి. వాటికి గుడ్లగూబల ధ్వనులు తోడయ్యాయి. కుక్కలు నేలను తవ్వుతూ శిరస్సును పైకెత్తి రోదించాయి. గాడిదలు గుంపులు గుంపులుగా తిరుగుతూ గిట్టలతో నేలను తన్నుతూ ఓండ్ర పెట్టాయి.

భీకర శబ్దాలకు భయపడిన పక్షులు గూళ్ళను వదిలిపెట్టి పారిపోయాయి. అలా ఎగురుతూ చచ్చినేలకు రాలాయి. పశువులు ఎవరో కొడుతున్నారా అన్నట్లు స్థిరంగా ఉండలేక అటు ఇటు తిరుగుతూ మలమూత్రాలను విసర్జించినాయి. గోవులు బాష్పనేత్రాలతో రక్తాన్ని స్రవించాయి. పాలిచ్చినా ఆ పాలు దుర్గంధ భరితంగా ఉన్నాయి. మేఘాలు చీమును వర్షించాయి. దేవతా ప్రతిమలు తుళ్ళిపడి కన్నీరు కార్చాయి. ఆకాశంలో గ్రహయుద్ధం జరిగింది. ఇంకా అనేక ఉత్పాతాలు సంభవించాయి.

వాటిని చూచి ముల్లోకాల జనులు భయభ్రాంతులయ్యారు. ఆ బాలునికి కశ్యప ప్రజాపతి తారకుడని నామకరణం చేశాడు. తారకుడు శీఘ్రంగా పెరిగి పెద్దవాడై బ్రహ్మను గూర్చి తపస్సు చేసి వరాలను పొందాలనే సంకల్పంతో తల్లిని అనుజ్ఞ ఇమ్మని కోరాడు. తల్లి అనుమతించింది.

తారకుడు మధువనాన్ని చేరి బ్రహ్మను గూర్చి తపస్సు మొదలు పెట్టాడు. చేతులు పైకెత్తి ఒంటి కాలిపై కొంతకాలం, కేవలం బొటన వ్రేలిపై నిలిచి కొంతకాలం, నీటిని త్రాగుతూ కొంత కాలం, గాలిని భక్షించి కొంత కాలం, నీటిలో నిలబడి, నేలపై నిలబడి, అగ్నుల మధ్య, అరచేతిపై నేలపై నిలబడి, చెట్టుకొమ్మకు చేతులతోను కాళ్ళతోను వ్రేలాడుతూ కొంతకాలం ఇలా కొంతకొంత కాలం చొప్పున కొన్నివందల సంవత్సరాలు మహాఘోరంగా వినేవారికి విస్మయం కలిగే విధంగా తపస్సుచేశాడు. అతని శిరస్సు నుండి గొప్ప తేజస్సు పుట్టి మహోపద్రవాన్ని కలిగించింది.

అంత ఈ విపత్తు నుండి లోకాలను రక్షించమని గీర్వాణులు సృష్టికర్త ఐన బ్రహ్మను కోరగా; లోకోపద్రవానికి హేతువు నూహించి తారకుని ఎదుట ప్రత్యక్షమయ్యాడు పితామహుడు. ప్రత్యక్షమై తారకునితో "వత్సా! నీ ఉగ్రతపస్సుకు లోకాలన్ని వ్యాకులపడ్డాయి. నీ మనోరథం నెరవేరే వరాన్ని కోరుకో. తప్పక ఇస్తాను." అన్నాడు.

అంత తారకుడు ఇలా రెండు వరాలను కోరాడు: "పితామహా! నీ సృష్టిలో మత్తుల్యుడైన బలవంతుడు మరొక పురుషుడు ఉండరాదు. శివ వీర్యంచే జన్మించిన కుమారుడు సేనాపతియై ఏనాడు నాపై ఆయుధాన్ని ప్రయోగిస్తాడో అప్పుడు మాత్రమే నాకు మరణాన్ని అనుగ్రహించు." ఈ రెండు దుర్ఘటమైన వరాలను తారకునకిచ్చి తన లోకానికి చేరుకున్నాడు బ్రహ్మ.

అంత ఆ రాక్షసుడు శోణితమనే తన నగరానికి చేరుకొన్నాడు. అసురగురువైన శుక్రాచార్యుడు బ్రహ్మగారి ఆజ్ఞచే అఖిల అసుర, దైత్య, దనుజ, పూర్వదేవ, దానవ గణాల మధ్య తారకుణ్ణి ముల్లోకాలకు సార్వభౌముణ్ణి చేసి అభిషేకించాడు.

వాడు యథావిధిగా రాజనీతిని ప్రవర్తిల్లజేస్తూ ప్రజలను చక్కగా పాలించాడు. భూమిని దున్నకుండ పంటలు పండాయి. ఎవరికీ దుఃఖం కలగకుండా సూర్యుడు ప్రకాశించాడు. అంతటా వెన్నెల విరిసింది. వాయువు అందరికి అనుకూలంగా వీచింది. ఎక్కడా అగ్ని ప్రమాదాలు లేవు. సముద్రుడు చెలియలి కట్ట దాట లేదు. పంచభూతాలు హద్దుల్లో సంచరించాయి. ప్రకృతి భీభత్సాలు లేవు.

కాని వాడు తల్లి ఆజ్ఞను నెరవేర్చి, ఆమెను సంతోషపెట్టగోరి దేవతలను మాత్రం అధికంగా బాధించాడు. దేవతల వద్ద నున్న శ్రేష్ఠ వస్తువులను లాక్కున్నాడు. ఇంద్రుడు భయంతో స్వయంగా ఐరావతాన్ని సమర్పించాడు. కుబేరుడు నవ నిధులను ధారపోశాడు. వరుణుడు శ్వేతాశ్వాలను, సూర్యుడు ఉచ్చైశ్రవాన్ని కానుకలుగా తెచ్చి ఇచ్చారు. ఋషులు కామధేనువును బహుమానంగా ఇచ్చారు. అతను ముల్లోకాలను వశం చేసికొని ఇంద్ర పదవిని అధిష్ఠించి, దేవతల నందరిని తరిమి ఆ పదవులలో దైత్యులను నియమించాడు. తన సేవకులుగా దేవ జాతులను వియోగించాడు. అపుడు ఇంద్రునితోకూడి సర్వదేవతలు దిక్కు తోచని వారై అతి విహ్వలులై బ్రహ్మగారిని శరణు పొందారు."

**బ్రహ్మ దేవతల నోదార్చి ఉపాయాన్ని చెప్పుట**

దేవతలందరు బ్రహ్మతో ఇలా మొరపెట్టుకొన్నారు. "ఓ లోకనాథా! తారకుడు నీ వర గర్వితుడై మమ్ములను పదవీ భ్రష్టులను చేశాడు. అహర్నిశలు ఈ దుఃఖం మమ్ము పీడిస్తోంది. మేం ఎక్కడకు వెళ్ళినా వాడక్కడే ప్రత్యక్షమవుతున్నాడు. నిద్రనేది లేదు. చివరకు చిన్న కునుకు పడితే కలలోకూడా వాడే కనిపిస్తున్నాడు. దిక్పాలకులైన మేమంతా వాడి ముందు బానిసలమై చేతులు కట్టుకొని నిల్చుంటున్నాం. ఒక్క క్షణం కూడా స్వాతంత్ర్యం లేకుండా ఉంది. చివరకు ఎంత పాపం చేసి ఈ దేవతాజన్మను పొందేమో అని అనుకొనే స్థితికి వచ్చాం.

యజ్ఞాలు లేవు, హవిస్సులు లేవు, తపస్సు లేదు. వాడిసేనాపతి క్రౌంచాసురుడనే మహాపాపి ఒకడున్నాడు. వాడు రోజూ పాతాళానికి వెళ్ళి అక్కడి వారిని బాధిస్తున్నాడు. మేము అతనిపై ప్రయోగించిన అస్త్రాలన్నీ సన్నిపాత రోగికి ఇచ్చిన ఔషధం వలె నిర్వీర్యమై పోయాయి. చివరగా ఒక్క మాట! విష్ణువు సుదర్శన చక్రం మీద మాకు గొప్ప ఆశ ఉండేది. అది వాడి మెడలో పూలమాలయై కూర్చుంది. మాకేదైనా ఒక సురక్షిత స్థానాన్ని చూపించు. మేమక్కడికి వెళ్ళి స్వస్థులమై బ్రతుకుతాం."

దేవతా ప్రార్థితుడైన బ్రహ్మ సమాధానంగా ఇలా అన్నాడు. "ఓ బృందారకులారా! వాణ్ణి సంహరించటం నా కర్తవ్యం కాదు. వాడు నా ఆజ్ఞ చేతనే పెరిగి పెద్ద వాడయ్యాడు. విషవృక్షమైనా పెంచిన వ్యక్తి తన చేతులచే దానిని నరకలేడుగదా! మీ వాంఛితాన్ని నెరవేర్చగలవాడు శంకరుడొక్కడే. శివ వీర్యం వలన జన్మించిన కుమారుడు తారకుని వధింపగలడు. సతీ వియోగానంతరం శివుడు జ్ఞాననిష్ఠలో ఉండి హిమవత్పర్వత ప్రాంతంలో తపస్సు చేసికొంటున్నాడు. పార్వతి చెలులతో కలసి ఆయనకు సేవలు చేస్తోంది. చంద్రశేఖరుడామెను వివాహం చేసికొనేటట్లు మీరు దృఢ ప్రయత్నం చెయ్యండి. వారిద్దరికి పుట్టిన కుమారస్వామి, తారకుని తప్పక వధించగలడు. నేనీ లోపులో తారకుని కలిసి వాని మొండి పట్టుదలను నివారిస్తాను." విధాత చెప్పిన ఉపాయానికి ప్రహృష్ట మానసులై దేవతలు తిరిగి వెళ్ళారు.

బ్రహ్మగారు తారకుని వద్దకేగి ఇలా హితవును బోధించారు. "ఓ వత్సా! ఈ స్వర్గం తేజస్సారం. నేను నీకిచ్చిన వరంకంటె అధికంగా కోరుకొంటున్నావు. నేను నీకు స్వర్గాధిపత్యాన్ని వరంగా ఈయలేదు. కనుక స్వర్గ పరిత్యాగం చేసి భూమండలాధి పత్యాన్ని వహించు. ఈ స్వర్గ సౌఖ్యాలన్నీ అక్కడా ఉన్నాయి."

బ్రహ్మగారి హిత వచనాలను అంగీకరించి తారకుడు స్వర్గపరిత్యాగం చేసి భూలోకానికి శోణితపురికి వచ్చి పరిపాలన చేసికొంటున్నాడు. ఇంద్రాది దేవతలంతా తదుపరి కర్తవ్యనిష్ఠులై శివునికి శివాదేవి యందు అనురాగ వృద్ధి కలిగే నిమిత్తమై మన్మథ సహాయాన్ని కోరి వర్తమానం పంపేరు.

**ఇంద్రుడు మన్మథ సహాయాన్ని కోరుట**

తక్షణం మన్మథుడు రతీ సహాయుడై అమరేంద్రుని సన్నిధికి వచ్చి ప్రణమిల్లి గర్వంతో ఇలా అన్నాడు: "ఓ దేవరాజా! నాకు వర్తమానాన్ని పంపిన వైనం ఏమిటి? తక్షణం చెప్పు. త్రిమూర్తులను

సైతం కామ పీడితులను చెయ్యగలను. ఇతరుల లెక్కేమిటి? నేను పంచ బాణుడను, కుసుమాస్త్రుడను. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము, మృదువైన ఈ పుష్పాలు నా ఆయుధాలు. తుమ్మెద బారు నా నారి. ఇక్షుఖండం నా ధనుస్సు. వసంతుడు నాకు సచివుడు. సుధానిధి ఐన చంద్రుడు నాకు మంచి మిత్రుడు. శృంగారం సర్వసైన్యాధిపతి. హావ భావాలు నా సైనికులు. సర్వము సౌకుమార్యం! నేను కూడా సుకుమారుడనే! ఏ కార్యం దేనిచే పూర్తవుతుందో బుద్ధిమంతుడు ఆ కార్యాన్ని దానితో పూర్తిచేయాలి. నాకు ఉచితమైన కార్యాన్ని చెప్పి అందులో నన్ను నియోగించు."

కందర్పుని ఉత్సాహాన్ని వేయి కన్నులతో పరికించిన బృందారక సార్వభౌముడు అంతరంగంలో ఆనందించి తనదైన్యాన్ని తోపనీయకుండ ప్రీతి పూర్వకంగా ఇలా మాట్లాడేడు.

"ఓ కుసుమాయుధా! అలా వర్తమానం పంపగానే ఇలా వచ్చిచేరిన నీ ఉద్యమ శీలత మెచ్చదగినది. నిన్ను పిలిపించిన నా కార్యం నీ కార్యమే గాని మరొకటి కాదు. నాకు మిత్రులు చాలా మంది ఉన్నారు. కాని నీతో సమానమైన సన్మిత్రుడు లేడు. అమిత ప్రతాపా! జయార్థం నావి అనుకొనేవి రెండున్నాయి... నా వద్ద. అందులో ఉత్తమమైనది ఈ వజ్రాయుధం. రెండవది అంతకంటె ఉత్తమమైన వాడవు నీవు. వజ్రం నిష్ఫలం కావచ్చు కాని నీవు నిర్వీర్యుడవు కావు.

ఓ మీనకేతనా! ఎవడు హితాన్ని చేస్తాడో వానికంటె అధిక ప్రీతిపాత్రుడు ఎవడుంటాడు? కాల ప్రభావం చేత నాకు అసాధ్యమైన దుఃఖం సంప్రాప్తమైంది. నువ్వు తక్క వేరెవరూ దాన్ని పోగొట్టలేరు. దుర్భిక్షా కాలమందు దాతృత్వము, యుద్ధమునందు శౌర్యము, ఆపత్కాలమందు మైత్రి, భర్త అశక్తుడైతే కులస్త్రీ యొక్క పాతివ్రత్యము నిగ్గు తేలుతాయి. వాటికవి పరీక్షా కాలాలు. దేవతలందరికి వచ్చిన ఆపదనుండి గట్టెక్కించు."

బిడౌజుని బేలతనానికి నివ్వెరపోయిన మకరధ్వజుడు శివమాయామోహితుడై స్మితపూర్వక ప్రేమ గంభీర వచనాలనిలా పలికేడు.

"ఓ జంభారీ! ఏమిటీ పేద మాటలు! నేను నీకు సమాధానం చెప్పను. నా కార్యం పరిసమాప్తిలోనే నా శక్తిని గుర్తించెదవు గాక! అధిక ప్రసంగి కార్యాన్నేమి చెయ్యగలడు? ఎవరి తపస్సునైనా భ్రష్టు పట్టించ మంటావా? కుబేర సఖుడు, ఆదిభిక్షువు ఐన రుద్రుణ్ణి ప్రేమ భిక్షను యాచించే దీనుణ్ణి చెయ్యమంటావా? చెప్పు."

దర్పంతో పలికిన కందర్పుని ప్రసంగాన్ని అక్కడే దొరక పుచ్చుకొని అమరేంద్రుడు అమితానందంతో అతనితో "ఓ అద్వితీయ ప్రభావా! ఆ ద్వితీయ కార్యమే నీవల్ల నెరవేర వలసి ఉంది" అని పలికి, తారకాసుర వృత్తాంతాన్ని, శివుని తపస్సును పార్వతి సేవలను గురించి చెప్పి ఎలాగైనా శంకరునికి పార్వతియందు ప్రేమ పుట్టునట్లు చేసి కార్యాన్ని సఫలం చేయవలసిందిగా వేడుకొన్నాడు. మారుడు సరేయని ససైన్యంగా శివ స్థానానికి తరలి వెళ్ళాడు.

**కాముని విజృంభణం**

అక్కడ మన్మథ ప్రభావంచే ముందుగా వసంతం వనంలో ప్రవేశించింది. మ్రానులన్నీ చిగురు జొంపాలతో మనోహరంగా ఉన్నాయి. మావిచిగుళ్ళు మన్మథుని కత్తుల్లా తళుకు లీనుతున్నాయి. అశోకవనికా సుమాలు సుగంధాన్ని వెదజల్లుతున్నాయి. వసంతాగమనాన్ని ఎల్లెడలా చాటుతూ కోకిలలు కలకూజితాలను చేస్తున్నాయి. ప్రఫుల్లకైరవిణీ సమూహంతో సరస్సులన్నీ శోభాయమానంగా నేత్రపర్వంగా ఉన్నాయి. తుమ్మెదలు కమ్మగా గానం చేస్తున్నాయి. వెండి జలతారు వంటి వెన్నెల దారాలతో చంద్రుడు ప్రేయసీ-ప్రియుల మధ్య దూత కార్యాన్ని నిర్వహిస్తున్నాడు. కామదేవుని రాజ మందిరంలోని కర్పూర దీపంలా కలకల వెలిగి పోతున్నాడు కళానిధి. సాంద్రచంద్రికా విభవవికీర్ణమాన తుషారభూధరం; జ్యోత్స్నాపూరాన్ని ద్విగుణీకృతం చేస్తున్నది. మందాకినీ జలాలలో వెన్నెల కరిగి, ప్రవాహ రూపంలో చంద్రికామృతాన్ని మోసుకొస్తూన్నదా అన్నట్టుంది గంగ.

ఆ తపోవనమంతా విరహోత్కంఠిత నాయికలా వేగిపోతూన్నది. సర్వ సృష్టి మన్మథ ప్రతాపానికి తల వంచింది. వసంతుని ప్రభావం వనౌకసులకు సైతం దుస్సహమైంది. ఈ అకాల వసంతాన్ని శివ ప్రభువు చూచి ఆశ్చర్యాన్ని పొంది తిరిగి సమాధి నిష్ఠుడయ్యాడు. కుసుమాస్త్రుడు అప్పటికి అరవిందము, అశోకము అనే రెండు పుష్ప బాణాలను శివునిపై ప్రయోగించాడు కాని అవి హర్షణము (ఇష్టం లేక సంతోషం) రోచనము (ప్రకాశము) అనే క్రియలను నెరవేర్చలేక నిష్ఫలమయ్యాయి.

ఇప్పుడు మోహాన్ని (మోహనము) పుట్టించే చూతాన్ని ధనుస్సుకు సంధించి రతీదేవికి ఎడమప్రక్కన నిలబడి శంకరునిపై ప్రయోగించాడు. ఆ శర ప్రయోగానికి సకల జనులు మోహ విభ్రాంతులయ్యారు. శృంగార రసం మన్మథునికి సహాయంగా తన హావ, భావ, లీలా, విలాసాదులతో శంకరుని సమీపించింది. మునులారా! మదనునికి అప్పటికి శరీరం

ఉన్న కారణంగా ప్రకటంగానే సంచరిస్తున్నాడు. శంకరునిలో ఎట్టి వికారాన్ని కనుగొనలేక అతడు భయభ్రాంతుడయ్యాడు.

ఇంతలో గిరిజాదేవి సఖీ జనులతో కూడి పూజా ద్రవ్యాలతో శంకరుని సమీపించింది. సృష్టిలోని సౌందర్యమంతా మూర్తిమంతమైనట్లుంది ఆమె. నానావిధ పుష్ప సమలంకృత యైన ఆమె పూల తేరులా ఉంది. అప్పటి వరకు నిస్తరంగ సముద్రంలా, గర్జితం లేని నీల మేఘంలా ధ్యాననిశ్చలుడైన చంద్ర శేఖరుడు ధ్యానాన్ని వీడి; భానుని కిరణాల సోకుకు విచ్చుకొన్న కమలంలా కన్నులు తెరిచి చూచాడు. అవకాశం కోసం ఎదురు చూస్తున్న మదనుడు అదనెరిగి హర్షణ సామర్థ్యం కల అరవిందమనే పుష్ప బాణాన్ని ప్రయోగించాడు.

కన్నులు తెరిచిన గంగాధరుని యెదుట హిమగిరి కన్యకామణి! జగన్మాత! పార్వతి! సన్నని నడుము, రింగులు వారగా కట్టిన కెంపురంగు పట్టు చీర! పూలగుత్తులను, లేత చిగుళ్ళను ఆభరణాలుగా ధరించి నడచి వచ్చిన నును తీగలా ఉంది. మొల నూలుగా నడుముకు అలంకరించుకొన్న కేసర పుష్పదామం మాటి మాటికి జారిపోతుంటే హస్తపద్మాలతో సవరించుకొంటూన్నది. పద్మ భ్రాంతితో ఆమె ముఖం చుట్టూ తిరుగుతూన్న భ్రమరాన్ని లీలా కమలంతో అదలిస్తూన్నది.

కన్నులు తెరిచిన శంకరుని చూచి పార్వతి ఎంతో భయ భక్తులతో గోరు సోకకుండ కోసిన కుసుమాలను దోసిట నింపి కౌను కంపింప, అర్ధచంద్రుని వంటి ఫాల భాగం చెమర్చ పరమేశ్వరుని పాద పద్మాలకు సమర్పించి పాదపూజ చేసింది. చెవికి అలంకారంగా అలంకరించుకొన్న సంపంగి మొగ్గ ఒకింత జారగా భావి భర్తయైన భుజగ భూషణునకు, అంధకారాతికి వందనం చేసింది. భాను దీప్తులకు వికసించి తేనెలూరుతున్న ఆకాశగంగా పద్మమాలను పాణి పల్లవాలు వణకగా శశిమౌళికి సమర్పించింది. ఆమె ఆదరంగా అందించిన పద్మమాలను అందుకొన్నాడు శ్రీకంఠుడు. అదే అదనుగా సమ్మోహనాస్త్రాన్ని వింట సంధించాడు పంచబాణుడు. పక్వబింబాధరి, చంద్రముఖి, ఆకర్ణాంత విశాలనేత్ర ఐన పార్వతీ ముఖావలోకనం చేశాడు చంద్రకళా ధరుడు. చంద్రోదయారంభ వేళ దుగ్ధ సాగరం పొంగినట్లు అనురాగం వెల్లివిరిసి ఆమె ముఖసౌందర్య దర్శనకాంక్షాతత్పరుడై చేతోవికారాన్ని పొందేడు లోకభర్త.

**కామ దహనం**

మునులారా! అనంతరం ఇందుధరుడు ఇంద్రియ క్షోభను బలాత్కారంగా అణచుకొని చిత్త చాంచల్య హేతువును తెలియగోరి దిక్కులను పరికింపగా గర్విష్ఠి, మూఢ చేతసుడు, మండలీకృత కార్ముకుడు ఐన మన్మథుడు కనుపించాడు. ఆకుంచిత సవ్యపాదుడై (కుడికాలు ముందుకు వంచి) తన ఎడమప్రక్కనే నిలబడి శరప్రయోగానికి సిద్ధంగా ఉన్న కుసుమ శరుని చూచి సక్రోధుడై కనుబొమలు ముడిచాడు విరూపాక్షుడు. వెంటనే లలాటేక్షణుని సముజ్జ్వలజాలా జాలితంబైన ఫాలాగ్ని భువనాలన్నీ భయభ్రాంతాలై హాహాకారాలు సేయగా శర, శరాసన, తూణీరాలతో కూడ మన్మథుణ్ణి భస్మం చేసింది.

దేవతలందరు దుఃఖితులయ్యారు. పార్వతి వైవర్ణ్యాన్ని పొంది మనోవైకల్యంతో చెలులతో కలిసి గృహోన్ముఖురాలైంది. భర్త మరణానికి రతీదేవి నేలకూలి ఆక్రోశించి దేవతలను నిందించింది. ఆమె దుఃఖాన్ని చూచి వనమంతా శోకించింది. భవిష్య జ్ఞానం గల ఇంద్రుడు ఆమెను సమీపించి ఇలా అనునయించాడు.

"ఓ రతీదేవీ! నీకు శుభం కలుగుతుంది. నీ భర్త దేవకార్యానికై ప్రాణత్యాగం చేశాడు. శోకించకు. కొద్దిగా భస్మను శ్రద్ధగా భద్రం చెయ్యి. శంకరుడు నీ భర్తను పునర్జీవితుణ్ణి చెయ్యగలడు. జీవులకు సుఖదుఃఖాలను ఎవరూ ఇవ్వరు. కర్మ ఫలాన్ని అనుభవిస్తారు. అంతే! నువ్వు వ్యర్థంగా దేవతలను నిందిస్తున్నావు."

రతీదేవినిలా అనునయించి అమరేంద్రుడు దేవతలతో కూడి రుద్రునిలా ప్రార్థించాడు.

"భగవాన్ శంకరా! నువ్వు శరణాగత వత్సలుడవు. నిన్ను మేము శరణు పొందేం. కాముడు ఈ పనిని చెయ్యటంలో అతని స్వార్థం ఏముంది? తారకునిచే పీడితులైన దేవతలు ఈ కార్యాన్ని అతనిచే చేయించారు. మన్మథ సంహారంతో దేవతలందరిని సంహరించినట్లే అవుతుంది. కాముడు నశిస్తే ఈ పైన సృష్టి కార్యం ఎలా కొనసాగుతుంది? అవతల రతీదేవి ఏడుస్తోంది. ఆమెకు శుభ వచనాలను చెప్పు."

శంకరుడంత సంతుష్టాంతరంగుడై క్రోధాన్ని ఉపసంహరించుకొని దేవతలనిలా సాంత్వన పరచాడు.

"ఓ అమరులారా! ఋషులారా! జరిగిందేదో జరిగింది. రాబోయే ద్వాపరంలో హరి కృష్ణుడై అవతరించి రుక్మిణీ దేవియందు ప్రద్యుమ్నుడనే కుమారుని కంటాడు. ఈ

మన్మథుడే ఆ ప్రద్యుమ్నుడై అవతరించగలడు. ఆ బాలుని పుట్టగానే శంబరాసురుడు అపహరించి సముద్రంలో పారవేసి మరణించాడనే భ్రమతో తన నగరానికి వెడతాడు. ఓ రతీ! నువ్వు అంత వరకు ఆ నగరంలో ఉండు. ప్రద్యుమ్నుడు శంబరుని వధించి నిన్ను వివాహం చేసికొంటాడు. అంత వరకు కాముడు శరీరంలేని వాడై ఉంటాడు.

ఐతే కాముని ఇప్పుడే జీవింపచేస్తున్నాను. అతడు నా మారగణాలలో ఒక గణంగా ఉంటాడు. ఇలా పలికి శివుడు తన నిజస్థానానికి వెళ్ళిపోయాడు.

**శివుని ఫాలాగ్నియే సముద్రబడబాగ్ని**

శివుని ఫాలాగ్ని మన్మథుని దహించి మరొక ప్రయోజనం లేనిదై ముల్లోకాలను దహించటం మొదలు పెట్టింది. ప్రాణులన్ని పితామహుని శరణువేడగా ఆయన శంకరుని స్మరించి ఆ అగ్నిని స్తంభింప చేశాడు. దానిని సౌమ్యమగు జ్వాలలను వెదజల్లు ముఖంగల బడబ (గుర్రము)గా మార్చి వేసి సముద్రుని దగ్గరకు వెళ్ళాడు. సముద్రుడు పురుష రూపాన్ని ధరించి చేతులు జోడించి బ్రహ్మను స్తుతించి "నే నెరవేర్చగల కార్యమేమిటి?" అని కోరగా లోకహితాన్ని కోరి బ్రహ్మగారిలా అన్నాడు.

"ఓ సముద్రుడా! ఈ బడబాగ్నిని ప్రలయకాలం వరకు నువ్వు ధరించు. అప్పుడు నేను వచ్చి ఇక్కడ నివసిస్తాను. నువ్వు ఈ శంకర లలాటాగ్నిని ఆ సమయంలో విడిచిపెట్టు. ఇదెప్పుడూ నోట్లోంచి నిప్పులు కక్కుతూ ఉంటుంది. ఈ అగ్నికి నీ జలాలే భోజనం కాగలదు. ఇది నీ గర్భంలోకి వెళ్ళకుండ జాగ్రత్త వహించు. ఇది జలాలను మాత్రమే దహిస్తుంది."

అని చెప్పి బ్రహ్మగారు అంత బడబను సముద్రునకు అప్పచెప్పి తాను అంతర్ధానమయ్యాడు. లోకాలన్ని సంతోషించాయి."

**పార్వతికి నారదోపదేశం**

సూతుడు తదనంతర వృత్తాంతాన్ని మునులకిలా చెపుతున్నాడు. మహాధ్వనితో పుట్టిన శివుని ఫాలాగ్నికీలలకు పార్వతి భయపడి ఇంటికి వచ్చి తల్లిదండ్రుల ఒడిలో తలపెట్టుకొని దుఃఖించింది. తాను పునర్జన్మను పొందినట్లు భావించింది. శివుని మీది ప్రేమచే ఎక్కడా సుఖాన్ని పొందలేక పోయింది. తన దురదృష్టాన్ని తానే నిందించుకొంది. ఎవరెంత ఓదార్చినా ఆమెకు దుః ఖోప శమనం కలుగ లేదు సరిగదా విరహ వేదన అధికం కాజొచ్చింది.

ఒక రోజున త్రిలోక సంచారం చేస్తూ నారద మహర్షి వచ్చారు. వచ్చిన మహర్షికి స్వాగత సత్కారాలు జరిపి గతమంతా వివరించి కర్తవ్యమేమని కోరగా, శివారాధనయే కర్తవ్యమని ఆయన గిరిరాజుకు బోధించాడు. పార్వతిని ఏకాంత మందిరంలోనికి తీసుకొని వెళ్ళి ఇలా ఉపదేశించాడు. "ఓ గిరిరాజ నందినీ! నీ మనోగతం నాకు తెలుసు. నువ్వు శంకరునికి సేవలు చేశావే, కాని తపస్సు చెయ్యలేదు. తపస్సువల్ల కాని కార్యం సిద్ధించదు. నిన్ను తప్ప ఆ శశాంక శేఖరుడు, అన్యస్త్రీ పాణిగ్రహణం చెయ్యడు." అని భావి శుభాన్ని చెప్పి శివ పంచాక్షరిని ఉపదేశించి, ఈ మంత్ర మహిమచే శివుడు శీఘ్రంగా ప్రసన్నుడవుతాడని చెప్పి తన ధామానికి వెళ్ళి పోయాడు.

## పార్వతీ తపో వర్ణనం

అంత ఆ కాళికా దేవి జయ, విజయ అనే ఇద్దరు చెలికత్తెలతో కలిసి తండ్రిని చేరి ఆయన అనుమతిని చెలులచే అడిగించింది. ఆయనిలా అన్నాడు. "అమ్మాయీ! ఇంతకంటె కులానికి సార్థక్యాన్ని చేకూర్చే మంచి కార్యమేముంటుంది చెప్పు! అమ్మతో కూడా చెప్పి అంగీకారం తీసుకో." వెంటనే గిరిజాదేవి తల్లిని సమీపించి సఖులచే ఆమె అనుమతిని కోరింది. పార్వతి మాటలకు మేనాదేవి దుః ఖితురాలై ఇలా పలికింది.

"హే శివే! పూర్వం సేవలు చేసి దుఃఖాన్ని పొందేవు. ఇప్పుడు మళ్ళీ తపస్సంటున్నావు. తపస్సుకు ఎక్కడికి వెడతావు? అదేదో ఇంట్లో ఉండి చెయ్యి. నువ్వు మొండిపట్టు పట్టకు. గతంలో ఏం సాధించావు? ఇకముందు ఏం సాధించ బోతున్నావు? దేవతలందరు మనింట్లోనే ఉన్నారు. సర్వ తీర్థాలు, క్షేత్రాలు ఇక్కడే ఉన్నాయి. అసలే నీ శరీరం సుకుమారమైనది. తపస్సులో ఉండే క్లేశాన్ని ఎలా ఓర్చుకోగలవు? తమ కోర్కెలను సాధించుకొనటం కోసం స్త్రీలు తపోవనానికి వెళ్ళారని గతంలో వినలేదు. కనుక ఇల్లు కదలకు."

తపస్సుకు వనానికి వెళ్ళవద్దని తల్లి నిషేధించిన కారణంగా (ఉమా=అమ్మాయీ! వద్దు) పార్వతికి ఉమా అనేపేరు స్థిరపడింది. తల్లి వద్దన్నందుకు పార్వతి శోకతప్తురాలైంది. కుమార్తె దుఃఖాన్ని చూడలేక ఎట్టకేలకు విధిలేక అంగీకరించింది మేనక.

అలా పార్వతి తల్లిదండ్రుల అనుమతిని, ఆశీర్వాదాన్ని పొంది సఖీ జనంతో కలిసి గంగానది దివి నుండి భువికి దిగిన గంగావతరణమనే పవిత్ర స్థానానికి చేరుకొంది. అక్కడే శివుడు తపస్సు చేసి కాముణ్ణి దహించాడు. ఆమె తన కిష్టమైన చీనాంబరాలను విసర్జించి, నార చీరలను ధరించి మౌంజీ బంధంతో శోభిల్లింది. గంగావతరణ శిఖర

ప్రాంతానికి వచ్చి గతమంతా గుర్తుకు రాగా 'హా! హరా!' అంటూ విరహంతో చింతాశోక తప్తురాలైంది. ఆపై ధైర్యాన్ని వహించి తపోదీక్షలో కూర్చుంది. గౌరి తపస్సు చేసిన కారణంగా ఆ శిఖరానికి గౌరీ శిఖరమనే పేరు వచ్చింది.

ఆమె తపస్సు యొక్క కాల గణనం కొరకు సుందరము, పవిత్రము ఐన ఫల వృక్షాలను నాటింది. ముందుగా భూమిశుద్ధి చేసి, వేదికను నిర్మించి మునులకైనా దుష్కరమైన తపస్సును చేయ ప్రారంభించింది. గ్రీష్మ కాలంలో అగ్ని జ్వాలల మధ్య, వానకాలంలో వర్షం కురుస్తూండగాను, శీతువు నందు నీళ్ళలోను నిలబడి తపస్సు చేసింది. ఈ విధంగా పంచాక్షరీ మంత్రజప పరాయణురాలై శివుని ధ్యానించింది. ఆమె ప్రతిదినము తను నాటిన శుభ వృక్షాలకు జలసేచనం చేసేది. వచ్చిన మునులకు ఆనందంతో స్వాగత సత్కారాలను ఇచ్చేది.

ఆ దేవి ముందు ఫలాలను, ఆ తరువాత పత్రాలను భుజించి తపస్సు చేసింది. కాలం గడవగా వాటిని కూడా విసర్జించింది. ఆకులను సైతం భుజించటం విడనాడింది కనుక దేవతలామెకు 'అపర్ణ' అని నామకరణం చేశారు. నిరాహారయై, ఏకపాద స్థితయై తపస్సు చేసింది. ఆమె శిరోజాలు జడలు కట్టాయి. ఏ స్థానంలో శివుడు పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడో అదే స్థానంలో పార్వతి మూడువేల సంవత్సరాలు తపస్సు చేసింది. ఐనా శివానుగ్రహం లభించలేదు.

ఒక రోజున పార్వతి తన మనస్సులో ఇలా తలపోసింది. "శంకరా! నీకింత వరకు నాపై అనుగ్రహం గలుగలేదు. ఆత్మ రూపుడు, సర్వసాక్షి అగు నీకు నా అంతరంగం తెలియదా ఏమి? నేను సర్వకామనలను విడిచి వృషభధ్వజుని యందు అనురక్తురాలనైనచో శంభుడు నన్ననుగ్రహించు గాక! పంచాక్షర మంత్రాన్ని విధివిధానంగా భక్తితో జపించిన దాననైనచో శంకరుడు ప్రసన్నుడగు గాక!

ఇలా తలపోసి నిర్వికారిణియై అత్యుగ్రమైన తపస్సు చేసింది. ఆ తపస్సుకు మునులు ఆశ్చర్యపోయారు. ఆమె సందర్శన మాత్రం చేతనే ధన్యులమైనామని ఆనందపడ్డారు. మహాత్ములను, ధర్మ వృద్ధులను దర్శించి నమస్కరించటం శ్రేయోదాయకమని కదా పెద్దల వాక్కు అని మునులు ఆమెను దర్శించి హర్షమానసులయ్యేవారు. ఆమె తపః ప్రభావం వలన క్రూర మృగాలు సైతం పరస్పర వైరాన్ని విడిచి స్నేహంగా సంచరించేవి. తృణం సమృద్ధిగా పెరిగింది. ఫలవృక్షాలు విస్తారంగా కాచాయి. పువ్వులు తారకలను మించి

విరిశాయి. ఆమె తపస్సిద్ధి వన దేవతారూపంగా సాక్షాత్కరిస్తున్నదా అన్నట్లు వనమంతా శోభించింది.

### దేవతలు శివుని దర్శించుట

ఒకరోజున హిమవంతుడు గిరిజాదేవి యోగక్షేమాలను విచారించటానికై అందరితో కలిసి వచ్చి ఆమెతో ఇలా అన్నాడు.

"అమ్మాయీ! మనం భాగ్యవంతులం. ఇలా తపస్సుచేసి క్లేశాన్ని పొందవలసిన అవసరం నీకేముంది? రుద్రుడు విరాగి. నువ్వు సుకుమారివి. ఆయనను నువ్వు పొందలేవు! గగనస్థుడైన చంద్రుణ్ణి పండులా అందుకోగలమా? శివుడూ అంతే! తపస్సును విరమించి గృహానికి వచ్చేయి." మేనక, సహ్య పర్వతుడు, మేరువు, మందరుడు, మైనాకుడు మరియు క్రౌంచుడు ఇత్యాది పర్వత సోదరులందరు అనేక యుక్తులు చెప్పి పార్వతిని తపోవిముఖురాలిని చేయ ప్రయత్నించారు.

అప్పుడు పార్వతి దృఢ చిత్తంతో "ఏ శంకరుడు నిర్వికారుడై ఏ స్థలంలో మదనుని దహించాడో, ఆ శంకరుని నా తపస్సుచే మెప్పించి, ఇదే స్థానానికి వచ్చేలా చేస్తాను." అని ప్రతిజ్ఞాపూర్వకంగా పలికి వారందరిని ఇంటికి పంపించేసింది. వారందరు ఆమె ప్రతిజ్ఞను ప్రశంసించారు.

వారలా గృహోన్ముఖులు కాగానే పార్వతి అధికతరమైన తపస్సు చేసింది. ఆ తాపానికి దేవతలు సైతం నల్లబడ్డారు. వారంతా బృహస్పతిని ముందుంచుకొని బ్రహ్మను శరణుకోరారు. ఆయన శంకరుని స్మరించి, పార్వతి తపో వృత్తాంతాన్ని గీర్వాణులకు చెప్పి వారితో కలిసి నారాయణుని సన్నిధికి వచ్చి విషయాన్నంతా విన్నవించాడు. వారి విజ్ఞాపనను విన్న హరి "మనమంతా పరమేశ్వరుడైన రుద్రుని సన్నిధికేగి పార్వతీ పాణిగ్రహణం చెయ్యవలసిందిగా ఆయనను ప్రార్థిద్దాం. బయల్దేరండి." అని ఉపాయాన్ని చెప్పాడు.

రుద్రుని పేరు విన్నంత మాత్రాన భయకంపితులైన బృందారకులు సంశయింపగా హరి వారి భయ సంశయాలను పోగొట్టి శివ సందర్శనానికి వారందరిని ప్రేరేపించాడు. మధ్యలో మూర్తీభవించిన తపస్సిద్ధివలే ఉన్న పార్వతిని దర్శించి, ఆమెకు ప్రణమిల్లి కైలాసపతి దర్శనానికి వెళ్ళారు. దూరాన్నుండి నమస్కరించి ముందు నారదుని పంపి నారదానుమతితో శివుని సందర్శించి ఇలా స్తుతించారు.

**దేవతలు శివుని ప్రార్థించుట**

**శ్లో॥ నమోరుద్రాయ దేవాయ మదనాంతకరాయ చ ।**
**స్తుత్యాయ భూరి భాసాయ త్రినేత్రాయ నమో నమః ॥**
**శిపివిష్టాయ భీమాయ భీమాక్షాయ నమోనమః ।**
**మహాదేవాయ ప్రభవే త్రివిష్టపతయే నమః ॥**
**త్వం నాథ స్సర్వ లోకానాం పితామాతా త్వమీశ్వరః ।**
**శంభురీశ శ్శంకరోఽసి దయాలుస్త్వం విశేషతః ॥**
**త్వం ధాతా సర్వజగతాం త్రాతుమర్హసి నఃప్రభో ।**
**త్వాం వినా కస్సమర్థోఽస్తి దుఃఖనాశే మహేశ్వర ॥**

**తా॥** ప్రకాశ స్వరూపుడు, మన్మథుని దహించిన వాడు, స్తుతింప దగిన వాడు, గొప్పతేజశ్శాలి, ముక్కంటి అగు రుద్రునకు అనేక నమస్కారాలు. రశ్మలచే సర్వమును ప్రకాశింపచేయు ఆదిత్యుడవు నీవే. భయంకరా కారుడు, భయమును గొల్పు కన్నులు గలవాడు, ప్రభువు మహాదేవుడు అగు నీకు నమస్కారం. ఇంద్ర రూపుడవై స్వర్గాన్ని పాలిస్తున్నావు. లోకాలకు నాథుడు, తండ్రి, తల్లి మరియు పాలకుడు నీవే. నువ్వు మంగళ స్వరూపుడవు. ఈశ్వరుడవు. మంగళముల నిచ్చువాడవు. నీ యందు దయ విశేషంగా ఉంది. హే ప్రభో! లోకాలన్నింటిని పోషించు నువ్వు మమ్మురక్షింపతగుదువు. మహేశ్వరా! దుఃఖాన్ని పోగొట్టుటలో సమర్థుడు నీవు తక్క మరి ఎవరున్నారు?

ఈ విధంగా అందరు స్తుతించి ధ్యాననిష్ఠుడైన శంకరుని ముందు నిలబడ్డారు. నంది ముఖంగా విషయాన్ని తెలుసుకొన్న శంభుడు సమాధిని ఉపసంహరించి కన్నులను తెరచి చూచి లోకరీతిగా మీ రాకలో గల ఆంతర్యాన్ని తెలుపవలసిందని కోరాడు. అంత నారాయణుడు తారకుని దుశ్చర్యలను, పార్వతి ఉగ్ర తపస్సును గూర్చి చెప్పి పార్వతీ పాణిగ్రహణాన్ని చెయ్యవలసిందిగా కోరేడు. దానికి నవ్వి ఇందుధరుడిలా అన్నాడు.

"ఓ విష్ణు బ్రహ్మేంద్రాది సుర ప్రముఖులారా! సిద్ధ, సాధ్య, దేవ, మునిగణాల్లారా! నే చెప్పేది శ్రద్ధగా వినండి. ఈ మదనుడు పూర్వం అందరి ధ్యానాలను పాడుచేసే కామ వికారాన్ని కలిగించేవాడు. కామం నరకహేతువు. కామం వలన క్రోధం పుట్టి, క్రోధం నుండి వ్యామోహం అల్లుకొని దాని వల్ల తపస్సు భ్రష్టమవుతుంది. అట్టి ఈ కాముని దహించి లోకాలకు, మీకు మేలు చేశాను. మీరందరు నా వలెనె కామ రహితులై ధ్యాన

నిమగ్నులగుదురు గాక! నేను పార్వతీ పాణిగ్రహణం చేసిన మరుక్షణంలో కాముడు పునర్జీవితుడవుతాడు. మీరందరు మోక్షమార్గ దూరులవుతారు. మీరంతా కామ క్రోధాలను విడిచి బంధవిముక్తులు కండి.” ఇలా బోధించి ఈశ్వరుడు తిరిగి ధ్యానమగ్నుడయ్యాడు.

అలా విరక్తి మాటలు పల్కిన శంకరుని చూచి కార్యసాధన యందు మిక్కిలి పట్టుదల గల హరి అక్కడి వారందరిని శివస్తోత్రాన్ని చెయ్యమని ఆజ్ఞాపించాడు. వారలా చేయగా, కొంత సేపటికి శంకరుడు కన్నులు తెరచి చూచి ఇలా అన్నాడు.

“మీకు సర్వోత్తమమైన విరక్తి మార్గాన్ని చెప్పినా దాని యందు రుచి పుట్టటం లేదు. వివాహం దృఢ బంధనం. అదిపెద్ద సంకెల. లోకంలో చెడ్డసంగములనేకం ఉన్నాయి. అన్నిటికంటె చెడ్డది స్త్రీ సంగం. స్త్రీకంటె మాదక వస్తువు మరొకటేదీ లేదు. ముల్లోకాల్లో స్త్రీపాశ బద్ధుడు ఎప్పటికీ విముక్తుడు కాలేడు. ఈ ఇంద్రియ సుఖాలు అనుభవించే కొలది వృద్ధి పొందుతూనే ఉంటాయి. అట్టి వానికి మోక్షప్రాప్తి కలలో కూడా అసంభవం. వివేకవంతుడైన మానవుడు విషయ సుఖాలను విషంవలె వెడిచి పెట్టాలి.

దేవతలారా! నాకొక వ్రతం ఉంది! నా భక్తుల కొరకు అదెట్టిదైనా ఆ పని చేస్తాను. పూర్వం నే చేసిన పనులెట్టివనగా భీమ మహారాజుచే బంధింప బడిన సుదక్షిణుడనే కామరూప దేశాధిపతి ప్రతిజ్ఞను సఫలం చేశాను. గౌతముని కష్టాలను తొలగించి సుఖాలనిచ్చి ఆయనకు కష్టాలను కలిగించిన దుష్టులకు శాపాలనిచ్చాను. దేవతల కొరకు విషం త్రాగాను. విశ్వానర మహర్షి దుఃఖాన్ని నివారించాను. మీ ఆంతర్యం నాకు తెలుసు. త్వరలోనే మీ అభీష్టం నెరవేరుతుంది. నిర్భయంగా ఉండండి.” అని చెప్పి వారందరిని సముచితంగా సాగనంపి తిరిగి ధ్యానమగ్నుడయ్యాడు ఈశ్వరుడు.

**సప్తర్షులు పార్వతిని పరీక్షించుట**

భక్తవత్సలుడైన శంకరుడు దేవ కార్యాన్ని సిద్ధింపచేయాలని సంకల్పించి సప్తర్షులను స్మరించాడు. వారు వచ్చి ఉచిత రీతిని స్తుతించి కర్తవ్యాన్ని చెప్పవలసిందని కోరగా శివుడు వారికి పార్వతీ వృత్తాంతాన్ని సమగ్రంగా చెప్పి ఆమె మనస్సు యొక్క దృఢత్వాన్ని పరీక్షించి విన్నవించవలసిందిగా ఆజ్ఞాపించాడు.

మునులు శీఘ్రంగా గౌరీ శిఖరానికి చేరుకొని ఆమె తపో నిష్ఠకు విస్మితులై స్తుతించి ఏ పరమార్థాన్ని ఆశించి, ఇంతటి ఉగ్ర తపస్సుకు పూనుకొన్నావని ప్రశ్నించారు. దానికామె బ్రాహ్మణ వేషధారులైన సప్తర్షులకిలా సమాధానమిచ్చింది.

"ఓ బ్రాహ్మణోత్తములారా! మీరు పరిహాసం చెయ్యకుండ వింటె చెపుతాను. నా మనస్సు నీటిపై మహా ప్రాసాదాన్ని నిర్మింపగోరుతున్నది. రెక్కలు లేని నా మనస్సనే పక్షి హఠాత్తుగా ఆకాశంలో విహరిస్తున్నది. నా మనస్సు నా వశంలో లేదు. అసంభవమైన కర్మలను అపేక్షిస్తూన్నది. రుద్రుణ్ణి భర్తగా పొందాలనే కోరికతో దేవర్షి ఐన నారద వచనానుసారంగా ఈ తపస్సును చేస్తున్నాను."

ఆమె మాటలకు బ్రాహ్మణులు నవ్వి ఆమె ధృడ సంకల్పాన్ని పరీక్షింపగోరి ఇలా మాయ మాటలు పలికేరు. "ఓ హిమగిరి రాజనందినీ! నారదుడు దాంభికుడు. మాయ మాటలు చెప్పి మోసం చేస్తాడు. దక్షుని కుమారులకు మాయ మాటలతో వైరాగ్యాన్ని బోధించి కొడుకులను తండ్రికి అక్కరకు రాకుండ చేశాడు. వారంతా బిక్షుకులయ్యారు. చిత్రకేతుడనే గంధర్వునికి ఉపదేశం చేసి వాడిల్లు గుల్ల చేశాడు. ప్రహ్లాదునకు హరిభక్తిని ఉపదేశించి, తండ్రి కొడుకుల మధ్య చిచ్చు రేపాడు. నారదుడు ప్రకాశమానమైన దేహం కలవాడే కాని మనస్సు మాత్రం మలినం. వాడు ఎవరింట్లో అడుగు పెడితే ఆ ఇల్లు మట్టం. వాడి గురించి మాకు బాగా తెలుసు. వాడు నమ్మతగ్గ వాడు కాదు. నువ్వు బుద్ధిమంతురాలవు. నారదోపదేశంతో శివుని కొరకు కఠిన తపశ్చర్యకు ఉపక్రమించావు. శివుడు నిర్వికారుడు. మన్మథ శత్రువు. అమంగళ వేషదారి, దిగంబరుడు. అలాటి వాణ్ణి పెళ్ళి చేసుకొని నువ్వేం సుఖ పడతావు. సతీదేవి ఏం సుఖపడింది? బాగా ఆలోచించుకో!

నీకు తగిన వరుడు విష్ణువు ఒక్కడే! అందంలోనూ, అలంకారాలలోను, వైభవంలోను ఆయనకు ఆయనే సాటి! ఆయన నీకు సర్వసుఖాలను సమకూర్చగలడు. దగ్గరుండి ఆ వివాహాన్ని మేం జరిపిస్తాం. బాగా ఆలోచించుకొని చెప్పు."

కపట బ్రాహ్మణుల మాటలకు పార్వతి నవ్వుకొని ఇలా అంది. "ఓ బ్రాహ్మణులారా! దేవర్షి ఐన నారదుని వచనమే నాకు హితకరం. గురువుల వచనమందు ఎవరికి సత్యబుద్ధి ఉంటుందో వారు ఇహపరాలలో సుఖిస్తారు. ఈ తపస్సు నాకు సుఖాన్నిస్తుందో, శూన్యాన్ని మిగులుస్తుందో నాకేదైనా సంతోషమే. శివుడు గుణహీనుడు నిజమే! విష్ణువు అలంకారప్రియుడు అదీ నిజమే! దానికి గల కారణం వినండి.

పరబ్రహ్మ యొక్క సగుణ రూపం శివుడు. ఆయన మాయాతీతుడు, అవధూత స్వరూపుడు. మాయావేషం లేని వారికి అలంకారాదుల యందు ప్రీతి ఉండదు. ఏ గుణములు ఉండవు. రాతి మీద పద్మం వికసించవచ్చు! నా వ్రతాన్ని మాత్రం వదలను."

అలా పలికి పార్వతి మౌనాన్ని వహించగా మహర్షులు ఆమెకు “జయము కలుగు గాక” అని ఉత్తమ ఆశీర్వచనాన్ని పలికి శివలోకానికి వెళ్ళి ఆ వృత్తాంతాన్ని నివేదించి తదుపరి తమ లోకానికి చేరుకొన్నారు.

**శివుడు బ్రహ్మచారి వేషంలో వచ్చుట**

మునుల వచనాలను విని శంకరుడు పార్వతిని తానే స్వయంగా పరీక్షింప గోరి కర్రను, గొడుగును పట్టుకొని వృద్ధ బ్రహ్మచారి వేషంలో మార్గస్థునివలె పార్వతి ముందు సాక్షాత్కరించాడు. పార్వతి ఆయనను పూజించి “ఓ వేద మూర్తీ! మీరెవరు? నా వల్ల నెరవేర వలసిన కార్యాలేమైనా ఉన్నాయా? దయతో చెప్పండి.” అని కోరగా ఆయనిలా అన్నాడు.

“ఓ భద్రే! నేను అన్నిచోట్లా సంచరిస్తూ ఉండే వృద్ధ బ్రహ్మచారిని. తపస్సు నా ప్రధాన వృత్తి. నువ్వెవరో ముందు చెప్పు. నువ్వు వయసులో ఉన్న సుందరాంగివి. నీ సౌందర్యం ఈ వనానికి బంగారు నీరు పూసినట్లుగా ఉంది. భర్త తోడు లేకుండా ఈ తపశ్చర్యకు ఎందుకు పూనుకొన్నావు? ఒకవేళ ఆ అభాగ్యుడు నిన్ను పరిత్యజించాడా? నువ్వు లక్ష్మివా? సరస్వతివా? నీ పుట్టుకచే ఏ తల్లిదండ్రుల జన్మ సార్థకమైంది చెప్పు?”

బ్రాహ్మణుని మాటలకు సమాధానంగా పార్వతిచే ఆజ్ఞాపితురాలై ఇష్టసఖి ఇలా అంది: “ఓ బ్రాహ్మణోత్తమా! నా చెలి మేనకా గర్భాన జన్మించిన గిరి సార్వభౌముడైన హిమవంతుని ముద్దులు పట్టి. పార్వతి నామధేయ. పూర్వ జన్మలో దక్షపుత్రియైన సతీదేవిగా జన్మించి తండ్రిచే అవమానితురాలై దేహాన్ని త్యజించి ఈ జన్మలో కూడ శంకరునే పతిగా వరించి తపస్సు చేస్తూన్నది. శంకరుడు లభించాడు, కాని విధివిలాసంచే కామదహనం చేసి ఈమెను విడిచి కైలాసానికి వెళ్ళిపోయాడు. అప్పటి నుండి ఇలా తీవ్ర తపశ్చర్యలో మునిగి ఉంది. ఇంత వరకు శివుడు లభించలేదు! మా చెలి కోరిక శీఘ్రంగా నెరవేరే ఉపాయాన్ని మీరేమైనా చెప్పగలరా?”

చెలి మాటలకు బ్రహ్మచారి నవ్వి, “శ్మశానవాసి, కపాలధారి ఐన శివుడెక్కడ? కుసుమ కోమలి, సుందరాంగి ఐన ఈ పార్వతి అతణ్ణి వరించటం ఎక్కడ? నీ మాటలలో నాకు పరిహాసం తోస్తూన్నది. నాకు నమ్మకం కలగాలంటె నువ్వు చెప్పిన మాటలను మీ దేవి తన నోటితోనే పల్కుగాక!” అని పార్వతినోట మధుర వాక్కులను వినాలనే కుతూహలంతో అన్నాడు.

**బ్రహ్మచారి శివుని నిందించుట**

దానికి సమాధానంగా పార్వతి "ఓ విప్రోత్తమా! నా సఖి పల్కిన పల్కులు సత్యమే. నా కోరిక దుర్లభమైనదే కావచ్చుగాక! ఆ సంకల్పమునందే నా మనస్సు దృఢంగా నిల్చి ఉంది. నే నాయనకు అర్ధాంగిని కాలేకపోతే అగ్నికి ఈ దేహాన్ని అర్పించి సాలోక్యాన్ని పొందుతాను. ఇది నా నిశ్చయం." అని త్రికరణ శుద్ధిగా పలికింది.

ఆమె పల్కులకు విస్మితుడైన శంకరుడు ఆమె ప్రేమకు పరీక్షగా ఇలా అన్నాడు: "ఓ దేవీ! నేనా మహాదేవుని బాగా ఎరుగుదును. ఆయన వృషభ ధ్వజుడు! భస్మలేపనుడు! జటాధారి! వ్యాఘ్రచర్మాంబర ధరుడు. కపాలధారి! భుజంగ భూషణుడు! విష భక్షకుడు! విరూపాక్షుడు! విభీషణుడు! దిగంబరుడు! గృహభోగ వివర్జితుడు. భూతప్రేత పరివేష్టితుడు.

ఓ శుభాంగీ! ఇక నువ్వు సముజ్వల కాంచన రథసమారోహవు. కుంకుమాగరు కస్తూరీ చందన వాసితవు! వినీల కుంతలవు! దుకూల వస్త్ర శోభితవు! లీలా శుక ధారిణివి! రత్న భూషణోజ్వలాంగివి! బహువిధ రుచిరాన్న సంపన్నవు! సీమంతవీధీముక్తాఫల సూత్రధారిణివి! సుందర మందహాస వదనారవిందవు! మౌక్తిక శోభిత కాంచన మేఖలాన్విత తన్వంగివి. నానా రత్నశోభిత సౌధోపరి చంద్రశాలా విహారిణివి! సుందర యువతీజన శోభిత మనోహారివి!

ఓ మంగళాంగీ! పరస్పర విరుద్ధమైన అంశలుగల మీ ఇద్దరికి దాంపత్యం ఎలా కుదురుతుంది? దక్షపుత్రి ఐన సతీదేవి ఏం సుఖపడింది చెప్పు? నీ చర్యలోక విరుద్ధంగా ఉంది! లోకంలో కన్యలు కోరుకొనే లక్షణాలలో ఏ ఒక్కటి శంకరునికి లేవు! ఆయనను భర్తగా పొందాలనే కోరికను వదలుకో! లేదా నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో!" అని ఈ విధంగా పలికి గమనోద్యుక్తుడయ్యాడు కపట బ్రహ్మచారి.

**శివుని సాక్షాత్కారం**

బ్రహ్మచారి నోట శివనిందను విన్న ఉమాదేవి నొచ్చుకొని సమాధాన పూర్వకంగా ఇలా అంది.

"ఓ బ్రాహ్మణోత్తమా! వేదాధ్యయన సంపన్నుడవైన నీ నోటినుండి అనుచిత వాక్కులను వినిన ఈ రోజు దూషితమగు గాక! నా యోగ్యత ననుసరించి శివతత్త్వాన్ని గూర్చి చెపుతున్నాను విను. శివుడు స్వరూప దృష్ట్యా నిర్గుణుడే కాని ప్రకృతితో కూడి సగుణుడైనాడు. ఆ కారణంగా ఆయనకు జాతి, మత, కుల వివక్ష ఏముంటుంది? సర్వజ్ఞుడైన వానికి విద్యలతో పనేమిటి?

కల్ప ప్రారంభంలో ఉచ్ఛ్వాస రూపంలో వేదాలను విష్ణువుకు అనుగ్రహించిన పరిపూర్ణునికి విద్యాభ్యాసమా?

కాలాతీతునకు వయస్సా? చతుర్దశ భువన సృష్టి కర్తకు తల్లిదండ్రులా? అలంకారాలా? అష్ట సిద్ధులు ఆయన ముందు నృత్యం చేస్తుంటే ఆయనకు లేని దేముంది? నీ వంటి బహిర్ముఖునికి ఆయన తత్త్వం ఎలా అర్థమవుతుంది? ఆయన ధరించే చితాభస్మం అపవిత్రమైతే బ్రహ్మవిష్ణ్వాదులు ఆయన శరీరం నుండి జారిన భస్మను శిరసుపై ఎందుకు ధరిస్తున్నారు? నువ్వెన్ని కుయుక్తులు పల్కినా, నా మనస్సు మరలదు. శివనింద చేసిన వానిని వధించాలి. బ్రాహ్మణుడవు కనుక బ్రతికి పోయావు." అని పల్కి పార్వతి మనసులో శివుని ధ్యానించింది.

ఆ కపట వటువు ఇంకా ఏదో చెప్పబోతూంటే తన చెలికత్తె ఐన విజయను పిల్చి "ఈ దుష్టుడేదో చెప్పబోతున్నాడు. శివనిందను చెయ్యటం మాత్రమే కాదు వినటం కూడా అంతకంటె మహాపాపం. ముందు వీణ్ణి బయటకు నెట్టండి. ఆ! ఆ! ముట్టుకోకండి! అది మరింత పాపం. ఈ దండాన్ని మెడ మీద పెట్టి నెట్టండి!" అని ఉమాదేవి పోవనుద్యుక్తురాలై ముందడుగు వేసినంతలో...

చంద్రరేఖామౌళి, నీలగళుడు, ధవళాఖిలాంగుడు, మదనహరుడు, నాగకుండలధారి, భువనకర్త, గిరిరాజనిలయుడు, సర్వగురుడు ఐన విశ్వనాథుడు సాక్షాత్కరించి చేయి పట్టుకొని నిలువరించి "దేవీ! నన్ను విడిచి ఎక్కడకు వెళ్ళగలవు? నువ్వు నా సనాతన ధర్మపత్నివి. నీ తపస్సుకు నేను అమ్ముడు పోయాను. ప్రసన్నుడనయ్యాను. వరం కోరుకో! రా! నా నివాసమైన కైలాసానికి నాతోరా!" అని వరప్రదానం చేశాడు. గిరిజకు తపఃక్లేశం మాయమైంది.

**శివపార్వతీ సంవాదం**

అంత మహాసాధ్వియైన ఉమ సంతోషంతో వికసించిన కన్నులు గలదియై ఇలా అంది. "ఓ దేవదేవా! నువ్వు కృపాపరుడవైతే నన్ను వివాహం చేసుకో! నీ అనుజ్ఞ ఐతే నేను నా పితృ గృహానికి వెడతాను. ఓ లీలా విశారదా! లోక తీరును అనుసరించి, నా తండ్రిని యాచించి నన్ను గృహిణిగా పొందు. నా తండ్రియొక్క గృహస్థాశ్రమాన్ని సఫలం చెయ్యి. అతను నీ కోర్కెను తప్పక మన్నిస్తాడు. అలా చేసి లోకంలో ఒక వ్యవస్థను ఏర్పాటు చేసి నీ కీర్తిని విస్తరింపచేయి. గతజన్మలో నేను సతిగా అవతరించినప్పుడు మీరు యథావిధిగా వివాహ కార్యాన్ని నిర్వర్తించలేదు. నా తండ్రి ఐన దక్షుడు గ్రహపూజ చెయ్యలేదు. గ్రహాల విషయంలో అది పెద్ద పొరపాటైంది. కనుక అన్ని విషయాలలోను యథా విధిగా చెయ్యండి. నా తండ్రి నా తపశ్శక్తిని చక్కగా తెలియునుగాక!"

దానికి సదాశివుడు నవ్వి ఇలా అన్నాడు. "ఓ మహేశ్వరీ! బ్రహ్మ మొదలుగా సకల ప్రాణులు అనిత్యాలు. నేనొక్కడినే నిత్యుడను స్వతంత్రుడను. అలాటి నన్ను పరతంత్రుణ్ణి చేశావు. నువ్వు ప్రకృతివి! మహా మాయవు! గ్రహాలు, ఋతువులు అన్నీ ప్రకృతి స్వరూపమే కదూ! నీకంటె భిన్నంగా సృష్టిలో ఏమైనా ఉందా? నీ తపస్సు నా సాక్షాత్కారం అంతా ప్రకృతి మాయ! మనిద్దరం భక్త పరాధీనులం కనుక గుణభేదాన్ని బట్టి ఏర్పడిన కార్యభేదం అంతే! ఓ దేవీ! నేను నీ తండ్రి వద్దకు భిక్షుకుడనై వెళ్ళి యాచించను. మహాత్ముడు, మహా పురుషుడు ఐనవాడు కూడ "దేహి" (ఇమ్ము!) అంటె చాలు మరు క్షణంలో గడ్డిపరక కంటె కూడ తేలికవుతాడు."

దానికి సమాధానంగా "ఓ ప్రభూ! నా తండ్రికి ఈ భాగ్యాన్ని కల్పించండి. నాపై దయ చూపండి. జన్మ జన్మలకు నేను మీ భార్యను. మీరు భక్తపరాధీనులు గదా!" అని ప్రార్థించగా 'సరే' అని అంగీకరించి పార్వతీ విరహపీడితుడై శివుడు కైలాసాన్ని చేరుకొన్నాడు. వెళ్ళి ఈ విషయాన్ని నందీశ్వరాది గణాలకు చెప్పగా వారంతా గొప్ప ఉత్సవం చేసికొన్నారు.

**పార్వతి ఇంటికి తిరిగి వచ్చుట**

అలా తపస్సిద్ధిని పొందిన పార్వతి సఖురాండ్రతో కలిసి "చంద్రశేఖర! చంద్రశేఖర! చంద్రశేఖర! పాహిమాం! చంద్రశేఖర! చంద్రశేఖర! చంద్రశేఖర! రక్షమాం!" అని మహాదేవుని నామాన్ని పాడుకొంటూ గృహానికి చేరుకొన్నది. మేనకా హిమవంతులు కుమార్తె రాకను విని పట్టరాని సంతోషంతో కాంచన రథారూఢులై పురోహిత, అమాత్య, సచివ, సైన్యాధీశ, సామంత, నృపవర, సీమంతినీ జన శ్రేణితో కూడి ఎదురేగి స్వాగతం చెప్పారు. మైనాక, మందరాది సోదరులంతా భార్యలతో కూడి ఆహ్వానం పలికేరు. రాజ మార్గంలో మంగళ ఘటాన్ని (పూర్ణకుంభాన్ని) స్థాపించారు. చందనాగరు కస్తూరీ కుంకుమాది పరిమళ ద్రవ్యాలతో కలయంపి చల్లారు.

బ్రాహ్మణులు, ఋషులు, మునులు వేదమంత్రాలతో ఆశీర్వాదం చేశారు. నర్తకీ మణులు నృత్యోత్సవాన్ని నిర్వహించారు. మేళ, తాళాలు మార్మోగాయి. దీపాలు వెలిగించి ముత్తైదువలు హారతులిచ్చి సేసలు (పేలాలు) చల్లేరు. ఉమాదేవి నగర ప్రవేశం చేసి తల్లిదండ్రులకు నమస్కరించింది. వారామెను ఇంట్లోకి తీసుకెళ్ళి దిష్టి తీశారు. హిమవంతుడు వేదవేత్తలను ఘనంగా సత్కరించాడు. వారితో పాటు శాస్త్ర విద్వాంసులను, కవులను, కళాకారులను సన్మానించాడు.

ఒక రోజున పర్వత రాజు స్నానానికై గంగా నదికి వెళ్ళాడు. గిరిజాదేవి తల్లితో కుటుంబ సభ్యులతో కూడి, వీధి అరుగుపై కూర్చుని ఉంది. నటరాజైన శివుడు నటుని రూపంలో సాక్షాత్కరించాడు. ఎఱ్ఱని వస్త్రం, ఎడమ చేతిలో కొమ్ము బూరా, కుడి చేతిలో డమరుకం, భుజంపై కంబళి, బుడ బుడక్కలవాని వేషంలో వచ్చి బూరాను ఊదుతూ, డమరుకాన్ని మ్రోగిస్తూ పాటలు పాడుతూ అనేక కథలను చెప్పి నాట్యం చేస్తూ అక్కడి వారందరిని తన విద్యలచే సమ్మోహితులను చేశాడు. అందరూ ఆనందించారు. దుర్గాదేవి పూర్వజన్మ సంస్కారం చేత ఏవో స్మృతులు చుట్టుముట్టగా క్రమంగా స్మృతి తప్పింది. ఎట్టయెదుట శంకరుడు సాక్షాత్కరించగా నమస్కరించి 'స్వామీ! చేపట్టి నన్నునుగ్రహించు' అని కోరింది.

మేనకాదేవి బంగారు పాత్రలో రత్నాలను పోసి భిక్షుకున కీయగా అతను పార్వతిని భిక్షగా కోరేడు. మేనకాదేవి ఆశ్చర్యాన్ని, కోపాన్ని పొంది భిక్షుకుని నిందించి... "ఈ ముష్టివాణ్ణి నగరం వెలుపలికి వెళ్ళగొట్టండి!" అని భటులను ఆజ్ఞాపించింది. ఇంతలో హిమవంతుడు వచ్చి జరిగిన దానిని తెలుసుకొని కోపావిష్టుడయ్యాడు. ప్రభువుల ఆజ్ఞమేరకు భటులు యాచకుని రూపంలో ఉన్న శివుని బంధించ బోయారు గాని అగ్ని సదృశుడైన ఆయనను తాకలేకపోయారు. పరమేశ్వరుడు అక్కడి వారందరికి ఒకసారి విష్ణువు రూపంలోను, మరొకసారి బ్రహ్మ రూపంలోను సాక్షాత్కరించాడు. వెంటనే ఆదిత్య రూపంలో గోచరించాడు. పార్వతీ సహితుడై రుద్ర రూపంలో కనుపించాడు. తిరిగి శివుడు భిక్షుక రూపాన్ని పొంది పార్వతిని భిక్షగా యాచించినా శివమాయా మోహితులైన మేనకా–హిమవంతులు ఆయన కోర్కెను మన్నించలేదు. వెంటనే శివుడు అంతర్థానమయ్యాడు. తదుపరి వారికి జ్ఞానోదయమై "శివ ప్రభువు మనలను కన్నుకప్పేడు" అని అప్పుడనుకొన్నారు.

**శివమాయ**

నడిచిన వృత్తాంతమంతా నమ్మకంగా తెలిసిన దేవతలు ఒక విషయంలో వారిలో వారు ఇలా ఆందోళన చెందారు. పరమేశ్వరుడు పార్వతీ పాణిగ్రహణం చెయ్యటం సత్యం. హిమవంతుడు ఇష్ట పూర్వకంగా కన్యాదానం చేస్తే దాని పుణ్యఫలంగా శివలోకంలో సారూప్యాన్ని పొంది ఆపై ముక్తిని పొందుతాడు. అనంతరత్నాధార భూతుడైన అతడు (ఆత్మ) భూలోకాన్ని విడిచి వెళ్ళితే భూమికి రత్నగర్భ అనే నామం నిరర్థకమవుతుంది. ఈ భరత ఖండం తన పవిత్రతను కోల్పోతుంది. అలా కాకుండా అయిష్టంగా కన్యదానం చేస్తే అతను (ఆత్మ) ఇక్కడే ఈ భరతభూమి మీదే చిరకాలం ఉంటాడు. కనుక అతని మనసులోని ఇష్టాన్ని విరిచేయాలి. భరతక్షోణిని రక్షించాలి.

ఇలా తలపోసి వారంతా బృహస్పతిని చేరి ఆయనను హిమవంతుని వద్దకు వెళ్ళి శివనిందను చేసి అతని మనస్సును విరిచి శివద్వేషం పుట్టునట్లుగా చెయ్యమని ప్రార్థించారు. దానికి దేవ గురుడు శివ నామాన్ని స్మరిస్తూ చెవులు మూసుకొని "ఓ వేలుపులారా! చతుర్వేద పారంగతుడైన నాకది తగని పని. అలా చేసిన వాడు ఆత్మద్రోహి అవుతాడు. వానికి నరకమే గతి. మీలో ఒకడు వెళ్ళి మీపని నెరవేర్చుకోండి! ఆపై సప్తర్షులు వెళ్ళగలరు. లేదా ఇంద్రునితో కలిసి బ్రహ్మలోకానికి వెళ్ళండి. ఆయన మీ కార్యాన్ని చక్కపెడతాడు." అని ఉపాయాన్ని చెప్పి పంపించాడు.

దేవతలంతా బ్రహ్మగారి కొలువుకు వచ్చి నమస్కరించి విషయాన్ని విన్నవించి ఈ కార్యాన్ని సఫలీకృతం చెయ్యవలసిందని కోరేరు. శివనింద అనేమాట చెవిని పడగానే వేదవక్త ఐన విధాత విలపించాడు. "వత్సలారా! సంపద్వినాశ రూపము, సర్వవిపత్తులకు బీజరూపము ఐన శివనిందను నేను చెయ్యలేను. మీరే కైలాసానికి వెళ్ళి శంకరుని ప్రార్థించండి." అని చెప్పి పంపించేశాడు. వారంతా కైలాసానికి వెళ్ళి శంభుని స్తుతించి విషయాన్ని సాదరంగా నివేదించారు. ఆయన అమరుల నోదార్చి పంపించేశాడు. తమ కార్యం సిద్ధించిందని దేవతలు సంతోషంతో స్వస్థానాలకు చేరుకొన్నారు. అంత శంకరుడు దండాన్ని, ఛత్రాన్ని, దివ్యమైన వస్త్రాలను, ఉజ్జ్వలమైన తిలకాన్ని, మెడలో సాలగ్రామాన్ని, చేతిలో స్ఫటిక మాలను ధరించి హరి నామాన్ని భక్తితో స్మరిస్తూ సభామధ్యమందు హిమవంతుని సందర్శించాడు. గిరిరాజు మేనకాపార్వతులతో, సకల బంధువర్గంతో సభ తీర్చి ఉన్నాడు. మంచి వేష భూషలతో మనస్సును ఆకట్టుకొనేటట్లుగా ఉన్న బ్రాహ్మణ వర్చస్సుతో సభలోకి ప్రవేశించిన వైష్ణవోత్తముని చూచి హిమవంతుడు సపరివారంగా లేచి నిలబడి సంభ్రమాశ్చర్యాలతో స్వాగత సత్కారాలొనరించి సాష్టాంగ నమస్కారం చేశాడు. కపట వైష్ణవుని గుర్తించిన శైలసుత మనసులోనే షోడశోపచార పూజా విధానాలతో నాథుని అర్చించి నమస్కరించింది.

నగాధిపుడు అతిథిని కుశలాదిక మడిగి 'స్వామీ! నే చెయ్యవలసిన కర్తవ్యాన్ని ఆజ్ఞాపించండి!" అని కోరగా ఆ విప్రుడిలా అన్నాడు: "ఓ గిరి సార్వభౌమా! నేను బ్రాహ్మణుడను! వైష్ణవుడను! బుధ సత్తముడను! జ్యోతిష వృత్తిని చేపట్టిన వాడను. భూమండలమంతా తిరుగుతూ ఉంటాను. నేను స్వేచ్ఛాజీవిని. స్వతంత్రుడను! సర్వగామిని! సర్వాంతర్యామిని. గుర్వనుగ్రహంచే నాకు సర్వము తెలుసు. నేను శుద్ధాత్ముడను. నిర్వికారుడను. మీరు మిక్కిలి దయా సింధువును, పరోపకారిని. మంచి లక్షణాలు గలిగి లక్ష్మీదేవి వంటి అందమైన నీ

కుమార్తెను ఆ విరూపాక్షునకిచ్చి వివాహం చేయ బోతున్నావని తెలిసింది. ఆ శ్మశాన వాసికి ఈ సర్వమంగళ నిచ్చి పాణిగ్రహణం చెయ్యటం శ్రేయోదాయకం కాదు సుమా! నువ్వు నారాయణుని కులంలో పుట్టిన వాడివి! ఎలా చూచినా నీ ఇంటి అల్లుడు కావటానికి తగిన అర్హతలలో ఒక్కటీ లేదు ఆ ఆది భిక్షువుకు. ఐనా ఇంట్లో అందరిని అడిగి చూడు. పార్వతిని మాత్రం అడగకు. ఎందుకంటె రోగికి ఔషధము, పథ్యము రుచించవు! రోగాన్ని వృద్ధి చేసే అపథ్యాహారం మాత్రమే రుచిస్తుంది." ఇలా చెప్పి నిష్క్రమించాడు కపట వైష్ణవుడైన శంకరుడు.

**సప్తర్షుల రాక**

కపట వైష్ణవుని మాటలను విన్నది మొదలు మేనకాదేవి హృదయం దుఃఖ భారంచే నిండిపోయింది. ఒక రోజున కుమిలిపోతూ భర్తను సమీపించి ఇలా అంది. "నాథా! సుకుమారి, శుభలక్షణ ఐన నా కుమార్తెను కురూపి, పిశాచ గణాధిపతి ఐన ఆ రుద్రునకిచ్చి వివాహం చెయ్యటానికి నేనంగీకరించను. మీరు నా మాటను వినకపోతే ఇల్లు విడిచి పోతాను! విషం మ్రింగుతాను లేదా ఉరేసుకు చస్తాను. అమ్మాయిని త్రాడుతో మెడకు కట్టుకొని సముద్రంలో మునుగుతాను." ఇలా రోషంతో తీక్షణంగా పలికి కోపగృహానికి వెళ్ళి ఆభరణాలను విసిరికొట్టి ఏడ్వటం మొదలుపెట్టింది మేనక.

అక్కడ కైలాసంలో శంకరుడు సప్తర్షులను స్మరించగా అపర కల్పవృక్షముల వంటి ఆ ఋషులు మరుక్షణంలో ప్రత్యక్షమయ్యారు. అపర సిద్ధివలె ఉన్న అరుంధతి కూడ వచ్చింది. వారందరు ఈశ్వరుని స్తుతించి "శంకరా! నీ నామస్మరణ మాత్రం చేతనే మహా పాతకాలు నశించి, ఉత్తమ లోకాలు సిద్ధిస్తూంటే అలాటి నువ్వు మమ్ములను స్మరించావంటె మా పుణ్య విశేషాన్ని ఏమని కొనియాడాలి? నీకు దయ ఉంటే ఈ సేవకులకు ఆజ్ఞాపించ దగిన శుభ కార్యాన్ని చెప్పండి" అని వినయంగా మనవి చేశారు.

అంత చంద్రశేఖరుడు వారికి తారకాసురుడు బ్రహ్మ నుండి వరాలను పొందిన వృత్తాంతం మొదలుగా పూర్వగాథను చెప్పి కర్తవ్యాన్నిలా బోధించాడు. "సప్తర్షులారా! దేవతల ప్రార్థనను మన్నించి వైష్ణవ వేషంలో వెళ్ళి శివనిందను చేసి మేనకా హిమవంతుల మనస్సులను విరిచి వారి హృదయాలలో శివద్వేషం రగులుకొనేటట్లు చేశాను. ఇప్పుడు వారు వారి కన్యయైన పార్వతిని నాకిచ్చి వివాహం జరిపించటానికి ఇష్టపడటం లేదు. నా పెళ్ళిని నేనే చెడగొట్టుకొన్నట్లైంది. కనుక మీరు వెళ్ళి ఆ దంపతుల మనస్సులను మరల్చి,

గిరిజను నాకిచ్చి కళ్యాణం జరిపించే టట్లుగా కన్యావరణ విధిని నెరవేర్చండి. ఇది దేవతాకార్యం"

అంత ఆ మహర్షులు శివ పార్వతుల కళ్యాణానికి తాము సంధాన కర్తలం కాబోతున్నామనే మహదానందంతో ఆకాశమార్గాన పయనించి ఓషధీప్రస్థ పురంలో దిగారు. నగరం మహా శోభాయమానంగా ఉంది. అలకానగరాన్ని అతిక్రమించిన సంపదతో, అమరావతిని తలదన్నే అందచందాలతో, భోగవతీ నగరాన్ని మించిన భోగభాగ్యాలతో పరమ రమణీయంగా ఉంది. విశాలమైన రాజవీధులు, విధుమండలాన్ని చుంబించే చంద్రశాలా శోభిత సౌధరాజాలు. నీడలు తోచే పాలరాతి గచ్చుతో మేడలు. చందనం, పన్నీరు కలిపి కలయంపి జల్లి కాశ్మీర రజంతో (కుంకుమ పువ్వుతో) రంగవల్లికలు తీర్చిదిద్దిన వాకిళ్ళు. విచిత్ర పత్ర, పుష్ప, పల్లవ లతా శోభితమైన తోరణాలు. అనేక ఉద్యానవనాలు, ఉపవనాలు.

అలాటి నగరాన్ని చూచి ఇట్టి సౌభాగ్య నగరం ఈ భూమి మీద ఉంటే, కర్మఠులు స్వర్గాన్ని కోరి కష్టపడి యజ్ఞాలనెందుకు చేస్తారో అని సంశయాత్ములయ్యారు సప్తర్షులు. నగర సౌభాగ్యాన్ని వారిలో వారు వర్ణించుకొంటూ హిమవంతుని సౌధాన్ని చేరారు. సూర్య సంకాశంతో వస్తూన్న వారిని చూచి ఎదురేగి అతిథి మర్యాదలను జరిపి ఆసీనులను జేసి "మీ రాకతో నా గృహస్థాశ్రమ జీవితం ధన్యమైంది. మహర్షులారా! ఆజ్ఞాపించండి అన్నాడు" హిమవంతుడు.

**సప్తర్షుల ఉపదేశం**

పార్వతిని శివునకిచ్చి వివాహం జరిపించవలసిందిగా కోరేరు సప్తర్షులు. దానికి సమాధానంగా "ఓ ఋషులారా! అమ్మాయి ఇష్టప్రకారం, శివుని ఆజ్ఞమేరకు ఆ విధంగానే నిర్ణయం జరిగింది. కాని ఇప్పుడే ఒక వైష్ణవ ధర్మానుయాయి ఐన బ్రాహ్మణుడు వచ్చి శివుని ఉద్దేశించి విపరీతమైన మాటలను మహాప్రీతితో పలికి వెళ్ళాడు. అప్పటి నుండి జ్ఞాన భ్రష్టురాలైన నా భార్య ఈ వివాహానికి అంగీకరించటం లేదు. చాలా మొండి పట్టుదలతో ఉంది. నిజం చెప్పద్దూ! నా మనస్సు కూడా మారిపోయింది. మా అమ్మాయిని శివునకియ్యటానికి నాకూ ఇష్టం లేదు." అని నిజాన్ని చెప్పాడు హిమవంతుడు.

సప్తర్షులు శివమాయకు విస్మితులై అరుంధతిని మేనక యొద్దకు పంపి పర్వతరాజుతో ఇలా అన్నారు. "ఓ పర్వత సార్వభౌమా! తారకాసుర సంహారం నిమిత్తం, యాచించటం ఎరుగని బ్రహ్మ పరమేశ్వరుని యాచించి వివాహానికై ఒప్పించాడు. ఇప్పుడు నువ్వు

కాదంటున్నావు. లోకంలోను, వేదంలోను కూడా నీతి వచనం మూడు రకాలుగా ఉంటుంది. వినటానికి మధురంగా ఉండి భవిష్యత్తులో హానిని కలిగించేది. ఇది శత్రువు పలికేది. శత్రువు బుద్ధిమంతుడైతే హితాన్ని చెప్పడు. ఆదిలో క్లేశాన్ని కలిగించినా పరిణామ దశలో సుఖాన్నిచ్చేది. ఇది ధర్మబుద్ధిగల బంధువు పలికేది. వినటానికి అమృతంలా ఉండి ఎప్పుడూ సుఖాన్నిచ్చేది. ఇది గురువు చెపుతాడు.

రాజా! గురువుల మైన మా అమృతతుల్యమైన మాటలను విను. పరమేశ్వరుడు త్రిమూర్త్యాత్మకుడు. ఆయన ఆజ్ఞనే తక్కిన వారు పాలిస్తూ ఉంటారు. భువనాలన్ని ఆయన అంగాలు. వేదాలతో కూడి వాఙ్మయమంతా ఆయన వాక్కులు. సూర్య, చంద్ర, గ్రహ, తారకా మండలాలన్ని ఆయనకు అలంకారాలు. జగన్నిర్మాణ సామర్థ్యంగల ఆయన తపశ్శక్తియే ప్రకృతి. అది మూడు విధాలుగా ఉండి సృష్టి కార్యాన్ని నడపుతూ ఉంటుంది. ముఖం నుండి పుట్టి, వాక్కుకు అదిష్ఠాన దేవత ఐన సరస్వతి. వక్షస్థలం నుండి పుట్టి, సర్వ సంపత్స్వరూపిణి ఐన లక్ష్మి. సమస్తమైన దేవతల తేజస్సు నుండి ఆవిర్భవించినది, రాక్షసులను సంహరించి దేవతలకు సంపదలనిచ్చినది ఉమ. దుర్గ, కాళి, హైమవతి, కాత్యాయని, గౌరి, శివా, భవాని, రుద్రాణి, శర్వాణి, సర్వమంగళ, అపర్ణ, మృడాని, చండిక, అంబిక, ఆర్యా, దాక్షాయణి, గిరిజా… ఇవన్ని ఆ శక్తి యొక్క నామాలే. పర్వతరాజువైన నీ కూతూరు కనుక పార్వతి అని, మేనక గర్భాన జన్మించింది కనుక మేనకాత్మజ అని వ్యవహార నామాలు సిద్ధించాయి.

ఆ తల్లి నీ భాగ్యవశం చేత నీకు కుమార్తెగా జన్మించింది. ఆమె సర్వోత్కృష్టురాలు. ఆమె త్రికాలముల యందు ఈశ్వరుని అర్థాంగి. కనుక నీ కన్య ఐన పార్వతిని సంతోషంతో ఈశ్వరునకియ్యి. నువ్వు ప్రీతి పూర్వకంగా ఇవ్వకపోతే, ఆ తల్లి తన స్థానానికి తనే స్వయంగా వెళ్ళిపోతుంది. విధిబలం చేతనే అలా జరుగుతుంది. అది ఈశ్వరాజ్ఞ. ఈ కన్యావరణ విధిని నెరవేర్చమని ఈశ్వరుడు కోరితే సప్తర్షులమైన మేము నిన్ను యాచించటానికి యాచకులమై వచ్చాం. మేము కాలు కదిపితే చతుర్దశ భువనాలు తలక్రిందులవుతాయి. మా స్థానాలను సురక్షితంగా కాపాడుతున్నవాడు ఈశ్వరుడు. కనుక నీ కన్యను మహేశ్వరునకిచ్చి కీర్తిని దక్కించుకో! లోకంలో పదికాలాల పాటు పసుపు కుంకుమలతో చల్లగా వర్ధిల్లాలని కోరుకొనే తల్లులంతా భవిష్యత్తులో నీ కుమార్తెనే ఆరాధిస్తారు. ఓ నగాధిపా! ఒక వ్యక్తి కొరకు సంపదలను, కులాన్ని, కుటుంబాన్ని నాశనం చేసుకో కూడదు. కులం కోసం, కుటుంబం కోసం వ్యక్తిని విడిచి పెట్టాలని సనాతనమైన వేద ధర్మం చెపుతూన్నది. పూర్వం

అనరణ్య మహారాజు బ్రాహ్మణుని వలన సంప్రాప్తించిన భయంకలవాడై తన కుమార్తెను ఆ బ్రాహ్మణునకిచ్చి తన సంపదను రక్షించు కొన్నాడు. చివరిమాట చెపుతున్నాం విను! దక్షునికి పట్టిన దుర్గతి నీకు పట్టకూడదు. కనుక నీ కుమార్తె ఐన పార్వతిని పరమేశ్వరునకిచ్చి వివాహం జరిపించు! శాశ్వతంగా భోగభాగ్యాలను అనుభవించు."

సప్తర్షుల హిత వచనాలను విన్న హిమవంతుడు అనరణ్యుని వృత్తాంతాన్ని చెప్పమని కోరగా వసిష్ఠుడు దాన్నిలా చెప్పసాగేడు.

**అనరణ్యుని కథ**

"ఓ నగాధిరాజా! పూర్వం ఇంద్ర సావర్ణి అనే పేరుగల పదునాల్గవ మనువు యొక్క వంశంలో అనరణ్యుడు అనే చక్రవర్తి జన్మించి ఏడు దీవులను ఏలేడు. మంగళారణ్యంలో జన్మించిన ఆ చక్రవర్తి గొప్పశివ భక్తుడు. ఆయన భృగువును బ్రహ్మగా చేసికొని వంద యజ్ఞాలను చేసి ఇంద్ర పదవికి అర్హతను పొందినా దానిని తిరస్కరించాడు. ఆయనకు వందమంది కుమారులు. పద్మ అనే పేరుగల లక్ష్మీ సమానురాలైన కుమార్తె కలిగారు. ఆ చక్రవర్తి దంపతులకు కుమారులందరి పైనగల ప్రేమకంటె కుమార్తె మీద అధిక ప్రేమ. ఆయనకు ఐదుగురు భార్యలు. పద్మకు వివాహ వయస్సు వచ్చింది. చక్రవర్తి రాజు లందరకు పత్రాలను పంపించాడు.

ఒక రోజున పిప్పలాద మహర్షి లోక సంచారంలో ఒక గంధర్వుడు గంధర్వ స్త్రీలతో కూడి వనవిహారం చేసి జలకేళి పచరిస్తూండగా చూచి, కామ మోహితుడయ్యాడు. అప్పటి నుండి మనస్సును తపస్సు మీద లగ్నం చెయ్యలేక, వివాహం చేసుకొనాలనే నిర్ణయానికి వచ్చాడు. ఒక రోజున పుష్పభద్రా నదిలో స్నానం చేస్తూన్న పద్మ అనే యౌవనవతి ఐన సుందరాంగిని చూచాడు. అతనిలో ఉన్న కోరిక అధికమై సమీపంలో ఉన్న చెలికత్తెలను వివరాలడిగాడు. వారు ఆమె అనరణ్యుని కుమార్తె ఐన పద్మ అని, అనేక మంది రాజకుమారులు ఆమెను పెళ్ళిచేసుకొనాలని ఉవ్విళ్ళూరుతున్నారని చెప్పారు.

వెంటనే పిప్పలాదుడు శివపూజ చేసి రాజ సభకువెళ్ళి సన్మానాలందుకొని అతిథి పూజలో భాగంగా రాకుమార్తె ఐన పద్మను భార్యగా తనకిచ్చి వివాహం జరిపించమని కోరేడు. ఈకుంటే నీ ఐశ్వర్యాన్ని క్షణంలో భస్మం చేస్తానన్నాడు. ముని తేజస్సుకు అక్కడి వారంతా భయభ్రాంతులయ్యారు. వృద్ధుడైన పిప్పలాదునికి సుకుమారి, సుందరి ఐన రాకుమార్తెను భార్యగా ఇవ్వటం ఇష్టంలేక రాజకుటుంబం రోదించింది. దిక్కుతోచక రాజగురువును, రాజపురోహితుని పిలిపించి విషయాన్ని చెప్పి కర్తవ్యోపదేశం చెయ్యవలసిందిగా

కోరేరు. వారిద్దరు రాజుతో "ఓ రాజా! ఒక్కరి కొరకై సర్వనాశనం అయ్యే సందర్భంలో వానిని విడిచి సర్వమును రక్షించుకోవాలి. ఇది వేద ధర్మం" అని హితవు చెప్పారు. వేదవిదులైన ఆ బ్రాహ్మణులు చెప్పిన చొప్పున అనరణ్యుడు తన కుమార్తె ఐన పద్మను అలంకరించి మహర్షికిచ్చి వివాహం జరిపి తన కుటుంబాన్ని, సంపదను, రాజ్యాన్ని రక్షించుకొన్నాడు. కనుక నువ్వు కూడ పార్వతిని శివునకిచ్చి వివాహం జరిపించి నీ సర్వస్వాన్ని రక్షించుకో!" అని హితవు చెప్పారు సప్తర్షులు.

**పద్మా - పిప్పలాదుల చరిత్ర**

అంత హిమవంతుడు పద్మా, పిప్పలాదుల తదనంతర వృత్తాంతాన్ని చెప్పవలసిందని కోరగా వసిష్ఠ మహర్షి ఇలా చెప్పసాగేరు. పిప్పలాదుడు పద్మను అరణ్యంలోని తన ఆశ్రమానికి తీసికొని వెళ్ళాడు. మునిజప తపాలకు, ధ్యానానికి, ధర్మానుష్ఠానానికి, తపస్సుకు అవసరమైన పరిచర్యలను, సేవలను చేస్తూ త్రికరణ శుద్ధిగా భర్తనే సేవిస్తూ ఆయన కేలోటు రాకుండా ఆశ్రమ జీవనం సాగిస్తూన్నది పద్మ. భర్త మనసెరిగి మసలు కొంటూన్నది. అన్యోన్యంగా, ఆనందంగా ఉంటున్నారు వారిద్దరు. అలా ఉండగా... ఒక రోజున పద్మ గంగా నదిలో స్నానం చేసి నీళ్ళను పిండినతడి చీరను కట్టుకొని, నీళ్ళ కడవను నెత్తిన పెట్టుకొని ఆశ్రమానికి తిరిగి వస్తూండగా మార్గమధ్యంలో ధర్మప్రభుడు నవీన యౌవనుడై, కామదేవ సమప్రభుడై, నానాలంకార భూషితుడై ఎదురు నిలిచి ఆమెతో ఇలా అన్నాడు:

"ఓ చారు రూపిణీ! సుందరీ! ఆర్ద్రవస్త్ర పరిధానంలో మబ్బుల చాటున చందమామలా మెరిసి పోతున్న నీవెవరు? జారిపడుతూన్న నీటి బిందువులతో కూడి స్నానం చేసిన నీ కురులు వార్షుకాభ్రంలా ఉంది. నీ పేరులో ఏ అక్షరాలు సార్థక్యాన్ని పొందాయి? నిన్ను కన్న తల్లిదండ్రులు ధన్యులు!"

ధర్ముని పల్కులకు ఈషద్రక్తాంత లోచనయైన పద్మ లోకాచారంగా, ముక్తసరిగా సమాధానం చెప్పింది. దానికి ధర్ముడు నవ్వి ఇలా అన్నాడు.

"ఓహో! ఆ నెరిసిన వెంట్రుకలు గలవాడు, ముడుతలు పడ్డ శరీరం గలవాడు ఐన పిప్పలాదుడా నీ భర్త! వనమంతా వెన్నెల విరిసినట్లు కన్నులపండువుగా ఉన్న నువ్వెక్కడ? పండుకోతి వంటి పిప్పలాదు డెక్కడ? నీ సౌందర్యం రాజ పూజితం. తపస్సు చేసుకొనే మునికి ఇంత అపురూప సౌందర్యరాశి భార్యగా అక్కర లేదు. నేను రాజశ్రేష్ఠుడను. ఆ ముసలివాణ్ణి వదిలివెయ్యి! నాతో రా!" ఆమె ఆంతర్యాన్ని పరీక్షింపగోరి ఇలా పల్కిన ధర్ముడు ఆమె చేతిని పట్టుకో బోయాడు.

ధర్ముని దురాగతాన్ని సహించలేక మహా క్రోధంతో మండిపడి పద్మ ఇలా అంది: “ఓ మానవాధమా! దూరంగా ఉండు! నువ్వు పాపాత్ముడవు! పరస్త్రీని కామ దృష్టితో చూచిన నువ్వు నిస్సందేహంగా నశిస్తావు. తపోధనుడైన పిప్పలాదుడెక్కడ? కాముకుడవైన నీవెక్కడ? నువ్వు కాల గతిలో నా శాపం వల్ల క్షయాన్ని పొందగలవు!

ఆమె శాపానికి గడగడ వణికి, రాజవేషాన్ని విడిచిన ధర్ముడు ఇలా అన్నాడు: “ఓ మాతా! నేను ధర్మ దేవతను! గురువులకు గురువును! ఈశ్వర ప్రేరితుడనై ఈ చిలిపి పని చేశాను. నాకు తగిన శాస్తి చేశావు! అందరికి వారివారి కర్మానుసారంగా ఫలాలను ఇచ్చేవాడు ఈశ్వరుడే గదా! తల్లీ! నా శాప విముక్తిని కూడా నువ్వే అనుగ్రహించు!”

అప్పుడు పద్మ పశ్చాత్తప్తురాలై ఇలా శాపవిముక్తిని ప్రసాదించింది. “ఓ ధర్మదేవతా! పతివ్రత శాపం ఫలించి తీరుతుంది. ధర్మం క్షయించిన నాడు లోకాలన్ని వ్యాకులమవుతాయి. నువ్వు నశించకూడదు. కనుక నేనొక వ్యవస్థను చేస్తున్నాను. నువ్వు సత్యయుగంలో (కృత) షోడశకళా పూర్ణుడైన రాకా శశాంకుని వలె పరిపూర్ణంగా విరాజిల్లుతావు. ఆపై త్రేత, ద్వాపర, కలియుగాలలో ఒక్కొక్కపాదం చొప్పున క్షయిస్తూ కలియుగాంతానికి అమావాస్య చంద్రునిలా కానరావు. తిరిగి కలితర్వాత ఆరోహణ క్రమంలో కాలగతిలో వచ్చే ద్వాపర, త్రేత, కృత (సత్య) యుగాలలో ఒక్కొక్క పాదం చొప్పున వృద్ధి చెందుతూ సత్యయుగంలో పూర్ణుడవై ప్రకాశిస్తావు. ఆ యుగంలో నువ్వు సర్వ వ్యాపకుడవై ఉంటావు! ఈ నా మాటలు నీకు సుఖాన్ని కలిగించు గాక! నేను నా పతిని చేరుకొంటాను.” ఇలా పలికి పద్మ గృహోన్ముఖురాలైంది.

ఆమె పతిభక్తికి ధర్మప్రభువు సంతోషించి ఇలా అన్నాడు: “ఓ పతివ్రతా! నీకు మంగళమగు గాక! నీ భర్తయైన పిప్పలాదుడు రూపవంతుడు, సంతత స్థిర యౌవనుడు అగు గాక! మార్కండేయుని మించిన అధిక చిరంజీవి అగు గాక! కుబేరుని మించిన అధిక ధనవంతుడగు గాక! ఇంద్రుని కంటె అధికైశ్వర్యం కలవాడగు గాక! విష్ణువుతో సమమైన శివభక్తి కలవాడగు గాక! కపిల మహర్షిని మించిన సిద్ధుడగు గాక! బృహస్పతి సమాన బుద్ధిశాలి అగుగాక! బ్రహ్మతో సమమైన సమత్వ భావన (జ్ఞానం) కలిగియుండు గాక! మీ దంపతుల యందు రూప, యౌవనాదులు స్థిరమై నిల్చుగాక! నీ భర్తకంటె అన్నిటా అధిక గుణవంతులైన పదిమంది పుత్రులకు నీవు తల్లివి అగుదువు గాక!”

ఇలా ఆశీర్వదించిన ధర్మునికి ప్రదక్షిణ నమస్కారాదులాచరించి తన ఆశ్రమానికి చేరుకొంది పద్మ. ధర్ముడు తన నిజ స్థానానికి చేరుకొన్నాడు.

కనుక ఓ పర్వతరాజా! నే చెప్పిన ఈ చరిత్ర సారాన్ని బుద్ధియందుంచుకొని పార్వతిని శంకరునకిచ్చి వివాహం జరిపించు. మీ దంపతులిద్దరు శివుని యందు ద్వేషభావాన్ని విడిచి పెట్టండి. నేటికి ఏడు రోజుల తర్వాత లగ్నాధిపతి ఐన చంద్రుడు తన కుమారుడైన బుధునితో కూడి లగ్నంలో ఉండి, ఆనందంతో రోహిణితో కలిసియున్న శుభ ముహూర్తంలో మార్గశీర్ష మాసంలో సోమవారం నాడు కన్యాదానం చెయ్యి.” ఇలా చెప్పి ముగించాడు వసిష్ఠుడు.

**సప్తర్షుల ఉపదేశం**

వసిష్ఠుని ఉపదేశాన్ని విన్న హిమవంతుడు తన సోదరుడైన మేరు పర్వతాన్ని, కుమారులైన సహ్యా, గంధమాదన, మందర, క్రౌంచ, మలయ, మహేంద్ర, మైనాక మరియు ఇతర పర్వతాలను సమావేశపరచి వసిష్ఠ మహర్షి పలుకులను వారికి చెప్పి మీ మీ అభిప్రాయాలను చెప్పవలసిందని కోరేడు. వారందరు దేవ కార్యం కొరకు జన్మించిన పార్వతిని, గతంలో ఇచ్చిన వాగ్దానం ప్రకారం రుద్రునకిచ్చి కన్యాదానం చెయ్యవలసిందే అని ముక్తకంఠంతో పలికేరు. అరుంధతి అనేక యుక్తులను, ఇతిహాసాలను చెప్పి మేనకను ఒప్పించింది.

అంత హిమవంతుడు ఆనందంతో సప్తర్షులతో ఇలా అన్నాడు. “ఓ మహాత్ములారా! నా అజ్ఞానం పటాపంచలైంది. నా శరీరం, నా భార్యయైన మేనక, నా కుమారులు, కుమార్తె, సాధన సంపత్తి, సిద్ధి మరియు నా సర్వస్వం శివునకు చెందినవే కాని మరొకటి కాదు.” అలా పలికి పార్వతిని అలంకరింపజేసి, ప్రేమతో వీక్షించి, వసిష్ఠుని యొక్క ఒడిలో కూర్చుండబెట్టి “ఈ భాగాన్ని నేను శివునకు ఇస్తున్నాను! ఇది నిశ్చితం!” అని ప్రీతితో అన్నాడు. అప్పుడు ఋషులు “ఓ పర్వతరాజా! యాచించు వాడు శంకరుడు! దాత స్వయంగా నువ్వే! యాచింపబడుతున్నది పార్వతీదేవి! నిన్ను యాచించటానికై వచ్చిన వారు సప్తర్షులు! ఇంతకంటె మహత్తర సన్నివేశం మరొకటి ఏముంటుంది?” అని పరమానందంతో పలికి పార్వతిని ఇలా ఆశీర్వదించారు. “ఓ జగన్మాతా! సర్వులకు సుఖాన్నిచ్చే శంకరునికి నువ్వు సుఖాన్ని ఇయ్యి తల్లీ! నీకు మంగళము కలుగు గాక! శుక్లపక్ష చంద్రుని వలె నీ గుణములు వృద్ధిపొందును గాక!” ఇలా పలికి హిమవంతునికి పుష్పాలను, ఫలాలను ఇతర మంగళ ద్రవ్యాలను సమర్పించి సంతోషపెట్టారు సప్తర్షులు.

ఆపై అందరి వద్ద సెలవు తీసికొని కైలాసానికేగి పరమేశ్వరుని దర్శించి, స్తుతించి జరిగిన వృత్తాంతాన్ని చెప్పి “ఓ మహాదేవా! హిమవంతుడు పార్వతిని నీకు ఇచ్చినట్లు

మాటను ఇచ్చాడు. దీనికి సంశయం లేదు. నువ్వు దేవతలతో, నీ గణాలతో వివాహానికై తరలివెళ్ళు! నీ కళ్యాణం అన్ని లోకాలకు కళ్యాణమవుతుంది." అని ఉత్సాహంతో పలికారు.

అంత శంకరుడు నవ్వి "ఓ సప్తర్షులారా! నేనింత వరకు వివాహాన్ని గురించి వినలేదు. ఎవరి వివాహాన్ని చూడలేదు! అందువల్ల వివాహ విధానాన్ని చెప్పి నేనేమి చెయ్యాల్సి ఉంటుందో అది కూడా చెప్పండి!" అన్నాడు.

శంకరుని పరిహాస వచనాలకు నవ్వుకొని ఋషులిలా అన్నారు. "పరివారంతో రమ్మని విష్ణువును ప్రత్యేకంగా ఆహ్వానించండి. భాషా వధూటిని వెంటపెట్టుకొని ఆమెతో పాటు సకల నిగమాగమ, మంత్ర, తంత్ర, శాస్త్ర, పురాణ, ఇతిహాస, కావ్యనాటకాలంకారాది వాఙ్మయమంతా తోడురాగా కుమార వర్గంతో కలిసి రమ్మనమని పితామహుని ఆజ్ఞాపించండి! సర్వ ఋషి గణాలను సాదరంగా రమ్మని పిలవండి! బృందారక సార్వభౌముణ్ణి కల్ప వృక్షాన్ని, కామధేనువును వెంటపెట్టుకు రమ్మని కబురు పెట్టండి. యక్ష, రాక్షస, గరుడ, గంధర్వ, కిన్నర, పన్నగ, కింపురుష, అప్సర, విద్యాధరాది గణాలను తక్షణం రమ్మని వర్తమానం పంపించండి! వాళ్ళతో చాలా పనుంది. వీళ్ళందరు వచ్చి నీ కార్యాన్నంతా చక్కపెట్టగలరు." ఇలా చెప్పి సప్తర్షులు తమ స్వస్థానాలకు చేరుకొన్నారు.

**హిమవంతునింటికి బంధువర్గం రాక**

హిమవంతుడు సంతోషంతో పెళ్ళి ఏర్పాట్లు మొదలు పెట్టాడు. సోదరులకు, కుమారులకు, బంధువులకు ఆహ్వానం పంపించాడు. తన పురోహితుడైన గర్గుని చేత లగ్న పత్రికను వ్రాయించి అపురూప వస్తు సామగ్రితో పాటు దానిని బంధువులచే శివునికి పంపించాడు. వారు కైలాసానికి వెళ్ళి పత్రికకు తిలకం దిద్ది శివునకు సమర్పింపగా ఆయన వారిని యథోచితంగా సత్కరించాడు.

వివాహకరణోచితమైన వస్తు సామగ్రిని సేకరించి శ్రద్ధతో జాగ్రత్తపెట్టాడు పర్వతరాజు. బియ్యం, పప్పులు, అటుకులు, బెల్లం, పంచదార, లవణం పర్వత శిఖరాలుగా రాసులు పోశారు. పాలు, నెయ్యి, పెరుగు, చెరుకు రసం నూతుల వంటి పాత్రలలో సిద్ధం చేశారు. ఊరగాయలు సిద్ధం చేశారు. బంగారు, వెండి ఆభరణాలను, పట్టు వస్త్రాలను భద్రంగా ఉంచారు. వివిధ ఫలాలను జాగ్రత్తతో సేకరించి ఉంచారు.

హిమవంతుని బంధువర్గమంతా స్వజన, బంధుమిత్ర, సపరివారంగా అట్టహాసంగా వచ్చి వాహనాలను దిగుతున్నారు. వారందరికి ఆహ్వానం పలికి, కుశలాదికాలడిగి సేవకులను పురమాయించి విడిది గృహాలకు పంపుతున్నాడు పర్వతరాజు. మేరువు, మందరుడు,

అస్తాచలుడు, ఉదయాచలుడు, మలయ పర్వతుడు, నిషదుడు, గంధమాదనుడు. మహేంద్రుడు, పారియాత్రుడు, క్రౌంచుడు, త్రికూట, చిత్రకూట, వింధ్య, శ్రీపర్వతాలు ఇలా భూమండలం మీది ఆయన బంధువర్గమంతా అపార ధన, కనక, రత్న, మాణిక్య రాశులతోను, అపురూప బహుమానాలతోను, వివిధ వస్తు సామగ్రితోను వచ్చిచేరారు.

కాంచన రత్నోజ్వల దివ్యభూషణావళుల రోచిస్సులు కండ్లు మిరుమిట్లు గొలుప వివిధాలంకార శోభితలై నదీమ తల్లులు దివ్యరూపాలతో వచ్చి చేరారు. సమస్త ప్రాణికోట్లకు జీవనాధారభూతమై, సిరులు పండే మధుర జలాలను అందించే గంగ, యమున, సరస్వతి, గోదావరి, సింధు, కావేరి, నర్మద ఇత్యాది నదీదేవతలందరు, పుట్టింట్లో జరిగే పెండ్లికి మహా శోభతో చాలా అట్టహాసంగా దిగారు. వచ్చిన వారందరిని పేరుపేరున పలకరించి యథోచితంగా సన్మానించి వారివారి విడిది గృహాలకు పంపించాడు పర్వత సార్వభౌముడు. చేసిన అలంకరణలతో, విచ్చేసిన పెండ్లివారితో నగరమంతా చాలా కోలాహలంగా ఉంది.

**విశ్వకర్మ చేసిన అద్భుత సృష్టి**

పర్వతరాజు తన రాజధానీ నగరాన్ని రమణీయంగా అలంకరింపచేశాడు. మార్గాలన్నిటిని తుడిచి పరిమళ జలాలచే తడిపారు. ద్వారదేశాలన్నింటిని అరటి బోదెలతో అలంకరించారు. పట్టు దారాలతో కట్టిన మామిడి తోరణాలను కట్టారు. సింహద్వారాలన్నిటిని బంతిపూల మాలలచే తీర్చిదిద్దారు. అంతా గర్గుడు చెప్పినట్లుగానే చక్కని ఏర్పాట్లను చేసి విశ్వకర్మను పిలిచి వివాహ మంటపాన్ని నిర్మించమని పురమాయించాడు.

అనేక అద్భుతాలతో కూడిన కళ్యాణ మండపాన్ని నిర్మించాడు విశ్వకర్మ. స్థలం ఉన్నచోట జలభ్రాంతిని, జలం ఉన్నచోట స్థల భ్రాంతిని కల్పించాడు. కృత్రిమ సింహాలచే, కృత్రిమ జల పక్షులచే, కృత్రిమ నెమళ్ళచే అలంకరించాడు. కొన్ని చోట్ల స్త్రీ, పురుషులు నృత్యం చేస్తూండగా ప్రేక్షకులు పారవశ్యంతో చూస్తున్నారు. సుందరులైన ద్వారపాలకులు కొన్నిచోట్ల ఖడ్గపాణులై కావలి ఉన్నారు. కొన్నిచోట్ల మదపుటేనుగులు మావటీలతోను, అశ్వాలు రౌతులతోను కూడి ఉన్నాయి. కొన్నిచోట్ల రథాలను సారథులు తోలుతున్నారు. కొన్నిచోట్ల పదాతి దళాలు ఆయుధాలతో నిలిచి ఉన్నాయి. ద్వారం వద్ద అద్భుతమైన మహాలక్ష్మి విగ్రహం ఉంది. అన్నీ కృత్రిమ విగ్రహాలే!

ఇంకా... బ్రహ్మ, విష్ణువు, లోకపాలురు, ఇంద్రుడు, మహర్షులు ఒకరేమిటి; తన నైపుణ్యంతో, బుద్ధికుశలతతో సృష్టికి ప్రతిసృష్టి చేసి ఆ మంటపాన్ని అత్యద్భుతంగా తీర్చిదిద్దాడు

విశ్వకర్మ. సమస్త దేవ లోకాన్ని అక్కడ సాక్షాత్కరింప చేశాడు. వారి వారి ప్రతిమలను చూచుకొని దేవతలే దిగ్భ్రాంతులయ్యారు. మరొక విచిత్రమేమంటే దేవతల నిజలోకాలు, నిజగృహాలు ఎలా ఉంటాయో అలాటి లోకాలను, గృహాలను క్షణంలో నిర్మించాడు. ఈ విధంగా అన్ని ఏర్పాట్లను పూర్తి చేసుకొని శివుని రాకకై నిరీక్షిస్తున్నాడు గిరిరాజు.

**శివుని యాత్రా సన్నాహం**

శివుడు లగ్న పత్రికను చదువుకొని వెంటనే నారదుని స్మరించాడు. నారదుడు వచ్చి వాలేడు. అతనితో శివుడిలా ఆదరంగా "నారదా! గతమంతా నీకు తెలుసు. పార్వతిని తపస్సు చెయ్యమని ప్రోత్సహించింది నువ్వే! నువ్వు చేపట్టిన కార్యం ఫలరూపానికి వచ్చింది. ఇదిగో! లగ్న పత్రిక! నువ్వు మనో వేగంతో వెళ్ళి బ్రహ్మను, హరిని, ఇంద్రుని, ఋషులను, సమస్తదేవలోకాన్ని నామాటగా ఆహ్వానించు. రాని వారిని నా ఆత్మీయులుగా భావించలేను" అని చెప్పి పంపేడు. దేవర్షి ఆ కార్యాన్ని లెస్సగా నెరవేర్చేడు. శివుడు ముహూర్తంకోసం ఉత్కంఠతో ఎదురు చూస్తున్నాడు. శివగణాలన్ని సంతోషంతో నృత్యం చేశాయి.

శివునివైపు పెళ్ళి వారంతా ఒక్కొక్కరే కైలాసంలో బంధు, మిత్ర సపరివారంగా, భార్యాపుత్ర సమేతంగా మహోత్సాహంతో వచ్చి దిగుతున్నారు. ముందుగా విష్ణువు తన పరివారంతో వచ్చాడు. వాణీ సహితుడైన పితామహుడు వేదాలన్ని సుస్వరంగా తమకు తామే గానం చేస్తూండగా, హంస వాహనా రూఢుడై, శుభవచనాలను పలుకుతూ దిగాడు. తన వైభవమంతా వెల్లి విరియగా బృందారకులతో కూడి వచ్చి చేరాడు ఇంద్రుడు. శివునిచే ఆజ్ఞాపించబడిన వారందరు శివకార్యం తమ కార్యంగా భావించి సంతోషంతో వచ్చారు.

సప్త మాతృకలు శంకరునికి యథోచితంగా అలంకార విధిని నెరవేర్చారు. శివ సంకల్పం చేతనే అవి అలంకారాలుగా తోచాయి. బాల చంద్రుడు మణి మకుటంగా, ఫాలనేత్రం శుభతిలకంగా, సర్పాలు కర్ణకుండలాలుగా, ఇతర అవయవముల యుందున్న భుజగములన్నీ రత్నాభరణాలుగా, గజచర్మం పీతాంబరంగా, విభూతి చందన లేపనంగా చూపరులకు కనువిందు చేశాయి.

అప్పుడు పరమ సుందరుడైన శంకరుని సమీపించి మధురంగా నారాయణుడిలా అన్నాడు. "ఓ దేవదేవ! మహాదేవ! శరణాగత వత్సల! గృహ్య సూత్రాను సారంగా, విధివిధానంగా వివాహ కర్మను అనుష్ఠించటానికి దయ చెయ్యండి. మండప స్థాపనను, నాందీ ముఖాన్ని ప్రీతి పూర్వకంగా అనుష్ఠించండి. మీరీ విధానాన్ని పాటిస్తే లోకం అంతటా

అది వ్యాప్తి చెంది ఖ్యాతిని పొంద గలదు.” విష్ణువు మాట యందు లోకాచారమునందు శ్రద్ధగల శంకరుడు ఆ కర్మలను విధివిధానంగా అనుష్ఠించాడు.

కశ్యపుడు, అత్రి, వసిష్ఠుడు, గౌతముడు, భాగురి, గురుడు, కణ్వుడు, బృహస్పతి, శక్తి, జమదగ్ని, పరాశరుడు, మార్కండేయుడు, శిలాపాకుడు, అరుణపాలుడు, అకృతశ్రముడు, అగస్త్యుడు, చ్యవనుడు, గర్గుడు మరియు శిలాదుడు, వీరంతా శివ కళ్యాణానికి వచ్చారు. ఇంకా దధీచి, ఉపమన్యువు, భరద్వాజుడు, అకృతవ్రణుడు, కుశికుడు, పిప్పలాదుడు, కౌత్సుడు, వ్యాసుడు అతని శిష్యులు ఇలా ఋషిగణమంతా వచ్చారు. వేదవేదాంగ వేత్తలైన ఆ ఋషులందరు పితామహుడు బ్రహ్మత్వాన్ని వహించగా వేదోక్త విధానంగా పవిత్ర వివాహ కర్మకు మంగళాన్ని కలిగించే రక్షాబంధన కార్యక్రమాన్ని పరమేశ్వరునిచే అనుష్ఠింప చేశారు. మండపాన్ని స్థాపించి దాని యందు సకల దేవతారాధన చేసి శంభునిచే గ్రహపూజను చేయించారు. ఋషులందరు వేద సూక్తాలను పఠించి వివిధ ఆశీర్వచనాలను, మంగళా శాసనాలను చేశారు. శివుడు వారందరికి సంభావన లిచ్చి సత్కరించి నమస్కరించాడు. ఋషులు, బ్రాహ్మణులు, దేవతలు ముందు నడవగా కైలాసం నుండి బయలుదేరాడు పెండ్లికొడుకైన శంకరుడు.

**శివుని వివాహ యాత్ర**

రుద్రుని వెంట అసంఖ్యాక రుద్ర గణాలు చిత్రవిచిత్ర వాద్యధ్వనుల సంరంభంతో కదిలాయి. శంఖకర్ణుడు, కేకరాక్షుడు, విశాఖుడు, పారిజాతుడు, సర్వాంతకుడు, వికృతాననుడు, కపాలుడు, దుందుభుడు, కందుకుడు, కుండకుడు, ఆవేశనుడు, మహాకేశుడు, చంద్రతాపనుడు, అగ్నిముఖుడు, ఘనావహుడు, అమోఘుడు, కుముదుడు, కోకిలుడు, కాకపాదుడు, మహాబలుడు, నీలుడు. పూర్ణభద్రుడు, విరూపాక్షుడు, తాలకేతుడు... ఇంకా అనేక మంది గణాధ్యక్షులు కోట్ల సంఖ్యలోగల వారి వారి గణాలతో కదిలేరు. సర్వసైనాధ్యక్షుడైన వీరభద్రుని పర్యవేక్షణలో వారంతా నడిచారు. త్రిమూర్తులతో సహా సమస్తమైన దేవతల రూపాలను ధరించి ఉన్నారు వారు. సృష్టి అంతా వ్యాపించియున్న రుద్రగణాలన్ని కదిలాయి.

రుద్రుని సోదరియైన చండి మహోత్సాహంతో వచ్చింది. చాలా భయంకరంగా ఉంది ఆమె రూపం. సంధ్యా కాలంలో అరుణ ప్రభలతో రక్తం కక్కుతున్న ఆకాశంలా ఉంది... ఆమె ముఖం! అస్తంగత సూర్యుని మించి, అగ్నిగోళాల్లా వెలుగుతూ, రెప్పల సందున నిప్పులు కక్కుతున్న నేత్రాలు! ప్రేతాసనాసీనయై ఉంది. కాలకూటాన్ని కక్కే కాద్రవేయ,

కాకోదరాదులు ఆమెకు ఆభరణాలు, నెత్తిమీద కాంచన పూర్ణ కలశం. వికృతాననులు, భయంకరాకారులు, ఐన పదకొండు కోట్ల రుద్రగణం ఆమె పరివారం. ఢమరు, భేరి, శంఖ, దుందుభి ధ్వనులకు దిక్కులు మార్మోగగా; జగత్తులోని అమంగళాలను నశింప చేసి మహీమండలాన్ని మంగళమయం చేస్తూ కోలాహలంగా వచ్చింది.

గణాల వెనుక ఇంద్రాది దిక్పాలురు, దేవతలు, సిద్ధులు నడిచారు. వారి మధ్య లక్ష్మీ సహితుడై, అలంకార శోభితుడై గరుడ వాహనారూఢుడై నారాయణుడు చుక్కల మధ్య చంద్రునిలా శోభించాడు. బ్రహేంద్రాది దేవతలందరు ధ్వజశోభిత వాహనాలపై వైభవోపేతంగా వెంట అనుసరించారు. హాహా, హూహూ, తుంబురు, నారాదాదులు సామగానం చేస్తూ పాదచారులై వెంబడించారు.

వారి మధ్య .... ప్రమథగణ పరివృతుడై ... శుద్ధస్పటిక సంకాశము, సర్వాంగ సుందరము, వేద శాస్త్ర, బ్రహ్మర్షి, సిద్ధ, మునిగణ సంభావిత ధర్మ స్వరూపము ఐన వృషభాన్ని అధిరోహించి, ... భూతగణ నాథునకు శీతకిరణుడు శ్వేతచ్ఛత్రమై రాజిల్ల... అంతరిక్ష మధ్యస్థమైన క్షీర సాగరంలా.... మహోతేజో విరాజమానుడై వెలిగి పోతున్నాడు... సర్వజ్ఞ శేఖరుడైన మహాదేవుడు.

వెండి కొండ వేలుపు పెండ్లి కొడుకైన వేళ... ఇలా సాగింది, 'శుభయాత్ర'.

**పెళ్ళి వారికి ఎదురేగుట**

శంకరుడు పెండ్లి కొడుకై సకల దేవతా సమూహంతో తన నగర శివార్లకు వచ్చేదని వర్తమానాన్ని విన్న హిమవంతుడు బ్రాహ్మణులతో, తన కుమారులతో కలిసి తగిన సంచారాలతో ఎదురేగి స్వాగతం చెప్పాడు. శివుని సేనను, వైభవాన్ని చూచి తన కుమార్తెకు మంచి వరుడు లభించాడని మురసి పోయాడు. ధన్యుడనయ్యానని తనను తానే అభినందించు కొన్నాడు. పర్వతరాజు బంధు వర్గాన్ని, పరివారాన్ని చూచి దేవతలు విస్మితులై ఆనందాన్ని పొందారు. ఉభయ వర్గాల కలయిక పూర్వ పశ్చిమ సముద్రాలు కలిసి నట్లుంది. సహస్ర దళ పద్మంలా శోభాయమానంగా ఉన్న సేనామధ్యమందు వామ దక్షిన పృష్ట స్థితుల యందు మాధవ, విధి, మహేంద్రులు కనువిందు చేస్తుండగా... కర్ణికా స్థానంలో నేత్ర పర్వంగా ఉన్న చంద్రశేఖరుని చూచి... ఆనందించి నమస్కరించి ఆపై తక్కిన వారందరికి కూడ నమస్కరించి స్వాగతం పలికాడు హిమవంతుడు. అతని వెంట వచ్చిన వారు కూడ పునః పునః అనేక నమస్కారాలు చేశారు. వారందరిని తన గృహానికి సగౌరవంగా తీసికొని వెళ్ళాడు.

మార్గ మధ్యంలో శివ సందర్శనాపేక్షతో పురంధ్రీ మణులు సౌధోపరి భాగాలను అధివసించి తమ కన్నుల సాఫల్యానికి తామే సంతోషించారు. వాళ్ళ కుతూహలం వర్ణించ రానిది. ఒకామె స్నానానికి వెడుతూ అభ్యంగన చూర్ణంతో అలాగే వచ్చింది! ఒకామె భర్తకు చామర సేవ చేస్తూ దానిని విడిచిపెట్టి వచ్చింది. చంటి పిల్లాడికి పాలు పూర్తిగా ఇవ్వకుండానే వచ్చింది ఒక బాలింత! భోజనానికి కూర్చొన్న భర్తకు వడ్డన పూర్తవకుండానే వచ్చింది... ఒక యువతి!

వారందరు పార్వతి అదృష్టాన్ని పరిపరి విధాల మెచ్చుకొన్నారు. అందరు శివుని పెండ్లి వారిపై పువ్వులను, సేసలను చల్లారు. ఇంత మంచి అల్లుడు దొరికినందుకు మేనక ఆనందానికి మేరలేదు.

**శివుడు హిమవంతుని గృహానికి వెళ్ళుట**

అడుగులకు మడుగు లొత్తుతూ గంగాధరుని సపరివారంగా తన మహారాజ మందిరానికి ఆహ్వానించాడు నగాధి రాజు. అందరు పెండ్లి నడకలు సాగించారు. శ్రేష్ఠమైన సింహద్వారం దగ్గర ఆగారు. అక్కడ మేనకాదేవి బంగారు మంగళ హారతి పళ్ళెరాన్ని పట్టుకొని సిద్ధంగా ఉంది. మనోహారిణులైన యువతులనేకమంది దీప పాత్రలను ధరించి ఆమె చుట్టూ ఉన్నారు. దీపకాంతుల ప్రకాశంలో వారు ధరించిన శ్రేష్టమైన రత్నాభరణాలు మెరిసి పోతున్నాయి. పెండ్లి కొడుకైన శంకరునికి కర్పూర నీరాజనమిచ్చి కీడు తీశారు పుణ్యాంగనలు. సర్వలోకాలకు మంగళాల నిచ్చే ఆ పరమాత్మకు అమంగళ పరిహారార్థం నీరాజనమా! స్త్రీల వేడుకకు శంకరుడు ముచ్చట పడ్డాడు.

గిరిసార్వభౌముడైన హిమవంతుని రాజ కుటుంబ మంతా రెప్ప వేయకుండ ముక్కంటిని చూచారు. మహా సౌందర్యరత్నాకరుడైన శంకరుడు వరుని వేషంలో మరీ మనోహరంగా ఉన్నాడు! చారు చంపక వర్ణాభుడు, ఏక వక్త్రుడు, త్రినేత్రుడు, ప్రసన్నాస్యుడు, రత్న స్వర్ణాది భూషితుడు, మాలతీ మాలాయుక్తుడు, రత్న మకుటోజ్జ్వలుడు, సత్కంఠాభరణుడు, సుందర వలయాంగద భూషితుడు, చందనాగరు కస్తూరీ కుంకుమ శోభితుడు, రత్నదర్పణ హస్తుడు, కజ్జలోజ్జ్వల లోచనుడు, సర్వాంగ సుందరుడు .... ఐన ఇందుధరుని చూచి మేనకా హిమవంతులు ఇంకా అక్కడున్న తక్కిన వారంతా ముదిత మానసులై ఉమాదేవి సౌభాగ్యాన్ని ప్రశంసించారు. ఈ విధంగా ద్వారం వద్ద జరిగే ఆచారాన్ని అనుష్ఠించి శంకరుడు తన విడిదికి వెళ్ళాడు.

అనంతరం ఆ దుర్గాదేవి అంతఃపుర పరిచారికలతో కూడి కులదేవతారాధనకై నగరోప కంఠానికి బయలు దేరింది. మహేంద్ర నీలద్యుతి కోమలాంగి, స్వాంగ భూషిత, ప్రసన్న వదన, చారు కబరీభర, కంబుకంఠి, సిందూర బిందు శోభిత, రత్న హార విరాజిత, రత్న కంకణ మండిత, క్రీడా పద్మ విభూషిత, ఘనసార కుంకుమ చందన చర్చిత, క్వణన్మంజీర లాక్షారంజిత పాద మండిత, సర్వావయవ సుందరి ... ఐన ఆ ఇందు కళాధరిని చూచి బృందారకు లందరు భక్తితో ప్రణమిల్లారు. గౌరి దేవిని చూచిన శంకరునకు పులకాంకురాలు మేన పొడమగా శరీరం పనస కాయవలె ఐపోయింది. ఆయన కన్నుల నిండ ఆమె రూపమే! అతనుడైన మన్మథుడు మదనారిని చూచి కెవ్వు మన్నాడు... అదెవరికీ వినిపించలేదు. బ్రహ్మగారు నవ్వు కొన్నాడు... అదెవరికి కనుపించ లేదు. ఆ తరువాత కాళి తన కులదైవమైన అంబికను అర్చించి తండ్రి మందిరానికి తిరిగి వచ్చింది.

**శివపార్వతుల కళ్యాణం**

ఆ తరువాత హిమవంతుని ప్రార్థనను మన్నించి వరుడు సపరివారంగా ఆయన అంతఃపురంలో ప్రవేశించాడు. వేదాచారాన్ని, లోకాచారాన్ని అనుసరించి శివుడిచ్చిన అలంకారాలతో పార్వతిని అలంకరించారు. తరువాత కర్పూర నీరాజన మిచ్చారు. రత్నాలు కుట్టబడిన కంచుకాన్ని, జంట వస్త్రాన్ని ధరించింది ఆమె. చిత్తంలో శివధ్యానం చేస్తూనే ఉంది. మంగళ వాద్యాలు మార్మోగుతున్నాయి. ఇంతలో జ్యోతిశ్శాస్త్ర విశారదుడైన గర్గుడు పాణిగ్రహణ సమయ మాసన్నమైందని గుర్తించి; వరుడైన శంభుని తోడ్కొని రావలసిందిగా హిమవంతునకు పురమాయించాడు.

ఆయన కోరిక మేరకు వేదవేత్తలైన బ్రాహ్మణులు మంగళ ద్రవ్యాలను చేతుల యందు పట్టుకొని, వధువు బంధువర్గం వెంటరాగా సుస్వరంతో వేద మంత్రాలను పఠిస్తూ ఉత్సాహంతో శివ సన్నిధానానికి కదిలారు. వారి వేద ఘోషకు ఋషులు, దేవతలు, గణాలు అందరు ఒక్కసారిగా సంతోషంతో లేచి నిల్చున్నారు. వారిలో వారిలా అనుకొన్నారు: "మనం ధన్యుల మయ్యాం! శివుని తీసికొని వెళ్లటానికి ఆడపెళ్ళివారొస్తున్నారు. సుముహూర్తం సమీపించింది. ఇంత కాలానికి బాలచంద్ర ధరుడైన మన శంకరుడు జంటవాడు కాబోతున్నాడు. జగత్తుకు మంగళాల నిచ్చే పార్వతీ పరమేశ్వరుల కళ్యాణాన్ని చూడబోతున్నాం! త్వరగా నడవండి!"

వారిలో వారిలా మాట్లాడుకొంటూ ఉండగానే పర్వతరాజు బంధువులు, మంత్రులు వచ్చి "కన్యాదాన సమయం ఆసన్నమైంది! బయలు దేరండి!" అని ప్రార్థించారు. ఆ మాటను విన్నదేవతలందరు పర్వతరాజు నుద్దేశించి జయజయ ధ్వానాలు చేశారు. పార్వతీ పాణిగ్రహణ కుతూహలుడైన శంకరుడు తన శృంగార భావాలను గుప్తంగా ఉంచుకొని గంభీరంగా ఉన్నాడు. అక్కడున్న వారంతా పెళ్ళైన వారే కనుక శివుని తొందరను కనిపెట్టక పోలేదు. హరి బ్రహేంద్రాది లోకపాలకులందరు మంగళ వాద్యాలు మార్మోగుతూ ఉండగా పెళ్ళి కొడుకైన శంకరుని వృషభ వాహనారూఢుని చేశారు. కొందరు ఢమరుకాలు మ్రోగించారు. కొందరు శంఖాలను పూరించారు. కొందరు జేగంటలను వాయించారు. కొందరు వేణువులను ఊదారు. వీరందరితో కూడి వరుడు ఛత్ర, చామర శోభితుడై హిమవంతునింటికి చేరుకొని వాహనాన్ని దిగాడు. అంగనా మణులు హారతు లిచ్చారు. వేదిక నలంకరించాడు వరుడు. పురోహిత స్థానంలో గర్గ మహర్షి ఉండి మధుపర్కాదు లిచ్చి మంగళకర్మలన్నింటిని చేయించాడు.

సుముహూర్తం సమీపించగా హిమవంతుడు భార్యా సహితుడై... "ఇమాం కన్యాం తుభ్యమహం దదామి పరమేశ్వర । భార్యార్థే పరిగృహ్ణీష్వ ప్రసీద సకలేశ్వర ॥" – (ఈ కన్యను నేను నీ కొరకు ఇస్తున్నాను. ఓ పరమేశ్వర ! నీవు ప్రసన్నుడవై ఈమెను భార్యగా స్వీకరించు) అని మంత్రాన్ని చదివి పార్వతి చేతిని శివుని చేతిలో ఉంచి బ్రహ్మానంద భరితుడయ్యాడు. శంకరుడు కూడ వేద మంత్రాన్ని పఠించి పార్వతి చేతిని తన చేతితో పట్టుకొని భూమిని స్పృశించి "కామస్య కోఽ దాత్" ఇత్యాది మంత్రాన్ని పఠించాడు. అందరూ ఆనందించారు. ఈ విధంగా పార్వతీ పరమేశ్వరుల పాణిగ్రహణ మహోత్సవం సకలజన లోచనోత్సవంగా సాగింది.

**బ్రహ్మ మోహితుడగుట**

పాణిగ్రహణానంతరం పార్వతీ పరమేశ్వరులిద్దరూ లాజహోమ విధిని నెరవేర్చారు. ఆ సమయంలో వారిద్దరు అగ్నిప్రదక్షిణం చేస్తూండగా.... నక్షత్రముల వంటి నఖములు కలిగి, పారాణిచే అలంకరింప బడిన పద్మముల వంటి పార్వతీ చరణద్వయాన్ని చూచి శివమాయచే బ్రహ్మగారు క్షుభిత మానసుడయ్యాడు. పాదద్వయాన్ని తేరిపార చూచాడు. విధాత ఆంతర్యాన్ని తెలుసుకున్న త్రినేత్రుడు ఆగ్రహావేశుడయ్యాడు. అచటి దేవతలంతా భయభ్రాంతులై సదా శివుణ్ణిలా స్తుతించారు.

**శ్లో ॥ దేవదేవ జగద్వ్యాపిన్ పరమేశ సదాశివ ।**
**జగదీశ జగన్నాథ సంప్రసీద జగన్మయ ॥**
**సర్వేషామపి భావానాం త్వమాత్మాహేతు రీశ్వరః ।**
**నిర్వికారో-వ్యయో నిత్యో నిర్వికల్పోఽ క్షరః పరః ॥**
**ఆద్యంతావస్య యన్మధ్య మిదమన్యదహం బహిః ।**
**యతో-వ్యయస్స నైతాని తత్సత్యం బ్రహ్మచిద్భవాన్ ॥**
**తవైవ చరణాంభోజం ముక్తికామా దృఢవ్రతాః ।**
**విసృజ్యోభయత స్సంగం మునయ స్త్వముపాసతే ॥**

**తా॥** ఓ దేవదేవా! జగద్వ్యాపీ! పరమేశ్వర! సదాశివ! జగదీశ! జగన్నాథా! జగత్స్వరూపా! మాపై ప్రసన్న భావాన్ని చూపించు. సర్వప్రాణులకు ఆత్మ, కారణము, ఈశ్వరుడు నీవే! నీవు వికార రహితుడవు. నాశం లేని వాడవు. నిత్యము, నిర్వికల్పము, అక్షరము ఐన పరబ్రహ్మము నీవే. ఆది, మధ్యము, అంతము అంతా నీవే! ఇది, మరియొకటి, నేను, నాకంటె భిన్నము.... ఇత్యాది భేధములు లేనిది, అవ్యయము, సచ్చిద్ఘనము అగు ఆ పరబ్రహ్మ నీవే! ముముక్షువులు, దృఢవ్రతులు, అగు మునులు ఇహపరముల యందు సంగమును వీడి నీ పాద పద్మాలను మాత్రమే సేవిస్తారు.

**శ్లో ॥ త్వం బ్రహ్మ పూర్ణమమృతం విశోకం నిర్గుణం పరమ్ ।**
**ఆనంద మాత్ర మవ్యగ్ర మవికార మనాత్మకమ్ ॥**
**విశ్వస్య హేతు రుదయస్థితి సంయమనస్యహి ।**
**తదపేక్ష తయాత్మేశోఽ న పేక్ష స్సర్వదా విభుః ॥**
**ఏకస్త్వ మేవ సద సద్ద్వయ మద్వయమేవచ ।**
**స్వర్ణం కృతాకృతమివ వస్తు భేదో న చైవహి ॥**
**అజ్ఞానతస్త్వయి జనైర్వికల్పో విదితోయతః ।**
**తస్మాద్భ్రమ ప్రతీకారో నిరుపాధే ర్నహి స్వతః ॥**

**తా॥** పూర్ణము, అమృతము, శోక రహితము, నిర్గుణము, ఆనంద ఘనము, వ్యగ్రత లేనిది, వికారములు లేనిది, ఉపాధి కంటె భిన్నమైనది, ఐన పరబ్రహ్మవు నీవే. ఈ సృష్టికి కారణం నీవే. ఆత్మ, ప్రభువు నీవే. సర్వ వ్యాపకుడవైన నువ్వు ఏనాడూ జగత్తుపై ఆధారపడి లేవు. నువ్వు ... ఒక్కడివే ఐనను కార్య కారణ రూపాలను పొంది ద్వైత, అద్వైత

స్వరూపుడుగ ఉన్నావు. బంగారం స్వరూపంలో ఒక్కటే ! నగలు వేరు ! జనులు అజ్ఞానం చేత నీ యందు భేద భావాన్ని కలిగి ఉంటారు. ఉపాధికి అతీతుడవైన నీ యందు భేదం లేదు, కనుక భ్రమను నివారించే అద్వైతమే అందరికి ఆశ్రయం.

**శ్లో ॥ ధన్యా వయం మహేశాన తవ దర్శన మాత్రతః ।**
**దృఢ భక్తజనానందప్రద శంభో దయాంకురు ॥**
**త్వమాదిస్త్వమనాదిశ్చ ప్రకృతేస్త్వం పరః పుమాన్ ।**
**విశ్వేశ్వరో జగన్నాథో నిర్వికారః పరాత్పరః ॥**
**యోఽయం బ్రహ్మాస్తి రజసా విశ్వమూర్తిః పితామహః ।**
**త్వత్ప్రసాదాత్ప్రభో విష్ణు స్సత్త్వేన పురుషోత్తమః ॥**

**తా ॥** ఓ! మహేశ్వర! నీ దర్శన మాత్రం చేతనే ధన్యుల మయ్యాం. ఓ ఆనందప్రద! దయ చూపు. ఈ జగత్తుకు నువ్వు కారణం. కాని నీకు కారణం లేదు. ప్రకృతికి అతీతుడవైన పురుషుడవు నువ్వే. నువ్వు విశ్వేశ్వరుడవు. జగన్నాథుడవు, నిర్వికారుడవు, పరాత్పరుడవు. హే ప్రభో! ఈ బ్రహ్మనీ అనుగ్రహం చేతనే రజోగుణ ప్రధానుడై సృష్టికర్త ఐనాడు. విష్ణువు సత్త్వగుణ ప్రధానుడై లోక పాలకుడైనాడు.

**శ్లో ॥ కాలాగ్ని రుద్రస్తమసా పరమాత్మా గుణై పరః ।**
**సదాశివో మహేశాన స్సర్వవ్యాపీ మహేశ్వరః ॥**
**వ్యక్తం మహచ్చ భూతాది స్తన్మాత్రాణీంద్రియాణిచ ।**
**త్వయై వాధిష్ఠితాన్యేవ విశ్వమూర్తే మహేశ్వరః ॥**
**మహాదేవ పరేశాన కరుణాకర శంకర ।**
**ప్రసీద దేవ దేవేశ ప్రసీద పురుషోత్తమ ॥**
**వాసాంసి సాగరాస్సప్త దిశశ్చైవ మహాభుజాః ! ।**
**ద్యౌర్మూర్థాతే విభోర్నాభిః ఖంవాయుర్నాసికా తతః ॥**

**తా॥** తమోగుణ ప్రధానుడై కాలాగ్ని... రుద్రుడైనాడు. కాని నువ్వు గుణాతీతుడవు. ఓ సదాశివా! సర్వవ్యాపీ! మహేశ్వరా! విశ్వమూర్తీ! అవ్యక్తం నుండి పుట్టిన మహత్తత్త్వం, భూతతన్మాత్రలు పంచభూతాలు, ఇంద్రియాలు నీచేతనే అధిష్ఠితాలై ఉన్నాయి. మహాదేవా! పరమేశ్వరా! కరుణానిధీ! శంకరా! దేవదేవా! ఈశ్వరా! పురుషోత్తమా! దయ చూపు. సప్త సముద్రాలు నీ వస్త్రాలు. దిక్కులు నీ మహాభుజాలు. ద్యులోకం నీ శిరస్సు. ఆకాశం నాభి, వాయువు నాసిక.

**శ్లో॥ చక్షూంష్యగ్నీ రవిస్సోమః కేశా మేఘాస్తవ ప్రభో ।**
**నక్షత్ర తారకాద్యాశ్చ గ్రహాశ్చైవ విభూషణమ్ ॥**
**కథం స్తోష్యామి దేవేశ త్వాం విభో పరమేశ్వర ।**
**వాచామగోచరోఽసి త్వం మనసాచాపి శంకర ॥**
**పంచాస్యాయ చ రుద్రాయ పంచాశత్కోటి మూర్తయే ।**
**త్ర్యధిపాయ వరిష్ఠాయ విద్యాతత్త్వాయ తే నమః ॥**
**అనిర్దేశ్యాయ నిత్యాయ విద్యుజ్జ్వాలాయ రూపిణే ।**
**అగ్ని వర్ణాయ దేవాయ శంకరాయ నమో నమః ॥**
**విద్యుత్కోటి ప్రతీకాశ మష్టమూర్తిం సుశోభనమ్ ।**
**రూపమాస్థాయ లోకేఽస్మిన్ సంస్థితాయ నమో నమః ॥**

**తా ॥** సూర్య, చంద్ర, అగ్నులు నీ కన్నులు. మేఘాలు నీ కేశములు, నక్షత్రాలు, గ్రహాలు ఇత్యాదులు నీ అలంకారాలు. నిన్నెలా స్తుతించాలి ? వాక్కులకు అందవు. శంకరా! మనస్సుకు గోచరించవు! ఐదు ముఖాలు కలవాడు, యాభైకోట్ల రూపములు గలవాడు, భూర్భువస్సువర్లోకములకు ప్రభువు, సర్వోత్తముడు, జ్ఞాన స్వర్వోత్తముడు, అగు నీకు నమస్కారం. ఇదమిత్థంగా నిర్దేశింప శక్యం కానివాడు, నిత్యుడు, విద్యుత్తుల వలె ప్రకాశించు రూపం కలవాడు అగు శంకరునకు నమస్కారం. కోటి విద్యుత్తు కాంతి కలవాడు, సుందరమగు ఎనిమిది రూపాలను ధరించి లోకమంతా వ్యాపించి యున్నవాడు అగు నీకు నమస్కారం.

దేవతల స్తోత్రానికి భక్త వత్సలుడైన శంకరుడు ప్రీతుడై అభయమిచ్చాడు. ముప్పు తప్పిందని వేలుపులు సంతోషించారు. బ్రహ్మ తేజస్సునుండి పుట్టి జారిపడిన వీర్యకణాల నుండి మహాకాంతితో ప్రకాశించే వాలఖిల్యాది ఋషులు వేలాదిగా పుట్టారు. వారందరు పుడుతూనే 'తండ్రీ! తండ్రీ! అంటూ బ్రహ్మ గారిని చేరి నిలబడ్డారు. ఈశ్వర సంకల్పంచే ప్రేరితుడై నారదుడు వారితో కోపంగా ఇలా అన్నాడు. "ఓ వాలఖిల్యులారా! మీరందరు కలసి గంధమాదన పర్వతానికి వెళ్ళండి. అచ్చట మీరు గొప్ప తపస్సు చేసి మునీశ్వరులై సూర్యునకు శిష్యులు కాగలరు. ఇక్కడ మీకు ప్రయోజనం లేదు. కనుక మీరిక్కడ ఉండవద్దు. ఇది ఈశ్వరాజ్ఞ."

నారదుని పలుకులను విన్న వాలఖిల్యాది మహర్షులు శివునికి నమస్కారం చేసి వెంటనే వెళ్ళి పోయారు. ఆపై విష్ణువు ఓదార్చుగా విధాత భయాన్ని వీడి ఇందుధరుని స్తుతించాడు. మహేశ్వరుడు ప్రసన్నుడు కాగా అందరు మహానందాన్ని పొందారు.

**పేరంటాండ్ర పరిహాస వచనాలు**

బ్రహ్మగారు ఆ వివాహ యజ్ఞంలో శివపార్వతుల చేత తదనంతర కార్య క్రమాన్ని వేదోక్తంగా అనుష్ఠింప చేసాడు. వారిద్దరికి శిరస్సులపై అభిషేకింప జేసి, ధ్రువ నక్షత్ర దర్శనాన్ని చేయించి, ఆపై హృదయ స్పర్శ కర్మను జరిపించాడు. విప్రులు స్వస్తి పఠనాన్ని మహదానందంతో సాగించారు. ఫాల లోచనుడు పురోహితుల ఆజ్ఞ మేరకు గిరిజా దేవి సీమంతంపై సిందూరాన్ని ఉంచాడు. ఆపై బ్రహ్మగారు వారిద్దరని ఒకే ఆసనంపై కూర్చుండ బెట్టాడు. పిమ్మట హోమ శేష ద్రవ్యాన్ని వధూవరులు భుజించారు. ఈ విధంగా పార్వతీ పరమేశ్వరుల వివాహ యజ్ఞం సుసంపన్నం కాగా...శంకరుడు నవరత్నాలతో నింపిన పూర్ణ పాత్రను బ్రహ్మ కట్నంగా పితామహున కిచ్చి సంతోష పెట్టాడు. తక్కిన బ్రాహ్మణులందరని యథోచితంగా సత్కరించాడు. అందరు జయ జయ ధ్వానాలు చేసి హిమవంతుని వద్ద సెలవు తీసికొని స్వస్థానాలకు తిరిగి వెళ్ళారు.

అటు పిమ్మట స్త్రీల కార్యక్రమం మొదలైంది. హిమవంతుని రాజధానీ నగరంలోని పుణ్య స్త్రీలందరు ఒకరి నొకరు మంగళకరమైన నామధేయాలతో పిలుచుకొంటూ, చేయి చేయి పట్టుకొని కేరింతలతో, కలకలా రావాలతో, హర్ష ధ్వానాలను చేస్తూ, పాద కటకాలు ఘల్లని మ్రోయ, పూల వాసనలు రంజిల్ల, యువతుల కరకంకణ నిక్వాణాలను నవ్వుల కిల కిలా రావాలను ద్వారపంజరస్థ కీరాంగనలు అనుకరింప హిమవంతుని రాజసౌధానికి వచ్చి చేరారు. వచ్చి నూతన వధూవరులైన గిరిజా శంకరులను కన్నుల పండువుగా అలంకరించి వాస గృహంలో ప్రవేశ పెట్టారు.

తారకాసురుని భాధల నుండి సర్వ సుపర్వులు విముక్తి పొందటానికి తగిన సమయం ఆసన్నమైందని; నిండు జవ్వనంలో భర్తృ మరణంతో ఎండి మ్రోడైన రతి జీవితంలో పండు వెన్నెలలు విరిసే శుభతరుణం సమీపించిందని ఎరిగిన పదహారు మంది దివ్యాంగనలు మహాదరంతో వచ్చారు. సరస్వతి, లక్ష్మి, సావిత్రి, గంగ, అదితి, శచి, లోపాముద్ర, అరుంధతి, అహల్య, తులసి, స్వాహా, రోహిణి, పృథివి, శతరూప, సంజ్ఞ, రతి... వీరందరు వచ్చి శయ్య నలంకరించిన శంకరునితో తియ్యగా ఇలా మాట్లాడారు.

“ఓ సర్వజ్ఞ శేఖరా! ప్రాణాధికమైన నీ ప్రియురాలు సతీదేవి నీకు లభించింది. రాకాచంద్రుని పరిహసించే ఈ పార్వతీ ముఖసందర్శన మాత్రం చేతనే సర్వతాపాలు నశిస్తాయి. నీ తాపము తొలగి పోతుంది. ఈ పైన మీకు వియోగం ఉండబోదు. ఈ సతి నాకాశ్రితురాలు కాగలదు... అని సరస్వతి భావి శుభాన్ని పలికింది.

"ఓ మదనాంతకా! ఈ పాటికి బిడియాన్ని విడిచి నీ ఎడదలో ఈ సతీదేవిని దాచుకో! ఈమె నీ ప్రాణవాయువు!" అని లక్ష్మీ దేవి సరసంగా ఎత్తి పొడిచింది.

"ఓ తరుణేందు ధరా! ఎవరి కోసం నువ్వింత కాలం విరహంతో వేగి విలపించావో ఆ సతీదేవి నీకు తిరిగి దక్కింది. నీ హృదయంలో పదిలంగా భద్రపర్చుకో! ప్రియురాలి విషయంలో లజ్జకు తావులేదు". అని శచీ దేవి అనునయించింది.

"స్వర్ణ శోభాన్వితయైన నీ సఖి యొక్క అరవింద సదృశమైన హస్తాన్ని పట్టుకొని తుమ్మెద రెక్కల వంటి ఆమె కురులను మృదువుగా సవరించు. దీన్ని మించిన సౌభాగ్యం మరొకటి లేదు సుమా!" – అని గంగా దేవి సుధామధురంగా పలికింది.

"ఓ భావజ్ఞ శేఖరా! సర్వాంతర్యామి యైన నీకు తెలియని మనోభావంలేదు. కనుక ఈ ఉమాదేవి మనోభావాన్ని గుర్తించి మసలుకో" – అని వసుంధర మృదువుగా చెప్పింది.

"ఓ నీలకంఠా! భోజనా లయ్యాక స్త్రీలకు ఇంకా పని మిగిలి ఉంటుంది. కనుక నువ్వు పార్వతికి తాంబూల మిచ్చి శయనింప వచ్చు" – అని లోపాముద్ర లోక ధర్మాన్ని చెప్పింది.

"ఓ ఫాలలోచనా! మేనకా దేవి ఈ వివాహానికి మొదట్లో అంగీకరించ లేదు. నేను ఆమెకు అనేక యుక్తులను చెప్పి ఒప్పించాను. కనుక ఈ సుకుమారి అభీష్టాన్నెరిగి ప్రవర్తించు" – అని అరుంధతి దాంపత్య ధర్మాన్ని చెప్పింది.

"ఓ లోక నాయకా! నువ్వెంత ధర్మజ్ఞుడవైనా స్త్రీల వచనాలను త్రోసిపుచ్చకు. మన్నించు. వివాహ, వ్యవహారాలలో స్త్రీలకు ప్రాగల్భ్యం ఉంది సుమా " – అని దాంపత్య ధర్మాన్ని చెప్పింది స్వాహాదేవి.

అందరి కంటె పెద్ద ముత్తైదువ అదితి పార్వతికిలా హితోపదేశం చేసింది. "కుమారీ! భోజనాంత మందు నీ ప్రాణప్రియుడైన శంకరునకు ముఖ శుద్ధ్యర్థం ప్రేమతోను, ఆదరంతోను శుద్ధ జలాన్ని భక్తితో అందీయటం మరచి పోకుసుమా! ఇట్టి ప్రేమ దంపతుల మధ్య దుర్లభం".

ఇలా రసోచిత వాక్కులను పల్కిన ఆ పతివ్రతామతల్లులను సముదంచిత రీతిని సత్కరించి పరమేశ్వరుడు మనోవాంఛా తృప్తుడై, ఆనందంలో మునిగి పోయాడు.

**మన్మథుడు పునర్జీవితుడగుట**

ఈ శుభ సమయం ఎప్పుడొస్తుందా అని ఎన్నో సంవత్సరాలుగా ఎదురు చూస్తున్న రతీదేవి దీనవత్సలుడైన శంకరుని సమీపించి ఇలా ప్రార్థించింది. "హే గిరిజా వల్లభా! పార్వతీ పాణిగ్రహణం చేసి దుర్లభమైన సౌభాగ్యాన్ని పొందావు. ఈ మహోత్సవంలో అందరు ఆనందంగా ఉన్నారు. భర్తృహీన నైన నేను దుఃఖితురాలనై ఉన్నాను. ఈ శుభ సమయంలో నా పతిని పునర్జీవితుని చేసి మనిద్దరికి సమానంగా సంప్రాప్తించిన వియోగ దుఃఖాన్ని తొలగించు. అందరికి ఆనంద ప్రదాయకమైన నీ వివాహం ఉత్సవంగా సాగింది. నన్ను కూడా ఉత్సవం కలదానిగా చేయి. నా భర్త జీవించాక పార్వతితో నీ వివాహం పరిపూర్ణ మవుతుంది."

ధూళిధూసరితమై శోభాహీనమైన శరీరం, కాంతి లేని ముఖం, బాష్పవారి సంకులమైన నేత్రాలు, నిరాభరణ భూషితురాలై మూర్తీభవించిన శోక దేవతలా ఉన్న రతి 'నాథా! నాథా' అని రోదిస్తూ తన భర్త చితాభస్మాన్ని మృత్యుంజయుని ముందుంచింది. రతి రోదనాన్ని విన్న లక్ష్మి, సరస్వత్యాది దేవీ మూర్తు లందరు శోకించి దీనంగా... మన్మథుని బ్రతికించి రతి జీవితంలో ఉత్సాహాన్ని నింప వలసిందిగా శివుని ప్రార్థించారు. వెంటనే కరుణా సముద్రుడైన శంకరుడు తన కృపామృత దృష్టిని చితాభస్మంపై ప్రసరింప చేయగానే మునుపటి వేషంతో, చిహ్నాలతో, ధనుర్బాణాలను ధరించి పరమ సుందరుడైన మన్మథుడు సాక్షాత్కరించాడు. అంత రతీమన్మథులిద్దరు చేతులు జోడించి శివునకు నమస్కరించి, స్తుతించి, శాశ్వతమైన శివభక్తిని వరంగా కోరగా 'అలాగే అగుగాక'! అని ఫాల లోచనుడు వర మిచ్చాడు. అంత ప్రీత మానసులై రతీ మన్మథులిద్దరు వైకుంఠానికి చేరుకొన్నారు. తదనంతరం...

శివుడు వాస గృహంలో ఉమాదేవిని ఎడమవైపు కూర్చుండ పెట్టుకొని క్షీరాన్నాన్ని తినిపించగా, ఆమె కూడా అలాగే చేసింది. పిమ్మట మహేశ్వరుడు కర్తవ్యాచరణ పూర్తి కాగానే మేనా హిమవంతుల అనుజ్ఞను పొంది జనావాసానికి వచ్చాడు. అక్కడ మహోత్సవం ప్రవర్తిల్లింది. దేవతలంతా ఆయనను ఇలా స్తుతించారు.

**శ్లో ॥ జయ శంభోఽఖిలాధార జయనామ మహేశ్వర ।**
**జయరుద్ర మహాదేవ జయ విశ్వంభర ప్రభో ॥**
**జయకాళీపతే స్వామిన్ జయానంద ప్రవర్ధక ।**
**జయత్ర్యంబక సర్వేశ జయ మాయాపతే విభో॥**

**జయ నిర్గుణ నిష్కామ కారణాతీత సర్వగ ।**
**జయ లీలాఖిలాధార ధృత రూప నమోఽస్తుతే ॥**
**జయస్వభక్త సత్కామ ప్రదేశ కరుణాకర ।**
**జయ సానంద సద్రూప జయ మాయాగుణాకృతే ॥**
**జయోగ్ర మృడ సర్వాత్మన్ దీన బంధో దయానిధే ।**
**జయవికార మాయేశ వాఙ్మనోఽతీత విగ్రహ ॥**

**తా ॥**హే! శంభో! సర్వాధారా! జయము. ఓ మహేశ్వరా నీ నామమునకు జయము. ఓ రుద్రా! మహాదేవా! జయము. జగత్తును పోషించే ఓ ప్రభూ! జయము. కాళీపతీ! స్వామి! జయము. ఆనందమును పెంపొందించు వాడా జయము. ముక్కంటి! సర్వేశ్వరా! జయము. మాయాధీశా! ప్రభూ! జయము. ముక్కంటి! సర్వేశ్వరా! గుణరహితా! కామరహితా! కారణమగు ప్రకృతికి అతీతమైన వాడా! సర్వవ్యాపీ! జయము. లీలచే సర్వమునకు ఆధారమై రూపమును ధరించిన వాడా! జయము. నీకు నమస్కారం. నీ భక్తులకు యోగ్యమగు కామనలను ఇచ్చు ఈశ్వరా! దయానిధీ! జయము. సచ్చిదానంద రూపా! జయము. మాయచే గుణములను రూపమును స్వీకరించిన వాడా! జయము. భయంకరాకారా! రక్షకుడా! సర్వాత్మా! ధీనబంధూ! దయాసముద్రా! జయము. వికారములు లేనివాడా! మాయాధీశా! వాక్కులకు, మనస్సునకు అతీతమైన విగ్రహము కలవాడా! జయము.ఇలా స్తుతించి అందరూ స్వస్థానాలకు వెళ్ళారు.

**పెండ్లి వారి భోజనాలు శివుని పవ్వళింపు సేవ**

హిమవంతుడు మగ పెండ్లి వారందరిని భోజనాలకు రావలసిందిగా తన కుమారులచే ఆహ్వానాలు పంపేడు. ఇక్కడ భోజన ప్రాంగణం పరిశుద్ధంగాను, శోభనంగాను ఉంది. శుభ్రంగా తుడిచి, పరిమళ ద్రవ్యాలను కలిపిన పన్నీటితో దుమ్ము రేగకుండా నేలను తడిపారు. త్రిమూర్తులు తక్కిన దేవతాగణం ఒక వరుసలో కూర్చున్నారు. నంది, భృంగి, వీర భద్రుడు తక్కిన గణనాయకులు ఒక పంక్తిలో ఆసీనులయ్యారు. ఋషులు, మునులు, విప్రులు వేరే పంక్తిలో తిష్ఠ వేశారు. చండి తన గణాలతో అనేక హాస్య వచనాలను పలుకుతూ ప్రత్యేక పంక్తిలో కూర్చుంది. వివిధ రకాలైన భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పానీయాలను వడ్డించారు. అందరూ తృప్తిగా ఆరగించారు.

అనంతరం శివుని, ప్రత్యేక విడిది గృహంలో విశ్రాంతిని తీసుకోమని ఆహ్వానించారు. మహా శోభనంగా ఉంది ఆ గృహం. ఆ భవనంలో అతి రమణీయమైన రత్న పర్యంకం మీద ఆ రాత్రి శయనించాడు చంద్రశేఖరుడు. ఉషః కాలం కాగానే దేవత లందరు మేల్కొని శివుని శయన మందిరం వద్దకు చేరి సౌఖశాయనికులై ఇలా సుప్రభాత వాక్యాలను పలికారు.

**శ్లో ॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రంతే భువనః ప్రమథాధిప ।**
**జనావాసం సమాగచ్ఛ కృతార్థాన్ కురు తత్ర తాన్ ॥**

ఓ ప్రమథపతీ! లెమ్ము, లెమ్ము. నీకు మంగళమగు గాక! మాకు మంగళముల నిమ్ము. జనుల నివాసము వద్దకు రమ్ము. అచట వారిని కృతార్థులను చేయుము.

సౌఖశాయనికులై (రాత్రి సుఖంగా నిద్ర పట్టిందా అని అడిగిన వారై ) నిలబడిన దేవతలను శివుడు మందహాసంతో పల్కరించి పంపించి ప్రాతః కృత్యాలను పూర్తి చేసికొని జనావాసాన్ని చేరుకొన్నాడు.

**అరుంధతి పార్వతికి పతివ్రతా ధర్మములను చెప్పుట**

పార్వతీ పరమేశ్వరుల వివాహ యజ్ఞ సందర్భంగా నాల్గవ రోజున చతుర్థీ కర్మ శుద్ధిగా, యథావిధిగా ఆచరింప బడింది. దీనిని ఆచరించక పోతే వివాహ యజ్ఞం భగ్నమవుతుంది. ఉభయ పక్షాల వారు వేదశాస్త్ర పారంగతులైన విప్రులను భూరి సంభావన లిచ్చి సత్కరించారు. సంగీత, నాట్య ఉత్సవాలు విరివిగా సాగాయి. ఐదు రోజుల వివాహా నంతరం పర్వత రాజు కోరిక మేరకు ఆయన చూపిన ఆదరానికి ముగ్ధులై ఇంకా కొన్ని రోజులు ఉండి పోయారు వరునితో కూడి దేవతలు.

ఒక రోజున అరుంధతి పార్వతిని సమీపించి శిరసు నిమిరి చిరునవ్వుతో... కొత్త కాపురం ఎలా చక్కదిద్దుకోవాలో, భర్తతోను, పరిజనులతోను, ఇరుగు పొరుగు వారితోను, బంధువులతోను ఎలా మసలు కోవాలో.... ఆ దాంపత్య ధర్మాలనిలా చెప్పింది.

" అమ్మాయీ! ధర్మ వర్ధనము, సుఖకరము ఐన నాలుగు మాటలు చెపుతాను విను. స్త్రీకి తక్కినవారు కొద్దిగా ఇస్తారు. కాని భర్త మాత్రం తన భార్యకు సర్వస్వాన్ని అర్పిస్తాడు. కనుక స్త్రీకి భర్తకంటె ఉత్తమ స్నేహితుడు లోకంలో ఉండబోడు. భార్యాభర్తల మధ్య ఏమైనా పొరపొచ్చా లొచ్చినా అద్దంమీద పెసర గింజల్లాగ అవి అట్టే కాలం నిలవవు! దాంపత్య బంధం... తామర తూడులోని దారం కంటె సున్నితమైనది. ఇనుప సంకెళ్ళ కంటె దృఢమైనది. భర్తను స్వాధీనంలో ఉంచుకోవాలనుకుంటే... ముందు మనసును గెలవాలి.

దానికి ప్రేమ ఒక్కటే మార్గం. దానికి సేవా ధర్మం ఉత్తమమైనది. ఇతర మార్గాల ద్వారా భర్తను కట్టిపెట్టి స్వాధీనంలో ఉంచుకొనాలని అనుకోవడం పూలమాలలతో మదపుటేనుగును బంధించా లను కోవటం వంటిదే!

గతంలో కొందరు స్త్రీలు తమ నడవడిక చేతనే భర్తృప్రేమను పొంది ఇప్పటికీ ఆనందంగా ఉన్నారు. వారు... సావిత్రి, శాండిల్య, లోపాముద్ర, శతరూప, అనసూయ, లక్ష్మి, స్వధా, సంజ్ఞ, సుమతి ఇత్యాదులు. వారు ఆచరించి చూపిన దాంపత్య ధర్మాలే తర్వాత కాలంలో ప్రతిప్రతా ధర్మాలుగా పెద్దలచే చెప్ప బడ్డాయి. పతివ్రత ఐన స్త్రీ ప్రభాత సమయంలో భర్త కంటె ముందు లేచి భర్త లేచేటప్పటికి లక్ష్మి దేవిలా దర్శన మివ్వాలి. రాత్రి భర్త శయనించిన తర్వాతనే తాను శయనించాలి. భర్త కంటె ముందుగాని, భర్తతో గాని, భోజనం చెయ్యరాదు. భర్త యెదుట అలంకార రహితంగా కనుపించ కూడదు. భర్త కార్యార్థియై పొరుగూరు వెళితే ఆ సమయంలో అలంకారాలను ధరించరాదు. ఏ గృహంలో స్త్రీ ఇలా ప్రవర్తిస్తుందో ఆమెను దేవతలు అనుగ్రహించి భోగ భాగ్యాల నిస్తారు. తద్వ్యతిరేక మైన చోట దరిద్రం తాండవిస్తుంది.

ద్వారదేశంలో నిల్చుని వీధిలో వచ్చే పోయే వారిని చూడరాదు. అలాటి స్త్రీ చులకన అవుతుంది. ఇంటి గుట్లు ఇతరులకు చెప్పరాదు. ఇల్లు వదలి పెత్తనాలకు పోరాదు. భర్త అనుమతి లేనిదే ఇంట్లోని ఏ వస్తువు ఇతరుల కీయరాదు. పట్టణంలో జరిగే సమాజోత్సవాలకు భర్తతో కలిసే వెళ్ళాలి. భర్త తోడు లేకుండా జరిపిన తీర్థ యాత్రలు ఫలాన్ని ఇయ్యవు. ఇంట్లో వస్తువులను తీర్చి దిద్దినట్లుగా అలంకరించాలి. ఖర్చును తగ్గించి పొదుపు పాటించాలి. అసద్వ్యయం, దుర్వ్యయం చేయరాదు. అది దరిద్ర హేతువు అవుతుంది. భర్త అనుమతి లేకుండ చేసిన ఉపవాసాది వ్రతాలు... అవి నరకహేతువు లవుతాయని తెలుసుకో! కాలగతిలో ఎన్ని దురవస్థలు సంప్రాప్తించినా భార్యాభర్తలు కలిసే ఉండి సహకరించు కోవాలి. స్వర్గారోహణ పర్వం దాకా ఒకరి చేతిని ఒకరు విడువ రాదు. ఈ ధర్మం ముఖ్యం సుమా! భర్త యొక్క ఆ యుర్దాయాన్ని కోరే స్త్రీ పసుపు కుంకుమలను, మంగళ సూత్రాన్ని, తిలకాన్ని, గాజులను, కాటుకను, కర్ణాభరణాలను ఇతర పుణ్యస్త్రీ లక్షణాలను విసర్జించ రాదు.

పతివ్రత యొక్క స్పర్శ చేతనే అంతరిక్షము, వాయువు, అగ్ని, జలము, భూమి, సూర్యుడు, చంద్రుడు... వీరంతా తమ జడత్వం తొలగి ఇతరులను పవిత్రులను చేయ

గలిగే సామర్థ్యం లభించిందని సంతోష పడతారు. పతివ్రత ఐన స్త్రీ ఉభయ (పుట్టింటిని, అత్తింటిని) కులాలను ఉద్ధరిస్తుంది. శీలమే సర్వసంపదలకు, సౌభాగ్యానికి హేతువు. కనుక ప్రాణాన్ని త్యాగం చేసైనా సరే శీలాన్ని రక్షించు కోవాలి. శీలాన్ని కోల్పోయిన నాడు..... జాతి, కులము, వంశము, ప్రతిష్ఠ, గౌరవము, ఔన్నత్యము....... సమస్తము కోల్పోయి నట్లే. పంచేంద్రియాలను ఏక కాలమందు ఆనందింప చేసేది.... స్త్రీ. చతుర్విధ పురుషార్థాలను సాధించటానికి సాధన భూతమైనది.... పతివ్రత ఐన స్త్రీ.

ఓ గిరిజా దేవీ! ఏదో లోకాచారాన్ని అనుసరించి ఈ ప్రసంగాన్ని చేశాను కాని లోకమాతవైన నీకు చెప్పాలా?" ఈ విధంగా అరుంధతి చెప్పి విరమించింది. శివప్రియ, హిమగిరి రాజతనయ ఐన పార్వతి ఆ పల్కులను శ్రద్ధగా విని ప్రణమిల్లి సత్కరించింది.

**శివ పార్వతులు దేవతలతో కలిసి కైలాసానికేగుట**

మునులారా! పర్వత రాజైన హిమగిరీంద్రుని రాజధానీ నగర మైన ఓషధీప్రస్థపురంలో, పార్వతీ పరమేశ్వరుల పాణిగ్రహణ యజ్ఞోత్సవం ఐదు రోజులు జరిగిన తదుపరి, పర్వత రాజు అభ్యర్థన మేరకు మరికొన్ని రోజులు విందులతో వినోదాలతో గడిపి..... విష్ణ్వాది దేవతలు నూతన వధూవరులతో కలిసి కైలాసానికి తరలి వెళ్ళటానికి ఆలోచనలు చేశారు. సప్తర్షులు హిమవంతుని సమీపించి "ఓ పర్వతరాజా! నీ కుమార్తె ఐన పార్వతి యొక్క యాత్రకు ఈ రోజు మిక్కిలి అనుకూలంగా ఉంది. కావలసిన ఏర్పాట్లు చెయ్యి" - అని చెప్పగా ఆయన కూతురు ఎడబాటును సహింప లేక రోదించాడు. రోదించి భార్యయైన మేనకకు వార్తను పంపాడు. ఆమె వెంటనే వచ్చి భర్త దుఃఖంలో పాలు పంచుకొని... పార్వతిని అత్తవారింటికి పంపటానికి తగిన ఏర్పాట్లను ప్రారంభించింది. రాచ మర్యాద ననుసరించి పార్వతిని పన్నెండు రకాల ఆభరణాలతో అలంకరించింది. సర్వాభరణ భూషితయైన కులదేవతా స్వరూపంగా వెలిగి పోతూన్న ఆమెను చూచి, సజల నేత్రాలతో దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చి గుండెలకు హత్తుకొని బావురుమంది. తల్లి మాట కాదని తపస్సిద్ధిగా శంకరుని పొందిన ఉమాదేవి కూడా ఎడబాటు సహింప లేక గుండె దిటవు కోల్పోయి బొట బొట కన్నీరు కార్చింది. గిరి సార్వభౌముడు కూడా ఆమెను గుండెలకు హత్తుకొని "తల్లిగా! ఈ యింటిని అంధకార బంధురం చేసి, సర్వాన్ని శూన్యం చేసి ఎక్కడకు వెడుతున్నావు?" - అంటూ కుప్పకూలి పోయాడు.

అక్కడి వారంతా ఆ దృశ్యాన్ని చూచి రోదించారు. అందరూ నిశ్చేష్టితులై నిలబడిన ఆ ఘట్టం చిత్తరువులా తోచింది. ఆ సమయంలో జ్ఞానియైన వసిష్ఠ మహర్షి కలుగ జేసుకొని. "ఓ గిరిసార్వభౌమా! ఇలాటి శుభ తరుణంలో శోకించటం తగదు. అన్య *కుటుంబంలోని కన్యలను నువ్వు తెచ్చుకోలేదూ... వధువులుగా? సంతోషంగా సాగనంపు"* – అని సాంత్వన వచనాలను పల్కి కొంత అధ్యాత్మ విద్యా ప్రసంగాన్ని చేశాడు. ఇంతలో బ్రాహ్మణ పురోహితులు యాత్రా సుముహూర్తం సమీపించిందని చెప్పగా, త్రిలోక పావని ఐన పార్వతిని ... మహారాణికి తగిన ఉపచారాలతో అన్యజన దుర్లభమైన బహుమానాలతో, పరిమళ ద్రవ్యాలతో, సరిగంచు మేలి జలతారు పట్టు వస్త్రాలతో, అలంకరణ సామగ్రితో, మంగళ ద్రవ్యాలతో... ఇంకా అనేక శోభన వస్తువులతో ముత్తైదువ లంతా పల్లకీలో కూర్చుండ పెట్టి కర్పూర నీరాజనమిచ్చి ఆశీర్వదించారు. పెండ్లి వద్దని భీష్మించుక కూర్చున్న సత్య పురుషుడు, ఆది దేవుడైన ఈశ్వరుడు వృషభ వాహనారూఢుడై కైలాసానికి కదిలాడు. దేవతలందరు అనుసరించారు. కన్నులు చాలనంత కళ్యాణ వైభవంతో సాగింది... శివపార్వతుల కైలాస యాత్ర. దేవతలు దారి పొడవునా పుష్పవృష్టి కురిపించారు.

అందరూ కైలాసాన్ని చేరుకొన్నారు. అప్పటికే రుద్ర గణాలన్నీ భోజన పదార్థాలను సిద్ధం చేశారు. పితామహ, నారాయణుడాదిగా గీర్వాణులందరు భోజనాలు చేసి కొద్ది సేపు విశ్రమించి, శివపార్వతులను స్తుతించి, వారి వద్ద అనుజ్ఞను పొంది తమతమ నెలవులకు చేరుకొన్నారు.

మునులారా! ఇంత వరకు మంగళకరము, శోకహరము, ఆనంద దాయకము, ధన వర్ధనము, అకాల మృత్యుహరణము... ఐన పార్వతీ పరమేశ్వరుల కళ్యాణ గాథను చెప్పాను. ఎవరైతే దీనిని శ్రద్ధా భక్తులతో పఠిస్తారో, శ్రవణం చేస్తారో వారు నిస్సందేహంగా శివ సాయుజ్యాన్ని పొందుతారు... అని చెప్పి ముగించారు సూత మహర్షి.

**శివ మహా పురాణంలో రుద్ర సంహితలో**

**పార్వతీ ఖండంలో ఏబది ఐదవ అధ్యాయం ముగిసింది.**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## రుద్ర సంహిత - కుమార ఖండం



**శ్లో॥ వందే వందన తుష్ట మానసమతి, ప్రేమ ప్రియం ప్రేమదం**
**పూర్ణం పూర్ణకరం ప్రపూర్ణ నిఖిలైశ్వర్యైక వాసం శివమ్**
**సత్యం సత్యమయం త్రిసత్యవిభవం సత్యప్రియం సత్యదం**
**విష్ణు బ్రహ్మనుతం స్వకీయ కృపయోపాత్తాకృతిం శంకరమ్ ॥**

**తా॥** నమస్కారముచే సంతసించే మనస్సు గలవాడు. ప్రేమను కలిగి సర్వులకు ప్రియమైన వాడు, ప్రేమను పంచి ఇచ్చువాడు, పూర్ణుడు, పూర్ణునిగా చేయువాడు సర్వ పూర్ణైశ్వర్యములకు ఏకైక నిధానమైన వాడు, మంగళ స్వరూపుడు, సత్తాఘనుడు, సత్యస్వరూపుడు, త్రికాలముల యందు బాధింప బడని వైభవము గలవాడు, సత్యమునందు ప్రేమగల వాడు. సత్యమగు మోక్షము నిచ్చువాడు, విష్ణు, బ్రహ్మలచే స్తుతింపబడు వాడు, స్వీయ కృపచే ఆకృతిని స్వీకరించిన వాడు.... అగు శివునికి నమస్కరిస్తున్నాను.

**శివ విహారం**

సూతుడు మునులతో తదనంతర గాథను ఇలా చెపుతున్నాడు. “ఓ! మునులారా! అనఘము, పరమాద్భుతము, పాప సంతాప హరణము, సర్వ విఘ్న వినాశకరము, మంగళ ప్రదము, శ్రుతి మనోహరము, సుఖదము, కర్మమూల విచ్ఛేదకము ఐన కుమార స్వామి గాథను చెపుతున్నాను. శ్రద్ధతో వినండి.

పాణిగ్రహణానంతరం పరమేశ్వరుడు పార్వతితో కూడి కైలాసానికి వచ్చి మహా దివ్యము, మనోహరము ఐన ఒక నిర్జన స్థానానికేగి.... భోగ వస్తు సమన్వితమైన శయ్యా మందిరంలో చందనదారు నిర్మితమైన శయ్యను అలంకరింపజేసి వేయి దివ్య సంవత్సరాలు పరమానందాన్ని అనుభవించాడు. కేవలం దుర్గాదేవి స్పర్శమాత్రం చేతనే శివుడు మూర్ఛాగతుడయ్యాడు. కేవలం శివ స్పర్శచే దుర్గాదేవి మూర్ఛాగతురాలైంది.

అపుడు దేవత లందరు మేరుగిరి సమీప ప్రాంతాన సమావేశమై.... "యోగి శ్రేష్ఠుడు, నిర్వికారుడు, ఆత్మారాముడు ఐన శంకరుడు మన కొరకు వివాహం చేసికొన్నా; ఆయన కింత వరకు కుమారోదయం కాక పోటానికి కారణ మేమై ఉంటుంది?"–అని ఆలోచన చేశారు. పార్వతీ పరమేశ్వరులిద్దరు పారవశ్యంలో మూర్ఛాగతులైనారన్న విషయాన్ని నారదుని ద్వారా తెలుసుకొని విధాతతో కూడి విష్ణువు వద్ద కేగి విషయాన్ని విన్న వించి ఉపాయాన్ని చెప్పమని కోరారు. దానికి నారాయణుడిలా అన్నాడు.

"ఓ! బృందారకులారా! చింతిల్లకండి. మనకు శుభాలు ప్రాప్తిస్తాయి. ఆది దంపతులు విహారాన్ని విరమించటానికి సమయం ఇంకా ఆసన్నం కాలేదు. వారి విహారానికి మనం విఘ్నం కల్పించ కూడదు. అలా భంగాన్ని కల్పించిన వానికి జన్మ జన్మల యందు భార్యా వియోగం కలుగుతుంది. పూర్వం ఇంద్రుడు రంభతో విహరిస్తూండగా విఘ్నాన్ని కల్పించి దుర్వాస మహర్షి భార్యా వియోగాన్ని పొందాడు. కాముడు ఘృతాచితో కూడి ఉండగా అడ్డు పడిన బృహస్పతికి ఆరు మాసాలలోపులో చంద్రుని వలన భార్యావియోగం సిద్ధించింది. మోహినీ చంద్రుల విహారానికి విఘాతాన్ని కల్పించిన గౌతమ మహర్షికి భార్యా వియోగం తటస్థించింది. హరిశ్చంద్రుడు రైతు దంపతులకు వియోగాన్ని కల్పించిన కారణంగా సర్వస్వాన్ని కోల్పోయాడు.

గీర్వాణులారా! ఆది దంపతులు మరొక వేయి సంవత్సరాలు అలా ఏకాంతంలో ఉంటారు. గడువు పూర్తి కాగానే అక్కడకు వెళ్లి... ఆ శివ తేజస్సును భూమి ధరించేటట్లు చెయ్యండి. ఆ తేజస్సునుండి ప్రభువు యొక్క కుమారుడైన స్కంధుడు జన్మించ గలడు. ప్రస్తుతానికి మీరు మీ నివాసాలకు వెళ్ళండి." వాసుదేవుని ఉపదేశాన్ని పాటించారు అమరులు.

శక్తి – శివుల లీలా విహార రూపమైన లాస్య – తాండవాలను భరించ లేక భూమి ఆది కూర్మ, ఆది శేషువులతో సహా కంపించింది. కూర్మ భారానికి కూర్మ వాయువు స్తంభించింది. లోకాలన్నీ తల్లడిల్లాయి. అప్పుడు దేవత లందరు విష్ణువును చేరి ముల్లోకాల లోను ప్రాణ వాయువు స్తభించిందని మొర పెట్టుకోగా... నారాయణుడు వారందరితో కూడి కైలాసానికి కదిలాడు. శివ మందిరంలో శివపార్వతులు లేరు. శివ గణాలను విచారించాడు హరి. వారి ద్వారా విషయాలను తెలుసుకొని శివ సన్నిధానానికేగి... "మహాదేవా! తారకాసుర పీడితులైన అమరులు నిన్ను శరణుకోరి వచ్చి ఉన్నారు! ద్వారం వద్ద వేచి యున్నారు!" – అని ఆర్తితో రోదించాడు. దేవతలతో కూడి స్తుతించాడు.

**కూమార స్వామి జననం**

యోగ జ్ఞాన విశారదుడు, మహా దేవుడు ఐన శంకరుడు సురల ఆర్తనాదాన్ని విని తన ఆనంద వ్యాపారాన్ని ముగించ గోరియూ; దుర్గా దేవికి భయపడిన వాడై కామ వ్యాపారాన్ని ముగించకుండానే దేవతలకు దర్శన మిచ్చే నిమిత్తం ద్వార దేశం వద్దకు వచ్చి నిల్చున్నాడు. విధి – మాధవులతో కూడి సర్వదేవతలు శివునకు ప్రణమిల్లి, అనేక విధాల స్తుతించి, ఆయనను సంతుష్టాంత రంగుణ్ణి చేసి; తారకాసురాది రాక్షస సంహారానికి ఉపక్రమించ వలసిందని విన్నపం చేశారు.

వారి విన్నపాన్ని విన్న శంకరుడు...... దేవతలు చేసిన తొందరపాటు పనికి విషణ్ణుడై.... వికల మనస్కుడై ఇలా అన్నాడు. "ఓ! నారాయణా! ఓ బ్రహ్మా! ఓ దేవతలారా! నేను ఆకార్యమందే నిమగ్నుడనై ఉన్నాను! నా తపస్సు ఫలించే సమయానికి మీరు విఘ్నాన్ని కలిగించారు. మంచి చెడ్డలకు మనస్సే సాక్షి! జరగ వలసింది జరిగి తీరుతుంది! దానిని అడ్డుకోగల వారెవ్వరు? సరే! జరిగిందేదో జరిగింది. ప్రస్తుత కర్తవ్యాన్ని చెప్పండి. ఇప్పుడు నా శిరస్సునుండి జారి పడుతున్న తేజస్సును (వీర్యాన్ని) గ్రహింప గల సమర్థులెవరు? గ్రహింపగల సమర్థుడు గ్రహించును గాక!" శివుని మాటలను విన్న బృందారకులు అగ్నిని ప్రేరేపించగా; అగ్ని ఆ శివ తేజస్సును కపోత (పావురం) రూపంలో ముక్కుతో గ్రహించాడు.

ఇంతలో శక్తి స్వరూపిణి ఐన దుర్గ ..... శివుని రాక ఆలస్యం ఐన కారణంగా అక్కడకు వచ్చి; దేవతలను చూచి మహా క్రోధంతో మండిపడి వారి నుద్దేశించి ఇలా పలికింది. "ఓరీ! దేవతా గణములారా! మీరందరు పరమ దుర్మార్గులు! స్వార్థపరులు! మీ స్వార్థాన్ని సాధించుకొనటం కొరకు ఇతరులను బలిపెట్టి వారికి దుఃఖాన్ని కలిగిస్తారు. మీ స్వార్థం కోసం పరమేశ్వరుని ఆరాధించి నా 'విహారానికి భంగం కలిగించారు. నేనిప్పుడు వంధ్య (గొడ్రాలు) నయ్యాను. నాతో విరోధించిన వారికి సుఖం లభించదు." ఇంకా ఇలా శపించింది. "ఈనాటి నుండి దేవతల భార్యలు వంధ్యలు అగుదురు గాక! నా విరోధులైన వారందరు దేవతలతో సహా దుఃఖితులగుదురు గాక! ఆపై ఆమె అగ్నిని చూచి "ఓ అగ్నీ! నువ్వు శివతత్త్వాన్ని ఎరుగని మూర్ఖుడవు కనుక శివ వీర్యాన్ని గ్రహించావు. ఇది ఉచిత కార్యం కాదు! నువ్వు నిత్య దుఃఖితుడవై సర్వ భక్షకుడవగుదువు గాక!" – ఇలా దేవతలను శపించి శివునితో కూడి గృహంలోకి వెళ్ళిపోయింది పార్వతీదేవి.

ఓ మునులారా! ఆ తరువాత ఆ దేవి గణేశుడనే మరొక పుత్రునకు జన్మనిచ్చింది. ఆ వృత్తాంతాన్ని ముందు చెప్తాను. ఇప్పుడు గుహుడైన కుమార స్వామి వృత్తాంతాన్ని

వినండి. దేవతలు అగ్ని ముఖులు గదా. అగ్ని భుజించిన దానినే దేవతలు భుజిస్తారు. ఇది వేద వాక్కు. శివ వీర్యాన్ని అగ్ని భుజించిన కారణంగా దేవతలందరు గర్భాన్ని ధరించారు. పార్వతీదేవి శాపం వల్ల దుఃఖితులయ్యారు. శివ తేజస్సు లోపల నుంచి దహించి వేస్తోంది. భరించలేక శివుని శరణు జొచ్చారు. అంత దయామయుడైన గౌరీశుడు "నా తేజస్సును వెంటనే వమనం చెయ్యండి! మీకు స్వస్థత కలుగుతుంది" అని పల్కగా వారలా చేసి సుఖాన్ని పొందారు. ఆ తేజస్సు భూమిపై పడి స్వర్ణ కాంతులతో పర్వతాకారంగా అంతరిక్షాన్ని తాకింది. కాని అగ్నికి మాత్రం దుఃఖం తొలగలేదు. శంకరుని ప్రార్థించగా ఆయనిలా అన్నాడు.

"ఓ! అగ్నీ! నా తేజస్సును పానం చేసి అధికమైన పాపం చేశావు! నీ కొక ఉపాయాన్ని చెపుతున్నాను విను. దానిని యోగ్యమైన స్త్రీ యందు నిక్షేపించు. నీకు స్వస్థత కలుగుతుంది." శంభుని పలుకులకు అగ్ని చేతులు జోడించి "శంకరా! అలాటి స్త్రీ ముల్లోకాల లోను 'శక్తి' తక్క మరొకరు లేరు!" అని ప్రార్థించగా శంకర ప్రేరితుడైన నారద మహర్షి అగ్నికి ఉపకారాన్ని చేయ గోరి ఇలా అన్నాడు: "ఓ! వీతిహోత్రా! ఈ శివ తేజస్సును మాఘ మాసంలో తెల్లవారు జామున నదీ స్నానం చేసే స్త్రీల యందుంచు. "నీ తాపం పోతుంది!" దానికి సరేనని వైశ్వానరుడు అన్వేషణలో పడ్డాడు. అదే సమయంలో సప్తర్షుల భార్యలు ఆకాశగంగలో మాఘ స్నానానికై ; ఉదయమే లేచి మంచి నియమాలతో నదీ తీరానికి వచ్చి స్నానం ముగించారు. స్నానానంతరం చలిచేత పీడింపబడి వారిలో ఆరుగురు వహ్ని జ్వాలా సమీపానికి వెళ్ళబోగా వివేకవతి ఐన అరుంధతి వారించింది. శివమాయా మోహితులైన వారు హఠంతో శుక్రుని (అగ్ని) సమీపానికేగి చలికాచుకోగా... శివ తేజస్సు వెంటనే రోమకూపాల ద్వారా వారి దేహంలో ప్రవేశించింది. తక్షణం పావకునికి తాపం శాంతించగా... ఋషి పత్నులు గర్భవతులై తాప పీడిత లయ్యారు. అనలుడు చేసిన పనికి అరుంధతి దుఃఖించింది.

గర్భవతులై గృహానికి వచ్చిన వారిని చూచి మహర్షులు క్రోధాన్ని, దుఃఖాన్ని పొంది తమ భార్యలను పరిత్యజించారు. ఆ ఆర్గురు ఋషి పత్నులు తమకు పాతివ్రత్య లోపం సంభవించిందని శోకించి గర్భంలో ఉన్న శివ తేజస్సును హిమవత్పర్వతంపై విడిచి పెట్టి తాపశాంతిని పొందారు. హిమవంతుడు దానిని సహింప లేక వణికి పోయి వెంటనే గంగలోకి పడవేశాడు. జాహ్నవి దానిని భరింప అసమర్థురాలై, తన తరంగ హస్తాలతో

రెల్లు గడ్డి యందు భద్రంగా ఉంచింది. వెంటనే ఆ తేజస్సు... సుందరుడు, సౌభాగ్యవంతుడు, శోభాయుక్తుడు, ప్రీతి వర్ధనుడు ఐన బాలకునిగా మారింది. మార్గ శీర్ష మాసంలో శుక్ల పక్షంలో షష్ఠి నాడుఈ భూమండలం మీద శివ తేజోద్భవుడైన కుమారుడు అవతరించాడు. అదే సమయంలో కైలాసంలో పార్వతీ పరమేశ్వరులు అనిర్వచనీయము, అఖండము, అద్భుతము, అనంతము, అద్వయము ఐన సుఖప్రాప్తిని పొందారు. జగన్మాత మాతృభావనను పొందగా పాలిండ్లు పాల చేపున గిలిగింతలయ్యాయి. ఆ బాలకునిపై బృందారకులు పుష్పవృష్టిని కురిపించారు.

**కార్తికేయుని లీలలు**

ఆ సమయంలో అస్త్రవిద్యా పారంగతుడైన విశ్వామిత్రుడు విధిచోదితుడై అక్కడకు వచ్చాడు, తేజశ్శాలి ఐన శివ కుమారుని అలౌకిక ప్రకాశాన్ని చూచి ఆశ్చర్యంతో నమస్కరించాడు. వెంటనే ఆ బాలుడు "ఓ మహాజ్ఞానీ! ఈశ్వరాజ్ఞచే నువ్విక్కడకు వచ్చావు! తండ్రీ! నాకు వేద విహితమైన సంస్కారాన్ని యథావిధిగా చెయ్యి. ఈనాటి నుండి నువ్వు నాకు పురోహితుడవై లోక పూజ్యుడవౌతావు!" – అని కోరేడు. దానికి గాధేయుడు ఆశ్యర్యచకితుడై "ఓ కుమారా! నేను బ్రాహ్మణుడను కాను, క్షత్రియుడను. విశ్వామిత్ర నామధేయుడను. విప్ర సేవకుడను. నీ చరిత్ర కూడా చెప్పు." – అని కోరగా కుమారుడు తన వృత్తాంతాన్ని చెప్పి.... ఇంకా ఇలా అన్నాడు.

"ఓ! గాధేయా! నా వరంచే నువ్వు బ్రహర్షివయ్యావు. వసిష్ఠాది మునులు నిన్ను ఆదరంతో ప్రశంసిస్తారు. నా ఆజ్ఞను పాటించి నాకు సంస్కారం చెయ్యి. ఈ విషయాన్ని గోప్యంగా ఉంచు. "విశ్వామిత్రుడు అమితానందంతో ఆ బాలునికి వేదోక్త సంస్కారాన్ని నెరవేర్చగా, శివ కుమారు డాయనకు దివ్యజ్ఞానాన్ని గురుదక్షిణగా ప్రసాదించాడు. తరువాత హవ్య వాహనుడు అచటికి వచ్చి ఆ బాలుని ' పుత్రా!' అని ఆలింగన పురస్సరంగా ముద్దాడి శక్తి అనే ఆయుధాన్ని సమంత్రకంగా ఇచ్చాడు. గుహుడు ఆ శక్తి చేత పర్వతాన్నెక్కి శిఖరాన్ని కొట్టగా అది నేలకూలింది. అదే సమయంలో అనేక మంది రాక్షసులు సంహరించటానికి రాగా వారందరిని నేలకూల్చాడు బాలుడు. ఆ శక్తి ప్రహారానికి ముల్లోకాలు కంపింపగా ఇంద్రుడు సక్రోధుడై వచ్చి బాలుని కుడి పార్శ్వం మీద వజ్రంతో కొట్టగా మహాబలశాలి ఐన శాఖుడు అనే పురుషుడు ఉద్భవించాడు. తిరిగి ఆగ్రహంతో ఎడమ పార్శ్వం మీద తాడించగా విశాఖుడు అనే బలశాలి పుట్టాడు. రోష మానసుడై బాలుని హృదయంపై ప్రహరించగా నైగముడు అనే వీరుడు జన్మించాడు.

వెంటనే స్కందునితో కూడి ఆ నలుగురు ఇంద్రుని సంహరించటానికి ఉద్యుక్తులు కాగా ఇంద్రుడు శరణు కోరి భయంతో తన లోకానికి ఉరుకులు పరుగులతో వెళ్ళాడు. అతనికి ఆ నలుగురు బాలకులలోను ఇసుమంత కూడా భేదం తెలియలేదు. బాలుడు మాత్రం నిర్భయంగా అచటనే నిలబడి ఉండగా ఆ సమయంలో కృత్తికలనే ఆరుగురు స్త్రీలు స్నానం కొరకై వచ్చి బాలుని చూచి ముచ్చటపడి ఎవరికి వారే తమ బాలునిగా పెంచుకొనాలని ఉవ్విళ్ళూరారు. ఈ విషయంలో వారి మధ్య వివాదం చెలరేగింది. కుమారుడు...తగవులాడు కొంటున్న తల్లులను చూచి తన మనసులో ఇలా అనుకొన్నాడు: "స్త్రీ మాతృమూర్తి కావటంతో తన జన్మసాఫల్యం చెందిందని మురిసి పోతుంది. బిడ్డను సాకటం ఎంత కష్టమో తెలిసిన వీరు; తమ గర్భాన జన్మించక పోయినా నన్ను తమ కుమారునిగా పెంచుకోవటానికి తగవులాడు కొంటున్నారంటె...ఓహో! తల్లి ప్రేమ ఇట్టిది గదా!" ఇలా తలపోసి స్కందుడు వారి మాతృప్రేమకు ముగ్ధుడై ఉత్సాహభంగం కలిగించటానికి ఇష్టంలేక ఆరు ముఖాలను పొంది వారందరి స్తన్యాన్ని గ్రోలగా అమితానందాన్నీ పొంది బాలుని ఆంతర్యాన్ని గుర్తెరిగి తమ లోకానికి తీసికొని వెళ్ళారు కృత్తికలు.

సూర్యాధిక తేజశ్శాలి ఐన కుమారుని తమ స్తన్యాన్నిచ్చి పెంచారు. బాలుడు క్షణం కనిపించకపోతే తల్లడిల్లి పోయేవారు. శ్రేష్ఠమైన వస్త్రాలను, ఆభరణాలను, రుచ్యములైన పదార్థాలను ఇచ్చి అల్లారుముద్దుగా పెంచారు. ఆ తల్లులకు ప్రాణాధిక ప్రేమాస్పదుడయ్యాడు... బాలుడు. తరువాత ఒక నాడు ఆ బాలుడు దేవసభకు వెళ్ళి తన లీలలను ప్రదర్శించగా హరిబ్రహ్మేంద్రాది దేవతలు దిగ్భ్రమచెంది కుమారుని వివరాలడిగారు. స్కందుడు సమాధానం చెప్పకుండ తన లోకానికి వెళ్ళి పోయాడు.

### కార్తికేయుని కొరకు అన్వేషణ

ఇలా ఉండగా కైలాసంలో పార్వతి ఒక రోజున శివుని సమీపించి "నాథా! విపులతపస్సుచే మిమ్ములను భర్తగా పొందాను కాని.... ఆనాటి లీలా విహారాన్ని దేవతలు భంగ పరచిన కారణంగా మీ తేజస్సును ధరించే అదృష్టం లేక పోయింది! ఆ తేజస్సు ఏమైంది? ఏ దేవత ధరించింది? శిశు రూపాన్ని ధరించిందా? శిశువెక్కడ?" – ఇలా అనేక ప్రశ్నలను కుతూహలంతో అడిగింది.

వెంటనే ఈశ్వరుడు సకల దేవతలను ఆహ్వానించి పార్వతి ప్రశ్నలను వారి ముందుంచాడు. బ్రహ్మ మొదలుగా, భూమి, అగ్ని, పర్వతము, గంగ, వాయువు, సూర్యుడు,

చంద్రుడు, జలము, సంధ్య, రాత్రి, అహస్సు.... వీటి అధిదేవతలందరు వారికి తెలిసిన సత్యాన్ని వెల్లడించారు. కాల పురుషుని ద్వారా.... కుమారుడు కృత్తికాభిమాన దేవతలచే పెంచబడుతున్నాడనే విషయాన్ని తెలుసుకొన్న పార్వతీ పరమేశ్వరులు సంతోషించారు. శివుడు తన గణాలను కార్తి కేయుని కైలాసానికి తీసికొని రావలసిందిగా ఆజ్ఞాపించగా... వారంతా వెతికి కృత్తికల ఇంటిని చుట్టు ముట్టారు.

ఘోరాకృతులు, వికృత రూపులు ఐన ఆ రుద్ర గణాలను చూచి భయ విహ్వాలులైన కృత్తికలు కార్తికేయుని కౌగిలించు కొని రక్షించమని మొరపెట్టు కొన్నారు. అంత ఆ కుమారుడు శక్త్యాయుధాన్ని ధరించి "తల్లులారా! భయపడకండి! నేను దుర్నివారుడను! నన్నెవరూ ఆపలేరు!" – అని ఓదార్చి గణాల ముందు నిల్చున్నాడు. ఇంతలో నంది ముందుకు వచ్చి కార్తికేయుని ముందు కూర్చొని కృత్తికలతోను, కుమారునితోను జరిగిన వృత్తాంతాన్ని సవిస్తరంగా చెప్పి "కుమారా! ఆ కారణంగా నువ్వు శివతేజోద్భవుడవు! దేవకార్యం కొరకు జన్మించి కృత్తికలచే పెంచబడుతున్నావు. శివుడు నిన్ను కైలాసానికి తోడ్కొని రమ్మని ఆజ్ఞాపించాడు. అక్కడ దేవతలందరు నీకు తమతమ ఆయుధాలనిస్తారు. త్రిమూర్తులు నిన్ను ముప్పైమూడు కోట్ల దేవతా సమూహానికి సర్వసైన్యాధ్యక్షునిగా అభిషేకిస్తారు.

లయకారుడైన రుద్రుని కుమారుడవు నీవు! నిన్ను సంరక్షించే సామర్థ్యం ఈ కృత్తికలకు లేదు! ఎండిన చెట్టు తన మ్రాను తొఱ్ఱలో అగ్నిని సంరక్షించ నేరదు గదా! గోతిలో ఉన్న మదపుటేనుగు ప్రకాశించ గలదా? కుమారా! ఆకాశం వలె నువ్వు సర్వ వ్యాపకుడవు! జ్ఞానులు కర్మలను ఆచరిస్తూ ఉన్నప్పటికి కర్మఫలంతో సంగము పొందని తీరున నీకు కూడా సంసార లేపం లేదు. నీ యదార్థ తత్త్వాన్ని తెలుసుకోలేని అజ్ఞానులు సరస్సులో కప్పలు వంటి వారు. పద్మాలు, కప్పలు ఒకే సరస్సులో ఉంటాయి కాని కప్పలు పద్మ సౌరభాన్ని ఆస్వాదించ లేవు గదా!" – అని కర్తవ్యాన్ని గుర్తు చేశాడు.

నందీశ్వరుని సమయోచిత మైన వాక్కులకు సంతసించి " ఓ సోదరా! నాకు సర్వము తెలుసు. శివుని ఆశ్రయించిన నీవు ధన్యుడవు. ఈ కృత్తికలు ప్రకృతి యొక్క అంశలు. జ్ఞానం గల యోగినులు. వీరి స్తన్యం చేత, వీరి నిరంతర సేవ చేత పెరిగి పెద్ద వాడ నయ్యాను. ఈ స్త్రీలు నా వంశానికి చెందిన వారు. నేను వీరి పెంపుడు కొడుకును పెంచిన ప్రేమ గొప్పది కదా! పార్వతితో నాకు బంధుత్వం లేదు. ఆమె నాకు ధర్మసిద్ధమైన తల్లి. నువ్వు నాకు శంభుని పుత్రునితో సమానం. నేను నీతో కైలాసానికి వస్తాను." అని

ఉచితమైన వాక్కులను పల్కి కృత్తికల అనుమతిని పొంది రుద్ర గణాలతో కూడి కైలాసానికి బయలు దేరాడు షణ్ముఖుడు.

**కుమారాభిషేకం**

ఇంతలో అక్కడ అద్భుతము, నిత్యశోభనము ఐన నూరు చక్రాల రథం సిద్ధంగా ఉంది. విశ్వకర్మ నిర్మితమైన ఆ రథాన్ని పార్వతి పంపించింది. శోక వ్యాకుల చిత్తంతో కార్తికేయుడు రథాధి రోహణం చేయ బోతుండగా జుట్టు విరబోసుకొని కృత్తికలు అతణ్ణి సమీపించి ఇలా పలవించారు. "ఓ! దయా సముద్రా! నిర్దయతో మమ్మెలను విడిచి ఎక్కడికి వెడుతున్నావు? నిన్ను మేం ప్రేమతో పెంచాం! నువ్వు మా కుమారుడవు! పెంచిన తల్లులను విడిచి వెళ్ళటం కుమారునికి ధర్మం కాదు." ఇలా పలవించి గుండెలకు హత్తుకొని వియోగాన్ని తట్టుకోలేక మూర్ఛపోయారు. శర జన్ముడు వారికి ఆధ్యాత్మ వచనాలను బోధించి, వారితో పాటు రథారోహణం చేసి కైలాసానికి చేరుకొన్నాడు.

దేవతా గణాలు శివునికి కుమారాగమానాన్ని గూర్చి తెలియజేశారు. శివాజ్ఞచే మేడలను అలంకరించి, రాజమార్గాన్ని తోరణాలతో ముగ్గులతో తీర్చిదిద్దారు. హరి బ్రహ్మేంద్రాదులు స్కందునికి ప్రదక్షిణ నమస్కారం చేసి స్తుతించారు. ఇంతలో శివపార్వతులు ఉత్సవ పురస్సరంగా వచ్చారు. దూరాన్నుండి వారిని దర్శించిన విశాఖుడు ఎదురేగి శిరస్సు వంచి ప్రణామాలాచరించాడు. పరమేశ్వరుడు కుమారుని కౌగిలించుకొని శిరసుపై ముద్దు పెట్టుకొన్నాడు. జగజ్జనని ఐన పార్వతి బాలుని ఒళ్ళంతా నిమిరి ఆనంద బాష్పాలు చెక్కిళ్ళపై జార పరవశించి పోయింది. తక్కిన వారంతా జయ, జయ ధ్వానాలను చేశారు. నాగభూషణుడైన శంకరుడు కార్తికేయుని తొడపై కూర్చుండ పెట్టుకొని కౌగిలించుకొని పుత్రగాత్ర పరిష్వంగ సుఖాన్ని పొందాడు. పాములతో కొద్దిసేపు వినోదించాడు కుమారుడు. ఆపై అందరు శివ మందిరానికి చేరారు.

దేవతలందరు షణ్ముఖుని రత్నసింహాసనా సీనుని చేశారు. వంద రత్న ఘటలలో నింపిన సర్వతీర్థ జలాలతో వేదమంత్ర పురస్సరంగా ముదంతో అభిషేకించారు బ్రహ్మర్షులు. ఆ మహోత్సవ వేళ కుమారునికి.......

రత్న మకుటాన్ని, అంగదాలను, వైజయంతీ మాలను, మరియు చక్రాన్ని వినయంగా సమర్పించాడు విష్ణువు.

శూలాన్ని, పినాకమనే ధనుస్సును, పరశువును, శక్తిని, పాశుపతాన్ని మరియు పరమ విద్యను పరమానందంతో ఇచ్చాడు శంకరుడు.

యజ్ఞసూత్రాన్ని, వేదాలను, గాయత్రిని, కమండలాన్ని మరియు బ్రహ్మాస్త్రాన్ని భక్తితో బహూకరించాడు బ్రహ్మ.

ఇంద్రుడు ఐరావతాన్ని, వజ్రాయుధాన్ని, వరుణుడు శ్వేత ఛ్ఛత్రాన్ని, రత్నమాలను, సూర్యుడు మనోవేగ తుల్యమైన రథాన్ని కవచాన్ని, యముడు యమ దండాన్ని, చంద్రుడు అమృత కలశాన్ని, నిర్ఋతి శస్త్రాన్ని, అగ్ని శక్తిని, వాయువు వాయువ్యాస్త్రాన్ని, కుబేరుడు గదను, కామదేవుడు కామాస్త్రాన్ని, గదను, తన విద్యలను... ఇలా దిక్పాలకులు, దేవతలు వారివారి అస్త్రాలను విద్యలను, సమంత్రకంగా ప్రయోగోప సంహారాలతో ధార పోశారు. క్షీర సముద్రుడు అమూల్య రత్నాలను, హిమవంతుడు అలంకారాలను వస్త్రాలను ఓషధులను, గరుడుడు చిత్ర బర్హణుడు అనే పేరుగల తన పుత్రుని, అరుణుడు పాదములే ఆయుధంగా గల బలశాలి ఐన తామ్ర చూడుడనే పేరుగల వానిని ప్రీతి పూర్వకంగా ఇచ్చారు.

పార్వతి పరమైశ్వర్యాన్ని, చిరంజీవిత్వాన్ని మహదానంతో ఇచ్చింది.

లక్ష్మి దివ్య సంపదను, రమణీయ రత్నహారాన్ని అభిమానంతో ఇచ్చింది.

సరస్వతి వీణను, జ్ఞానాన్ని, సంతోషంతో ఇచ్చింది.

అక్కడికి వచ్చిన బృందారకు లందరు తమతమ శక్తి, సామర్థ్యాలను కుమారునికి ధారపోసి యథాశక్తి బహూకృతుల నందించారు. పరమేశ్వరుడు సంప్రీతుడై త్రిదశుల నుద్దేశించి "మీ మనో వాంఛితాన్ని నెరవేరుస్తాను. ఎరుక చెయ్యండి!" – అని కోరగా.... "ఓ ప్రభూ! నీ కుమారుని చేతిలో తారకాసురుడు సంహరింప బడగలడు! ఈ ఉత్తమ చరిత్ర అందుకే సంఘటిల్లింది. తారకాసుర సంహారానికి సన్నద్ధులమై ఈ రోజే దండు నడిపిస్తాం. కుమారునికి అనుజ్ఞ ఇయ్యండి." – అని ప్రార్థించారు. శంకరుడు 'సరే' అని కుమారుని ఆశీర్వదించి దేవతలకు అప్పగించాడు.

దేవతలంతా కుమార స్వామిని ముందు పెట్టుకొని కైలాసం నుండి కదిలారు. శివాజ్ఞచే విశ్వకర్మ, పర్వత సమీపంలో సుందర నగరాన్ని, అద్భుత మందిరాన్ని, రత్న ఖచిత సింహాసనాన్ని నిర్మించి ఇచ్చాడు. అంత హరి దేవతలచే సర్వతీర్థ జలాలతో కుమారస్వామికి మంగళాభిషేకం చేయించి, రత్నసింహాసనాసీనుని చేసి, తిలకం దిద్ది, బ్రహ్మాండాధిపత్యాన్ని ఇచ్చాడు.

**యుద్ధారంభం**

ఆ విధంగా కుమారస్వామిని ముందుపెట్టుకొని తారకాసుర సంహార నిమ్మిత్తం గీర్వాణులంతా మహోత్సాహంతో సింహనాదం చేస్తూ జైత్రయాత్రా సంరంభంతో కదిలారు. ఆ వార్త విన్న తారకుడు....భాను ప్రతాపానికి భయపడి దాక్కున్న చీకట్ల వలె మాటున ఉన్న దేవతలకు ఇంత ధైర్యం ఎలా వచ్చిందా అని ఆశ్చర్యపడి.... కుమారుని వృత్తాంతాన్ని తెలుసుకొని...... ఇంతకాలానికి తన కరవాలానికి పదును పెట్టే అవకాశం వచ్చింది కదా అని ఉప్పొంగి పోయాడు. వెంటనే సైన్యాధక్షులకు కబురు పెట్టి సైన్యాన్ని యుద్ధానికి సిద్ధం చెయ్యమన్నాడు. ఇసుక వేస్తే రాలనంత అసురగణం ఆయుధాలతో సర్వ సన్నద్ధమై నిలిచారు. యుద్ద వాయిద్యాల మ్రోతలకు దిక్కులు పిక్కటిల్ల, కఠిన అట్టహాస సంరంభ రావాలకు నిలింపులు కంపమొంద, చండ ప్రతాపుడై భండన భూమికి బయలు దేరాడు....తారకాసురుడు. అతని సైన్యంలో దుశ్శకునాలు తోచాయి. అనిమిషులకు శుభ శకునాలు తోచాయి. ఆకాశవాణి దేవతలనుద్దేశించి కుమారుని సేనాపతిత్వంలో దేవతలకు జయమగు గాక! అని భావి శుభాన్ని చెప్పింది.

ఉభయ సైన్యాలు భూమి, సముద్రాల సంగమ స్థానం వద్దకు వచ్చి చేరారు. వారి అరుపులకు, కేకలకు, ధనుష్టంకారాల మ్రోతలకు సాగర ఘోష అణిగి పోయింది. కార్తికేయుడు నానారత్న సమన్వితమైన విమానాన్ని అదిష్ఠించగా దేవతలతనికి ఛత్రాన్ని పట్టి చామరసేవ చేస్తున్నారు. యుద్ధ ప్రారంభ సూచకంగా కాహళ ధ్వనులు మిన్నుముట్టాయి. క్షణంలో నిశిత కరవాల కాంతులు విద్యుల్లతలుగా, భీకర గదా ప్రహారాలు ప్రావుట్కాల పయోధర గర్జనలుగా, ధనుర్వినిర్ముక్త శరపరంపర కుంభవృష్టిగా.... ఆహవరంగం ప్రళయకాలవేళా విశేష వియన్మండలంలా తోచింది. రక్తపుటేరులతో నిండిన రణరంగం సంధ్యారుణ కుంకుమ సంపన్నమైన ఆకాశంలా భీతావహంగా ఉంది. తెగిపడిన తలలతో, పగిలిన కపాలాలతో, ఉబికి వచ్చిన కనుగ్రుడ్లతో, నుజ్జునుజ్జైన మెదళ్ళతో, ఖండిత బాహువులతో, విరిగిన కాళ్ళతో, నరకబడిన మొండెములతో, ముద్ద ముద్దలుగా పడ్డ మాంస ఖండాలతో భండన భూమి మహాభీభత్సంగా ఉంది. నక్కలు విందారగించాయి. అసంఖ్యాకంగా కాకులు, గ్రద్దలు, రాబందులు యథేచ్ఛగా ఆకాశంలో విహరిస్తూంటే... ఎండ పడకుండ భండన భూమికి నల్లని గొడుగు పట్టినట్లుంది.

**దేవాసుర యుద్ధం**

గణాలన్నీ తుముల యుద్ధం చేస్తుంటే, గణనాయకులు ద్వంద్వ యుద్ధానికి తల పడ్డారు. తారకాసురుని ఇంద్రుడు నిలువరించాడు.

సంహ్రాదుని అగ్ని ఎదుర్కొన్నాడు. జంభుని యముడు డీకొన్నాడు. మహాప్రభుని నిర్రుతి మార్కొన్నాడు. సువీరుని గద్దించాడు వాయువు. చంద్రుని అదిలించాడు కుంభాసురుడు. కుబేరుని అడ్డగించాడు పవమానుడు. ఇలా దేవ దానవులు అసువుల మీద ఆసలు వీడి పరస్పర జిగీషతో కోపం రూపెత్తినట్లు పోరాడు తున్నారు.

విరించి వరబల గర్వితుడైన తారకుడు మహాక్రోధంతో మండిపడి పండ్లు పటపట కొరికి, కండ్లు కొలిమి తిత్తులై నిప్పుకణికలు రాల, కొండ చిలువల వంటి చేతులతో తాళ వృక్షోపమానమైన గదను పట్టి అమరేంద్రుని నెత్తిపై మొత్తబోగా; అది గురి తప్పి ఐరావత కుంభస్థలాన్ని నిర్భేదించింది. ఎన్నడూ మొక్కవోని ఐరావతం ఒక్క సారిగా కుప్ప కూలింది.

సంహ్రాదుని విక్రమాటోపానికి ఆగలేక జాతవేదుడు భీతితో వెన్ను చూపాడు. రణ విశ్రుతుడైన  జంభుని వీర రసావతారాన్ని తేరి చూడలేక తన గదా దండాన్ని పారవేసి యుద్ధ పరాఙ్ముఖుడయ్యాడు పరేత రాజు. బలుని కాలానల బాణ జ్వాలలకు నిలువ లేక వరుణుడు కరుణించమని ప్రార్థించి పలాయితుడయ్యాడు. రణోజ్జ్వల విక్రమ క్రియా సాంద్రుడైన పవమానుని అసమాన కోదండ పాండిత్యానికి ఆగలేక కుబేరుడు కూలేడు. ఇలా దిక్పాలకులంతా అసహాయ శూరులైన అసురుల చేతిలో పరాజితులై వీరభద్రుని వెనక్కు చేరారు. దైత్యులంతా అత్యుత్సాహంతో అట్టహాసం చేసి కోలాహల పరాయణులై గర్జించారు.

అదే సమయంలో వీరభద్రుడు ప్రమథులతో కూడి శత్రువుల పాలిటి అకాల రుద్రుడై త్రిశూలాన్ని చేపట్టి తారకాసుని ఎదుర్కొన్నాడు. పోరు ఘోరంగా సాగుతోంది. త్రిశూల, పరుశు, పట్టిస, ముసల, ముద్గర, ఖడ్గ, తోమరాలతో పరస్పరం హింసించు కొంటున్నారు. వీరభద్రుని త్రిశూల హతుడైన తారకుడు క్షణమూర్ఛితుడై లేచి కొండ గుహలాంటి నోరు తెరచి ఒక్క బొబ్బ పెట్టి శక్త్యాయుధంతో దెబ్బ కొట్టాడు. వారి మధ్య యుద్ధం చూపరులకు రోమహర్షణంగా సాగింది. విజయ లక్ష్మి ఒకసారి వీరభద్రుని వైపు మరొక సారి తారకుని వైపు దోబూచులాడుతూన్నట్లు తోచి ఉత్కంఠను కలిగించింది. ఇంతలో వాసుదేవుడు వచ్చి వీరభద్రునకు బాసటగా నిలిచేడు.

పాంచజన్యాన్ని పూరించాడు హరి. గర్భనిర్భేద్యమైన ఆ రావానికి తారకుని సైన్యం దైన్యాన్ని పొందింది. నారాయణుడు నాల్గు చేతుల తోను చక్ర, గద, ఖడ్గ, చాపాలను

ధరించి తారకుని ముందు వీర విక్రమంతో నిలిచి పోరు సాగించాడు. సింహ వాహనా రూఢుడైన తారకుడు వర గర్వితుడై పదివేల బాహువులతో పద్మనాభుని ప్రయోగా లన్నింటిని త్రిప్పి కొట్టాడు. వారిద్దరి మధ్య యుద్ధం పూర్వ పశ్చిమ దిక్కుల యందు ఉదయించే శుక్ర గ్రహంలా ఊగిస లాడుతున్నదే కాని... గెలుపు మాత్రం నిశ్చితం కావటం లేదు.

ఇక కాలహరణం చేయటం మేలు కాదని తలపోసిన బ్రహ్మగారు కుమార స్వామిని సమీపించి ఇలా ఉపదేశించాడు. "కుమారా! గుహా! విష్ణు తారకుల మధ్య ఈ యుద్ధం శోభించటం లేదు. నా వర ప్రభావంచే ఈ దుష్టుడు ఎవరి చేతిలోను చావడు.. శివ తేజోద్భవుడవైన నీ చేతిలో తక్క! నీ జన్మ కారణం అదే! పూర్వం వీడు దేవత లందరిని జయించి విష్ణువును కూడ బెదిరించాడు. కుమారా! వీడెంతటి వాడంటె..... ఫణాగ్ర మణులచే ప్రకాశించే తక్షక, వాసుకి, కర్కోటకాదులను రాజమార్గంలో దీప స్తంభాలుగా నిలపెట్టాడు. వీడి రాజధానీ నగరంలో.... ఎంత ఎండ కాస్తే పద్మాలు వికసిస్తాయో అంత మాత్రపు ఎండను మాత్రమే కాస్తాడు భానుడు. రాకా శశాంకుడు వీడికి శృంగార దీపం. ఈ దిక్పాలకులంతా దిక్కులేక ఎలా పడి ఉన్నారో చూడు! నువ్వు రక్షణగా ఉన్నావనే ధైర్యంతోనే దేవతలీ యుద్ధానికి దిగారు. లేకపోతే వచ్చి ఉండేవారు కాదు. ఇక జాగుసేత మేలు కాదు."

విరించి పల్కులకు కుమార స్వామి ప్రసన్నుడై విమానాన్ని దిగి 'అట్లే అగు గాక!' అని పల్కి, పెద్ద ఉల్కవంటి శక్త్యాయుధాన్ని ధరించి తారకునికి అభిముఖంగా మత్త వేదండాన్ని చీల్చటానికి ఉద్యుక్త మవుతున్న సింహంలా నడిచాడు. తారకుడు కూడా కుమారుని చూచి బాలుడని ఎంచి.... మంటను చూచి పండని భ్రమించి దూకబోతున్న మిడుతలా..... ఆయుధ పాణియై ఆవేశంతో వచ్చాడు. వచ్చి అక్కడున్న ఇంద్ర, ఉపేంద్రులను చూచి....దేవతా రక్షణార్థమై ఇంద్రుడు, లోక కళ్యాణార్థం విష్ణువు చూపిన అవతార విశేషాలను దోషాలుగా ఎత్తి చూపించి నిందించాడు. అలా నిందించిన కారణంగా తన పూర్వ పుణ్యాన్ని పోగొట్టు కొన్నాడు తారకుడు.

అలా నిందించిన తారకుని చూచి కోపాన్ని ఆపుకోలేక బిడౌజుడు వజ్రాయుధంతో బలంగా కొట్టాడు. ఆ వజ్ర ప్రహారానికి జర్జరీ భూత శరీరుడై తారకుడు నేలకూలి... తిరిగి క్షణంలో లేచి ఐరావతంపై ఉన్న పురందరుని శక్త్యాయుధంతో యుక్తిగా కొట్టి నేల కూల్చాడు. అంత్యకాలం సమీపించిన తారకుడు ఆ సమయంలో మహాక్రోధం కన్నుల

తాండవ మాడ దేహస్మృతి మరచి దుఃఖదము, స్వనాశ కారణము, ధర్మవిరుద్ధము ఐన అకార్యాన్ని ఆచరించాడు. ద్వాత్రింశత్ దేవతా కోటి కిరీట మణిరంజిత పాద పంకేరుహ శోభాయుక్తుడైన నిర్జర సార్వభౌముణ్ణి నిర్దాక్షిణ్యంగా వామ పాదంతో తన్ని అతని చేతి లోని వజ్రాన్ని పెరికి దానితో అతనినే క్రూరంగా ప్రహరించాడు. విష్ణువుతో కూడి అమృతాంధసు లందరు హా హా కారాలు చేశారు. అచ్యుతుడు, వీరభద్రుడు తారకునిపై పరాక్రమించారు కాని అది వ్యర్థమే ఐంది.

**తారకాసుర సంహారం**

శ్రీ హరిని దూషించటం, ఇంద్రుని కాలితో తన్నటం, ధర్మ విరుద్ధమైన ఈ రెండు అకార్యాల కారణంగా తారకుని పూర్వ పుణ్యం నిశ్శేషంగా హరింప బడగా స్కందుడు తారకుని సంహరించ టానికి సంకల్పించి యుద్ధ సన్నద్ధుడయ్యాడు. దేవతలు జయ జయ ధ్వానాలు చేసి స్తుతించారు. అప్పుడు సర్వభూత భయంకరమైన రణం సాగింది. వీరులైనవారిద్దరూ కూడా వైతాలిక, ఖేచర, పాపంత ఇత్యాది యుద్ధ గతులను ప్రదర్శిస్తూ; శక్తితో శక్తిని ప్రహరిస్తూ, నివారిస్తూ కొద్దిసేపు వీర నాట్యాన్ని చేశారు. ఆ మీద శిరస్సు, కంఠం, తొడలు, మోకాళ్ళు, నడుము, వక్షస్థలం, వీపు.... ఇత్యాది శరీర భాగాలను గురిచూచి శక్త్యాయుధంతో పరస్పరం ఛేదించుకొంటూ యుద్ధక్రీడా నైపుణ్యాన్ని చూపించారు.

వారిద్దరు వీరనాట్య విశారదులు, రణక్రీడా నిపుణులు కనుక పదాతులై అనేక చారీ కరణ, ఖండ, మండల, గతి ప్రచారములతో చూపరులకు 'ఆహా' పుట్టిస్తూ బాహు యుద్ధం చేశారు. సమపాద, స్థితావర్త, శకటాస్య, అడ్డిత, ఊరూద్వృత్త, మత్తల్లి ఇత్యాది పదహారు భౌమీచారీ విశేషాల చేతను ; అతి క్రాంత, అప క్రాంత, పార్శ్వ క్రాంత, ఊర్ధ్వ జానువు, సూచి, హరిణప్లుత, భ్రమరి ఇత్యాది పదహారు ఆకాశికీ చారీ విశేషాలచేతను రణరంగాన్ని నాట్య మందిరం చేసి ప్రేక్షకులకు కనువిందు చేశారు.

ఆపై చారుల సంయోగంచే పుట్టిన కరణాలను ప్రదరిస్తూ మండల గతి ప్రచారాన్ని నిర్వహిస్తూ బాహు యుద్ధం చేశారు. భ్రమర, ఆస్కందిత, ఆవర్త, అడ్డిత, శకటాస్య, ఇత్యాది పది భౌమీ మండలాలను; అతిక్రాంత, విచిత్ర, లలిత సంచర, దండ పాద, లలిత, క్రాంత ఇత్యాది పది ఆకాశగ మండలాలను నేర్పుతో ప్రదర్శిస్తూ యుద్ధం చేశారు.

వారుభయులు అనేక గతి ప్రచారాలను చూపించారు. ఉత్తమ, మధ్యమ, అధమ ప్రకృతి గతి భేధాలను, సమగతి, మిశ్రగతి, మధ్యమ గతి భేదాలను ప్రదర్శించారు.

రౌద్ర, బీభత్స వీర రసభేద గతులను, దేశాను సారులైన గతులను శాస్త్ర ప్రామాణ్యాన్ని, లోక ప్రామాణ్యాన్ని అనుసరించి చూపి శస్త్ర యుద్ధాన్ని, బాహు యుద్ధాన్ని కూడ చేశారు. సకల దేవతా సమూహం ఆ సమయంలో విస్మితులై రెప్ప వేయకుండ చూచారు.

అంత వరకు యుద్ధాన్ని క్రీడగా భావించి తారకునితో యుద్ధక్రీడ సలిపిన కుమార స్వామి; ఆటను కట్టిపెట్టి, తారకుని మట్టుపెట్ట తలచి శక్త్యాయుధాన్ని మహావేగంతో దూసుకొస్తున్న ఉల్కాపాతంలా ప్రయోగించాడు. ఆ విసురుకు అసురుడు అసువులు విడిచాడు.

ఈ విధంగా లోక విదారకుడైన తారకుని కుమారకుడు పరిమార్చిన వేళ.... లోక పాలకుల శోక ముడిగింది. దిక్పాలకుల దేహ స్వాస్థ్యం సమకూరింది. వేలుపుల వెతలు తీరాయి. వేల్పు వెలదుల చెఱలు వీడాయి. పన్నగుల విన్న బాటు తొలగింది, కిన్నరుల బన్నాలు తప్పాయి. అప్సరసలు ఆపదలు గడవగా అలంకరణపై శ్రద్ధ చూపారు. విద్యాధరులు సద్యోజాత హర్షంతో కేరింత లాడారు. గంధర్వుల బంధాలూడాయి. గుహ్యకులు బాహ్య సంచారులయ్యారు. యక్షులకు అధిక్షేపాలు తప్పాయి. పితరుల భీతి సద్దు మణిగింది. వసువులకు అసువులు నిలిచాయి. రుద్రులకు ఉపద్రవం తప్పింది. తాపసులకు ఆపదలు కుందాయి.

**బాణప్రలంబాసురుల వధ**

ఇంతలో క్రౌంచుడనే పర్వత రాజు కుమారుని శరణు జొచ్చి ఇలా ప్రార్థించాడు. "కుమారా! గుహా! దయానిధీ! నీతో ఆహవంలో ఓహటిల్లిన బాణాసురుడు పదివేల సైన్యంతో వచ్చి నన్ను పీడిస్తున్నాడు. వాణ్ణి కూడా సంహరించి నాకు స్వస్థతను కలిగించు." వెంటనే భక్త పాలకుడైన స్కందుడు మనసులో శివ పార్వతులను స్మరించి బాణాసురునిపై శక్త్యాయుధాన్ని ప్రయోగించగా అది వానిని, వాని సేనను త్రుటిలో పరిమార్చి షణ్ముఖుని వద్దకు వచ్చి చేరింది. క్రౌంచుడు హర్షంతో గృహాన్ని చేరుకొన్నాడు.

కుమారుడు శంకరుని ఆనందం కొరకు ఆ స్థలంలో ప్రతిజ్ఞేశ్వర, కపాలేశ్వర, కుమారేశ్వర నామాలతో మూడు లింగాలను స్థాపించాడు. అంతే కాక జయస్తంభ సమీపంలో స్తంభేశ్వర లింగాన్ని కూడా ప్రతిష్టించాడు. విష్ణువు మొదలుగా దేవత లందరు ఈశ్వర లింగాలను స్థాపించారు.

అదే సమయంలో శేషుని కుమారుడైన కుముదుడు రణరంగం నుండి పారిపోయి వచ్చి తనను బాధిస్తూన్న ప్రలంబాసురుని గూర్చి కుమారునితో విన్నవించగా వాణ్ణి కూడా శక్త్యాయుధంతో నేల కూల్చాడు స్కందుడు.

ఓ మునులారా! ఈ కుమార విజయ గాథ పరమ పవిత్రమైనది. ఇది సర్వ పాపహరము, సర్వకామదము, భుక్తి ముక్తి ప్రదము. సకల తాపహరము.

**కార్తికేయ స్తుతి** అంత విష్ణు బ్రహ్మేంద్రాది దేవతలంతా కుమార స్వామినిలా స్తుతించారు.

**శ్లో ॥ నమః కళ్యాణ రూపాయ నమస్తే విశ్వమంగళ ।**
**విశ్వబంధో నమస్తేఽస్తు నమస్తే విశ్వభావన ॥**
**నమోఽస్తుతే దానవ వర్య హంత్రే బాణాసుర ప్రాణహరాయ దేవ ।**
**ప్రలంబ నాశాయ పవిత్ర రూపిణే నమో నమశ్శంకర తాత తుభ్యమ్ ॥**
**త్వమేవ కర్తా జగతాంచ భర్తా త్వమేవ హర్తా శుచిజ ప్రసీద ।**
**ప్రపంచ భూతస్తవ లోక బింబః ప్రసీద శంభాత్మజ దీన బంధో ॥**

**తా ॥** కళ్యాణ స్వరూపుడు, జగత్తునకు మంగళముల నిచ్చు వాడు, విశ్వమునకు బంధువు, విశ్వమును సంకల్పించి సృష్టించువాడు అగు నీకు నమస్కారం. ఓ దేవా! రాక్షస శ్రేష్ఠుడైన తారకుని, బాణాసురుని సంహరించిన నీకు నమస్కారం, ఓ శంకరపుత్రా! ప్రలంబుని సంహరించిన పవిత్ర స్వరూపుడవగు నీకు అనేక నమస్కారాలు. ఓ అగ్నిపుత్రా! జగత్తుల సృష్టి స్థితిలయములకు నీవే కర్తవు. ప్రసన్నుడవు కమ్ము! నీవు ప్రపంచ రూపుడవై విస్తరించగా ప్రాణులన్నియు బింబ రూపుడవైన నీకు ప్రతిబింబములైనవి.

ఆ విజయోత్సవ సభలో కుమారస్వామి దేవతలకు వరాలిచ్చి పర్వత రాజులతో ఇలా అన్నాడు. “మీరందరు కర్మిష్ఠులచే, జ్ఞానులచే, తపశ్శాలురచే సేవింప తగిన వారు కాగలరు. వారందరు మీ ఆశ్రయాన్ని పొందుతారు. మీరు పవిత్రాత్ములు. మీరందరు నా వర ప్రభావంచే లింగాకారాన్ని పొందుతారు. నా మాతామహుడైన ఈ హిమవంతుడు సర్వోత్తముడై తపశ్శాలురకు ఫలములను ఇచ్చు వాడు కాగలడు.”

పిమ్మట వారంతా మహదానందంతో కైలాసానికి వెళ్ళారు. కుమారుడు భక్తితో పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించగా; వారు స్కందుని పరమ ప్రీతితో ఆలింగనం చేసుకొన్నారు. అమరులంతా ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరుల నిలా స్తుతించారు.

**శ్లో ॥ దేవదేవ మహాదేవ భక్తానా మభయ ప్రద ।**
**నమో నమస్తే బహుశః కృపాకర మహేశ్వర ॥**
**అద్భుతా తే మహాదేవ మహాలీలా సుఖప్రదా ।**
**సర్వేషాం శంకర సతాం దీన బంధో మహాప్రభో ॥**
**ఏవం మూఢధియశ్చాజ్ఞాః పూజాయాం తే సనాతనమ్ ।**
**ఆవాహనం నజానీమో గతింనైవ ప్రభోఽ_ద్భుతామ్ ॥**
**గంగాసలిల ధారాయ హ్యాధారాయ గుణాత్మనే ।**
**నమస్తే త్రిదశేశాయ శంకరాయ నమో నమః ॥**

**తా ॥** దేవదేవా! మహాదేవా! భక్తులకు అభయమునిచ్చు వాడా! నీకు అనేక నమస్కారాలు. కృపానిధీ! మహేశ్వరా! మహాదేవా! నీ గొప్ప లీల అద్భుతమైనది! సత్పురుషు లందరికి సుఖమును కలిగించునది. దీనబంధో! సనాతనుడవైన నీ విషయంలో నీ పూజ విషయంలో మేము అజ్ఞానులమై ఉన్నాం. ఓ ప్రభూ! నిన్ను ఆవాహన చేయుట గాని నీ అద్భుత లీలగాని మాకు తెలియదు. గంగనిచ్చిన వాడు, జగత్తుకు ఆధారమైన వాడు, త్రిగుణ స్వరూపుడు, దేవతలకు ప్రభువు, శుభములను కలిగించు వాడు అగు నీకు అనేక నమస్కారాలు.

**శ్లో ॥ వృషాంకాయ  మహేశాయ గణానాం పతయే నమః ।**
**సర్వేశ్వరాయ దేవాయ త్రిలోక పతయే నమః ॥**
**సంహర్త్రే జగతాం నాథ సర్వేషాంతే నమో నమః ॥**
**భర్త్రే కర్త్రేచ దేవేశ త్రిగుణేశాయ శాశ్వతే ॥**
**విసంగాయ పరేశాయ శివాయ పరమాత్మనే ।**
**నిష్ప్రపంచాయ శుద్ధాయ పరమాయావ్యయాయ చ ॥**
**దండ హస్తాయ కాలాయ పాశ హస్తాయ తే నమః ।**
**వేదమంత్ర ప్రధానాయ శత జిహ్వాయ తే నమః ॥**

**తా ॥** వృషభ ధ్వజుడు, మహేశ్వరుడు, గణములకు ప్రభువు, సర్వేశ్వరుడు, ముల్లోకములకు ప్రభువు అగు మహాదేవునకు నమస్కారం. ఓ నాథా! త్రిగుణ స్వరూపుడవై లోకము లన్నింటిని సృష్టించి, పాలించి, పోషించి, సంహరించు నీకు నమస్కారం. నీవు శాశ్వతుడవు. సంగము లేని వాడు, పరమేశ్వరుడు, మంగళ కరుడు, పరమాత్మ,

ప్రపంచాతీతుడు, శుద్ధుడు, సర్వకారణుడు, నాశము లేనివాడు, చేతియందు దండమును ధరించు మృత్యు స్వరూపుడు, పాశమును ధరించువాడు, వేద మంత్రములచే ప్రతిపాదింపబడు వాడు, నూరు జిహ్వాలు గలవాడు అగు నీకు నమస్కారం.

**శ్లో ॥ భూతం భవ్యం భవిష్యచ్చ స్థావరం జంగమంచ యత్ ।**
**తవదేహోత్సముత్పన్నం సర్వథా పరమేశ్వర ॥**
**పాహి నస్సర్వదా స్వామిన్ ప్రసీద భగవన్ ప్రభో ।**
**వయంతే శరణాపన్నా స్సర్వథా పరమేశ్వర ॥**
**శితికంఠాయ రుద్రాయ స్వాహాకారాయ తే నమః ।**
**అరూపాయ సరూపాయ విశ్వరూపాయతే నమ ః ॥**
**శివాయ నీలకంఠాయ చితా భస్మాంగ ధారిణే ।**
**నిత్యం నీల శిఖండాయ శ్రీ కంఠాయ నమో నమః ॥**

**తా ॥** ఓ పరమేశ్వరా! భూత, భవిష్య, వర్తమాన కాలాల్లో స్థావర జంగమాదులన్నీ నీ దేహ జనితములే. స్వామీ! మమ్ములను ఎల్లవేళలా రక్షించు. భగవాన్! ప్రభూ! ప్రసన్నుడవు కమ్ము! పరమేశ్వరా! మేము నిన్ను అన్ని విధములుగా శరణు పొంది ఉన్నాము. తెల్లని కంఠము గలవాడు, స్వాహాకార స్వరూపుడు, రూపం లేని వాడైనా రూపాన్ని స్వీకరించి అన్నిరూపములు తానే ఐన రుద్రునకు నమస్కారం. నీలకంఠుడు, చితాభస్మాంగ ధారి, నల్లని కేశములు గలవాడు అగు శివునకు అనేక నమస్కారాలు.

**శ్లో ॥ సర్వ ప్రణత దేహాయ సంయమి ప్రణతాయచ ।**
**మహాదేవాయ శర్వాయ సర్వార్చిత పదాయచ ॥**
**త్వం బ్రహ్మ సర్వదేవానాం రుద్రాణాం నీలలోహితః ।**
**ఆత్మాచ సర్వభూతానాం సాంఖ్యైః పురుష ఉచ్యతే ॥**
**పర్వతానాం సుమేరుస్త్వం నక్షత్రాణాంచ చంద్రమాః ।**
**ఋషీణాంచ వశిష్ఠస్త్వం దేవానాం వాసవస్తథా ॥**
**ఓంకార స్సర్వవేదానాం త్రాతా భవ మహేశ్వర ।**
**త్వంచ లోకహితార్థాయ భూతాని పరిషించసి ॥**

**తా ॥** అందరిచే నమస్కరింపబడు రూపముగలవాడు, యోగులచే ఉపాసింప బడువాడు, లయ కాలములో ప్రాణులను సంహరించువాడు, అందరిచే పూజింప బడే

పాదములు కలవాడు అగు మహాదేవునకు నమస్కారం. నీవు దేవతలలో బ్రహ్మవు. రుద్రులలో కంఠము నందు నీల వర్ణముగల శివుడవు. సర్వప్రాణులలోను ఆత్మవు నీవే. సాంఖ్యులు నిన్ను పురుషుడని వర్ణింతురు. పర్వతములలో మేరువు నీవే. నక్షత్రములలో చంద్రుడు నీవే, ఋషులలో వశిష్ఠుడవు నీవే మరియు దేవతలలో ఇంద్రుడవు నీవే. వేదములన్నింటిలో ఓంకారము నీవే. నువ్వు లోకహితాన్ని కోరి ప్రాణులకు రసమును, పుష్టిని ఇచ్చి రక్షిస్తున్నావు. ఓ మహేశ్వరా! రక్షించు.

**శ్లో ॥ మహేశ్వర మహాభాగ శుభాశుభ నిరీక్షక ।**
**ఆప్యాయాస్మాన్ హి దేవేశ కర్తృన్ వై వచనం తవ ॥**
**రూపకోటి సహస్రేషు రూపకోటి శతేషుచ ।**
**అంతం గంతుంన శక్తాస్మ దేవదేవ నమోஉస్తుతే ॥**

**తా ॥** మహేశ్వరా! మహాత్మా! ప్రాణుల పుణ్యపాపములకు సాక్షివి నీవే! నీ వచనాన్ని పాలించే మమ్ము ఆనందింప చేయి. కోట్లాది రూపాలలో నిన్ను దర్శిస్తున్నాం. కాని నీ విభూతుల అంతాన్ని తెలుసుకోలేక పోయాం.

ఇలా స్తుతించి ఈశ్వరుని అనుజ్ఞను పొంది కుమార స్వామి లీలలను గానం చేసికొంటూ స్వస్థానాలను చేరుకొన్నారు దేవతలు."

**గణేశుని పుట్టుక**

సూత మహర్షి మునులతో ఇలా అంటున్నాడు. మునులారా ఇప్పుడు మీకు పరమ మంగళ ప్రదమైన గణేశుని జన్మవృత్తాంతాన్ని చెపుతున్నాను. శ్రద్ధతో వినండి. స్వభావం చేత (తత్త్వంలో) నిర్గుణులు నిరాకారులు ఐన పార్వతీ పరమేశ్వరుల నుండి ప్రథమ రజస్సు (సృష్టికి కారణభూత మైన తొలి అణువులు) పుట్టి, సృష్టి ఆవిర్భావం జరిగిన నాటి కథా వృత్తాంతమే ఈ గణేశుని ఆవిర్భావ గాథ. ఇది వేద రహస్యం. దీనినే లోకంలో 'నలుగు పిండి కథ' గా చెప్పుకొంటారు. ఈ నలుగు పిండిని వేదం 'పరో రజస్సు' అని చెప్పి ఆ రజస్సే గణేశునిగా అంటే భౌతిక సృష్టిగా రూపుదిద్దుకొందని చెపుతోంది. సృష్టి భౌతిక రూపం గణేశుని ఆకారంలో ఉంటుంది. కర్మ మార్గంలో ఉన్నవారు ఉపాసన అలాగే చేస్తారు. గణపతిని ఆరాధించే వారిని గాణాపత్యులు అంటారు.

పరమేశ్వరుడు పార్వతిని పరిణయ మాడిన కొంత కాలానికి గణపతి జన్మించాడు. ఒక రోజున జయ, విజయ.... అనే చెలికత్తెలు పార్వతితో చదరంగ మాడుతూ ఆమెకిలా

బోధించారు. "చెలీ! మన సౌధంలో ఉన్న సేవకు లందరు శివుని ఆజ్ఞను పాలించే రుద్ర గణాలే, మనం ద్వారం వద్ద మన ఆజ్ఞను పాటించే మన వాడుండటం అవసరం," కాత్యాయనికి ఆ మాటలు హితవుగానే తోచాయి. ఒక రోజున జగన్మాత అభ్యంగన స్నానం చేస్తుండగా సదాశివుడు ద్వారపాలకుడైన నందిని గద్దించి, మందిర ప్రవేశం చేసాడు. ఆ రోజు జరిగిన అనుభవంతో చెలికత్తెలు చెప్పిన హితవును ఆచరణలో పెట్టటానికి సంకల్పించింది దుర్గ.

వెంటనే తన శరీరం నుండి రాలిన రజస్సుతో.... సర్వ లక్షణ సంయుతుడు, సర్వావయవ సుందరుడు, సర్వశోభాఢ్యుడు, మహాబలపరాక్రమ సంపన్నుడు ఐన ఒక పురుషుని సృష్టించింది. ఆ పురుషునకు ఆమూల్య వస్త్రాభరణాద్యలంకారాలను ఇచ్చి ఆశీర్వదించింది. ఆ పురుషుడు కర్తవ్యాన్ని ఉపదేశించమని కోరగా "పుత్రా! నా గృహాన్ని సదా రక్షిస్తూ, ద్వార పాలకుడవై ఉండు. నువ్వు నా కుమారుడవు. నువు తక్క నాకు మరి యొకడు లేడు. నా ఆజ్ఞ లేకుండా హఠాత్తుగా లోని కెవరు ప్రవేశించ రాదు." అని చెప్పి యష్టి (కఱ్ఱ) నొక దానిని ఆయుధంగా ఇచ్చింది. ఆ పురుషుడు ద్వార పాలకుడై తల్లి ఆజ్ఞను నెరవేరుస్తున్నాడు. ఒక రోజున.......

దుర్గాదేవి సఖీజనంతో కూడి జలక్రీడ లాడుతూ ఉండగా శ్రీ కంఠుడు మందిర ప్రవేశం చేయబోయాడు. గణేశుడు నిలువరించాడు. 'ఈ నూతన పురుషు డెవరా?' – అని శంకరుడు శంకా సంకలిత మానసుడై " ఓ! ద్వారపాలకా! ఇది నా స్వగృహం. ఎక్కడైనా 'స్వ' అనే దాని విషయంలో ఇతరుల అపేక్ష ఉంటుందా? నేను భవుడను. లోపల ఉన్న స్త్రీమూర్తి నా అర్ధాంగి ఐన భవాని, నేను శివుడను! ఆమె నా భార్య ఐన శివాని. వేయేల ఈ సృష్టికి కారణభూతుడ నైన సత్పురుషుడను నేనే! ఆమె నా తపశ్శక్తి ఐన సతి అడ్డుతొలగు" – అని గద్దించాడు.

గణేశుడు మాత్రం "ఇది నా తల్లి ఆజ్ఞ! అంతే! " అని శివుని లోనికి వెళ్ళనీయ లేదు. పైగా కఱ్ఱ ఎత్తాడు కొట్టటానికి.

**గణ వివాదం**

అంత శివుడు గణాలను పిల్చి "ఈ నూతన ద్వార పాలకుడు నా యింట్లోకి వెళ్ళటానికి నన్నే అడ్డగిస్తున్నాడు! ముందు వీణ్ణిక్కడ నుండి మెడ పట్టుకొని నెట్టండి అని ఆజ్ఞాపించాడు. వారు గణపతిని సమీపించి "బ్రతుకు మీద ఆశ ఉంటే తప్పుకో!" అని హెచ్చరించారు. ఐనా గణపతి కదల లేదు. వారు తీవ్రంగా బెదిరించగా వారందరిని బెత్తంతో మొత్తాడు. ప్రమథులు శివుని వద్దకు పరుగెత్తారు.

"యుద్ధం చేసైనా సరే వాడిని తరిమి వెయ్యండి" అని శ్రీ కంఠుడు ఆజ్ఞాపించగా వారంతా యుద్ధానికి సన్నద్ధమై నిలిచారు. ముందుగా నందీశ్వరుడు వచ్చి గణపతి కాలు పట్టి లాగేడు. భృంగి రెండవ కాలు పట్టుకొన్నాడు. గణపతి కాళ్ళతోనే తన్నగా వారిద్దరు బంతుల్లా ఎగిరి దూరాన పడ్డారు. మిగతా గణాలను కఱ్ఱతో మొత్తి చెల్లాచెదరు చేశాడు. వారందరు కృత్తివాసునితో మొర పెట్టుకొన్నారు. ఆయన బ్రహ్మను పిల్చి విషయాన్ని చెప్పి గణేశుని వద్దకు వెళ్ళి నీతి వాక్యాలను పల్కి సమస్యను సామరస్యంగా పరిష్కరించమని కోరేడు. బ్రహ్మగారు రాయబారం నడిపాడు. బ్రహ్మ మాటలను విన్న గణేశుడు నవ్వి ఇలా అన్నాడు. "శివ గణాలు శివుని ఆజ్ఞను పాటింతురు గాక! నేను మా అమ్మ మాటనే నెరవేరుస్తాను. ద్వారం దాటి గృహంలోకి అడుగు పెట్టనివ్వను. యుద్ధానికి నేను సిద్ధమే."

ఇక బ్రహ్మగారు చేసేది లేక వెనుదిరిగాడు. శివ గణాలకు గణేశునికి యుద్ధం సిద్ధమైంది. ఈ వర్తమానాన్ని విన్న పార్వతి జంట శక్తులను సృష్టించి గణేశునికి తోడుగా పంపింది. అందులో ఒక శక్తి కాటుక కొండలా ఉండి కొండగుహ వంటి నోరు తెరిచి ఎదుటి వారు ప్రయోగించిన అస్త్రాలను మ్రింగేస్తోంది. రెండవ శక్తి విద్యుత్ప్రకాశ రూపంలో వేయి బాహువులతో ఉండి చేతికి దొరికిన వారిని నల్లుల్లా నలిపేస్తోంది. దిక్కు తోచక ప్రమథ గణాలన్ని మహాదేవుని ముందు మొరపెట్టు కొన్నాయి.

**గణేశుని శిరచ్ఛేదం, పునర్జీవనం**

వెంటనే రుద్రుడు రోషంతో మండిపడి గణేశుని వద్దకు వచ్చి వాదులాడి అతనిని ఒప్పింప జాలక నిశిత త్రిశూలంతో శిరసును ఖండించాడు. ఆ వార్తను విన్న సర్వ లోకాధీశ్వరి ఐన దుర్గ అనేక భయంకర శక్తులను సృష్టించి నా కుమారుని పునర్జీవితుని చేసేవరకు మీరందరు ప్రళయాన్ని సృష్టించి, దేవతలను హింసింపమని ఆజ్ఞాపించింది. వారందరు అగ్ని శిఖల్లా చెలరేగి రుద్ర గణాలను, వారికి తోడుగా వచ్చిన దేవతలను ఎండు గడ్డిని కాల్చినట్లు కాల్చవేయ సాగారు. వారందరు దిక్కు తోచక పద్మ సంభవుని శరణు వేడగా ఆయన ఉపదేశం మేరకు దుర్గాదేవిని ఇలా స్తుతించారు.

**శ్లో ॥ జగదంబ నమస్తుభ్యం శివాయైతే నమోஉస్తుతే ।**
**చండికాయై నమస్తుభ్యం కల్యాణ్యైతే నమోஉస్తుతే ॥**
**ఆదిశక్తి స్త్వమేవాంబ సర్వసృష్టికరీ సదా ।**
**త్వమేవ పాలినీ శక్తి స్త్వమేవ ప్రలయంకరీ ॥**

**ప్రసన్నాభవ దేవేశి శాంతింకురు నమోఽస్తుతే ।**
**సర్వంహి వికలం దేవి త్రిజగత్తవ కోపతః ॥**

**తా ॥** జగన్మాతా! నీకు నమస్కారం. శివపత్నివగు నీకు వందనాలు. చండికవగు నీకు నమస్కారం. మంగళముల నిచ్చు నీకు నమస్కారం. అమ్మా! ఆది శక్తివి నీవే! సదా సర్వ సృష్టిని చేయునది నీవే! జగత్తును పాలించు శక్తివి నీవే! ప్రలయమును సృష్టించు దానవు నీవే! ఓ దేవదేవి! ప్రసన్నురాలవు కమ్ము! శాంతిని పొందుము. నీకు నమస్కారం. దేవీ! నీవు కోపించుటచే ముల్లోకములు సర్వము అల్లకల్లోలమయ్యాయి.

ఋషులందరు శక్తి స్వరూపిణి ఐన పార్వతిని ఉద్దేశించి "అమ్మా! నీ క్రోధాన్ని ఉపసంహరించు! నీ స్వామి ఇక్కడే ఉన్నాడు. ఆయనను ఒక్కసారి చూడు. మేమందరము నీ సంతానమే కదా! కన్న తల్లి తన బిడ్డలను విషప్రయోగంతో చంపటానికి పూనుకొన్నా, వేద శాస్త్ర పారంగతుడైన బ్రాహ్మణుడు శీలాన్ని త్యజించినా, ప్రజలను రక్షించాల్సిన ప్రభువు వారి ఆస్తులను దోచుకొన్నా.... వారి ముందుకు వెళ్ళి అడ్డుకోగలవారెవ్వరు? అందరి అపరాధాన్ని క్షమించు తల్లీ!"

ఋషుల ప్రార్థనకు ప్రీత మనస్కురాలైన చండిక "ఓ దేవతలారా! నా కుమారుడు పునర్జీవితుడు కావాలి. గణాధ్యక్షుడు కావాలి. ఆది పూజ్యుడు కావాలి... అప్పుడు మాత్రమే ఈ సంహారం నిలిచి పోగలదు." అని పల్కగా వారంతా శివునకు విన్నవించారు. అంత శివుడు "అట్లే అగు గాక!" అని పలికి "మీలో కొందరు ఉత్తర దిక్కుగా వెళ్ళండి. ఏ ప్రాణి ముందు కనుపిస్తే దాని శిరస్సును ఖండించి తెచ్చి గణేశుని దేహానికి అనుసంధానం చెయ్యండి." అని ఆజ్ఞాపించాడు. వారలా వెళ్ళగా ఒకే దంతం కల ఏనుగు కనుపించింది. దాని శిరస్సును ఖండించి తెచ్చి దేహానికి అతికించి, అనంతర కార్యాన్ని మీరు నిర్వర్తించవలసిందని శివుని ప్రార్థించారు. అంత విధి, మాధవులు శివాజ్ఞచే వేద మంత్రాలతో అభిమంత్రించి, 'నీ తేజస్సు దీనియందు ప్రవేశించు గాక!' అని మంత్రపూత జలాలను ఆ దేహంపై ప్రోక్షించగా ఆ బాలుడు చైతన్యాన్ని పొంది నిద్ర మేల్కొన్న వానివలె లేచాడు, అందరూ ఆనందించారు. పార్వతి హర్ష బాష్పాలు క్రమ్ము కొనగా బాలుని ముద్దాడి ఒడిలో కూర్చుండపెట్టుకొంది.

### గణేశ వ్రత మహాత్మ్యం

జగన్మాత ఐన పార్వతి ఆ కుమారుని వివిధ వస్త్రాభరణాలతో అలంకరిచింది. అనేక వరాలిచ్చి ఇలా అంది. "కుమారా! నువ్వు

పుట్టిన తోడనే పుట్టిన ఆపద తొలగింది. అందుకని నిన్ను కొలిచిన వారి ఆపదలను తొలగించగల సామర్థ్యాన్ని నీకు అనుగ్రహిస్తున్నాను. ఇపుడు నీ ముఖం సిందూరంతో అలంకరింపబడి ఉంది. కనుక నిన్ను సిందూరంతో పూజించిన మానవులకు కార్య విఘ్నాలు తొలగుతాయి." తదుపరి దేవత లందరు ఆ బాలుని శివుని వద్దకు తీసికొని వెళ్ళగా శివుడు బాలుని శిరసుపై చేయుంచి ఆశీర్వదించి " ఈ బాలుడు నారెండవ కుమారుడు! ఈ గణేశుడే నా గణాలన్నిటికి సర్వాధ్యక్షుడు. విఘ్నాలను నాశనం చేస్తాడు కనుక వినాయక నామంతో ప్రసిద్ధి పొందుతాడు " అని పుత్రప్రేమతో ఆశీర్వదించాడు.

అంత గణేశుడు తెలియక చేసిన అపరాధాన్ని మన్నించమని త్రిమూర్తులను, దేవతలను ప్రార్థించగా, వారు ప్రీతులై ఇలా ఆశీర్వదించారు. "త్రిమూర్తులమైన మేము ఎట్లు లోక పూజితుల మైనామో అదే విధంగా ఈ గణనాథుడు కూడా మా కంటే ముందుగా లోక పూజితుడగు గాక! ఈ గజాననుని ముందుగా పూజించ కుండ ఏ కార్యం తలపెట్టినా ఆ కార్యం విఘ్నమగు గాక! మావలెనే ఈతడు కూడా ప్రకృతి నుండి పుట్టిన వాడు కనుక పూజ్యుడగు గాక!.

పిమ్మట శంకరుడు ప్రీతుడై... పవిత్ర మనస్కురాలైన పార్వతి సంకల్పం నుండి ఈ గణేశుడు భాద్రపద శుక్ల చతుర్థి నాడు చంద్రోదయ కాలమందు ఆవిర్భవించాడు కనుక ఆ తిథినాడు ఎవరు ఈ గణేశుని పూజిస్తారో వారికి సకల శ్రేయస్సులు కలుగుతాయని లోకులకు వరమిచ్చాడు.

### గణేశుని బుద్ధి చాతుర్యం

స్కంద, గణపతులిద్దరు ఆట, పాటలతో తల్లి దండ్రులకు ఎంతో ఉల్లాసాన్ని కలిగిస్తూ; శుక్లపక్ష చంద్రునిలా ఎదిగి పెద్దవారై వివాహ వయస్సుకు వచ్చారు. 'నేను వివాహ మాడుతాను' అని గణేశుడు; 'కాదు నీకంటె ముందు నే పెళ్ళి చేసికొంటాను' అని షణ్ముఖుడు... ఇలా వారిలో వారు తగవులాడ జొచ్చారు. వారి మనోగతాన్ని గ్రహించిన ఆది దంపతులు ఒక రోజున వారిద్దరిని పిలిచి ఇలా అన్నారు. "ఓ కుమారులారా! మీ ఇద్దరి యందు మాకు పుత్ర వాత్సల్యం సమానమే. మీలో ఎవరైతే ఈ భూమండలాన్ని చుట్టి ముందుగా ఇచటకు చేరుకొంటారో వారికి ముందు వివాహం చెయ్యటం జరుగుతుంది."

తల్లి దండ్రులు ఏర్పాటు చేసిన నియమానుసారంగా కుమార స్వామి భూప్రదక్షిణానికి బయలు దేరాడు. గణేశుడు మాత్రం పార్వతీ పరమేశ్వరులను ఏకాసనాసీనులను జేసి

పూజించి ఏడు ప్రదక్షిణాలను చేసి ఎదుట నిలబడి చేతులు జోడించి స్తుతించి ఇలా అన్నాడు: "ఓ తల్లిదండ్రులారా! నాకిపుడు వివాహం చెయ్యండి." వెంటనే గౌరీ శంకరులు "కుమారా! స్కందుడు భూ ప్రదక్షిణానికై బయలుదేరి వెళ్ళాడు. నువ్వు కూడా వెళ్ళి చుట్టిరా! అప్పుడు మాత్రమే నీకు వివాహం." – అని హెచ్చరించారు. దానికి గణేశుడు నవ్వి "ఓ జననీ జనకులారా! నేను ఏడుసార్లు చుట్టి వచ్చాను కాదా"? అన్నాడు. దానికి వారు విస్మయంతో "ఇక్కడే ఉన్న నీకు అదెలా సాధ్యమైంది?" అని అడుగగా వినాయకుడిలా అన్నాడు.

"ఓ సర్వజ్ఞ స్వరూపులారా! పుత్రునకు తన తల్లిదండ్రుల పాద పద్మములే గొప్ప తీర్థము వారిని పూజించుటే దైవారాధన, వారి సందర్శన క్షేత్ర సందర్శన కంటె శ్రేయోదాయక మైనది. అలాగే స్త్రీకి భర్తను సేవించుటే గొప్ప మంగళకరమైన తీర్థ సేవనం. ఎవడైతే తన తల్లిదండ్రులను పూజించి ప్రదక్షిణం చేస్తాడో, వాడు తప్పక భూప్రదక్షిణ ఫలాన్ని పొందుతాడు. వేద శాస్త్రాదులు ఈ విషయాన్ని నొక్కి వక్కాణించి చెప్పాయి కదా! వేదం అసత్యం చెపుతుందా?"

బుద్ధిమంతుడైన గజాననుని పల్కులకు సంతోషించి "కుమారా! నువ్వు చేసిన కర్మ ధర్మబద్ధమైనది. సంకట స్థితిలో ఎవని బుద్ధి చురుగ్గా పని చేస్తుందో వానికి సూర్యోదయానికి చీకట్లు తొలగినట్లు ఆ సంకట స్థితి తొలగుతుంది. నువ్వు ధర్మాన్ని పూర్ణంగా పాలించావు." అని గిరిజా శంకరులు పలికి వివాహ ప్రయత్నాన్ని మొదలు పెట్టారు.

**గణేశుని వివాహం**
**స్కందుని ఆగ్రహం**

అదే సమయంలో విశ్వరూపుడనే ప్రజాపతి తన కుమార్తెలైన సిద్ధి, బుద్ధి అను వారికి వివాహ ప్రయత్నం మొదలు పెట్టాడు. ఆ విషయాన్ని తెలుసుకొన్న ఉమా శంకరులు వారితో గణేశునకు వివాహాన్ని నిశ్చయించి మహావైభవంగా జరిపించారు. కొంత కాలానికి గజాననునికి సిద్ధి యందు లోకానంద కరుడైన క్షేముడు, బుద్ధి యందు సర్వజన ప్రీతి పాత్రుడైన లాభుడు అనే కుమారులు కలిగారు. అలా కొంత కాలం గడవగా కుమారస్వామి భూప్రదక్షిణం చేసి వచ్చాడు. వస్తూన్న కార్తికేయుని కలహభోజనుడైన నారదుడు నగర బాహ్యోద్యానంలో కలుసుకొని ఇలా ఉపదేశించాడు.

"ఓ కార్తికేయా! నేను సత్యం చెవుతున్నాను... విను. ఈర్ష్యచే గాని, మోసబుద్ధిచే గాని అసత్యం చెప్పటం లేదు. లోకంలో ఏ తల్లిదండ్రులు తమ పుత్రులకు చేయని దానిని

నీ తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులు నీకు చేశారు. భూప్రదక్షిణం మిషతో నిన్ను ప్రయత్న పూర్వకంగా బయటకు పంపి గణేశునకు వివాహం చేశారు. అప్పుడే... అతనికి చక్కని ఇద్దరు కొడుకులు కూడా కలిగారు. నీ తల్లి దండ్రులు చేసిన పని నాకైతే యోగ్యంగా లేదు. తల్లి విషం పెట్టినా, తండ్రి అమ్మకానికి పెట్టినా.... ఆ బిడ్డల గతి ఏమిటి? శాంతి కాముకుడైన వాడు అలాటి తల్లి దండ్రుల ముఖాన్ని చూడకుండ దూరంగా తొలగిపోవటం మేలు! ఇది నా అభిప్రాయం! తర్వాత నీ ఇష్టం!" ఇలా చెప్పి నారదుడు తన లోకానకి వెళ్ళిపోయాడు.

కార్తికేయుడు తల్లి దండ్రుల కపట ప్రవర్తనకు కినిసి, క్రౌంచ పర్వతానికి వెళ్ళి అక్కడే బ్రహ్మచర్య దీక్షలో ఉండి పోయాడు. దర్శన మాత్రం చేతనే పాపాలను పోగొట్టే పుణ్యమూర్తి షణ్ముఖుడు. ప్రతి సంవత్సరం కార్తీక మాసంలో దేవతలు, ఋషులు, మునులు ఆయన దర్శనానికి వెడుతూ ఉంటారు. ఆ మాసంలో కృత్తికా నక్షత్రం నాడు కుమారుని దర్శనం మిక్కిలి ప్రశస్తం. కుమారుని ఎడబాటుతో కుమిలి పోయిన ఉమాదేవి శంభునితో కూడి అక్కడకు వెళ్ళింది. శంకరుడు ఇప్పటికీ మల్లికార్జునుడను పేర అక్కడ కొలువై ఉన్నాడు. కుమార స్వామి తల్లి దండ్రులను చూడ నొల్లక అక్కడికి మూడు యోజనాల దూరంలో దేవతల ప్రార్థనపై నిలిచాడు. అమావాస్యనాడు శంకరుడు, పున్నమి నాడు పార్వతి స్వయంగా వచ్చి భక్తులకు దర్శనమిస్తూ ఉంటారు.

ఈ గాథ పుణ్యాన్ని, కీర్తిని, సుఖాన్ని, ఆయుర్ధాయాన్ని జ్ఞానాన్ని, ముక్తిని ఇచ్చే పరమ పవిత్రమైన గాథ."

**శ్రీ శివ మహాపురాణంలో రుద్ర సంహితలో**

**కుమార ఖండం సమాప్తం.**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## రుద్ర సంహిత - యుద్ధ ఖండం



### త్రిపుర వర్ణనం

తదనంతర వృత్తాంతాన్ని సూతుడు, శౌనకాది ఋషులకు ఇలా చెప్పసాగేడు. "మునులారా! పూర్వం ఋషి సత్తముడైన సనత్కుమారుడు మా గురువు గారైన వ్యాస మహర్షికి చెప్పిన త్రిపురాసుర సంహార గాథను మీకు వివరిస్తున్నాను వినండి. ఇందులో లోక నీతి, తత్త్వము రెండూ ఉన్నాయి.

సత్త్వరజస్తమో గుణాలే..... త్రిగుణాలు. ఆ త్రిగుణాలే ఈ గాథలో త్రిపురములు. త్రిగుణాతీతుడైతే కాని మానవుడు ముక్తుడు కాలేడు. ఆ త్రిగుణాలను జయించే ఉపాయాన్ని చెప్పే గాథ.... ఈ త్రిపుర సంహార గాథ. సృష్టి అంతా త్రిగుణాత్మకం. త్రిగుణముల యొక్క సమస్థితి శాంతి. వాటి ప్రకోపమే లోకంలో ప్రళయం. వ్యక్తి విషయంలో ఐతే అది రోగం. త్రిగుణాలే లోకంలో సుఖదుఃఖాలకు కారణములవుతున్నాయి. సత్త్వగుణం కూడా బాధిస్తుందా అంటే.... అది కూడా ఒక విధమైన సాత్త్వికాహంకారాన్ని పెంచుతుంది. ఏ అహంకారమైనా అహంకారం...... అహంకారమే గదా! అహంకార వినాశనమే జీవన్ముక్తి కారకం. అహంకారం నశించిన నాడు పునర్జన్మకు కారణమైన బీజం నశించినట్లే. ఆత్యంతిక దుఃఖ నివృత్తి రూపము, పునర్జన్మ రాహిత్యము ఐన స్థితియే ముక్తి. అహంకారం అంటే 'నేను' అనే భావన. ఈ భావన లోకంలో దేహంతో తాదాత్మ్యాన్ని చెంది ఉంటూన్నది. అది ఉన్నంతవరకు 'నాది' అనే భావన ఉంటుంది. 'నేను' నుండి 'నాది', 'నాది' నుండి ధన సంపాదన, దాని నుండి వస్తు సంపాదన, దాని నుండి సుఖ దుఃఖాలు కలుగు తున్నాయి.

ఋషులారా! అందువల్ల 'నేను' అనే భావనను దేహం మీది నుండి 'ఆత్మ' వైపుకు మళ్ళించాలి. ఆత్మ సర్వ వ్యాపకము, పూర్ణము ఐనది కనుక ఆత్మైక్యం సిద్ధించి నప్పుడు పూర్ణత్వం సిద్ధించినట్లే. అదే ముక్తి. దీనికి నిష్కామ కర్మాచరణ ఒక్కటే ఉపాయం. దీనిని

అనుష్ఠిస్తే మనం నిత్యజీవితంలో కర్మలను ఆచరించటం వల్ల వచ్చే ప్రతిబంధకం తొలగి పోతుంది. కర్మ ప్రతిబంధకం పునర్జన్మ రూపంలో ఉంటుంది. తిరిగి జన్మించక పోవటమే ముక్తి. ఈ నిష్కామ కర్మాచరణ ద్వారా మానవుడు ఇహంలో సుఖాన్ని, పరంలో ముక్తిని పొందుతాడు! సందేహం లేదు. వేదంలో చెప్ప బడిన అట్టి పవిత్ర గాథను వినండి.

తపోధనులారా! మీకు గతంలో కుమారస్వామి తారకాసురుని సంహరించిన గాథను చెప్పాను. ఆ అసురునికి ముగ్గురు కొడుకులు. పెద్దవాడు తారకాక్షుడు. రెండవ వాని పేరు విద్యున్మాలి. మూడవ వాడు కమలాక్షుడు. ముగ్గురు సమాన బలులు. వారు జితేంద్రియులు. దృఢ చిత్తులు. మనో నిగ్రహులు. సత్యవాక్య పరాయణులు. విశేషించి దేవతా ద్రోహులు. వారు తండ్రి మరణానికి దుఃఖించి మృత్యువును జయించాలనే సంకల్పంతో సకల భోగాలను త్యజించి మేరు పర్వతం వద్దకు పోయి తీవ్ర తపశ్చర్యలో మునిగిపోయారు. వేసవి కాలంలో పంచాగ్ని మధ్యమందు, వానాకాలంలో తడుస్తూ నిలబడి వర్షంలోను, హేమంతంలో కంఠదఘ్నమైన జలాలలోను నిలబడి... ప్రాణాలను లెక్క చేయక పితామహుని ఉద్దేశించి ఉగ్రమైన తపస్సును ఆచరించారు.

కొంత కాలం కందమూలాలను భక్షించి, మరికొంత కాలం జలపానం చేసి, ఆపై వాయువును పూరించి..... పిమ్మట దానిని కూడా బంధించి, ధర్మంతో జీవిస్తూ లోకాలన్ని ఆకులపాటును పొందగా ఘోరమైన తపస్సు చేశారు..... తారక పుత్రులు. వారి తపస్సుకు మెచ్చి వారిజోద్భవుడు ప్రత్యక్షమై.... కోరిన వరాన్ని అనుగ్రహిస్తాను కోరుకొమ్మని ప్రసన్నుడై పల్కగా వారిలా ప్రార్థించారు.

"ఓ పద్మసంభవా! ఏ ప్రాణి చేత కూడ మాకు మరణం లేకుండ వరాన్ని ఇయ్యి! జరా, రోగములు మమ్ము దరిజేరకుండు గాక! నిమిషంలో మృత్యువు కబళించి వేస్తుంటే..... ఈ సిరి సంపదలు, భోగ, భాగ్యాలు, ధన కనక వస్తు వాహనాదులు..... ఇదంతా వ్యర్థమే కదా! కనుక మరణంలేని శాశ్వత జీవితాన్ని ప్రసాదించు. ముల్లోకాల లోని వారందరిని మేము మాత్రం మృత్యువుకు ఆహారంగా అప్పచెపుతాం." వారి కోరికకు విస్మితుడై విరించి శంకరుని స్మరించి ఇలా అన్నాడు.

"ఓ రాక్షసులారా! దుర్లభమైన కోరికను మీరు కోరారు. లోకంలో మరణం లేక పోవటం అసంభవం. ఏదీ...... నిత్యము, శాశ్వతము కాదు..... ఒక్క మృత్యువుకు మృత్యుడైన రుద్రుడు, విష్ణువు తక్క. వారు నిర్గుణులు. లోకానుగ్రహం నిమిత్తం వారు సగుణ రూపాన్ని

స్వీకరించారు. కావున మీ బుద్ధి చాతుర్యాన్ని ఉపయోగించి ఏయే కారణాల వలన మరణం సంభవిస్తుందో వాటినుండి రక్షణ కలిగేటట్లు వరాన్ని కోరండి. మరొక హెచ్చరిక. లోకాన్ని పీడించటం కొరకు తపస్సు చేసి వరాలను పొందినా దాని ఫలం దక్కదు."

దానికా రాక్షసులు 'సరే' అని కొద్ది సేపు ఆలోచించి ఇలా కోరారు. "కమలోద్భవా! సకల సంపత్సమృద్ధి సహితమైన మూడు నగరాలను, మూడు లోకాలలోను సంచరించే వాటిని నిర్మించి మాకు ఇయ్యి. మేము వాటిని అధిరోహించి, త్రిలోకాలలోను సంచరిస్తాం. మరొక్క నియమం. మధ్యాహ్న కాలంలో చంద్రుడు పుష్యానక్షత్ర యుక్తుడై అభిజిత్ లగ్నంలో ఉండగా ఆ మూడు నగరాలు ఒకే స్థానంలోకి వచ్చినప్పుడు; సర్వదేవతా స్వరూపుడైన శంకరుడు ఎవరి ఊహకు అందని రథాన్ని అధిరోహించినవాడై అచింత్యమైన ఒకే ఒక బాణంతో మా నగరాలను భేదించు గాక! ఆ నగరాలు ఆకాశంలో నల్లని మేఘాల మధ్య ఒక దానిపై ఒకటి ఉండి కంటికి కనుపించకుండ ఉండు గాక! ఆ మూడు పురాలు కలిసి ఒకటిగా ఉండి మేము అన్యోన్యంగా ఉండెదము గాక!".

ఇలా ప్రార్థించి తారకాక్షుడు బంగారు నగరాన్ని, కమలాక్షుడు వెండి నగరాన్ని, విద్యున్మాలి ఇనుప నగరాన్ని కోరారు. వాణీ వల్లభుడంత శివుని స్మరించి, మయుని ఆహ్వానించి, రాక్షసులు కోరినట్లుగా మూడు నగరాలను నిర్మించి ఇమ్మని ఆజ్ఞాపించి అంతర్హితు డయ్యాడు. మయుడు తన శిల్ప చాతురి నుపయోగించి..... కల్పద్రుమ సంకీర్ణము, గజ వాజి సమాకులము, దివ్య మణి స్థగిత నానా ప్రసాద విరాజితము, సూర్యమండల సంకాశము, పద్మరాగ సమాకీర్ణము, వాపీ కూప తటాక దీర్ఘికా శోభితము, నందనవన సమాన ఉద్యానవన సుశోభనము, మత్త మాతంగ తురంగ రథ శిబికాభిరలంకృతము ఐన మూడు నగరాలను నిర్మించి, అసురులకిచ్చి మయుడందులో ప్రవేశించాడు.

ఇంకా అందులో రుద్రాలయము, అగ్నిహోత్ర శాల, వేదాధ్యయన పాఠశాల, గోశాల ఇత్యాదులున్నాయి. వేద శాస్త్ర విశారదులైన విప్రులు, శ్రౌతస్మార్తకర్మల తత్త్వాన్ని తెలుసుకొన్న స్వధర్మ నిరతులైన బ్రాహ్మణులు, అగ్నిహోత్ర నిరతులైన ఆహితాగ్నులు భార్యా బిడ్డలతో అక్కడ సుఖంగా ఉంటున్నారు. వేద శాస్త్ర పురాణాలలో చెప్పబడిన ధర్మాలను ఆచరించే ప్రజలతో ఆ నగరాలు నిండి ఉన్నాయి. అచటి ప్రజలందరు శివభక్తులే ! ప్రతి ఇంట్లోను ఒక శివ మందిరం ఉంది. ప్రజలకు ఏలోటు రాకుండా ఆ పురాలను పాలిస్తున్నారు అసురులు. కాని దేవతలను మాత్రం ధిక్కరించి పీడిస్తున్నారు.

**శివస్తుతి**

ఇక అక్కడ త్రిపురాసురుల తేజస్సు ముందు వెలవెల పోయిన దేవతలు వారు పెట్టే బాధలను తట్టుకోలేక పితామహుని సమీపించి ప్రార్థించగా ఆయన శివుని శరణు వేడమని ఉపాయాన్ని చెప్పాడు. అప్పుడు ఇంద్రాది దేవతలందరు కైలాసానికేగి వృషభ ధ్వజుని ఇలా స్తుతించారు.

**శ్లో॥ నమో హిరణ్యగర్భాయ సర్వసృష్టి విధాయినే ।**
**నమస్థితికృతే తుభ్యం విష్ణవే ప్రభవిష్ణవే ॥**
**నమో హరస్వరూపాయ భూత సంహారకారిణే ।**
**నిర్గుణాయ నమస్తుభ్యం శివాయామిత తేజసే॥**
**అవస్థారహితాయాథ నిర్వికారాయ వర్చసే ।**
**మహాభూతాత్మ భూతాయ నిర్లిప్తాయ మహాత్మనే॥**
**నమస్తే భూతపతయే మహాభారసహిష్ణవే ।**
**తృష్ణాహరాయ నిర్వైరాకృతయే భూరితేజసే ॥**

**తా॥** నీవు హిరణ్య గర్భుడవై సృష్టినంతనూ చేసితివి. సర్వసమర్థుడగు విష్ణువు యొక్క రూపమును దాల్చి జగత్తును రక్షించుచున్నావు. నీకు నమస్కారము. నీవు రుద్ర స్వరూపుడవై ప్రాణులను సంహరించెదవు. కాని నీవు నిర్గుణుడు, సాటిలేని తేజస్సు గలవాడు అగు శివుడవు. నీకు నమస్కారము. అవస్థలకు అతీతుడవు, వికారరహితుడు, తేజస్స్వరూపుడు, పంచ మహాభూతముల స్వరూపములో నున్నవాడు, కర్మలేపము లేనివాడు, అఖండాత్మ స్వరూపుడు, భూతములకు ప్రభువు, బ్రహ్మాండ భారమును మోయువాడు, తృష్ణను పోగొట్టువాడు, దోషరహితమగు ఆకారము గలవాడు, మహాతేజశ్శాలి అగు శివునకు నమస్కారము.

**శ్లో॥ మహాదేవ నమస్తుభ్యం త్రిలోకీనందనాయ చ ।**
**ప్రద్యుమ్నాయానిరుద్ధాయ వాసుదేవాయ తే నమః ॥**
**సంకర్షణాయ దేవాయ నమస్తే కంసనాశినే ।**
**చాణూరమర్దినే తుభ్యం దామోదర విషాదినే ॥**
**హృషీకేశాచ్యుత విభో మృడ శంకర తే నమః ।**
**అధోక్షజ గజారాతే కామారే విషభక్షణ ॥**

**నారాయణాయ దేవాయ నారాయణ పరాయ చ ।**
**నారాయణ స్వరూపాయ నారాయణ తనూద్భవ ॥**

ఓ మహాదేవా! ముల్లోకములను ఆనందింప జేయు నీకు నమస్కారము. అతిశయించిన మహిమ గల నీకు నమస్కారము. సర్వస్వతంత్రుడవగు నీకు నమస్కారము. సర్వప్రాణులలో చైతన్యస్వరూపునిగా నివసించే నీకు నమస్కారము. నీవు భక్త జనులను ఆకర్షించు దేవుడవు. చాణూరుని మర్దించి కంసుని సంహరించిన నీకు నమస్కారము. మెడలో మాలను ధరించువాడా! విషమును భక్షించిన నీకు నమస్కారము. ఇంద్రియములను పాలించువాడా! చ్యుతిలేని వాడా! సర్వవ్యాపీ! రక్షకా! శంకరా! నీకు నమస్కారము. ఇంద్రియ గోచరము కానివాడా! గజాసురుని సంహరించిన వాడా! కాముని దహించిన వాడా! విషమును భక్షించినవాడా! నారాయణుని శరీరము నుండి పుట్టిన వాడా! నీవు నారాయణ భక్తుడవు, మరియు నారాయణ స్వరూపుడవు. అట్టి నారాయణ దేవుడవగు నీకు నమస్కారము.

**శ్లో॥ నమస్తే సర్వరూపాయ మహానరకహారిణే ।**
**పాపాపహారిణే తుభ్యం నమో వృషభ వాహన ॥**
**క్షణాది కాలరూపాయ స్వభక్త బలదాయినే ।**
**నానారూపాయారూపాయ దైత్య చక్ర విమర్ధినే ॥**
**నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయ చ ।**
**సహస్రమూర్తయే తుభ్యం సహస్రావయవాయ చ ॥**
**ధర్మ రూపాయ సత్త్వాయ నమస్సత్త్వాత్మనే హర ।**
**వేద వేద్య స్వరూపాయ నమో వేదప్రియాయ చ ॥**

ఓ వృషభవాహనా! సర్వజగత్స్వరూపుడవు, పాపములను పోగొట్టి నరకం నుండి రక్షించువాడవు అగు నీకు నమస్కారములు. క్షణము మొదలగు కాలములకు అధిష్ఠానమైనవాడు, తన భక్తులకు బలమునిచ్చువాడు, వివిధ రూపములలో ప్రకటమగు వాడు, రూపరహితుడు, రాక్షస సమూహములను నశింపజేయువాడు, వేదవేత్తలచే ఆరాధింపబడు వాడు, గోవులకు బ్రాహ్మణులకు హితమును చేయువాడు, జగత్తులోని నానారూపములలో వ్యక్తమగు వాడు, అసంఖ్యాకములగు అవయవములు గలవాడు. ధర్మస్వరూపుడు, సత్త్వ గుణస్వరూపుడు అగు నీకు నమస్కారము. ఓ హరా! నీ స్వరూపము వేదముల యందు తెలియదగును, నీకు వేదములు ప్రియమైనవి. నీకు నమస్కారము.

శ్లో॥ నమో వేదస్వరూపాయ వేదవక్త్ర నమో నమః ।
సదాచారాధ్వగమ్యాయ సదాచారాధ్వగామినే ॥
విష్టరశ్రవసే తుభ్యం సమస్సత్యమయాయ చ ।
సత్యప్రియాయ సత్యాయ సత్యగమ్యాయ తే నమః॥
నమస్తే మాయినే తుభ్యం మాయాధీశాయ వై నమః ।
బ్రహ్మగాయ నమస్తుభ్యం బ్రహ్మణే బ్రహ్మజాయ చ॥
తపసే తే నమోస్త్వీశ తపసా ఫలదాయినే ।
స్తుత్యాయ స్తుతయే నిత్యం స్తుతిసంప్రీతచేతసే ॥

వేదము నీ స్వరూపమే. నీ ముఖమే వేదము. సదాచారమనే మార్గమునందు పయనించు నీవు సదాచారమనే మార్గమునందు నడచువారిచే పొందబడెదవు. నీకు అనేక నమస్కారములు. వ్యాపకమైన కీర్తి గలవాడు, సత్యస్వరూపుడు, సత్యము ప్రియమైనవాడు, సత్యవర్తనముచే పొందదగినవాడు అగు నీకు నమస్కారము. మాయావి, మాయను వశము చేసుకున్నవాడు అగు నీకు నమస్కారము. బ్రహ్మ నుండి పుట్టిన వాడు, పరబ్రహ్మ స్వరూపుడు, బ్రహ్మజ్ఞానులు తన స్వరూపమైనవాడు అగు నీకు నమస్కారము. ఓ ఈశ్వరా! తపస్వరూపుడవగు నీవు తపస్సును చేయువారికి ఫలమునిచ్చెదవు. స్తుతిస్వరూపుడవగు నీవు నిత్యము భక్తులచే స్తుతింపబడెదవు. నీ మసస్సు భక్తుల స్తుతిచే మిక్కిలి ఆనందించును.

శ్లో॥ శ్రుత్యాచార ప్రసన్నాయ స్మృత్యాచార ప్రియాయ చ ।
చతుర్విధ స్వరూపాయ జలస్థలజరూపిణే ॥
సర్వే దేవాదయో నాథ శ్రేష్ఠత్వేన విభూతయః ।
దేవానామింద్ర రూపోఽసి గ్రహాణాం త్వం రవిర్మతః ॥
సత్యలోకోఽసి లోకానాం సరితాం ద్యుసరిద్భవాన్ ।
శ్వేతవర్ణోఽసి వర్ణానాం సరసాం మానసం సరః ॥
శైలానాం గిరిజాతాతః కామధుక్త్వం చ గోషుహ ।
క్షీరోదధిస్తు సింధూనాం ధాతూనాం హాటకో భవాన్ ॥

వేదోక్తకర్మానుష్ఠానముచే ప్రసన్నుడగువాడు, స్మృతి విహిత ధర్మమునందు ప్రీతిగలవాడు, జరాయుజ, ఉద్భిజ, అండజ, స్వేదజములను ప్రాణులే స్వరూపమైన వాడు, జలములో మరియు భూమిపై నివసించే ప్రాణులే స్వరూపముగా గలవాడు అగు నీకు

నమస్కారము. ఓ దేవా! దేవతలు మొదలగు వారందరిలో శ్రేష్ఠులు నీ విభూతులే. దేవతలలో ఇంద్రుడు నీవే. గ్రహములలో సూర్యుడు నీవే. లోకములలో సత్యలోకము నీవే. నదులలో మందాకిని నీవే. వర్ణములలో శ్వేత వర్ణము నీవే. సరస్సులలో మానస సరోవరము నీవే. పర్వతములలో హిమవంతుడవు నీవే. గోవులలో కామధేనువు నీవే. సముద్రములలో పాల సముద్రము నీవే. లోహములలో బంగారము నీవే.

**శ్లో॥ వర్ణానాం బ్రాహ్మణోఽసి త్వం నృణాం రాజాసి శంకర ।**
**ముక్తిక్షేత్రేషు కాశీ త్వం తీర్థానాం తీర్థరాడ్భవాన్॥**
**ఉపలేషు సమస్తేషు స్ఫటిక స్త్వం మహేశ్వర ।**
**కమలస్త్వం ప్రసూనేషు శైలేషు హిమవాంస్తథా ॥**
**భవాన్ వాగ్వ్యవహారేషు భార్గవస్త్వం కవిష్వపి ।**
**పక్షి ష్వేవాసి శరభస్సింహో హింస్రేషు సంమతః ॥**
**శాలగ్రామ శిలా చ త్వం శిలాసు వృషభధ్వజ ।**
**పూజ్యరూపేషు సర్వేషు నర్మదాలింగమేవ హి ॥**

వర్ణములలో బ్రాహ్మణుడవు నీవే. ఓ శంకరా! మానవులలో రాజువు నీవే. ముక్తిని ఇచ్చే పుణ్యక్షేత్రములలో కాశీ నీవే. క్షేత్రములలో ప్రయాగ క్షేత్రము నీవే. ఓ మహేశ్వరా! శిలలన్నింటిలో స్ఫటికము నీవే. పుష్పములలో కమలము నీవే. పర్వతములలో హిమవంతుడవు నీవే. లోక వ్యవహారములలో వాగ్రూపమగు వ్యవహారము నీవే. కవులలో (ద్రష్టలలో) భార్గవుడవు నీవే. పక్షులలో శరభుడవు నీవే. హింసించే మృగములలో సింహము నీవే. ఓ వృషభధ్వజా ! శిలలలో సాలగ్రామశిల నీవే. పూజింపదగిన రూపములన్నింటిలో నర్మదా లింగము నీవే.

**శ్లో॥ నందీశ్వరోసి పశుషు వృషభః పరమేశ్వర ।**
**వేదేషూపనిషద్రూపీ యజ్వనాం శీతభానుమాన్ ॥**
**ప్రతాపినాం పావకస్త్వం శైవానామాచ్యుతో భవాన్ ।**
**భారతం త్వం పూరాణానాం మకారోఽస్యక్షరేషుచ ॥**

ఓ పరమేశ్వరా! పశువులలో నందీశ్వరుడను వృషభము నీవే. వేదములలో ఉపనిషత్తులు నీ స్వరూపమే. యజ్ఞము చేయు యజమానులకు సోమరసము నీవే. తపింపజేయు వారిలో అగ్నివి నీవే. శివభక్తులలో అచ్యుతడవు నీవే. పురాణములలో భారతము నీవే. అక్షరములలో మకారము నీవే.

శ్లో॥ ప్రణవో బీజమంత్రాణాం దారుణానాం విషం భవాన్ ।
వ్యోమ వ్యాప్తి మతాం త్వం వై పరమాత్మాసి చాత్మనామ్॥
ఇంద్రియాణాం మనశ్చ త్వం దానానామభయం భవాన్ ।
పావనానాం జలం చాసి జీవనానాం తథామృతమ్ ॥
లాభానాం పుత్రలాభోఽసి వాయుర్వేగవతామసి ।
నిత్యకర్మసు సర్వేషు సంధ్యోపాస్తిర్భవాన్మతా ॥
క్రతూనామశ్వమేధోఽసి యుగానాం ప్రథమో యుగః ।
పుష్యస్త్వం సర్వధిష్ణ్యానామమావాస్యా తిథిష్వసి ॥

బీజమంత్రములలో ఓంకారము నీవే. భయంకరమగు వాటిలో విషము నీవే. వ్యాపకములలో ఆకాశము నీవే. ఆత్మలలో పరమాత్మవు నీవే. ఇంద్రియములలో మనస్సు నీవే. దానములలో అభయదానము నీవే. పవిత్రము చేయువాటిలో జలము నీవే. జీవనము నిచ్చు వాటిలో అమృతము నీవే. లాభములలో పుత్రలాభము నీవే. వేగము గలవాటిలో వాయువు నీవే. నిత్యకర్మలన్నిటి యందు సంధ్యోపాసన నీవే. క్రతువులలో అశ్వమేధము నీవే. యుగములలో సత్యయుగము నీవే. నక్షత్రములన్నింటిలో పుష్యానక్షత్రము నీవే. తిథులలో అమావాస్యవు నీవే.

శ్లో॥ సర్వర్తుషు వసంతస్త్వం సర్వపర్వసు సంక్రమః ।
కుశోఽసి తృణ జాతీనాం స్థూలవృక్షేషు వై వటః ॥
యోగేషు చ వ్యతీపాత స్సోమవల్లీ లతాసు చ ।
బుద్ధీనాం ధర్మ బుద్ధిస్త్వం కలత్రం సుహృదాం భవాన్ ॥
సాధకానాం శుచీనాం త్వం ప్రాణాయామో మహేశ్వర ।
జ్యోతిర్లింగేషు సర్వేషు భవాన్ విశ్వేశ్వరో మతః ॥
ధర్మస్త్వం సర్వ బంధూనామాశ్రమాణాం పరో భవాన్ ।
మోక్షస్త్వం సర్వవర్గేషు రుద్రాణాం నీలలోహితః ॥

ఋతువులన్నింటిలో వసంత ఋతువు నీవే. పర్వదినము లన్నింటిలో సంక్రమణము నీవే. గడ్డి జాతులన్నింటిలో దర్భ నీవే. పెద్ద వృక్షములలో మర్రి నీవే. యోగములలో వ్యతీపాత యోగము నీవే. లతలలో సోమలతవు నీవే. బుద్ధులలో ధర్మబుద్ధివి నీవే. మిత్రులలో భార్యవు నీవే. ఓ మహేశ్వరా! సత్పురుషులగు సాధకులలోని ప్రాణాయామము

నీవే. జ్యోతిర్లింగములన్నింటిలో నీవు విశ్వేశ్వరుడవని ఋషులు చెప్పెదరు. బంధువులందరిలో ధర్మమనే బంధువు నీవే. ఆశ్రమములలో సన్న్యాసాశ్రమము నీవే. పురుషార్థములన్నింటిలో మోక్షము నీవే. రుద్రులలో నీలకంఠుడు, రక్తవర్ణుడు అగు రుద్రుడు నీవే.

**శ్లో॥ ఆదిత్యానాం వాసుదేవో హనూమాన్ వానరేషు చ ।**
**యజ్ఞానాం జపయజ్ఞోఽసి రామశ్శస్త్ర భృతాం భవాన్ ॥**
**గంధర్వాణాం చిత్రరథో వసూనాం పావకో ధ్రువమ్ ।**
**మాసానామధిమాసస్త్వం వ్రతానాం త్వం చతుర్దశీ ॥**
**ఐరావతో గజేంద్రాణాం సిద్ధానాం కపిలో మతః ।**
**అనంతస్త్వం హి నాగానాం పితౄణా మర్యమా భవాన్ ॥**
**కాలః కలయతాం చ త్వం దైత్యానాం బలిరేవ చ ।**
**కిం బహూక్తేన దేవేశ సర్వం విష్టభ్యవై జగత్ ॥**
**ఏకాంశేన స్థితస్త్వం హి బహిస్థో న్వితి ఏవ చ ॥**

ఆదిత్యులలో విష్ణువు నీవే. వానరులలో హనుమంతుడవు నీవే. యజ్ఞములలో జపయజ్ఞము నీవే. శస్త్రధారులలో శ్రీరాముడవు నీవే. గంధర్వులలో చిత్రరథుడవు నీవే. వసువులలో నిశ్చయముగా అగ్నివి నీవే. మాసములలో అధిక మాసము నీవే. వ్రతములలో చతుర్దశీ వ్రతము నీవే. గొప్ప ఏనుగులలో ఐరావతము నీవే. సిద్ధులలో కపిలుడవు నీవేనని పెద్దలు చెప్పెదరు. సర్పములలో శేషుడవు నీవే. పితృదేవతలలో అర్యముడవు నీవే, గణకులలో కాలము నీవే. దైత్యులలో బలి నీవే. ఇన్ని మాటలేల? ఓ దేవదేవా! నీవు ఒకే అంశముతో జగత్తునంతనూ వ్యాపించి యున్నావు. వస్తువునకు బయట నీవు ఉన్నావు. వస్తువునందు సారరూపుడవై నీవే ఉన్నావు.

ఈ విధంగా పరిపరి విధాల స్తుతించి "ఓ మహాదేవా! తారకాసుర సంహారానికై మేము పడ్డ పాట్లు నీవెరుగనిది కాదు. వాడు పెట్టిన బాధలను మేమింకా మరిచి పోలేదు. మాప్రాణాలింకా కుదుట పడలేదు. అతికష్టం మీద వాడి పీడ విరగడైందని సంతోషిస్తుంటే వాడి కొడుకులు ముగ్గురు పులిమీద పుట్రలా వచ్చి మీద పడి హింసిస్తున్నారు. యజ్ఞభాగాలను బలాత్కారంగా లాక్కొంటున్నారు. నందన వనంలో తిష్ఠ వేసి అప్సరసలను పంప మంటున్నారు. వారి బారిన పడి ఈ అదితి సంతానం నశించిపోక ముందే నీవేదైనా ఉపాయాన్ని ఆలోచించి వాళ్ళని మట్టు పెట్టకపోతే మేం బ్రతకటం కష్టం. ముల్లు తీసి కొఱ్ఱు పెట్టుకొన్నట్లైంది మాపని. కరుణించు" అని వేడగా కరుణా సముద్రుడైన చంద్రశేఖరుడిలా అన్నాడు.

**త్రిపుర వధోపాయం**

"ఓ దేవతలారా! త్రిపురాధ్యక్షుడైన మయుడు ఇప్పుడు అధిక పుణ్యవంతుడై ఉన్నాడు. త్రిపురాసురులు, మయుడు, వారి నగరాలలోని స్త్రీ, పురుషులు వేద ధర్మాన్ని వీసమెత్తు తప్పకుండ పాటిస్తున్నారు. విశేషించి వారందరు విభూతి ధారణ, లింగ పూజ నిరంతరము చేసే శివభక్తులు, పంచాక్షరీ మంత్ర పరాయణులు. మీ కష్టాలు నాకు తెలిసినా మిత్ర ద్రోహం చెయ్యలేను కదా. బ్రహ్మ హత్య, సురాపానం, చౌర్యం మరియు వ్రత భంగం వీటికి మహర్షులు ప్రాయశ్చిత్తాన్ని చెప్పారు కాని మిత్ర ద్రోహానికి, కృతఘ్నతకు నిష్కృతి లేదు. భక్తపాలన వ్రతంగా గల నేను నా భక్తులకు ద్రోహాన్ని ఎలా తలపెట్ట గలను? మిత్ర ద్రోహాన్ని మించిన పాపం లేదు. ఐనా ఈ విషయాన్ని మీరు నారాయణునికి నివేదించండి." శంభుని ధర్మ బద్ధమైన వాక్కులకు ఎదురాడలేక గీర్వాణులు కమలాసనుని వద్దకేగి విషయాన్ని విన్నవించి ఆయనతో కలిసి హరి సన్నిధికేగి తమ గోడును చెప్పుకొన్నారు.

దేవతల మొరలాల కించిన హరి వారితో ఇలా అన్నాడు. "బృందారకులారా! శంకరుడు చెప్పింది సత్యమే. సనాతన ధర్మం ఉన్న చోట దుఃఖం ఉండదు. ధర్మ స్వరూపమే దైవం. నేను దేవతా పక్షపాతినని మీకు తెలుసు. ధర్మాచరణలో ఉన్న వానికి దైవంతో పనిలేదు. దైవం కూడా వానికి ఏ విధమైన మేలు - కీడులు తల పెట్ట లేదు. వాడు ఆచరిస్తూన్న ధర్మమే వానికి సుఖాలను ఇస్తుంది. ముందుగా త్రిపురాసురుల రాజ్యంలో సనాతన ధర్మానికి హాని కలిగించి వారిని తద్విపరీత మార్గావలంబులుగా చేస్తాను. ఇదే వారి వధోపాయం! దీనికి ప్రారంభ ఘట్టంగా వారిచేత శివపూజ మానిపిస్తాను. తరువాత కార్యం దానంతట అదే చక్కబడుతుంది. మీరు మీమీ నెలవులకు వెళ్ళండి." నారాయణుని పల్కులకు సంతసించి సుపర్వులు తమతమ స్థానాలకు చేరుకొన్నారు.

**త్రిపుర వాసుల అవైదిక మత దీక్షా స్వీకారం**

అనంతరం అచ్యుతుడు త్రిపురాసురుల ధర్మానికి విఘ్నాన్ని కలిగించే నేర్పుగల ఒక మాయా పురుషుని అతనితో పాటు నల్గురు శిష్యులను తన దేహం నుండి సృష్టించాడు. ఆ పురుషుడు ముండిత శిరస్కుడై మాసిన వస్త్రాలను ధరించి జలపాత్రను త్రాడుతో కట్టి భుజానికి వ్రేలాడ తీసుకొన్నాడు. చేతిలో మణిని ధరించి దానిని పదేపదే త్రిప్పుతున్నాడు. చేతి మణికట్టు వరకు వస్త్రాన్ని ధరించాడు. చిక్కిన ముఖంతో భయంతో నిండిన స్వరంతో ధర్మ శబ్దాన్ని పలుకుతున్నాడు. ఆ పురుషుడు హరికి నమస్కరించి నా నామాన్ని స్థానాన్ని చెప్పి నా కర్తవ్యాన్ని కూడ ఉపదేశించండి అని కోరాడు.

దానికి సమాధానంగా దామోదరుడిలా అన్నాడు: "ఓ బుద్ధిశాలీ! 'అరిహన్' అనే పేరుతో నువ్వు ప్రసిద్ధుడ వౌతువు. ఇతర నామాలున్నా అవి శుభకరాలు కావు. నేను చెప్పబోయేది శ్రద్ధతో విని ఆచరించు. వేద విరుద్ధమైనది, స్మృతి, శాస్త్ర విరుద్ధమైనది, వర్ణాశ్రమ విభాగం లేనిది, మోస బుద్ధితో కూడినది అగు శాస్త్రాన్ని పదహారు వేల శ్లోక సంఖ్య గలదానిని నిర్మించు. దైవంతో పని లేకుండ పురుష ప్రయత్నానికి మాత్రమే ప్రాధాన్యత నిచ్చే విధంగా, మానవులను భ్రష్టులను చేసే విధంగా ఆ శాస్త్రాన్ని నిర్మించు. అట్టి శక్తి, సామర్థ్యాలను దానిని ప్రచారం చేయ గల మాయోపాయాలను నేను నీకిస్తున్నాను. లోకులు నీ మాయ మాటలకు శీఘ్రంగా వశమవుతారు.'

ఆ మాయా పురుషుడు అలాగే అని అట్టి శాస్త్రాన్ని నిర్మించి పద్మనాభుని ముందు పఠించాడు. ఆ శాస్త్ర సారం ఇది: "స్వర్గ నరకాదులు లేవు. ఉంటే అవి ఇక్కడే ఉన్నాయి. మరణానంతరం పునర్జన్మ లేదు," ఆ శాస్త్రాన్నంతా వాసుదేవుడు విని ప్రశంసించి ఇలా ఆజ్ఞాపించాడు: "ఓ మాయావీ! త్రిపురాసురుల నగరాలలో ఇప్పుడు వైదిక ధర్మం, శివ పూజ ప్రబలంగా ఉంది. నీ నాస్తిక మతాన్ని అక్కడ ప్రచారం చేసి వారందరికి దీక్షల నియ్యి. త్రిపుర నాశనం కొరకు పుట్టిన వాడవు నువ్వు. ఆ తరువాత నువ్వు ఎడారి ప్రాంతానికి వెళ్ళి కలి యుగం ప్రారంభ మయ్యేటంత వరకు ఉండి కలి ప్రారంభం కాగానే నీ శిష్య, ప్రశిష్యుల ద్వారా నీ అవైదిక ధర్మాన్ని ప్రచారం చెయ్యి. నా వర ప్రభావంచే నీకు నీ నల్గురు శిష్యులకు ఏ పాపం అంటదు. మీరందరు పూజనీయులే. కనుక మీ నామధేయాల ముందు 'పూజ్య' అనే పదం ఉంటుంది. ఓ మాయావీ! నీ శిష్యులు ఋషి, యతి, కీర్యుడు, ఉపాధ్యాయుడు అనే పేర్లతో ప్రసిద్ధిని పొందుతారు. మరణానంతర గతిలేదు కనుక జీవించి ఉండగానే అన్ని సుఖాలను అనుభవించమని ప్రచారం చేసి త్రిపుర వాసులను భ్రష్టులను చెయ్యండి. వెళ్ళండి, వెంటనే మీ ప్రచారం ప్రారంభించండి."

పురుషోత్తముని మాటలను బాగా ఆకళింపు చేసికొని ఆ ఐదుగురు ముండిత శిరస్కులై, నోటికి గుడ్డ కట్టుకొని, వస్త్ర పీలికలతో చేసిన చీపురు చేతపట్టి, ప్రాణులకు హింస కలుగకుండ మెల్లమెల్లగా అడుగులు వేస్తూ.... త్రిపుర నగర సమీప బాహ్యోద్యాన ప్రాంతంలో విడిది చేసి అవైదికమత ప్రచారాన్ని ప్రారంభించారు. కాని పరమేశ్వర పద సమారాధన బద్ధ చిత్తులైన ప్రజా సమూహంలో అది వ్యాపింప లేదు. అంత ఆ యతి దుఃఖితుడై విష్ణువును స్మరింపగా; హరి నారదుని స్మరించి విషయాన్ని విపులంగా చెప్పి, యతికి సహాయంగా పంపించాడు.

వెంటనే నారదుడు నగర సమీపానికి వచ్చి యతిని కలుసుకొని అతని వద్ద ప్రజలందరు చూస్తుండగా దీక్షను తీసికొన్నాడు. దానిని చూచిన ప్రజలు ఆశ్చర్యపోయి ఆలోచనలో పడ్డారు. ఆపై నారదుడు నేరుగా త్రిపురాధిపతుల వద్దకు వెళ్ళి క్షేమసమచారాలడిగి ఇలా ఉపదేశించాడు: “ఓ తారకపుత్రులారా! మన నగరానికి ధర్మనిష్ఠుడు, సర్వవిద్యా పారంగతుడు, వేద సారాన్ని ఎరిగిన వాడు అగు యతి శ్రేష్ఠుడొకాయన తన నలుగురు శిష్యులతో వచ్చి ఉన్నాడు. నేను అనేక మంది మహానుభావులను చూచాను. అనేక ధర్మాలను విన్నాను. అవేవీ ఈ యతి చెప్పు ధర్మానికి సాటి రావు. ఇది సనాతన ధర్మమని ఇదే వేదసారమని నా మనసుకు తోస్తున్నది. నేనాయన వద్ద దీక్ష తీసికొన్నాను. రాక్షస శ్రేష్ఠులారా! మీకు దానియందు అభిరుచి ఉంటే మీరు కూడా దీక్షా స్వీకారం చెయ్యండి.”

నారదుని మాటలను విన్న ఆరాక్షస రాజులు బుద్ధి చాపల్యంచే ఆ యతిని దర్శించి మోహితులై..... “ఓయతిశ్రేష్ఠా! మాకు కూడా దీక్షనియ్యండి . ఈపై మీకు శిష్యులమై మీ ఆజ్ఞ ప్రకారం నడచుకొంటాం” – అని వేడుకొన్నారు. తన పాచిక పారినందుకు ఆ మాయావి సంతోషించి తన శాస్త్రంలో చెప్పబడిన విధానంలో త్రిపురాసురులకు దీక్షనిచ్చాడు. “రాజానుమతో ధర్మః” అనే న్యాయాన్ననుసరించి ప్రజలందరు కూడా ఆ మాయా యతి వద్ద దీక్షలను తీసికొన్నారు.

**త్రిపురాసురులు వైదిక ధర్మచ్యుతులగుట**

తరువాత ఆ మాయాయతి త్రిపురాధ్యక్షుని, త్రిపురాసురులను, ప్రజలను ఉద్దేశించి తన మతంలోని సిద్ధాంతాలను గూర్చి ఇలా ఉపదేశించాడు : “మీరంతా మంచి జ్ఞానంతో కూడిన నా వాక్యాలను వినండి. ఈ వాక్యాలు వేదసార సర్వస్వ మనతగినవి. రహస్యమైనవి. ఉత్తమోత్తమమైనవి. ఈ సంసారం అనగా సృష్టి ఉన్నదే.... ఇది అనాది. నిత్య సిద్ధమూను. దీనికి కర్త లేదు. ఇది క్రియ నుండి పుట్టినది కాదు. కర్తయే లేనప్పుడు క్రియ ఎలా ఉంటుంది? ఈ సృష్టి స్వయంగానే ప్రకటమై స్వయంగానే లీనమవుతుంది. దీనికి మరొక అపేక్ష అక్కర లేదు. దేహమే ఆత్మ. దేహం కంటె భిన్నంగా ఆత్మలేదు. ఈశ్వరుడు లేడు. గడ్డి పోచ మొదలు త్రిమూర్తుల వరకు గల నామధేయాలన్నీ దేహాన్ని ధరించిన ప్రాణుల పేర్లు మాత్రమే అవి. అంత కంటె విశిష్టత లేదు. నాకు ‘అరిహన్’ అనిపేరు. అలాగే మీ కందరకు పేర్లు ఉన్నాయి కదా! సర్వత్రా అలాగే ఉంటుంది. మన దేహాలు వాటి ఆయుర్దాయం పూర్తి కాగానే నశిస్తాయి కదా! అలాగే చీమ మొదలుగా త్రిమూర్తుల వరకు...ప్రాణుల దేహాలన్ని నశించి తీర వలసినవే! విచారణ చేస్తే సర్వ ప్రాణులకు ఆహారము, నిద్ర, భయము,

మైథునము ఈ నాలుగు సమానంగానే ఉంటాయి. ఇంతకు మించి ఎవరి దేహంలోను అధికంగా ఏమీ ఉండదు. పొందే సంతృప్తి కూడ అందరికి సమానమే!.

గాదెల నిండుగా ధాన్యం ఉన్నా ఎవరైనా పొట్ట పట్టినంతే కదా భుజించేది! పెట్టెల నిండా బట్టలున్నా కట్టుకొనే చీర మాత్రం ఒక్కటే కదా! భూమండల మంతా ఏలినా నిద్రించేది ఒక్క మంచం మీదనే కదా! హంసతూలికా తల్పంపై శయనించినా భూమిపై శయనించినా నిద్రాసుఖం ఒక్కటే కదా! మరణ భయం అందరికి సమానమే! మనుష్యులలో హెచ్చు, తగ్గులు; ఎక్కువ తక్కువలు వర్ణాధిక్యత ఎక్కడున్నాయి? చెప్పండి. విచారణ చేస్తే దేహధారు లందరు సమానమే. ఈ సత్యాన్ని తెలుసుకొని సర్వులు ప్రాణిహింసను మానండి. అహింసను మించిన పరమ ధర్మం లేదని వేదం అంటూన్నది.

భూత దయను మించిన ధర్మం లేదు. ఒక్క ప్రాణిని హింసిస్తే ముల్లోకాలను హింసించి నట్లవుతుంది. ఒక్క ప్రాణికి అభయమిచ్చి రక్షిస్తే ముల్లోకాలను రక్షించినట్లే! హింసను మించిన పాపం లేదు, దానాలెన్ని ఉన్నా అభయదానం గొప్పది. భయపడ్డ వానికి అభయం, వ్యాధిగ్రస్తునకు మందు, విద్యార్థులకు విద్య, ఆకలితో ఉన్న వానికి అన్నం..... వీటిని ఇయ్యాలి. చచ్చిన తర్వాత స్వర్గనరకాదులున్నాయనే మాట కల్ల. ఇక్కడ అనుభవించే సుఖదుఃఖాలే స్వర్గనరకాలు. కనుక మానవుడు ఏ ఉపాయం చేతనైనా ధనాన్ని సంపాదించి ఆ ధనంతో ఇక్కడే ఈ భూమి మీద లభ్యమయ్యే ప్రాసాద వాపీతటా క్రీడా కానన కేళి కౌతుక విహార భోగాలు, స్త్రీ సంభోగ వారనారీ నృత్యోత్సవ వసంతోత్సవ విలాసాలు అనుభవించాలి.

కామదేవుడే దైవం. మానవుడు కోర తగినది ధనం. నిజంగా ఉందో లేదో తెలియని స్వర్గం కోసం చేతికి చిక్కిన ధనాన్ని వ్యయం చేసి యజ్ఞ యాగాది క్రతువులు, దానధర్మాలు చేయటం వృథా! వేటకు వెడితే రేపు దొరకబోయే నెమలి కంటె ఇప్పుడు చేతిలో ఉన్న పావురం శ్రేష్ఠం కదా! లేని ఈశ్వరుని కొరకు చాంద్రాయణాది వ్రతాలు, తపస్సు చేసి శరీరాన్ని హింసించటం పాపం. ఈ దేహమే దేవాలయం. ఇందులో ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి అనే పన్నెండు ఆరాధనా స్థానాలున్నాయి. మనం చక్కగా వాటికే లోటు రాకుండా అవి కోరిన వాటిని సమర్పించి నిత్యము పూజించాలి. హాయిగా సమస్త భోగాలు అనుభవించగానే కోరికలన్నీ తీరి వాసనలు నశిస్తాయి. వాసనలు నశించగానే మోక్షం సిద్ధం.

ప్రాణి హింసతో కూడుకొన్న అగ్నిష్టోమాది యజ్ఞాలు పాప హేతువులు. పరబ్రహ్మ యొక్క స్వరూపం ఆనందమని కదా వేదం చెపుతూన్నది. ఆ ఆనందాన్ని మీరిక్కడే పొందటానికి ప్రయత్నించండి. ఇంద్రియ పటుత్వాన్ని కోల్పోయి, అనారోగ్యంతో మూలుగుతూ పడి ఉన్న ముసలితనంలో భోగాలను ఏం అనుభవిస్తారు? ఇప్పుడే హాయిగా ఇక్కడే అనుభవించండి. కనుపించే ఇంత అందాల ప్రపంచాన్ని కాదని కనుపించని ఈశ్వరుడు ఎక్కడో ఉన్నాడని అనుకోవటం ...... భ్రమ, అవివేకం, అజ్ఞానం. పునర్జన్మ ఉందనే మాట అసత్యం. పాంచభౌతిక దేహం ఇక్కడే భస్మం అవుతూంటే పునర్జన్మ దేనికి? ఆత్మ నిత్యం అనే మాట అసత్యం. వర్ణ వ్యవస్థ ననుసరించి చేసిన విభాగం కేవలం కల్పన. బ్రహ్మగారి నుండి గదా మనుష్య జాతి ఉద్భవించింది. ఒకే తండ్రికి నలుగురు పుత్రులు జన్మిస్తే వారిలో హెచ్చు తగ్గులేముంటాయి? ఇక్కడ కొందరేమంటా రంటే....... రాళ్ళు, మణులు, రత్నాలు, చెట్లు, లోహాలు. అలాగే చరణాయుధాలు (కోళ్ళు) మొదలుగా శునకాలు, ఆవులు, అశ్వాలు మదగజాలు ఒకటేమిటి సమస్తమైన సృష్టిలోను ఉత్తమ, మధ్యమ, అధమ జాతులున్నాయి కదా...... అలాగే మనుష్యుల లోను జాతి విభాగం ఉంటుంది అంటారు. వాటిలో ఉంటే ఉండవచ్చు గాక! మామతంలో లేదు."

ఈ విధంగా ఆ మాయా యతి సమస్తమైన సనాతన వైదిక ధర్మాలను వేదాన్ని త్రోసిపుచ్చి యుక్తులతో, బుద్ధి చమత్కారంతో ఖండించాడు. చివరకు పురుషుల బ్రహ్మచర్యాన్ని, స్త్రీల పాతివ్రత్యాన్ని కూడా ఖండించి విశేషించి లింగారాధనను, శివపూజను ప్రత్యేకంగా ఖండించాడు.మయా యతి యుక్తి వాదానికి మోహితులై అంతఃపుర స్త్రీలు, రాకుమారులు, పౌరులు, పురస్త్రీలు ఇలా అందరు స్వధర్మమైన సనాతన వైదిక ధర్మాన్ని విడిచి భయావహమైన పరధర్మాన్ని ఆశ్రయించగా, ఆ నగర లక్ష్మి వారిని విడిచి వెళ్ళిపోయింది. మాయాదేవి, జ్యేష్ఠాదేవి వెంటనే ప్రవేశించారు. శివ సంకల్పంతో త్రిపురాసురుల పూర్వపుణ్యం నశించగా వారి పరాక్రమం మొక్కవోయింది.

**దేవతలు శివుని స్తుతించుట**

అనంతరం దేవతలందరు కైలాసానికేగి దక్షిణా మూర్తి ఋషిగా గల రుద్ర మంత్రాన్ని ఒక కోటి జపించి పరమేశ్వరుని ఇలా స్తుతించారు.

**శ్లో॥ నమస్సర్వాత్మనే తుభ్యం శంకరాయార్తి హారిణే ।**
**రుద్రాయ నీలకంఠాయ చిద్రూపాయ ప్రచేతసే ॥**
**గతిర్నస్సర్వదా త్వం హి సర్వాపద్వినివారకః ।**

**త్వమేవ సర్వదాస్మాభిర్వేద్యో దేవారిసూదన ॥**
**త్వమాదిస్త్వమనాదిశ్చ స్వానందశ్చాక్షయః ప్రభుః ।**
**ప్రకృతేః పురుషస్యాపి సాక్షాత్స్రష్టా జగత్ప్రభుః॥**
**త్వమేవ జగతాం కర్తా భర్తా హర్తా త్వమేవ హి ।**
**బ్రహ్మో విష్ణుర్హరో భూత్వా రజస్సత్త్వతమోగుణైః ॥**

సర్వాత్మకుడు, మంగళకరుడు, కష్టములను పారద్రోలువాడు, నీలకంఠుడు, చైతన్య స్వరూపుడు, జ్ఞానఘనుడు అగు నీకు నమస్కారము. ఆపదలన్నింటినీ నివారించే నీవే మాకు సర్వకాలములలో శరణు అగుచున్నావు. దేవశత్రువులను సంహరించు వాడా! సర్వకాలములలో మాచే తెలియదగిన వాడవు నీవే. నీకు కారణము లేదు, నీవు ఆనందఘనుడవు, వినాశములేని ప్రభుడవు. ప్రకృతి పురుషులనిద్దరినీ సృష్టించిన జగదీశ్వరుడవు నీవే. నీవే సర్వకారణుడవు. రజస్సత్త్వ తమోగుణములను స్వీకరించి క్రమముగా బ్రహ్మ, విష్ణు రుద్రరూపములను దాల్చి జగత్తులను సృష్టించి పాలించి సంహరించువాడవు నీవే.

**శ్లో॥ తారకోఽసి జగత్యస్మిన్ సర్వేషామధిపోఽవ్యయః ।**
**వరదో వాఙ్మయో వాచ్యో వాచ్య వాచక వర్జితః ॥**
**యాచ్యో ముక్త్యర్థ మీశానో యోగిభిర్యోగవిత్తమైః ।**
**హృత్పుండరీకవివరే యోగినాం త్వం హి సంస్థితః ॥**
**వదంతి వేదాస్త్వాం సంతః పరబ్రహ్మ స్వరూపిణమ్ ।**
**భవంతం తత్త్వ మిత్యద్య తేజోరాశిం పరాత్పరమ్ ॥**
**పరమాత్మానమిత్యాహురస్మిన్ జగతి యద్విభో ।**
**త్వమేవ శర్వ సర్వాత్మన్ త్రిలోకాధిపతే భవ ॥**

ఈ లోకంలో రక్షకుడువు, సర్వేశ్వరుడవు నాశనము లేనివాడవు, వరముల నిచ్చువాడవు, శబ్దస్వరూపుడవు, శబ్దప్రమాణముచే నిరూపింపబడెడివాడవు, వాచ్యవాచక భావమునకు అతీతుడవు నీవే. యోగవిశారదులగు యోగులు ముక్తి కొరకు ఈశానుడవగు నిన్ను ప్రార్థించెదరు. నీవు యోగుల హృదయపుండరీకమునందలి ఆకాశములో స్థిరముగా నుండెదవు. పరబ్రహ్మ స్వరూపుడు, తేజోనిధి, ప్రకృతి కంటె పరుడు అగు నిన్ను పవిత్రములగు వేదములు తత్త్వమసి ఇత్యాది మహా వాక్యములతో ప్రతిపాదించు చున్నవి. హే విభో! ఈ

జగత్తులోని సర్వము నీవే. పరమాత్ముడవు నీవేనని ఋషులు చెప్పెదరు. హే శర్వా! భవా! సర్వము నీ స్వరూపమే. ముల్లోకములకు ప్రభువు నీవే.

**శ్లో॥ దృష్టం శ్రుతం స్తుతం సర్వం జ్ఞాయమానం జగద్గురో ।**
**అణోరల్పతరం ప్రాహుర్మహతోఽపి మహత్తరమ్ ॥**
**సర్వతః పాణి పాదాంతం సర్వతోక్షి శిరోముఖమ్ ।**
**సర్వతశ్శ్రవణఘ్రాణం త్వాం నమామి చ సర్వతః ॥**
**సర్వజ్ఞం సర్వతో వ్యాపిన్ సర్వేశ్వరమనావృతమ్ ।**
**విశ్వరూపం విరూపాక్షం త్వాం నమామి చ సర్వతః ॥**
**సర్వేశ్వరం భవాధ్యక్షం సత్యం శివమనుత్తమమ్ ।**
**కోటి భాస్కర సంకాశం త్వాం నమామి చ సర్వతః॥**

ఓ జగద్గురూ! చూడబడే, వినబడే, తెలియబడే సర్వము నీవే. నీవు అణువు కంటె సూక్ష్మతరుడవు. మిక్కిలి పెద్దదానికంటె పెద్దవాడవు అని ఋషులు చెప్పుచున్నారు. సర్వత్రా నీ చేతులు, కాళ్ళు, కళ్ళు, శిరస్సులు, ముఖములు, చెవులు, ముక్కులు గలవు. సర్వాత్మకుడవగు నీకు నమస్కారము. ఓ సర్వవ్యాపీ! సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, మాయావరణము లేనివాడు, జగద్రూపుడు, ముక్కంటి అగు నిన్ను అన్ని దిక్కులయందు నమస్కరించుచున్నాను. సర్వేశ్వరుడు, జగదధ్యక్షుడు, సత్యస్వరూపుడు, మంగళస్వరూపుడు, సర్వోత్కృష్టుడు, కోటి సూర్యుల కాంతి గలవాడు అగు నీకు సర్వదిక్కుల యందు నమస్కరించు చున్నాను.

**శ్లో॥ విశ్వదేవ మనాద్యంతం షడ్వింశత్క మనీశ్వరమ్ ।**
**ప్రవర్తకం చ సర్వేషాం త్వాం నమామి చ సర్వతః ॥**
**ప్రవర్తకం చ ప్రకృతే స్సర్వస్య ప్రపితామహమ్ ।**
**సర్వ విగ్రహమీశం హి త్వాం నమామి చ సర్వతః ॥**
**ఏవం వదంతి వరదం సర్వావాసం స్వయం భువమ్ ।**
**శ్రుతయశ్శ్రుతి సారజ్ఞం శ్రుతిసారవిదశ్చ యే ॥**

జగత్తునకు ప్రభువు, ఆద్యంతము లేనివాడు, ఇరువదియారు తత్త్వములను ప్రవర్తిల్ల జేయువాడు, తనకంటె పైన ప్రభువు లేనివాడు, సర్వప్రాణులను ప్రవర్తిల్ల జేయువాడు అగు నిన్ను అన్ని వైపుల నుండియూ నమస్కరించు చున్నాను. ప్రకృతికి చైతన్యము నిచ్చి అనుగ్రహించు వాడు, సర్వజగత్తును సృష్టించిన బ్రహ్మకు తండ్రి, సర్వదేవతా స్వరూపుడు,

ఈశ్వరుడు అగు నిన్ను అన్ని విధములుగా నమస్కరించు చున్నాము. వేదములు, వేదవేత్తలు,నిన్ను వరముల నిచ్చు వాడనియు, సర్వులకు అధిష్ఠానమనియు, స్వయం సిద్ధుడవనియు వర్ణించుచున్నారు.

అమరులు చేసిన ప్రార్థనకు ఆనందించిన వాడై చంద్రశేఖరుడు వృషభ వాహనారూఢుడై సాక్షాత్కరించి వారితో ఇలా అన్నాడు. "ఓ పితామహా! విష్ణువు యొక్క మాయాశక్తి వల్లను, నారదుని బుద్ధి చాతుర్యం వల్లను త్రిపురాసురులు వారి ప్రజలు; ఉత్తమమైన స్వధర్మాన్ని విడిచి పరధర్మాన్ని ఆశ్రయించి, వారి మరణాన్ని వారే కోరి తెచ్చుకొన్నారు. కాని వారితో యుద్ధం చెయ్యటానికి తగిన సాధన సంపత్తి నా వద్ద లేదే! రథము, సారథి, ధనుర్బాణాలు, తూణీరం.... ఇవేమి లేకుండా యుద్ధం ఎలా సాధ్యం?

శంకరుని అంగీకారానికి సంతసించిన విష్ణుబ్రహ్మేంద్రాది దేవతలు "హే! కపర్దీ! అవన్ని సిద్ధంగానే ఉన్నాయి. మీరు బయలు దేరటమే మిగిలి ఉంది" – అని విన్నవించారు. 'ఐతే రణభేరి మ్రోగించండి' అని పోరుకు సిద్ధమయ్యాడు రుద్రుడు.

**అసుర సంహారానికి అంతరాయం**

ఇంతలో పుత్రులిద్దరిని వెంట పెట్టుకొని ఉమాదేవి శివ సన్నిధానానికి వచ్చింది. దేవతలందరు ఆశ్చర్యంతో పాటు కొద్ది పాటి తొట్రుపాటును కూడా పొంది ఆమెకు జయ వాక్యాన్ని పలికారు. మెల్లగా గిరిరాజ నందిని మందహాసంతో శశాంక శేఖరుని సమీపించి "నాథా! మీ కుమారులిద్దరి దుడుకు చేష్టలను భరించ లేకుండా ఉన్నాను. ప్రతి చిన్న విషయం లోనూ ఇద్దరూ తగవులాడుకొంటున్నారు. ఈ దేవతల మొరలు, విన్నపాలు ప్రార్థనలు మనకెప్పుడు ఉండేవే! వీరు స్వార్థపరులు. సృష్టిలో ఉన్న శ్రేష్ఠమైన వస్తువులన్నీ తమకే కావాలంటారు వీళ్ళు. ఇలా ఇంట్లోకి వచ్చి, పిల్లలను కొంచెం మందలించండి. వాళ్ళ ఆట పాటలను చూసి మీరు ముచ్చట పడటం లేదు.... తగవులూ పట్టించుకొనటం లేదు! ఈ దేవతలకేం! వాళ్ళ సంసారాలు బాగానే ఉన్నాయి." – ఇలా గృహస్థ ధర్మాన్ని గుర్తు చేసింది.

గౌరీదేవి మనోగతాన్ని అవగతం చేసి కొన్న శ్రీ కంఠుడు పుత్రులను గాఢంగా ఆలింగనం చేసికొని, మూర్ధాఘ్రాణం చేసి, మెల్లగా హస్త పద్మాలతో శరీరమంతా నిమిరి, బుగ్గ గిల్లి కుమారులతో కూడ కొద్దిసేపు వినోదించి, తన భవనంలోకి వెళ్ళిపోయాడు. దేవతలంతా తమ కార్యానికి విఘ్నం కలిగినందుకు విచారించి వ్యగ్రమనస్కులై కర్తవ్యం తోచక హతాశులయ్యారు. దేవతల దీన వదనాలను చూచిన అచ్యుతుడు కరుణాంతరంగుడై

కర్తవ్యాన్నిలా బోధించాడు. గీర్వాణులారా! నా మాటను శ్రద్ధతో వినండి! మహాదేవుని ఆరాధనలో ఆరంభంలో దుఃఖం కలుగుతుందని పెద్దల వలన విన్నాను. మంత్రజపం చేత మాత్రమే ఆయన అనుగ్రహం కలుగుతుంది. "ఓం నమః శివాయ శుభం శుభం కురు కురు శివాయ నమః ఓం" – ఈ మంత్రాన్ని కోటి పర్యాయాలు జపించండి. ఆయన ప్రసన్నుడై మన కార్యాన్ని నెరవేరుస్తాడు.

విష్ణువు ఉపదేశాను సారంగా అందరూ ఆ మంత్రాన్ని జపించగా మృత్యుంజయుడు ప్రత్యక్షమై, దేవతల మనోగతాన్ని అవగతం చేసికొని ప్రతిజ్ఞా పూర్వకంగా ఇలా పలికాడు: "అమరులారా! త్రిపురాలు నశించాయనే మీరు నిశ్చయం చేసికొనండి. గతంలో నే చెప్పినట్లు యుద్ధ సామాగ్రిని సిద్దం చెయ్యండి. ఈ దేవ కార్యంలో అందరూ సహకరించండి. "మీరు జపించిన మంత్రం నాకు ప్రీతిని కలిగించేది. సకామంగా ఈ మంత్రాన్ని జపించిన వారికి ఆయురారోగ్య భుక్తి ముక్తులు సంతోషంగా ప్రసాదిస్తాను. ఇక మీరు వెళ్ళండి." అంత దేవతలు పరమానంద కందళిత హృదయారవిందులై విశ్వకర్మను పిలిచి రథాన్ని నిర్మించమని ఆజ్ఞాపించారు."

## రథ నిర్మాణం

నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుడైన సూతుడు తపోధనులైన మునులతో ఇలా అంటున్నాడు: "మునులారా! పరమాద్భుతమైన త్రిపురాసుర సంహార ఘట్టాన్ని వినిపిస్తున్నాను. శ్రద్ధాభక్తులతో వినండి. దేవతాశిల్పి అయిన విశ్వకర్మ నిర్మించిన...... సర్వవేద స్వరూపము, సకల దేవాత్మకము, పరమ సుందరము, దివ్యము అగు రథ నిర్మాణాన్ని గూర్చి చెపుతున్నాను. దాని బాహ్య స్వరూపాన్ని మనసులో ఊహించుకొని, తత్త్వాన్ని బుద్ధితో ధ్యానించండి.

సర్వలోకాలు, సర్వభూతాలు, ఆ రథంలో ఉన్నాయి. దానికి కుడి చక్రం సూర్యుడు కాగా, ఎడమ చక్రం చంద్రుడు. కుడి చక్రానికి పన్నెండు, ఎడమ చక్రానికి పదహారు ఆకులు (కమ్మీలు)న్నాయి. ద్వాదశాదిత్యులు కుడి చక్రాన్ని, చంద్రుని పదహారు కళలు ఎడమ చక్రాన్ని అధిష్ఠించి ఉన్నారు. నక్షత్రాలు ఆ ఎడమ చక్రానికి ఆభరణా లయ్యాయి. ఆరు ఋతువులు ఆ చక్రాలను చుట్టి ఉండే పట్టాలు (బద్దీలు) అయ్యాయి. అంతరిక్షం రథానికి ముందు భాగం. మందర పర్వతం రథిక స్థానం. పూర్వ, పశ్చిమాద్రులే రథానికి ముందున్న రెండు స్తంభాలు. మహామేరువు మూలాధిష్ఠానం కాగా మేరు శిఖరాలు అధిష్ఠానంలోని ఇతర భాగాలు.

సంవత్సరాలు దాని వేగం అయ్యాయి. ఉత్తరాయణ, దక్షిణాయనాలు చక్రాల ఇరుసులు. ముహూర్తాలు దాని భూషణ మకుటాలు. ఘడియలు దాని కీలలు (సీలలు / మేకులు). విఘడియలు ముక్కువంటి అగ్రభాగాలు కాగా, క్షణములు ఇరుసు కర్రలు. నిముషాలు క్రింది కరల్రు కాగా, లవములు నిలువు కర్రలు. ద్యులోకం ముందుండే ఇనుప కమ్మి, స్వర్గ మోక్షాలు రెండు ధ్యజాలు. ఐరావతం మరియు కామధేనువు కాడి యొక్క కొనలు. ప్రకృతి నిలువు స్తంభం. మహత్తత్త్వం ఆసనం. అహంకారం కోణాలు. పంచభూతాలు దాని బలం. ఇంద్రియాలు దాని ఆభరణాలు. శ్రద్ధ దాని గమనం. ఆరు వేదాంగాలు ఆ రథానికి భూషణాలు. పురాణ, న్యాయ, మీమాంసా, ధర్మ శాస్త్రాలు ఉపభూషణాలు. శ్రేష్ఠమైన మంత్రాలు ఘంటలు. వర్ణాశ్రమ ధర్మాలు పాదాలు.

సహస్రఫణ భూషితుడైన ఆది శేషువు దాని కట్టుత్రాడు. దిక్కులు, ఉపదిక్కులు (మూలలు) కట్టుత్రాళ్ళు. పుష్కరాది తీర్థాలు బంగారు పతాకలు. నాలుగు సముద్రాలు ఆ రథాన్ని కప్పే కంబళ్ళు, గంగా, సింధు, గోదావరి ఇత్యాది నదులు రత్న పాంచాలికలు. సప్త వాయువులు దానికి సోపానాలు. లోకాలోక పర్వతాలు ఉపసోపానాలు, మానసాది సరోవరాలు బయట ఉండే విషమ స్థానం. సప్త ద్వీపాల లోని పర్వతాలన్నీ ఆ రథానికి నలువైపుల ఉండే తాళ్ళు. పాతాళాది అధోలోక జీవులు దానికి ఉపరితలం.

సృష్టికర్తయైన బ్రహ్మ సారథి. ప్రణవం (ఓంకారం) చేతి కొరడా. అకారం ఛత్రం. హిమవంతుడు శివుని చేతి విల్లు. ఆది శేషువు అల్లె త్రాడు. వేదమాత ఐన సరస్వతి ఆ ధనుస్సుకు గంట. మహా తేజశ్శాలి ఐన నారాయణుడు బాణం. అగ్ని ఆ బాణం యొక్క వాడి ముల్లు (కొన). నాల్గు వేదాలే రథానికి నాలుగు గుర్రాలు. వ్యాసాది మహర్షులు వాటికి సంరక్షకులు. అంతరిక్షంలో మెరిసే కాంతిపుంజాలన్నీ గుఱ్ఱాలకు ఆభరణాలు. సర్వమైన విషాలు శివునకు సైన్యం. వాయువులు చతుర్విధ వాద్యకారులు. ఇలా సృష్టిలో ఉన్న సర్వమైన వస్తువులు ఆ రథంలో ఉన్నాయి. జగత్తే రథంగా జగన్నాధుడైన శివునికి నిర్మించి ఇచ్చాడు.... విశ్వకర్మ. అది జగన్నాథుని రథం.

**శివుని రథయాత్ర**

సకల దేవతా సమూహం జయజయ ధ్వానాలు చేస్తూండగా; వాసుదేవ, కమలాసన, పాకశాసనాది ప్రముఖులు కరకమలాలను మొగిడ్చి వినయ వినమితోత్తమాంగులై స్తుతించి సర్వదేవాతా స్వరూపుడైన మహాదేవుని దివ్య రథారూఢుణ్ణి చేశారు. ఆయన రధాన్ని అధిరోహించగానే వేదసంభవమైన అశ్వాలు

తలలు వంచి నేలకూలాయి. కుల పర్వతకానన సహితంగా క్షోణీ మండలం క్షోభించింది. ఆ భారాన్ని సహించలేక అనంతుడు అవనతు డయ్యాడు. వెంటనే శేష భగవానుడు వృషభ రూపంలో ఆ రథం క్రిందకు చేరి క్షణంలో దానిని పైకి ఎత్తి నిలపెట్టాడు. కాని ఆయన కూడ మరుక్షణంలో మోకాళ్ళపై నేల కూలాడు. అంత పరమేష్ఠి చేతి కొరడాతో అశ్వాలను అదలించి శివుని ఆజ్ఞచే రథాన్ని నిలపెట్టాడు. గంగాధరుడు శంఖాన్ని పూరించగా కమలాసనుడు కళ్ళేలను సడలించి సైంధవాలను అదలించాడు. మహావీరులైన త్రిపురాసురుల నగరాలను లక్ష్యంగా చేసికొని రథ చోదనం చేశాడు శంకరుడు.

అప్పుడు మంగళకరుడైన మృత్యుంజయుడు దేవతల నుద్దేశించి ఇలా అన్నాడు: "ఓ త్రిదశులారా! నాకు పశుపతిత్వాన్ని కల్పించి నట్లైతే నేను అసురులను సంహరిస్తాను. దేవతలకు మరియు ఇతర జీవులకు వేరువేరుగా పశుత్వాన్ని కల్పించక పోతే అసురులు సంహరింప బడరు." శూలి పలుకులకు అమర్త్యులు అనిష్ఠులై దుఃఖవివశు లయ్యారు. వారి మనోగతాన్ని ఎరిగిన భూతేశుడు నవ్వి దయతో ఇలా అన్నాడు.

"ఓ! ఆదిత్యులారా! మీరు పశుభావాన్ని పొందినా పతనాన్ని పొందరు. దానికొక ఉపాయం ఉంది. ఎవరైతే దివ్యమైన పాశుపత వ్రత దీక్షను ఆచరిస్తాడో అతడు పశుత్వం నుండి విముక్తిని పొందుతాడు. ఆ వ్రతాన్ని జీవిత కాలమంతా కాని లేదా పన్నెండు సంవత్సరాలు లేదా ఆరు లేక మూడు సంవత్సరాలు శుశ్రూష చేస్తే చేసిన వానికి పశుపాశ విమోచనం కలుగుతుంది." ఆ మాటలకు సుపర్వులు 'సరే' అని తమ అంగీకారాన్ని తెలిపారు. ఆ కారణంగానే దేవతలు, దానవులు అందరూ ఈశ్వరునకు పశువులు అయ్యారు. పశువుల పాశాలను విడిపించు వాడు కనుక ఆనాటి నుండి శంకరుడు పశుపతి అయ్యాడు. ఆనాటి వామదేవుని రూపాన్ని వర్ణించటానికి వేయి సంవత్సరాలు చాలవు.

త్రిపురాసుర సంహారానికై దేవగణాలన్నీ మహాదేవుని వెంట నడిచాయి. తమ తమ గణాలతో కూడి హిరణ్యగర్భ, నారాయణులు అనుసరించారు. ముప్పైమూడు కోట్ల దేవతా సమూహం తనను కొలువ బిడౌజుడు కదిలాడు. పన్నిద్దరు ఆదిత్యులు, పదిమంది విశ్వేదేవులు, ఎనమండుగురు వసువులు, ముప్పై ఆరుగురు తుషితులు, అరవై నాలుగు మంది భాస్వరులు, నలభై తొమ్మండుగురు అనిలులు, రెండువందల ఇరవై మంది మహారాజికులు, పన్నెండుగురు సాధ్యులు, పదకొండుగురు రుద్రులు.... ఇలా దేవయోనులైన గణ దేవతలందరు వెంబడించారు. విద్యాధరులు, అప్సరసలు, యక్షులు, రక్షస్సులు,

గంధర్వులు, కిన్నరులు, పిశాచకులు, గుహ్యకులు, సిద్ధులు, బాల గ్రహాదులైన భూతాలు..... ఈ దేవ జాతులన్ని అనుసరించాయి. ఇక విశేషించి రుద్రగణాధ్యక్షులైన కేశుడు, విగత వాసుడు, మహాకేశుడు, మహాజ్వరుడు, సోమదుడు, సనకుడు, సూర్యవర్చసుడు, చండుడు, కంపనుడు... ఇత్యాది వీరులంతా తమతమ గణాలతో భూమి కంపింప అడుగులు వేసికొంటూ నడిచారు. వారి చేతుల్లో వివిధ ఆయుధాలున్నాయి.

ఆ గణాధ్యక్షులలో ఏ ఒక్కడైనా చాలు సంకల్పమాత్రం చేత చరాచర జగత్తును భస్మం చేయటానికి! త్రినేత్రుడొక్కడు చాలు త్రిపుర దహనానికి! మరెందుకీ అట్టహాస యుద్ధ సంరంభం అంటే దేవతలందరిలో సర్వోత్కృష్టుడు పరమేశ్వరుడొక్కడే, అనే విషయం దుష్టులకు విశదమయ్యే నిమిత్తం!

### త్రిపుర దహనం

త్రిపురాలను సంపూర్ణంగా దహించి వేయటానికి మహాదేవుడు సర్వ సామాగ్రితో కూడి రథస్థుడై ఉన్నాడు. ఎడమ కాలు ముందుకు చాచి రథశీర్ష స్థానక మందుండి ధనుస్సుకు నారిని బిగించి, బాణాన్ని సంధించి, అద్భుతమైన రథిక విన్యాసంలో ప్రత్యాలీఢ స్థానకంలో నిల్చున్నాడు. ధనుర్మధ్యాన్ని పిడికిట పట్టి ఆకర్ణాంతం అల్లెత్రాటిని లాగి లక్ష్యం మీద చూపుంచి నిశ్చలంగా లక్ష సంవత్సరాలు అలా ఏకాగ్రచిత్తుడై ఉన్నాడు. అప్పుడు గణపతి తనను పూజించ లేదనే కోపంతో చేతి బొటన వ్రేలిని ఆశ్రయించి నిరంతరమగు పీడను కలిగించగా తినేత్రుడు త్రిపురాలను భేదించ లేక పోయాడు.

అప్పుడు ఆకాశవాణి శంకరునుద్దేశించి, గజాననుని పూజించనంత వరకు త్రిపుర సంహారం సంభవం కాదు, అని శుభ వచనాన్ని పల్కగా అంధకాసుర వైరి భద్రకాళిని పిలిచి పత్నీ సహితుడై హేరంబుని యధావిధిగా పూజించాడు. వెంటనే త్రిపురాసురుల నగరాలు కానవచ్చాయి. మునులారా! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశానుడు, సదాశివుడు.... అనబడే పంచదేవతల చేత ఉపాసింపబడే పరబ్రహ్మ తత్త్వం ఆయనే కదా! ఆయనచే ఉపాసింపబడే మరియొక దైవం లేదు గదా? అలాంటప్పుడు అట్టి మహేశ్వరుని యందు ఇతర దేవతాను గ్రహంచే కార్యం సిద్ధించటం అనేది ఎలా కుందురుతుంది? అంటే పిండి బొమ్మను సకల గణాధ్యక్షుని చేసింది ఆయనే, కనుక సృష్టి పాలన సర్వతంత్ర స్వతంత్రుడైన ఆయన విషయంలో ఒక లీల మాత్రమే!

ప్రత్యాలీఢ స్థానకంలో మహాదేవుడు నిలబడి ఉండగానే త్రిపురాలు ఒక్క రేఖలోనికి వచ్చాయి. దేవతలు, సిద్ధులు, మహర్షులు అందరు హర్ష ధ్వానాలు చేసి జయజయ

ధ్వానాలు చేశారు. విధి, మాధవులిద్దరూ కూడా ఆయనను సమీపించి "హే మహాదేవా! త్రిపురాలు ఒక్క రేఖలోకి వచ్చాయి. అవి విడిపోకముందే శర సంధానం చేసి దహించి దేవ కార్యాన్ని నెరవేర్చండి"....... అని ప్రార్థించారు. వెంటనే ఫాల లోచనుడు పినాక మనే ధనస్సు చేతపట్టి అల్లె త్రాటిని తగిల్చి, లోక భీకరంగా ధనుష్టంకారం చేసి, విష్ణు స్వరూపమైన శరాన్ని సంధించి, మనసులో పరమ పూజ్యమైన పాశుపతాస్త్రాన్ని ధ్యానించి..... ఈ అస్త్రంతో త్రిపురములు భస్మమగుగాక అని ప్రకటించి ఆ కృపీటయోని వికట భృకుటి దుర్భర దుస్సహ దుర్నిరీక్ష్య తేజో విరాజమానుడై, అభిజిల్లగ్నంలో బాణప్రయోగం చేసే సరికి ఆ శరం సహస్రకోటి మార్తాండ ప్రభాభాసమాన పావకాద్భుత జ్వాలా మాలికలు నాలికలు సాచి పురత్రయాన్ని క్షణంలో దగ్ధం చేసింది. రాక్షసులు హాహాకారాలు చేస్తూ దగ్ధమయ్యారు. దేవతలు హర్ష ధ్వానాలు చేసారు.

త్రిపురాసురులు దహింప బడుతూ భక్త వత్సలుడైన శంభుని స్మరించి మనసులో ఇలా ప్రార్థించారు. "హే! శంకరా! మేము నిన్ను తెలుసుకొన్నాం. మాకు జ్ఞానోదయమైంది. భార్యాపుత్ర బంధుమిత్ర సపరివారంగా మమ్ములను దహించటంలో నీకు ఆనందం ఉంటే గృహారామ క్షేత్రాలను ఈ పాంచ భౌతిక శరీరాలను దహించటం కాదు. పునర్జన్మ లేకుండ మా కర్మ బీజాలను దహించు. జన్మజన్మలలోను మా బుద్ధి నీ యందే నిమగ్నమై ఉండు గాక!" ఇలా ప్రార్థిస్తూ ప్రాణాలను విడిచారు త్రిపురాసురులు.

త్రిపురములలోను భస్మం కాకుండ మిగిలిన వస్తువు ఏ ఒక్కటి లేదు. మయుడు చిరంజీవి కనుక ఆయన ప్రాణాలతో బయట పడ్డాడు. ఆయన మహా శివభక్తుడు. ఎవరే కర్మలను ఆచరించినా.... రాగ ద్వేషాది మనో మాలిన్య రహితంగా ఆచరిస్తే అవి పతన హేతువులు కాజాలవు. కనుక సత్పురుషులు సత్కర్మలనే ఆచరించాలి. సనాతన వైదిక ధర్మాన్నే ఆచరించాలి. పాప కర్మచే ఇహపరాలు రెండు నశిస్తాయి. త్రిపురాసురులకు, త్రిపుర వాసులకు ఘటిల్లిన మాయా యతి స్నేహం వంటి స్నేహం.... ఎవరికి ఘటిల్లకుండు గాక !

గతంలో చేసిన శివపూజచే త్రిపురాసురులు గాణాపత్య స్థానాన్ని పొందారు.

**దేవతల శివస్తుతి**

ఆ సమయంలో రుద్రుని భయంకర రూపాన్ని చూచి దేవతలందరు భయ విహ్వాలులయ్యారు. అంత పరమేష్ఠి పెద్దవాడు కనుక కొంచెం తేరుకొని చేతులు జోడించి ఇలా ప్రార్థించాడు.

**శ్లో ॥ దేవదేవ మహాదేవ భక్తానుగ్రహ కారక ।**
**ప్రసీద పరమేశాన సర్వదేవహిత ప్రద ॥**
**ప్రసీద జగతాం నాథ ప్రసీదానంద దాయక ।**
**ప్రసీద శంకర స్వామిన్ ప్రసీద పరమేశ్వర ॥**
**ఓంకారాయ నమస్తుభ్య మాకార పరతారక ।**
**ప్రసీద సర్వదేవేశ త్రిపురఘ్న మహేశ్వర ॥**
**నానా వాచ్యాయ దేవాయ వరణప్రియ శంకర ।**
**అగుణాయ నమస్తుభ్యం ప్రకృతేః పురుషాత్పర ॥**
**నిర్వికారాయ నిత్యాయ నిత్యతృప్తాయ భాస్వతే ।**
**నిరంజనాయ దివ్యాయ త్రిగుణాయ నమోஉస్తుతే ॥**
**సగుణాయ నమస్తుభ్యం స్వర్గేశాయ నమోஉస్తుతే ।**
**సదాశివాయ శాంతాయ మహేశాయ పినాకినే ॥**
**సర్వజ్ఞాయ శరణ్యాయ సద్యోజాతాయతే నమః ।**
**వామ దేవాయ రుద్రాయ తథా తత్ పురుషాయచ ॥**
**అఘోరాయ సుసేవ్యాయ భక్తాధీనాయ తే నమః ।**
**ఈశానాయ వరేణ్యాయ భక్తానంద ప్రదాయినే ॥**

**తా ॥** దేవదేవా మహాదేవా! భక్తులను అనుగ్రహించు వాడా! దేవతలకు హితమును చేయువాడా! పరమేశ్వరా! ప్రసన్నుడవు కమ్ము! ఓ జగన్నాథా! ఆనందనాయకా! శంకరా! పరమేశ్వరా! ఓంకార స్వరూపా! నీకు నమస్కారం. నిన్ను ధ్యానించు వారిని నువ్వు రక్షిస్తావు. సర్వదేవ ప్రభూ! త్రిపుర సంహారా! మహేశ్వరా! భక్త ప్రియా! శంకరా! నీకు నమస్కారం. నామములచే నిర్దేశింప బడువాడు, నిర్గుణుడు, ప్రకృతి పురుషుల కంటె అతీతుడు అగు నీకు నమస్కారం. నిర్వికారుడు, శాశ్వతుడు, నిత్య తృప్తుడు, ప్రకాశ స్వరూపుడు, కర్మలేపం లేనివాడు, త్రిగుణాత్మకుడు అగునీకు నమస్కారం. సగుణుడు, స్వర్గమునకు ప్రభువు, శాంతుడు, సదా శివుడు, మహేశ్వరుడు, పినాకధారి అగు నీకు నమస్కారం. సర్వజ్ఞుడు, శరణ్యుడు, సద్యోజాతుడు, వామదేవుడు, తత్పురుషుడు, రుద్రుడు అగు నీకు నమస్కారం. శాంత స్వరూపుడు, చక్కగా సేవింప దగిన వాడు, భక్తాధీనుడు, సర్వేశ్వరుడు, సర్వశ్రేష్ఠుడు, భక్తానందప్రదుడు అగు శివునకు నమస్కారం.

ఓ మహాదేవా! నీ రూపాన్ని చూచి, భయపడి ఉన్న మా దేవతలందరిని రక్షించు. త్రిపురములను దహించి అమరులందరిని కృతార్థులను చేశావు. శంకరా! నీ యందు ఎన్నటికీ తొలగిపోని పరాభక్తి కలుగు గాక! నన్ను సర్వదా సారథివై నడిపించు. నాకు సర్వదా అనుకూలుడవు కమ్ము.

అంత నారాయణుడిలా ప్రార్థించాడు.

**శ్లో ॥ దేవాధీశ ! మహేశాన ! దీనబంధో ! కృపాకర ।**
**ప్రసీద పరమేశాన కృపాం కురు నతప్రియ ॥**
**నిర్గుణాయ నమస్తుభ్యం పునశ్చ సగుణాయచ ।**
**పునః ప్రకృతి రూపాయ పునశ్చ పురుషాయచ ॥**
**పశ్చాద్గుణ స్వరూపాయ నతో విశ్వాత్మనే నమః ।**
**భక్తప్రియాయ శాంతాయ శివాయ పరమాత్మనే ।**
**సదాశివాయ రుద్రాయ జగతాం పతయే నమః ।**
**త్వయి భక్తిర్దృఢా మేఽద్య వర్ధమానా భవత్వితి ॥**

**తా ॥** ఓ దేవాధి దేవా! మహేశ్వరా! దీనబంధో! కృపానిధీ! ప్రసన్నుడవుకమ్ము! ఓ పరమేశ్వరా! నమస్కరించు వారిపై ప్రేమగల నీవు దయను చూపు. నిర్గుణుడవు సగుణడవు నీవే! పురుషుడవు ప్రకృతివి కూడ నీవే. అట్టి నీకు నమస్కారం. సృష్టి ఐన తరువాత త్రిగుణాత్మకుడైన విశ్వస్వరూపుడు, భక్తి ప్రియుడు, శాంతుడు, శివుడు, పరమాత్మ, సదాశివుడు, రుద్రుడు, జగత్పతి ఐన నీకు నమస్కారం. నాకు నీయందు భక్తి వర్ధిల్లు గాక! ఆపై దేవతలందరు కలిసి త్రిపురాంతకుని ఇలా ప్రార్థించారు.

**శ్లో ॥ దేవనాథ ! మహాదేవ ! కరుణాకర ! శంకర ! ।**
**ప్రసీద జగతాం నాథ ప్రసీద పరమేశ్వర ॥**
**ప్రసీద సర్వకర్తా త్వం నమామస్త్వాం వయం ముదా ।**
**త్వయి భక్తి ర్దృఢాస్మాకం నిత్యంస్యాదనపాయినీ ॥**

**తా ॥** దేవదేవ! మహాదేవా! కరుణాకరా! శంకరా! ప్రసన్నుడవు కమ్ము. పరమేశ్వరా! సర్వమును చేయువాడవు నీవే. నీకు మేము ఆనందంతో నమస్కరిస్తున్నాం. నీయందు ఎన్నటికీ తొలగిపోని, నిత్యమగు భక్తి దృఢముగా కలుగు గాక!

వారందరి స్తుతులకు ప్రీతుడైన శంకరుడు మీ అభీష్టాన్ని చెప్ప వలసిందని కోరగా దేవత లందరు “శంకరా! మమ్ములను నీ దాసులుగా స్వీకరించు. మా కెప్పుడు దుఃఖం కలిగినా నువ్వు ప్రకటమై ఆ దుఃఖాన్ని నశింప చేయి.” అని వేడుకొన్నారు. రుద్రుడు ప్రసన్నుడై ‘తథాస్తు’ అని వరమిచ్చాడు. వారితో పాటు ఈ స్తోత్రాలను పఠించిన వారికి, వినిన వారికి కూడా సర్వమైన దుఃఖాలు తొలగి అభీష్టాలు నెరవేరుతాయని వరమిచ్చాడు.

**మయుడు శంకరుని స్తుతించుట**

ఇంతలో శంభుడు ప్రసన్నుడగుటను చూచిన మయుడు భయం తొలగగా ఆయన్ని సమీపించి ఇలా ప్రార్థించాడు.

**శ్లో ॥ దేవదేవ మహాదేవ భక్తవత్సల శంకర ।**
**కల్పవృక్షి స్వరూపోఽసి సర్వపక్షి వివర్జితః ॥**
**జ్యోతీ రూపో నమస్తేస్తు విశ్వరూప నమోఽస్తుతే ।**
**నమః పూతాత్మనే తుభ్యం పావనాయ నమో నమః ॥**
**చిత్ర రూపాయ నిత్యాయ రూపాతీతాయతే నమః ।**
**దివ్యరూపాయ దివ్యాయ సుదివ్యా కృతయే నమః ॥**
**నమః ప్రణత సర్వార్తి నాశకాయ శివాత్మనే ।**
**కర్త్రే భర్త్రేచ సంహర్త్రే త్రిలోకానాం నమో నమః ॥**
**భక్తి గమ్యాయ భక్తానాం నమస్తుభ్యం కృపాలవే ।**
**తపస్సత్ఫల దాత్రే తే శివాకాంత శివేశ్వర ॥**
**న జానామి స్తుతింకర్తుం స్తుతిప్రియ వరేశ్వర ।**
**ప్రసన్నో భవ సర్వేశ పాహిమాం శరణాగతమ్ ॥**

**తా ॥** దేవదేవా! మహాదేవా! భక్తప్రియా! శంకరా! కల్పవృక్ష స్వరూపుడవగు నీకు స్వపర భేదం లేదు. జ్యోతిస్స్వరూపుడవగు నీకు నమస్కారం. జగద్రూపుడవగు నీకు నమస్కారం. పవిత్రమగు అంతఃకరణము గల నీకు నమస్కారం. పవిత్రము చేయునీకు అనేక నమస్కారాలు. చిత్రమగు రూపము కలవాడవు, నిత్యుడవు, రూపములకు అతీతమైన వాడవు అగు నీకు నమస్కారం. దివ్య స్వరూపుడవు, దివ్యమగు ఆకారము కలవాడవు అగు నీకు నమస్కారం. నమస్కరించిన వారి కష్టముల నన్నింటిని నశింప చేయువాడు, మంగళ స్వరూవుడు, ముల్లోకములను సృష్టించి, భరించి, లయము చేయువాడు అగు నీకు అనేక నమస్కారములు. భక్తిచే పొందదగిన వాడు, భక్తుల యెడ దయగల వాడు, తపస్సుకు

యోగ్యమైన ఫలము నిచ్చువాడు పార్వతీ పతి, మంగళరూపుడు, జగదీశ్వరుడు అగు నీకు నమస్కారం. ఓ శ్రేష్ఠమగు ప్రభువా! నీవు స్తోత్ర ప్రియుడవు! కాని స్తుతించుట నేనెరుగను. ఓ సర్వేశ్వరా! నీ శరణు జొచ్చిన నన్ను ప్రసన్నుడవై రక్షించు.

బ్రాహ్మణ శ్రేష్ఠుడైన మయుని స్తోత్రానికి ప్రీతుడైన శంకరుడు నీ అభీష్టాన్ని నెరవేరుస్తాను వరం కోరుకోవలసిందని పల్కగా మయుడిలా ప్రార్థించాడు. "ఓ మహాదేవా! నీవు నాయందు ప్రసన్నుడవైనచో, నేను నీ వరానికి అర్హుడనైనచో నాకు నీయందు శాశ్వత భక్తి నిలుచుగాక! నీ భక్తులతో నిత్యమైత్రిని, దీనుల పట్ల సర్వదా దయాభావాన్ని, దుష్టుల విషయంలో ఉపేక్షా భావాన్ని కలిగి ఉండేటట్లు అనుగ్రహించు. మహేశ్వరా! నాకు ఎన్నటికి అసుర భావం లేకుండు గాక! మంగళకరమైన నీ భజన యందు మగ్నుడనై సర్వదా నిర్భయుడనై ఉండెదను గాక".

మయుని స్వచ్ఛమైన అంతరంగాన్నెరిగిన శంభుడు అతన్నిలా అనుగ్రహించాడు. "ఓ దానవ శ్రేష్ఠా! నా భక్తుడవైన నువ్వు ధన్యుడవు. నీయందు ఎట్టి వికారాలు లేవు. నువ్వు కోరిన వరాలన్నిటిని అనుగ్రహించాను. నా శాసనంచే నువ్వు నీ పరివారంతో కూడి స్వర్గం కంటె రమణీయమైన వితల లోకానికి వెళ్ళు. అక్కడ నిర్భయంగా ఆనందంతో జీవించు. సదాభక్తి భావాన్ని కలిగి ఉండు. నీకెప్పుడూ అసుర భావం కలుగ బోదు." పార్వతీపతి ఆజ్ఞను అనుసరించి మయుడు వితల లోకానికి వెళ్ళి అక్కడ సుఖంగా ఉన్నాడు.

ఇంతలో ముండిత శిరస్కులగు మాయాయతి శిష్యులు నలుగురు; బ్రహ్మ, విష్ణువుల ఎదుట నిలిచి చేతులు జోడించి ఇలా ప్రార్థించారు. "దేవశ్రేష్ఠులారా! మేము ఎక్కడికి పోవాలి? మాకర్తవ్యం ఏమిటి? మేం చెడ్డ పనిని చేశాం. రాక్షసుల శివభక్తిని చెడ గొట్టేం. శివనింద చేసిన వానికి నరకం తప్పదు. మాకు ప్రాయశ్చిత్తాన్ని సెలవియ్యండి." వారి భయాన్ని గుర్తెరిగి విధి, మాధవులిలా అన్నారు. "ఓ సన్యాసులారా! మీరు భయపడకండి. జరిగిందంతా శివాజ్ఞచే ఘటిల్లింది. దేవతలకు, ఋషులకు హితాన్ని కలిగించారు మీరు. మీకు దుర్గతి ఎన్నటికీ కల్గదు. మా ఆజ్ఞచే మీరీనాటి నుండి కలియుగం ప్రవేశించేటంత వరకు ఎడారి ప్రదేశంలో రహస్యంగా ఉండండి. కలి ప్రవేశించగానే మీ మతాన్ని స్థాపించి ప్రచారం చెయ్యండి. కలి ప్రభావంచే కలిలో ప్రజలు మీ మతాన్ని స్వీకరించి భ్రష్టులై నరకాన్ని పొందుతారు. ఇది నిశ్చయం. మా ఆజ్ఞ." వెంటనే వారు ఎడారి ప్రదేశానికి వెళ్ళి పోయారు.

ఈ విధంగా త్రిపుర సంహారం పూర్తికాగానే దేవతలు, ఋషులు ఆనందించారు. శివుడు అంతర్ధాన మయ్యాడు. ఆయనతో పాటు శరచాపాదులు, రథము ఇత్యాది యుద్ధ సామాగ్రి అంతర్ధానమైంది. శంభుని యశస్సును, పరాక్రమాన్ని గానం చేసికొంటూ దేవతలు తమతమ నెలవులకు చేరుకొన్నారు.

గిరిజా మనోహరుని లీలలను ప్రకటం చేసే గాథలన్నింటిలోను ఈ త్రిపుర సంహార గాథ పవిత్రమైనది, శ్రేష్ఠమైనది – శ్రేయోదాయకమైనది.

**ఇంద్ర, బృహస్పతులు కైలాసాని కేగుట**

ఒకప్పుడు అమరేంద్రుడు దేవగురు వైన బృహస్పతితో కూడి కాలకంఠుని దర్శనానికై కైలాసానికి బయలు దేరారు. పరమేశ్వరుడు దాన్నెరిగి వారి భక్తిని పరీక్షింప గోరి మార్గ మధ్యంలో దిగంబరుడై అడ్డు నిలిచాడు. మఘవుడు వికృతాకారుడైన ఆ దిగంబరుని చూచి అలసభావంతోను, అజ్ఞానంతోను ఇలా అన్నాడు: "ఓయీ! మేము శంకర దర్శనానికి కైలాసానికి వెడుతున్నాం. అడ్డుతొలగు, ఆ మహాప్రభువు కైలాసంలోనే ఉన్నాడా? ఎక్కడకైనా వెళ్ళాడా? తెలిస్తే చెప్పు" జంభారి మాటలకు దింగబరుడు మారుపల్కలేదు. అలా ఎన్నిమార్లు ప్రశ్నించినా సమాధానం రాలేదు. "త్రివిష్టపాధిపత్యం గల నన్నే ధిక్కరిస్తున్నాడే ఈ దిగంబరుడు!" – అని దురాగ్రహంతో సురాధిపతి క్రకచ దంష్ట్రా కరాళమైన వజ్రాన్ని ఎత్తి ఆ దిగంబరుని శిక్షించ బోయాడు. వెంటనే మదనాంతకుడు కంటి మంటలతో కాల్చివేసేటట్లు క్రోధంతో చూచాడు. ఫాలాక్షుని సంకల్పంతో జంభారి బాహువు అలాగే స్తంభించి పోయింది. బుద్ధిశాలి ఐన బృహస్పతి వెంటనే ఆ దిగంబరుడు.... గంగాధరుడని గుర్తించి హస్త కమలాలను జోడించి భయభక్తులతో ఇలా స్తుతించాడు.

**శ్లో॥ నమో దేవాధిదేవాయ మహాదేవాయ చాత్మనే ।**
**మహేశ్వరాయ ప్రభవే త్ర్యంబకాయ కపర్దినే ॥**
**దీననాథాయ విభవే నమోఽ౦ధకనిషూదినే ।**
**త్రిపురఘ్నాయ శర్వాయ బ్రహ్మణే పరమేష్ఠినే ॥**
**విరూపాక్షాయ రుద్రాయ బహురూపాయ శంభవే ।**
**విరూపాయాతిరూపాయ రూపాతీతాయ తే నమః ॥**
**యజ్ఞ విధ్వంసకర్త్రేచ యజ్ఞానాం ఫలదాయినే ।**
**నమస్తే మఖరూపాయ పరకర్మ ప్రవర్తినే ॥**

**కాలాంతకాయ కాలాయ కాలభోగిధరాయ చ ।**
**నమస్తే పరమేశాయ సర్వత్ర వ్యాపినే నమః ॥**
**నమో బ్రహ్మశిరోహంత్రే బ్రహ్మచంద్రస్తుతాయ చ ।**
**బ్రహ్మణ్యాయ నమస్తేస్తు నమస్తే పరమాత్మనే ॥**
**త్వమగ్నిరనిలో వ్యోమ త్వమేవాపో వసుంధరా ।**
**త్వం సూర్యశ్చంద్రమాభాని జ్యోతిశ్చక్రం త్వమేవ హి ॥**

**తా॥** దేవతలకు అధిదేవుడు, ఆత్మరూపుడు, మహేశ్వరుడు, ప్రభువు ముక్కంటి, జటాజూట ధారి యగు మహాదేవుని కొరకు నమస్కారము. దీనులకు ప్రభువు, సర్వవ్యాపకుడు, అంధకాసురుని సంహరించిన వాడు, త్రిపురములను నాశము చేసినవాడు, పరంబ్రహ్మ పరిమేష్ఠి అగు శర్వునకు నమస్కారము. బేసి కన్నులవాడు, అనేక రూపములలో ప్రకటమై మంగళములను చేయువాడు, రుద్రుడు, వికృతరూపుడు, పెద్ద రూపము గలవాడు, రూపములకు అతీతుడు అగు నీకు నమస్కారము. దక్షయజ్ఞమును నాశనము చేసిన వాడు, యజ్ఞముల ఫలమును ఇచ్చు వాడు, యజ్ఞ స్వరూపుడు, శ్రేష్ఠకర్మలను చేయించు వాడు, అగు నీకు నమస్కారము. మృత్యువునకు మృత్యువు, కాల స్వరూపుడు, కాలసర్పములను ధరించువాడు, పరమేశ్వరుడు, సర్వవ్యాపకుడు ఆగు నీకు నమస్కారము. బ్రహ్మయొక్కశిరస్సును దునిమిన వాడు, బ్రహ్మచే మరియు చంద్రునిచే స్తుతింపబడిన వాడు, పరబ్రహ్మ పరమాత్మ అగు నీకు అనేక నమస్కారములు. అగ్నివి నీవే. వాయువు నీవే. ఆకాశము నీవే. జలములు నీవే. భూమి నీవే. సూర్యుడు నీవే. చంద్రుడు నీవే. నక్షత్రములు నీవే. జ్యోతిర్మండలములతో నిండిన బ్రహ్మాండము నీవే.

**శ్లో॥ త్వమేవ విష్ణుస్త్వం బ్రహ్మా తత్‌స్తుతస్త్వం పరేశ్వరః ।**
**మునయస్సనకాద్యాస్త్వం నారదస్త్వం తపోధనః ॥**
**త్వమేవ సర్వలోకేశస్త్వమేవ జగదాత్మకః ।**
**సర్వాన్వయస్సర్వభిన్నస్త్వమేవ ప్రకృతేః పరః ॥**
**త్వం తు సృజసి లోకాంశ్చ రజసా విధినామభాక్ ।**
**సత్త్వేన హరిరూపస్త్వం సకలం పాసివై జగత్ ॥**
**త్వమేవాసి మహాదేవ తమసా హరరూపధృక్ ।**
**లీలయా భువనం సర్వం నిఖిలం పాంచ భౌతికమ్ ॥**

**త్వద్ధ్యానబలత స్సూర్యస్తపతే విశ్వభావన ।**
**అమృతం చ్యవతే లోకే శశీ వాతి సమీరణః ॥**
**త్వద్ధ్యాన బలతో మేఘాశ్చాంబు వర్షంతి శంకర ।**
**త్వద్ధ్యాన బలతశ్శక్రస్త్రి లోకీం పాతి పుత్రవత్ ॥**
**త్వద్ధ్యాన బలతోఽమోఘాస్సర్వే దేవా మునీశ్వరాః ।**
**స్వాధికారం చ కుర్వంతిచకితా భవతో భయాత్॥**

**తా॥** విష్ణువు నీవే. బ్రహ్మ నీవే. వారిచే స్తుతింపబడే పరమేశ్వరుడవు నీవే. సనకాది మహర్షులు నీ స్వరూపమే. తపోధనుడగు నారదుడవు నీవే. సర్వలోకములకు ప్రభువు నీవే. జగత్స్వరూపుడవు నీవే. సర్వపదార్థములయందు అనుగతముగ నుండు వాడవు నీవే. కాని నీవు సర్వము కంటే భిన్నుడవు. నీవు ప్రకృతికంటే అతీతుడవు. రజోగుణము నాశ్రయించి బ్రహ్మ అను పేరును పొంది నీవే లోకములను సృష్టించుచున్నావు. సత్త్వ గుణమునాశ్రయించి, విష్ణురూపుడవై నీవే సమస్త జగత్తును పాలించుచున్నావు. ఓ మహాదేవా! నీవే తమో గుణమునాశ్రయించి, హరరూపమును ధరించి పంచభూతాత్మకమగు బ్రహ్మాండము నంతనూ లీలగా ఉపసంహరించెదవు. ఈ జగత్తు నీ కల్పనయే. సూర్యుడు నిన్ను ధ్యానించి ఆ బలముచే తపించుచున్నాడు. నీ ధ్యానబలముచే చంద్రుడు లోకములో అమృత కిరణములను వెదజల్లుచున్నాడు. వాయువు వీచుచున్నాడు. ఓ శంకరా! నిన్ను ధ్యానించిన బలముచే మేఘములు నీటిని వర్షించుచున్నవి. నిన్ను ధ్యానించిన బలముచే ఇంద్రుడు ముల్లోకములను తన సంతానమును వలె రక్షించుచున్నాడు. నిన్ను ధ్యానించిన బలము చేతనే దేవతలు అందరు తమతమ అధికారములను ప్రవర్తిల్ల జేయుచున్నారు. నీ భయముచే వారు అట్లు చేయుచున్నారు. నీ ధ్యానముచే మహర్షులు అమోఘమగు తపస్సు గల వారగుచున్నారు.

**శ్లో॥ త్వత్పాదకమలస్యైవ సేవనాద్భువి మానవాః ।**
**నాద్రియంతే సురాన్రుద్ర లోకైశ్యర్యం చ భుంజతే ॥**
**త్వత్పాదకమలస్యైవ సేవనాదగమన్ పరామ్ ।**
**గతిం యోగధనానామప్య గమ్యాం సర్వ దుర్లభామ్ ॥**

హే రుద్రా! భక్త సులభుడవైన నీపాద పద్మాలను సేవించిన భూలోక వాసులు ఇతర దేవతల విషయంలో నిరాదరణ చూపుతున్నారు. వారందరు ఉత్తమగతిని పొందుతున్నారు.”

వాచస్పతి మృత్యుంజయుని ఇలా స్తుతించి బిడౌజుని; మృదుని పాద కమలాలపై పడవేసి దీనంగా ఇలా ప్రార్థించాడు "ఓ మహాదేవా! దీనబంధూ! అజ్ఞానంతో చేసిన ఈ ఆఖండలుని అకార్యాన్ని మన్నించు. నీ శరణు కోరిన ఈ ఇంద్రుని క్షమించు. కోపాన్ని ఉపసంహరించుకో! ఫాలనేత్ర సముద్భవమైన అగ్ని శమించు గాక!"

సురాచార్యుని సమయోచితమైన పల్కులకు సంతసించి విరూపాక్షుడిలా అన్నాడు. "ఓ వాచస్పతీ! నా కంటి నుండి పుట్టిన క్రోధాగ్నిని నేనెలా ఉపసంహరించుకో గలను. పాము విడిచి పెట్టిన కుబుసాన్ని తిరిగి తాను ధరించ నేరదు గదా! "

అంత భయ వ్యాకుల మానసుడైన గీష్పతి "శంకరా! భక్తవత్సలుడవైన నీ బిరుదును సార్థకం చేసుకో! ఉగ్రమైన నీ తేజస్సును మరొక చోట నిక్షిప్తం చేయి. ఇంద్రుని ఉద్ధరించు. " అని వేడగా శ్రీ కంఠుడిలా అన్నాడు.

"ఓ! జీవా! నీ స్తుతికినే సంతసించాను. ఈ ఇంద్రుని క్షమించి ప్రాణాలతో విడిచి పెడుతున్నాను. ఇంద్రుని ప్రాణాలను రక్షించావు కనుక నీకు గల మంగళకరమైన నామాలతో పాటు 'జీవుడు' అనే నామం కూడా ప్రసిద్ధి కెక్కుతుంది. ఈ ఫాలాగ్నిని బిడౌజునికి పీడ కలుగని విధంగా దూరంగా విడిచిపెడతాను." ఇలా కరుణతో పల్కి రుద్రుడు తన ఫాలాగ్నిని చేతితో పట్టుకొని సముద్రంలోకి విసిరి వేశాడు. పిమ్మట ఎవరి స్థానాలను వారు చేరుకొన్నారు.

**జలంధరుని జన్మ-వివాహము**

ఆ రుద్ర తేజస్సు గంగా సాగర సంగమంలో బాలుని రూపాన్ని ధరించింది. ఆ బాలుడు కెరటాలపై ఉయ్యాల లూగుతూ రోదించాడు. ఆ శిశువు ఆక్రందనకు జంభారి వైభవ శ్రీ భయంతో కంపించింది. ముల్లోకాలు తల్లడిల్లాయి. స్థావర జంగమాత్మకమైన జగత్తు స్తంభీ భూతమైంది. అంత అమరులంతా కమలోద్భవుని చెంతకు చేరి విషయాన్ని విన్నవించి శరణు కోరారు. ఆయన జ్ఞాన దృష్టితో పరికించి విబుధులతో కూడి వార్ధి తీరానికి వచ్చి బాలుని చూచాడు. వెంటనే సముద్రుడు పితామహునకు నమస్కరించి బాలుని ఆయన ఒడిలో కూర్చుండ పెట్టాడు. బాలుని లాలించి ఈ అద్భుత తేజోరూపుడైన బాలుడు...... ఎవరి కుమారుడని అడిగాడు.

దానికి సమాధానంగా సముద్రుడు "విధాతా! ఆ విషయం నాకు తెలియదు. ఈ బాలకుడు అకస్మాత్తుగా గంగా సాగర సంగమంలో ఉద్భవించాడు. ఇతనికి వేదోక్త విధి విధానంగా జాత కర్మాది సంస్కారాలను నెరవేర్చండి! వీని జాతక భవిష్యత్తును మీ నోట్లోంచి వినాలను కొంటున్నాను." – అని ప్రత్యుత్తర మిచ్చాడు. సముద్రుని పల్కులను తల ఊపుతు వింటూన్న బ్రహ్మగారి కంఠాన్ని ఆ బాలకుడు గట్టిగా పట్టుకోగానే ఆయన చాలా వ్యధను

పొందాడు. కన్నుల నీరు పెల్లుబికింది. పరమేష్ఠి అతి కష్టం మీద ఆ బాలుని చేతి పట్టు విడిపించుకొని సముద్రునితో ఆదరంగా ఇలా అన్నాడు.

"ఓ సాగరా! ఈ కుమారుని జాతక ఫలం చెపుతాను విను. ఈతడు నా కన్నులు జలాలను ధరించేటట్లు చేశాడు కనుక 'జలంధరుడు' అనే నామంతో విఖ్యాతు డౌతాడు. యువకుడయ్యే సరికి సర్వశాస్త్ర పారంగతుడై, యుద్ధవిద్యలో కూడా ఆరితేరిన వాడవుతాడు. యుద్ధంలో ఈతడెన్నడు పరాజయాన్ని చవిచూడడు. ఇతడు రాక్షస సార్వభౌముడు కాగలడు. విష్ణువును సైతం జయించ గలడు. రుద్రుని చేతిలో ఇతడు సంహరింపబడ గలడు. ఈతని పత్ని పతివ్రత, సౌభాగ్యవర్ధిని, సర్వాంగ సుందరి, రమ్య, ప్రియవాదిని కాగలదు. అష్టైశ్వర్యాలతో తులతూగుతాడు." ఇలా చెప్పి పితామహుడు.... శుక్రుని ఆహ్వానించి ఆ బాలుని రాజ్యాభిషిక్తుని చేసి తన నెలవుకు చేరుకొన్నాడు.

సముద్రుడు ఆ బాలకుని తీసికొని స్వగృహానికేగి అల్లారు ముద్దుగా పెంచాడు. ఆ శిశువు క్రమంగా పెరిగి పెద్దవాడై విధాత చెప్పిన చొప్పున సకల విద్యాపారంగతుడయ్యాడు. యుక్త వయస్సు రాగానే సముద్రుడు కాలనేమి అను రాక్షసుని కుమార్తె వృందాదేవితో జలంధరునకు వివాహం జరిపించాడు. తారకాసుర, త్రిపురాసుర సంహారానంతరం అనాథలై తలదాచుకొన్న దానవులంతా జలంధరుని కొలువులో చేరి ప్రతీకారం కోసం ఎదురు చూస్తున్నారు.

**ఇంద్రునిపై జలంధరుని దాడి, ఇంద్రుని పలాయనం**

ఒక రోజున రాక్షసేశ్వరుడైన జలంధరుడు మంత్రి, సామంత, పురోహిత, అమాత్య, సచివ, సైన్యాధీశ, దండ నాయక, దౌవారిక, మహాప్రధాన, కవి, విద్వాంస, పౌరాణిక, ఇతిహాస, భట్ట, పరిహాసక, గాయకులతో కూడి డెబ్బైరెండు నియోగాల వారు తనను పరివేష్టించి ఉండగా కన్నుల పండువుగా నిండు పేరోలగంలో రత్నసింహాసనాసీనుడై ఉదయార్కుని వలె వెలిగి పోతున్న వేళ.... అసుర గురువు, రాజనీతి విశారదుడు, బ్రాహ్మణ శ్రేష్ఠుడు ఐన శుక్రుడు శిష్యపరివృతుడై సభాభవనంలోకి ప్రవేశించాడు. జలంధరునితో కూడి సభలోని వారంతా నయ, వినయ, భయ, భక్తులతో లేచి నిలబడి చేతులు జోడించి ఆయనను ఉచితాసనాసీనుని చేశారు. తదుపరి కుశల ప్రశ్నానంతరం జలంధరుడు.... దేహంనుండి నరుక బడిన శిరస్సుగల రాహువును సభలో చూచి భార్గవునిలా కుతూహలంతో ప్రశ్నించాడు: " గురుదేవా! మన సోదరుడైన రాహువుకు ఈ దుస్థితిని కల్పించిన దుర్మార్గుడెవరు? తల నరికిన ఖలుడెవ్వరు? ఆ వృత్తాంతాన్ని చెప్పండి!".

అంత శుక్రుడిలా చెప్పసాగాడు: "జలంధరా! మన రాక్షస వంశంలో పూర్వం హిరణ్యకశిపుని మునిమనుమడు, విరోచనుని కుమారుడు, గొప్ప ధర్మవేత్త ఐన బలి చక్రవర్తి ఉండేవాడు. దేవత లాయనచే ఓడింపబడి విష్ణువును ఆశ్రయించి ఆయన ఆజ్ఞచే సంధి కుదుర్చుకొని అమృతం కొరకు సముద్రాన్ని మథించారు. అప్పుడు పుట్టిన శ్రేష్ఠమైన వస్తువులను దేవతలు; రాక్షసులను వంచించి తమ హస్తగతం చేసికొన్నారు. అలాగే ఒక్క చుక్క కూడ మనకు దక్కనీయకుండ అమృతాన్ని దేవతలే ఆస్వాదించారు. వారి మోసాన్ని గ్రహించిన రాహువు దేవతల పంక్తిని చేరి అమృతాన్ని త్రాగుతుండగా వెంటనే విష్ణువు తన చక్రంతో రాహువు శిరస్సును ఖండించాడు".

ఈ విధంగా శుక్రుడు దేవతలు వక్రబుద్ధితో చేసిన అమృతాపహరణ గాథను చెప్పగా విని జలంధరుడు ఆగ్రహావేశుడై.... ఘస్మరుడనే దూతను పిల్చి వానికి చెప్పవలసిన విషయాన్ని బోధించి ఇంద్రుని సన్నిధికి పంపాడు. వాడు అమరావతి చేరి, సుధర్మా సభాభవనాంతర భద్రపీఠంపై పేరోలగంలో ఉన్న పురుహూతుని కనుగొని ఇలా అన్నాడు.

"ఓ పాకశాసనా! దైత్యజనేశ్వరుడు, అబ్ధితనయుడు, ప్రతాపుడు, మహావీరుడు, కవి (శుక్రుడు) సహాయుడు ఐన జలంధరుని దూతను నేను. నాపేరు ఘస్మరుడు. నా ప్రభువు చెప్పిన సందేశాన్ని విను: 'ఓ దేవతాధమా! నా తండ్రియైన సముద్రుని మందర పర్వతంతో మథించి కల్పవృక్ష, కామధేను, ఐరావతాది సమస్త శ్రేష్ఠ వస్తు సముదాయాన్ని నీ స్వంతం చేసికొన్నావు! దానికి కారణం ఏమిటి? స్వార్థ బుద్ధితో నువ్వు చేసిన పని ఉచితమైనది కాదు. కనుక వెంటనే వాటిని నాకు సమర్పించి, సకల దేవతా సమూహంతో నన్ను శరణు వేడుకో. అలా కానినాడు నువ్వు రాజ్యభ్రష్టుడవు అవుతావు."

దూత మాటలకు భయ రోష సమన్వితుడైన పురుహూతుడిలా అన్నాడు: "ఓ దూతా! విను. నాకు భయపడి పారిపోయిన పర్వతాలకు సముద్రుడు ఆశ్రయాన్నిచ్చాడు. అంతేకాదు! గతంలో నా శత్రువులకు ఆశ్రయాన్నిచ్చి రక్షించాడు. ఇంకా విను! సముద్ర పుత్రుడైన శంఖాసురుడు మూర్ఖుడై, సజ్జన సాంగత్యాన్ని విడిచి నాతో వైరాన్ని పెంచుకొన్నాడు. సాధువులను బాధించిన ఆ పాపిని నా తమ్ముడైన ఉపేంద్రుడు సంహరించాడు. ఇంకా చాలా కారణాలున్నాయి. అందువల్ల అతని శ్రేష్ఠ వస్తువులను నేను సంగ్రహించ వలసివచ్చింది. ఈ సత్య విషయాన్ని నీ ప్రభువుకు విన్నవించు."

వెంటనే బుద్ధిశాలియైన ఘస్మరుడు జలంధరుని వద్దకేగి పురందరుని వచనాలను నివేదించాడు. ఆ మాటలను విన్న జలంధరుడు ఆజ్యాహుతికి భగ్గున ప్రజ్వలించిన హుతాశనుని వలె మండిపడి, అధరం కంపింప, పండ్లు పటపట కొరికాడు. అతనిదంత ఘట్టనానికి సభాభవనం బీటలు వారింది. తక్షణం అక్షీణ బలపరాక్రమ సముపేతమైన రాక్షస సైన్యాన్ని సర్వ సన్నద్ధం చేశాడు. ముల్లోకాల దానవ సైన్యం వచ్చి చేరింది. భూరి భేరీ భాంకారాలతో, యుద్ధ క్రేంకారాలతో, శుంభ నిశుంభాది రాక్షసులతో కూడి జలంధరుడు అమరావతిని చేరి నందన వనంలో విడిది చేసి సింహనాదాన్ని చేశాడు.

దేవతలు కూడ కవచ, శిరస్త్రాణ, కోదండ, తూణీరాలను ధరించి సమరాంగణంలో సన్నద్ధులై నిలిచారు. అమరాధిపతి ఐరావతాన్ని అధిరోహించి వజ్రపాణియై రెండవ ఉదితార్కుని వలె కాంతులు గ్రుమ్మరిస్తున్నాడు. ఉభయ సైన్యాల శంఖనాదం అభఃస్థవి మార్మోగింది. తుముల యుద్ధం మొదలైంది. దేవ దానవులు పరస్పరం గదా, పరశు, శక్తి, ముసల, తోమర, పరిఘాద్యాయుధాలతో హింసించు కొంటున్నారు. అంప వాన ముంపుగా కురుస్తోంది. భగ్నమైన రథాలతో, తొండాలు తెగిన వేదండ తండాలతో, నేలకొరిగిన తురంగాలతో, ధర వ్రాలిన శూర వరులతో సంగర రంగం, మేఘ శకలాలతో కూడిన సంధ్యాకాలపుటాకాశంలా విషాద భరితంగా ఉంది.

రణ రంగంలో ప్రాణాలను తృణ ప్రాయంగా విసర్జించిన అసురులను శుక్రుడు మృత సంజీవినీ విద్యతో బ్రతికిస్తున్నాడు. అదే విధంగా అంగిరసుడు (బృహస్పతి) ద్రోణాద్రి నుండి తెచ్చిన ఓషధులతో దేవతలను పునర్జీవితులను చేస్తున్నాడు. యుద్ధం ఎప్పటికీ పరిసమాప్తి కావటం లేదు. హతులైన అమరులు బ్రతికి వచ్చి యుద్ధాన్ని చేయటం చూచిన జలంధరుడు శుక్రునితో "గురుదేవా! నా చేతిలో హతులైన దేవతలు పునర్జీవితులు కావటం ఎలా సాధ్య పడుతోంది. మృత సంజీవినీ విద్య మీ వద్ద తక్క అన్యుల వద్ద లేదు గదా?" – అని విస్మయంతో ప్రశ్నించాడు. దానికి అసుర గురువు ప్రసన్నుడై "వత్సా! అంగిరసుడు ద్రోణాద్రి నుండి తెచ్చిన ఓషధులతో బృందారకులను తిరిగి బ్రతికిస్తున్నాడు. నీకొక్క ఉపాయాన్ని చెపుతాను విను. నీ భుజ బలంతో ఆద్రోణ పర్వతాన్ని సముద్రం లోనికి త్రోసెయ్యి. నీకు విజయం తథ్యం." అని ఉపాయాన్ని చెప్పాడు.

వెంటనే జలంధరుడు ద్రోణాద్రి వద్ద కేగి తన బాహు బలంతో దానిని ఎత్తి సముద్రం లోనికి విసిరేశాడు. శివ తేజోద్భవుడైన వానికి అసాధ్య మేముంటుంది? తిరిగి

వచ్చి మహోత్సాహంతో ఆహవంలో పాల్గొని గీర్వాణులను సంహరించటం మొదలు పెట్టాడు. బుద్ధిశాలి ఐన బృహస్పతి వివేకంతో విషయాన్ని గ్రహించి ఇంద్రుని, దేవతలను ఉద్దేశించి సమయోచితంగా ఇలా బుద్ధి చెప్పాడు. "ఓ! పురందరా! బృందారకులారా! మీరంతా పారిపోయి సురక్షిత స్థానాలకు చేరుకోండి. ఓషధీ సమన్వితమైన ద్రోణాద్రి పూర్వస్థానంలో లేదు. దానిని ఆ దానవుడు నిశ్చయంగా నాశనం చేసి ఉంటాడు. కనుక మిమ్ములను పునర్జీవితులను చెయ్యటం కుదరదు. రుద్రతేజోద్భవుడైన జలంధరుని మీరు జయించలేరు! వెనక్కు వెళ్ళండి!".

గురుని మాటలను పాటించి ఇంద్రాది బృందారకులు భయ విహ్వాలులై శీఘ్రంగా పరుగెత్తి మేరు పర్వత గుహలలో తల దాచుకొన్నారు. జలంధరుడు విజయోత్సాహంతో అమరావతీ నగర ప్రవేశం చేసి నగర లక్ష్మిని కైవసం చేసికొని అక్కడి దేవతల అధికార స్థానాలన్నింటియందు దైత్యులను నియమించి కట్టడిని ఏర్పాటు చేసి తాను స్వయంగా మేరు పర్వత ప్రాంతానికి వెళ్ళాడు.

### దేవాసుర సంగ్రామం

జలంధరుడు వస్తున్నాడని ముందే తెలుసుకొన్న ఆదిత్యులు ప్రాణభయంతో పలాయనాన్ని చిత్తగించి బ్రహ్మ గారితో తమ దుస్థితిని విన్నవించుకొన్నారు. వెంటనే విరించి..... జలంధర జన్మ వృత్తాంతాన్ని వారికి వివరించి ఈ ఆపద నుండి గట్టెక్కించ గలవాడు నారాయణుడొక్కడే అని నమ్మకంగా పలికి...... విబుధులతో కూడి వైకుంఠానికి వెళ్ళాడు. వారందరూ కలిసి హరిని ఇలా ప్రార్థించారు.

**శ్లో॥ హృషీకేశ మహాబాహో భగవాన్ మధుసూదన ।**
**నమస్తే దేవదేవేశ సర్వదైత్య వినాశక ॥**
**మత్స్యరూపాయ తేవిష్ణో వేదాన్నీతవతే నమః ।**
**సత్యవ్రతేన సద్రాజ్ఞా ప్రలయాబ్ధి విహారిణే ॥**
**కుర్వాణానాం సురాణాం చ మంథనాయోద్యమం భృశమ్ ।**
**బిభ్రతే మందరగిరిం కూర్మరూపాయ తే నమః ॥**
**నమస్తే భగవన్నాథ క్రతవే సూకరాత్మనే ।**
**వసుంధరాం జనాధారాం మూర్ధతో బిభ్రతే నమః ॥**
**వామనాయ నమస్తుభ్యముపేంద్రాఖ్యాయ విష్ణవే ।**

**విప్రరూపేణ దైత్యేంద్రం బలిం ఛలయతే విభో ॥**
**నమః పరశురామాయ క్షత్రనిః క్షత్ర కారిణే ।**
**మాతుర్హితకృతే తుభ్యం కుపితాయాసతాం ద్రుహే ॥**
**రామాయ లోకారామాయ మర్యాదాపురుషాయ తే ।**
**రావణాంతకారాయాశు సీతాయాః పతయే నమః॥**

**తా॥** ఇంద్రియములకు ప్రభువైన వాడా! హేభగవాన్! గొప్ప బాహువులు గలవాడా! మధువు అను రాక్షసుని సంహరించిన వాడా! దేవదేవా! ఈశ్వరా! రాక్షసుల నందరినీ నశింపజేసిన వాడా! నీకు నమస్కారము. హే! విష్ణో సత్యవ్రతుడనే పుణ్యశీలుడగు రాజుతో గూడి ప్రలయ కాలమునందు మత్స్యరూపముతో సముద్రమునందు విహరించి వేదములను కాపాడిన నీకు నమస్కారము. సముద్రమును మధించుటకు దేవతలు పెద్ద యత్నమును చేయుచుండగా కూర్మరూపమును దాల్చి మందరపర్వతమును మోసిన నీకు నమస్కారము. హే! భగవాన్! నాధా! యజ్ఞ వరాహరూపమును దాల్చి జనులకు ఆధారమైన భూమిని శిరస్సుపై ధరించిన నీకు నమస్కారం. హే ప్రభో! వామనావతారములో నీవు ఇంద్రుని సోదరుడవై బ్రాహ్మణ వేషముతో రాక్షసరాజైన బలిని మోసగించి బ్రహ్మాండమునంతను నీ అడుగులతో వ్యాపించినావు. అట్టి నీకు నమస్కారము, పాపులను సంహరించు నీవు పరశురాముడవై తల్లి హితము కొరకు క్రోధముతో భూమియందు క్షత్రియులు లేకుండగా చేయుటకు ఉద్యమించితివి. అట్టి నీకు నమస్కారము. లోకుల మనస్సులను రంజింప చేయువాడు, మర్యాదా పురుషోత్తముడు, సీతాపతి అగు రాముని రూపమును దాల్చి రావణుని సంహరించిన నీకు నమస్కారము.

**శ్లో॥ నమస్తే జ్ఞానగూఢాయ కృష్ణాయ పరమాత్మనే ।**
**రాధావిహారశీలాయ నానాలీలాకారాయ చ ॥**
**నమస్తే గూఢదేహాయ వేద నిందాకరాయ చ ।**
**యోగాచార్యాయ జైనాయ బౌద్ధరూపాయమాపతే ॥**

**నమస్తే కల్కి రూపాయ మ్లేచ్ఛానామంత కారిణే ।**
**అనంతశక్తిరూపాయ సద్ధర్మ స్థాపనాయ చ ॥**
**నమస్తే కపిల రూపాయ దేవహూత్యై మహాత్మనే ।**
**వదతే సాంఖ్య యోగం చ సాంఖ్యాచార్యాయవై ప్రభో ॥**
**నమః పరమహంసాయ జ్ఞానం సంవదతే వరమ్ ।**

**విధాత్రే జ్ఞానరూపాయ యేనాత్మా సంప్రసీదతి ॥**
**వేదవ్యాసాయ వేదానాం విభాగం కుర్వతే నమః ।**
**హితాయ సర్వలోకానాం పురాణరచనాయ చ ॥**
**ఏవం మత్స్యాదితనుభిర్భక్త కార్యోద్యతాయ తే ।**
**సర్గస్థితిధ్వంస కర్త్రే నమస్తే బ్రహ్మణే ప్రభో ॥**

జ్ఞానస్వరూపుడవు, పరమాత్మవు అగు నీవు శ్రీకృష్ణ రూపమును దాల్చి, రాధతో గూడి విహరిస్తూ అనేక లీలలను వెలయించితివి. అట్టి నీకు నమస్కారము. ఓ లక్ష్మీపతీ! జైనరూపములో, బుద్ధరూపములో నిగూఢమగు అవతారమును దాల్చిన నీవు వేదములను నిందించి యోగా చార్యుడవైతివి. అట్టి నీకు నమస్కారము. అనంత శక్తి స్వరూపుడవగు నీవు కల్కి రూపమును దాల్చి మ్లేచ్ఛుల నంతమొందించి సద్ధర్మమును స్థాపించెదవు. అట్టి నీకు నమస్కారము. ఓ ప్రభూ! మహాత్ముడగు కపిలుని రూపము దాల్చి సాంఖ్యాచార్యుడవై సాంఖ్యయోగమును దేవహూతికి బోధించిన నీకు నమస్కారము. ఏ జ్ఞానముచే అంతః కరణము మిక్కిలి ప్రసన్నమగునో అట్టి పరమజ్ఞానమును బోధించువాడు, సృష్టిస్థితిలయకర్త, జ్ఞానస్వరూపుడు అగు పరమహంసకు నమస్కారము. సర్వజనుల హితమును గోరి వేదములను విభజించి పురాణములను రచించిన వేదవ్యాసుడు నీ స్వరూపమే. అట్టి నీకు నమస్కారము. ఓ ప్రభూ! ఈ తీరున నీవు మత్స్యాది అవతారములను దాల్చి భక్తుల కార్యమును చేయుటకు సంసిద్ధుడ వగుచుందువు. సృష్టిస్థితిలయములకు కారణమైన పరబ్రహ్మవు నీవే. నీకు నమస్కారము.

శ్లో॥ **ఆర్తిహంత్రేస్వదాసానాం సుఖదాయ శుభాయ చ ।**
**పీతాంబరాయ హరయే తార్క్ష్యయానాయతే నమః॥**
**సర్వక్రియాయైక కర్త్రే శరణ్యాయ నమో నమః ॥**
**దైత్యసంతాపితామర్త్య దుఃఖాదిధ్వంసవజ్రక ।**
**శేషతల్పశయాయార్క చంద్రనేత్రాయ తే నమః ॥**
**కృపాసింధో రమానాథ పాహి నశ్శరణాగతాన్ ।**
**జలంధరేణ దేవాశ్చ స్వర్గాత్సర్వే నిరాకృతాః ॥**
**సూర్యోనిస్సారితస్థానా చ్చంద్రో వహ్నిస్తథైవ చ ।**
**పాతాలాన్నాగరాజశ్చ ధర్మరాజో నిరాకృతః ॥**

**విచరంతి యథా మర్త్యాశ్శోభంతే నైవ తే సురాః ।**
**శరణంతే వయం ప్రాప్తా వధస్తస్య విచింత్యతామ్ ॥**

తన దాసుల కష్టములను పోగొట్టి సుఖములను, శుభములను ఇచ్చువాడు, పచ్చని వస్త్రమును ధరించువాడు, పాపములను పోగొట్టు వాడు, గరుడుడు వాహనముగా గలవాడు అగు నీకు నమస్కారము. క్రియలన్నింటినీ చేయు ఒకే ఒక కర్తవు నీవే. శరణు పొందదగిన నీకు నమస్కారములు. దైత్యులచే పీడింపబడుచున్న దేవతల దుఃఖములు మొదలగు వాటిని నశింపజేయుటలో వజ్రము వంటి వాడా! శేషశయ్యపై పరుండు వాడవు, సూర్య చంద్రులు నేత్రములుగా గల వాడవు అగు నీకు నమస్కారము. దయానిధీ! లక్ష్మీపతీ! శరణు పొందిన మమ్ములను రక్షించుము. జలంధరుడు స్వర్గమునుండి దేవతలనందరినీ వెళ్ళగొట్టినాడు, సూర్యచంద్రులను, అగ్నిని, యమధర్మరాజును అతడు తమతమ స్థానముల నుండి వెళ్ళగొట్టినాడు. పాతాళమునుండి వాసుకిని తరిమివేసినాడు. మానవుల వలె తిరుగాడుచున్న దేవతలలో శోభ అంతరించినది. మేము నిన్ను శరణు పొందుచున్నాము. వానిని వధించు ఉపాయమును ఆలోచించుము.

దేవతల దీనాలాపాలను విని కరుణా సముద్రుడైన పురుషోత్తముడు "ఓ బర్హిర్ముఖులారా! భయాన్ని విడిచి పెట్టండి. నేనిదే యుద్ధానికి సిద్ధమై వెడుతున్నాను. జలంధరుని తోడి జగడంలో నా విక్రమాన్ని చూపిస్తాను." – అని గరుత్మంతుని స్మరించాడు. వెంటనే వచ్చి వ్రాలిన వైనతేయుని అధిరోహించి పోరుకు బయలు దేరుతున్న వారిజ నాభుని సమీపించి అబ్ధి తనూజ ఐన ఆది లక్ష్మి ఇలా ప్రార్థించింది. "నాథా! నేను మీకు ప్రాణ ప్రియురాలు నైనచో, సర్వదా మీ భక్తురాల నైనచో...... ఓ దయానిధీ! నా తమ్ముడైన జలంధరుని వధించకండి." అనపాయిని ఐన ఆదిలక్ష్మి పలుకులకు సుముఖుడై పురుషోత్తముడిలా అన్నాడు. " దేవీ! క్షీరసాగర రాజ పుత్రీ! నీ మూలంగానే కదా నాకు శోభ సమకూరింది! నావైభవమంతా నీ తండ్రి గారిచ్చిందే కదా! నీ మాటను నేకాదన గలనా! మరొక్క మాట జలంధరుడు రుద్ర తేజోద్భవుడగుట వల్లను, బ్రహ్మ వాక్కు వల్లను, నీ అనురాగం వల్లను అవధ్యుడు. చింతమాని సంతోషంగా ఉండు."

అంత ప్రాణ వల్లభుడు తన మాటను మన్నించి నందుకు పరమానంద భరితురాలైన పద్మ సవిలాసంగా నాథుని వీక్షించి శుభాన్ని పలికింది. లోకంలో ప్రాణవల్లభ ఐన భార్యమాటను కాదనగల వాడెవ్వడు?

వెంటనే అచ్యుతుడు ఆయుధాలను ధరించి, వైనతేయుని అధిరోహించి, ఇంద్రాది బృందారకులతో కూడి, దానవుల స్కంధావారానికి వచ్చి చేరాడు. గరుత్మంతుని రెక్కల సుడిగాలి విసురుకు రాక్షసులు పెను తుఫానుకు ఎడారిలో రేగిన ఇసుకలా మీద కెగిరి క్రింద పడ్డారు. ఆ హఠాత్సంఘటనకు ఆశ్చర్య పోయిన జలంధరుడు విస్మితుడై క్షణంలో తేరుకొని తన గదతో గరుత్మంతుని తలపై మోదాడు. మోది కయ్యానికి కాలు దువ్వుతూ వచ్చిన వేలుపులను చూచి, కన్నుల నిప్పు కణికలు రాల, మాటల మంటలు రేగ, జబ్బలు చరిచి బొబ్బలు పెడుతూ, పుడమి వడకగా కాలుతో నేలను తన్ని...... తన రక్కసి మూకల పోటు బంటులైన శుంభ, నిశుంభ, తామ్రాక్ష, ధూమ్రాక్ష, కాకరాక్ష, ఖడ్గరోమ, కాలనేమి, కాలకేయాదులను ఆలంలో నిలిపి; తన చేతి ఆయుధాల తళతళలు నింగిని తాకి పెక్కు భంగుల మెరయ రౌద్రోద్రేకంతో సముద్రంలా విరుచుక పడిపోతూ, శూల పాణియై ఆహవంలో అకాల రుద్రుడై నిలిచాడు.... జలంధరుడు. రౌద్రం రూపు దాల్చినట్లున్న అతనిని చూచి నిలింపులు కంపించారు. కాని ...... వారి జాక్షుడు మన పక్షాన రక్షకుడై ఉన్నాడని అంతలోనే ఊరట చెందారు.

వియచ్చరులు అచ్చెరు వొంద దేవ దానవ సంగ్రామం ప్రారంభమైంది.

**విష్ణు జలంధర సంగ్రామం**

సంకుల సమరం సాగుతోంది. కేశవుడు తమకు బాసటగా ఉన్నాడనే ధైర్యంతో నిర్జరులు పాశ, అంకుశ, త్రిశూల, డమరు, ఢక్క, టంక, ఖట్వాంగాది సాధనాలతో రాక్షసులను హింసిస్తున్నారు. దైత్యులు అత్యుగ్రులై శూల, ముద్గర, గద, పరశు, తోమర, శక్తి నారస, క్షురికాది ఆయుధాలచే గీర్వాణులను సర్వాంగముల యందు నొప్పించి రక్తపు టేరులలో ముంచుతున్నారు. లెక్క కెక్కువ ఐన ఆ రక్కసి మూకలు, దేవతలను పట్టి కపాలాలను పగుల కొట్టుతూ, ముక్కులను కోస్తూ, చెవులు కొరుకుతూ, పండ్లను పీకుతూ, దౌవడలను చీలుస్తూ, మెడలు నులుముతూ, చేతులను నరుకుతు, ఔమ్ములను అదుముతూ, ప్రక్కలను వక్కళిస్తూ, ఎముకలను విరుస్తూ, కాళ్ళను మెలిపెడుతూ, నడుములను విర్గగొడుతూ, ప్రేగులను త్రెంచుతూ...... గదలతో మొత్తి, శూలాలతో పొడిచి, నారసాలతో గుచ్చి, కరవాలాలతో ఖండించి, అంపాలతో కోసి,...... భయభ్రాంతులను చేశారు. సుపర్వులందరు పర్వులెత్తారు.

వారి పాట్లు చూచిన విష్ణువు గరుడ వాహనా రూఢుడై ముందుకురికి శార్ఙ్గ (శార్ఙ్గ) కోదండ వినిర్ముక్త ప్రచండ బాణా హతిచే దైత్యుల తలలు నరకటం మొదలు

పెట్టాడు. దైతేయులు భీతులై వెన్ను చూపారు. వారిదైన్యాన్ని చూచిన జలంధరుడు శూలాన్ని పట్టి రెండవ త్రిశూలిలా విష్ణువు ముందు నిలిచాడు. వారిద్దరి మధ్య అనన్యోపమానంగా ప్రళయ భీకరంగా పోరు సాగింది. వారు గుప్పించిన బాణాలు ఉప్పరాని కెగసి ఆకాశానికి పందిరి వేసి నట్లైంది.

నారాయణుడు బాణాలతో దానవుని ధ్వజాన్ని, ధనుస్సును, ఛత్రాన్ని, తూణీరాన్ని ఎగర గొట్టాడు. దానికి భగ్గున మండిపడ్డ అసురుడు దిగ్గన క్రింది కురికి గదను చేపట్టి వేగంగా ముందుకురికి గదతో గరుడుని తలపై మోది హరి వక్షస్థలంపై శూలంతో పొడిచాడు. మాధవుడు క్రోధావేశుడై కౌమోదకి అనే తన గదను జలంధరుని పైకి విసిరాడు. అది జలంధరుని మెడలో పుష్పమాలై శోభించింది. అంత నారాయణుడు ప్రసన్నుడై రాక్షసేశ్వరునితో ఇలా అన్నాడు : "ఓ అసుర సార్వభౌమా! రణరంగంలో అవక్ర పరాక్రమాన్ని చూపిన నువ్వు ధన్యుడవు! ఇంత వరకు నేను నీపై ప్రయోగించిన ఆయుధ ప్రహారాలకు గతంలో ఎంతో మంది అసుర చక్రవర్తులు హతులయ్యారు. నీతో సమానమైన వీరుడు కానరాడు! సంతోషించాను. ఏదైనా వరం కోరుకో!"

లక్ష్మీ ధవుని వచనాలకు జలంధరుడు పరమానంద భరితుడై "బావా! నువ్వు అన్నమాట నిజమైతే, నువ్వు నీ గణాలతో కూడి నా చెల్లెలితో కూడి నా ఇంట్లో నివసించాలి." – అని వరంకోరాడు. దైత్యుని వింత కోరికకు కించిత్ ఖేదాన్ని పొందిన పద్మనాభుడు 'అటులనే అగుగాక!" అని పలికి; లక్ష్మీ సహితుడై, తన గణాలతో కూడి 'జలంధర' మను నగరానికి వచ్చి నివసించాడు. అప్పుడా దానవ రాజు అక్కడి దేవతల పదవులలో రాక్షసులను నియమించాడు. ఈ విధంగా స్వర్గము, వైకుంఠము లోని దేవతాధికార పదవులన్ని రాక్షసులచే నిండిపోయింది. జలంధరుడు భూమికి వచ్చి ప్రజలను కన్నబిడ్డల వలె కంటికి రెప్పలా కాపాడుతూ, ధర్మబద్ధంగా పరిపాలింప సాగాడు. అతని రాజ్యంలో వ్యాధిగ్రస్తులు గాని, దుఃఖితులుగాని, దీనులుగాని, యాచకులు గాని, కృశులు గాని...... ఒక్కడైనా లేడు. జారులుగాని, చోరులుగాని లేరు.

**జలంధరునికి నారదుని దుర్బోధ**

ఈ విధంగా ముల్లోకాధిపత్యాన్ని వహించి ధర్మబద్ధంగా జలంధరుడు పాలన చేస్తుండగా జ్ఞాతులైన దేవతలు దుః ఖితులయ్యారు. దుఃఖితులై శంకరు డొక్కడే మనకు దిక్కని యెంచి మనసులో స్తుతించగా, ఆ ప్రభువు నారదుని ప్రేరేపించాడు. నారదుడు జలంధర నగరానికి వచ్చి దేవతలను కలుసుకొన్నాడు. వారంతా తమ దుఃఖాన్ని దేవర్షి ముందు వెళ్ళబోసుకొని

"నారదా! సాక్షాత్తు లక్ష్మీదేవి ఆ దానవుని నగరంలో కొలువై ఉంటే మాకు ఇంకేమి మిగిలింది చెప్పు? నువ్వు ఉపాయశాలివి కనుక ఏదో ఒక ఉపాయాన్ని ఆలోచించి మమ్మలను ఈ కష్టాల నుండి తప్పించు. ఆ దైత్యుని మట్టుపెట్టే మార్గం కూడ ఆలోచించు" అని దీనంగా ప్రార్థించారు. నారదుడు వేలుపుల నూరడించి రాక్షసుని కొలువు కూటానికి వెళ్ళాడు. నారదాగమనాన్ని విన్న దైత్యవరుడు ఎదురేగి చేతులు జోడించి స్వాగత మర్యాదలు చేసి శాస్త్రోక్తంగా పూజించి "వచ్చిన పనిని ఆజ్ఞాపించండి." అని కోరగా; ఆ దేవర్షి పతన హేతువులైన పల్కులను సుధామధురంగా ఇలా పలికాడు.

"ఓ దానవ సార్వభౌమా! నువ్వు చాలా బుద్ధిమంతుడవు! సృష్ట్యాదిగా అనేక మంది రాక్షస సార్వభౌములను నేనెరుగదును. కాని వారెవరు బాహు పరాక్రమంలో గాని, బుద్ధి బలంలో గాని నీకు సాటిరారు ! సాక్షాత్తు లక్ష్మీ నారాయణులను నీ ఇంట్లో లేగదూడల్లా కట్టేసుకొన్నావు! ఇక నీకు లేనిదేముంది చెప్పు? చెరువు నీళ్ళలో ప్రతిబింబించిన చంద్రుని వలే..... అంత వైకుంఠం వచ్చి నీ సదనంలో ఒదిగి పోయింది. ఔరా!

అసలింతకు వచ్చిన పనేమి టంటే చెపుతాను విను! నేనీ మధ్య కైలాసం వెళ్ళాను. అది పదివేల యోజనాల విస్తీర్ణం కలది. అక్కడి రాళ్ళన్ని చింతామణులే! చెట్లన్ని కల్ప వృక్షాలే! గోవులన్ని కామధేనువులే! అశ్వాలన్ని ఉచ్చైశ్శ్రవాలే! మాతంగాలన్ని ఐరావతాలే! అసలు కైలాస శిఖరమే బంగారపు కొండ! అక్కడి వన్నీ అద్భుతాలే! అక్కడ పార్వతీ సహితుడైన పరమేశ్వరుని చూచాను. ఆ పార్వతి ఎంత అందంగా ఉందను కొన్నావు! ఇన్ని లోకాలు తిరిగాను గాని అంత శ్రేష్టమైన నారీ రత్నాన్ని చూడలేదు! సరే! అదలాఉంచు. ఆవిడ అందంతో మనకేం పని?

ఆ కైలాసాన్ని చూచాక నాకు మనసులో ఒక సందేహం కలిగింది. ఇంత సంపద ముల్లోకాల లోను ఇంకెక్కడైనా ఉందా? అని. అంతలో నీ సంపద గుర్తుకొచ్చింది. దాన్నొక సారి చూచి పోదామని వచ్చాను. అంతే!" నారదుని పల్కులకు ఉబ్బితబ్బిబ్బైన జలంధరుడు తన పూర్ణ సంపదను ప్రదర్శించాడు. దానిని చూచిన నారదుడు ఇలా అన్నాడు: " ఓ! దానవ వీరా! నిజంగానే నీ సంపద గొప్పది! నీకు లేనిదంటూ ఏమి లేదు. కాని ఒక్కటే కొరత కనుపిస్తోంది. నీ సంపదలో శ్రేష్టమైన స్త్రీ రత్నం లేదు. అది లేని నాడు ఇదంతా వ్యర్థమే!" నారీ శిరోమణి అనే మాట చెవిని పడేసరికి, ఆ రాక్షస వీరుడు మదనాకుల మానసుడై "నారదా! అట్టి స్త్రీ రత్నం నాకెక్కడ దొరుకుతుంది?" అన్నాడు వెంటనే.

తన పాచిక పారినందుకు పరమానంద భరితుడైన నారదుడు, పార్వతీదేవి సౌందర్యాన్ని వర్ణించి చెప్పి........“జలంధరా! ఏ యువతి లావణ్యాంబుధిలో మునిగి పితామహుడు సైతం తన ధైర్యాన్ని కోల్పోయాడో అట్టి చంద్రముఖి నీ ఆధీనంలో ఉంటే నీ సంపద శోభిస్తుంది.” – అని పలికి దూది రాశిలో నిప్పు రవ్వ వేసినట్లు అంటించి అంతర్ధాన మయ్యాడు.

**జలంధరుడు శివుని వద్దకు రాహువును దూతగా పంపుట**

నాడు మొదలుగా జలంధరుడు పార్వతీ దేవి సౌందర్యాన్నే భావన చేస్తూ కామజ్వర పీడితు డయ్యాడు. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల యందు ఆమె లావణ్యాన్నే తలపోస్తూ బుద్ధి నశించి; మోహవశుడై మూర్ఛ, ఉన్మాద స్థితులను గడిచి మృత్యు ముఖానికి చేరుకొన్నాడు. అంత్యకాలం సమీపించగా ఔచిత్యాన్ని కోల్పోయి ; రాహువును పిలిపించి అతనికి చెప్పవలసిన మాటలను చెప్పి........ పార్వతీ దేవిని తన స్వాధీనం చెయ్యమని శివునకు చెప్పవలసిందని దూతగా పంపాడు.

రాహువు తల ఎగరేసుకొంటూ కైలాసానికి చేరుకొని మృత్యుంజయుని సభా భవనంలోనికి నందీశ్వరుని ఆజ్ఞచే ప్రవేశించాడు. ఎదురుగా చంద్రశేఖరుడు, భుజగ భూషణుడు, మహాకాలుడు ఐన మహాదేవుని దర్శించి, నమస్కరించి భయ భక్తులతో దూతకార్యాన్ని అనుసరించి ఇలా అన్నాడు.

“ఓ వృషభ ధ్వజా! శంకరా! పరమేశ్వరా! దైత్య, పన్నగేంద్ర సేవితుడు, త్రిలోకాధిపతి ఐన జలంధరుని దూతననేను. బలవంతుడు, దేవతలకు మృత్యువుతో సమానమైన వాడు, గొప్ప దివ్య ప్రభావము కలవాడు, సృష్టిలోని సర్వ శ్రేష్ఠ వస్తువులకు అధిపతి, రాక్షస సమ్రాట్టు అగు ఆ జలంధరుని ఆజ్ఞను నా ముఖతః విని ఆపై తమకు తోచినట్లు చేయండి.

“నిత్యం శ్మశానంలో ఉండే వాడవు, కపాలాన్ని చేత ధరించిన వాడవు, ఎముకల మాలను వేసికొన్న వాడవు, దిగంబరుడవు అగు నీకు సర్వమంగళ ఐన ఈ హిమగిరి రాజతనయ ఎలా భార్య అయింది? తన రాజ్యంలోని శ్రేష్టమైన వస్తువులన్నీ రాజుకే చెందుతాయని కదా రాజనీతి. ముల్లోకాలకు అధిపతిని నేనే! కనుక ఈ లావణ్యనిధి ఐన పార్వతి నాకే చెందుతుంది. ఇంద్రుని ఐరావతం, ఉచ్ఛైశ్రవం, కల్పవృక్షం, కామధేనువు ఇవన్నీ నా పెరట్లో ఉన్నాయి! హంసలు పూన్చిన బ్రహ్మగారి విమానం నా ఇంటి ముందెప్పుడూ సిద్ధంగా ఉంటుంది! కుబేరుని నవనిధులను లాక్కొని నా ఇంట్లో పాతిపెట్టాను. ఒక టేమిటి!

అమరుల, అష్ట దిక్పాలకుల వైభవ శ్రీ అంతా నా అధీనంలో ఉంది! ప్రజలు రాజుకు సుఖాన్ని కలిగించాలి గదా!" – ఇంకా చెపుతూనే ఉన్నాడు రాహువు.

రాహువు మాటలను వింటూన్న ఫాలక్షుడు కనుబొమ్మలను చిట్లించాడు. వెంటనే భ్రూమధ్య నుండి రౌద్రుడు, సింహం వంటి నోరు కలవాడు, నిప్పులు కక్కు కన్నులు గలవాడు, పైకి లేచి నిలబడిన శిరోజములు కలవాడు, ఎత్తైన దేహం, పొడవైన బాహువులు, తాటి చెట్ల వంటి కాళ్ళు కలవాడు, శుష్కించిన దేహం కలవాడు అగు పురుషుడు పుట్టి వెంటనే రాహువు వైపు పరుగెత్తి పట్టుకొని మ్రింగ బోయాడు. వెంటనే రాహువు భయ కంపితుడై శంకరుని శరణు వేడి "శంభో! బ్రాహ్మణుడనైన నన్ను నీ కళ్ళముందే చంపేస్తున్నాడు. బ్రహ్మహత్యా పాపం నీకు చుట్టుకోకుండ నన్ను రక్షించు." అని ప్రార్థించాడు.

వెంటనే భక్తవత్సలుడైన శంభుడు, తన కింకరునితో "ఓ గణశ్రేష్ఠా! బ్రాహ్మణుడు దూత,శరణార్థి అయిన ఈ రాహువును శిక్షించకు. విడిచి పెట్టు." అని ఆజ్ఞాపించగానే స్వర్భానుని ఆకాశంలో స్వేచ్ఛగా వదిలేశాడు. వచ్చిన దారినే వెళ్ళాడు రాహువు. కింకిరుడంత శంకరుని సమీపించి "శంభో! కరుణానిధీ! నేను ఆకలితో మలమల మాడిపోతున్నాను. నువ్వు దొరికిన ఆహారాన్ని విడిచిపెట్ట మన్నావు! నాకు ఆహారాన్ని చూపించు." అని దీనంగా ప్రార్థించాడు. దానికి శంకరుడు "అంత ఆకలిగా ఉంటే నీ కాళ్ళు చేతుల మాంసాన్ని నువ్వే తిను!" అని ఆజ్ఞాపించగా వాడలాగే చేశాడు. వాడికిక శిరస్సు ఒక్కటే మిగిలింది. వాడు చేసిన భయంకర కర్మను చూచిన కపాలి విస్మితుడై "ఓ మహాగణా! నా ఆజ్ఞను వెంటనే చక్కగా పాలించిన నువ్వు ధన్యుడవు! సర్వదా నా కుమారుడవు. మహా గణుడవు. మహావీరుడవు. మహాబలుడవు. దుష్టులందరికి భయాన్ని కలిగించే నువ్వు ఈపైన 'కీర్తి ముఖుడు' అనే పేరుతో నా ద్వారం వద్ద ద్వార పాలకునిగా ఉండు. నన్ను పూజించ టానికి వచ్చిన భక్తులందరు ముందు నిన్ను పూజిస్తారు." అని వరమిచ్చాడు. నాటి నుండి కీర్తిముఖుడు దేవదేవుని ద్వారం వద్దనే ఉంటున్నాడు. అతనిని పూజించకుండ మహాదేవుని పూజిస్తే ఆ పూజ వ్యర్థం.

### రుద్రగణాలతో రాక్షసుల యుద్ధం

కీర్తి ముఖునిచే విడువ బడిన రాహువు ఆభీర దేశాన్ని చేరి జాతి బాహ్యుడై, చచ్చి బ్రతికినట్లు సంతోషించి మెల్లగా జలంధర నగరానికి చేరుకొని తన ప్రభువు సన్నిధిని జరిగిన దంతా మనవి చేశాడు. వెంటనే జలంధరుడు అత్యుగ్రుడై రాక్షస సైన్యాలను నమీకరించి యుద్ధ సరంభంతో శంభుని మీదికి దండు నడిపాడు. అతని ముందు అసుర గురువైన శుక్రుడు, తెగిన తలతో

రాహువు నడిచారు. మూడ బోయే కీడుకు నీడలో అనునట్లుగా గొప్ప ఉపద్రవాన్ని సూచించే అపశకునాలు అధికంగా తోచాయి. రథ వేగానికి రాక్షసేంద్రుడు తూలగా మణి మకుటం నేలపై పడింది. ధర కంపించింది. ధ్వజంపై గ్రద్దలాడాయి. ఎదురుగా వచ్చి మోరలెత్తి కుక్కలు మొరిగాయి.

దానవేంద్రుని యుద్ధ సన్నాహాన్ని విన్న పురందరాది దేవతలు పురుషోత్తమునితో కూడి ఉమాపతిని సమీపించి ఇలాస్తుతించారు. "ఓ దేవదేవా! మహాదేవా! నీకు నమస్కారం. శరణు పొందిన మమ్ములను రక్షించు. జలంధరుడు సృష్టించిన ఉపద్రవాలు నీవెరుగనివి కావు. నువ్వు పూర్వం మా రక్షణ కొరకు నారాయణుని సృష్టించావు. అతడీ రోజున రక్షింప అసమర్థుడు! అంతే కాదు లక్ష్మీ సహితుడై రక్కసుని ఇంట్లో బందీ అయ్యాడు. వెంటనే దానవ సంహారానికి పూనుకో."

ఆదిత్యుల పేద మాటలకు జాలిపడిన కాలకంఠుడు జలజాక్షుని పిలిచి "ఓ విష్ణు! నువ్వింత వరకు జలంధరుని వధించక పోవటానిక కారణమేమిటి?" అని ప్రశ్నించగా ఇందిరా రమణుడిలా అన్నాడు. "చంద్రశేఖరా! జలంధరుడు నీ అంశనుండి ఆవిర్భవించిన వాడు. సాగర పుత్రుడైన కారణంగా లక్ష్మికి సోదరుడు. ఈ రెండు కారణాల వలన నేనతనిని హతమార్చ లేదు. మరొక్క మాట నీ చేతిలో తక్క ఇతరుల చేతిలో అతనికి మరణం లేదు. కనుక వాని సంహారానికి నువ్వే ఉద్యమించు." హరి పల్కులకు 'సరే' అని అభయమిచ్చి పంపించాడు శంభుడు.

ఇంతలో రక్కసి ఱేడు దండుతో కూడి దుమ్ము రేపుకొంటూ కైలాసాన్ని ముట్టడించి, శంఖాన్ని పూరించి కేసరిలా గర్జించాడు. శంఖా రావాన్ని విన్న భర్గుడు ఉదగ్రుడై...... వీర భద్ర, వారణముఖ కార్తికేయ, నందీశ్వర, భృంగీశ్వరాదులను ఇతర ప్రమథ, రుద్ర గణాలను పోరుకు సిద్ధం చేశాడు. వారంతా కైలాస శిఖరాన్ని వీడి ఆయుధాలను చేపట్టి చివ్వకు సిద్ధమై నిలిచారు. రుద్ర గణాలకు రాక్షస గణాలకు మధ్యశస్త్రాస్త్ర సంకులమైన సమరం ప్రారంభమైంది. భేరి, మృదంగ, శంఖ ధ్వనులు వీరులకు ఉత్సాహాన్ని కల్పిస్తున్నాయి. ఏనుగుల ఘీంకారాలతో గుఱ్ఱాల సకిలింపులతో, రథాల చక్ర ధ్వనులతో యుద్ధభూమి ముయ్యేడు వారాలు ముసురు పట్టిననాటి ఆకాశంలా బీభత్సంగా ఉంది. ధానుష్కులు విడిచిన శర పరంపర వినువీధిని కప్పేసింది. శబరి నీరు తగిలిన గోదావరిలా రణరంగం రక్తసిక్తమైంది.

మృతులైన దైత్యులను శుక్రుడు తన మృత సంజీవినీ విద్యతో బ్రతికిస్తున్నాడు. ఆ విషయాన్ని రుద్ర గణాలు తెలుపగా రుద్రుడు ప్రళయకాల రుద్రుడై క్రోధావిష్టుడయ్యాడు. వెంటనే అతని ముఖం నుండి భయంకరమైన కృత్య (క్షుద్రశక్తి) ఆవిర్భవించి పర్వత గుహ వంటి నోరు తెరచి యుద్ధ భూమిలో రాక్షసులను భక్షిస్తూ శుక్రుని సమీపించి గరుడుడు సర్పాన్ని పట్టినట్లు భార్గవుని ఒడిసి పట్టి, క్షణంలో ఆకాశంలోనికి అంతర్ధానమైంది. వెంటనే సుడిగాలికి ఎగిరిన ఎండుటాకుల వలె అసుర సైన్యం భయంతో చెల్లాచెదురైంది.

వెంటనే శుంభ, నిశుంభ, కుంభ, నికుంభాది రక్షాగణాధ్యక్షులు వారి సైన్యం యొక్క దైన్యాన్ని చూచి మచ్చరించి పెచ్చు పెరిగి హెచ్చరిక మాటలాడి వారిని నిలువరించి ప్రావృట్కాల వర్షధారాపాతాన్ని మించి క్రూర నారాచాలను గుప్పించి ప్రమథ గణాలను పాతరలాడించారు. అలా ఉక్కు మిగిలి పోరాడుతున్న రక్కసి మూకల విక్రమాటోపానికి ఆగలేక పారిపోతున్న ప్రమథ గణాలను ప్రోత్సాహ వచనాలతో ఆపి; గజానన, షడానన, వీర భద్రాదులు ఆయుధాలతో సింహనాదం చేస్తూ ముందు కురికారు.

### గణాధ్యక్షుల యుద్ధం

ఇంత వరకు గణ వీరులు మాత్రమే జరిపిన యుద్ధంలో నిగ్గు తేలక పోయే సరికి; ఇరు పక్షాల గణాధ్యక్షులు పరస్పరం ద్వంద యుద్ధానికి తలపడ్డారు. కాలనేమి నందితోను, శుంభుడు విఘ్నేశ్వరునితోను, నిశుంభుడు కుమార స్వామితోను జగడం ప్రారంభించారు. ఏ కాలమందు కూడ అట్టి యుద్ధం జరగనేలేదు. సిద్ధ, సాధ్య, దేవర్షి, ముని గణాలన్ని వెరపుతో పరికిస్తున్నారు. గెలుపోటములు నిర్ధారితంకాక ఊగిసలాడుతుంటె .... దేవర్షి, ముని సంఘాలు ఆగ్రహాన్ని నిగ్రహించు కోలేక రాక్షసులను భస్మీపటలం చెయ్యటానికి కమండలు జలాన్ని చేత పట్టారు. వారణ ముఖుడు వారిని వారించి భీకరంగా ఘీకరించి శత్రుసైన్యాన్ని తొండంతో పట్టి కాళ్ళతో నలిపి వేయ సాగాడు. అతనికి వీరభద్రుడు తన గణాలతో తోడ్పాటుగా నిలిచాడు. రుద్ర గణాల ధాటికి రక్కసి మూకల ఉబ్బు అణిగింది.

అప్పుడు నిస్తేజంగా ఉన్న తన సేనను చూచి జలంధరుడు విక్రమాటోపంతో దండు మొగదల నిలిచి పౌజును ప్రోత్సహించి రుద్ర గణాధ్యక్షు లందరితోను తానొక్కడే, పోరు సలిపాడు. ఆ రక్కసి రేడు.... గదతో కుమార స్వామిని ప్రహరించి, శక్తితో వినాయకుని పడగొట్టి, పరిఘతో వీరభద్రుని శిరస్సును మోదాడు. వీరుడు నేల కూలాడు. అతని గణాలు జారి పోయాయి. పలాయితులైన గణవీరులు రుద్రునకు ఆ వార్త తెచ్చారు.

**శివజలంధరుల యుద్ధం**

వార్త విన్న కృత్తి వాసుడు వృషభవాహనారూఢుడై వచ్చి సంగ్రామ రంగంలో నిలిచాడు. ఉత్సాహం ఉరకలెత్తగా గణాలు ఆయన వెంట నిలిచి రక్కసులను గద్దించటం మొదలు పెట్టారు. దనుజ సైన్యం ఫాలాక్షుని చూచి వెఱపుతో పారిపోగా జలంధరుడు చేయూచి అడ్డగించి శంభుని మార్కొన్నాడు. రుద్రుడు క్రుద్ధుడై ఖడ్గ రోముని శిరస్సును పరశువుతో నరికాడు. వాని పాటు చూచి రోషంతో మీదికి దూకిన ఘస్మరాసురుని పాశంతోను, ప్రచండుని త్రిశూలంతోను కూల్చాడు. దనుజ సైన్యం సడలింది. ధైర్యాన్ని కోల్పోయిన దండును చూచి జలంధరుడు. "ఓ పోటు బంటు లారా! యుద్ధంలో భీరువులై పారిపోవటం వీర లక్షణం కాదు. పారి పోతూ ప్రాణాలను కోల్పోవటం కంటె మొనగాడై నిలిచి మడిసినా మేలు. ఉత్తమ స్థానాన్ని పొందుతారు. లోకంలో సూర్యమండలాన్ని ఛేదించి పరమ పదాన్ని పొందేవారు....... ఇద్దరే! ఒకడు.... తుచ్ఛమైన భౌతిక సుఖాలను రోసి సన్న్యసించిన జ్ఞాని (సన్న్యాసి) రెండవ వాడు......... ప్రపంచం మీద, భార్యా బిడ్డల మీద, చివరకు దేహం మీద కూడ ఏ విధమైన మమకారం లేక పాము కుబుసాన్ని విడిచినట్లు రణరంగంలో ప్రాణాలను త్యజించిన సంశప్తకుడు (విజయాన్ని సాధించకుండా తిరిగి రానని ప్రతిజ్ఞ చేసిన వీరుడు.)

జలంధరుడు ఎన్ని పోటు మాటలు పల్కినా వాని కదుపు పారుబోతులయ్యారు. రక్కసి రేడు మిక్కిలి క్రోధంతో ఫాలాక్షుని ముందు నిలిచి వీరాలాపా లాడుతూ సింహనాదం చేసి డెబ్బై బాణాలచే కొట్టాడు. వాటిని మధ్యలోనే నరికి వాని ధ్వజాన్ని, అశ్వాలను, ఛత్రాన్ని, ధనుస్సును ఛేదించాడు శంభుడు. ఛేదించి ఒకే ఒక్క బాణంతో వానిని దూరంగా విసిరి వేశాడు. అంతదైత్యుడు లేచి ఒడలు దులుపుకొని; ఎదుటపడి రుద్రుని నిగ్రహించ లేనని గ్రహించి గాంధర్వ మాయను ప్రయోగించాడు. ఆ మాయచే అనేక గంధర్వాప్సరో గణాలు ప్రభవించి; చతుర్విధ అభినయ నాట్యాలతో, వాయిద్యాలతో నటరాజైన శంకరుని ముందు నృత్యోత్సవాన్ని నిర్వహించారు. నృత్య సంగీత ప్రియుడైన ఆ నటరాజు, ఆ మాయలో పడి మైమరచి పోయాడు. చేతుల నుండి ఆయుధాలు జారిపోయినా గుర్తించలేక పోయాడు.

వెంటనే దానవేశ్వరుడు శంకరుని ముందు శుంభనిశుంభులను నిలపెట్టి తాను రుద్రాకృతిని దాల్చి వృషభారూడుడై శాంభవి చెంతకు చేరాడు. విచ్చేస్తున్నవాడు నిక్కపు ముక్కంటి అని భావించి ఉమాదేవి ఎదురేగి ఎదుట నిల్చింది. ఆమెను చూడగానే జలంధరుని జవ సత్వాలుడిగి జడుడయ్యాడు. అంత ఆ లోకమాత, రాక్షసుని వంచనను గుర్తించి క్షణంలో అంతర్హితురాలై మానస సరోవర ఉత్తర తీరానికి చేరింది. పార్వతిని గాంచ లేక దైత్యుడు తిరిగి యుద్ధభూమికి వెళ్ళాడు.

దానవుని దుష్ట బుద్ధిని అసహ్యించుకొన్న దుర్గ, మనసులో విష్ణువును స్మరించగా, ఆయన లిప్తలో సాక్షాత్కరించి చేతులు జోడించి నిలబడ్డాడు. అంత సర్వమంగళ దైత్యుని కపట వర్తనాన్ని దామోదరుని కెరిగించి "ఓ లక్ష్మీధవా! జలంధరుడు ఈ మోసకృత్యం ద్వారా మనకొక దారి చూపించి వాడి చావు వాడే కొని తెచ్చుకొన్నాడు. విష్ణూ! నువ్వు వెంటనే వాని మందిరానికి వెళ్ళి అతని భార్య యొక్క పాతివ్రత్య ధర్మాన్ని భ్రష్టు చెయ్యి. వాడి భార్య మంగళసూత్ర మహిమ చేతనే ఆ దుష్టుడింత కాలం ప్రాణాలను ధరించి ఉన్నాడు. స్త్రీలకు పాతివ్రత్యంతో సమానమైన ధర్మం ముల్లోకాలలోను లేదు. వానిని వధించటానికి మరియొక ఉపాయము లేదు. వెంటనే వెళ్ళు." – అని ఆజ్ఞాపించింది. విష్ణువు కపటముని వేషంలో జలంధరుని నగరానికి వెళ్ళాడు.

**బృందాదేవి పాతివ్రత్యాన్ని విష్ణువు భంగం చేయుట**

వెళ్ళి బృందాదేవి పాతివ్రత్యాన్ని భంగం చేయ సంకల్పించి నగర బాహ్యోద్యానంలో విడిది చేసి బృందకు ఒక స్వప్నాన్ని తన మాయా ప్రభావంచే కల్పించాడు. ఆమె తన భర్తఐన జలంధరుడు..... దున్న పోతును అధిరోహించి, దిగంబరుడై, శరీరమంతా నూనె రాసుకొని, నల్లని పుష్పాలను అలంకారంగా ధరించి, తల గొరిగించుకొని, రాక్షసగణాలచే సేవింపబడుతూ, దక్షిణ దిక్కుకు వెడుతూన్నట్లుగాను, తన నగరం తనతో కూడి సముద్రంలో మునిగి పోయినట్లు గాను, దుస్వప్నాన్ని కన్నది. ఆమె కింకా అనేక చెడ్డ కలలు వచ్చాయి. ఇంతలో మెలకువచ్చి తూర్పు దిక్కుకు చూడగా ఛిద్ర (రంధ్ర) సహితుడైన సూర్యుడు కనుపించాడు. వెలవెల పోయి ఉన్నాడు. తెల్లవారు జామున వచ్చిన దుస్వప్న ఫలితాన్ని తలపోస్తూ, భయవిహ్వలయై ఎక్కడకు వెళ్ళినా శాంతిని పొందలేక పోయింది. చివరకు తనకిష్టులైన ఇద్దరు చెలికత్తెలతో కూడి నగర బాహ్యోద్యాన వనానికి వచ్చి చేరింది. అక్కడ కూడ శాంతిని పొందలేక వనంలో తిరుగుతూనే ఉండగా.... క్రూరమైన దంష్ట్రలు కలవారు, సింహముఖం కలవారు భయంకర రూపులు ఐన ఇద్దరు రాక్షసులను చూసింది.

చూచి పెనుగాలికి కంపించే నును తీగలా వణికి పోతూ భయంతో పారిపోతుండగా; శిష్య సహితుడై శాంతంగా, మౌనంగా పద్మాసనస్థుడై కూర్చున్న ముని కనుపించాడు. ఆమె భయంతో దిక్కు తోచక తన బాహు లతలతో అతని కంఠాన్ని చుట్టి "ఓ సంయమి వర్యా! నిన్ను శరణు పొందిన నన్ను రక్షించు" అని దీనంగా విలపించింది. అపుడా ముని కన్నులు తెరచి చూచి గొప్ప హూంకారాన్ని చేశాడు. వెంటనే రాక్షసులు పలాయితులయ్యారు. దుష్టరాక్షసుల బారి నుండి తనను రక్షించిన, ఆ తపోధనునికి అంజలి బంధంతో ప్రణామా

లాచరించి కృతజ్ఞతలను చెప్పి బృందా దేవి ఇలా ప్రార్థించింది. "ఓ దయాసింధో! నాభర్త ఐన జలంధరుడు రుద్రునితో యుద్ధానికి వెళ్ళాడు, ఆయన క్షేమ సమాచారాన్ని సెలవియ్యండి."

బృందాదేవి పల్కులకు బదులియ్యక ఆ కపట ముని మౌనాన్ని వహించి ఒక్కసారి పైకి చూడగానే రెండు కోతులు వచ్చి అతనికి నమస్కరించి 'ఏమిటి ఆజ్ఞ'? అన్నట్లుగా నిల బడ్డాయి. కేవలం కనుబొమ్మల కదలికతో ముని ఇచ్చిన ఆజ్ఞను స్వీకరించి, అవి గగనానికి ఎగిరి త్రుటి కాలంలోనే తిరిగి వచ్చి జలంధరుని శిరస్సును, మొండేన్ని, చేతులను తీసుకొని వచ్చాయి. వాటిని చూచిన క్షణమే బృందాదేవి దుఃఖంతో మూర్ఛపోయింది. కొద్దిసేపటికి తేరుకొని భర్త శిరసును, అవయవాలను మళ్ళీ మళ్ళీ తడుముతూ, కన్నీరు మున్నీరుగా రోదించింది. రోదించి కొంచెం ధైర్యాన్ని పూని "మహర్షీ! ఓ కరుణా మూర్తి! స్త్రీకి భర్తకంటె ప్రియమైన వస్తువు లోకంలో మరేది ఉండదు కదా! మీ తపశ్శక్తితో నాప్రాణ వల్లభుని బ్రతికించి పసుపు కుంకుమలను నిలపండి. కాలునికి ప్రాణానికి ప్రాణం బదులు కావాలనుకొంటే నా ప్రాణాలను ఇస్తాను. ఆయనను బ్రతికించండి. మీరు అన్నిటా సమర్థులని నాకు తోస్తున్నది." అని నిట్టూర్పులు విడుస్తూ పాదాలంటి ప్రార్థించింది.

దానికి ఆ కపటముని మరణించిన వారిని బ్రతికించటం సాధ్యంకాదు. అందులోను రుద్రుని చేతిలో హతుడైన వాడెన్నటికి పునర్జీవితుడు కాడు. ఐనా శరణాగతుని రక్షించాలనే సనాతన ధర్మాన్ని ఎరిగిన నేను నీ పతిని తప్పక బ్రతికిస్తాను... అని ఆదరంగా పలికి జలంధరుని బ్రతికించి వెంటనే అంతర్హితు డయ్యాడు కపట ముని వేషంతో ఉన్న విష్ణువు. బృందాదేవి పునర్జీవితుడైన భర్తను అధిక ప్రేమతో ఆలింగనం చేసికొని ముద్దాడి పరమ సంతోషాన్ని పొందింది. జరిగిందంతా ఒక పీడకలలా భావించి భర్తతో వనమంతా విహరించి యదేచ్ఛగా సుఖించింది. ఒక రోజున భర్త రూపంలో ఉన్నవాడు విష్ణువే అని గుర్తించి బృందా దేవి తీవ్ర క్రోధంతో మండిపడి ఇలా శపించింది.

"ఓ! హరీ! పరస్త్రీ శీలాన్ని కపటోపాయంతో హరించిన నీ చరిత్రకు నిందయగు గాక! ఆ కపట ముని నీవే అని గ్రహించాను. విషములన్నింటిలోను తీక్షణమైన కాలకూటాన్ని మించిన తీక్షణతరమైన నా శాపాన్ని అనుభవించు. ఓ దైత్యారీ! పరధర్మవిదూషక! నీ అనుచరులిద్దరూ, భవిషత్తులో రాక్షసులై మాయచే నీ భార్యను అపహరించ గలరు. భార్యా వియోగ దుఃఖంతో అలమటిస్తూ అడవులలో సంచరిస్తావు. వనచరులు నీకు సహాయులు కాగలరు. నీ శిష్యుని వలె నటించిన, ఈ శేషుడు నీకు తోడు కాగలడు." ఇలా శపించి

బృందాదేవి, విష్ణు స్పర్శచే అపవిత్రమైన శరీరాన్ని అగ్నికి ఆహుతి చేసి పరిశుద్ధురాలైంది. ఆమె యొక్క సర్వో త్కృష్టమైన ఆ మహా తేజస్సు బృందారకాది బ్రహ్మర్షి గణం చూస్తుండ గానే శీఘ్రంగా శివలోకాన్ని చేరి పార్వతీదేవి యొక్క శరీరంలో కలిసి పోయింది. ఆకాశ సంచారులు హర్ష ధ్వానాలు చేశారు. విష్ణువు బృందాదేవి యొక్క చితాభస్మాన్ని శరీరమంతా పూసుకొని ఆమెనే స్మరిస్తూ ఉండి పోయాడు. సుర, సిద్ధ గణాలు ఎంత బోధించినా శాంతిని పొందలేక పోయాడు. ఈ విధంగా మహారాణి, కాలనేమి కుమార్తె, ఉత్తమురాలు అగు బృందాదేవి తన పాతివ్రత్య మహిమచే పరమ ముక్తిని పొందింది.

## జలంధర సంహారం

ఇక అక్కడ పార్వతి అంతర్హితురాలు కాగానే దైత్యేంద్రుడు యుద్ధరంగానికి వచ్చి చేరాడు. గంధర్వ మాయ విలీనం కాగానే శంకరుడు చైతన్యవంతుడయ్యాడు. ఇద్దరి మధ్య బాణ యుద్ధం ప్రారంభమైంది. జలంధరుడు తిరిగి గంధర్వ మాయను ప్రయోగించాడు. పార్వతిని రథానికి బంధించి శుంభ, నిశుంభులు, ఆమె కుత్తుక నుత్తరించిన దృశ్యాన్ని చంద్రశేఖరుడు చూచి క్షణకాలం నిర్విణ్ణుడయ్యాడు. వెంటనే జలంధరుడు మూడు వాడి బాణాలను రుద్రుని శిరస్సుకు, వక్ష స్థలానికి, ఉదరానికి గురి చూచి కొట్టగా అవి పిడి వరకు దిగ బడ్డాయి. త్రుటిలో రుద్రుడు జ్ఞాన సంపన్నుడై జ్వాలామాలాతి భీషణుడై ఉగ్ర రూపాన్ని ధరించాడు. జలంధర మాయ తొలగి పోయింది. శుంభ, నిశుంభులు రుద్రుని భయంకర రూపాన్ని చూచి భీతులై పలాయితు లయ్యారు. వారిని పరికించి శంభుడిలా శపించాడు. "ఓ శుంభ నిశుంభులారా! ఆలము నుండి తొలగి పోతున్న వారిని తెగటార్చటం యుద్ధ నీతి కాదు. నా నుండి మీరు మరణాన్ని తప్పించుకొన్నా పార్వతి చేతిలో మీకు మరణం తథ్యం."

తన సైన్యాధ్యక్షులను శపించిన శంభుని చూచి దైత్యుడు అత్యుగ్రుడై బాణ వర్షాన్ని కురిపించాడు. పెద్ద పరిఘతో వృషభాన్ని బలంగా మోదాడు. ఆ దెబ్బకు వృషభం రుద్రుడు లాగినా నిలువక వెనుకంజ వేసింది. అంత ముక్కంటి పగతుని తెగటార్చ సంకల్పించి ఎదలో వానిని అనుగ్రహించి, కాలి బొటన వ్రేలితో లీలగా సముద్రం నుండి భయంకరమైన చక్రాన్ని సృష్టించాడు. సృష్టించి "ఓ జలంధరా! ఈ చక్రాన్ని ఎత్త గలిగే బలం ఉంటే ఆలంలో నాతో నిలబడు. లేనిచో మగిడిపో" అని బిరుదు మాట లాడేడు.

దానికి జలంధరుడు నవ్వి కఱకంఠునితో ఇలా బీరపు మాటలాడేడు. "శంకరా! ఈ చక్రాన్నెత్తి దీనితోనే నీ గణాలను నిన్ను కూడా చక్కడగిస్తాను. నేను బాలుడనై ఉండగానే

వేలుపు పెద్దకు ఊపిరాడ కుండా కుత్తుక నొక్కాను. నా బాహువుల తీట పోగొట్టు కొనటానికి మేరు, మందర, నీల పర్వతాలను ఢీ కొట్టగా, అవి పొడియై నేలకు రాలాయి. నేను వేడుకగా ఆట లాడుతూ లీలగా బాహువులతో భాగీరథిని అడ్డగించాను. బడబాగ్నిని పట్టుకొని చేతితో దాని మూతిని మూయగా క్షణంలో సర్వము ఏక సముద్రమైంది. ఐరావతాది దిగ్గజాలను గులక రాళ్ళవలె ఎత్తి పారావారంలో పడవేశాను. వైనతేయునితో లక్ష్మితో కూడి విష్ణువును నాగపాశంతో నాగృహంలో బంధించాను."

ఇలా దిటవు మాట లాడి, అహంకారంతో బాహువులను అప్పళించి, పరుష వచనాలతో తిరస్కరించి, ఉపాలంభం చేసిన జలంధరుని చూచి రుద్రుడుగ్రుడై అవక్ర పరాక్రమంతో, అప్రతీప ప్రతాపంతో, నిర్వక్ర విక్రమంతో, అవార్య వీర్యంతో కోటి సూర్య ప్రతీకాశము, ప్రళయానలానిల సన్నిభము, పాలితాఖిల సుధాంధశ్చక్రము ఐన చక్రాన్ని, ప్రయోగించే సరికి అది క్షణంలో జలంధరుని తల నరకి తిరిగి రుద్రుని చెంతకు చేరింది. ఇంద్రుని వజ్రాయుధంచే నరుకబడి రెండు ముక్కలై సముద్రంలో పడిన అంజన పర్వతంలా; అతని తల, మొండెము రెండు కూడ రథం మీద నుండి పెద్ద శబ్దం చేస్తూ భూమి మీద పడ్డాయి. అతని రక్తంచే భూమి అంతా వికృతమైంది. రుద్రుని నియోగం చేత రక్తమాంసాదులు సర్వము మహా రౌరవ నరకానికి చేర్చబడి రక్తకుండం అయింది. అతని నుండి ఉద్భవించిన దివ్య తేజస్సు పరమేశ్వరునిలో లీనమైంది.

దేవ, గంధర్వ, సిద్ధ, సాధ్యులు కల్పవృక్ష ప్రసూనాలను కుసుమ వృష్టి కురిపించారు. దేవర్షి, సిద్ధ, ముని గణాలు నమక చమకాలతో రుద్రసూక్త పారాయణను ఉచ్చై స్వరంతో గానం చేశారు. కిన్నరాంగనలు సుస్వరంగా మధుర గీతాలను పాడుతూ బృంద నాట్యం చేశారు. దిక్కులన్ని ప్రసన్నము అయ్యాయి. వాయువు సుఖస్పర్శను చేకూర్చింది. తుహిన కరుడు పదహారు కళలతో ప్రకాశించగా అమరాంగనలు ప్రేమ విహ్వలు లయ్యారు. వెలుగు ఱేడు వెరపు తీరి వేయి కిరణాలతో విరాజిల్లాడు. అగ్నులు ప్రదక్షిణమార్గంలో జ్వలించాయి. అధ్వర క్రియలు ప్రారంభం కాగా ఆజ్యాహుతులు హోమ ధూమంతో ఆకాశం పరిమళించింది. త్రిలోకాలు స్వస్థతను పొందాయి.

**దేవతలు శివుని స్తుతించుట**

అంతటి మహాకార్యాన్ని నిర్వహించి నందుకు బ్రహ్మాది దేవతలందరు శంకరుని ఇలా స్తుతించారు.

**శ్లో॥** **దేవదేవ మహాదేవ శరణాగత వత్సల ।**
**సాధుసౌఖ్యప్రదస్త్వం హి సర్వదా భక్త దుఃఖహా ॥**
**త్వం మహాద్భుత సల్లీలో భక్తి గమ్యో దురాసదః ।**
**దురారాధ్యోఽసతాం నాథ ప్రసన్న స్సర్వదా భవ ॥**
**వేదోఽపి మహిమానంతే న జానాతి హితత్త్వతః ।**
**యథామతి మహాత్మానస్సర్వే గాయంతి సద్యశః ॥**
**మహాత్మ్యమతి గూఢంతే సహస్రవదనాదయః ।**
**సదా గాయంతి సుప్రీత్యా పునంతి స్వగిరం హి తే ॥**
**కృపయా తవ దేవేశ బ్రహ్మజ్ఞానీ భవేజ్జడః ।**
**భక్తి గమ్యస్సదా త్వం వా ఇతి వేదా బ్రువంతి హి ॥**
**త్వం వై దీనదయాలుశ్చ సర్వత్ర వ్యాపకస్సదా ।**
**ఆవిర్భవసి సద్భక్త్యా నిర్వికారస్సతాం గతి ః ॥**
**భక్త్యైవ తే మహేశాన బహవస్సిద్ధి మాగతాః ।**
**ఇహ సర్వసుఖం భుక్త్వా దుఃఖితా నిర్వికారతః ॥**

**తా॥** ఓ దేవదేవా! మహాదేవా! శరణు జొచ్చు వారిని ప్రేమతో రక్షించువాడా! నీవు సర్వకాలములయందు సాధుపురుషులకు సౌఖ్యముల నొసంగెదవు; మరియు భక్తుల దుఃఖములను పోగొట్టెదవు. గొప్ప అద్భుతమైన పవిత్రలీలలు గల నీవు భక్తిచే పొందదగుదువు. దుష్టులకు నిన్ను ఆరాధించుట గాని, పొందుటగాని సంభవము కాదు. ఓ నాథా! నీవు సర్వకాలములలో ప్రసన్నుడవు కమ్ము. వేదము కూడ నీ మహిమను యథాతథముగా నెరుంగదు. మహాత్ములందరు తమ బుద్ధికి అందినంతవరకు నీ పవిత్రకీర్తిని గానము చేయుచున్నారు. ఇంద్రాదులు అతి రహస్యమగు నీ మహిమను సర్వకాలములలో మిక్కిలి ప్రీతితో గానము చేసి తమ వాక్కును పవిత్రము చేసుకొనుచున్నారు. ఓ దేవ దేవా! నీ దయచే మూర్ఖుడు బ్రహ్మజ్ఞాని అగును. నీవు సర్వదా భక్తిచే పొందదగుదువని వేదములు చెప్పుచున్నవి. వికారములులేని వాడవు. సత్పురుషులకు శరణ్యుడవు, దీనుల పాలిటి రక్షకుడవు, సర్వవ్యాపకుడవగు నీవు సర్వదా మంచి భక్తిచే సాక్షాత్కరించెదవు. ఓ మహేశ్వరా! అనేకులు నీ భక్తిచేతనే సిద్ధిని పొందినారు. వారు ఇహలోకములో సర్వ సుఖములను అనుభవించినప్పుడు, మరియు దుఃఖమును పొందినప్పుడు వికారమును పొందలేదు.

శ్లో॥ పురా యదుపతిర్భక్తో దాశార్హస్సిద్ధిమాగతః ।
కలావతీ చ తత్పత్నీ భక్త్యైవ పరమాం ప్రభో ॥
తథా మిత్రసహో రాజా మదయంతీ చ తత్ప్రియా ।
భక్త్యైవ తవ దేవేశ కైవల్యం పరమం యయౌ ॥
సౌమినీ నామ తనయా కైకే యా గ్రభువస్తథా ।
తవ భక్త్యా సుఖం ప్రాప పరం సద్యోగిదుర్లభమ్ ॥
విమర్షణో నృపవరస్సప్త జన్మానథి ప్రభో భుక్త్వా ।
భోగాంశ్చ వివిధాం స్త్వద్భక్త్యా ప్రాప సద్గతిమ్ ॥
చంద్రసేనో నృపవరస్త్వద్భక్త్యా సర్వభోగభుక్ ।
దుఃఖ ముక్తస్సుఖం ప్రాప పరమత్ర పరత్రచ ॥
గోపీపుత్రశ్శ్రీకరస్తే భక్త్యా భుక్త్వేహ సద్గతిమ్ ।
పరం సుఖం మహావీరశిష్యః ప్రాప పరత్రవై ॥
త్వం సత్యరథ భూజానేర్దుఃఖహర్తా గతిప్రదః ।
ధర్మగుప్తం రాజపుత్రమతార్షీస్సుఖినం త్వీహ ॥

**తా॥** ఓ ప్రభూ! పూర్వము యందువంశమునకు ప్రభువు భక్తుడు అగు దాశార్హుడు, మరియు అతని భార్యయగు కలావతి భక్తిచేతనే పరమసిద్ధి (మోక్షము) ని పొంది యున్నారు. ఓ దేవదేవా! అదేవిధముగా, మిత్రసహ మహారాజు మరియు అతని ప్రియురాలగు మదయంతి నీయందలి భక్తి చేతనే పరమకైవల్య (మోక్ష)మును పొందినారు. కేకయమహారాజు యొక్క అన్నగారి కుమార్తె యగు సౌమిని అదే విధముగా నీ యందలి భక్తిచే మహాయోగులకైననూ లభించని పరమసుఖము (మోక్షము) ను పొందెను. ఓ ప్రభూ! విమర్షణ మహారాజు నీ భక్తిచే ఏడు జన్మలవరకు అనేక భోగములనను భవించి ఉత్తమ గతి (మోక్షము)ని పొందెను. చంద్రసేన మహారాజు నీ భక్తిచే దుఃఖము నుండి విముక్తుడై ఇహలోకములో భోగముల నన్నింటినీ అనుభవించి దేహత్యాగానంతరము పరసుఖమును పొందెను. గొల్లయువతి పుత్రుడు, మహావీరుని శిష్యుడు అగు శ్రీకరుడు నీ భక్తిచే ఇహలోకములో గొప్ప సుఖముననుభవించి పరలోకములో సద్గతిని పొందెను. నీవు సత్యరథ మహారాజు యొక్క దుఃఖమును పోగొట్టి సద్గతినొసంగితివి. నీవు రాజకుమారుడగు ధర్మ గుప్తనకు ఇహలోకములో సుఖముల నొసంగి సంసార సముద్రమును దాటించితివి.

శ్లో॥ తథా శుచివ్రతం విప్రమదరిద్రం మహాప్రభో ।
త్వద్భక్తవర్తినం మాత్రా జ్ఞానినం కృపయాఽ కరోః ॥
చిత్రవర్మా నృపవరస్త్వద్భక్త్యా ప్రాప సద్గతిమ్ ।
ఇహలోకే సదా భుక్త్వా భోగానమరదుర్లభాన్ ॥
చంద్రాంగదో రాజపుత్ర స్సీమంతిన్యా స్త్రియాసహ ।
విహాయ సకల దుఃఖం సుఖీ ప్రాప మహాగతిమ్ ॥
ద్విజో మందరనామాపి వేశ్యాగామీ ఖలోఽధమః ।
త్వద్భక్తశ్శివ సంపూజ్య తయా సహ గతిం గతః ॥
భద్రాయుస్తే నృపసుతస్సుఖమాప గతవ్యథః ।
త్వద్భక్తకృపయా మాత్రా గతించ పరమాం ప్రభో ॥
సర్వస్త్రీ భోగ నిరతో దుర్జనస్తవ సేవయా ।
విముక్తోఽభూదపి సదాఽభక్ష్యభోజీ మహేశ్వర ॥
శంబరశ్శంకరే భక్త శ్చితా భస్మ ధరస్సదా ।
నియమాద్భస్మనశ్శంభో స్వస్త్రి యా తేపురం గతః ॥

**తా॥** ఓ మహాప్రభూ! నీ భక్తి యందు స్థిరముగా నున్న శుచివ్రతుడను బ్రాహ్మణునకు అతని తల్లితో సహా దయతో జ్ఞానమునిచ్చి అతని దారిద్ర్యమును తొలగించితివి. చిత్రవర్మమహారాజు నీయందలి భక్తిచే ఇహలోకములో సర్వదా దేవతలకు కూడ లభింప శక్యముకాని భోగముల ననుభవించి సద్గతి పొందెను. చంద్రాంగదుడనే రాజకుమారుడు తన భార్యయగు సీమంతినితో గూడి సకల దుఃఖముల నుండి విముక్తుడై సుఖములను, ఉత్తమ గతిని పొందెను. ఓ శివా! వేశ్యతో తిరుగువాడు, దుష్టుడు, అధముడు అగు మందరుడనే బ్రాహ్మణుడు కూడ నీ భక్తుడై నిన్ను చక్కగా పూజించి ఆమెతో సహా సద్గతిని పొందినాడు. భద్రాయుడనే రాజకుమారుడు నీభక్తుని దయచే, మరియు నీ దయచే దుఃఖవినిర్ముక్తుడై తల్లితో గూడి సుఖములను పొంది పరమపదమును చేరినాడు. హే ప్రభూ మహేశ్వరా! స్త్రీలందరితో భోగమునందాసక్తి గలవాడు, సర్వదా తినకూడని పదార్థములను తినువాడు నగు దుష్టుడు కూడ నిన్ను సేవించి మోక్షమును పొందును. ఓ శంభూ! శంకర భక్తుడు, సర్వదా విభూతిని దాల్చువాడు నగు శంబరుడు విభూతి ధారణ నియమము వలన తన భార్యతో గూడి నీ పురమును చేరినాడు.

శ్లో॥ భద్రసేనస్య తనయస్థథా మంత్రిసుతః ప్రభో ।
సుధర్మ శుభకర్మాణౌ సదా రుద్రాక్షధారిణౌ ॥
త్వత్కృపాతశ్చ తౌ ముక్తావాస్తాం భుక్త్వేహ సత్సుఖమ్ ।
పూర్వజన్మని యౌకీశకుక్కుటౌ రుద్రభూషణౌ ॥
పింగలా చ మహానందా వేశ్యే ద్వే తవ భక్తితః ।
సద్గతిం ప్రాపతుర్నాథ భక్తోద్ధార పరాయణ ॥
శారదా విప్ర తనయా బాలవైధ్యవ్యమాగతా ।
తవ భక్తేః ప్రభావాత్తు పుత్ర సౌభాగ్యవత్యభూత్ ॥
బిందు గో ద్విజమాత్రో హి వేశ్యా భోగీ చ తత్ప్రియా ।
వంచుకా త్వద్యశశ్రుత్వా పరమాం గతి మాయయౌ॥
ఇత్యాది బహవస్సిద్ధిం గతాజీవాస్తవ ప్రభో ।
భక్తి భావాన్మహేశాన దీనబంధో కృపాలయ ॥
త్వం పరః ప్రకృతేర్బ్రహ్మ పురుషాత్పరమేశ్వర ।
నిర్గుణస్త్రి గుణాధారో బ్రహ్మావిష్ణు హరాత్మకః ॥
నానా కర్మ కరో నిత్యం నిర్వికారోఽఖిలేశ్వరః ।
వయం బ్రహ్మాదయస్సర్వే తవ దాసా మహేశ్వర ॥
ప్రసన్నో భవ దేవేశ రక్షాస్మాన్ సర్వదా శివ ।
త్వత్ప్రజాశ్చ వయం నాథ సదా త్వచ్ఛరణం గతాః ॥

**తా॥** ఓ ప్రభూ! భద్రసేనుని కుమారుడగు సుధర్ముడు, మరియు మంత్రిపుత్రుడగు శుభకర్ముడు సర్వదా రుద్రాక్షలను ధరించి, నీ అనుగ్రహమువలన ఇహలోకములో ఉచితమగు సుఖముననుభవించి ముక్తిని పొందిరి. పూర్వజన్మలో కోతి, కోడి యైన వారిద్దరు రుద్రునకు అలంకాములైరి. ఓ నాథా! భక్తుల ఉద్ధారమే ప్రముఖకార్యముగా గలవాడా! పింగళ, మహానంద అను ఇద్దరు వేశ్యలు నీ భక్తి వలన సద్గతిని పొందిరి. బ్రాహ్మణుని కుమార్తెయగు శారద బాల్యములో భర్తృ వియోగమును పొంది నీ భక్తి యొక్క ప్రభావమువలన పుత్ర ప్రాప్తి అనే సౌభాగ్యమును పొందెను. నామమాత్ర బ్రాహ్మణుడు,వేశ్యాలంపటుడునగు బిందుగుడు మరియు వాని ప్రియురాలగు వంచుక నీ కీర్తిని విని, పరమగతిని పొందిరి. ఓ ప్రభూ! మహేశ్వరా! దీనబంధూ! కృపాసముద్రా! ఈ తీరున అనేక జీవులు నీయందు

భక్తిభావము కలుగుట వలన సిద్ధిని పొందిరి. ఓ పరమేశ్వరా! నీవు ప్రకృతి పురుషాతీతమగు నిర్గుణ బ్రహ్మావు. నీవు త్రిగుణములను స్వీకరించి బ్రహ్మ విష్ణు రుద్రులను రూపములను దాల్చినావు. మహేశ్వరా! నీవు వివిధ కర్మలను ఆచరిస్తున్నను నిర్వికారుడవు. బ్రహ్మాదులమైన మేమందరము సర్వేశ్వరుడైన నీకు దాసులము. దేవదేవా! ప్రసన్నుడవై మమ్ము ఎల్లవేళలా రక్షించు. శివా! నీ సంతాన మైన మేము నిన్ను శరణు పొంది యున్నాము.

ఇలా ప్రస్తుతించిన అమరులను చూచి ప్రసన్నుడైన పరమేశ్వరుడు వారికి వరాలిచ్చి అంతర్హితు డయ్యాడు. తక్కిన వారంతా యథా స్థానాలకు చేరుకొన్నారు. శివ భక్తులు, పరమ పుణ్యదంపతులు ఐన జలంధర – బృందా దేవుల గాథను, ఈ దేవతల స్తుతిని ఎవరు పఠిస్తారో, లేదా వింటారో వారికి పాపాలు నశించి, ఇహ పరాలలో శాంతి సౌభాగ్యాలు లభిస్తాయని శంకరుడు వరమిచ్చాడు.

**రుద్రుడు విష్ణువు యొక్క మోహాన్ని తొలగించుట**

తర్వాత ఆ మరునాడు దేవతలు శంభుని దర్శించి తలలు వంచి మిన్నకుండి పోయారు. వారిని చూచి రుద్రుడిలా అన్నాడు: "ఓ! దేవతలారా! జలంధరుడు నా అంశ నుండి జన్మించిన వాడే ఐనా మీ అభ్యుదయం కొరకు పరిమార్చాను. ఇంకా మీకు సుఖం కలుగ లేదా? మీ మనో గతాన్ని చెప్పండి. తప్పక నెరవేరుస్తాను." దానికి సమాధానంగా గీర్వాణులిలా అన్నారు. "గంగాధరా! నువ్వు నిస్సందేహంగా దేవతలకు మహోపకారం చేశావు. ఇప్పుడు మరొక మనో వికలత్వం వచ్చి పడింది. ఓ ప్రభూ! దేవ కార్యార్థం విష్ణువు బృందా దేవిని మోహింప చేయగా ఆమె అగ్నిప్రవేశం చేసిన సంగతి దేవరకు తెలుసు. అప్పటి నుంచి ఆమె సౌందర్యంచే మోహితుడై ఆమె చితా భస్మాన్ని ధరించి భ్రమలోపడి అక్కడే తిరుగున్నాడు మాధవుడు. మేమందరము చెప్పి చూశాం! నీ మాయలో చిక్కిన జనార్దనుడు బృందమీది మమతను చంపు కోలేక ఆ వ్యామోహం నుండి బయట పడలేక పోతున్నాడు. వైకుంఠం కళ తప్పింది. అక్కడ ఇప్పుడే వేడుకలు లేవు. సర్వేశ్వరా! ప్రకృతి నుండి పుట్టిన ఈ జగత్తు నీ అధీనంలో ఉంది. నువ్వు వచ్చి మాయలో మునిగి ఉన్న విష్ణువుకు జ్ఞానబోధ చేయి".

బృందారకులు చేసిన విన్నపానికి గంగాధరుడు మందహాసం చేసి ఇలా ఉపదేశించాడు: "ఓ బ్రహ్మాది దేవతలారా! సర్వలోక మోహనమైన నా మాయ దురతిక్రమం. జగత్తు అంతా దానికి లోబడి ఉంది. ప్రకృతి మాయా మోహితుడైన విష్ణువు ఇప్పుడు కామాధీనుడై ఉన్నాడు. మూల ప్రకృతి అయిన ఆ మాయ, పార్వతి అను పేరుతో అందరికి

ఆనందాన్ని ఇస్తున్నది. ఆమె త్రిమూర్తులకు తల్లి. 'శివా' అను నామధేయం కలది. ఆమెను ప్రార్థించండి. మీ కార్యం నెరవేరుతుంది." వెంటనే శ్రద్ధా భక్తులతో ఆమెను వేలుపులిలా స్తుతించారు.

**శ్లో ॥ యదుద్భవా స్సత్త్వరజస్తమోగుణా ।**
**స్సర్గ స్థితి ధ్వంస విధాన కారకా ॥**
**యదిచ్ఛయా విశ్వమిదం భవాభవౌ ।**
**తనోతి మూల ప్రకృతిం నతాస్స్మతామ్ ॥**
**పాహిత్రయోవింశ గుణాన్ సుశబ్ధితాన్ ।**
**జగత్యశేషే సమధిష్ఠితా పరా ॥**
**యద్రూప కర్మాణి జగత్త్రయేఽపితే ।**
**విదుర్న మూల ప్రకృతిం నతాస్స్మతామ్ ॥**
**యద్భక్తి యుక్తాః పురుషాస్తు నిత్యం ।**
**దారిద్ర్య మోహాత్యయ సంభవాదీన్ ॥**
**న ప్రాప్ను వంత్యేవ హి భక్తవత్సలా ।**
**సదైవ మూల ప్రకృతిం నతాస్స్మతామ్ ॥**
**కురు కార్యం మహాదేవి దేవానాం నః పరేశ్వరి ।**
**విష్ణు మోహం హర శివేదుర్గే దేవి నమోఽస్తుతే ॥**

**తా ॥** దేని నుండి సత్త్వరజస్తమో గుణములనే త్రిగుణములు పుట్టాయో, ఏది సృష్టి స్థితి లయములను కర్మలను అనుష్ఠిస్తున్నదో, దేని సంకల్పంచే ఈ విశ్వం జనన మరణాలను పొందుతూ ఉన్నదో అట్టి మూల ప్రకృతికి నమస్కారం. సంపూర్ణమైన ఈ జగత్తు నందు సుశబ్దములచే, సుస్పష్టంగా ప్రకటింప బడిన ఇరువది మూడు గుణాలను సమన్వయ పూర్వకంగా అధిష్ఠించి ఉన్న పరాశక్తి మమ్ము రక్షించుగాక! ముల్లోకముల లోని జనులు ఏ దేవి యొక్క రూపమును, కర్మలను ఎరుగరో అట్టి మూల ప్రకృతిని నమస్కరిస్తున్నాను. జనులు దేని యందు భక్తి శ్రద్ధలు కలిగి ఉంటే ..... సర్వదా దారిద్ర్యము, అజ్ఞానము, చావు - పుట్టుకలు వీటిని నిశ్చయంగా పొందరో అట్టి భక్తివత్సలయగు మూలప్రకృతికి నమస్కారం. ఓ మహాదేవి! పరమేశ్వరీ! మా కార్యాన్ని నెరవేర్చు. ఓ శివా! దుర్గాదేవీ! విష్ణువు యొక్క మోహాన్ని తొలగించు నీకు నమస్కారం.

ఓ దుర్గా! దామోదరుడు బృందా దేవిని మరచి పోలేక ఆమె చితా భస్మాన్ని ఒడలంతా పూసుకొని మతిలేనివాడై అక్కడే తిరుగుతున్నాడు. వైకుంఠం వెలవెల పోయింది. మా ప్రయత్నాలు వ్యర్థమయ్యాయి. అమ్మా! ఇదంతా ప్రకృతి స్వరూపిణి వైన నీ మాయ! విష్ణువు తిరిగి స్వస్థుడై తన లోకాన్ని చేరేటట్లు జ్ఞానబోధ చేయి. ఆయనను లోక పాలకునిగా నిలపెట్టు.

ఇలా స్తుతిస్తున్న దేవతలకు దిగంత వ్యాప్తము, పరమ శాంతము ఐన తేజో మండలం ఆకాశంలో ప్రత్యక్షమై దాని మధ్యనుండి దివ్యవాణి ఈ విధంగా వినిపించింది. "ఓ వేలుపు లారా! మూల ప్రకృతినైన నేను గౌరీ, లక్ష్మీ, సరస్వతి అను మూడు రూపాలను ధరించి ఉన్నాను. మీరు వారిని ఆశ్రయించండి. నా ఆజ్ఞచే వారు మీ కోర్కెను సఫలం చేస్తారు. ఇలా పలికి ఆ తేజస్సు అంతర్హితమైంది. ఆకాశవాణి వాక్యాలను ఆదరంతో విన్న వేల్పులంత విస్మితులై పరమ భక్తితో గౌరి, లక్ష్మీ, సర్వస్వతులకు ప్రణమిల్లి స్తుతించగా ఆ దేవీ మూర్తులు స్వస్వరూపంతో సాక్షాత్కరించారు. గీర్వాణులు వారిని పొగడి తమ కార్యాన్ని విన్నవించారు. ప్రసన్నలైన ఆ దేవీ మూర్తులు వారికి బీజాలనిచ్చి..... విష్ణువు ఉన్న స్థానంలో నాటమని ఆదేశించి మీ కార్యం సిద్ధిస్తుందని వరమిచ్చి అదృశ్యులయ్యారు.

వెంటనే వారందరు బృందా దేవి అగ్ని ప్రవేశం చేసిన చితా భూమిని చేరుకొన్నారు. అక్కడ బృందాదేవి కొరకు జుట్టు పీక్కొంటూ పిచ్చివానిలా రోదిస్తున్న విష్ణువును చూచి విస్మితులై ఆ చితాభూమి యందు బీజాలను నాటి దేవీ మూర్తులను పొగడుతూ నిల్చున్నారు. జాగు లేకుండ ఆ బీజాల నుండి గౌరీ దేవి అంశగా తులసి, లక్ష్మీ దేవి అంశగా మల్లె, సరస్వతి అంశగా ధాత్రి (ఉసిరిక) అను మూడు మొక్కలు ఉద్భవించాయి. మహా లావణ్య రత్నాకర మనదగిన స్త్రీ రూపాలలో వ్యక్తమైన ఆ మూడు మొక్కలను చూడగానే దామోదరుడు వాటిపై మరులు గొని లేచి నిల్చుని వలపు రెట్టించగా అపరిమితాను రాగంతో వాటిని రెప్ప వేయకుండ చూచాడు. తులసి, ధాత్రి కూడా హరిని ప్రేమతో చూచారు. మల్లె ఈర్ష్యతో చూచింది.

పూర్వం లక్ష్మీ దేవి నుండి ఏ బీజం సమర్పింప బడిందో ఆ బీజం నుండి పుట్టిన 'మల్లె పడుచు' ఆ కారణం చేతనే విష్ణువు యందు ఈర్ష్యా భావాన్ని పొందింది. అందుకనే మల్లె గర్హితమైన 'బర్బరి' అనే నిందా నామాన్ని పొందింది. ధాత్రి మరియు తులసి మొక్కలు మాధవునిపై మమత చూపిన కారణంగా ఆయనకు సదా ప్రీతి పాత్రములయ్యాయి.

అప్పుడు విష్ణువు దుఃఖాన్ని వీడి స్వస్థుడై వారిద్దరితో కూడి సుపర్వులు జయజయ ధ్వానాలు చేస్తూండగా సంతోషంతో వైకుంఠాన్ని చేరాడు. కార్తీక మాసంలో ధాత్రి మరియు తులసి పూజ సర్వదేవతలకు విశేషించి విష్ణువుకు మిక్కిలి ప్రీతికరం. రెంటిలోను తులసి మరింత ధన్యము, శ్రేష్ఠమూను తులసి గౌరీదేవి అంశ అయిన కారణంగా ఒక్క వినాయకుని తప్ప మిగతా దేవతలను తులసితో పూజించవచ్చు. తులసి సర్వదేవతలకు ప్రీతిని కలిగించి తనను కొల్చిన వారి కోర్కెలను తీరుస్తుంది. ఈ గాథ సర్వపాపహరము, సర్వకామ ప్రదమూను."

## శంఖచూడుని జననం

సూతుడు శౌనకాది మహర్షులతో ఇలా అంటున్నాడు. "ఓ ఋషులారా! శ్రవణ మాత్రం చేతనే శివభక్తి దృఢమయ్యే శంఖచూడుని వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి.

మరీచి ప్రజాపతి యొక్క కుమారుడే కశ్యప మహర్షి. ఆయన ధర్మాత్ముడు. దక్షుడు తన కుమార్తెలలో పదముగ్గురు కుమార్తెలను కశ్యపున కిచ్చి వివాహం చేశాడు. దేవ దానవులతో కూడి స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తంతా వారి సంతానమే. కశ్యపుని భార్యలలో దనువు అనే ఆమెకు మహా బలశాలులైన అనేక మంది పుత్రులున్నారు. అందులో ఒకడు విష్ణుచిత్తుడు. అతని పుత్రుడు దంభుడు చాలా ధర్మాత్ముడు, జితేంద్రియుడు విశేషించి విష్ణుభక్తుడు. అతనికి పుత్ర సంతానం లేని కారణంగా దుఃఖించి శుక్రుని గురువుగా భావించి కృష్ణ మంత్రాన్ని స్వీకరించి పుష్కర తీర్థంలో లక్ష సంవత్సరాలు గొప్ప తపస్సు చేశాడు. స్థిరాసనంలో ఉండి చిరకాలం కృష్ణ మంత్రాన్ని ఏకాగ్రతతో జపించాడు. అతని శిరస్సు నుండి దుస్సహమైన తేజస్సు ఉద్భవించి సర్వత్ర వ్యాపించగా దానిని భరించ లేక ఇంద్రాది బృందారకులు వాణీపతిని ఆశ్రయించారు. దంభుడు విష్ణు భక్తుడని యెరిగి వారితో కూడి విధాత వైకుంఠానికి వెళ్ళాడు. వెన్నునికి విషయాన్ని చెప్పి అందరూ రక్షించమని వేడు కున్నారు. ఆయన వారందరికి అభయాన్నిచ్చి పంపించి తాను పుష్కర తీర్థానికి చేరుకొన్నాడు. చేరుకొని దంభుని మధుర వచనాలతో ప్రోత్సహించి నీ అభీష్టాన్ని తెలుప వలసిందని కోరగా వాడిలా వరాన్ని కోరాడు.

"ఓ దేవదేవా! నీకు నమస్కారం. లక్ష్మీపతీ! నాపై దయను చూపు. నీ భక్తుడు, మహా బల పరాక్రమ వంతుడు, ముల్లోకాలను జయించగల వాడు, అమరులకు సైతం అజేయుడు అగు పుత్రుని అనుగ్రహించు." దంభుని అనుగ్రహించి దామోదరుడు వైకుంఠానికి

వెళ్ళాడు – దంభుడు స్వగృహానికి వచ్చాడు. వచ్చి ఇష్ట కథా వినోదాలతో రమ్య వనారామ విహారాలతో భార్యతో కూడి సుఖిస్తుండగా కొంత కాలానికి ఆమె గర్భవతి అయింది. ఆమె గర్భాన ధర్మాత్ముడైన మహా పురుషుడు ఉదయించ బోతున్నాడు కనుక రోజు రోజు ఆమె యందు దివ్య తేజస్సు అధికమై గృహాన్ని వెలుగులతో నింపేసింది. మునులారా ! శ్రీకృష్ణునికి అత్యంత సన్నిహితుడైన కూర్మి నెచ్చెలి, రాధా దేవిచే శపింప బడిన వాడు ఐన సుదాముడనే గోపాలుడు ఆమె గర్భంలో ఉన్నాడు.

తిథులు నిండగానే శుక్ల పక్షంలో ప్రాగ్దిశ పొలుపుగా పున్నమ చంద్రుని ప్రసవించినట్లు; దంభుని భార్య సుకుమార గాత్రుడైన పుత్రుని కన్నది. పుత్రోదయం కాగానే ఊరంతా ఉత్సవాన్ని జరిపి బ్రాహ్మణులను పిలిపించి శుభ ముహూర్తంలో కుమారునికి శంఖచూడుడు అని నామకరణం చేశాడు.....దంభుడు. ఆ బాలుడు శుక్లపక్ష చంద్రునిలా దినదినాభివృద్ధిని పొంది ఆట పాటలతో తల్లిదండ్రులకు ఆనందాన్ని సమకూరుస్తూ విద్యల నభ్యసిస్తూ పెరిగి పెద్దవాడై అందరికి ప్రీతి పాత్రు డయ్యాడు.

**శంఖచూడుని వివాహం**

అప్పుడా శంఖచూడుడు జైగీషవ్య మహర్షి ఉపదేశాన్ని పొంది ఇంద్రియాలను నిగ్రహించి మనస్సును ఏకాగ్రం చేసి పుష్కర క్షేత్రంలో గురూపదేశం వలన లభించిన బ్రహ్మ మంత్రాన్ని జపిస్తూ చిరకాలం తపస్సు చేశాడు. అతని తపస్సుకు ప్రీతుడైన పితామహుడు కట్టెదుట ప్రత్యక్షమై నీ మనోగతాన్ని తెలుపవలసిందని కోరగా అతడు వినయంతో అవనత శిరస్కుడై ప్రణమిల్లి స్తుతించి ఇలా కోరాడు. "ఓ పితామహా! నువ్వు సృష్టి కర్తవు. వేల్పులలో పెద్దవాడవు. ఆదిజుడవు. నీ వాక్కు తిరుగులేనిది. దేవత లందరిని నేను నిర్జించేటట్లు వరం ఇయ్యి."

బ్రహ్మగారు 'తథాస్తు' అని పలికి లోకంలో గల అన్ని మంగళ వస్తువుల కంటె మంగళప్రదమైనది, సర్వత్ర విజయప్రదమైనది, దివ్యమైనది అగు శ్రీ కృష్ణ కవచాన్ని శంఖచూడున కిచ్చి ఇంకా ఇలా ఉపదేశించాడు. "వత్సా! నువ్వు తక్షణం బదరికి వెళ్ళు. అక్కడ ధర్మధ్వజుని కుమార్తె అయిన తులసి నీ కోసం తపస్సు చేస్తూన్నది. ఆమెను వివాహం చేసుకో. నీకు మేలగు గాక!" ఇలా ఉపదేశించి వెంటనే అదృశ్యుడయ్యాడు బ్రహ్మ. సత్వరమే శంఖచూడుడు కృష్ణ కవచాన్ని మెడలో కట్టుకొని బ్రహ్మగారి ఆజ్ఞ ననుసరించి బదరికాశ్రమ భూమిని చేరాడు. చేరి ఆ పరిసర ప్రాంతాలలో సంచరిస్తూండగా తన మేని స్వర్ణ కాంతులతో సమీప భూమినంతా నీరెండలు కాయిస్తూన్న ఒక లావణ్యరాశి ఐన తపస్వినిని చూచి

ఈమెయే తులసి అని నిశ్చయించుకొని ఆమెను సమీపించి మధురంగా ఇలా అన్నాడు.

"ఓ మంగళాంగీ! నీ వెవరు? నీ నామధేయాన్ని వహించి ఏ అక్షరాలు సార్ధకతను పొందాయి! నీకు జన్మ నిచ్చిన పుణ్య దంపతులెవరు? నువ్విక్కడ ఒంటరిగా ఉండి ఏం చేస్తున్నావు? నన్ను నీ సేవకునిగా అంగీకరించు. తోడుగా ఉంటాను. అంతేకాదు. నీ సహచర్యం కంటే నాకు త్రిలోకాధి పత్యం ఎక్కువేమీ కాదు!."

దాని కామె కోయిలలు సైతం సిగ్గు పడే మధుర స్వరంతో ఇలా సమాధానమిచ్చింది: "ఓ ఆగంతుకా! నేను ధర్మధ్వజుని కుమార్తెను. నా పేరు తులసి. ఇక్కడి తపోవనంలో ఉండి తపస్సు చేసుకొంటున్నాను. నువ్వేదో సేవకునిగా అంగీకరించమని కోరేవు. నీ ముఖం చూస్తే ఉత్తమకుల సంజాతుడవని తోస్తూన్నది! నువ్వు అనదగిన మాటేనా అది? వద్దు! ముద్దు గుమ్మలతో పొత్తు వద్దు! స్త్రీ నరక ద్వారం. అనాచారానికి ఆటపట్టు. పాపాలకు పట్టుగొమ్మ. మల భూయిష్ఠపు తోలు బొమ్మ. దోషస్థానం. ఉత్తమలోక ప్రాప్తికి విఘ్న కారకమైన గండ కత్తెర. యువతి గరళ వల్లి, చిగురు బోడుల చూపులు విషం. పలుకులు హాలాహలం. మనస్సు కాలకూటం. పైపైకి వెన్నెల తీగలు మొఱుగు బోండ్లు! పంచదార బొమ్మలు! అమృతగుళికలు! పాము కాటుకు విషవైద్యం చేసే వెజ్జులున్నారు. ప్రమదల పాశంలో చిక్కిన వానిని బ్రహ్మాదులు రక్షించ లేరు. సాధకులకు సంకెల స్త్రీ, లేడి కన్నుల వన్నెలాడుల కంటి చూపు తగిలెనా ఆ ఉన్మాదాన్నుండి రక్షించేవాడు లేడు. పురుషునికి స్త్రీని మించిన మాదక వస్తువు లేదు. ఇక్కడ నుండి సుఖంగా వెళ్ళిపో".

తీవ్రంగా కామినీ గర్హణం (స్త్రీ నింద) చేసిన తులసి వాక్కులకు సమాధానంగా శంఖచూడుడిలా అన్నాడు: "ఓ దేవీ! నువ్వు చెప్పిన సర్వము అసత్యం కాదు. అలా అని సత్యము కాదు. కొంత సత్యము – కొంత అసత్యము ఉంది. స్త్రీ – పురుషులు, ప్రకృతి పురుషులు కదా! ప్రకృతి లేని పురుషుడు, పురుషుడు లేని ప్రకృతి ఉంటుందా? జన్మ ఎత్తాక శరీరం ప్రకృతి మీద ఆధారపడి బ్రతుకుతూన్నది గదా! లేని యెడల మరణం తథ్యం కదా! అలాటప్పుడు ప్రకృతి పాశంలో చిక్కుట అనే దానికి ఆధారమేముంది?.

సంసారంలో భార్యా భర్తల మనసులు కలిసి, భార్య అనురాగవతి అయితే 'అమృత వల్లి' లేనిచో విషవల్లి. చతుర్విధ పురుషార్థాలకు స్థానమైంది స్త్రీ. పురుషుని బలానికి, ఉత్సాహానికి పట్టుగొమ్మ స్త్రీ! ఆనందానికి ఆటపట్టు స్త్రీ! సంతానానికి క్షేత్ర స్థానం స్త్రీ! ఉత్తమ దివ్యక్షేత్రం స్త్రీ! ఉత్తమ తీర్థరాజం స్త్రీ! భోగమోక్ష స్థానం స్త్రీ! ఉత్తమ లోకాలన్నీ స్త్రీ

యందే ప్రతిష్ఠితమై ఉన్నాయి. పంచేంద్రియాలకు ఏకకాలమందు ఆనందాన్నిచ్చే ఆనందధామం స్త్రీ.

ఏదైతే ప్రాణాలను హరిస్తుందో వైద్య శాస్త్రంలో ...... దానినే శుద్ధి చేసి (సంస్కారం) వాడితే ప్రాణదానం చేస్తుంది. ఏ స్త్రీ ఐతే మాదక వస్తువు అవుతుందో దానిని నియంత్రణ చేస్తే మోక్ష ప్రాప్తికి హేతు వవుతుంది! నా మాట విను. నువ్వు పతివ్రతలలోకెల్ల పతివ్రతవు! నేను పాప చింతన గల కాముకుడను కాను! నువ్వు కూడ అట్టి దానవు కావని నే నెరుగుదును. బ్రహ్మగారి ఆజ్ఞ మేరకు నేనిక్కడకు వచ్చాను. ఓ శుభాంగీ! నేను నిన్ను గాంధర్వ విధిలో పాణిగ్రహణం చేస్తాను. ఎవరి పేరు చెపితే దేవతలు వణికి పోతారో ఆ శంఖచూడుడను నేనే! నా తండ్రి పేరు దంభుడు. పూర్వ జన్మలో నేను శ్రీ కృష్ణునికి కూర్మి చెలికాడైన సుదాముడనే గోపాలకుడను. రాధాదేవి శాపంచే ఈ జన్మలో దానవ వీరుడనై జన్మించాను. వాసుదేవుని వర ప్రభావంచే నాకు పూర్వజన్మ స్మృతిజ్ఞానం కలిగింది." ఇలా సముచితంగా పలికి విరమించాడు శంఖచూడుడు.

శంఖచూడుని పలుకులు చెవులకు అమృతపు చినుకులై తోచ; తులసి కలకంఠంతో సుధా మధురంగా ధర్మ సమ్మతమైన మరియు అర్థవంతమైన వాక్కులనిలా పలికింది.

"ఓ ధర్మ విశారదా! నీ తాత్త్విక విచారణ చేతను, నీ సాత్త్విక మనోభావాల చేతను నన్ను జయించావు. ఈ లోకంలో ఏ పురుషుడు స్త్రీ కడగంటి చూపులకు వశుడు కాడో వాడే ధన్యుడు. స్త్రీకి లొంగి పోయిన వాడు ఎంత పండితుడైన, ఎట్టి పవిత్ర కర్మల నాచరించినా... వాడు నిందార్హుడే! సర్వదా శౌచ విహీనుడే! దేవతలు వాని విషయంలో తిరస్కార భావాన్ని చూపుతారు. అట్టి వానికి లోకంలో గౌరవ మేముంటుంది? చావు పుట్టుకల వలన సంక్రమించిన మైల నుండి బ్రాహ్మణుడు పది, క్షత్రియుడు పన్నెండు, వైశ్యుడు పదిహేను, శూద్రుడు ముప్పది రోజులలోను పరిశుద్ధుడవుతున్నాడు. కాని స్త్రీ వ్యామోహంలో చిక్కుకొన్న పురుషుడు చితిపై దహింపబడిన తర్వాత మాత్రమే శుద్ధుడవు తున్నాడు. స్త్రీచే జయింపబడిన వాడు సమర్పించిన పిండాన్ని, తర్పణాలను పితృదేవతలు సంతోషంతో స్వీకరించరు. అతడు అర్పణ చేసిన పుష్ప ఫలాలను దేవతలు ముట్టుకోరు, జ్ఞానము, తపస్సు, జపము, హోమము, విద్య, పూజ, దానము..... ఇవన్నీ ఇంద్రియాలను జయించటం కొరకే ఉద్దేశింప బడ్డాయి. స్త్రీలోలుడైన వానికి అవన్ని వ్యర్థమే గదా! ఓ జ్ఞాన

విశారదా! నీ విద్యను, ప్రభావాన్ని, జ్ఞానాన్ని పరీక్షించటం కొరకు మాత్రమే నేనలా మాట్లాడేను! వరుని పరీక్షించిన తర్వాతనే కదా వధువు వరించాలి.”

తులసి ఇలా పలికి విరమించిన సమయంలోనే విరించి ప్రత్యక్షమై “ఓ శంఖచూడా! ఈమెను గాంధర్వ విధి విధానంగా వివాహం చేసుకో. జ్ఞానవంతురాలైన ఈమెకు జ్ఞాని వైన నీతోడి వివాహం గొప్ప మేలుచేకూర్చగలదు. విరోధం లేనిది, దుర్లభమైనది ఐన సుఖాన్ని విడిచిపెట్ట కూడదు. ఓ లక్షణవతీ! నువ్వితనితో కూడి సర్వలోకాలలో విహరించి సుఖించు. ఇతడు పంచత్వాన్ని పొందాక గోలోకంలో శ్రీ కృష్ణుని చేరుకొంటాడు. పిమ్మట నువ్వు వైకుంఠానికి వెళ్ళి విష్ణు సాన్నిధ్యాన్ని పొందగలవు.” – ఇలా వారిద్దరిని ఆశీర్వదించి బ్రహ్మ తన ధామమును చేరుకొన్నాడు. శంఖ చూడుడు గాంధర్వ విధిచే తులసిని వివాహం చేసికొని తన నివాసాన్ని చేరి సుఖించాడు.

**శంఖచూడుని పూర్వ జన్మ వృత్తాంతం**

ఈ విధంగా గొప్ప తపస్సు చేసి వారిజోద్భవునిచే వరాలను పొంది సౌందర్య రాశి, సుగుణ వారాశి ఐన తులసిని భార్యగా చేపట్టి, శుభ యోగాలతో తిరిగి వచ్చిన శంఖచూడుని సమస్త దానవ లోకం ఎదురేగి ప్రణమిల్లి స్తుతించి స్వాగతం చెప్పింది. దానవ గురువైన శుక్రుడు అతనిని చేరి దేవదానవుల వృత్తాంతాన్ని, దేవతల చేతిలో దానవుల పరాజయాన్ని చెప్పి దానికి ప్రతీకారాన్ని చెయ్య వలసిన అవసరాన్ని బోధ చేశాడు. చేసి సమస్త దానవ లోకానికి శంఖ చూడుని సార్వభౌమ స్థానంలో పట్టాభిషేకం చేశాడు. ఆ సమయంలో దానవు లందరు గొప్ప ఉత్సవాన్ని జరుపు కొన్నారు. ప్రకృతి అంతా ప్రసన్నంగా ఉండి అనుకూల వాయువులు వీచాయి. దానినే భావి శుభంగా భావించి దానవేంద్రుడు ఇంద్రునిపైకి దండు నడిపాడు. ఇంద్రుడు కూడా బృందారకులతో కూడి యుద్ధ సన్నద్ధుడయ్యాడు.

దేవ దానవ సంగ్రామం ప్రారంభమైంది. రథస్థులై కొందరు, అశ్వారూఢులై కొందరు, గజాధిరోహణులై కొందరు కయ్యాన్ని నడుపుతున్నారు. వీరుల హూంకారాలతో, కార్ముక గుణ టంకారాలతో, రివ్వు రివ్వున దూసుకుపోయే శరపరంపరా రావాలతో సంగర రంగం అమిత కోలాహలంగా ఉంది. శంఖచూడుని శరాఘాతాలకు అశ్వారుఢులైన అమరులు ఉసురులు వీడి ఉల్కాపాతంలా రాలి పోతున్నారు. హస్త్యారోహకులైన విక్రాంతులు ప్రియురాలి వక్షస్థలంపై నిద్రిస్తున్న వారిలా కరి కుంభాలపై వాలి పోతున్నారు. అతని విక్రమాటోపానికి

అమర వాహిని గడ్డ కట్టిన సముద్రంలా స్తంభించింది. ఈ విధంగా దానవేంద్రుడు తన పరాక్రమంతో ముల్లోకాలను జయించి యజ్ఞ భాగాలను పూర్తిగా స్వీకరించి తానే ఇంద్రుడయ్యాడు. దిక్పాలకుల అధికారాలను తానే నిర్వహించ సాగేడు. పంచభూతాల మీద ఆధిపత్యాన్ని వహించాడు. ఈ విధంగా సకల భువనాలకు శాసకుడై అనేక సంవత్సరాలు పాలించాడు.

అతని రాజ్యంలో దుర్భిక్షము, రోగాలు, అంటు వ్యాధులు, మనోవ్యాధులు లేవు. భూమి దున్నకుండానే పండేది. విషకీటకాల భయం లేదు. అతివృష్టి అనావృష్టి బాధలు లేవు. ఓషధులు రసవంతములై స్వస్వరూపంతో సాక్షాత్కరించేవి. తరువులన్ని ఫలభారంచే వంగిన కొమ్మలు గలవై బాటసారుల ఆకలిని తీర్చేవి. నదులన్ని మధుర జల పూరితములై ఏ ఉపద్రవాలు లేకుండ ప్రవహించేవి. సరస్సులన్నీ సరోజ షండములతో, భ్రమరకుల ఝుంకారంతో మహా శోభాయమానంగా దర్శనమిస్తున్నాయి, వాయువు పరిమళ భరితమై సుఖ శీతల స్పర్శతో రతి పరిశ్రాంతులైన వారి అలసటను పోగొడుతున్నది. అతని పాలనలో ఈర్ష్యా పరులు, అసూయాగ్రస్తులు ఐన దేవతలు వెలితిగా తక్కిన వారందరు నిర్విచారులుగా సుఖించారు. శాప వశాన దానవ వంశంలో జన్మించినా అతనిలో ఏ మాత్రము దానవ లక్షణాలు లేవు.

ఇలా ఉండగా....... శంఖచూడుడు పొందుతూన్న ప్రజాభిమానాన్ని అతని అభ్యుదయాన్ని చూచి, జ్ఞాతి వైరం కారణంగా ఓర్వలేక, దుఃఖితులైన దేవతలు బ్రహ్మగారితో మొరపెట్టుకొని; ఆయనతో కలిసి వైకుంఠానికి వెళ్ళి చతుర్భుజునితో సంగతులన్ని సముఖంలో విన్నవించి ముప్పు తప్పించి, మునుపటి వైభవాన్ని కల్పించమని పరిపరి విధాల ప్రార్థించగా ఆయన ఆలకించి ఇలా అన్నాడు.

"ఓ పద్మసంభవా! దేవతలారా! శంఖచూడుని వృత్తాంతం సర్వము నాకు తెలుసు. పూర్వ జన్మలో అతడు నా భక్తుడైన సుదాముడనే గోపాలకుడు. శివలోకం సమీపంలో గోలోకము, శంకరుని గోశాల రెండూ ఉన్నాయి. నా అవతారమైన శ్రీ కృష్ణుడు శంభుని ఆజ్ఞచే ఆ లోకానికి అధిపతిగా అక్కడ ఉంటూ పశుపతి యొక్క పశువులను సంరక్షిస్తూన్నాడు. శ్రీ కృష్ణుని విహార ప్రియురాలు..... రాధ. ఆమె ప్రకృతి కంటే ఉత్కృష్టమైన లోకమాత. శంకరుని అనుగ్రహంచే లభించిన గోలోకాధి పత్యాన్ని వహించి రాధా మాధవులు ఆయన

నామ సంకీర్తనం చేస్తూ యథేచ్ఛా విహారం చేస్తూ క్రీడిస్తూ ఉంటారు. ప్రకృతి – పురుషులైన రాధా కృష్ణుల సంతానమే “ఈ గోవులు, గోపాలకులు, గోపికలు. ఆ గోలోకంలోని వారంతా... రాధా కృష్ణులను సేవిస్తూ తన్మయులై మైమరచి పోతూ ఉంటారు. అక్కడ అంతా భక్తి మినహా మరొకటి ఉండదు. ఉపాధిని పొంది దుఃఖాన్ని అనుభవిస్తూన్న జీవుడు తిరిగి పరమాత్మను చేరుకొనాలనే తపనే భక్తి. తనను తాను ప్రేయసిగా భావించుకొంటూ పరమాత్మను ప్రియునిగా భావించి చేసే సాధనయే ‘మధుర భక్తి’, బృందారకులారా! పరమాత్మను తెలుసుకో గోరే వారికి ఇది చాలా సుకరమైన మార్గం సుమా! ఎందుకంటె ప్రేయసీ ప్రియులిద్దరు పరస్పరం ఒకరిపై ఒకరు మధుర భావాలనే కలిగి ఉంటారు. అక్కడ అరిషడ్వర్గాలు లేవు. అదొక రస ప్రపంచం! మధురైక జీవనం!! అనంద హేల!!! ముక్త జీవులుండే స్థానం..... గోలోకం.

సుదాముడనే గోపాలకుడు శంకరుని లీలచే ఒకప్పుడు రాధా దేవి జగన్మోహన సౌందర్యాన్ని చూచి మోహితుడు కాగా ఆమె అతనిని దానవుడవు కమ్మని శపించింది. ఆ శాపం ఆగ్రహంతో ఇచ్చింది కాదు– అనుగ్రహంతో చూపిన ముక్తి మార్గం! ఎలాగంటే పరస్త్రీ వ్యామోహం మానవ లక్షణం కాదు. దానవ లక్షణం! అందుకని దానవుడవు కమ్మని శపించింది. అంతేకాదు! సుదామునిలో ఎక్కడో ఒక మూల వరి ముల్లంతైనా కామబీజం ఉంది. అది కూడ నశిస్తే కాని సాయుజ్య ముక్తి లభించదు. కోరికలే పునర్జన్మ హేతువులు కదా! సుదాముడు రాధా దేవి శాపానికి భయకంపితుడై వేడుకోగా రుద్రుని చేతిలో మరణాన్ని నిర్ణయించాడు శ్రీకృష్ణుడు. మరణానంతరం ఈ శంఖచూడుడు తిరిగి గోలోకాన్ని చేరుకుంటాడు. ఈ సత్యాన్ని తెలుసుకొని మీరంతా శంభుని శరణు కోరండి. నేను కూడా ఆయన దర్శనానికి వస్తున్నాను అని విరమించాడు విష్ణువు! అంత వారంతా శివలోకానికి వెళ్ళారు.

**దేవతలు శంకరుని శరణు వేడుట**

ఆ లోకం ముప్పైరెండు కోట్ల యోజన విస్తారము, ఎనిమిది వాకిళ్ళు కలది. అది నిరాధారమైనది, భూత నిర్మితం కానిది. మొదటి దైన తూర్పు వాకిలిని.... బ్రాహ్మీ శక్తితో కూడి హంస వాహనా రూఢుడై అసితాంగ భైరవుడు రక్షిస్తూంటాడు. ఆగ్నేయ ద్వారాన్ని మాహేశ్వరీ శక్తితో కలిసి అజ (మేకపోతు) వాహనారూఢుడై రురుభైరవుడు కావలికాస్తూ ఉంటాడు. దక్షిణ ద్వారంలో మయూర వాహనారూఢుడై కౌమారీ శక్తి సహితుడై చండ భైరవుడు నిలబడి ఉంటాడు. నైరుతి ద్వారంలో వైష్ణవీ శక్తి సహితుడై గరుడ వాహనంతో కూడి క్రోధ భైరవుడుంటాడు.

వారాహీ శక్తితో కూడి మహిష వాహన సమేతుడై పశ్చిమ ద్వారాన్ని రక్షిస్తూ ఉంటాడు.... ఉన్మత్త భైరవుడు. మాహేంద్ర శక్తి మేళనంతో గజవాహనంతో కూడి కపాల భైరవుడు వాయవ్య ద్వారంలో ఉంటాడు. కాక వాహనంతో కూడి చాముండీ శక్తి సహితుడై ఉత్తర ద్వారంలో భీషణ భైరవుడు రక్షగా ఉంటాడు. ఈశాన్య ద్వారంలో మహాకాళీ శక్తి సమేతుడై సంహార భైరవుడు కావలి ఉంటాడు.

విరించి, మాధవ, పురందరులు బృందారక పరివృతులై అష్ట భైరవ పరిరక్షితమైన అష్ట ద్వారాలను గడిచి శివ సభా మంటపాన్ని చేరుకొన్నారు. ఆ మంటపం చతుర్ద్వార పరివృతం – చతుర్వేద శోభితం. తూర్పు ద్వార గోపురం ధవళ వర్ణ శోభితమైన ఋగ్వేదమయం, పశ్చిమ ద్వార గోపురం శుభ్ర వర్ణ సమలంకారమైన సామవేదమయం. దక్షిణ ద్వార గోపురం నీల వర్ణ విరాజమానమైన యజుర్వేదమయం. ఉత్తర ద్వార గోపురం కుంకుమ రాగ రంజితమైన అధర్వణ వేదమయం. చతుర్వేద ద్వారాలను గడిచి మహాద్వారాన్ని సమీపించి అక్కడ ద్వార పాలకుడైన నందీశ్వరుని స్తుతించి అతని అనుమతితో సర్వేశ్వరుని సాన్నిధ్యానికి చేరుకొన్నారు. బృందారక బృందం.

అక్కడ.....

ప్రణవార్ధ స్వరూపుడు, మూర్తి త్రయాతీతుడు, సచ్చిదానందాత్మక పరబ్రహ్మ శబ్ద వాచ్యుడు అయిన సర్వేశ్వరుడు నవరత్న స్థగిత స్వర్ణ సింహాసనాన్ని అధిరోహించి.......

వేదాలు స్తుతిస్తూండగా......

అరవై నాలుగు సిద్ధులు ఊడిగం చేస్తూండగా....

దేవ శ్రేష్ఠులు కైదండ యొసగగా....

కూతి, ఖ్యాతి,ధృతి, ప్రీతి, అరుంధతి ఇత్యాది ఏకాదశ పతివ్రతలు పరిచర్యలు చేస్తూండగా...

సావిత్రి, గాయత్ర్యాది మంత్ర శక్తులు మనవి తెల్పుతుండగా...

లక్ష్మి, వాణి, శచీ దేవ్యాదులు కైవారం చేస్తూండగా....

తుంబురు, నారదాదులు గానం చేస్తూండగా......

రంభోర్వశీ మేనకాదులు సుకుమార లాస్యాన్ని నెరవేరుస్తూండగా.....

ఏకాదశీ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, రుద్రగణ, ప్రమధగణ,

దేవగణ, భక్త గణాలు, జయజయ ధ్వానాలు చేస్తుండగా..... కిరీట కుండల రత్నమాలా విభూషితుడై, భస్మోద్ధూళిత సర్వాంగుడై, కేళి పంకజ లీలా హస్తుడై సుందర మందహాస వదనార విందుడై దర్శన మిచ్చాడు.

ఆదివ్య మంగళ విగ్రహాన్ని సందర్శించి దేవతలు అక్షుల ఆనందాశ్రువు లొలుక దీనంగా శంఖచూడుని వృత్తాంతాన్ని మనవి చేసి రక్షించమని ప్రార్థించారు.

**బ్రహ్మాదులకు శివుని ఉపదేశం**

అంత బ్రహ్మాదుల ప్రార్థనలను ఆలకించి సర్వేశ్వరుడైన శంకరుడిలా అన్నాడు: "ఓ గీర్వాణులారా! శంఖచూడుని వృత్తాంతం నాకు విదితమే. మీరు భయాన్ని విడిచి పెట్టండి. ఈ విష్ణువు ఒకప్పుడు కృష్ణావతారాన్ని పొంది తాను స్వతంత్రుడనని భావించి మోహితుడై రాధతో స్వేచ్ఛాచారియైనాడు. నేను నామాయచే వారి మంచి బుద్ధిని అపహరించి వారి చేతనే స్వేచ్ఛాచారియైన సుదామునకు శాపమిప్పించి తిరిగి నా మాయను ఉపసంహరించాను. ఆ సుదాముడే ఈ శంఖచూడుడు. ఇప్పుడు మీరు వెంటనే కైలాసానికి వెళ్ళి అక్కడ రుద్రుని సందర్శించండి. నా పూర్ణ రూపమే రుద్రుడు. అతడు భక్త సులభుడు." అని పలికి అంతర్హితుడయ్యాడు.

తదనంతరం దేవతలు రుద్రుని సందర్శించి తమ గోడు వెళ్ళ బుచ్చుకోగా ఆయన శంఖచూడుని పరిమార్చి మీకు అభ్యుదయాన్ని కలుగ చేస్తానని అభయమిచ్చి పంపించాడు.

**రుద్రుడు శంఖచూడుని వద్దకు పుష్పదంతుని దూతగా పంపుట**

తక్షణం ఆ దానవుని మట్టు పెట్ట సంకల్పించి తన కిష్టుడైన పుష్పదంతుని (చిత్ర రథుడు); అక్కడ ,చెప్ప వలసిన మాటలను చెప్పి శంఖచూడుని వద్దకు రాయబారిగా పంపించాడు. ఆ గంధర్వ రాజు మనోహరమైన దానవుని నగరానికేగి ద్వార పాలక పరిరక్షితమైన పన్నెండు ద్వారాలను దాటి శస్త్ర సంపన్నులైన మూడు కోట్ల రాక్షస గణాలచే పరివేష్టితుడైన దానవ సమ్రాట్టును చూచి వాని వైభవానికి దిగ్భ్రమ చెంది తేరుకొని ఇలా అన్నాడు.

"ఓ దైత్యాగ్రణీ! నేను రుద్రుని దూతను. పుష్పదంత నాముడను. రుద్రుడు పంపిన సందేశాన్ని విను. "వెంటనే దేవతల సంపదను, రాజ్యాన్ని దేవతలకు అప్పచెప్పు. లేదా వీరుల కిష్టమైన యుద్ధాన్ని చేసి వీర మరణాన్ని పొందు. గీర్వాణులకు రాజ్య లాభాన్ని చేకూరుస్తానని ప్రతిజ్ఞ చేశాను. కనుక నువ్వు వారి రాజ్యాన్ని వారికిచ్చి వారితో సఖ్యంగా

ఉండటమో లేదా మరణానికి సిద్ధంగా ఉండటమో రెంటిలో ఒక దానిని ఎన్నుకొని నాకు ప్రతి వచనం చెప్పు."

దానికి శంఖచూడుడిలా సమాధాన మిచ్చాడు : ఓ! పుష్పదంతా! నేను దేవతలకు రాజ్యాన్ని ఈయను. రాజ్యం వీరభోజ్యం కదా! నేను వారి రాజ్యాన్ని నా బాహు పరాక్రమంచే గెలిచాను. అమరులతో యుద్ధం చేస్తూన్నప్పుడు, వారి రాజ్యాన్ని గెల్చినప్పుడు ఈ రుద్రుడు లేడా? అప్పుడేం చేస్తున్నాడూ? విందులారగిస్తున్నాడా? లేక నృత్యగాన విలాసాలతో ప్రొద్దు పుచ్చుతున్నాడా? మరొక్క మాట! చిరకాలంగా దానవుల మైన మాకు దేవతలకు వైరం ఉంది. అసలు పూర్వ దేవతలం మేమే! పరమేష్ఠి ప్రథమ సృష్టిలో మొట్ట మొదట అతని తమోమయ దేహం నుండి ఉద్భవించిన వారము మేము. పితామహుడు ఆ దేహాన్ని విడిచి పెట్టగా రాత్రి ఏర్పడింది. ద్వితీయ సృష్టిలో సత్త్వమయ శరీరాన్ని ధరించి దేవతలను సృష్టించి ఆ శరీరాన్ని విడువగా అదే మనుష్యులకు పగలు అయింది. తృతీయ సృష్టిలో సాత్విక శరీరాన్ని ధరించి పితృ లోకాన్ని సృష్టించి ఆ తనువును విడిచి పెట్టగా సంధ్య ఏర్పడింది.

పుష్పదంతా! ఆ విష్ణువు కపట బుద్ధితో మా రాక్షసులను వంచించాడు. బలి చక్రవర్తిని పాతాళానికి త్రొక్కేడు. ఏం బావు కొన్నాడు? ఉన్న ఒక్క కొడుకు విరూపాక్షుని కంటి మంటలకు దగ్ధమయ్యాడు. రుద్రుని విష్ణు మాయలో పడవద్దని, చెప్పు! నేను ప్రజారంజకంగా పాలించటం లేదా? సర్వము కాలాధీనం. కాలంలో భవిషత్తులో ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? దేవతలకు రాజ్యాన్ని అప్పజెప్పటం కల్ల. నేను రుద్రునితో యుద్ధాన్నే కోరు కొంటున్నాను. వెళ్ళు! నా సందేశాన్ని ఆయనకు యథా తథంగా విన్నవించు." ఇలా పలికి కొలువు చాలించి అభ్యంతర మందిరం లోనికి వెళ్ళాడు శంఖచూడుడు.

పుష్పదంతుడు కైలాసానికి తిరిగి వచ్చి శంఖచూడుని ప్రతివచనాలను రుద్రునకు యధాతథంగా విన్నవించాడు. శంఖచూడుని ధిక్కారానికి మండి పడ్డ రుద్రుడు నందిని, వీర భద్రుని, అష్ట భైరవులను, క్షేత్ర పాలకులను, ఆదిత్యులను, వసువులను, దిక్పాలకులను, గణాధ్యక్షులను పిలిపించి యుద్ధానికి సంసిద్ధులు కావలసిందిగా ఆజ్ఞాపించాడు. వెంటనే మహాకాలుడు, సుభద్రకుడు, విశాలాక్షుడు, బాణుడు, పింగళాక్షుడు, వికంపనుడు, విరూపుడు, వికృతి, మణి భద్రుడు, బాష్కలుడు, కపిలుడు, దీర్ఘ దంష్ట్రుడు, వికరుడు, తామ్ర లోచనుడు, కాలంకరుడు, బలీభద్రుడు, కాల జిహ్వుడు, కుటీచరుడు, బలోన్మత్తుడు, రణశ్లాఘ్యుడు,

దుర్జయుడు, దుర్గముడు.... శ్రేష్ఠ చమూపతులైన గణాధ్యక్షులంతా తమ తమ సేనతో కదిలారు.

**రుద్రుని యుద్ధ సన్నాహం**

అనంతమైన సృష్టిలో ఎక్కడెక్కడ ఉన్న రుద్రగణాలన్నీ క్షణంలో వచ్చి చేరాయి. ఆ సంఖ్యను చెప్పటం సాధ్యంకాదు. మునులారా! మనకు సంఖ్యను లెక్కించ టానికి వేద మార్గంలో ఒకటి, పది, వంద ఇలా ముప్పైఆరు స్థానాల వరకు గణనం ఉంది. అవి యెవ్వి అనగా..... ఏకం, దశం, శతం, సహస్రం, దశ సహస్రం, లక్ష, దశ లక్ష, కోటి, దశకోటి, శతకోటి, అర్బుదం, న్యర్బుదం, ఖర్వం, మహా ఖర్వం, పద్మం, మహా పద్మం, క్షోణి, మహా క్షోణి, శంఖం, మహా శంఖం, క్షితి, మహా క్షితి, క్షోభం, మహా క్షోభం, నిధి, మహానిధి, సాగర, మహాసాగర, హరి, మహా హరి, ఫణి, మహా ఫణి, క్రతు, మహా క్రతు, భూరి మహా భూరి. ఈ సంఖ్యను దాటింది రుద్ర గణాల లెక్క.

వారందరు ఆకారంలో రుద్రుని పోలి ఉన్నారు. అందులో కొందరు బ్రహ్మ, విష్ణు, ఇంద్రుల రూపాలలో ఉన్నారు. వంద చేతులు గల భద్ర కాళి అనేకానేక రత్న శోభితమైన విమానాన్ని అధిరోహించి రక్తవర్ణ దుకూలాలను, రక్త మాలలను ధరించి, రక్త చందనాన్ని పులుము కొని........ చక్కని స్వరంతో పాడుతూ, నృత్యం చేస్తూ, ఆనందంతో నవ్వుతూ, భక్తులకు అభయాన్నిస్తూ, శత్రువులకు భీతిని గొలుపుతూ, భయంకరము చంచలము అయిన యోజనం పొడవు గల నాలుకను త్రిప్పుతూ బయలు దేరింది. ఆమె చేతులలో శంఖము, చక్రము, గద, పద్మము, ఖడ్గము, ధనుస్సు, బాణాలు, కపాలం, ముద్గరం, ముసలం, త్రిశూలం, శక్తి, వజ్రం, డాలు...... ఇత్యాది ఆయుధా లున్నాయి. ఆమె...... వైష్ణవ, వారుణ, వాయవ్య, నారాయణ, గాంధర్వ, బ్రహ్మ, గారుడ, పార్జన్య, పాశుపత, జృంభణ, పార్వత, మహావీర, సౌర, కాలకాల, మహానల, మహేశ్వర, సమ్మోహన..... ఇత్యాది అస్త్రాలను ధరించింది. ఆమె మూడు కోట్ల డాకినీ గణాలతో, మూడుకోట్ల యోగినులతో కూడి వచ్చి చేరింది. భూత, ప్రేత, పిశాచ, కూష్మాండ, బ్రహ్మ రాక్షస, వేతాల, రాక్షస, యక్ష, కిన్నరులతో కూడి కుమార స్వామి వచ్చి తండ్రికి నమస్కరించి, ప్రక్కనే నిల్చున్నాడు. రుద్రుడు వీరందరితో కూడి సుందరమైన చంద్రభాగా నదీ తీర వట వృక్ష మూలంలో విడిది చేశాడు.

**శంఖచూడుని యుద్ధ సన్నాహం**

ఇక అక్కడ శంఖచూడుడు... శంకరుని దూత ఐన పుష్పదంతునికి వీరోచితంగా సమాధాన మిచ్చి అంతః పురం లోనికి వెళ్ళి తన భార్య అయిన తులసికి విషయాలన్నిటిని చెప్పగా, ఆమె శంకరుని విషయంలో అనాదరం చేయటం తగదని భర్తకు హితవు చెప్పింది. స్త్రీ స్వభావంతో పల్కిన ఆమె మాటలకు, విక్రాంతుడు జ్ఞాని అగు శంఖచూడుడు తన ప్రియురాలగు తులసికి అనేక విషయాలను బోధించి ఆ రాత్రిసుఖంగా నిద్రించాడు.

తిరిగి బ్రాహ్మీ ముహూర్తంలో నిద్రలేచి కాల్య కరణీయాలను చక్క దిద్దుకొని ప్రాతః కాల నిత్య కర్మలను నెరవేర్చుకొని బ్రాహ్మణులకు వేద పారంగతులైన విప్రులకు అంతులేని దానాలను చేశాడు. తన పుత్రుని సకల దానవ లోకానికి సార్వభౌముని చేసి, సర్వమైన సంపదలను, భార్యను అతనికి అప్ప చెప్పాడు. అప్పుచెప్పి యుద్ధ తంత్ర విశారదుడు, మహారథుడు ఐన సర్వసైన్యాధి పతిని పిలిపించి యుద్ధానికి సేనను సంసిద్ధం చేయమని ఆజ్ఞాపించి తాను కూడా సంసిద్ధుడయ్యాడు. సంసిద్ధుడై అపార సేనా వాహినితో కూడి పుష్పభద్రా నదీతీరంలో గల అక్షయ వటవృక్షం క్రింద విడిది చేశాడు.

ఆ వట వృక్షం శుభకరమైనది. సిద్ధులకు శీఘ్రంగా తపస్సిద్ధి నిచ్చేది. సిద్ధాశ్రమమని పేరు పొందిన కపిల మహర్షి ఆశ్రమం అక్కడే ఉంది. అది పుణ్య భూమి అగు భారత దేశంలో పశ్చిమ సముద్రానికి తూర్పుగా, మలయ పర్వతానికి పశ్చిమంగా, శ్రీ శైలానికి ఉత్తరంగా, గంధమాదన పర్వతానికి దక్షిణంగా నెలకొని ఉంది. ఈ పుష్పభద్రా నది హిమాలయాలలో పుట్టి, స్వచ్ఛమైన తెల్లని జలాలను కలిగి సరస్వతీ నదిని ఆశ్రయించి గోమంత (గోవా) దేశానికి ఎడమగా ప్రవహించి పశ్చిమ సముద్రంలో సంగమిస్తుంది. ఈ నది భారత దేశంలో గల పుణ్య నదులన్నిటి లోను గొప్పది. సుందరమైనది. సరస్వతి అను పేరు గలది. సముద్రునకు మిక్కిలి ప్రీతి పాత్రమైనది. భక్తులకు సర్వ సౌభాగ్యాలను, సకల శ్రేయస్సులను ఇచ్చేది.

**శంఖచూడుడు తన దూతను శివుని వద్దకు పంపుట**

అలా దండుతో కూడి స్కంధావారంలో విడిది చేసి వయో, జ్ఞాన వృద్ధుడైన ఒక దానవ శ్రేష్ఠుని రాబిలిచి చెప్ప వలసిన మాటలను చెప్పి రుద్రుని వద్దకు రాయబారాన్ని పంపేడు శంఖచూడుడు. వాడు వెళ్ళి అక్షయ వట మూలంలో ఆసీనుడై ఉన్న..... చంద్ర శేఖరుడు, యోగాసనాసీనుడు, మందస్మిత సుందర వదనారవిందుడు,

శుద్ధస్ఫటికసంకాశుడు, త్రిశూల ధరుడు, వ్యాఘ్ర చర్మాంబరా వృతుడు, భక్త మృత్యు హరుడు, త్రిలోచనుడు, శాంతుడు, గౌరీ కాంతుడు, విశ్వనాథుడు, విశ్వబీజుడు, విశ్వరూపుడు, విశ్వంభరుడు, విశ్వసంహార కారకుడు, జ్ఞాన – ఆనంద స్వరూపుడు, సనాతనుడు అగు రుద్రుని సందర్శించాడు. రుద్రునకు ఎడమవైపున భద్రకాళి, ఎదురుగా కూమార స్వామి ఉన్నారు. వారందరికి చేతులు జోడించి నమస్కరించి సర్వ శాస్త్ర పారంగతుడైన శంఖ చూడుని దూత తన ప్రభువు సందేశాన్ని ఇలా వినిపించాడు.

"ఓ భక్తవత్సలా! శంకరా! సృష్ట్యాది నుండి ఈ జగత్తుపై రాజ్యాధికారం పూర్వ దేవతలమైన మాది. ప్రలయ సముద్రంలో మధుకైటభులను విష్ణువు సంహరించటానికి కారణం ఏమిటి? సర్వస్వాన్ని ఊడలాగి బలిచక్రవర్తిని పాతాళానికి అణగ ద్రొక్కటానికి హేతువేమిటి? హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను ఏదో నెపాన్ని నెత్తిమీద రుద్ది అంత క్రూరంగా హింసించటం దేవతలు చేసే పనేనా? ఈ జగత్తు కాలస్వరూపుడైన పరమాత్మ అధీనంలో ఉంది. ఆ కాల పురుషుడు ఎవనికి ఐశ్వర్యాన్ని ఇస్తాడో వాడనుభ విస్తాడు. ఇప్పుడు మా వంతు నడుస్తోంది. దేవ దానవులమైన మా మధ్య చిరకాలంగా వైరం ఉంది. గతంలో లక్ష్మీపతి మా విషయంలో చేసిన దుర్మార్గాలు చాలా ఉన్నాయి. అన్నిటి లోను; క్షీర సాగర మథన సందర్భంలో మోహినీ వేషంలో మమ్ములను వంచించి అమరులకు అమృతాన్ని ధారపోయటం..... మేము ఎప్పటికీ మరిచి పోలేని అకృత్యం అది! నువ్వు మాత్రం ఏం తక్కువ తిన్నావు? తారకాసురుని, త్రిపురాసురులను క్రూరంగా పరిమార్చ లేదా? సంపదలు వారికి ఆపదలు మాకూనా? కుడుముల నైవేద్యం వారికి ఇడుములన్నీ మాకునా? కాల పురుషుడు అలాగే వ్రాశాడా?......మా నుదుట! అట్లైతే ఇప్పుడు వారనుభవిస్తున్న ఇడుములన్నీ విధివ్రాతగానే భావించుకోమను! బాహాటంగానే దుర్మార్గానికి తెగబడి మా సర్వస్వాన్ని అపహరించిన వారి విషయంలో; మేము ఎట్టి ప్రతిక్రియకు పూనుకోకుండ చేతులు ముడుచుకొని తలవ్రాత అని విలపిస్తూ అకర్మణ్యులమై ఎలా ఉండగలం? అందువల్ల దేవతలకు రాజ్యాధికారం లేదు. నువ్వీ విషయంలో తల దూర్చటం శ్రేయస్కరం కాదు." అని చెప్పి విరమించాడు దూత.

దూత పల్కులకు దరహాసంతో ఇలా అన్నాడు రుద్రుడు. "ఓ దూతా! చారిత్రక ఆధారాలతో నువ్వు చక్కని హేతు వాదం చేశావు! నీ తర్కం మెచ్చుకో దగినది. నీ వంటి తార్కికుని తన ఆస్థానంలో నియమించుకొన్న శంఖచూడుడు వివేకి అనటంలో సందేహం

లేదు! నీ హేతు వాదాన్ని అనుసరించి గతంలో అమరులు మీకు అన్యాయం చేశారని అనుకొన్నా.... తిరిగి మీరు ప్రతిక్రియగా అదే పనిని చేయటం న్యాయము, ధర్మము అవుతుందా? చర్యకు ప్రతిచర్య ఉంటుంది. అది పదార్థం విషయంలో! ప్రాణుల (చైతన్యం) విషయంలో పదార్థ విజ్ఞానం కంటె...... జ్ఞానం ముఖ్యం. జ్ఞాన మార్గంలో క్రియకు ప్రతిక్రియ పాపహేతువు! నిప్పులో నేయి పోస్తే నిప్పు చల్లారుతుందా? నీళ్ళచే నిప్పును శాంతింప చేయాలి. అలాగే వైరాన్ని మిత్రత్వంతో శాంతింప చేయాలి. ఉపకారం చెయ్యటం కంటె ఉత్తమ మిత్రుని సంపాదించుకొనటానికి వేరే ఉపాయం లేదని గొప్ప రాజనీతిజ్ఞుడైన మీ గురువు శుక్రాచార్యుల వారు చెప్పలేదా? విరోధంతో సాధించేదేమీ ఉండదు. ప్రాణం (చైతన్యం) ఎప్పుడూ ప్రేమకు స్పందిస్తుంది.

జగత్తు అంతా కాలాధీనమై ఉంది అన్నావు గదా నువ్వు! ఆ కాలపురుషుణ్ణి నేనే! దాన్ని నియంత్రించే వాణ్ణి నేనే! అట్టి నేను...... చెప్పుతున్నాను విను. ఇప్పుడు మీకు కాలం అనుకూలంగా లేదు! గతించిన కల్పంలో కాలం అననుకూలంగా ఉంది కనుకనే...... రాఘవుడు రాజ్యాన్ని కోల్పోయాడు! అంతేకాని పౌరుషం చాలక కాదు! వెన్నునికే దిక్కు లేకపోతే దనుజులైన మీకా? తిరిగి కాలం అనుకూలించినప్పుడు రుద్రుడనైన నేనే హనుమదవతారంలో శ్రీరామునికి తోడ్పడి రావణ సంహారం చేసి ధరాత్మజను దశరథాత్మజునికి అప్పచెప్పాను. త్రిగుణాతీతుడనైన నాకు రాగద్వేషాదులు లేవు. జ్ఞాతి ద్రోహం వల్ల కలిగే పాపం బ్రహ్మహత్య కంటె వందరెట్లు అధికం. కనుక దేవతల రాజ్యాన్ని వారికిచ్చెయ్యమని నీ ప్రభువుకు చెప్పు. అసూయ వల్ల బ్రాహ్మణుడు, పరుల సంపదలను చూచి ఈర్ష్యను పొంది రాజ్య విస్తరణ కాంక్షచే క్షత్రియుడు నాశన మవుతారు. గతంలో అలాగే దుర్గతిని పొందారు. ద్రోహ చింత మాని దేవదానవులైన మీరిద్దరు ఎవరి రాజ్యాలను వారు సుఖంగా పరిపాలన చేసుకొనండి. నా అనుగ్రహం ఎప్పుడూ ఉంటుంది. తన మీద నాకు గల ప్రీతిని రక్షించుకొనమని మీ ఏలికకు చెప్పు. దేవతలు నన్ను ఆశ్రయించారు. నేను స్వతంత్రుడనైనా భక్త పరాధీనుడను. నేను చెప్పిన మాటలను యథాతథంగా సముఖంలో విన్నవించి నీ స్వామికి హితం చెయ్యి" అని చెప్పి మౌనాన్ని వహించాడు రుద్రుడు.

**దేవదానవ సంగ్రామం**

రుద్రుని వచనాలను మననంచేసుకొంటూ సిద్ధాశ్రమానికి వచ్చి తన స్వామికి ఉన్నదున్నట్లుగా మనవి చేశాడు దూత. సాగర సంగమాన్ని వాంఛించే నదివలె రుద్రునితో యుద్ధాన్ని

కోరుకున్నాడు..... ప్రతాపశాలి, దానవ చక్రవర్తి అయిన శంఖ చూడుడు. ఉభయ పక్షాల సైన్యాధిపతులు ప్రేరేపించగా వారివారి సైన్యం కదిలింది. శంఖాలను పూరించారు. యుద్ధ భేరులు మ్రోగాయి. వీరుల కోలాహలం చెలరేగింది. దేవదానవుల మధ్య ధర్మ యుద్ధం ప్రారంభమైంది.

దామోదరుడు దంభునితో తలపడ్డాడు. మహేంద్రుడు వృషపర్వుని అడ్డగించాడు. వికర్తనుడు (రవి) విప్రచిత్తిని నిరోధించాడు. కాలుడు (యముడు) కాలాసురుని మార్కొన్నాడు. అగ్ని గోకర్ణుని అరికట్టాడు. కాలకేయుడు కుబేరుని నిలపెట్టాడు. మయుడు విశ్వకర్మను మగిడించాడు. రక్తాక్షుడు శనిని తటాయించాడు. ధూమ్రాక్షుడు నలకూబరుని గద్దించాడు. రాహువు చంద్రునిపై హూంకరించాడు. గురు శుక్రులిద్దరు తార్కొన్నారు. ఈ విధంగా సైన్యాధిపతులు, సేన కూడా ఒకరితో ఒకరు ధర్మయుద్ధం చేశారు.

మగటిమిచూపుతూ పోటుబంట్లు జగడం చేస్తున్నారు. దానవ వీరులు 'నేను ముందు, నేను ముందు' అని అహంకారపూరితులై ముందుకు దూకుతున్నారు. గర్వంతో వీరాలాపా లాడుతూ ధీరోదాత్తంగా పోరాడు తున్నారు. రక్కసి మూక ఆకలిగొన్న సింహాలై కేకలు వేస్తూ మొత్తుతూంటే..... వేలుపులు వెఱపుతో పారిపోయి రుద్రుని శరణు వేడారు.

**షడానన శంఖచూడుల ద్వంద్వ యుద్ధం**

నిలువెల్లా పూచిన మందార తరువుల్లా రుధిర ధారలు కారుతున్న త్రిదశులను చూచి రుద్రుడు సక్రోధుడై వారి నోదార్చి తన రుద్ర తేజస్సుతో వారిని వర్ధిల్ల జేసి, మార్తురను ఎదుర్కొనమని కార్తికేయుని, భద్రకాళిని ఆజ్ఞాపించాడు. భీషణ తరంగ ఘోషలతో పర్వకాలం నాటి సముద్రంలా.... శంఖ, భేరీ, పటహ, కాహళ, ఇత్యాద్య నేక రణవాద్య ధ్వనుల రొదలకు దిక్కులదర శౌర్యోత్సాహంతో కార్తికేయుని సేన కదిలింది. ఆ సంరంభ రావానికి... మయూర క్రేంకారానికి వెఱచి పారిపోతున్న పాముల్లా దానవ సైన్యం చెల్లాచెదరైంది. స్కందునితో పాటే భద్రకాళి....... ప్రభంజన విజృంభణానికి తలలూపుతూన్న ఊడలు దిగిన మఱ్ఱి చెట్టులా జడలు విరబోసుకొని; అలాత చక్రంలా (త్రిప్పుడు పొట్లం లేక కాఱవి) నాలుకలను త్రిప్పుతూ.... పారిపోతున్న దానవులను.... దొడ్డ మండూకం దోమలను మ్రింగినట్లు నాలుకతో చప్పరించేస్తోంది. వృష పర్వుడు, విప్రచిత్తి, దండుడు మరియు వికంపనుడు ఇత్యాది దానవచమూపతులంతా దిటవుతో స్కందుని ఎదుర్కొన్నారు. కాని అతని బాణ వేగానికి ఆగలేక వీగి పోయారు.

తన సేన యొక్క చేడ్పాటును చూచిన శంఖచూడుడు కేసరిలా గర్జించి, కండ్లు కొలిమి తిత్తులై నిప్పు కణికలు రాల, దిశావలయం పెటి బీటలు వార పండ్లు పటపట కొరుకుతూ, అతి వేలమైన ఆగ్రహంతో నేలను దట్టించాడు. అతని పాద ఘట్టనకు భూతలం అదిరింది. రథస్థుడై స్కందుని ముందు నిలిచాడు. శింజినీ టంకారం చేసి ఆ కర్ణాంతం నారిని లాగి అగ్ని సదృశమైన శరపరంపరలచే పరసైన్యాలను నొప్పించాడు. ఉభయ పక్షాల ధానుష్కులు పరశ్శతంగా ప్రయోగించిన అమ్ములు.... ఆకాశానికి పందిరి వేసినట్లుగా ఉంది. ఉభయ పక్షాలలోను తెగిపడుతున్న వజ్రకుండల మండితమైన శూరవరుల తలలు... నింగి నుండి నేలకు రాలుతున్న తారల్లా ఉన్నాయి. అవని మీదికి ఒరిగినా ఆయుధాలు వీడని ఆయుధోప జీవులను చూచి కాలుడు సైతం జాలిపడు తున్నాడు.

శంఖచూడుని బాణ వర్షానికి రాహుగ్రస్తమైన ఆకాశంలా రణరంగంలో చీకట్లు అలుముకొన్నాయి. పర్వతాలను, పాములను, కొండచిలువలను, చెట్లను తన మాయచే వర్షంగా కురిపించాడు దానవ సమ్రాట్టు. ఇంకా అనేక మాయలను ప్రయోగించాడు. దానవ మాయాజాలంలో చిక్కుకొన్న కుమార స్వామి సైతం మంచుచే కప్పబడిన మార్తాండునిలా తేజోహీను డయ్యాడు. తక్కిన వేల్పుల లెక్కేమిటి? అలా మాయలో ముంచి మయూర వాహనుని ధ్వజాన్ని కూల్చి, పగ్గాలను త్రెంచి, సారథిని వ్రాల్చి, రథాన్ని కాల్చి, అశ్వాలనుడుల్చి మయూరాన్ని పరుగెత్తించి శరజన్ముని నిస్సహాయుని చేసి శక్తితో నేలకు తూలించాడు. అమృతాంధసులు ఒక్కపెట్టున హాహాకారాలు చేశారు.

పడిన కుమారుని పాటు చూచి భద్రకాళి వడివడిగా వచ్చి తన ఒడిలోనికి తీసుకొని రుద్రుని సన్నిధికి భద్రంగా చేర్చింది. హరుడు తన కుమారుని కరకమాలలచే నిమురగా వాడిన పైరు వర్ధిల్లినట్లు బడలిక తీరి అనంత బలసంపన్నుడై భద్రకాళీ సమేతుడై భండన భూమికి బయలుదేరాడు షడాననుడు. మధ్యలో వీరభద్రుడు శంఖచూడునితో పోరు సాగించాడు.

### భద్రకాళీ శంఖచూడుల యుద్ధం

సమరాంగణంలో నిలబడి మదిలో పార్వతీ పరమేశ్వరులను స్మరించి, దానవేంద్రుని మాయను ఛేధించి శిఖి వాహనుడు సింహనాదం చేసి అతనిని విరథునిగా యొనర్చి శక్త్యాయుధంతో మూర్ఛిల్లచేసాడు. దానవేంద్రుడు విరిగి పడిన కెరటం వలె ఉవ్వెత్తున లేచి బ్రహ్మదత్తమైన

శక్తిని ప్రయోగించాడు. కుమారుడు దానిని నిర్వీర్యం చేయగల సమర్థుడయ్యును గౌరవంతో నేలపై పడి ప్రణామం చేశాడు. దానవ సార్వభౌముని విజృంభణాన్ని చూచిన భద్రకాళి మహాసేనునకు బాసటగా నిల్చి అట్టహాసం చేసింది. ఆ నాదానికి దానవులు తెలివి తప్పారు. ఆమె ఉగ్రదంష్ట్ర, ఉగ్రదండ, కోటవి ఇత్యాది దేవీ మూర్తులతో కూడి యథేచ్ఛగా వీరపానం చేసి వీరనాట్యం చేస్తూ దానవసేనపై అగ్నివర్షం కురిపించింది. దానిని వైష్ణవాస్త్రంతో త్రిప్పికొట్టి బ్రహ్మాస్త్ర ప్రయోగం చేశాడు దానవుడు. దానిని నాలుకచాచి కప్పదోమను మ్రింగినట్లు మ్రింగేసింది కాళి. ఈ తీరుగా అస్త్రయుద్ధం చిరకాలంగా సాగింది. ఒకరిపై యొకరు అనేక అస్త్రాలను ప్రయోగించు కొంటున్నారు. కాని గెలుపోటములు నిశ్చయం కావటం లేదు. ఇక సహనాన్ని కోల్పోయిన భద్రకాళి దానవేంద్రుని పరిమార్చ తలచి పాశుపతాస్త్రాన్ని ప్రయోగింపబోయే సరికి ఆకాశవాణి ఇలా పలికింది. "ఓ చండికా! పాశుపతాస్త్ర ప్రయోగం చెయ్యకు. అస్త్రం అమోఘమైనదే ఐనా వీని విషయంలో అది వ్యర్థం. దానివల్ల అనర్థాలు చాలా ఉన్నాయి. వాణ్ణి తెగటార్చటానికి మరో ఉపాయాన్ని అన్వేషించు. "వెంటనే అస్త్రాన్ని ఉపసంహరించుకొని...... కొండ గుహ వంటి నోరు తెరచి దానవుని మీదికి దూకింది. అదే ఆమెకు సులువైన ఉపాయంగా తోచింది. వికృతాకారంతో, కరాళ వదనంతో, ఉగ్రదంష్ట్రలతో, దీర్ఘంగా నాలుకను చాచి మీదికి దూకుతున్న ఆమె విజృంభణాన్ని దివ్యమైన రౌద్రాస్త్రంతో అరికట్టాడు శంఖచూడుడు. అరికట్టి కోటి గ్రీష్మ చండభాను ప్రతాప సమానమైన కరవాలాన్ని వేగంగా ప్రయోగించాడు. దానిని ఆమె అవలీలగా మ్రింగి బలంగా వానిని పిడికిలితో మొత్తింది. పిడికిలి పోటుకు పుడమిపై పడి వెంటనే తేరుకొని లేచాడు. లేచాడు కాని మాతృభావన చేత ఆమెతో బాహు యుద్ధానికి సిద్ధపడ లేదు. అంత ఆ దేవి వాణ్ణి పట్టుకొని పలుమార్లు గిరగిర త్రిప్పి ఆట బంతిలా పైకి విసిరేసింది. వాడు క్రిందపడి లేచి భక్త వత్సల ఐన భద్రకాళికి నమస్కరించాడు. ఆమె వెంటనే సమరాన్ని విరమించి రుద్రుని సన్నిధికేగి యుద్ధ వార్తలను వాక్రుచ్చింది.

### శంఖచూడ వధ

కాళి యొక్క మాటలను విని రుద్రుడు వృషభ వాహనా రూఢుడై రుద్రగణాలు వీర నాట్య చేస్తూండగా వచ్చి రణరంగలో నిల్చేడు. శంకరుని చూచి పరమానంద భరితుడైన శంఖచూడుడు అధిక భక్తి తాత్పర్యాలతో రథాన్ని దిగి క్షోణితలం నెన్నెదురు సోకగా మ్రొక్కి పిదప రథాన్ని అధిరోహించి ధనుర్బాణాలను ధరించి రణ సన్నాహంతో నిల్చి పది బాణాలను శంభుని పాదపద్మాల ముందు వదలి వీర వందనం చేశాడు. దానికి సంతుష్టాంత రంగుడైన శంకరుడు ఐదు ముఖాలుగల సర్పశీర్ష

బాణాన్ని చేయెత్తి ఆశీర్వదించి నట్లుగా దానవుని శిరసుపైకి ప్రయోగించాడు. అలా ఆ వీరులిద్దరు గురు–శిష్య మర్యాదను యుద్ధనీతి పురస్సరంగా పాటించి వింటి నారిని బిగించి ధనుష్టంకారం చేసి బాణయుద్ధానికి దిగారు. ఒకేసారి వేయి బాణాలను ప్రయోగించగల నేర్పరి ఐన దానవుడు; అట్లే ప్రయోగించే సరికి అవి వేయి నాల్కలుగల ఆది శేషువు వలె శంకరుని సమీపించి ఆయనకు అలంకారా లయ్యాయి.

భండన భూమిలో స్థిరంగా నిల్చి, పరస్పరం ఒండొరులపై బాణవర్షాన్ని కురిపిస్తూన్న ఆ ధానుష్కులిద్దరూ ప్రళయకాల నీలజీమూతాలవలె ఉన్నారు. ఆ వీరులు ప్రయోగించిన వివిధ దివ్యాస్త్రాలకు ఆకాశం అగ్ని జ్వాలలతో నిండి.... అంత్య కాలంలో అంతరిక్షంలో సంభవించే నక్షత్ర యుద్ధంలా ఉంది. రణరంగం రుధిర ధారా ప్రవాహంతో నిండి పూర్ణ గర్భిణి ఐన నదిలా ఉంది. మృత కళేబరాలు వెల్లువలో పూచిక పుల్లల్లా తేలుతున్నాయి. అస్త్రాలన్నీ విఫలం కాగా శంఖచూడుడు శూలాన్ని చేపట్టి ఫాలాక్షుని మీదికి దూకాడు. వెంటనే హరుడు తన త్రిశూలంతో దానవుని వక్షస్థలాన్ని చీల్చాడు. తక్షణం అతని హృదయం నుండి ఒక దివ్య పురుషుడు బయటకు రాగా, అతనిని చూచి తన తేజస్సు అంతర్హిత మవుతూన్నదని గ్రహించిన దానవుడు 'నిలు! నిలు!' అని గద్దించాడు. అంత లోనే ఆ దివ్య తేజో మూర్తి యొక్క ఉత్తమాంగాన్ని శంకరుడు ఖండించాడు. వెంటనే భద్రకాళి మధ్యమధ్యలో మద్యపానం చేస్తూ దానవుల పచ్చిమాంసాన్ని నంజుడుగా నములుతూ అసంఖ్యాక వీరులను బలి తీసుకొంది. వీరభద్రాది ప్రమధులు విజృంభించి దానవ సేనా సమూహాన్ని చెఱకు తోట నరికినట్లు నరికారు. దానవ సైన్యం చెల్లా చెదరై భీతితో పలాయితులయ్యారు.

ఆపద పొందిన తన సైన్యాన్ని చూచి శంఖచూడుడు కోపించి రుద్రునితో "శంకరా! ఇదిగో! సంశప్తకుడనై (యుద్ధంలో విజయాన్ని సాధించకుండా ఇంటికి తిరిగి రానని ప్రతిజ్ఞ చేసిన వీరుడు) నేనిక్కడ నిల్చున్నాను. వీరుడవైతే నువ్వు కూడ నిలబడు! కాలి బంట్లను తరిమితే నీకేమి ప్రయోజనం?" – అని మందర పర్వతంలా స్థిరంగా నిల్చున్నాడు. అలా నిలబడి వెంటనే అనేక మాయలను ప్రయోగించి; వార్షుకాభ్రంలా రుద్రుని పైకి శర పరంపరను గుప్పించాడు. వాటిని శంకరుడు మహేశ్వరాస్త్రంతో అవలీలగా ఛేదించాడు. ఆ అస్త్ర ప్రయోగంతో దానవుని మాయా విద్య అదృశ్యం కాగా అతని అస్త్రాలన్నీ తేజోవిహీన మయ్యాయి. తక్షణం ఫాలాక్షుడు తన నిశిత త్రిశూలంతో శంఖచూడుని కంఠాన్ని ఖండించబోగా ఆకాశవాణి ఇలా పలికింది : "ఓ మహాదేవా! నీవన్నిటా సమర్థుడవే! సందేహంలేదు. ఐనా వేద మర్యాదను పాటించాలి తప్పదు. ఈ దానవుని కంఠమందు

విష్ణుకవచము, అతని భార్యకు పాతివ్రత్యము ఉన్నంత వరకు అతనికి వృద్ధాప్యము, మరణము లేవని బ్రహ్మ వరం ఇచ్చాడు. దానిని నువ్వు సఫలం చేయాలి." ఆ పలుకు లాలకించిన శంకరుడు 'సరే' అని; విష్ణువును స్మరించి శంఖచూడుని భార్యా పాతివ్రత్యానికి భంగాన్ని కల్పించమని అతనిని ఆజ్ఞాపించాడు.

వెంటనే మాయావి ఐన హరి ముసలి బ్రాహ్మణ వేషంలో శంఖచూడుని సమీపించి అమిత బ్రాహ్మణ భక్తుడైన అతనిని యాచించి విష్ణుకవచాన్ని పట్టుకుపోయాడు. ఆపై హరి మాయచే దానవ రూపాన్ని పొంది ఆ కవచాన్ని ధరించి శంఖ చూడుని భార్య ఐన తులసి పాతివ్రత్యాన్ని హరించాడు. అలా హరించిన మరుక్షణంలో సర్వజ్ఞుడైన శంకరుడు..... సహస్ర కోటి మధ్యాహ్న మార్తాండ మండల శిఖోపమము, రోదసీ సంప్రకాశము, దుర్నివారము, దుస్సహము, దుర్ధర్షము, అవ్యర్థము, అత్యుగ్రము, వైరి ఘాతుకము, సర్వ సృష్టి సంహార సామర్థ్యము గల విజయము అనే శూలాన్ని అవలీలగా పట్టుకొని దానవునిపై ప్రయోగించాడు. అది అతని నెత్తిపై అంతరిక్షంలో మేరు స్తంభంలా నిల్చి సూటిగా క్రిందకు దిగి శివాజ్ఞచే దానవుని శిరస్సును ఛేదించి తిరిగి శంకరుని చేరింది. ఆ శూలం జీవ బ్రహ్మైక్య స్వరూపం. ఆ కారణంగా దాని స్పర్శచే పునీతుడైన శంఖ చూడుడు శాప విముక్తుడై పూర్వరూపాన్ని పొంది గోలోకాన్ని చేరుకొన్నాడు. ఎల్లెడలా దేవతలలో ఆనందోత్సాహాలు వెల్లి విరిశాయి. శంఖ చూడుని ఎముకల నుండి శంఖం పుట్టింది. ఒక్క శంకరునికి తక్క మిగిలిన వారందరికి శంఖజలం ప్రశస్తం. తదనంతరం అందరూ వారివారి నెలవులకు చేరుకొన్నారు. ఈ గాథ పవిత్రము, సర్వదుఃఖ హరమూను."

**తులసి విష్ణువునురాయివి కమ్మని శపించుట, సాలగ్రామ శిల – విష్ణు స్వరూపం**

సూతుడు శివమహా పురాణ గాథను మునులకిలా చెపుతున్నాడు: "ఓ! మునులారా! విష్ణువు తులసి యొక్క పాతివ్రత్యాన్ని హరించాడని చెప్పాను గదా! తదనంతర గాథను వినండి. శంఖచూడుని రూపంలో వెళ్ళిన విష్ణువు యొక్క చర్యలలోను, ఆకర్షణలలోను గల వ్యతిక్రమాన్ని అనుసరించి.... తులసి; తనను కలిసినవాడు మాయావి అని గ్రహించి "నీవెవరవు?" నన్ను అంటు పరిచావు! చెప్పు. చెప్పకపోతే శపిస్తాను!" అని ఆగ్రహంతో పలికింది. ఆ పతివ్రత శాపానికి భయపడిన గరుడధ్వజుడు ఆమె ముందు నిజరూపంతో సాక్షాత్కరించాడు.

చతుర్భుజుడు, శ్రీ వత్స లాంఛనుడు, పీతాంబరధరుడు, స్వర్ణ కిరీట కుండల కేయూర భూషితుడు, కాంచీ మౌక్తిక తారహార కటక గ్రైవేయ భూషావళీ శోభితుడు, శతకోటి కందర్ప సుందరాకారుడు ఐన విష్ణువును చూచి....... అసహ్యంతో నొసలు చిట్లించి మహా పతివ్రతా శిరోమణి ఐన తులసి ఇలా శపించింది : “ఓ! మాధవా! విష్ణూ! నీవు సర్వవ్యాపకుడవే అయినా జీవులు ఉపాధిని (శరీరాన్ని) పొంది ఉన్నప్పుడు వారి మీద నీకెట్టి అధికారం లేదు. నా శీలాన్ని అపహరించి నా భర్త మరణానికి కారకుడ వయ్యావు. ఇది శిలా హృదయం కల వాడు చేసే పని! కనుక నువ్వు శిలా రూపుడవవుతావు!” ఇలా శపించి తులసి పలుమార్లు రోదించింది.

అంత విష్ణువు కింకర్తవ్యతా విమూఢుడై శంకరుని స్మరించగా ఆయన సాక్షాత్కరించాడు. వారిద్దరిని చూచి గతాన్ని గ్రహించి శంభుడిలా అన్నాడు. “ఓ తులసీ నువ్వు దుఃఖించకు! కర్మ ఫలం అనుభవించక తప్పదు. ఓ! మంగళాంగీ గతంలో గొప్ప తపస్సు చేశావు. దాని ఫలం నీకు దక్క బోతున్నది. నీ దేహ పాతానంతరం తులసి మొక్కగా జన్మిస్తావు. ముల్లోక వాసు లందరుకు అది ప్రీతిపాత్ర మవుతుంది. పూజా సామాగ్రిలో ప్రధాన వస్తువు అవుతుంది. తులసి మొక్కకు అధిష్ఠాతృదేవివైన నీవు దివ్య రూపంతో నిత్యమూ వైకుంఠంలో విష్ణు సన్నిధిలో ఉంటావు. విష్ణువు నిన్ను క్షణకాలం కూడా విడిచి పెట్టకుండా వనమాలా వక్షస్కుడై ఉంటాడు. నీచే పరిత్యజింపబడిన ఈ దేహం పుణ్యనదీ రూపాన్ని పొంది ‘గండకి’ అనే పేరుతో పిలువ బడుతుంది. నీకు సాగర సంగమ మహద్భాగ్యాన్ని కల్పించాను. భూలోకంలో భారతదేశంలో విష్ణు స్వరూపమైన సాగర సంగమాన్ని పొంది సుఖించు.

ఓ! శుభాంగీ! నీ శాపంచే ఈ విష్ణువు గండకీ నదీ తీరంలో శైల రూపాన్ని పొంది ఆ శైలానికి అధిష్ఠాన దేవతగా ఉండి ఆ నదిలో స్నానం చేసిన వారి నందరిని అనుగ్రహిస్తూ ఉంటాడు. అంతే కాదు! పదునైన దంతములు గల కోట్లాది కీటకాలు ఆ కొండ రాళ్ళను ఛేదించి లోపల విష్ణు చక్రా కారంగా మలుస్తాయి. ఆ పర్వతం నుండి వేరుపడిన శకలాలే మహా పుణ్య ప్రదమైన సాలగ్రామ శిలలవుతాయి. చక్రభేదాన్ననుసరించి లక్ష్మీనారాయణ ఇత్యాది భేదాలు కలుగుతాయి. ఓ విష్ణూ! నీతో తులసి యొక్క సమాగమానికి ప్రతీకగా సాలగ్రామ శిల ఎప్పుడూ ఏకరూపంగా ఉండి మహా పుణ్యాన్ని ఇస్తుంది. శంఖచూడునికి ప్రతీక ఐన శంఖం, తులసికి ప్రతీక ఐన తులసి, విష్ణువుకు ప్రతీక ఐన సాలగ్రామ శిల ఈ

మూడు అనవరతము కలసే ఉండాలి. ఈ మూటిని వేరు చేసిన వాడు భార్యా వియోగాన్ని పొందటమే కాకుండ ఏడు జన్మల వరకు అనారోగ్యవంతుడవుతాడు. సాలగ్రామ శిల గాని, శంఖం గాని అదెప్పుడూ తులసి పత్రంతో కూడి ఉండాలి." ఇలా పలికి శంకరుడు అంతర్హితుడయ్యాడు.

తులసి తక్షణం దేహ త్యాగం చేయగా ఆమె దేహం నుండి గండకీ నది ఆవిర్భవించింది. ఆమె దివ్య రూపాన్ని పొంది మాధవునితో కూడి వైకుంఠానికి వెళ్ళింది. విష్ణువు భూలోకంలో గండకీ నదీ తీరంలో శైల రూపంలో నిలిచాడు. అక్కడ నదిలో పడిన శిలలు మాత్రమే సాలగ్రామ శిలలై మహా పుణ్యప్రదము లవుతాయి. నేల మీద ఉన్న శిలలకు పింగళములని పేరు. అవి హానిని, అశుభాన్ని కలిగిస్తాయి. ఈ పుణ్య గాథను చదివినా వినినా వారికి మరణానంతరం వైకుంఠ ప్రాప్తి ఆపై క్రమంగా శివ సాయుజ్యము లభిస్తుంది."

## అంధకాసుర వృత్తాంతం

సూతుడు శౌనకాది మునులతో ఇలా అంటున్నాడు. "మునులారా! లీలా మానుష విగ్రహుడైన పరమేశ్వరుని అసంఖ్యాక నామాలలో 'అంధకరిపుడు' అనే నామం ఒకటి. అంధకాసురుడు శంభుని చేతిలో మరణించి గణాధ్యక్ష స్థానాన్ని పొందిన ఆ పవిత్ర గాథను చెపుతున్నాను వినండి.

పూర్వం ఒకానొకప్పుడు భక్త వత్సలుడు, సకల దేవతా సార్వభౌముడు ఐన శంకరుడు కైలాసాన్ని విడిచి కాశీ నగరానికి వచ్చాడు. వచ్చి భైరవుని నగర రక్షకునిగా నియమించి పార్వతితో కూడి అక్కడ అనేక లీలలను ప్రదర్శించాడు. కాశీలో నివాసముంటూ మందర పర్వత ప్రాంత మండలి సుందర దృశ్యాలను చూడగోరి గౌరితోను, గణాధ్యక్షులతోను కూడి గిరిభూములను చేరేడు.ఒక రోజున శివ పార్వతు లిద్దరు వన విహారం చేసి విశ్రాంతికై ఒక వట వృక్షాన్ని ఆశ్రయించి సరస సల్లాపాలాడుకొంటున్న వేళ పార్వతీ దేవి పగడాల వంటి తన పాణి పల్లవాలతో పరిహాసానికై పరమేశ్వరుని కన్నులను మూసింది. తక్షణం జగత్తంతా అంధకార బంధురమైంది. శంభుని స్పర్శ కారణంగా శాంభవి యందు ఒకానొక వికార భావం పుట్టి ఆమె అరచేతి యందు మదజలం ఉద్భవించింది. ఆ జలం ఫాలాక్షుని నేత్రాగ్నిచే తపింప చేయబడి ఒక పెద్ద బిందువు రూపంలో జారింది. దాని నుండి వికృతరూపుడు, మహా క్రోధుడు, అంధుడు, భయంకరుడు, కృతఘ్నుడు, అధిక రోమములు కలవాడు, నల్లని వాడు, జడలు కలవాడు అగు పురుషుడు ఉద్భవించాడు. అతడు పాడుతూ,

నవ్వుతూ, గట్టిగా ఏడుస్తూ నాట్యం చేస్తూ, నాలుకను బయటపెట్టి రోదనం చేస్తూ..... ఇలా అనేక వికృత చేష్టలను చేయ సాగేడు. వాడే అంధకాసురుడు.

మునులారా! స్త్రీ పురుష సంపర్కం వలన జరుగుతున్న ప్రస్తుత మైధున సృష్టి ఉన్నదే.... ఇది దక్ష ప్రజాపతి నుండి ప్రారంభమైంది. అంతకు ముందు కాలంలో కేవలం సంకల్ప మాత్రం చేత, దర్శన మాత్రం చేత, స్పర్శ మాత్రం చేత మాత్రమే సృష్టి కార్యం జరుగుతూ ఉండేది. ఈ అంధకాసురుడు కేవలం ఆది దంపతుల స్పర్శ నుండి ఉద్భవించిన వాడు. వాడి వికృత రోదనానికి భయపడిన పార్వతి "నాథా ఈ వికృతాకారుడెవరు? వీడిని ఎవరు సృష్టించారు?" అని ప్రశ్నించింది. దానికి సమాధానంగా "దేవీ! నీ స్పర్శ నుండి ఉద్భవించిన వీడు నీ కుమారుడే! వీనిని నీవు, నీ చెలులు యథానురూపంగా పెంచండి. గణాల బారి నుండి రక్షించండి! వీడు నీ మీద ఆధారపడి ఉన్నాడు సుమా!" అని సమాధాన మిచ్చాడు శంకరుడు. పార్వతి కూడా వాణ్ణి అనేక ఉపాయాలతో రక్షిస్తూ పెంచుతూన్నది.

ఇదిలా ఉండగా అదే సమయంలో హిరణ్యాక్షుని భార్య సంతానం లేని కారణంగా తన భర్తను తపస్సు చెయ్యమని ప్రోత్సహించింది. కశ్యపుని కుమారుడైన ఆ హిరణ్యాక్షుడు పుత్రార్థియై అడవిలో ఉండి శివుని గూర్చి తపస్సు చేయగా ఆయన ప్రత్యక్షమై ఆ రాక్షసుని వరం కోరుకోమన్నాడు. అంత హిరణ్యాక్షుడు "శంకరా! నాకు తగిన పుత్రుని అనుగ్రహించు. సంసార వృక్షానికి ఫలం సంతానం. పుత్రులు లేని వానికి ఉత్తమ గతులు లేవు. సంసారి ఐన వాడు తన తేజస్సును సంతాన రూపంలో చూచుకొని ముచ్చట పడతాడు. ఒక పురుషుడు సంసారియై సంతానాన్ని పొందిన తర్వాతనే తండ్రి అవుతున్నాడు. లేని యెడల కేవలం భర్తగా మిగిలి పోతున్నాడు. కనుక హే! రుద్రా! నాకు ఉత్తమ పుత్రుని అనుగ్రహించు" అని కోరేడు.

దానికి పశుపతి అతని కోరికకు సంతసించి "ఓ! దానవ వీరా! నీకు పుత్ర సంతాన యోగం లేదు. పార్వతీ పరమేశ్వరులమైన మాకు అంధకుడనే కుమారుడు ఒకడున్నాడు. వాడు నీకు తగిన వాడు. వాణ్ణి నీకు ధారదత్తం చేస్తున్నాను. నీ కుమారునిగానే పెంచుకో !" అని వరాన్ని అనుగ్రహించి అంధకుని అప్పచెప్పాడు. అంధకుని వెంట పెట్టుకొని హిరణ్యాక్షుడు పుత్ర గర్వంతో దేవతలందరిని జయించి ఈ భూమిని రసాతలానికి మోసుకు పోయాడు. తండ్రి కొడుకుల విపరీత చర్యలకు భయకంపితులైన దేవతలు విష్ణువును

ప్రార్థింపగా ఆయన సర్వ యజ్ఞాత్మకము, భయంకరము, శ్రేష్ఠము అగు యజ్ఞ వరాహావతారాన్ని ధరించి హిరణ్యాక్షుని తన సుదర్శన చక్ర ధారలకు ఆహుతి చేసి తన పంటి కోర మీద ఈ జంబూ ద్వీపాన్ని నేరేడు పండు వలె నిలపెట్టి పూర్వ స్థానంలో ఉంచి, అంధకుని రసాతలానికి అధిపతిని చేసి పట్టాభిషేకం చేశాడు. హరి యొక్క అద్భుత చర్యకు సుపర్వులు మహదానంద భరితులై విష్ణువును స్తుతించారు. సకల ప్రాణులు సుఖించాయి.

**హిరణ్యకశిపుని విష్ణువు నృసింహావతారంలో వధించుట**

హిరణ్యాక్షుడు అలా విష్ణువు చేతిలో హతుడు కాగా; వాని సోదరుడు హిరణ్యకశిపుడు హరి మీద ద్వేషంతో బ్రహ్మను గూర్చి తపస్సు చేసి మరణం లేని వరాన్ని పొంది వరగర్వితుడై బృందారకులను హింసింప సాగేడు. వారంతా హరిని ఆశ్రయించి తమ గోడును వెళ్ళబుచ్చుకోగా ఆయన వారికి అభయమిచ్చి పంపించాడు. పంపి తాను నృసింహావతారాన్ని ధరించి దానవుని నగరంలోకి ప్రవేశించి రాక్షస గణాలను ఒడిసిపట్టి వాడి గోళ్లతో చీల్చి వారిని సదమదం చేశాడు. సర్వాన్ని ఆక్రమించి ఆ సింహం రాక్షస సంహారం చేయటం మొదలు పెట్టింది. ఆ వార్త రాక్షస రాజుకు చేరింది దానిని చెర పట్టమని ఆయన భటులను ఆజ్ఞాపించాడు. తండ్రి చెంత నున్న తనయుడైన ప్రహ్లాదుడు తండ్రి మాటలను విని, " తండ్రీ! అది మామూలుగా వనంలో తిరిగే సింహం కాదు. సాక్షాత్తు విష్ణు భగవానుడే ఆ రూపంలో నగరంలో ప్రవేశించాడు! దానితో పోరాడగల వీరుడు ముల్లోకాలలోను లేడు. కనుక నీవా నృహింహునకు ప్రణమిల్లి శరణు వేడి రాజ్యాన్ని కాపాడుకో!" అని హితవు చెప్పాడు. ఆ మాటను పెడ చెవిని పెట్టాడు రాక్షస రాజు, సింహాన్ని బంధించ బోయిన రాక్షసవీరులు అగ్నిని సమీపించిన మిడుతల వలె క్షణంలో భస్మమయ్యారు.

అలా ఆ సింహం గిరి గహ్వరం వంటి నోరును తెరచి కనుపించిన రాక్షసులను మ్రింగుతూ హిరణ్యకశిపుని సభాభవనం లోనికి ప్రవేశించింది. దానిని చూచిన వెంటనే హరిమీది ద్వేషంతో రాక్షసరాజు అగ్ని సదృశమైన తన గదను ప్రయోగించాడు. ఆ గదను ఒడుపుగా పట్టి తిరిగి వాని మీదికే ప్రయోగించాడు నృసింహుడు. దానిని అవమానంగా భావించిన రాక్షసరాజు కోపంతో మండిపడి అనేక శస్త్రాలను సంధించాడు కాని అవన్నీ వమ్ము అయ్యాయి. అలా వారిద్దరి మధ్య చిరకాలం యుద్ధం సాగింది. ఇక జాగు చెయ్యటం మేలు కాదని తలచి నృసింహుడైన హరి తన సహస్ర బాహువులతో హిరణ్యకశిపుని

పట్టి..... రాత్రి, పగలు కాని సంధ్యా కాలంలో; లోపల బయట కాని ద్వార దేశ స్థానంలో సజీవము నిర్జీవము గాని గోళ్ళచే చీల్చి చంపాడు. చంపి రాక్షస రాజ్యానికి ప్రహ్లాదుని అభిషిక్తుని చేశాడు.

**అంధకుని తపస్సు, శివుని వద్దకు దూతలను పంపుట**

ఒకప్పుడు...... హిరణ్యాక్షుని కుమారుడైన అంధకుని; అతని సోదరులు అంధుడవైన నీకు రాజ్యం ఎందుకు? అని పరిహసించి అతని రాజ్యాన్ని హస్తగతం చేసి కొన్నారు. దుర్బుద్ధితో వారు చేసిన కుటిల చర్యకు కుమిలి పోయిన అంధకుడు..... ఒంటి కాలిపై నిలిచి, ఆహారాన్ని విడిచి, రెండు చేతులను పైకెత్తి, మంత్రాన్ని జపిస్తూ బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మ సాక్షాత్కారం కాలేదు. దానికి మిక్కిలి దుఃఖించి మరింత పట్టుదలతో పదునైన కత్తితో తన శరీరం నుండి మాంసాన్ని కోసి మంత్రపూతంగా అగ్నిలో హోమం చేశాడు. చివరకు నరాలు, ఎముకలు మాత్రమే మిగిలాయి. అతని తపస్సు నుండి పుట్టిన అగ్ని జ్వాలలు లోకాలను దహింపగా దేవతలు బ్రహ్మను చేరి రక్షించమని మనవి చేశారు. వెంటనే బ్రహ్మగారు అంధకుని ముందు ప్రత్యక్షమై "వత్సా! నీ అభీష్టాన్ని తెలుపు! నెరవేరుస్తాను" అని పల్కగా వాడిలా కోరేడు. "పితామహా ముందుగా నాకు దృష్టిని ప్రసాదించు! పరుష వచనాలతో నన్ను నిందించిన నా సోదరులు నాకు సేవకుల గుదురు గాక! నా రాజ్యం నాకు సంక్రమించును గాక! ఇంద్రాదులు నాకు కప్పమును చెల్లింతురు గాక! నాకు మృత్యువు లేక పోవు గాక!"

దానికి పితామహుడు అంధకునితో "వత్సా! నువ్వు కోరిన సర్వము అట్లే నెరవేరుతుంది. కాని మరణం లేకుండ వరమియ్యటం సాధ్యం కాదు. పుట్టిన ప్రతిజీవి మరణించట మనేది సృష్టి నియమం. దాన్నుండి నాకు కూడ మినహాయింపు లేదు. బ్రహ్మ మానంలో నా ఆయుర్దాయం నూరు సంవత్సరాలు. కనుక ఏదో ఒక మరణ కారణాన్ని స్వీకరించు." అని పల్కగా వాడిలా అన్నాడు.

"పితామహా! అయితే విను! తల్లి వలె పూజింప దగినది ముల్లోకాలలోను శ్రేష్ఠమైనది, ప్రకృతి సౌందర్యాన్ని మించిన సౌందర్యం గలది, అపురూప సుందరాంగి ఐన స్త్రీని నేను కోరినప్పుడు నాకు రాజ్య భ్రష్టత్వం కలుగు గాక!" అంధకుని కోరికకు ఆశ్చర్య పడిన బ్రహ్మ మనుసులో శంకరుని స్మరించి ఆయన అనుజ్ఞను పొంది వానికా వరాన్ని కూడా ఇచ్చాడు. దానికి పరమానంద భరితుడై వాడు "ఓ ప్రభూ! కేవలం నరములు, ఎముకలు మాత్రమే

మిగిలిన నేను శత్రువులతో ఎలా యుద్ధం చేయగలను. నువ్విచ్చిన వరాలను సాధించటానికి తగిన శరీరాన్ని అనుగ్రహించు" అని వేడగా విరించి వాడి దేహాన్ని తన కరకమలాలతో నిమిరేడు. వర్ష జలాలకు వాడిన పైరు వర్ధిల్లినట్లు విధాత అమృత హస్తస్పర్శకు వాడి శుష్క శరీరం మధు మాసంలో చిగిర్చిన మామిడి గున్నలా జీవ రసాన్ని పొంది పూర్ణ యౌవనంతో ప్రకాశించింది.

అంధకుడు నగర ప్రవేశం చేసి ముందుగా ప్రహ్లాదాది సోదరులను తన వశవర్తులుగా చేసికొన్నాడు. బృందారకులాదిగా అందరిని జయించాడు. చూడ చక్కని సుందరీ మణులైన యువతులను తన అంతఃపురానికి చేర్చాడు. మధుర పానీయాలను ఆస్వాదిస్తూ మహోన్నత రాజ భవనాలలో క్రీడించాడు. విహార యాత్రకు మందర పర్వత ప్రాతం మిక్కిలి మనోహరమైనదని ఎరిగి ఒక రోజున బయలుదేరి అక్కడ విడిది చేశాడు. వానికి దుర్యోధన, వైధస, హస్తి అనే పేర్లు గల ముగ్గురు మంత్రులున్నారు. వారు మందర పర్వత ప్రాంత మంతా కలియ తిరుగుతూ ఒక రమణీయ గిరి శిఖరంపై కొలువై ఉన్న పార్వతీ పరమేశ్వరులను చూచి అంధకుని వద్దకు వచ్చి సర్వమంగళ అయిన పార్వతి సౌందర్యాన్ని అతివేలంగా వర్ణించి చెప్పారు. చెప్పి "ఓ ప్రభూ! ఆ విభూతిరాయుని కంటే నువ్వే ఆ కోమలాంగికి తగిన నాయకుడవు!" అని వానికి 'ఆహా'! పుట్టించారు. 'దుష్టుడు మంత్రియై దొరను చెరచు' అన్నట్లుగా చేశారు వారు.

అదే అదనుగా మదనుడు చెఱకు విల్లును చేపట్టి, తుమ్మెద బారు నారిని బిగించి, కమ్మని తేనియ లూరిన పూవు టమ్ములను అంధకుని ఎదమీదికి గురిచూసి విసిరాడు. అగ్గలమైన వలపుకు ఆగలేక ఆ దైవోపహతుడు వెంటనే సచివులకు చెప్ప వలసిన మాటలను చెప్పి ...... పార్వతిని తనకు అప్పనంగా అప్పచెప్ప వలసిందిగా రుద్రునకు వర్తమానం పంపించాడు. వాడు శంకరుని సముఖంలో నిల్చి అంధకుని మాటలను ఇలా మనవి చేశాడు. "ఓ మునీ! నా ఏలిక ముల్లోకాలకు ప్రభువు! ఆయన చెప్పి పంపిన సందేశాన్ని విను. పండు కోతి వంటి నీకు మంచి పరువంలో ఉన్న ఈ పడతి సాంగత్యం తగదు. కాకులు రావిపండ్లు తిని కక్కితే రాతిని చీల్చుకొని రావి చెట్టు మొలుస్తుంది. చివరకు నిర్మాణాన్ని కూలదోస్తుంది. స్త్రీలు కాకుల వంటి వారు! పురుషుని మనసు ఎంత వజ్ర పంజరం వంటి దైనా స్త్రీలను చేరదీస్తే అది లోహమై, గ్రావమై (శిలయై) దారువై, తరుణ వృక్షమై, ఫల ప్రాయమై, పూవై, మకరందమై క్రమంగా పోను పోను నీళ్ళకంటె పల్చనై

జారిపోతుంది. తాపసివైన నీకు ఈమె తోడి పొత్తు తగదు. ఈ మెరుగు బోడిని మా దొరకు అప్ప చెప్పు. శ్రేష్ఠమైన మణిని బంగారంలో పొదిగి నప్పుడే గదా దాని శోభ! బూడిద గుమ్మడి కాయలా ఉన్న నీకు ఈ పూబోడితో తగులాటం కూర్చిన విధి నేర్పరి గదా! ఈ పల్లవాధరిని మా ప్రభువుకు ఉపాయనంగా సమర్పించక పోతే యుద్ధంలో నీ ప్రాణాలను బలి పెట్టి ఐనా సరే ఈమెను చేపట్టి గాంధర్వ వివాహం మా ఏలిక చేసికొనటం నిశ్చయం." ఇలా పలికి విరమించారు సచివులు.

దానికి ఆగ్రహోదగ్రుడైన రుద్రుడు మండిపడి వారిని త్రుంచగా సంకల్పించి; దూతను తునుమటం నీతి గాదని ఎంచి పోరుకు సిద్ధమని చెప్పి పంపాడు.

వారు తిరిగి వచ్చి రుద్రుని వచనాలను తమ దొరకు యథా తథంగా విన్నవించారు. సచివుల వచనాలను చెవి యొగ్గివిని, ప్రచండ వీరుడు, ఘూర్ణిత లోచనుడు ఐన అంధకుడు భగ్గున మండిపడి కాలాగ్ని సదృశమైన గదను చేపట్టి క్షణంలో రాక్షస సైన్యాన్ని సమీకరించి తక్షణం రుద్రుని మీదకు సమరోత్సాహంతో కదిలేడు.

**అంధకుడు శివునితో యుద్ధము చేయుట**

రుద్రుడు కూడ తన గణాలతో, సకల దేవతా సమూహంతో యుద్ధ సన్నద్ధుడై నిలిచాడు. గిలుడనే వాడు అంధకుని పక్షాన, వీరకుడు రుద్రుని పక్షాన చమూపతులై శస్త్రాస్త్ర సంపన్నులై నిలిచారు. పోరు మొదలైంది. మొదటగా పార్వతీ పరమేశ్వరుల నివాస స్థానమైన మందరగిరి గుహాముఖ ద్వారాన్ని గదతో బ్రద్దలు కొట్టాడు గిలుడు. వెంటనే రాక్షస సైన్యం పార్వతి కొరకు గిరి కందరం లోనికి బిలబిల వెళ్ళబోతుండగా వీరకుడు ఇతర దేవతలు వారిని అడ్డగించారు. అలా అడ్డగించిన బ్రహ్మ, విష్ణు, ఇంద్ర, సూర్య, చంద్రాది దేవతలను విఘసాసురుడనే రాక్షసుడు గ్రక్కున మ్రింగటం మొదలు పెట్టాడు. ప్రమాదాన్ని పసిగట్టిన వీరకుడు ఈ విషయాన్ని రుద్రుని చెవికి చేర్చగ ఆయన వృషభ వాహనా రూఢుడై వచ్చి విఘసుని ముందు నిల్చి మ్రింగిన వస్తువులను వెడల గ్రక్కించే సామర్థ్యంగల మంత్రాన్ని జపించి వారందరిని బయటకు రప్పించాడు. అప్పుడు వారందరు రాహువు నోట్లోంచి బయట పడ్డ రవిలా ప్రకాశిస్తూ రెట్టింపు ఉత్సాహంతో రాక్షసులను సంహరించటం మొదలు పెట్టారు.

ఆ శంకర – అంధకులిరువురు తమ తమ సైన్యాలను భేదింప శక్యంకాని వజ్ర – పర్వత వ్యూహాలలో నిలపెట్టి రణం చేస్తూండగా ప్రథమ విజయం శివుని ప్రభావంచే

దేవతలకే దక్కింది. దానికి దుఃఖితుడైన అంధకుడు బ్రాహ్మణ శ్రేష్ఠుడైన భార్గవుని చెంతకు రథాన్ని దిగి ఒంటరిగా నడచి వెళ్ళి చేతులు జోడించి ఇలా ప్రార్థించాడు: "ఓ! భార్గవవంశ మండనా! అసురుల యొక్క అభ్యుదయాన్ని అనవరతము కాంక్షించే నీ గురుత్వంలో మేము ఎల్లప్పుడు విజయాన్నే పొందుతూ వస్తున్నాం. ఇంద్రో పేంద్రులను సైతం ఏనాడూ లెక్క చేయలేదు. కాని ఈనాడు మా శత్రువులైన దేవతల చేతిలో పరాజయాన్ని పొందేము! వైరివీరుల చేతిలో హతులైన కుంభ, జంభాది శ్రేష్ఠులైన అసుర గణాలను చూడు! గురుదేవా! కేవలం కాల్చిన ధాన్యపు పొట్టు (ఊక) నుండి పుట్టిన పొగను పీల్చి పదివేల సంవత్సరాలు తపస్సు చేసి సాధించిన మృత సంజీవనీ విద్య యొక్క అవసరం ఈనాడు వచ్చింది. హతులైన అసురులను ఆ విద్యతో పునర్జీవితులను చేయి."

వేద విదుడైన శుక్రుడు అంధకుని మాటలకు దుఃఖించి కర్తవ్యం విషయంలో ఆలోచనలో పడ్డాడు. దానవులను బ్రతి కించటం అంటే..... శంకరుని నుండి పొందిన విద్యను ఆయనకు వ్యతిరేకంగా ప్రయోగించటం! బ్రతికించకుండ ఉపేక్ష వహించటం అంటె తన ఏలికకు అన్యాయం చేయటం! ఏదైనా సరే! శరణాగత ధర్మం చాలా గొప్పది అని యెంచి అంధకునికి అభయ మిచ్చి పంపించాడు. పంపించి రణభూమికి వచ్చి శంకరుని మదిలో స్మరించి ఒక్కొక్క రాక్షసుని ఉద్దేశిస్తూ మంత్రాన్ని ఆవృత్తి చేస్తూ విగత జీవులైన దైత్య, దానవ, రాక్షసులందరిని బ్రతికించాడు. వారంతా నిద్రనుండి లేచిన వారివలే లేచి వికటంగా గర్జిస్తూ, ఆయుధాలను ధరించి, ద్విగుణీ కృతోత్సాహంతో రుద్ర గణాలను చీల్చిచెండాడటం మొదలుపెట్టారు. ప్రమథ గణాలు పలాయనం చిత్తగించాయి. ఇదంతా శుక్రుని మంత్రవిద్య ప్రభావంగా గుర్తించిన శిలాద పుత్రుడైన నంది వెంటనే శంకరుని చెంతకేగి విషయాన్ని వివరించి ఉపాయాన్ని చెప్పమని కోరేడు. దానికి శంభుడు సేనా వ్యూహాన్ని ఛేదించి శుక్రుని ఎత్తుకొని రమ్మని నందిని పురమాయించి దానికి తగిన బలాన్ని ఇచ్చాడు.

**శివుడు శుక్రుని మ్రింగివేయుట**

వేగంగా నంది రంకె వేస్తూ సేనా వ్యూహాన్ని సడలించుకొంటూ వెళ్ళి; శరభ మృగం ఏనుగును ఎత్తుకెళ్లినట్లు, గరుత్మంతుడు కోడిపిల్లను తన్నుకు పోయినట్లు, శుక్రుని తన కొమ్ముల మధ్య ఇరికించుకొని భద్రంగా రుద్రుని సన్నిధికి చేర్చాడు. గ్రక్కున ఆ భూతనాథుడు శుక్రుని రెండు వ్రేళ్ళతో పట్టుకొని ద్రాక్ష పండువలె నోట్లో వేసికొని గుటుక్కున మ్రింగేశాడు. కాలకూటాన్ని మ్రింగిన

నీలకంఠునకు శుక్రుడు ఎక్కువా? వెంటనే దానవులు 'అయ్యో! అయ్యో!' అంటూ దుఃఖిస్తూ చెల్లాచెదరయ్యారు.

**శివుడు అంధకునకు గణాధ్యక్ష పదవి నిచ్చుట – శుక్రుడు బయటకు వచ్చుట**

నీలకంఠుడు శుక్రుని మ్రింగి వేయగా దానవ సేన...... కొమ్ములు లేని వృషభాలవలె గోళ్ళు లేని పెద్దపులుల వలె, కోరలు లేని సింహాల వలె, రెక్కలు లేని బాణాల వలె, వ్రతానుష్ఠానం లేని వేదాధ్యయనం వలె నిర్వీర్యమై పోయింది. చంద్రుడు లేని రాత్రి వలె, వేదాధ్యయనం లేని విప్రుల వలె, భర్తృ విహీనలైన స్త్రీలవలె నిస్తేజమై పోయింది. శౌర్యం లేని క్షత్రియుల వలె, సత్యం లేని దాన ధర్మముల వలె శోభాహీనమైంది.

చల్లారిన దావాగ్నిలా చేవ చచ్చి చైతన్యం లేక..... గడ్డ కట్టిన సముద్రంలా నిరుత్సాహంగా పడి ఉన్న సైన్యంలో తిరిగి శౌర్య, పరాక్రమాలను నింపుతూ అంధకుడిలా హెచ్చరిక మాటలాడేడు. "అసుర వీరులారా! ఒకే ఒక్క శుక్రుడు మనమధ్య లేక పోవవటంతో మన ధైర్య, వీర్య, శౌర్య, బల, పరాక్రమ, శక్తి, ఫల, కీర్తి, తేజస్సులు ఒక్కమారుగా అపహరింప బడ్డాయనే మాట సత్యం. బ్రాహ్మణ శ్రేష్ఠుడు, వేద వేదాంగ పారంగతుడు, రాజనీతి కోవిదుడు, పూజ నీయుడు, గురువు, సమర్ధుడు, రక్షకుడు అగు భార్గవుని రక్షించు కోలేక పోయిన మనం నిశ్చయంగా నిందార్హులమే. వీరులారా! మీరందరు మనసులో శుక్రాచార్యుల వారి పాద పద్మాలకు నమస్కరించి ప్రమధులతో యుద్ధం చేయండి. నేను నందితో కూడి రుద్ర గణాలను నిశ్శేషం చేస్తాను. యోగి తన యోగంచే జీవుని కర్మబంధం నుండి తప్పించి నట్లుగా నేను శుక్రుని విడిపిస్తాను. లేదా ఆయనే తన యోగ శక్తిచే, భక్తిచే స్వయంగా బయటకు వస్తే మనమందరము రక్షింప బడతాం.

అంధకుని మాటలకు తిరిగి ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని పొందిన దానవులు వారిలో వారిలా తలపోసారు. "మనకు ఆయుర్దాయం ఉన్నంత వరకు ప్రమధులు మనలను జయింపలేరు. ఆయుర్దాయం లేనప్పుడు మనం ప్రభువును విడిచి వెన్ను చూపితే అపకీర్తి కళంకమే అంటుకొంటుంది గాని మృత్యువును తప్పించుకొన గలమా? సమర భీరువులకు అంధ తామిస్ర నరకం తథ్యం. కదన రంగంలో కత్తి పదునులో స్నానమాడిన వారికి వేరే జప తపాదులతో తపోదానాద్యనుష్ఠానాదులతో పనిలేదు." ఈ విధంగా అంధకుని వచనాలను స్థిరీకరించికొని వారు వివిధాయుధాలతో ప్రమథులను పీచమడచటం మొదలు

పెట్టారు. ప్రమథ గణం ఉప్పెనలా అసుర గణంపై విరుచుక పడ్డారు. రణరంగం రక్తసిక్తమైంది.

అంధకుడు రథస్థుడై ఎక్కడ చూచిన తానై వీరవిహారం చేస్తున్నాడు. అసురగణం మృత్యువుకు మృత్యువై పోరాడు తున్నది. షడానన, గజానన, నంది, సోమనంది, ఇత్యాది ప్రమథ గణాధిపతులు బాణ వర్షాన్ని కురిపించి అంధకుని అంధుని చేశారు. పెద్ద కోలాహలం చెలరేగింది. ఆ రావం ప్రళయకాల సముద్భూత సప్తమారుత భయంకరా రావాన్ని మించి పోయింది. ఆ కలకలానికి శంభుని ఉదరంలో ఉన్న శుక్రుడు స్థిరమైన స్థానం లేని గాలి వలె సుడులు తిరుగుతూ నిర్గమించే మార్గాన్ని వెతుక్కొంటున్నాడు. ఏడు ఊర్ధ్వలోకాలను, ఏడు అధో లోకాలను సంచరించాడు గాని, మార్గం కాన రాలేదు. మరొక చిత్రమేమిటంటే బయట జరుగుతున్న యుద్ధం ఉదరంలో కనుపించింది. పుణ్య పురుషుని ఆచరణలో దోషం లేనట్లు, పతివ్రత శీలానికి కళంకం లేనట్లు శివుని ఉదరంలో వంద సంవత్సరాలు గడిపినా శుక్రునికి మార్గం దొరకలేదు. చివరకు భార్గవుడు శాంభవ యోగంచే శివమంత్రాన్ని జపిస్తూ శుక్ర రూపాన్ని పొంది శంభుని ఉదరమనే కారాగారం నుండి లింగ మార్గం ద్వారా బయట పడి పూర్వరూపాన్ని పొంది చేతులు జోడించి నమస్కరించి ఉదరంలో ఉండగా చేసిన శివ స్తుతినే తిరిగి ఇలా చేశాడు :

**శుక్రుని శివస్తుతి**

ఓం నమస్తే దేవేశాయ సురాసుర నమస్కృతాయ భూతభవ్య మహాదేవాయ హరితపింగళ లోచనాయ బలాయ బుద్ధి రూపిణే వైయా ఘ్రవసనచ్ఛ దాయారణేయాయ త్రైలోక్య ప్రభవే ఈశ్వరాయ హరాయ హరితనేత్రాయ యుగాంత కరణాయానలాయ గణేశాయ లోకపాలాయ మహాభుజాయ మహా హస్తాయ శూలినే మహాదంష్ట్రిణే కాలాయ మహేశ్వరాయ అవ్యయాయ కాలరూపిణే నీలగ్రీవాయ మహోదరాయ గణాధ్యక్షాయ సర్వాత్మనే సర్వభావనాయ సర్వగాయ మృత్యుహంత్రే పారియాత్ర సువ్రతాయ బ్రహ్మచారిణే వేదాంతగాయ తపోంతగాయ పశుపతయే వ్యంగాయ శూలపాణయే వృషకేతవే హరయే జటినే శిఖండినే లకుటినే మహాయశసే భూతేశ్వరాయ గుహావాసినే వీణా పణవతాలవతే అమరాయ దర్శనీయాయ బాలసూర్యనిభాయ శ్మశానవాసినే భగవతే ఉమాపతయే అరిందమాయ భగస్యాక్షి పాతినే పూష్ణో దశననాశనాయ క్రూరకర్తకాయ పాశహస్తాయ ప్రలయకాలాయ ఉల్కాముఖాయాగ్ని కేతవే మునయే దీప్తాయ విశాంపతయే ఉన్నతయే జనకాయ చతుర్థకాయ లోకసత్తమాయ వామదేవాయ వాగ్దాక్షిణ్యాయ వామతో

భిక్షవే భిక్షురూపిణే జటినే స్వయం జటిలాయ శక్రహస్త ప్రతిస్తంభకాయ క్రతవే క్రతుకరాయ కాలాయ మేధావినే మధుకరాయ చలాయ వానస్పత్యాయ వాజసనేతి సమాశ్రమ పూజితాయ జగద్ధాత్రే జగత్కర్త్రే పురుషాయ శాశ్వతాయ ధ్రువాయ ధర్మాధ్యక్షాయ త్రివర్త్మనే భూతభావనాయ త్రినేత్రాయ బహూరూపాయ సూర్యాయుత సమప్రభాయ దేవాయ సర్వతూర్యనినాదినే సర్వబాధా విమోచనాయ బంధనాయ సర్వ ధారిణే ధర్మోత్తమాయ పుష్పదంతాయావి భాగాయ ముఖ్యాయ సర్వహరాయ హిరణ్య శ్రవసే ద్వారిణే భీమాయ భీమపరాక్రమాయ ఓం నమో నమః ॥

ఓం దేవదేవుడు దేవవతలచే రాక్షసులచే నమస్కరింపబడువాడు, భూత భవిష్యత్కాలములలోని ప్రాణులకు గొప్ప దైవము, పచ్చని మరియు తేనెరంగు గల కన్నులు గలవాడు, బలశాలి, బుద్ధిస్వరూపుడు, వ్యాఘ్రచర్మమే ఉత్తరీయముగా గలవాడు అరణినుండి పుట్టిన యజ్ఞాగ్నియే స్వరూపముగా గలవాడు, ముల్లోకములకు ప్రభువు, ఈశ్వరుడు, పాపహారి, పచ్చని కన్నులు గలవాడు, ప్రళయ కాలాగ్ని స్వరూపుడు, గణాధ్యక్షుడు, లోకములను పాలించువాడు, గొప్ప భుజములు చేతులు గలవాడు, శూలధారి, గొప్ప దంష్ట్రలు గలవాడు, మృత్యుస్వరూపుడు, మహేశ్వరుడు, వినాశము లేనివాడు, నల్లని కంఠము గలవాడు, గొప్ప ఉదరము గలవాడు, సర్వస్వరూపుడు, సర్వకారణుడు, సర్వవ్యాపి, మృత్యుంజయుడు, పారియాత్ర పర్వతముపై గొప్ప తపస్సును చేసినవాడు, బ్రహ్మచారి, వేదాంత ప్రతిపాద్యుడు, తపస్సు యొక్క అవధులను దాటినవాడు, జీవులకు పాలకుడు, నిరవయవుడు, వృషభము ధ్వజమునందు గలవాడు, జటాధారి, జుట్టుముడి గలవాడు, దండధారి, గొప్ప కీర్తి గలవాడు, భూతపతి, గుహయందు ఉండువాడు, వీణపై మృదంగముపై తాళములను పలికించువాడు, అవినాశి, సుందరాకారుడు, బాలసూర్యునివలె ప్రకాశించువాడు, శ్మశానమునందు నివసించువాడు, భగవాన్ పార్వతీపతి, శత్రుసంహారకుడు భగుని కన్నులను పూష దంతములను బెరికిన వాడు, దుష్టసంహారకుడు, పాశధారి, ప్రలయకాల మృత్యుస్వరూపుడు, ఉల్క నోటియందు గలవాడు, అగ్నియేధ్వజముగాగలవాడు, మననశీలి, ప్రకాశస్వరూపుడు, మానవులకు ప్రభువు, ఎత్తైన దేహము గలవాడు, తండ్రి, త్రిమూర్తుల కతీతుడు, భువనములలో సర్వశ్రేష్ఠుడు, వామదేవుడు, వక్తలలో శ్రేష్ఠుడు, బిక్షురూపధారియై వామార్ధమునందున్న అన్నపూర్ణ నుండి బిక్షను గోరువాడు, తెలియ శక్యము కాని స్వరూపము గలవాడు, ఇంద్రుని చేతులను స్తంభింప జేసినవాడు, యజ్ఞస్వరూపుడు, యజమానస్వరూపుడు, మృత్యుస్వరూపుడు, జ్ఞాననిధి, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ ఆశ్రమస్వరూపుడు,

సర్వాశ్రమముల వారిచే వాజసన నామముతో పూజింపబడువాడు, జగత్తును సృష్టించి పోషించే శాశ్వత కూటస్థ పరబ్రహ్మ స్వరూపుడు, ధర్మమునకు అధ్యక్షుడు, ఉత్తర-దక్షిణ-అధో మార్గములుగలవాడు, ప్రాణులను సృష్టించువాడు, ముక్కంటి, అనేక రూపుడు, పదివేల సూర్యులతో సమమగు తేజస్సు గలవాడు, ప్రకాశస్వరూపుడు, సర్వవాద్యముల ధ్వనులు గలవాడు, బాధలన్నింటి నుండియు విముక్తిని కలిగించువాడు, సంసారములో బంధించువాడు, ఉత్తమమగు ధర్మస్వరూపుడు, పుష్పదంతస్వరూపుడు, ద్వైతవర్జితుడు, త్రిమూర్తులలో ముఖ్యుడు, సర్వమును హరించువాడు, బంగరు వర్ణముగల చెవులు గలవాడు, ద్వారదేవతారూపుడు, భయంకరుడు, భయంకరమగు పరాక్రమముగలవాడు, ఓంకారస్వరూపుడు అగు శివునకు అనేక వందనములు.

ఇలా స్తుతించిన భార్గవుని చూచి శంకరుడు సంతోషించి "ఓ పుత్రా! నీవు నా లింగంనుండి శుక్రంవలె నిర్గమించావు కనుక ఈ పైన శుక్ర నామధేయంచే పిలువ బడుతావు. నిన్ను నేను పుత్రునిగా స్వీకరిస్తున్నాను. నీకు జరా మరణాదులు లేవు." - అని వర మిచ్చాడు. పార్వతి కూడా ఆయనను పుత్రునిగా స్వీకరించింది. వెంటనే ఆయన రణరంగానికి వెళ్ళాడు.

అక్కడ.... సమరాంగాణంలో భార్గవుని శివుడు మ్రింగిన తదుపరి; ప్రమథుల పరాక్రమానికి ఆగలేక అసురులు ఆపద నొంది పలాయితులైనా......అంధకుడు మాత్రం అసహాయ శూరుడై విక్రమాన్ని చూపుతూనే ఉన్నాడు. అతని అస్త్ర, శస్త్రాదుల బలం క్షీణించింది. తూణీరం శూన్యమైంది. అప్పుడొక మాయను పన్నేడు. ఆ మాయా ప్రభావంచే అతని శరీరం నుండి స్రవించి నేలకు రాలిన ప్రతి రక్తపు బొట్టు నుండి అసంఖ్యాకులైన అంధకులు పుట్టి ప్రమథులను బాధించటం మొదలు పెట్టారు. మాయావులకు మాయావి అగు విష్ణువు అంధకుని మాయను అవగతం చేసికొని తన మాయా ప్రభావంచే వికృత ముఖంగల శుష్కించిన శక్తి రూపాన్ని ధరించి శంభుని చెవి నుండి పుట్టుకొచ్చాడు. వస్తూనే భీకరంగా అరుస్తూ అంధకుని మరియు అతని అనుచరుల రక్తాన్ని పానం చేసి అందరిని హతమార్చేడు. అంధకుడొక్కడే శల్యావశిష్టుడై మిగిలాడు. అస్థిపంజరం ఒక్కటే మిగిలింది. అయినా క్షత్రియ ధర్మాన్ని అనుసరించి వెన్ను చూపక పోరాడు తూనే ఉన్నాడు. అతని భీష్మ ప్రతాపానికి గీర్వాణులతో పాటు శర్వుడు కూడా నిర్విణ్ణుడయ్యాడు. ఇక జాగు చేయటం మేలు కాదని తలచి...... గ్రక్కున కరుణా సముద్రైన రుద్రుడు త్రిశూలాన్ని చేతపట్టి

పిడుగు భూమిలోనికి చొచ్చుకు పోయినట్లు వాని గుండెల్లో గుచ్చి అంతరిక్షంలో నిలపెట్టాడు. వాడప్పుడు శాంతించి నిశ్చేష్టుడై ఉండి పోయాడు. వాని శరీరం సూర్యకిరణాలకు తపిస్తూ శుష్కించి వర్షానికి తడుస్తూ జీవాలను ధరించి అలానే ఉంది. వాడు మాత్రం శంకరుని నిర్విరామంగా ధ్యానిస్తూనే ఉన్నాడు. ఉమాపతి ఉదరం నుండి భార్గవుడు బయట పడిన వేళకు అంధకుడలా ధ్యానిస్నూనే ఉన్నాడు

**అంధకుని శివస్తుతి**

**శ్లో ॥ మహాదేవం విరూపాక్షం చంద్రార్థ కృత శేఖరమ్ ।**
**అమృతం శ్వాశతం స్థాణుం నీలకంఠం పినాకినమ్ ॥**
**వృషభాక్షం మహాజ్ఞేయం పురుషం సర్వకామదమ్ ।**
**కామారిం కామ దహనం కామరూపం కపర్దినమ్ ॥**
**విరూపం గిరీశం భీమం స్రగ్విణం రక్త వాసనమ్ ।**
**యోగినం కాలదహనం త్రిపురఘ్నం కపాలినమ్॥**

**తా ॥** మహాదేవుడు, బేసి కన్నుల వాడు, చంద్రవంకతో ప్రకాశించే శిరస్సు గలవాడు, అమృత స్వరూపుడు, నిత్యుడు, కూటస్థుడు, నల్లని కంఠము గలవాడు, పినాక ధారి, వృషభము యొక్క కన్నుల వంటి కన్నులు కలవాడు, జ్ఞేయ బ్రహ్మరూపుడు, చేతనుడు, కోర్కెలన్నింటిని తీర్చువాడు, కాముని దహించిన వాడు, యథేచ్ఛా రూపము గలవాడు, జటాధారి, వికృతరూపుడు, కైలాస వాసి, భయంకరుడు, మాలను ధరించిన వాడు, ఎర్రని వస్త్రములు ధరించిన వాడు, యోగి, కాలాంతకుడు, త్రిపురారి, కపాల ధారి అగు శివపరమాత్మ, యొక్క నూట ఎనిమిది రూపాలను అతను ధ్యానించేడు. దానికి ప్రీతుడైన శంకరుడిలా అన్నాడు.

“ఓ రాక్షస రాజా! నీ శమ, దమాలకు, నియమ పాలనకు, శౌర్య, ధైర్యాలకు సంతోషించాను. నీవు మూడు వేల సంవత్సరాలు శూలాగ్రం మీద ఉండి ప్రాణాలను ధరించి నన్ను ధ్యానిస్తూనే ఉన్నావు. నీ దోషాలన్నీ నశించాయి. ఏవరం కావాలో కోరుకో.”

ముక్కంటి పల్కులకు ఎంతో అలరి అంధకుడు మోకాళ్లపై నిలబడి చేతులు జోడించి ఆనందాశ్రువులు చెక్కిళ్ళపై జార గద్గద స్వరంతో ఇలా అన్నాడు: “హే భగవన్! నేను పూర్వం యుద్ధరంగంలో వీరరసోద్రేకంలో పలికిన దుడుకు మాటలను మనసులో పెట్టుకొన

వద్దు. నీ యథార్థ స్వరూపాన్ని తెలుసుకోలేక మూఢుడనై నీ విషయంలో చేసిన అతినిందిత కర్మలను క్షమించు. ప్రకృతి స్వరూపిణి, లోక మాత అగు ఈ పార్వతి విషయంలో కామదోష కృతమైన నా తప్పులను మన్నించు. నేను దీనుడను! నీ భక్తుడను! నన్ను అన్నిటా క్షమించి రక్షించు!

అజ్ఞానాన్ని తొలగించేది, అధర్మాన్ని ధ్వసం చేసేది, అనర్థాన్ని రూపుమాపేది, దుఃఖాలను శాంతింప చేసేది, ఆశ్రితులపై కృపారసాన్ని వర్షించేది, తనుస్తాపాలను హరించేది, చంద్రసారమైన వెన్నెలకు వెన్నెలైనది, దీనులకు దిక్కైనది అగు...... ఈ హిమగిరి రాజ నందినీ సుందర మందహాస వదనారవింద నిర్గత కరుణారస పూరిత శుభదృక్కులు నాపై నిరంతరము ప్రసరించు గాక! గిరిరాజ నందినీ! శంకర విజయాన్ని సాధింప గోరిన పంచశరుడు తన బాణాలు వ్యర్థం కాగా ఉమా హసితమనే నీ మందహాస మల్లికా కుసమాన్ని వింట సంధించి విజయాన్ని సాధించాడు. మదనుడు తన బాణాలను పదును పెట్టుకొనే నీ దరస్మితం మహేశునికే దక్కనీ! భువనైక సుందరివైన నీ మోహ జనకమైన 'కాంత దృష్టి'కి చంద్రశేఖరుడే స్వామి యగు గాక! మాతా! సంతానం మీద అపేక్షతో సజల నయానాలతో చూచే నీ 'కరుణామృత రస దృష్టి'కి నేను పాత్రుడనగుదును గాక!

జననీ! త్రిలోక పావనీ! నీ అధర పుటాన్ని ఆశ్రయించి ఉన్న అమృతానికి ఈ అంధకాసుర వైరి ఈశ్వరుడగు గాక! నీ పాద కమల సేవా లబ్ధ మకరందం నీ భక్తులమైన మాకు చాలు! అమ్మా! ఆనాడు ఈ అర్భకుని చేరదీసి ఆదరించింది నువ్వే! దానవుని కప్పగించి దూరంగా పొమ్మన్నదీ..... నువ్వే! ఈ నాడు చెంతకు చేర్చుకొని వంతులు తీర్చి పునర్జన్మను ప్రసాదించిందీ నీవే! ఓ ఆది దంపతులారా! దేవతలతో వైరాన్ని మాని, శాంతాన్ని పూని యోగినవుతాను! మీ గణాలతో కలసి సాలోక్యాన్ని పొందుతాను. దానవ స్వభావం నుండి విముక్తిని కల్పించండి." ఈ విధంగా అంధకుడు పల్కి మిన్నకున్నాడు. పరమేశ్వరుడు అతనిపై ప్రసన్న దృక్కులను ప్రసరించగా పార్వతి చెంతకు చేరదీసి కరకమలాలతో శిరసు నిమిరింది. అంధకుడు గణాధ్యక్షు డయ్యాడు.

మునులారా! శివుని ఉదరంలో ఉండి శుక్రుడు జపించిన శివ మంత్రాన్ని..... ఇందులో చెప్పిన దానిని...... ఎవరైతే భక్తిశ్రద్ధలతో చదువుతారో, వింటారో..... వారికి నిశ్చయంగా మృత్యుభయం తొలగి, కోరికలన్నీ ఈడేరుతాయి.

## శుక్రుడు మృత సంజీవనీ విద్యను సంపాదించుట

సూత మహర్షి శౌనకాది మునులతో ఇలా అంటున్నాడు. "ఓ తపోధనులారా! బ్రాహ్మణ శ్రేష్ఠుడైన భార్గవుడు మృత్యుం జయుడైన శివుని వద్దనుండి మృత సంజీవనీ విద్యను సంపాదించిన వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి. భృగు వంశంలో జన్మించిన శుక్రుడు పూర్వం కాశీ నగరానికి వెళ్ళి గంగానదీ తీరంలో పరమాత్మ యొక్క లింగాన్ని స్థాపించి, దాని కెదురుగా అందమైన నూతిని ఏర్పాటు చేసి యథా శాస్త్రీయంగా షోడ శోపచార పూజా విధానాలతో అర్చిస్తూ తపస్సు చేశాడు. పంచామృతాలతో, సుగంధ జలాలతో, కస్తూరీ చందనాగరు ఘనసారాది పరిమళ ద్రవ్యాలతో, బిల్వాది పత్రాలతో, సహస్రదళ పద్మాలతో..... సావధానంగా ఈశ్వరార్చన చేసేవాడు, నైవేద్యానంతరం నృత్యగానాదులతో సేవించే వాడు, అనేక స్తోత్రాలతో, సహస్ర నామాలతో స్తుతించేవాడు. ఈ విధంగా ఐదువేల సంవత్సరాలు నిర్మలమైన మనసుతో ఆరాధించినా ఈశ్వర సాక్షాత్కారం కాలేదు.

అపుడా శుక్రుడు దుస్సహమైన నియమాన్ని...... కాలిన ఊక నుండి వచ్చే పొగను పీలుస్తూ వేయి సంవత్సరాలు తపస్సు చేశాడు. అతని తపస్సుకు ప్రీతుడైన దాక్షాయణీ పతియైన శంకరుడు ప్రత్యక్షమై ఇలా అన్నాడు: "ఓ తపోనిధీ! మహాభాగ! నీ అపురూప తపస్సుకు ప్రీతుడనయ్యాను. నీ వాంఛితాన్ని నెరవేరుస్తాను, వరాన్ని కోరుకో !"

అలా ప్రత్యక్షంగా సాక్షాత్కరించిన భుజగ భూషణుడు, రాజ శేఖరుడు ఐన పరమేశ్వరుని తనివి తీర పరికించి పరమానందంతో రోమ హర్షణుడై శిరస్సుపై చేతులు జోడించి అష్టమూర్తి అయిన శివుని ఇలా స్తుతించాడు...... శుక్రుడు.

**శ్లో॥ త్వం భాభిరాభిరభిభూయ తమస్సమస్తమస్తం నయస్యభి మతాని నిశాచరాణామ్ ।**
**దేదీప్యసే దివమణే గగనే హితాయ లోకత్రయస్య జగదీశ్వర తన్నమస్తే ॥**
**లోకేఽ తి వేలమతి వేల మహామహోభిర్నిర్భాసి కౌ చ గగనేఽఖిలలోక నేత్రః ।**
**విద్రావితాఖిల తమాస్సుతమో హిమాంశో పీయూషపూర పరిపూరిత తన్నమస్తే ॥**
**త్వం పావనే పథి సదాగతిరప్యుపాస్యఃకస్త్వాం వినా భువనజీవన జీవతీహ ।**
**స్తబ్ధప్రభంజనవివర్ధిత సర్వజంతోః సంతోషితాహికుల సర్వగ వై నమస్తే ॥**
**విశ్వైక పావక న తావకపావకైకశక్తేర్ ఋతే మృతవతామృత దివ్యకార్యమ్ ।**
**ప్రాణిష్యదో జగదహో జగదంతరాత్మంస్త్వం పావకః ప్రతిపదం శమదో నమస్తే ॥**

**పానీయరూప పరమేశ జగత్పవిత్ర చిత్రం విచిత్ర సు చరిత్ర కరోఽసి నూనమ్ ।**
**విశ్వం పవిత్రమమలం కిల విశ్వనాథ పానీయ గాహనత ఏతదతో నతోఽస్మి ॥**
**ఆకాశరూప బహిరంతరుతావకాశ దానా ద్వికస్వరమిహేశ్వర విశ్వమేతత్ ।**
**త్వత్తస్సదా సదయ సంశ్వసితి స్వభావాత్సంకోచమేతి భవతోఽస్మి నతస్తతస్త్వామ్ ॥**
**విశ్వం భరాత్మక భిభర్షి విభోఽత్ర విశ్వం కో విశ్వనాథ భవతోఽన్య తమస్తమోఽరిః**
**స త్వం వినాశయ తమో తమ చాహిభూష స్తవ్యాత్పరః పరపరం ప్రణతస్తతస్త్వామ్॥**
**ఆత్మస్వరూప తవ రూపపరం పరాభిరాభిస్తతం హర చరాచర రూపమేతత్ ।**
**సర్వాంతరాత్మనిలయ ప్రతిరూపరూప నిత్యం నతోఽస్మి పరమాత్మ జనోఽష్టమూర్తే॥**
**ఇత్యష్ట మూర్తిభిరిమాభిర బంధుబంధో యుక్తో కరోషి ఖలు విశ్వజనీనమూర్తే ।**
**ఏతత్తతం సువితతం ప్రణత ప్రణీత సర్వార్థ సార్థపరమార్థ తతో నతోఽస్మి ॥**

**తా॥** నీవు ఈ కాంతులతో చీకట్లనన్నింటినీ పారద్రోలి రాక్షసుల మనోరథములను ధ్వంసమొనర్చుచున్నావు. ఓ జగత్పతీ! సూర్యరూపా! నీవు లోకహితము కొరకై ఆకాశమునందు వెలిగిపోవుచున్నావు. నీకు నమస్కారము. ఓ చంద్రా! నీవు జనులకు కన్ను వంటి వాడవు. నిన్ను చూచి భూమిపై గల సముద్రము పెద్ద పెద్ద కెరటములతో ఉప్పొంగి చెలియలి కట్టను దాట గోరుచున్నది. నీవు ఆకాశములో ప్రకాశిస్తూ నీ చల్లని కిరణములతో చీకట్లనన్నింటినీ పారద్రోలి జగత్తును వెన్నెలలనే అమృత ధారలతో ముంచెత్తుచున్నావు. నీకు నమస్కారము. ఓ వాయూ! నీవు పవిత్రమగు అంతరిక్షమార్గములో సంచరిస్తూ సర్వమును వ్యాపించుచున్నావు. లోకుల ప్రాణశక్తి స్వరూపుడవగు నీవు లేనిదే ఏ జీవి బ్రతుకగలదు? నీవు ఒకప్పుడు కదలిక లేదా యన్నట్లు ఉండి మరుక్షణములో తుఫాను రూపమును దాల్చెదవు. సర్వప్రాణులను వర్ధిల్లజేయు నీకు నమస్కారము. నీవు సర్ప సముదాయములకు భోజనమై వాటిని సంతోషపెట్టెదవు. జగత్తును పవిత్రము చేయు ఏకైక మూర్తివగు ఓ అగ్నీ! నీ పవిత్రీకరణ శక్తిలేనిచో ఈ లోకము మృతప్రాయమగును. జగత్తునకు అంతరాత్మవగు నీవు అమృత స్వరూపమగు హవిస్సును దేవతల కొసంగి వారికి ఉపకారములను చేయుచున్నావు. నిన్ను మ్రొక్కు ప్రాణులకు నీవు ప్రతి అడుగులో శాంతిని కలిగించెదవు. నీకు నమస్కారము. జలరూపములో నుండి సర్వమును శుద్ధి చేయు ఓ పరమేశ్వరా! నీ గొప్ప చరిత్రలు నిశ్చయముగా అద్భుతములు. ఓ విశ్వనాథా! ఈ జగత్తులోని సర్వము నీ స్వరూపమగు జలములో మునక లేసి పవిత్రమగుచున్నది. అట్టి ఆ జలరూపుడవగు నీకు నమస్కారము. ఆకాశరూపములో నున్న ఓఈశ్వరా! శబ్దము గుణముగా గల నీవు లోపల,

బయట అవకాశము నిచ్చుట చేతనే ఈ జగత్తు మనగల్గు చున్నది. ఓ దయామూర్తీ! నీకు నేను నమస్కరించుచున్నాను. స్వస్వరూపమగు విశ్వమును పాలించి పోషించువాడా! సర్వవ్యాపీ! ఈ విశ్వమును నీవే పృథ్వీరూపములో ధరించియున్నావు. అజ్ఞానమును పోగొట్టగల దైవము నీవు తక్క మరియెవరు గలరు? సర్పములు అలంకారముగా గలవాడా! మా ఈ చీకట్లను నీవు పారద్రోలుము. సర్వాతీతుడవగు నీవు స్తోత్రములకు అతీతుడవు. అట్టి నీకు ప్రణమిల్లుచున్నాను. ఓయీ ఆత్మ స్వరూపుడవగు హరా! ఈ చరాచర జగత్తు అంతయు నీ ఈ రూపముల వరుసలచే నిండి యున్నది. ఓయీ అష్టమూర్తీ! సర్వప్రాణుల అంతరాత్మ నీ నివాసస్థానము. పరమాత్మవగు నీకు భక్తుడనగు నేను నిత్యము నమస్కరించుచున్నాను. బంధువులులేని వారికి బంధుడవు నీవే. ఈ జగత్తు సర్వము నీ స్వరూపమై యున్నది. నీవీ ఎనిమిది రూపములలో ఈ జగత్తు నంతనూ వ్యాపించి యున్నావు. నిన్ను నమస్కరించు భక్తుల కోర్కెల నన్నింటినీ నీవు ఈడేర్చెదవు. పరమార్ధము నీ స్వరూపమే అట్టి నీకు నమస్కరించు చున్నాను.

భార్గవుడీ విధంగా అష్టమూర్తి అగు శివుని అష్టకంతో చక్కగా స్తుతించి తల నేలకు సోకగా పలుమార్లు మ్రొక్కాడు. స్తుతిప్రియుడైన శంకరుడు అతని స్తుతికి సంతసించి రెండు భుజాలను పట్టుకొని లేవదీసి, తనదంత కాంతులు దిక్కుల ప్రసరింపగా ఇలా అన్నాడు.

“ఓ! భార్గవా! తపోనిధీ! నువ్వు పవిత్రుడవు! నీ తపస్సు చేత లింగాన్ని ప్రతిష్ఠించిన పుణ్యం చేత నీ ఆరాధన చేత, కాశీ నివాసం చేత నిన్ను నా ఇద్దరు పుత్రులతో సమానంగా చూస్తున్నాను. భవిష్యత్తులో నువ్వు.... ఇదే శరీరంతో నా ఉదరమనే గుహలో ప్రవేశించి నా శ్రేష్ఠమైన ఇంద్రియ మార్గం ద్వారా పుత్ర రూపంలో జన్మించ గలవు! నీ కీయ దగని వరం లేదు. ఇప్పటి వరకు ఎవరి వద్ద లేని ఎవరికీ తెలియని, ఎవరికీ ఈయని ‘మృత సంజీవని’ విద్యను నీకు ఇస్తున్నాను. ఈ విద్యను నేను నా తపోబలంచే స్వయంగా నిర్మించాను. హరి, హిరణ్యగర్భ, ఇంద్రాదులకు కూడా ఇలాంటి విద్య ఒకటుందనేది తెలియదు. ఓ! బ్రాహ్మణ శ్రేష్ఠా! నీవు అత్యంత శుచివి! పవిత్రుడవు! తపోనిధివి! ఈ విద్యను పొందే అర్హత గల పూజ్యుడు మరొకడు లేడు.” అని పలికి ఆ విద్యను యథా శాస్త్రీయంగా ఉపదేశించి ఇంకా ఇలా అన్నాడు: “భార్గవా! ఏ మృత ప్రాణిని ఉద్దేశించి ఐనా సరే విద్యలలో కెల్ల గొప్పదైన ఈ విద్యను పఠిస్తే ఆ మృత జీవి నిశ్చయంగా తిరిగి జీవిస్తుంది. నువ్వు సూర్యుని, అగ్నిని మించిన అతిశయం కలవాడవై ఆకాశంలో గొప్ప తేజస్సుతో గ్రహరూపంలో శ్రేష్ఠుడవై

ఉంటావు. భూలోకంలో నువ్వు ఉదయించిన కాలంలో మానవుడు ఏ శుభకార్యాలను చేసినా, ధర్మకార్యాలను చేసినా అవి సఫలమవుతాయి. నంద తిథులన్నీ నీ సంయోగంచే శుభకరములవుతాయి. నీకు అభిముఖంగా ఎవరు యాత్ర చేసినా నీ దృష్టి పాతం చేత వారి కార్యం నాశన మవుతుంది. నీ భక్తులు సంతానవంతు లవుతారు. కాశీలో నువ్వు స్థాపించిన ఈ లింగం శుక్రేశ్వరుడను పేరుతో ప్రసిద్ధిచెంది; అర్చించిన వారికి సకల అభీష్టాలను ఇస్తుంది." ఇలా వరాలిచ్చి శంభుడు ఆ లింగంలోనే విలీనమయ్యాడు. శుక్రుడు కృతార్థుడై తన నివాసాన్ని చేరుకొన్నాడు.

**బాణాసుర వృత్తాంతం**

సూతుడు శౌనకాది మహర్షులతో ఇలా అంటున్నాడు. "ఓ! తపోధనులారా! మీకిప్పుడు అద్భుతమైన బాణాసుర వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి. బ్రహ్మగారి పుత్రులందరిలో జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అగు మరీచి అనే మానస పుత్రుడున్నాడు. ఆయన పుత్రుడు కశ్యపుడు. దక్షుడు తన కుమార్తెలలో పదముగ్గురిని ఈ కశ్యపునికిచ్చి వివాహం చేశాడు. వారిలో పెద్ద భార్య దితి. ఆమె పుత్రులకు దైత్యులని పేరు. మిగిలిన భార్యలకు దేవతలు మొదలుగా స్థావర జంగమాత్మకమైన సర్వప్రాణులు సంతానంగా పుట్టారు. దితికి పుత్రులే హిరణ్యకశివుడు, హిరణ్యాక్షుడూను. పెద్ద వాడైన హిరణ్యకశిపునకు హ్రాదుడు, అనుహ్రాదుడు, సంహ్రాదుడు, ప్రహ్లాదుడు.... అని నలుగురు కొడుకులు, వారిలో ప్రహ్లాదుడు గొప్ప విష్ణుభక్తుడు. అతని కొడుకు విరోచనుడు. బ్రాహ్మణ వేషంలో వచ్చి యాచించిన ఇంద్రునికి తన శిరస్సును ఇచ్చేశాడు. అతని కుమారుడే బలి చక్రవర్తి. వామన రూపంలో వచ్చి యాచించిన విష్ణువుకు ధరామండలాన్ని దానం చేశాడు. శివభకుడైన బలి కుమారుడు బాణాసురుడు.

ఈ బాణాసురుడు ఒకప్పుడు తన వేయి చేతులతో మృదంగాన్ని వాయించి, తాండవ నృత్తాన్ని వివిధ తాళ గతులతో నర్తించి, శంకరుని మెప్పించి, తన రాజధానీ నగరమైన శోణ పురానికి నగరాధ్యక్షునిగా ఆయనను నియమించుకొన్నాడు. బాణుని పరిపాలనలో జ్ఞాతులైన దేవతలు వెలిగా మిగతా వారందరు సుఖశాంతులతో వర్ధిల్లారు. బాణుని అభ్యుదయాన్ని చూచి ఓర్వలేక దేవతలు లోలోపల కుములిపో సాగేరు. కుట్రలు పన్నేరు.

బాణునకిచ్చిన వరదానాన్ననుసరించి శంకరుడు తన భార్యా పుత్రులతో, గణాలతో శోణ పురంలోనే నివాసముంటున్నాడు. ఒక రోజున ఆయన నగరానికి దూరంగా నదీతీరమందు విహారానికై వెళ్ళాడు. ప్రమథులు, దేవగణాలు, అప్సరసలు, సిద్ధులు,

మునులు..... ఇలా ఒకరేమిటి దేవజాతులన్ని అక్కడకు వచ్చి చేరారు. మన్మథుడు వసంతుని తోను తక్కిన తన మారగణాల తోను వచ్చి చేరాడు. వికసిత కుసుమాలతో, భ్రమరకుల ఝుంకారంతో, కోకిలల గానంతో, మలయానిల వీచికలతో ప్రకృతి అంతా కామతంత్ర పరాధీనమైంది. యువతీ, యువకులందరు జంటలు, జంటలుగా విహరిస్తున్నారు. బాణుని అంతఃపురం కూడ అక్కడే ఉంది.

ఆ సమయంలో యోగ నిష్ఠుడైన పరమేశ్వరుడు ప్రకృతి సౌందర్యాన్ని చూచి పరవశించి విహారోత్సుకుడై గిరిరాజ నందినిని అలంకృతయై రావలసిందిగా నందిచే కబురు పెట్టాడు. వెంటనే నంది వెళ్ళాడు.

ఈ లోపులో.... ఇందుధరుడు విహారోత్సవ కుతూహలుడై ఉన్నాడనే విషయాన్ని తెలుసుకొన్న అప్సరసలాదిగా సుందర యువతీ మణులందరు బృందంగా ఏర్పడి వారిలో వారిలా అనుకొన్నారు: “చెలులారా! ఈ కౌముదీ మహోత్సవ సందర్భంగా ఇందు శేఖరుడు గిరిజా దేవితో కూడి నృత్యోత్సవాన్ని సలుపవలెనని ఉవ్విళ్ళూరు తున్నాడు. కాని ప్రస్తుతం పార్వతి ఆయన సన్నిధిలో లేదు. మనలో ఎవరు శివ కామినీ రూపాన్ని ధరించి ఆయనతో సమంగా లాస్య నర్తనాన్ని నెరవేరుస్తారో ఆ సుందరి నిశ్చయంగ వేలుపు వెలదులకు 'రాణి' అవుతుంది. ప్రాగల్భ్యం ఉన్నవారు ప్రయత్నించ వచ్చు” ఇలా పన్నిదాలు వేసుకొని ఘృతాచి కాళీ రూపాన్ని, విశ్వాచి చండికా రూపాన్ని, రంభ సావిత్రీ రూపాన్ని, మేనక గాయత్రీ రూపాన్ని, సహజన్య జయా రూపాన్ని, పుంజకస్థలి విజయ రూపాన్ని..... ఇంకా ఇతర అచ్చర మెరుగు బోండ్లు ఇతర మాతృకా రూపాలను తమతమ విద్యల ప్రభావంచే ధరించారు. బాణాసురుని కన్యయైన ఉషాదేవి తన దివ్యమైన శక్తిచే శుభకరమైన పార్వతీ రూపాన్ని ధరించింది.

అలా ధరించి హరునితో విహరించవలెనని అభిలషిస్తున్న వేళ.... సర్వజ్ఞురాలు, సర్వాంతర్యామిని అగుపార్వతి అక్కడ ప్రత్యక్షమై “ఓ ఉషాబాలా! శిష్యురాలా! నీకు యుక్త వయసు వచ్చిన తరి, యుక్త సమయంలో సముచితమైన నిర్ణయాన్ని తీసికొని నా రూపాన్ని ధరించావు. నువ్వు ఈ కార్తీక మాసంలో ఋతుధర్మాన్ని కలిగి ఉంటావు. వైశాఖ శుక్ల ద్వాదశినాడు ఉపవసించి అంతఃపురంలో నిద్రిస్తూన్న అర్ధరాత్రి సమయంలో స్వప్నంలో ఒక సుందరుడైన వరుడు నిన్ను కలుస్తాడు. ఆ రాకుమారుడే నీకు భర్త అవుతాడు.” అని భవిష్యద్వాణిని పలికింది. భర్త అనే మాట చెవి సోకగానే..... తుమ్మెద బరువుకు లీలగా వంగిన అరవిందంలా..... ఉషాకన్య సిగ్గుతో తలదించుకొంది.

ఆ కౌముదీ మహోత్సవ వేళ....... ముద్దుగుమ్మలు గుప్పిళ్ళతో కప్పూరపు రజాన్ని వెదజల్లగా ....... పాల కడలి ముద్దుల పట్టి ఐన నిండు జాబిల్లి మెండుగా కురిపించిన పండు వెన్నెలతో కలిసి సర్వము ఈశ్వర విభూతిగా నేత్ర పర్వమైంది. కౌముదీ మహోత్సవం ముగిసింది.

**ఉష–అనిరుద్ధుల సమాగమం**

ఒక రోజున శంకరుడు మిక్కిలి సంతోషంగా ఉన్న సమయంలో బాణాసురు డాయనను సమీపించి, అంజలి ఘటించి ఇలా ప్రార్థించాడు. "ఓ మహదేవా! నీవు దేవతలందరిలో శ్రేష్ఠుడవు! నీ అనుగ్రహంచే నాకు లభించిన ఈ సహస్ర బాహువులు నాకు భారంగా ఉన్నాయి. యుద్ధం లేనప్పుడు ఈ శిలా స్తంభాల వంటి బాహువులతో పనేముంది చెప్పు? అయినా ఈ చేతులకు తీట పుట్టినపుడు కొండలతో ఒరపిడి పెట్టితే అవి పొడియై నేలకు రాలుతున్నాయి. దిగ్గజాల దగ్గరకు వెళ్ళగానే అవి మోకరిల్లుతున్నాయి. దిక్పాలకుల లెక్కలేదు! శంకరా! యుద్ధంలో నా సహస్ర బాహువుల కండూతిని (దురదను) తీర్చి, వాటిని అరటి బోదెల వలె ఖండించే మొనగాడైవడైనా ఉన్నాడంటావా? లేదా నేనైనా వాణ్ణి యజ్ఞ పశువులా వధించాలి! నాకోరిక తీరుతుందంటావా? నాతో సముడవు నీవొక్కడివే!

ఈ విధంగా పల్కిన బాణుని గర్వోక్తులకు రుద్రుడు కుపితుడై "ఓ గర్విష్ఠీ! బలి చక్రవర్తి యొక్క కుమారుడవు, మీది మిక్కిలి నా భక్తుడవు అయిన నీవు...... ఇట్టి వీరాలాపా లాడుట తగదు. త్వరలోనే నీ కోరిక నెరవేరుతుంది! మనిషి తలతో కూడిన నెమలి...... చిహ్నంగా గల నీ ధ్వజం ఎప్పుడు, ఏ గాలివాటు లేకుండా నేల కూలుతుందో అప్పుడు నాతో సముడైన నరునితో నీకు యుద్ధం సంప్రాప్తిస్తుంది. నీ దర్పానికి తగిన ఫలితాన్ని అనుభవిస్తావు!"– అని ఆగామి కర్మ ఫలాన్ని చెప్పాడు.

అలభ్యమైన వీర మరణాన్ని కోరుకొన్న బల గర్వితుడైన బాణుడు శంకరుని పల్కులకు సంతసించి, తన సర్వ సైన్యాధ్యక్షుడైన కుంభాండునికి ఈ విషయాన్ని చెప్పి సేనను సిద్ధంగా ఉంచమన్నాడు. తను మాత్రం కయ్యపు విందు కొరకు ఎదురు చూస్తున్నాడు. ఒక రోజున అకారణంగానే ధ్వజం నేలకూలగా వార్త తెచ్చిన భటులను బహూకరించి ఎనిమిది మంది గణాధ్యక్షులతో పోరుకు సిద్దంగా ఉన్నాడు. ముందుగారణంలో విజయాన్ని పొందటం కొరకు ఒక ఇష్టిని నిర్వహించి, యుద్ధంలో వీరపానం చేసే మధువును తాను స్వయంగా పర్యవేక్షించాడు. ఇక్కడిలా బాణుడు వీరుని తోడి యుద్ధం కొరకు ఎదురు చూస్తూ ఉండగా అక్కడ అంతఃపురంలో.......

వైశాఖ శుక్ల ద్వాదశినాడు ఉపవాసముండి, మాధవుని భక్తి శ్రద్ధలతో పూజించి అలంకృతయై అంతఃపురంలో బాణాసుర పుత్రియైన ఉషాకన్య నిశీధిలో నిద్రిస్తున్న సమయంలో పార్వతి యొక్క మాయచే సుందరమైన స్వప్నాన్ని కన్నది. ఆస్వప్నంలో....... చెవుల కుండలాల కాంతులకు చెక్కిళ్ళు మెరియగా చిరునవ్వులు చిందిస్తున్న వాడు, సుగంధ బంధురమైన పూమాలలను ధరించిన నీల కుంతలుడు, సంపెగ పువ్వు వంటి నాసిక కలవాడు, నుదుట నామాన్ని ధరించిన వాడు, రమణీయోజ్వల రత్నా భరణ భూషితుడు, ముమ్మూర్తులా పంచశరునికి ప్రతిరూపమైనవాడు అగు ఒక సుందరుడు సాక్షాత్కరించాడు.

అలా సాక్షాత్కరించి...... చెంతకు చేరదీసి.......కొనగోట తిలకాన్ని దిద్ది – మొనపంట కెమ్మోవి నొక్కి...... పుక్కిట తాంబూల వాసనలు గుబుల్కొన – చెక్కిళ్ళ నెలవంక లుంచి – చిక్కు వడిన ఆ భరణాలను చక్క దిద్ది..... అలకలు సవరించి – అలుకలు తీర్చి – పులక లెత్తించి....... ఆవల ఏమోమో ఆగడాలను చేసి అదృశ్యుడయ్యాడు. అంత ఆ ఉషాకన్య స్వప్న పారవశ్యం చేతను, నిద్రా పరవశత్వం వలనను ఒడ లెరుగక సుఖ శయనం చేసి అరుణోదయ వేళ నిద్ర లేచింది. తన ప్రాణ నాధుడు ఇంకా పానుపు మీదనే ఉన్నాడన్న భ్రాంతితో నిద్రలేచి బారలు సాచి కౌగిలించుకోబోయే సరికి ఏముంది ? అంతా బయలు ! కల నిక్కల (నిజము + కల = నిక్కల నిజమైన కల) కాకపోయే సరికి ఆమె గుండె ఝల్లుమంది. ఇంతలో కుంభాండుని పుత్రిక, తనకు చెలికత్తె ఐన చిత్రలేఖ శయన మందిరంలోనికి రాగా ఆమెకు తన స్వప్న వృత్తాంతాన్ని చెప్పి ఇంకా ఇలా బేలగా వాపోయింది.

"చెలీ! కౌముదీ మహోత్సవ వేళ నేను పార్వతీ వేషాన్ని ధరించినప్పుడు ఆ జగన్మాత నాకు కాబోయే భర్తను గురించి భవిష్యత్తును చెప్పింది. నిన్న వైశాఖ శుక్ల ద్వాదశి! తిథి సరిపోయింది! నిన్న స్వప్నంలో సాక్షాత్కరించిన ఆ సుందరుడే నాకు కాబోయే భర్త! సందేహంలేదు. నా ప్రాణ నాధుడు నా మనసును దోచేశాడు. నా అవయవాలు పట్లు తప్పి ఉన్నాయి. నిలువలేకుండ ఉన్నాను. అతనినే యథావిధిగా వివాహమాడ నిశ్చయించు కొన్నాను. సఖీ! నా మనోహరుడు ఏ దేశ రాజకుమారుడో తెలసుకొని మా ఇరువురికి కళ్యాణాన్ని ఘటియింప చేసి పుణ్యం కట్టుకో!"

ఇలా దిటవు మాలి మొరలిడిన ఉషాకన్యను ఊరడించి లోకజ్ఞురాలు, రాక్షస మాయా నిపుణురాలు, ప్రౌఢ, చతురిక ఐన చిత్రలేఖ ఇలా అనునయించింది. "ఓ చెలీ! నువ్వు స్వప్నంలో దర్శించిన పురుషు డెవరో నాకు తెలియదు. అట్టి వానితో పొత్తు నీకెలా

సమకూర్చగలను? నా మాయా ప్రభావం చేతను, చిత్రలేఖనా సామర్థ్యం చేతను ముల్లోకాలలోని రాకుమారుల రూపు రేఖా విలాసాలను చిత్రీకరించి చూపుతాను. అందులో నీ ప్రియుడెవరో గుర్తించు." ఇలా చెప్పి అన్ని లోకాలలోని రాకుమారులను చిత్రించి చూపించింది. అందులో భూలోకంలో వృష్ణి వంశీయులైన వసుదేవుడు, బలరాముడు, శ్రీ కృష్ణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు..... ఇత్యాదులు ఉన్నారు. అనిరుద్ధుని చిత్ర పటాన్ని చూచి ఉషాకన్య సిగ్గుతో తల వంచుకొని "చెలీ! నా మానసచోరుడు ఇతడేనే!" అని లలితంగా పలికింది. పలికి అతని వివరాలను చెప్ప వలసిందిగా ప్రాధేయపడింది.

దానికి శంబర మాయా విశారదు రాలైన చిత్రలేఖ "ఓ బాణాసుర పుత్రీ! ఈ సుకుమారుడు.... లీలా మానుష విగ్రహుడైన శ్రీకృష్ణ దేవుని మనుమడు. కందర్ప సమానుడైన ప్రద్యుమ్నుని కుమారుడు. అనిరుద్ధ నామధేయుడు. వృష్ణి వంశజుడు."– అని పల్కగా ఆ వివరాలను విని మావి గున్నను అల్లుకొన్న మాధవీ లతలా, ఆకాశ గంగాప్రవాహంపై ప్రసరించిన వెన్నెలలా, శివుని జటాజూటాన్ని అలంకరించిన చంద్ర రేఖలా.... తన వలపు సార్థకమైందని ఉషాకన్య ప్రమోదాన్ని పొందింది. పొంది ఆ సుందరునితో సమాగమోపాయాన్ని అన్వేషించ వలసిందిగా వేడుకొంది.

వయసు పొంగులో వలపు సందడికి నిగ్రహించు కోలేక కన్నుల నీరు నిండగా చేతులెత్తి ప్రార్థించింది. వెంటనే తన యోగ విద్యా ప్రభావంచే చిత్రలేఖ ఆకాశ మార్గాన ద్వారకకు వెళ్ళి..... శేష తల్పంపై పవళిస్తూన్న విష్ణువో అన్నట్లుగా శయన మందిరంలో పాన్పుపై నిద్రిస్తూన్న అనిరుద్ధ కుమారుని తన తామస యోగ ప్రభావంచే అంధకారంలో ముంచి, మంచంతో సహా ఉషాకన్య పడక గదికి చేర్చింది. స్వప్నంలో సాక్షాత్కరించిన నిధిని నిజజీవితంలో పొందిన నిరుపేదవలె అనిరుద్ధ సమాగమానికి ఆనందించింది ఉష. తెలతెలవారుతుండగా తిరిగి అనిరుద్ధ కుమారుని ద్వారకకు చేర్చింది చిత్రలేఖ ఇలా ప్రతిరోజూ ఈ రహస్య ప్రణయం కొనసాగుతూ ఉండగా..... ఒక రోజున ఈ విషయం బయటకు పొక్కి బాణసురుని చెవికెక్కింది. విన్న వెంటనే భగ్గున మండి పడ్డాడు బాణుడు.

**అనిరుద్ధుని బాణుడు బంధించుట శ్రీకృష్ణ బాణాసురుల యుద్ధం**

తక్షణం అనిరుద్ధుని బంధించమని భటులకు ఆజ్ఞాపించాడు. శ్రీకృష్ణ పౌత్రుని పరాక్రమం ముందు భటులు నిలువ లేక వెన్ను చూపారు. తానే నాగాస్త్రంతో బంధించి కారాగారంలో ఉంచాడు బాణుడు. ఈ వార్త ద్వారకకు చేరింది. అక్కడ స్త్రీజనం

దుఃఖించారు. వారందరు శ్రీకృష్ణునితో మొరపెట్టుకోగా ఆయన గరుడుని స్మరించి; బలరాముడు, ప్రద్యుమ్నుడు, యుయుధానుడు, సాంబుడు, సారణుడు, గదుడు, నందుడు, భద్రుడు..... ఇత్యాది యాదవ వీరులు వెంటరాగా ససైన్యంగా బాణుని పైకి యుద్ధానికి తరలి వచ్చాడు.

రుద్రుని ముందుంచుకొని బాణుడు యుద్ధానికి సిద్ధంగా నిలిచాడు. ధర్మయుద్ధం మొదలైంది. శ్రీకృష్ణుడు రుద్రునితో, ప్రద్యుమ్నుడు కుమార స్వామితో, బలరాముడు కూష్మాండ కూపకర్ణులతో, సాత్యకి బాణునితో, గరుడుడు నందితో ద్వంద్వ యుద్ధానికి తలపడ్డారు. భండన మంటే పండుగ అని భావించే యాదవ వీరుల చేతిలో రుద్రగణం అలసటను పొందింది. దానిని గమనించిన రుద్రుడు కుపితుడై వారిలో ఉత్తేజాన్ని నింపుతూ, సింహనాదం చేస్తూ వచ్చి గోవిందుని ముందు నిలిచాడు. వారిద్దరి మధ్య పోరు ఘోరంగా సాగింది.

భండనంలో రుద్రుని మార్కొనలేమని భావించిన వాసుదేవుడు రెండుచేతులు జోడించి రుద్రుని స్తుతించి, ఇలా వినయంగా ప్రార్థించాడు. "హే! శంకరా! బలగర్వితుడైన బాణుని సహస్ర బాహువులను నరకటానికి నీ ఆజ్ఞను అనుసరించి వచ్చిన కింకరుడను నేను. నీ శాపం వృథా కారాదు. దయ ఉంచి తప్పుకో! నీ శాపాన్ని నెరవేరుస్తాను." దానికి శంభుడు నవ్వి "మాధవా! నీవన్న మాట నిజమే! అంతకంటె ముందు నీ నగర రక్షకునిగా ఉండి నిన్ను రక్షిస్తానని బాణునికి వరం ఇచ్చాను. నేను భక్తపరాధీనుడను! నేను చూస్తుండగా నువ్వు బాణుని జోలికి పోలేవు! నా ఆజ్ఞచే జృంభణాస్త్ర ప్రయోగం చేసి నన్ను మగతలో ముంచి నీ కార్యాన్ని యథేచ్ఛగా ముగించుకొని వెళ్ళు!"

**బాణుని గర్వభంగం**

వెంటనే రుద్రుని ఆజ్ఞ చొప్పున శ్రీకృష్ణుడు జృంభణాస్త్ర ప్రయోగం చేసి శంకరుని మగతలో ముంచేశాడు. ముంచి.......

అదే అదనుగా ..... విశ్వంభరుడు విజయోత్సాహంతో ఆర్చి........ అక్కజమైన తేజం దిక్కుల వెలయగా..... శతకోటి విలయాలను లిప్తలో సృష్టించగల మహోగ్రమైన సుదర్శన చక్రాన్ని ప్రయోగించి..... బాణుని చతుర్భుజావశిష్టుని చేసి.......

ధరాభార ధూర్వహ సముద్దండ వేదండ శుండా దండ మండితము......

స్వర్ణ కంకణ కేయూర ఖచిత ప్రచుర మణిగణమరీచి మాలికాలంకృతము.....

త్రైలోక్య భయంకర కారణము.....

సౌభాగ్యరేఖావళీ కలిత శోభితారుణ హస్తాలంకృతము.....

చంద్రశేఖర మనోరంజిత తాలలయానుబద్ధ మృదంగ వాద్యానుకూల అంగుళ్యాభిరామము.....

అయిన సహస్ర బాహువులను కదళీ తండాలవలె ఖండించాడు. చతుర్భుజావశిష్టుడైన బాణుడు...

జంభారి దంభోళి ధారాపాతానికి రెక్కలు తెగిన కుంభినీధరంలా ఉన్నాడు!

ప్రళయ జంఝూ సమీరణ విక్షేపానికి కొమ్మలు కూలి మ్రోడైన వట వృక్షంలా ఉన్నాడు.

రుధిర ధారా ప్రవాహాలతో...... నాలుకలు సాచి నింగిని ముట్టుతూ జ్వలిస్తూన్న అగ్నిలా ఉన్నాడు.

చతుర్భుజుడైన తనకు ప్రతిస్పర్ధిగా చతుర్బాహువులు కలిగి ఎట్ట ఎదుట అట్టహాసం చేస్తూ.... తొండాన్ని ఖండించగా ఘీంకరిస్తూన్న మత్త వేదండంలా రణోన్మత్తుడై బొబ్బలు పెడతూన్న బాణుని రత్నఖచిత కుండల మండితమైన ఉత్తమాంగాన్ని ఖండించ టానికి ఉద్యుక్తు డయ్యాడు.... ప్రద్యుమ్న జనకుడు.

జృంభణాస్త్ర ప్రభావం క్షీణించగా వెంటనే తెలివిలోకి వచ్చిన రుద్రుడు "ఓ! వాసుదేవా! నా ఆజ్ఞను నెరవేర్చావు! బాణుని శిరస్సును ఖండించటానికి ప్రయత్నించకు. అది నీ వల్ల కానిపని! ఈ సుదర్శన చక్రాన్ని గతంలో నేనే నీకిచ్చాను. దాన్ని వెంటనే ఉపసంహరించు." అని ఆజ్ఞాపించాడు. దుఃఖంతో కుమిలి పోతున్న బాణుని చెంతకేగి తన ప్రశస్తమైన హస్తాలతో అతని దేహాన్ని స్పృశించి దేహబాధ లేకుండ చేసి శ్రీ కృష్ణునితో మైత్రిని ఘటింప చేసి తన నివాసాన్ని చేరుకొన్నాడు శంభుడు. తదుపరి.....

**ఉష – అనరుద్ధుల వివాహం**
**బాణుడు గణత్వాన్ని పొందుట**

ఒకానొక శుభ ముహూర్తంలో సకల యాదవ సమక్షంలో ఉష అనిరుద్ధుల వివాహం అఖిలజన లోచనోత్సవంగా సాగింది. ఘనంగా సారెపెట్టి కూతురును, అల్లుణ్ణి సాగనంపాడు బాణుడు. నూతన వధూవరులను వెంట పెట్టుకొని మహా వైభవంతో ద్వారకా నగర ప్రవేశం చేశాడు హరి. తన ఇష్ట సఖి, మహా యోగిని ఐన చిత్రలేఖను కూడ తనతో పాటు వెంట పెట్టుకొని వెళ్ళింది ఉష.

బాణుడు తన బాహువులతో పాటు అజ్ఞానం కూడ నశించగా; తన అహంకారమే తనకిష్ట దైవమైన శంకరునితో ఎడబాటు కల్పించిందని లోలోపల కుమిలి పోసాగేడు. అప్పుడు నంది ఇలా ఊరడించాడు: "ఓబాణా! నీవు గొప్ప శివ భక్తుడవు! సందేహం లేదు. మేఘాలు నీటిని మోసుకొచ్చి కాలానుగుణంగా వర్షించినట్లు....... కర్మలు కూడ కాలానుగుణమైన ఫలాలను ఇస్తాయి. వాన రాకడ తెలియనట్లే కర్మ పోకడ, ఫలసిద్ధి కూడ తెలియదు. సర్వమునకు ఈశ్వరుడే కర్త. జరిగిన దానికి విచారించకు. మనస్సును ఆ ఆది పురుషుని యందు లగ్నం చేసి ఆయనకు నిత్యోత్సవాన్ని జరిపించు. ప్రసన్నుని చేసుకో! నీకు శాశ్వతమైన మేలు జరుగుతుంది!" అని చెప్పి అదృశ్యుడయ్యాడు నంది.

బాణుడు తన నాట్యవేద ప్రయోగంతో గొప్ప నృత్యోత్సవ మనే తపస్సును ప్రారంభించాడు. ఎనిమిది రసాలు, నలభైతొమ్మిది భావాలు, నాలుగు విధాలైన అభినయాలు, రెండు రకాల ధర్ములు, నాలుగు వృత్తులు, నాలుగు ప్రవృత్తులు, రెండు విధాల సిద్ధులు, ఏడు స్వరాలు, నాలుగు విధాలైన వాద్యములు, ఐదు విధాలైన ధ్రువా గానములు, మూడు విధాలైన నాట్యరంగములు.... ఇలా పదుకొండు విషయాలతో కూడిన అతి విస్తృతమైన నాట్య వేద ప్రయోగంతో నటరాజును అర్చించాడు."

సూతుడు ఋషులతో ఇలా అంటున్నాడు: "మునులారా! ఈ నాట్యవేదం చతుర్వేద సమన్వితం. దేవతల కోరికపై దీనిని తొలుత నిర్మించిన వాడు పితామహుడు. చూచుటకు, వినుటకు కూడ వీలైనది, చతుర్విధ పురుషార్థాలను సాధించుటకు సాధకమైనది, ప్రదర్శించుటకు అనుకూలమైనది.... అగు ఒక వినోదాన్ని (ఆటను) సృష్టించి ఇయ్య వలసిందిగా దేవతలు కోరేరు. సర్వమైన విజ్ఞానానికి వేదమే మూలం కనుక....... ఋగ్వేదం నుండి పాఠ్యాన్ని (సాహిత్యాన్ని), సామవేదం నుండి గీతాన్ని (సంగీతం) యజుర్వేదం నుండి అభినయాన్ని, అథర్వణవేదం నుండి రసాన్ని గ్రహించి పితామహుడు దీనిని నిర్మించాడు. దీనిని భూలోకానికి తెచ్చిన వాడు భరతముని. 'భ' అంటే భావము, 'ర' అంటే రాగము, 'త' అంటే తాళము (మాట, పాట, ఆట) ఈ మూడింటి సమ్మేళనమే భరతము. దీనిని మించిన విద్య లేదు. ఇందులో లేనిది లోకంలో లేదు.

నూట ఎనిమిది కరణాలను, ఆ కరణముల కూడికచే ఏర్పడే ముప్పది రెండు అంగహారాలను, కరణ– అంగహారముల యోగంచే సిద్ధించే పిండీబంధాలను, ప్రదర్శిస్తూ నృత్యం చేసి శంకరుని అర్చించాడు. పతాక, త్రిపతాక, కర్తరీముఖ.... ఇత్యాది ఇరవై

నాలుగు అసంయుత హస్తాలను, అంజలి, కపోత, కర్కట, స్వస్తిక ... ఇత్యాది పదమూడు సంయుత హస్తాలను; – చతురశ్ర, ఉద్వృత్త, తలముఖ...... ఇత్యాది ముప్పది నృత్త హస్తాలను చూపుతూ గీత వాద్యాలతో నృత్యవిలాసి ఐన శంకరుని సంతోషింప చేశాడు. సమపాద, స్థితావర్త, శకటాస్య.... ఇత్యాది పదహారు భౌమీచారులను; అతిక్రాంత, అవక్రాంత, పార్శ్వక్రాంత ...... ఇత్యాది పదహారు ఆకాశికీచారులను చూపుతూ అద్భుతమైన నృత్య విన్యాసాన్ని ప్రదర్శించాడు, వైష్ణవ, సమపాద, ఆలీఢ. ప్రత్యాలీఢ.......ఇత్యాది ఆరుస్థానములలో శస్త్రప్రయోగాన్ని నిరూపించి శంకరుని మెప్పించాడు. శస్త్ర ప్రయోగంలో పాటించే భారత, సాత్త్వత .... ఇత్యాది ఆరు న్యాయాలను అభినయించి నటరాజును ఆనందింప చేశాడు.

బాణ ప్రయోగంలో విధిగా పాటింప వలసిన ప్రమార్జనము (వింటిని సరిచూచు కొనుట), ఆదానము (తూణీరం నుండి బాణాన్ని గ్రహించుట), సంధానము (బాణాన్ని సంధించుట) మోక్షము (విడిచి పెట్టుట) ఈ నాలుగు ధనుష్కరణాలను అభినయించి బాణుడు స్థాణుని సంతుష్టాంత రంగుణ్ణి చేశాడు. ఉత్తమ, మధ్యమ, అధమ ప్రకృతులకు ఉచిత మైన గతి విశేషాలు చూపి శంభుని ఆరాధించాడు. గతి భేదాలను అనగా రసగతులను, దేశానుసార గతులను ప్రదర్శించాడు.

పెక్కు ఛందో రీతులలో గీతాలను, ధ్రువలను (దరువులను) పెక్కు రాగాలలో అనేక తాలలయ విన్యాసాలతో ఆడి, పాడి నృత్యగాన తాళ ప్రియుడైన కాలకంఠుని మెప్పించాడు. చతుర్విధ వాద్యాలను.... అనగా తంత్రీగతమైన (తతం) వీణాదులను, చర్మంతో మూసి ఉంచబడిన మృదంగ, కంజీర ఇత్యాది చర్మ వాద్యాలను (అవనర్థం), కంచు తాళాలను (ఘనం) గాలితో పూరించే (సుషిరం) వేణువు ఇత్యాది వాయిద్యాలను వివిధ రాగ తాళ గతులలో వాయించి శంకరుని అర్చించాడు. బాణుడు తన దేహాన్ని విస్మరించి పెక్కు భంగులలో చేసిన నృత్త నృత్య, నాట్య విన్యాసాలకు రక్త ధారలతో నేల పంకిలమైంది. అతని శరీరం నుండి పుట్టిన తాపానికి వియత్తలం వేడెక్కగా వియచ్చరులు విస్మయాన్ని పొందారు.

మునుపెన్నడు ఎవరూ చెయ్యని పరమాద్భుతమైన నృత్య తపస్సుకు నృత్య గీత ప్రియుడైన హరుడు పరమానందాన్ని పొంది బాణుని ముందు ప్రత్యక్షమై వరాన్ని కోరుకొమ్మనగా అతడిలా ప్రార్థించాడు "శంకరా! నాశనం లేని గణాధ్యక్ష స్థానాన్ని నాకు

కల్పించు! సాలోక్య ప్రాప్తి నాకు కలుగు గాక! విష్ణువు యందు వైరము లేకుండు గాక! ఈ రాక్షస జన్మ నాకు తిరిగి లేక పోవుగాక! ఉషా కుమారుడైన వజ్రుడు ఈ శోణ పురానికి రాజగు గాక! శివ భక్తులతో మైత్రి, భూతదయ నేను కలిగి ఉందును గాక! నీయందు నిర్వికారమైన భక్తిని కలిగి యుందును గాక!" ఇలా ప్రార్థించి ఇంకా ఇలా స్తుతించాడు.

**శ్లో ॥ దేవ దేవ మహాదేవ శరణాగత వత్సల ।**
**త్వాం నమామి మహేశాన దీనబంధో దయానిధే ॥**
**కృతా మయి కృపాతీవ కృపాసాగర శంకర ।**
**గర్వోఽ పహారితస్సర్వః ప్రసన్నేన మమప్రభో ॥**
**త్వం బ్రహ్మపరమాత్మా హి సర్వవ్యాప్యఖిలేశ్వరః ।**
**బ్రహాండతనురుగ్రేశో విరాట్ సర్వాన్వితః పరః ॥**
**నాభిర్నభోఽ గ్నిర్వదనమంబు రేతో దిశశ్శృతిః ।**
**ద్యౌశ్శీర్షమంఘ్రిరుర్వీతే మనశ్చంద్రస్తవ ప్రభో ॥**
**దృగర్కో జఠరం వార్ధిర్భుజేంద్రో ధిషణా విధిః ।**
**ప్రజాపతిర్విసర్గశ్చ ధర్మో హి హృదయం తవ ॥**
**రోమాణ్యోషధయో నాథ కేశా జలముచస్తవ ।**
**గుణాస్త్రయస్త్రినేత్రాణి సర్వాత్మా పురుషో భవాన్ ॥**
**బ్రాహ్మణం తే ముఖం ప్రాహూర్బాహుం క్షత్రియమేవచ ।**
**ఊరుజం వైశ్యమాహుస్తే పాదజం శూద్రమేవచ ॥**
**త్వమేవ సర్వదోపాస్యస్సర్వైర్జీవైర్మహేశ్వర ।**
**త్వాం భజన్ పరమాం ముక్తిం లభతే పురుషో ధ్రువమ్ ॥**
**యస్త్వాం విసృజతే మర్త్య ఆత్మానం ప్రియమీశ్వరమ్ ।**
**విపర్య యేంద్రియార్థార్థం విషమత్త్యమృతం త్యజన్ ॥**
**విష్ణుర్బ్రహ్మాథ విబుధా మునయశ్చామలాశయా ః ।**
**సర్మాత్మనా ప్రపన్నాస్త్వాం శంకరం ప్రియమీశ్వరమ్ ॥**

**తా॥** ఓ దేవదేవా! మహాదేవా! శరణాగతవత్సలా! మహేశ్వరా! దీనబంధూ! దయానిధీ! నీకు నమస్కారము. ఓ దయాసముద్రా! శంకరా! నీవు నాయందు గొప్ప దయను చూపితివి. ఓ ప్రభూ! నీవు ప్రసన్నుడవై నా గర్వమునంతను అడంచితివి. పరమాత్మ,

సర్వవ్యాపి , సర్వేశ్వరుడు, బ్రహ్మాండములే దేహముగా గలవాడు, భయంకరుడగు ఈశ్వరుడు, విరాట్ స్వరూపమునందు అనుగతమైన సర్వజగత్తు గలవాడు అగు పరబ్రహ్మ నీవే. ఆకాశము నీ నాభి, అగ్ని నోరు, జలము రేతస్సు. దిక్కులు చెవులు. స్వర్గ లోకము శిరస్సు, భూమి నీ పాదము, ఓ ప్రభూ! చంద్రుడు నీ మనస్సు. సూర్యుడు నీ కన్ను. సముద్రము నీ జఠరము. ఇంద్రుడు నీ భుజము. నీ బుద్ధి బ్రహ్మ. ప్రజాపతి విసర్గము. విసర్గమనగా వివిధ రూపములలోనున్న సృష్టి. ధర్మము నీ హృదయము. వృక్షలతాదులు నీ రోమములు. ఓ నాథా! మేఘములు నీ కేశములు. మూడు గుణములు నీకన్నులు. సర్వస్వరూపుడవగు పురుషుడవు నీవే. బ్రాహ్మణుడు నీ ముఖమనియు, బాహువులు క్షత్రియుడనియు, వైశ్యుడు ఊరువులనియు, శూద్రుడు పాదమనియు చెప్పెదరు. ఓ మహేశ్వరా! సర్వజీవులచే సర్వకాలములయందు ఉపాసించదగినవాడవు నీవే. మానవుడు నిన్ను సేవించి నిశ్చయముగా శ్రేష్ఠమగు ముక్తిని పొందును. ఆత్మరూపుడు, ప్రియుడు, ఈశ్వరుడు అగు నిన్ను ఏ మానవుడైతే విరుద్ధములగు ఇంద్రియ భోగముల కొరకై విడనాడునో, వాడు అమృతమును పరిత్యజించి విషమును భక్షించుచున్నాడు. ప్రియుడు, ఈశ్వరుడు, శంకరుడు అగు నిన్ను విష్ణువు, బ్రహ్మ, దేవతలు మరియు పరిశుద్ధమగు అంతఃకరణము గల మునులు సర్వ విధములుగా శరణు పొందియున్నారు.

బాణుడిలా స్తుతించి పులకిత శరీరుడై పునః పునః ప్రణామాలు చేశాడు. “నీ కోరికలన్ని నెరవేరు గాక!” అని అనుగ్రహంతో పలికి అంతర్ధాన మయ్యాడు శంభుడు. బాణుడు మహాకాల పర్యంతము చిరంజీవియై మహదానందాన్ని పొంది వర్ధిల్లేడు. నేటికీ హిమాలయ గిరిశిఖర మందున్న కేదారమనే పవిత్ర భూమి చెంత..... శోణ నగరము బాణుని కోట, ఉషా కళ్యాణ మంటపము తదితర చిహ్నాము లన్నీ  చెక్కుచెదర కుండ ఉన్నాయి. కేదారమనే శబ్దానికి ‘స్వర్గానికి ద్వారము’ అని అర్థం. కృతయుగంలో వైరాగ్య పీఠమనే పేరుతో ఒక శైవ పీఠం అక్కడుండేది. అదే పీఠం బాణుని కాలంలో ‘ఉషామఠం’గా వాసికెక్కింది. ఆ పీఠాధిపతియైన జగద్గురు ఆనందలింగ జంగమ భగవత్పాదుల సన్నిధి యందు ఉషాదేవి అన్ని విద్యలను నేర్చింది. ఆ పీఠానికి అనేక ధనకనక వస్తు వాహనాలను సమర్పించింది. అప్పటి నుండి ఆ పీఠం ఉషామఠంగా (ఉఖీమఠంగా) ప్రఖ్యాతమైంది. శంకరుడు పార్వతితో కూడి శోణ నగరం (శోణిత్‌పుర)లో ఉన్న కాలంలో ఉషాదేవి పార్వతివద్ద నర్తన విద్యను నేర్చుకొంది, సౌరాష్ట్రదేశంలో (ద్వారకలో) ప్రచారం చేసింది. నాట్య శాస్త్రాన్ని ప్రవర్తింప చేసిన వారిలో ఉష ప్రసిద్ధురాలు.

## గజాసుర సంహారం

పూర్వం దేవతల హితాన్ని కోరి దుర్గా దేవి యుద్ధంలో మహిషాసురుని సంహరించింది. వాని కుమారుడైన గజాసురుడు దానికి కుపితుడై అమరులపై ద్వేషాన్ని పూని వారిని సాధింపనెంచి బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. వాని తపస్సుకు లోకాలు క్షోభించగా దేవతలు బ్రహ్మతో మొరపెట్టుకొన్నారు. ఆయన ప్రత్యక్షమై నీ అభీష్టాన్ని వెల్లడించమని కోరగా అసురుడు "కామానికి లొంగి పోయిన స్త్రీ – పురుషుల చేతిలో నాకు మరణం లేకుండు గాక!" అని వరాన్ని కోరగా ఆయన 'తథాస్తు' అని పలికి అంతర్ధానమయ్యాడు.

గజాసురుడు విధాత వరబల గర్వితుడై స్వర్గ, మర్త్య, పాతాళలోక పాలకులను జయించి ఆ లోక వాసులందరిని తన ఏలుబడి లోనికి తెచ్చుకొన్నాడు. అంతటితో ఊరుకోక ఆనంద వనానికి (కాశీకి) వచ్చి అక్కడి బ్రాహ్మణులను, శివభక్తులను హింసింప సాగేడు. అప్పుడు పాకశాసనాది గీర్వాణు లందరు రుద్రుని చేరి రక్షించమని ప్రార్థించగా; ఈయన త్రిశూలాన్ని ధరించి గర్జిస్తూ గజాసురునితో పోరుకు సిద్ధమై అతని ముందు నిలిచాడు. అంతవరకు తన పరాక్రమానికి ప్రతిఘటన లేకుండ సంచరించిన ఆ అసురుడు రుద్రుని చూచి మహోగ్రుడై భీకర కరవాలాన్ని చేతపట్టి "ఈ రోజున నా చేతిలో నీకు మరణం తథ్యం" అంటూ మీదికి ఉరికాడు. సర్వజ్ఞశేఖరుడైన శంకర దేవుడు వాని అజ్ఞానానికి నవ్వుకొని నిశిత త్రిశూలానికి గ్రుచ్చి వాణ్ణి గొడుగులా ఆకాశంలో నిలపెట్టాడు.

మహేశ్వరుని చేతిలో మరణమే మహా ప్రసాదంగా భావించిన మహిషాసుర నందనుడు శూలంపై ఉంటూనే అంధకాసుర వైరిని అనేక విధాల స్తుతించాడు. దానికి ప్రసన్నుడై హరుడు వరాన్ని కోరు కొమ్మనగా గజాసురుడిలా వేడుకొన్నాడు.

"ఓ దిగంబరా! మహేశ్వరా! నీ త్రిశూలాగ్నిచే పావనమైన నా శరీర చర్మాన్ని దుకూలంగా ధరించు. తొమ్మిది వేల యోజనాల పొడవు, అంతే వెడల్పు గల సుందరమైన ఈ చర్మం నీ శరీర పరిమాణానికి తగినట్లుగా ఉంటుంది. ఇది నీకు ప్రాణవల్లభ ఐన ప్రియురాలి స్పర్శ వలె శరీర సుఖాన్ని ఇచ్చుగాక! ఎల్లవేళలా కుసుమ కోమలంగా ఉండి సుగంధాన్ని వెదజల్లుగాక! ఇది సర్వ కాల సర్వావస్థల యందు నిర్మలంగా ఉండి నీకు శ్రేష్ఠమైన అలంకారమగు గాక! ఓ ఫాలలోచనా! నా తపోనలానికి ముల్లోకాలు కమిలి పోయాయి గాని నా శరీరం వన్నె తగ్గలేదు..... సరిగదా అధికమైంది. ఇది పుణ్యగంధ నిధి! శంకరా! నా శరీరం పుణ్యనిధి కాని ఎడల సమరంలో నీతోడి సంపర్కం ఎలా కలిగింది చెప్పు? ఈనాటి నుండి నీకు కృత్తివాసుడనే నామం కలుగు గాక.!"

ఇలా ప్రార్థించిన గజాసురుని అభీష్టాన్ని నెరవేర్చి విశ్వేశ్వరుడిలా ఆశీర్వదించాడు. "ఓ గజాసురా! ముక్తి సాధనమైన ఈ కాశీ క్షేత్రంలో నీ పుణ్య శరీరం సర్వులకు ముక్తినిచ్చే కృత్తివాసేశ్వర నామధేయంతో లింగమై ప్రసిద్ధిచెంది శాశ్వతమై వెలయు గాక!" ఇలా పలికి గజాసుర చర్మాన్ని ప్రీతితో ధరించాడు గిరిజా మనోహరుడు. ఈ గజాసుర సంహార గాథ పరమ పవిత్రమైనది. ఇహంలో సమస్త భోగాలను ఇచ్చి పరంలో శివ సాయుజ్యాన్ని ఇస్తుంది.

**దుందుభి నిర్హ్రాదుని సంహారం**

పూర్వం దితి పుత్రుడైన హిరణ్యాక్షుని శ్రీ మహావిష్ణువు యజ్ఞ వరాహావ తార మెత్తి వధించాడు. దానికి దితి అమితంగా దుఃఖించింది. ప్రహ్లాదుని మేనమామ, దుష్టుడు అగు దుందుభి నిర్హ్రాదుడనే రాక్షసుడు దితిని ఓదార్చి దేవతల మీద పగ తీర్చు కొనటానికి ఉపాయాన్ని ఇలా అలోచించాడు: "ఎవరికైనా బలాన్నిచ్చేది ఆహారమే కదా! దేవతల యొక్క ఆహారం బ్రాహ్మణులు యజ్ఞాలలో సమర్పించే హవిస్సులు మాత్రమే! యజ్ఞాలకు వేదములే ఆధారం. ఆ వేదాలు బ్రాహ్మణులను ఆశ్రయించి ఉంటున్నాయి. కనుక బ్రాహ్మణులు నశిస్తే వేదాలు, వేదాలతో పాటు యజ్ఞాలు నశిస్తాయి. ఆ తరువాత దేవతలకు హవిర్భాగాలు లభించక దుర్బలులవుతారు. అపుడు వారిని తేలికగా జయించ వచ్చు. వారి అక్షయ సంపదలను కైవసం చేసికొనవచ్చు!" – ఇలా ఆలోచించి ఆ దుష్టుడు బ్రహ్మతేజో విరాజమానులు, వేదాధ్యయన సుసంపన్నులు అధికంగా నివసిస్తున్న వారణాసీ నగరానికి వచ్చి వారిని భక్షించటం మొదలు పెట్టాడు.

అతడు మాయావి ఐన కారణంగా వనంలో వనచరుని గాను, జలాలలో జలజంతువు రూపంలోను, పగటి భాగంలో మనుష్యుల మధ్య ముని రూపంలోను ఇంకా అనేక రూపాలలో ఉంటూ బ్రాహ్మణులను చంపి భక్షిస్తూ ఉండే వాడు. రాత్రి పెద్దపులి రూపంలో వచ్చిఎముకలను కూడ విడిచి పెట్ట కుండ తినివేసే వాడు. నిన్న కనిపించిన విప్రుడు ఈ రోజున కనుపించక పోయేసరికి కాశీ నగరంలో పెద్ద గగ్గోలు పుట్టింది. అప్పటికే చాలా మంది బ్రాహ్మణులు మాయావి నోట్లోపడి మాయ మయ్యారు.

ఒక రోజున శివరాత్రినాడు శివభక్తుడైన ఒక బ్రాహ్మణుడు శివుని అర్చించి ధ్యాననిమగ్నుడైనాడు. దుందుభి నిర్హ్రాదుడు అతనిని కబళించటానికి నిశ్చయించు కొన్నాడు కాని; అస్త్రమంత్ర న్యాసం చేసి ఏకాగ్ర చిత్తంతో శివధ్యానం చేస్తూన్న విప్రుని సమీపించలేక

పోయాడు. ధ్యానం నుండి లేచి అర్చన ముగించగానే విప్రుని కబళింప బోయాడు మయావి. వెంటనే సర్వవ్యాపకుడైన రుద్రుడు వాని అభిప్రాయాన్నెరిగి బ్రాహ్మణుడు అర్చించిన లింగాన్నుండి ఆవిర్భవించి మృగ రూపంలో ఉన్న రాక్షసుని బాహు బంధంలో ఇరికించి పిడికిలితో నెత్తిపై మొత్తగానే వ్యాఘ్రరూపంలో ఉన్న రాక్షసుడు వెంటనే భయంకరంగా గర్జిస్తూ మరణించాడు. ఆ అరుపుకు అనేక మంది మునులు,ఋషులు, విప్రులు, ప్రజలు, అక్కడకు చేరుకొని జయ, జయ ధ్వానాలతో శంకరుని స్తుతించి అక్కడనే నిత్య నివాసంగా ఉండమని ప్రార్థించారు. భక్త వత్సలుడైన శంభుడు తానా విర్భవించిన లింగమునందే లీనమయ్యాడు. అప్పటి నుండి ఆ లింగం కాశీ నగరంలో వ్యాఘ్రేశ్వర లింగమనే పేర నిత్య పూజలను అందుకొంటూ భక్తుల కొంగు బంగారమై వారిని రక్షిస్తూనే ఉంది. ఈ గాధ శివ ప్రీతికరమైనది, భుక్తి ముక్తి దాయకమైనది.

### విదలోత్పల దైత్యుల వధ

పూర్వం విదలుడు, ఉత్పలుడు అనే పేర్లు గల ఇద్దరు రాక్షసులు బ్రహ్మనుండి పురుషునిచే మరణం లేని విధంగా వరాన్ని పొంది సకల దేవతలను బాధిస్తుండగా; వారువిధాతను ఆశ్రయించారు. ఆయన పార్వతీ పరమేశ్వరులను దర్శించమని ఉపదేశించగా వారట్లే ఆ ఆది దంపతులను దర్శించి రాక్షసుల నుండి తాము అనుభవిస్తూన్న కష్టాలను విన్నవించగా అభయ మిచ్చి పంపారు వారు. ఒక రోజున కలహ భోజనుడైన నారదుడు శివుని ప్రేరణచే విదలోత్పలుల సభ కేగి వారి ముందు పార్వతీ సౌందర్య ప్రస్తావన చేశాడు. 'ఇందుముఖి' అనే మాట చెవిని పడగానే గంగవెర్రులెత్తే ఆ రాక్షసులు కామజ్వర పీడితులై పార్వతిని ఎలా అపహరించాలా అనే ఆలోచనలో పడ్డారు.

ఒక రోజున ఆదిశక్తి, ప్రకృతి స్వరూపిణి, లోక మాత ఐన పార్వతి తన చెలికత్తెలతో కూడి శివుని సన్నిధిలో లీలా వినోదంగా బంతి ఆటను ఆడుతున్నది. అదే సమయంలో అంతరిక్షంలో సంచిరిస్తూన్న ఆ జంట రాక్షసులు శంబర మాయా ప్రభావంచే నేలకు దిగి శివకింకరుల రూపంలో పార్వతిని సమీపించారు. తక్షణం సర్వాంతర్యామి ఐన శంకరుడు వారి దుష్ట తలంపును గమనించి పార్వతికి కనుసైగ చేయగా ఆమె ఆట బంతితో విదలోత్పలు లిద్దరిని ఒకే సారి కొట్టింది. ఆ దెబ్బకు ముగ్గిన తాటి పండ్ల వలె వారిద్దరు నేలకు కూలి మరణించారు. ఆ బంతి శివుని సంకల్పంచే లింగ రూపంలోనికి మారింది. ఇప్పటికీ ఆ లింగం కందుకేశ్వర లింగమనే పేర జ్యేష్ఠేశ్వర లింగ సమీపంలో ఉండి తనను అర్చించిన వారి అభీష్టాలను తీరుస్తూ ఉంది.

మునులారా! మీకింత వరకు శివ మహా పురాణంలో రుద్ర సంహితలో అంతర్భాగమైన యుద్ధ ఖండమును చెప్పాను. ఇంతటితో రుద్రసంహిత పూర్తయింది. ఇందులోని గాథలన్ని రహస్యమైనవి. పరమ పవిత్రమైనవి! సర్వోత్కృష్టమైన శంకరుని లీలా విలాసాలను తెలియ చెప్పే గాథల కంటె మానవుడు పఠింప దగిన గ్రంథమేమున్నది? ఆయన నామజపం కంటె, ఆయన అర్చన కంటె ఉత్తమ కర్తవ్యం మరొకటి లేదు. దీనిని పఠించిన మానవులకు రోగ భయం, మృత్యుభయం, శత్రుభయం ఉండవు, తలపెట్టిన కార్యాలకు అడ్డుపడే ఆటంకాలను తొలగించటంలో దీన్ని మించిన గ్రంథం లేదు. ఈ లోకంలో శివభక్తులైన మానవు లందరు మరణానంతరం శివసాలోక్యాన్ని పొందుతారు అనటంలో సందేహం లేదు.

**శ్రీ శివ మహా పురాణంలో రెండవది అయిన**

**రుద్ర సంహిత సమాప్తం**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## శత రుద్ర సంహిత



**శ్లో ॥ వందే మహానంద మనంత లీలం మహేశ్వరం సర్వవిభుం మహాంతమ్ ।**
**గౌరీప్రియం కార్తిక విఘ్నరాజ సముద్భవం శంకర మాది దేవమ్ ॥**

శ్రీ గణేశునకు నమస్కరించి శ్రీ శివ మహా పురాణంలో మూడవది ఐన శతరుద్ర సంహిత ఆరంభింప బడుతున్నది. ఆనంద ఘనుడు, అనంత మగు లీలలు గలవాడు, మహేశ్వరుడు, సర్వవిభుడు, పరబ్రహ్మ, గౌరీపతి, షడానన గజాననులకు ప్రాదుర్భావ కారకుడు, ఆది దేవుడు అగు శంకురునకు నమస్కరిస్తున్నాను.

### శివ పంచముఖ అవతారములు

సూత మహర్షి శౌనకాది మునులతో ఇలా అంటున్నాడు: "ఓ తపోధనులారా! తొల్లి జ్ఞాన స్వరూపుడైన నందీశ్వరుడు సనత్కుమారునికి చెప్పిన తాత్త్విక, జ్ఞాన బంధురమైన శివ గాథలను చెపుతున్నాను వినండి. వీటి తత్త్వం దురవగాహం.

సర్వ వ్యాపకుడు, సర్వేశ్వరుడు అగు శివుడు వివిధ కల్పాలలో బహు రూపుడై అవతరించిన అవతారాలకు లెక్క లేదు. అయినా నా బుద్ధికి తోచిన వాటిని మీకు చెపుతున్నాను వినండి. పందొమ్మిదవ కల్పానికి శ్వేత లోహితమని పేరు. ఆ కల్పంలో పరబ్రహ్మను ధ్యానిస్తూన్న బ్రహ్మనుండి శిఖతో కూడిన వాడు; తెలుపు, ఎరుపు రంగు కలవాడు అగు కుమారుడు జన్మించాడు. బ్రహ్మ ఆ కుమారుని చూచి; పరబ్రహ్మ స్వరూపుడైన ఈశ్వరుడే సద్యోజ్యాత రూపంలో అవతరించాడని ఎరిగి గొప్ప ఆనందంతో చేతులు జోడించి నమస్కరించి పవిత్రాంతః కరణతో ధ్యానించాడు. బ్రహ్మ అలా ధ్యానిస్తూండగా సద్యోజాత రూపం నుండి తెల్లని వర్ణము గలవారు, కీర్తిమంతులు, మహాజ్ఞానులు, పరబ్రహ్మ స్వరూపులు అగు నలుగురు మహాత్ములు ఆవిర్భవించారు. సునందుడు, నందనుడు, విశ్వనందుడు, ఉపనందుడు అనే

పేర్లు గలవారు. బ్రహ్మకు శిష్యులయ్యారు. వారిచే బ్రహ్మలోకం వ్యాపించింది. ఇది సద్యోజాతావతారం.

ఇరువదియవ కల్పానికి రక్త కల్పమని పేరు. ఆ కల్పంలో బ్రహ్మ రక్త వర్ణాన్ని కలిగి ఉంటాడు. పరబ్రహ్మ ధ్యాన నిమగ్నుడైన బ్రహ్మ నుండి ఈ కల్పంలో ఎర్రని మాలను, వస్త్రాలను, కన్నులను, మరియు ఆభరణాలను ధరించిన శివుని రెండవ రూపమైన వామదేవావతారం ఆవిర్భవించింది. ఆ కుమారుని చూచి బ్రహ్మ శివావతారమని గుర్తించి నమస్కరించి ధ్యానించగా; వామదేవుని నుండి విరజసుడు, వివాహుడు, విశోకుడు, విశ్వభావనుడు అనే పేర్లు గల రక్త వర్ణ వస్త్రాలను ధరించిన నలుగురు కుమారులు ఆవిర్భవించారు. ఆ వామదేవుడు బ్రహ్మకు బ్రహ్మ జ్ఞానాన్ని, సృష్టి సామర్థ్యాన్ని ప్రీతితో ఇచ్చి అంతర్హితు డయ్యాడు. ఇది వామదేవావతారం.

ఇరువది ఒకటవ కల్పానికి పీతవాసః కల్పము అని పేరు. ఆ కల్పంలో పచ్చని వస్త్రాన్ని ధరించి ధ్యానిస్తూన్న బ్రహ్మ నుండి పచ్చని వస్త్రాన్ని ధరంచిన, శివుని మూడవ అవతారమైన తత్పురుషావతారం వ్యక్తమైంది. ఆ అవతారాన్ని గుర్తించి బ్రహ్మ మహాదేవ గాయత్రిని (శంకర గాయత్రిని) జపించి ధ్యానించగా ఆ తత్పురుషావతారం నుండి పచ్చని వస్త్రాలను ధరించిన నలుగురు కుమారులు వ్యక్తమై వారందరు లోకంలో యోగ మార్గ ప్రవర్తకు లయ్యారు. ఇది తత్పురుషావతారం.

ఇరువది రెండవ కల్పానికి శివ కల్పమని పేరు. సర్వము జలమయమైన ఆ కల్పంలో ప్రజలను సృష్టించ గోరి బ్రహ్మ వేయి దివ్య సంవత్సరాలు ధ్యానించగా; నల్లని రంగు, నల్లని కిరీటము, నల్లని చందనము, నల్లని వస్త్రములు, నల్లని తలపాగా, నల్లని యజ్ఞోపవీతము కలిగిన కుమారుడు ఆవిర్భవించాడు. కృష్ణ పింగళ వర్ణములు కల ఆ కుమారుడు శివుని నాల్గవ రూపమైన అఘోరావతారం. బ్రహ్మగారు ఆ కుమారుని భక్తితో ధ్యానించగా ఆ అవతార పార్శ్వము నుండి అతనిని పోలిన నలుగురు కుమారులు ఆవిర్భవించారు. వారు కృష్ణుడు, కృష్ణ శిఖుడు, కృష్ణాస్యుడు, కృష్ణ కంఠధృక్ లనే పేర్లు గలవారు. వారు లోకంలో అద్భుతమైన ఘోరమను పేరుగల యోగాన్ని ప్రవర్తింప చేశారు. ఆ యోగానుష్ఠానాన్ని పాటించిన వారిని అఘోరీలు అంటారు. ఇది అఘోరావతారం.

ఇరువది మూడవ కల్పానికి విశ్వరూప కల్పమని పేరు. ఈ కల్పంలో బ్రహ్మ పుత్రార్థియై ధ్యానింపగా ..... గొప్ప నాదము కలది, విశ్వమే రూపంగాగలది అగు

సరస్వతి ఆవివర్భవించింది. పిమ్మట పరమేశ్వరుడు స్ఫటికం వలె తెల్లని ప్రకాశంతో ఈశాన రూపంలో ఆవిర్భవించాడు. ఆ కుమారుడు బ్రహ్మకు ధర్మ మార్గోపదేశం చేసి జటి, ముండి, శిఖండి, మరియు అర్థముండుడు అనే పేర్లు గల నలుగురు మంగళ స్వరూపులను సృష్టించాడు. వారు యోగ బుద్ధితో సద్ధర్మాన్ని అనుష్ఠించి దానినే లోకంలో ప్రవర్తింప చేశారు. ఇది ఈశానావతారం.

పరమేశ్వరుడు ఈ ఐదు రూపాలలో బ్రహ్మాండ మంతా వ్యాపించి మేలు చేస్తూ ఉంటాడు. ఇందులో ఈశానుడు ప్రకృతిని అనుభవిస్తూ క్షేత్రజ్ఞుని స్వయంగా అధిష్ఠించి ఉంటాడు. తత్పురుషుడు గుణాశ్రయమైన ప్రకృతియే స్వరూపంగా కలిగి భోగ్యమైన సర్వజ్ఞత్వాన్ని అధిష్ఠించి ఉంటాడు. అఘోరుడు ధర్మ-అధర్మ (మంచి-చెడ్డ) ముల వివేకాన్ని కలిగిన బుద్ధి తత్త్వాన్ని ఆశ్రయించి ఉంటాడు. వామదేవుడు అహంకారాన్ని అశ్రయించి వివిధ కర్మలను నెరవేరుస్తూ ఉంటాడు.

పంచముఖుడైన పరమేశ్వరుడు ఈ ఐదు అవతారాలను ధరించి బ్రహ్మాండమంతా వ్యాపించి పంచ భూతాల మీద ఆధిపత్యాన్ని కలిగి సృష్టి కార్యాన్ని నెరవేరుస్తూ ఉంటాడు. అలాగే సకల ప్రాణికోట్ల యందు అంతర్యామి స్వరూపంగా ఉంటూ పంచ జ్ఞానేంద్రియ, పంచ కర్మేంద్రియ వ్యాపారాలకు అదిష్ఠాన దైవంగా ఉంటాడు.

| పంచ ముఖాలు | పంచభూతాలు | పంచజ్ఞానేంద్రియాలు | పంచకర్మేంద్రియాలు |
|---|---|---|---|
| 1. ఈశానుడు | ఆకాశం (శబ్దం) | చెవి(వినుట) | నోరు (మాట్లాడుట-తినుట) |
| 2. తత్పురుషుడు | వాయువు (స్పర్శ) | చర్మం (స్పర్శ) | చేతులు |
| 3. అఘోరుడు | అగ్ని (తేజస్సు, రూపం) | కన్ను (చూచుట) | కాళ్ళు / శరీరం |
| 4. వామదేవుడు | జలం (రసం) | జిహ్వ (రుచి) | జననేంద్రియం |
| 5. సద్యోజాతుడు | భూమి(గంధం) | ముక్కు (వాసన) | గుదము |

శుభాలను కోరుకొనే వారెల్లప్పుడు పంచముఖుడైన పరమేశ్వరుని ధ్యానించాలి.

**పరమేశ్వరుడు అష్టమూర్తి**

పరమేశ్వరుడు అష్టమూర్తి స్వరూపుడు. మునులారా! ఆ అష్టమూర్తుల నామధేయాలను ఆయన ధరించిన రూపాలను చెపుతున్నాను వినండి. పూసలలో దారంలా అన్నింటిని ఆయనే ధరించి ఉన్నాడు.

| | అష్టమూర్తులు | ఆయన ధరించిన రూపాలు |
|---|---|---|
| 1. | శర్వుడు | భూమి |
| 2. | భవుడు | జలము |
| 3. | రుద్రుడు | అగ్ని |
| 4. | ఉగ్రుడు | వాయువు |
| 5. | భీముడు | ఆకాశం |
| 6. | పశుపతి | జీవుడు (క్షేత్రజ్ఞుడు) |
| 7. | ఈశానుడు | సూర్యుడు |
| 8. | మహాదేవుడు | చంద్రుడు |

మంగళస్వరూపుడు, సర్వకారణ కారణుడు అయిన రుద్రుడే అష్టమూర్తుల రూపంలో జగత్తును అధిష్ఠించి ఉన్నాడు. చెట్టు మొదట్లో నీరు పోస్తే కొమ్మలకు పుష్టి కలుగుతుంది. అలాగే శివుని ఆరాధిస్తే ఆయన శరీరమైన జగత్తుకు శుభాలు కలుగుతాయి. జగత్తు ఆనందంగా ఉంటే ఆయన ప్రీతుడవుతాడు. ఏ ప్రాణిని హింసించినా అది శివాపరాధమే అవుతుంది. సందేహం లేదు. సకల ప్రాణికోట్ల యందు అంతర్యామి స్వరూపంగా జీవ రూపంలో (పశువు లేదా గోవు) ఉన్నవాడు శివుడే! అందువల్లనే ఆయన పశుపతి లేదా గోపాలకుడు అనబడుతున్నాడు. ఆ కారణంగా జ్ఞానం కలవాడెవడూ ప్రాణి హింస చెయ్యరాదు. సర్వము శివుడే అనే భావనతో ఆయనను ఆరాధిస్తే నిశ్చయంగా అష్టైశ్వర్యాలు కలుగుతాయి.

**అర్ధనారీశ్వర స్వరూప ఆవిర్భావం**

సృష్టి ప్రారంభంలో బ్రహ్మ చేసిన సృష్టి వృద్ధి చెందలేదు. ఆకారణంగా ఆయన మిక్కిలి దుఃఖాన్ని పొందాడు. అపుడు ఆకాశవాణి (అంతర్వాణి) స్త్రీపురుష సమాగమం వలన కలిగే సృష్టిని చేయవలసిందని కర్తవ్యాన్ని ఉపదేశించగా ఆయన అలాగే సంకల్పించాడు. కాని అప్పటి వరకు జరిగిన పంచముఖుడైన పరమేశ్వరుని సృష్టి నుండి స్త్రీ సమూహం ఇంకా ప్రకటితం కాలేదు. కావున పితామహుడు మైధున సృష్టిని చేయ్యలేక పోయాడు. ఈశ్వరానుగ్రహం లేనిదే ఇట్టి కార్యం నెరవేరదని ఎరిగి పరాశక్తితో కూడియున్న పరమేశ్వరుని హృదయంలో ధ్యానిస్తూ హిరణ్యగర్భుడు తీవ్రమైన తపశ్చర్యకు పూనుకొన్నాడు. ఆయన తపస్సుకు ప్రీతుడైన పరమేశ్వరుడు సగం పురుషుడు సగం స్త్రీగల అర్ధనారీశ్వర స్వరూపాన్ని ధరించి ప్రత్యక్షమై ఇలా అన్నాడు: "పుత్రా! ప్రజా వృద్ధి చేయాలనే నీ మనోరథం నాకు

తెలుసు. శివ-శక్తులమైన మేము ఇప్పటి వరకు స్థిర శక్తులుగా, సృష్టి పూర్వ శక్తులుగా అద్వైత స్థితిలో ఉండి పోయాం. నీ ప్రయోగానికి యోగ్యమైన మరొక శక్తిని స్థిరుడనైన నేను నా నుండి వేఋ చేసి నీకిస్తున్నాను"... అని పల్కి తన శరీరాన్ని రెండుగా విభాగించాడు. ఆ రెండవ భాగం స్త్రీ శక్తియైన ఉమా కృతిని పొందింది. ఆ పరమ శక్తిని వీక్షించి ప్రణమిల్లి వినయంగా ఇలా ప్రార్థించాడు విధాత.

"ఓ! ఉమాదేవీ ! సృష్ట్యాదియందు నీ భర్త నన్ను సృష్టించి; సృష్టి కార్యాన్ని నెరవేర్చ వలసిందిగా ఆజ్ఞాపించాడు. నేనింత వరకు సనకసనందనాది మహర్షులను, దేవతలను ఇంకా ఇతరమైన సృష్టిని నా మనస్సు చేతనే సృజించాను. అది వృద్ధి పొందటం లేదు. ఇప్పుడు స్త్రీ-పురుష యోగోద్భవ మైన సృష్టిని చేయ సంకల్పించాను. కాని ఇంత వరకు అవ్యయమైన స్త్రీ జాతి ఉద్భవించ లేదు. దానిని సృష్టించే సామర్థ్యం నాకు లేదు. శక్తి స్వరూపిణి వగు నీవు అట్టి సామర్థ్యాన్ని నాకివ్వు! స్థావర జంగమాత్మకమైన ఈ సృష్టి యొక్క అభివృద్ధి కొరకు తల్లీ నీవు నా పుత్రుడైన దక్షునికి కుమార్తెగా జన్మించు.".

పరమేష్ఠి పల్కులకు "అట్లే అగు గాక!" అని వరమిచ్చి ఆ ఉమాదేవి తన భ్రూమధ్యం నుండి దివ్య కాంతులు గల ఒక శక్తిని సృష్టించింది. ఆ శక్తిని చూచి పరమేశ్వరుడు జగన్మాతతో "ఓ దేవీ! ఈ విధాత కోర్కెను ప్రీతితో నెరవేర్చు!" అని పల్కగా ఆమె దక్షుని కుమార్తెగా జన్మించింది. జగన్మాత బ్రహ్మకు సాటిలేని శక్తినిచ్చి తిరిగి శంకరునిలో ఐక్యమైంది. అప్పటి నుండి లోకంలో స్త్రీ విభాగం కల్పించబడి; స్త్రీ పుంస యోగోద్భవమైన ప్రజా సృష్టి వర్ధిల్లింది.

ఇది శంకరుని అర్ధనారీశ్వ రావిర్భావ గాథ. ఇది పుణ్యప్రదం".

**శివావతారములు**

సూతుడు శౌనకాది ఋషులతో ఇలా చెపుతున్నాడు : "ఋషులారా! ఆద్యంతాలు లేని ఈ సృష్టి అనంతం. ఇందులో బ్రహ్మాండములున్నాయి. కాలం కూడా ఆద్యంతాలు లేనిదే. అదీ అనంతం. రెప్పపాటులో మొదలై రోజులు, సంవత్సరాలు, యుగాలు, మహాయుగాలు, మన్వంతరాలు, కల్పములు... ఇలా బ్రహ్మగారి ఆయుర్ధాయం వరకు కాల గణన ఉంటుంది. ఈ అనంతమైన కాలంలో శివ ప్రభువు అనేక యోగేశ్వరావతారములలో ఆవిర్భవించాడు. ప్రతి ద్వాపరంలోను వ్యాసుడు ఆవిర్భవించి వేద విభాగాన్ని చేస్తాడు. ప్రతి కలియుగారంభంలోను శంకరుడు యోగేశ్వరుడై ఆవిర్భవించి యోగ మార్గాన్ని ప్రవర్తింప చేస్తాడు. ప్రతి అవతారానికి

నలుగురు శిష్యులుంటారు. ఆ శిష్యులందరు శరీర మంతా విభూతిని పూసుకొని, రుద్రాక్ష మాలలను ఆభరణాలుగా ధరించి, నుదుట త్రిపుండ్రములు కలవారై సాక్షాత్తు పరమేశ్వర స్వరూపులై దివ్యమైన శివ యోగమార్గాన్ని ప్రచారం చేస్తారు. వారందరు ధర్మనిష్ఠులు, వేదవేదాంగ పారంగతులు, హృదయ గుహ యందు లింగార్చన చేయుటలో స్థిర చిత్తం కలవారు. శాశ్వత పరబ్రహ్మ స్వరూపులైన పశుపతి శిష్యుల సంఖ్య ఎప్పుడూ నూట పన్నెండు.

**నందీశ్వరావతారము**

పూర్వం శాలంకాయనుని కుమారుడైన శిలాద మహర్షి పుత్రార్థియై ఇంద్రుని ఉద్దేశించి కఠోరమైన తపస్సును చేయగా పాకశాసనుడు ప్రత్యక్షమై వరాన్ని కోరుకొమ్మన్నాడు. అయోనిజుడు, అమరుడు, సువ్రతుడు అగు పుత్రుని కోరుకొన్నాడు శిలాదుడు. దానికిలా సమాధాన మిచ్చాడు శతక్రతుడు : "ఓ మహర్షీ! స్త్రీ గర్భం నుండి జన్మించు వాడు, మర్త్యుడు అగు పుత్రుని మాత్రమే నేను నీకీయగలను. మృత్యువు లేని వారు లేరు సుమా! బ్రహ్మ, విష్ణువులకు సైతం మరణం ఉంది. కాకపోతే వారి ఆయుర్దాయ గణనం వేరు. వారు కూడ రుద్రుని దేహం నుండి పుట్టినవారే! నీ కోరిక దుర్లభమే అయినా ప్రసన్నుడైనచో రుద్రుడీయ గలడు. కనుక రుద్రుని ఆరాధించు." ఇలా చెప్పి తన లోకానికి చేరుకొన్నాడు ఇంద్రుడు.

రుద్రుని ఉద్దేశించి తీవ్రమైన తపస్సు చేశాడు శిలాదుడు. పదివేల సంవత్సరాలు గడిచాయి. ఆయన శరీరంపై పుట్టలు పోశాయి. రక్త మాంసాదులు హరించుకు పోయి అస్థిపంజరం మిగిలింది. అపుడు రుద్రుడు ప్రత్యక్షమై అభీష్టాన్ని తెలుప వలసిందని పల్కినా సమాధి స్థితిలో ఉన్న శిలాదుడు బదులు పల్కలేదు. శివుడు తన అమృత హస్తంతో స్పృశించగా తిరిగి రక్త మాసాందులు ఏర్పడి సమాధిని వీడి కళ్ళు తెరిచాడు మహర్షి. ఎదురుగా ఉన్న పార్వతీ పరమేశ్వరులను దర్శించి వెంటనే పాదాలపై పడ్డాడు. పడి అనేక విధాల స్తుతించి అమరుడు, అయోనిజుడు 'అన్నిటా నీతో సమనమైన వాడు' అగు పుత్రుని అనుగ్రహించ వలసిందని కోరగా శంకరుడిలా అన్నాడు : "ఓ బ్రాహ్మణా! నీవు తపోధనుడవు! పూర్వం బ్రహ్మాదులు తపస్సుచే నన్ను ఆరాధించి అవతరించ వలసిందిగా కోరారు. దాని కిప్పుడు సమయం ఆసన్నమైంది. ఓ మహర్షీ! నేను నంది అను పేరుతో నీకు అయోనిజుడగు పుత్రునిగా ఆవిర్భవిస్తాను. జగత్తుకు తండ్రి అగు నాకు నీవు తండ్రివి కాగలవు! వెంటనే వేదోక్తంగా సోమయాగాన్ని చేసి సోమయాజివి కమ్ము." ఇలా ఆదేశించి అంతర్హితుడయ్యాడు రుద్రుడు.

ఆపై శిలాదుడు తన ఆశ్రమాని కేతెంచి రుద్రసాక్షాత్కారాన్ని రుద్ర ప్రసంగాన్ని ఋషులతో ముచ్చటించి జ్యోతిశ్శాస్త్రాను సారంగా ఒక శుభ ముహూర్తాన యాగ దీక్షితు డయ్యాడు. దీక్షలో ఉండగానే.... మూడు నేత్రాలు, నాలుగు భుజాలు, జటలు, కిరీటం, త్రిశూలం... ఇవన్నీ కలిగి అపూర్వ తేజస్సుతో ముమ్మూర్తులా రుద్రుని పోలిన బాలుడు శిలాదుని నుండి ఆవిర్భవించాడు. ఆ సమయంలో గంధర్వులు పాడారు. అచ్చరులు ఆడారు. దేవతలు కుసుమ వృష్టిని కురిపించారు. విధి, మాధవ, పురందరాది బృందారక బృందం జయజయ ధ్వానాలను చేసి బాలుని సాదరంగా ఆలింగనం చేసుకొని స్తుతించారు. శిలాదుడు తేజోరూపుడైన బాలుని చూచి రుద్రుడిచ్చిన వరాన్ని గుర్తుకు తెచ్చుకొని సాక్షాత్తు రుద్రునిగా భావించి అనేక విధాల స్తుతించాడు.

శిలాదుని సోమయాగం పరిపూర్తి అయింది. బాలుని ఎత్తుకొని పెన్నిధి లభించిన పేదవలే పొంగి పోతూ ఇంటికి చేరు కొన్నాడు. ఆశ్రమానికి చేరుకోగానే దివ్యరూపాన్ని విడిచి మనుష్యరూపాన్ని పొందాడు బాలుడు. శిలాదుడు దుఃఖించాడు, కాని రుద్రుడిచ్చిన వరం వృథా కాదుగదా అని ఊరట పొందాడు. పుట్టగానే ఆనందాన్ని ఇచ్చిన కుమారునికి 'నంది' అని నామకరణం చేశాడు. ఐదవ ఏడు రాగానే బాలునికి సాంగో పాంగంగా సర్వవేదాలను నేర్పించాడు. ఏడవ సంవత్సరం వయస్సు వచ్చేసరికి బాలుడు అధ్యయనం చేయవలసిన విద్యలుకాని, అభ్యాసం చేయవలసిన కళలు కాని లేకుండ... నిర్విశేషంగా సమస్త విజ్ఞానాన్ని గ్రహించి సర్వజ్ఞ శిరోమణి అయ్యాడు. అలాటి లోకోత్తర కుమారుడు లభించి నందుకు శిలాదుడు పుత్రోత్సాహంతో పొంగి పోతున్న వేళ... ఒక రోజున.....

శంకరుని ఆజ్ఞచే మిత్రా–వరుణుడు అను పేర్లు గల ఇద్దరు ఋషులు శిలాదుని ఆశ్రమానికి వచ్చి అతిథి సత్కారాలను పొంది నందిని పరికించి ఇలా అన్నారు. "ఓ! మహర్షీ! నీ కుమారుడు సర్వజ్ఞుడే అయినా అల్పాయుష్కుడు. నేటి నుండి ఒక సంవత్సర కాలం తర్వాత జీవించడు." ఇలా చెప్పి వారు వచ్చిన దారినే వెళ్ళి పోయారు. వారి మాటలు చెవిని పడగానే పిడుగు నెత్తిన పడినట్లుగా మహా క్షోభను పొంది మొదలు నరికిన తరువులా కూలబడ్డాడు... శిలాదుడు. బాలుని కౌగిలించుకొని పలుమార్లు రోదించాడు.

అలా రోదిస్తూన్న తండ్రిని చూచి "తండ్రీ! నీ దుఃఖ కారణమేమిటి?" అని అడిగిన నందికి మిత్రావరుణులు తనకు ఏకాంతంలో చెప్పిన విషయాన్నే చెప్పి గుండెలకు హత్తుకొని మరింత బిగ్గరగా రోదించాడు.

ఆ మాటలను విన్న బాలుడు నవ్వి "తండ్రీ! దేవతలు గాని, దానవులు గాని, కాలపురుషుడైన యముడు గాని.... నాకెవ్వరూ మృత్యువును కలిగించలేరు. నేను ఆకల్పాంతం చిరంజీవినై ఉంటాను. నీవు దుఃఖించకు!" అని ధైర్యంగా సమాధాన మిచ్చాడు. దానికి ఆయన "కుమారా! నీ ధైర్యానికి కారణ మేమిటి?" అని ప్రశ్నించగా నేను మృత్యుంజయుడైన మహాదేవుని గూర్చి తపస్సు చేసి మృత్యువును జయిస్తాను అని చెప్పి తండ్రి పాదాలకు ప్రణమిల్లి ఆయన అనుమతితో ఉత్తమమైన తపోవనానికి తపస్సుకై బయలుదేరి వెళ్ళాడు.... నంది.

**నంది సర్వగణాధ్యక్షుడగుట**

నందీశ్వరుడు తపోవనానికి వెళ్ళి పవిత్రమైన నదీ తీరంలో ఆశ్రమాన్ని నిర్మించుకొని త్ర్యంబకుడు, పంచవక్త్రుడు అగు సదాశివుని ధ్యానిస్తూ ఏకాగ్ర చిత్తంతో రుద్రమంత్రాన్ని జపిస్తూ ఉగ్రమైన తపస్సును చేశాడు. అతని తపస్సుకు ప్రసన్నుడైన పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఇలా అన్నాడు: "ఓ! శిలాదపుత్రా! నందీశ్వరా! నీ మనోగతం నాకుతెలుసు! నువ్వు నా అంశతో ఆవిర్భవించిన అయోనిజుడవు నీకు జరామరణాదులు లేవు ! నేనే మిత్రావరుణులను బ్రాహ్మణుల రూపంలో మీ ఆశ్రమానికి పంపాను. నీ వన్నింటా నాతో సముడవు. నీకు సర్వ గణాధ్యక్ష పదవిని ఇస్తున్నాను. నిత్యము సర్వకాల సర్వావస్థల యందు నా సన్నిధిలో ఉంటావు. నాకు అత్యంత ప్రియుడవు! నీతో పాటుగా నీ తండ్రి, పితృదేవతలు కూడ నా సన్నిధిలో ఉంటారు."

ఇలా పలికి దయానిధి ఐన శంకరుడు తాను జటాజూటంలో అలంకరించుకొన్న తామర పువ్వుల దండను తీసి నంది కంఠాన్ని అలంకరించాడు. వెంటనే నంది మూడు కన్నులతో, పదిచేతులతో రెండవ రుద్రునిలా ప్రకాశించాడు. నంది తపస్సు చేసిన ప్రాంతాన్ని శాశ్వత పుణ్యభూమిగా చేయనెంచి రుద్రుడు తన జటల యందున్న జలాన్ని గ్రహించి అక్కడ ప్రోక్షించగా ఆ జలం ఐదు పుణ్య నదుల రూపంలో ప్రవహించింది. జటో దక, త్రిస్రోతస్సు, వృషధ్వని, స్వర్ణోదక, జంబునది.... అను పేర్లు గల ఆనదులు మంగళకరమైనవి, సుందరమైనవి, వేగం కలవి, పవిత్రమైనవి. ఆ నదులను దర్శించి అందులో స్నానం చేసి జపం చేసిన నరుడు శివ సాయుజ్యాన్ని పొందుతాడు.

పిమ్మట పార్వతి అనుమతిని కూడ తీసుకొని నందిని వెంట పెట్టుకొని కైలాసానికేగి గణాధ్యక్షులను స్మరించగా అసంఖ్యాకంగా వారంతా వచ్చి చేరారు. వారందరిని ఉద్దేశించి ఇలా పలికాడు రుద్రుడు "ఓ గణాధ్యక్షులారా! ఈ నందీశ్వరుడు నాకు పుత్రుడు. అన్నింట

నాతో సర్వసముడు. మీ అనుమతితో ఈతని సర్వగణాధ్యక్షుని చేయాలని సంకల్పించాను. మీ అభిప్రాయాన్ని చెప్పండి". వెంటనే వారందరు జయ జయ ధ్వానాలతో తమ సమ్మతిని తెలియ చేశారు. అలా వారందరి సమ్మతిని పొంది నందీశ్వరుని పట్టాభిషేకానికి తగిన ఏర్పాట్లను చేయండి అని ఆజ్ఞాపించగా, వారందరు ఏర్పాట్లలలో తలమునకలయ్యారు.

హరి, విరించి, పురందరు లాదిగా సకల దేవతా సమూహం వారివారి వాహనాలతో, గణాలతో, స్త్రీలతో మహావైభవంతో వచ్చి చేరారు. నందీశ్వర సర్వగణాధ్యక్ష సార్వభౌమ పట్టాభిషేక మహోత్సవ శుభ తరుణంలో... ఆకాశం ధర్మ మేఘా వృతమై వేలుపు తండాలకు వెల్ల గొడుగైంది. దిక్కులు ప్రసన్నంగా ఉండి కౌముదీ స్వచ్ఛతను సంతరించు కొన్నాయి. కల్పవృక్ష ప్రసూన పరిమళ బంధుర మందానిలం... శీతల సుఖస్పర్శను సుకుమారంగా అందించింది. అగ్నులు ధూమ రహితంగా జ్వలించాయి. పుణ్య నదులన్ని ప్రకృతి అలంకరించుకొన్న మౌక్తిక హారాలవలె స్వచ్ఛమైన జలాలతో ప్రవహించాయి. పుడమి పులకించి వికసించిన సహస్రదళ పద్మంలా శాంత గంధాన్ని ప్రసరించింది.

శంకరుని నిర్దేశాన్ని అనుసరించి సాక్షాత్తు పితామహుడు బ్రహ్మత్త్వాన్ని వహించి అభిషేక కార్యక్రమాన్ని స్వయంగా నిర్వహించాడు. గీర్వాణు లందరు చేతులు జోడించి నమస్కరించి నందీశ్వరుని స్తుతించారు. అదే సమయంలో నీలకంఠుని ఇచ్ఛ ననుసరించి మరుద్దేవతల కుమార్తె అగు సుయశా దేవితో నందీశ్వరునికి పాణిగ్రహణం జరిపించారు. ఆ సమయంలో హరి మొదలుగా సకల దేవతలు తమ తమ అధీనంలో ఉన్న అనేక శ్రేష్ఠమైన వస్తువులను నందికి కానుకలుగా సమర్పించారు. ఒకరు గొప్ప ఎద్దును, మరొకరు తెల్లని ఏనుగును, వేరొకరు సింహాన్ని, ఇంకొకరు సింహం గుర్తుగల ధ్వజాన్ని, ఛత్రాన్ని, కిరీటాన్ని, సింహాసనాన్ని, హారాన్ని, రథాన్ని..... ఇలా అనేక ఉత్తమ ఉపాయనములను అందించారు. నందీశ్వర దంపతులు వచ్చిన వారందరికి నమస్కరించి అందరి ఆశీర్వచనాలను పొందేరు. పార్వతీ పరమేశ్వరులు తమకు నమస్కరించిన నూతన వధూవరులను దగ్గరకు తీసుకొని, లాలించి ప్రేమతో శిరసు నిమిరి, ఆలింగనం చేసుకొని సమస్త ఐశ్వర్యాలను ఇచ్చి అనేక విధాల అనుగ్రహించి ఏదైనా అభీష్టాన్ని కోరుకొమ్మనగా వారు "ఓ తల్లి దండ్రులారా! మీ పాద కమల సేవ తక్క మాకేమి వద్దు!" అని వినయంగా ప్రార్థించారు. దానికి ప్రీతులైన గిరిజా శంకరులు మీ దంపతులకు ఎప్పటికీ ఎడబాటు కలగకుండు గాక! నిరంతరము మీరు నా సన్నిధిలో ఉందురు గాక!" అని వరం ఇచ్చారు.

**భైరవా వతార గాథ**

సూత మహర్షి శౌనకాది ఋషులతో ఇలా అంటున్నారు. "ఓ! తపోధనులారా! మీకిప్పుడు పరమేశ్వరుని పూర్ణావతారమైన భైరవావతార గాథను చెపుతున్నాను శ్రద్ధతో వినండి. ఈ జగత్తంతా శివపార్వతుల లీలా విలాసమే! సహస్రకోటి జన్మార్జిత పూర్వపుణ్యం వలన తక్క జ్ఞాన వైరాగ్య సంపన్నుడైన శంకరుని యందు భక్తి పుట్టదు. భక్తి లేని వారికి ఆయన అనుగ్రహం లభించదు. హరి బ్రహ్మాదులు సైతం ఆయన మహిమను తెలుసుకోలేరు. లోకంలో ఇన్ని భోగాలు ప్రలోభ పెడుతూంటే వాటిని కాలదన్ని మనసును వైరాగ్యం వైపుకు మళ్ళించు కొన వలెనంటె మాటలా! అది జ్ఞానం వల్లనే సాధ్యం. జ్ఞానం ఎప్పుడూ అవిద్య, అహంకారములనే మావిచే కప్పబడి ఉంటుంది. అహంకారం అణగనిదే 'నేను' యొక్క అసలు తత్త్వం గోచరించదు. హరి బ్రహ్మాదులు సైతం అహంకారానికి లోబడినవారే! ఈ విషయంలో ఒక పూర్వ గాథను చెపుతున్నాను వినండి.

పూర్వం ఒకప్పుడు దేవతలు, ఋషులు కలిసి పరబ్రహ్మ తత్త్వాన్ని తెలియగోరి బ్రహ్మగారి వద్దకు వెళ్ళి "ప్రళయకాలంలో కూడా నశించని అవ్యయ తత్త్వమేది?" అని ప్రశ్నించారు. దానికి ఆయన అహంకారంతో ఇలా ప్రత్యుత్తర మిచ్చాడు : "ఓ జిజ్ఞాసువులారా! సృష్టి, స్థితి, లయ, కర్తను నేనే! నేను స్వయంభువును! నాకంటె అవ్యయ తత్త్వం లేదు!"

బ్రహ్మగారి అహంకారానికి నవ్వి విష్ణువు అంతకు మించిన అహంకారంతో ఇలా అన్నాడు: "ఓ వత్సా! యోగీశ్వరుడవైన నీకు ఇట్టి మూర్ఖత్వం తగదు. నా నాభి కమలం నుండి ఆవిర్భవించిన నా కుమారుడవు నీవు! నారాయణుడను నేనే! పురుషోత్తముడను నేనే! యజ్ఞ పురుషుణ్ణి నేనే! మాయ ఎప్పుడూ నా అధీనంలో ఉంటుంది. జీవు లందరకు సర్వోత్తమ గతియగు పరమ పురుషుణ్ణి నేనే!

శివ మాయా విమోహితులు, అహంకార పూరితులు, జీవ భావ విలసితులు అగు హరి బ్రహ్మలు ఇలా వాదులాడుకొని సర్వత్ర ప్రమాణమైన వేదాలను ఆశ్రయించి నాశనం లేని ఏకైక తత్త్వం ఏది? అని ప్రశ్నించారు.

దానికి ఋగ్వేదం ఇలా బదులు చెప్పింది :

**శ్లో॥ యదంతస్థాని భూతాని యతస్సర్వం ప్రవర్తతే ।**
**యదాహుః పరమం తత్త్వం స రుద్రస్త్వేక ఏవహి ॥**

**తా ॥** సర్వప్రాణులు ఎవని యందు ఉన్నవో, ఎవని నుండి సర్వ జగత్తు ఉద్భవించు చున్నదో ఆరుద్రుడు ఒక్కడే పరమ తత్త్వం.

యజుర్వేదం ఇలా సమాధానం చెప్పింది :

**శ్లో ॥ యో యజ్ఞైరఖిలైరీశః యోగేన చ సమిజ్యతే ।**
**యేన ప్రమాణం ఖలు నస్స ఏకస్సర్వదృక్ శివః ॥**

**తా॥** ఏ ఈశ్వరుడు సర్వ యజ్ఞములచే మరియు యోగముచే ఆరాధింప బడుచున్నాడో, ఎవనిచే మాకు ప్రామాణ్యము లభించు చున్నదో అట్టి సర్వ సాక్షియగు అద్వయ తత్త్వము శివుడే.

సామవేదం ఇలా సమాధాన మిచ్చింది.

**శ్లో ॥ యేనేదం భ్రామ్యతే విశ్వం యోగిభిర్యో విచింత్యతే ।**
**యద్భాసా భాసతే విశ్వం స ఏకస్త్ర్యంబకః పరః ॥**

**తా ॥** ఎవరిచే ఈ జగచ్చక్రము త్రిప్పబడుచున్నదో, ఎవరిని యోగులు ధ్యానించెదరో, ఎవని ప్రకాశముచే జగత్తు ప్రకాశించు చున్నదో అట్టి అద్వయ పరమాత్మ ముక్కంటియే.

అధర్వణ వేదం ఇలా నిశ్చయించి చెప్పింది:

**శ్లో ॥ యం ప్రపశ్యంతి దేవేశం భక్త్యాను గ్రహిణో జనాః ।**
**తమాహురేకం కైవల్యం శంకరం దుఃఖతః పరమ్ ॥**

**తా ॥** ఏ దేవదేవుని కృపచే భక్తులగు జనులు ఆయనను చక్కగా దర్శించు చున్నారో, ఎవడు దుఃఖమునకు అతీతుడో అట్టి అద్వయ నిర్గుణ తత్త్వము శంకరుడే.

అలా ఆప్త వాక్యాన్ని పల్కిన వేదమూర్తులను చూచి మాయా విమోహితులై వివేకాన్ని కోల్పోయిన హరి బ్రహ్మలు కృద్ధులై ఇలా అన్నారు. “ఓ వేద మూర్తులారా! సత్యజ్ఞాన స్వరూపులైన మీరు వివేకాన్ని కోల్పోయి మాట్లాడుతున్నారు! దిగంబరుడు, వికృత వేషధారి, నాగాభరణుడు,వృషభ వాహనుడు, భస్మధారి, స్త్రీకి లొంగిపోయి సగం దేహాన్నిచ్చి ఎప్పుడు వెంట పెట్టుకుని తిరిగేవాడు ఐన రుద్రుడెక్కడ? సంగరహితుడైన పరబ్రహ్మ తత్త్వ మెక్కడ?”

అల్ప బుద్ధులైన హరిబ్రహ్మలు అహంకారంతో పలికిన పలుకులకు విచారించి సర్వ వ్యాపకమైన “ఓం” కారం సశరీరంగా సాక్షాత్కరించి తత్త్వాన్ని ఇలా తెలియ చెప్పింది:

“ఓ! విధి మాధవు లారా! స్వయం జ్యోతిస్స్వరూపుడైన రుద్రుని తపశక్తియే పార్వతి. చిదానంద ఘనుడైన రుద్రుని ఆనంద స్వరూపమే పార్వతి. సత్య పురుషుడైన రుద్రుని యొక్క జగత్సిద్ధి హేతువైన మాయా శక్తియే పార్వతి. వెలుగు సూర్యుని, వెన్నెల చంద్రుని, ఉష్ణగుణం అగ్నిని ఎలా విడిచి ఉండవో...అలాగే ఆయన తపశ్శక్తి రుద్రుని విడిచి ఉండదు. రుద్రుని ప్రమోద కలా రూపమైన ఆ తపశ్శక్తికే దాక్షాయణి, సతి, హైమవతి, శివా, భవాని, అపర్ణ, ఉమ, కామేశ్వరి, శివకామిని, గిరిజ, పార్వతి.... ఇత్యాది అసంఖ్యాక నామాలున్నాయి. ప్రళయ కాలమందు సృష్టి; మాయలో లీన మవుతుంది. మాయ పరబ్రహ్మ స్వరూపుడైన రుద్రునిలో లీనమవుతుంది. కాముని పుట్టించిన ఈ విష్ణువు, కామానికి వశుడైన ఈ బ్రహ్మ..... మీరిద్దరు సచ్చిదానంద పరబ్రహ్మ శబ్దవాచ్యులెట్లు కాగలరు? కాముని దహించిన రుద్రుడొక్కడే అవ్యయ తత్త్వస్వరూపుడు.

ప్రణవం ఇలా తత్త్వో పదేశాన్ని చేసినా హరి బ్రహ్మల అజ్ఞానం నశించలేదు. అప్పుడు వారి మధ్య భూమ్యాకాశముల అంతరాళమంతా నిండిన గొప్ప జ్యోతి అవిర్భవించింది. దాని మధ్య త్రిశూలపాణి, ఫాలాక్షుడు, భుజగ భూషణుడు అగు పురుషుడు గోచరించాడు. ఆ పురుషుని చూచి బ్రహ్మ “ఓ రుద్రా! పూర్వం నా లలాటం నుండి ఆవిర్భవించావు! నేనే నీకు రుద్రుడనే నామధేయాన్ని ఉంచాను. చెప్పు! నీకు ఏ వరం కావాలో కోరుకో!” – అని గర్వంతో పలికాడు. ఆ మాటకు రుద్రుడు అత్యుగ్రుడు కాగా ఆ రౌద్రం నుండి తేజో వంతుడు, భయంకరుడు అగు ఒక పురుషుడు... ముమ్మూర్తులా రుద్రుని పోలినవాడు ఆవిర్భవించాడు. అతనికి కాల భైరవుడని పేరు పెట్టాడు రుద్రుడు. రుద్రుని ఆజ్ఞను అనుసరించి.... అహంకారాన్ని ప్రదర్శించిన పితామహుని ఐదవ తలను ఎడమ చేతి కొన గోరుతో గిల్లి వేశాడు....కాలభైరవుడు.

ఆ దృశ్యాన్ని గాంచిన వివేకి ఐన విష్ణువు భక్తి పూర్వకంగా శతరుద్రీయ మంత్రాలతో రుద్రుని స్తుతించాడు. బ్రహ్మగారు కూడా తత్త్వ జ్ఞానాన్ని పొంది వేద మంత్రాలచే రుద్రుని నుతించాడు. ఈ విధంగా వారిద్దరికి అహంకారం నిర్మూలం కాగా జ్ఞానోదయ మైంది. శంకరుడు కూడా వారిద్దరికి అభయ మిచ్చి ; కాలభైరవునితో ఇలా అన్నాడు. “ఓ భైరవా! సర్వ నగరాలలోను ముక్తి ప్రదమైన కాశీ నగరం మీద నీకు ఆధిపత్యాన్ని ఇస్తున్నాను. భక్తుల పాపాలను భక్షిస్తావు కనుక ‘పాపభక్షణుడు’ అని, దుష్టులను శిక్షిస్తావు కనుక ‘ఆమర్దకుడు’ అని నీకు పేర్లుంచు తున్నాను. ఈ విష్ణువును ఆదరించు. బ్రహ్మను మన్నించు.

ఓ నీల లోహితా! ఈ బ్రహ్మ యొక్క కపాలాన్ని చేత ధరించి కపాల వ్రతాన్ని పూని నిత్యము భిక్షాటనం చేసుకొంటూ జీవించు. కాశీ నగరాన్ని ప్రవేశించగానే నీకు బ్రహ్మ హత్యా పాతకం తొలగి పోతుంది." ఇలా ఆజ్ఞాపించి తక్షణం బ్రహ్మహత్య అను పేరుగల కన్యను సృష్టించి.... ఆమెతో ఇలా అన్నాడు. "ఓ బ్రహ్మ హత్యా! ఉగ్రుడైన ఈ కాలభైరవుని దివ్యమైన వారణాసీ నగరాన్ని చేరేటంత వరకు అనుసరించి వెళ్లు ! ఆ నగరంలోనికి నీకు ప్రవేశార్హత లేదు. అది తక్క మిగతా భూతల మంతా సంచరించు". ఇలా పలికి అంతర్ధాన మయ్యాడు రుద్రుడు.

**భైరవుని భిక్షావ్రతం, కాశీనగర ప్రవేశం, బ్రహ్మహత్యా నివారణ**

శివుని ఆజ్ఞను అనుసరించి కాల భైరవుడు బ్రహ్మహత్యా నివారణార్థం కాపాలిక వ్రతాన్ని పూని ముల్లోకాలలోని పుణ్యక్షేత్రాలను, తీర్థరాజములను సేవిస్తూ నారాయణుని నివాసానికి వెళ్ళాడు. భైరవాగమన వార్తను విన్న విష్ణువు లక్ష్మితో కూడి ఎదురేగి ఆయనను పూజించి వినయంతో "హే! భగవన్! అక్షయ స్వరూపుడవైన నీవు ఈ భిక్షావృత్తిని ఎందుకు స్వీకరించావు ?" అని ప్రశ్నించగా బ్రహ్మ శిరస్సును ఖండించిన వైనాన్ని గుర్తు చేశాడు... భైరవుడు. దానికి విష్ణువు విస్మయాన్ని పొంది... "హే! పరంధామా! లోక క్షేమాన్ని కోరి నీవాచరించిన కృత్యంలో నీకు పరాధీనత ఎక్కడుంది? ఓ! పాపరహితా! నీ నామోచ్చారణ మాత్రం చేతనే పాపాలు పటాపంచలవుతుంటే నీకు పాప మెక్కడిది? భిక్షావృత్తి కడు దీన వృత్తి గదా! అట్టి దైన్యానికి అధీనుడ వగుట దేవరకు లీల! బ్రహ్మహత్యాది సమస్త పాతకాలు భిక్షావృత్తితో పటాపంచలవుతాయి. అని లోకులకు బోధించటమే నీ చర్యలోని అంతరార్థం. లక్ష్మీనారాయణులమైన మమ్ములను అనుగ్రహించటం కొరకే ఇలా వచ్చావు కాని ముల్లోకాధి పత్యం గల నీకు వాంఛితార్థం ఏముంటుంది?" – అని స్తుతిస్తూ ఉప్పొంగి పోయి కన్నీరు కార్చేడు. అంతలో క్షీర సాగర రాజ తనయ 'మనోరథవతి' అనే స్వచ్ఛమైన మణిని భైరవుని భిక్షపాత్రలో వేసింది. దానిని గ్రహించి మరొక స్థానానికి కదిలాడు.

భైరవుని వెంటాడుతున్న బ్రహ్మహత్యను పిలిచి ముక్కంటిని విడిచి పెట్ట వలసిందిగా ప్రార్థించాడు హరి. ఈ నెపంతో వృషభధ్వజుని చక్కగా సేవించుకొని పునరావృత్తి రహితమైన మోక్షాన్ని పొందుతాను అని సమాధానం చెప్పి వెంట నడిచింది. అలా భైరవుడు కపాల వ్రతాన్ని ఆచరిస్తూ కాశీ క్షేత్రంలో కాలు పెట్టగానే బ్రహ్మహత్య హాహాకారం చేస్తూ భూమిని

చీల్చి పాతాళంలో ప్రవేశించింది. వెంటనే భైరవుని చేతిలోని బ్రహ్మ యొక్క కపాలంక్రింద పడింది. ఆ స్థానమే 'కపాల మోచనము' అనే తీర్థం అయింది. బ్రహ్మహత్య తొలిగినందుకు భైరవుడు పరమానందంతో తాండవం ఆడాడు. పరమేశ్వరుడు మార్గశీర్షమాస కృష్ణ పక్ష అష్టమి నాడు భైరవ రూపంలో ఆవిర్భవించాడు. ఆ తిథినాడు కాశీలో కపాలమోచన తీర్థంలో గాని లేక మరే ఇతర స్థలములయందు గాని భైరవుని పూజించి, పితృదేవతలకు తర్పణాదులిచ్చి, జాగరణం చేసి భైరవ వ్రతాన్ని ఆచరిస్తే ఆ వ్యక్తి సకల పాపాల నుండి విముక్తు డవుతాడు.

**వీరభద్రుని శరభావతారం**

మునులారా! శివుడు అనేక సందర్భాలలో అనేక అవతారాలను ధరించాడని చెప్పాను గదా! ఈ సృష్టి చాలా విచిత్ర మైనది. భూచర, వనచర, జల చరాలలో వింత వింత ప్రాణులు అసంఖ్యాకంగా ఉండి తమ మనుగడను సాగిస్తున్నాయి. పంచ భూతాల లోను వేటి కవే విడివిడిగా ప్రాణులున్నాయి. భగవంతుడు సర్వవ్యాపి కదా! అలాటప్పుడు ఆయన లేని స్థలం ఎక్కడుంటుంది? ప్రాణులన్ని ఆయన స్వరూపాలే! అందుకే ఆయనకు బహురూపుడని పేరు. ఆయన ధరించిన ఆవతారాలలో శరభావతారం ఒకటి. సింహాన్ని సైతం అవలీలగా చీల్చ గలదు. ఆ గాథ వినండి.

శ్రీహరి నృసింహావతారాన్ని ధరించి హిరణ్య కశిపుని సంహరించిన తర్వాత కూడా నృసింహునికి ఆగ్రహం చల్లార లేదు. గీర్వాణులు భయకంపితులై ప్రహ్లాదుని ఆయన సన్నిధికి పంపగా ఆబాలుడు చేతులు జోడించి స్తుతిస్తూ నిర్భయంగా ఆయన అంకపీఠాన్ని అధిరోహించాడు. హరి పరమానంద భరితుడై ఆ బాలుని దగ్గరకు తీసుకొని లాలించి ఆలింగన పురస్సరంగా ఆశీర్వదించాడు... కాని కోపం చల్లార లేదు. ఆయన క్రోధం రోమ కూపాల నుండి నాలుకలు సాచి అగ్ని జ్వాలలై బహిర్గత మవుతోంది. ప్రళయ వేళ సప్త సముద్రాలను ఇంకింప చేసే కాలాగ్నిలా మండి పడుతున్నాడు. శాంతింప చేసే ఉపాయాన్ని కానక గరళకంఠుని శరణు వేడి విషయాన్ని చెప్పి ఇలా ప్రార్థించారు దేవతలు: "హే! కాలకంధరా! మాకెప్పుడు ఆపద సంభవించినా నీవే దిక్కు! ఆనాడు సముద్ర మథన వేళాసముద్భూత హాలాహలాన్ని కంధరంలో బంధించి పదునాలుగు లోకాలను రక్షించావు! ఈనాడు నృసింహుని క్రోధజ్వాలాలలచే పీడితులమై ఉన్నాము. దానిని చల్లార్చటానికి నీవే సమర్థుడవు."

దేవతలకు అభయాన్నిచ్చి పంపించి మనసులో వీరభద్రుని స్మరించాడు నీలకంఠుడు, వెంటనే అతను భయంకర నృసింహరూపాలను ధరించిన అసంఖ్యాక గణాలతో వచ్చి 'కర్తవ్యాన్ని ఆజ్ఞాపించండి' – అంటూ చేతులు కట్టుకొని నిల్చున్నాడు. తన ఇంగితాన్ని గుర్తెరిగి; నృసింహావతారాన్ని మించి ప్రళయాగ్ని సదృశులై మండి పడుతున్న అసంఖ్యాక గణాలతో వచ్చిన వీరభద్రుని చూచి చిరు నవ్వు నవ్వి ఇలా ఆజ్ఞాపించాడు రుద్రుడు : "ఓ వీరభద్రా! కాలంకాని కాలంలో లోకాలకు విలయం సంప్రాప్తించింది. దురాసదమైన క్రోధాగ్నిచే జ్వలిస్తున్నాడు నృసింహుడు. శమింప చేయటానికి చేసిన ప్రయత్నాలు ఫలించ లేదు. తక్షణం వెళ్ళి అతనిని శాంతింప చేయి. ముందు సాంత్వన వచనాలతో నచ్చచెప్పు. శమించక పోతే నా యొక్క భయంకర రూపాన్ని ప్రదర్శించు. అతని తేజస్సును అపహరించి నిర్వీర్యునిగా చెయ్యి! సూక్ష్మతేజాన్ని నీ సూక్ష్మ తేజం చేత, స్థూల తేజాన్ని స్థూల తేజం చేత ఉపశమింప చెయ్యి. నా ఆజ్ఞచే అతని తలను, చర్మాన్ని తీసుకొనిరా."

గ్రక్కున వీరభద్రుడు తన గణాలతో నృసింహుని చెంతకేగి పుత్రునివలె లాలించి క్రోధాన్ని ఉపసంహరించు కొమ్మని కోరినా; గర్వితుడైన నృసింహుడు మరింతగా క్రోధావేశుడయ్యాడు. మృగ రూపాన్ని పొందిన హరి మృగభావాన్ని కూడా పొంది శివ మాయచే స్వస్వరూపాన్ని మరచి "మృత్యువుకు మృత్యువైన నేను ఈ నాయొక్క సర్వాధిక తేజో రూపంతో సృష్టినంతటిని క్షణంలో భస్మం చేస్తాను. లోక సంహారం కొరకు ప్రవర్తిల్లు వాడనునేనే!" – అంటూ వీరభద్రుని మీదకు దూక బోయాడు.

తక్షణం పూర్వ రూపాన్ని ఉపసంహరించుకొని మహాఘోరము, ప్రత్యక్ష భయ కారణము, దుర్ధర్షము, శైవతేజ సముద్భవము, మృగపక్షి సమాహారము అగు శరభావతారాన్ని ధరించాడు వీరభద్రుడు. తలభాగం పక్షిరూపంలోను మిగిలిన భాగం నాలుగు కాళ్ళుగల మృగ రూపం లోను ఉంది... ఆ రూపం. పక్షులకు రాజు ఖగరాజైన గరుడుడు. మృగాలకు రాజు మృగ రాజైన సింహం. ఆ రెంటి సమాహార రూపమే శరభావతారం. అతి తీక్ష్ణమైన కోరలు, చూపులతోనే దేన్నైనా సరే కాల్చివేయగల మూడు నేత్రాలు, వజ్రసదృశమైన గోళ్ళు, కంఠమందు నల్లని మచ్చ, శిరసున చంద్రవంక, అశని పాతం వంటి కంఠధ్వని... ఇట్టి మహోగ్రమైన రూపంలో సాక్షాత్కరించి వెనుక రెండు కాళ్ళపై నిలిచి నృసింహుని చేతులతో బంధించి ముక్కుతో పొడి చాడు వీరభద్రుడు. వెంటనే శ్రీ హరికి పూర్వ స్మృతి కలిగి నృసింహ రూపాన్ని విడిచి స్వస్వరూపంతో నిలిచి రుద్రుడైన వీరభద్రుని అనేక విధాల

స్తుతించాడు. వీరభద్రుడు నృసింహదేహాన్ని పట్టి తలను వేరు చేసి, చర్మాన్ని ఒలిచి దానిని తీసికొని కైలాసానికి వెళ్లి శంకర దేవునికి సమర్పించి అనేక నమస్కారాలను చేశాడు. నాటి నుండి నృసింహ చర్మాన్ని ధరిస్తూ వస్తున్నాడు శంభుడు.

నృసింహ దేవుని క్రోధాగ్నికి లోకాలు భస్మం కాకుండ రక్షించిన శంభుని శరభావతార గాథ పరమ పవిత్రమైనది.”

## గృహపత్యవతార గాథ

సూత మహర్షి మునులతో ఇలా చెపుతున్నాడు : “ఓ మునులారా! తొల్లి శంకరుడు విశ్వానరుడనే శివభక్తునకు గృహపతి అనే పేరుతో కుమారునిగా జన్మించిన పవిత్ర గాథను చెపుతున్నాను వినండి.

పూర్వం సుందర నర్మదా నదీ తీరంలో నర్మపురంలో శాండిల్య గోత్రీకుడు, శుచి మంతుడు, బ్రహ్మతేజ స్సంపన్నుడు విశేషించి త్రిపురాంతక భక్తుడు అగు విశ్వానరుడు అనే ముని ఉండేవాడు. అతను బ్రహ్మచర్యాశ్రమంలో ఉండి ఆశ్రమ ధర్మాలను చక్కగా పాటిస్తూ వేదశాస్త్రాధ్యయనం చేసి యుక్త వయసు రాగానే గుణవతి, రూపవతి ఐన ఒక శ్రోత్రియుల ఇంటి కన్యను వివాహం చేసి కొన్నాడు. ఆమె పేరు శుచిష్మతి. ఆ విశ్వానరుడు సహధర్మ చారిణితో కూడి నిత్యాగ్ని హోత్రియై, అగ్ని శుశ్రూషణా తత్పరుడై, పంచ యజ్ఞ పరాయణుడై, షట్కర్మ నిరతుడై, దేవ, పితృ, అతిధి సేవా లగ్న మానసుడై, శివపూజా ధురంధరుడై, వైదికాచార సంపన్నుడై గృహస్థ జీవితాన్ని లెస్సగా నడుపుకొంటున్న వేళ....

ఒక రోజున అతని భార్య ఐన శుచిష్మతి భర్తను సమీపించి ఇలా తన ఆంతర్యాన్ని వెల్లడించింది: “నాథా! శంకరుడు మనకు ఏ కొరత లేకుండ అన్నిటిని అనుగ్రహించాడు. పుత్రులు లేని వారికి గతులు లేవంటారు! శంకరుని వంటి పుత్రుని అనుగ్రహించమని శంకరునే కోరండి.” భార్య కోరిక దుర్లభమే ఐనా దానిని శంకరాదేశంగా భావించి పరమ పవిత్రమైన వారాణసీ నగరాన్ని చేరుకొన్నాడు విశ్వానరుడు. చేరుకొని విశ్వేశ్వరుడు మొదలుగా సమస్తమైన లింగాలను పూజించి, మణికర్ణికాది ఘట్టాలలో అవగాహనం చేసి, సమస్త కుండముల యందలి జలాలను గ్రోలి, గణనాధునకు ప్రణమిల్లి, గౌరీదేవికి వందన మాచరించి భైరవుని పూజించి, గణాధ్యక్షులను స్తుతించి, ఆదికేశవుని సన్నుతించి, లోలార్కాది సూర్యులకు నమస్కరించి యథా శాస్త్రీయంగా కాశీనగరాన్ని సేవించాడు. సేవించి అసంఖ్యాక సిద్ధ పురుషులు ఆరాధించి సిద్ధిని పొందిన శ్రేష్ఠమైన సిద్ధలింగ ఖ్యాతి గల వీరేశలింగం చెంత ఉపవిష్టుడై తపస్సు ప్రారంభించాడు.

ఒక నెల ఏక భుక్తాన్ని, రెండవ నెల నక్తాన్ని, మూడవ నెల అయాచిత ఆహారాన్ని, నాల్గవ నెల ఉపవాసాన్ని, ఐదవ నెల పాలను, ఆరవ నెల ఫలాలను మరియు కూరలను, ఏడవ నెల గుప్పెడు నువ్వులను ఎనిమిదవ నెలన నీరును, తొమ్మిదవ నెల పంచ గవ్యాన్ని, పదవ నెల చాంద్రాయణాన్ని, పందకొండవ నెల దర్భాగ్ర జలాలను, పంద్రెండవ నెల గాలిని మాత్రమే ఆహారంగా తీసుకొని..... త్రికాలముల యందు వీరేశలింగాన్ని భక్తి శ్రద్ధలతో సేవించాడు. పదమూడవ నెలలో విశ్వానరుడు ప్రత్యూషంలో (తెల్లవారు జామున) లేచి, గంగా నదిలో స్నానం చేసి విశ్వేశ్వర దర్శనానికి వస్తూన్న వేళ...

ఆ కర్ణాంత విశాల నేత్రుడు, కెంపు వంటి పెదవులు కలవాడు, సుందరమైన నల్లని జటలు గలవాడు, దిగంబరుడు, మందస్మిత సుందర వదనారవిందుడు, శైశవోచిత ఆభరణాలంకారుడు, చితాభస్మాలంకృతుడు.... అగు ఎనిమిది సంవత్సరాల బాలుడు వేద సూక్తాలను వల్లె వేస్తూ కనుపించాడు. ఆ బాలుని చూడగానే విశ్వానరుడు మహదానంద భరితుడై, శరీరం పులకాంకితం కాగా, చేతులు జోడించి నమస్కరించి ఎనిమిది శ్లోకాలలో ఇలా స్తుతించాడు.

**అభిలాషాష్టకము**

శ్లో ॥ ఏకం బ్రహ్మైవాద్వితీయం సమస్తం సత్యం సత్యం నేహ నానాస్తి కించిత్ ।
ఏకో రుద్రో న ద్వితీయోఽవతస్థే తస్మాదేకం త్వాం ప్రపద్యే మహేశమ్ ॥
కర్తా హర్తా త్వం హి సర్వస్య శంభో నానారూపే ష్వేకరూపోఽప్య రూపః ।
యద్వత్ప్రత్యగ్ధర్మ ఏకోఽప్యనేక స్తస్మాన్నాన్యం త్వాం వినేశం ప్రపద్యే ॥
రజ్జౌ సర్పశ్శుక్తి కాయాంచ రౌప్యం నైరః పూరస్తన్మృగాఖ్యే మరీచౌ ।
యద్వత్సద్విద్విష్వగేవ ప్రపంచో యస్మిన్ జ్ఞాతే తం ప్రపద్యే మహేశమ్ ॥
తోయే శైత్యం దాహకత్వం చ వహ్నౌ తాపో భానౌ శీతభానౌ ప్రసాదః ।
పుష్పే గంధో దుగ్ధ మధ్యేఽపి సర్పిర్యత్తచ్ఛంభోత్వం తతస్త్వాం ప్రపద్యే ॥
శబ్దం గృహ్ణాస్య శ్రవాస్త్వం హి జిఘ్ర స్య ఘ్రూణస్త్వం ప్యంఘ్రిరాయాసి దూరాత్ ।
వ్యక్షః పశ్యేస్త్వం రసజ్ఞోఽప్య జిహ్వః కస్త్వాం సమ్యగ్వేత్త్య తస్త్వాం ప్రపద్యే ॥
నో వేద త్వామీశ సాక్షాద్ధి వేదో నో వా విష్ణుర్నో విధాతాఖిలస్య ।
నో యోగీంద్రా నేంద్రముఖ్యాశ్చ దేవా భక్తో వేద త్వామతస్త్వాం ప్రపద్యే ॥

**నో తే గోత్రం నో సజన్మాపి నాశో నో వా రూపం నైవ శీలం న దేశః ।**
**ఇత్థం భూతోఽపీశ్వరస్త్వం త్రిలోక్యాస్సర్వాన్ కామాన్ పూరయేస్త్వం భజే త్వామ్ ॥**
**త్వత్తస్సర్వం త్వం హి సర్వం స్మరారే త్వం గౌరీశస్త్వం చ నగ్నోఽతి శాంతః ।**
**త్వం వై వృద్ధస్త్వం యువాత్వంచ బాలస్తత్త్వం యత్కిం నాన్యతస్త్వాం నతోఽహమ్ ॥**

బ్రహ్మ సజాతీయ విజాతీయ స్వగత భేదములే లేని పూర్ణ సత్యతత్త్వము. ఈ నానాత్వము కన్పట్టునదియే గాని సత్యము గాదు. రుద్రుడు ఒక్కడే గలడు. రెండవ తత్త్వము లేదు. కావున అద్వయుడవు, మహేశుడవు అగు నిన్ను శరణు జొచ్చు చున్నాను. హే శంభో సర్వమును సృష్టించి లయము చేయువాడవు నీవే. వివిధ రూపములలో అఖండ సత్తారూపంలో నుండే నీకు రూపములేదు. ప్రత్యగాత్మ స్వరూపుడవగు నీవు అద్వయుడవైననూ అనేకముగ కన్పట్టుచున్నావు. కావున ఈశ్వరుడవగు నిన్ను తక్క ఇతరమును నేను శరణు పొందుట లేదు. త్రాడు నందు పాము, ముత్యము చిప్ప యందు వెండి, ఎండమావుల యందు నీరు ఎట్లు మిథ్యయో, అటులనే సద్ఘనుడవగు నీయందు విశ్వము మిథ్యయగును. దేనిని తెలిసినచో ప్రపంచము తత్త్వతః తెలిసినట్లు యగునో, అట్టి మహేశుని శరణు పొందుచున్నాను. నీటియందలి చల్లదనము, నిప్పుయందలి వేడి, సూర్యుని యందలి తాపము, చంద్రుని యందలి ఆహ్లాదకత్వము, పుష్పమునందలి పరిమళము, పాలలోని వెన్న నీవే. కావున, హే శంభో! నిన్ను నేను శరణు వేడు చున్నాను. నీవు శబ్దమును వినెదవు, కాని నీకు చెవులు లేవు. నీవు ఆఘ్రాణించెదవు కాని నీకు ముక్కులేదు. నీకు పాదము లేకున్ననూ దూరమునుండి వచ్చెదవు. కన్నులు లేని నీవు చూచుచున్నావు. జిహ్వ లేని నీవు రుచిని తెలియుచున్నావు. నీ స్వరూపమును పూర్ణముగా ఎవరు ఎరుంగగలరు? కావున నిన్ను శరణు వేడు చున్నాను. ఓ ఈశ్వరా! వేదము సాక్షాత్తుగా నిన్ను ఎరుంగ జాలదు, విష్ణువు గాని, సర్వమును సృజించు బ్రహ్మగాని నిన్ను యెరుంగరు. యోగిశ్రేష్ఠులు ఇంద్రాది దేవతలు నిన్ను ఎరుంగరు. కాని భక్తుడు నిన్ను తెలియ గల్గును. కావున నిన్ను శరణు పొందుచున్నాను. నీకు గోత్రము లేదు. జన్మ నాశములు లేవు. నీకు రూపము లేదు. శీలము లేదు. దేశము లేదు.... ఇట్టివాడవైననూ, నీవు ముల్లోకములకు ప్రభుడవు. నేను నిన్ను సేవించుచున్నాను. నా కోర్కెలనన్నిటినీ ఈడేర్చుము. ఓ మన్మథాంతకా! సర్వము నీనుండి ఉద్భవించినది. సర్వము నీవే. గౌరీపతివి నీవు. దిగంబరుడవు అగు నీవు పరమ శాంత స్వరూపుడవు. వృద్ధుడవు నీవే. యువకుడవు నీవే. బాలుడవు నీవే. నీచే వ్యాప్తము కాని తత్త్వము ఏది గలదు? నేను నిన్ను నమస్కరించుచున్నాను.

బ్రాహ్మణుని స్తోత్రానికి బాలుడైన శంకరుడు ప్రీతుడై ఏదైన ఉత్తమమైన వరాన్ని కోరుకొన వలసిందని పల్కగా "ప్రభూ! సర్వజ్ఞుడవైన నీకు తెలియని దేమున్నది. సర్వాంతర్యామివి, సర్వసాక్షివి అగు నిన్ను కోరవలెనా! యాచకుడు గడ్డి పరక కంటె తేలిక కదా! మోక్షాన్ని కూడా నేను యాచించను! నాకు అర్హమైన దానిని నీవే అనుగ్రహించు!" అని పలికి ఊరకున్నాడు విశ్వానరుడు. దానికి శంకరుడు మరింతగా సంతోషించి "ఓ విప్రోత్తమా! త్వరలో నేను నీ పుత్రుడనై జన్మించి గృహపతి నామధేయంతో వర్ధిల్లి దేవతలకు సైతం ప్రియుడను కాగలను. సంతానార్థులైన దంపతులు ఈ అభిలాషాష్టకాన్ని పఠిస్తే తప్పక పుత్ర సంతానవంతులవుతారు" అని వరమిచ్చి అదృశ్యుడయ్యాడు.

శంకరాను గ్రహంతో సఫలీకృత మనోరథుడై ఇంటికి వచ్చి ఇల్లాలికి జరిగిన వృత్తాంతాన్ని చెప్పి తిరిగి శివార్చనలో మునిగి పోయాడు బ్రాహ్మణుడు. శంకర వర ప్రభావంచే పూర్వజన్మ కర్మ రూపమైన అవరోధాలు తొలగగా శుచిష్మతి గర్భవతి ఐంది. పూర్ణ గర్భవికాసాన్ని, పుత్ర సంతానాన్ని కోరి పుంసవన సంస్కారాన్ని శాస్త్రోక్తంగా జరిపించాడు విశ్వానరుడు. సుఖ ప్రసవాన్ని కోరి ఎనిమిదవ మాసంలో సీమంతాన్ని చేశారు. నెలలు నిండగానే బృహస్పతి కేంద్రంలో ఉండగా, శుభయోగంలో, శుభ లగ్నంలో ..... తూర్పు దిక్కు పొలుపైన పున్నమ చంద్రుని కనినట్లు బాలుని కన్నది శుచీష్మతి. పురుడు వెళ్ళగానే పదకొండవ రోజున వైశ్వానర తేజంతో వెలిగి పోతున్న బాలునికి గృహపతి అని నామకరణం చేశారు. దేవత లందరు ఆశీర్వదించారు. తండ్రి ఆ బాలకునికి నాల్గవ మాసంలో ఇంటిగడప దాటుట అనే ఆచారాన్ని, ఆరవ మాసంలో అన్నప్రాశనను, సంవత్సరం నిండిన తదుపరి పుట్టు వెంట్రుకలను తీయుట అనే ఉత్సవాన్ని యథా శాస్త్రీయంగా జరిపించాడు. శ్రవణా నక్షత్రం నాడు చెవులు కుట్టించాడు. ఏడు సంవత్సరాలు నిండగానే ఉపనయన సంస్కారాన్ని యథావిధిగా నెరవేర్చాడు. ఆ బాలుడు తొమ్మిది సంవత్సరాల వయసు వచ్చేసరికి షడంగాలతో కూడి చతుర్వేదాధ్యయనాన్ని పూర్తి చేశాడు. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషం, కల్పము, నిరుక్తము.... ఈ ఆరు షడంగాలు. ఇలా ఉండగా...

ఒక రోజున నారద మహర్షి విశ్వానరుని పర్ణశాలకు వచ్చి ఆ బ్రహ్మచారి సాముద్రిక లక్షణాలను పరిశీలించి "ఓ మహాత్మా! ఈ బాలుడు అల్పాయుష్కుడు. పంద్రెండవ సంవత్సరం వయస్సులో అగ్ని వలన గండం ఉంది. జాగ్రత్తగా కుమారుని రక్షించుకో!" అని భవిష్యత్తును చెప్పి వెళ్ళి పోయాడు. దేవర్షిపల్కులకు పట్టరాని దుఃఖంతో రోదిస్తూన్న తల్లిదండ్రులను

ఓదారుస్తూ గృహపతి ఇలా అన్నాడు: "ఓ జననీ జనకులారా! మీరు శోకాన్ని విడిచి పెట్టండి! నా జన్మ కారణం నాకు తెలుసు! నన్ను కాలుడు కూడా ఏమీ చెయ్య లేడు! శాశ్వతుడు, నిత్యుడు, విభువు అగు శంకరుని ఆరాధించి నేను జరా మరణాదులను జయిస్తాను." ఇలా ప్రతిజ్ఞా పూర్వకంగా పలికి తల్లిదండ్రులకు సంతోషాన్ని కలిగించి వారికి ప్రదక్షిణ నమస్కారాదులు చేసి వారి అనుమతితో కాశీ నగరాన్ని చేరుకొన్నాడు. చేరుకొని.....

ముందుగా మణికర్ణికా ఘట్టంలో స్నాన మాచరించి విశ్వేశ్వరుని సేవించి అనుకూల ప్రదేశంలో ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకొని తన కెదురుగా లింగాన్ని స్థాపించి తపశ్చర్యకు ఉపక్రమించాడు. అంతరంగ పూజా విధానం చేత అన్ని వేళల శంకరుని అర్చించాడు. మునులారా! దాని క్రమం ఎట్టిదంటే...

ముందుగా అంతరంగంలో శివధర్మాన్ని దృఢంగా నిలుపుకొనాలి. అదే మూల కందం (దుంప). జ్ఞానమే దాని నాళం (కాడ). అష్టైశ్వర్యములే దాని దళములు. రుద్రేశ్వరాదులు దాని కేసరములు. వైరాగ్యం దాని కర్ణిక. మన హృదయ కమలంలో ప్రకాశిస్తూన్న సోమ సూర్యాగ్ని మండల త్రయ మధ్యమందున్న 'సత్' యే శివ స్వరూపం. 'చిత్' దాని దేహ కాంతి. ఆనందం దాని లావణ్యం. ఇతర సద్గుణములు దాని ఆభరణాలు. శివుడు లోపల, బయట అంతట వ్యాపించి ఉన్నాడు. ఎలాగంటె.... శుద్ధ స్ఫటికం చెంత దీపాన్ని ఉంచితే బయట ఉన్న దీపకాంతి స్ఫటికం లోపల ప్రకాశిస్తుంది. చిల్లులు గల ఘటంలో దీపాన్ని ఉంచితే ఆ దీపకాంతి బయటకు ప్రసరిస్తుంది. పరమాత్మ స్వరూపం అట్టిది. లోపల, వెలుపల ఒక్క విధంగానే ప్రకాశిస్తూంటాడు ఆయన.

అట్టి ఈశ్వరుని భావించి, సర్వజగత్తుకు ఆధారమైన వాడు ఆయనొక్కడే అనే నిశ్చయం ఆసనం. శంకరుడు పరిపూర్ణుడు అను బుద్ధి ఆవాహనం. జగత్తంతా ఆయన విభూతియే అను తెలివి పాద్యం. సుఖాలనిచ్చే వాడు శంకరుడు అను జ్ఞానం అర్ఘ్యం. శంకరుడు పరమ పవిత్ర స్వరూపుడు అను ఎరుక ఆచమనం. నిత్య నిర్మలుడు శంకరుడు అను భోధ స్నానం. జగత్తంతా ఆయన అతిక్రమించి ఉన్నాడనే శుద్ధ విద్య వస్త్రం. ఆయన త్రిగుణాతీతుడు అనే జ్ఞానం యజ్ఞోపవీతం. చైతన్యమే ఆయన స్వరూపం అను తలపోత ఆభరణం. శంకరుడు 'చిత్' స్వరూపుడు అను బుద్ధి గంధం. కారుణ్యం అక్షతలు. ప్రణవ, పంచాక్షరులు ఆయనకు పుష్పాలు. విషయ సుఖాలకు దూరంగా ఉండటం ధూపం. ఈ జగత్తును వత్తిగా చేసుకొని పరమాత్మ వెలిగి పోతున్నాడనే దృష్టిని కలిగి ఉండటం దీపం.

న్యిత్య తృప్తుడై ఉండటమే నైవేద్యం. త్రిగుణా తీతుడుగా ఉండి అరిషడ్వర్గాలకు లోను కాకుండ ఉండటమే తాంబూలం. నేను శివుడను అను 'సోఽ హం' భావనయే ప్రదక్షిణం. సమస్త తత్త్వములను అతిక్రమించి ఉండటం నమస్కారం. శివుని యందు ఐక్య భావన విసర్జనం. ఈ విధమైన ఉపచారాలచే శంకరుని పూజించటమే అంతః పూజ.

ఈ విధంగా గృహపతి ప్రతి దినం మానస పూజ చేస్తూ నియతాహారుడై సంవత్సర కాలం తపస్సు చేయగా ఇంద్రుడు ప్రత్యక్షమై వాంఛితాన్ని తెలుప వలసిందని కోరగా "నేను శంకర భక్తుడను, ఆయన నుండి మాత్రమే వరాన్ని స్వీకరిస్తాను. అన్యులతో నాకు పనిలేదు, వచ్చిన దారినే మరలి పో!" అని మృదువుగా తిరస్కరించాడు. దానికి ఇంద్రుడు కోపించి దంభోళిని ఝుళిపించి బాలుని భయ పెట్టాడు. మెరుపులు సృష్టించిన వజ్రాయుధ కాంతులకు... నారదుడు చెప్పిన వైద్యుతాగ్ని గండం ఇదే కాబోలు అనుకొని బాలుడు భయ కంపితుడై మూర్ఛ పోయాడు.

వెంటనే వృషభధ్వజుడు ప్రత్యక్షమై మూర్ఛాగతుడైన బాలుని "లెమ్ము! లెమ్ము! నీకు మంగళమగు గాక!" అని ఆశీర్వదిస్తూ తన అమృత హస్తాలతో స్పృశించాడు. నిద్ర లేచిన వాని వలె లేచి ఆ బాలుడు ఎదురుగా ఉన్న శంకరుని దర్శించి ఆనందాశ్రువులు చెక్కిళ్ళపై జార చేతులు జోడించి బొమ్మలా నిలబడి పోయాడు. ఆ బాలుని చూచి కరుణా మూర్తి ఐన శంకరుడు చిరునవ్వుతో ఇలా అన్నాడు : "ఓ బాలకా! గృహపతీ! దేవర్షి అగు నారదుని మాట అసత్యం కాకూడదు. ఆ కారణంగా నేనే ఇంద్రుని పంపిచాను. ఇదంతా నా మాయ. నీ మనోగతం నాకు తెలుసు. నీ వాంఛితం నెరవేరుతుంది. నీవు అగ్ని పదవిని పొంది యమునికి ఇంద్రునకు మధ్యలో దిక్పాలక స్థానాన్ని అధిష్ఠించి దేవతలకు, నరులకు కూడా వరముల నియ్య గలవు! నీవు సృష్టి అంతా వ్యాపించి ఉంటావు. విశ్వంలో వైశ్వానరాగ్ని రూపంలోను, విద్యుత్తులో వైద్యుతాగ్ని రూపంలోను, ప్రాణులలో జఠరాగ్ని రూపంలోను... ఇంకా అనేక రూపాలలో వ్యాపించి ఉంటావు. నిన్ను ఆరాధించిన వారికి అనారోగ్యము, అకాల మరణము ఉండవు. నరులలో నీవు జాగ్రత్-స్వప్న-సుషుప్త్యవస్థలలో విశ్వ, తైజస, ప్రాజ్ఞ రూపాలలో ఉండి వారిని నడిపిస్తావు. కాశీలో నీవు స్థాపించిన లింగం అగ్నీశ్వరుడనే పేరుతో లోక విఖ్యాతమై భక్తుల మనో వాంఛితాలను నెరవేరుస్తుంది. ఓ అగ్నీ! నిన్ను ఆరాధించిన వారెవరైనా నీతో సమానమైన తేజస్సును పొందుతారు. అనాథ శవానికి అగ్ని సంస్కారం చేస్తే అతడు శాశ్వతమైన పుణ్యలోకాలను పొందుతాడు. దేవతలు నీ ద్వారానే

ఆహారాన్ని పొందుతారు. మోక్షము నిచ్చే పరదైవము, గురువు, తీర్థము అన్నీ నీవే! అపవిత్ర వస్తువు లన్ని నీ సంస్కారంచే పవిత్రములవుతాయి. అందువల్ల నీకు లోకంలో పావకుడనే పేరు విఖ్యాత మవుతుంది. నీవు అందరి యందు అంతర్యామి స్వరూపంలో ఉంటూ, తిన్న ఆహారాన్ని జఠరాగ్ని రూపంలో పచనం చేస్తూ; ప్రాణులకు శక్తినిస్తావు. కాని స్త్రీల ఉదరంలో ఉన్న శిశువులను నీవేమీ చెయ్యలేవు. శిశువు లందరు శివస్వరూపాలు! ఆ మాంసపిండాలను తక్క తక్కిన మాంసాలను జీర్ణం చెయ్యగలవు. నా తేజస్సు, నా దాహక శక్తి నీవే! ముల్లోకాలకు ప్రభువు నైన నా మూడవ కంటి తేజస్సుకు ప్రత్యక్ష స్వరూపానివి నీవు! నీవు భక్షించిన వాటిని మాత్రమే దేవతలు భక్షిస్తారు!" ఇలా అగ్నికి వరాలిచ్చి అంతర్హితు డయ్యాడు.... రుద్రుడు. శివుని లలాటాగ్ని నుండి భూమి మీద అవతరించిన ఈ అగ్ని సాక్షాత్కార గాథ పవిత్రమైనది.

**యక్షేశ్వరావతారము**

తొల్లి దుర్వాస మహర్షి శాపంచేత ఆఖండులుని ఐశ్వర్యమంతా పాల మున్నీటిలో కూలి నాక మంతా నిశ్శ్రీకం కాగా దేవ దానవులు పార్వతీపతి ఆజ్ఞ చొప్పున క్షీరసాగరాన్ని మథించారు. అలా తరువగా తరువగా...బుగ బుగమంటూ లోక త్రయాన్ని చీకాకు పరుస్తూ, పొగలు రేగ, లేత మామిడి చిగురుల వలె నాలుకలు సాచి నల్లని చిచ్చు పుట్టి దుర్నిరీక్ష్యమైన ఆ హాలాహలం దేవదానవులను దహించటం మొదలు పెట్టింది. హరి విరించి సుర గరుడ ఉరగ అమరాదులు భయంలో కూరుకు పోయారు. అప్పుడు విరూపాక్షుడు సుస్థిరుడై త్రైలోక్య రక్షా దక్షమైన తన దక్షిణ హస్తాన్ని ఎత్తి "భయపడకండి! పారి పోకండి" అని అమరులకు అభయమిచ్చి అప్రతిమ రౌద్రోద్రేక సంరంభంతో హూంకారం చేసి భుజంగాధిపాలంకార ప్రశస్తమైన హస్తాన్ని చాచాడు. వెంటనే ప్రళయకాల జలధరంలా ఉన్న ఆ గరళం మదగజం చందమై, సూకరాకృతిని నిలిచి, కోకిలంతయై, నేరేడు పండులా ఉండయై హస్త మధ్యమందు చుక్కలా నిలిచింది. ఘటికా సిద్ధుడు రస ఘుటికను మ్రింగినట్లు కటుకమైన ఆ విషాన్ని మృడుడు గుటుక్కున మ్రింగాడు. అప్పటి నుండి శంకరుడు నీలకంఠు డయ్యాడు.

ఆ తరువాత దేవదానవులు హాలాహల దాహ భయాన్ని వీడి క్షీర సాగరాన్ని చిల్కగా కలిమి చూపుల పూబోడి ఐన కమల ఆవిర్భవించింది. వెంటనే కలువల చెలికాడైన చంద్రుడు ఉదయించాడు. వాని వెంట మందార, కల్పతరు, హరి చందన, పారిజాత, అప్సరసలు ఉద్భవించారు. ఇంకా అనేక శ్రేష్ఠమైన వస్తువులు అవతరించాయి. కలశ

పాథోరాశి కడుపు చల్లగా ఆది వైద్యుడైన ధన్వంతరి అమృత కుంభంతో సాక్షాత్కరించాడు. వెంటనే అంధక కాలకేయ మహిషాది రాక్షసులు వడివడిగా వచ్చి దొమ్మిచేసి ధన్వంతరిని నిర్బంధించి అతని దక్షిణ భుజ స్కంధం మీద ఉన్న సుధారస హేమ కుంభాన్ని గుంజుకొని పోయారు. దేవ దానవు లకు వారిలో వారికి కలహం పుట్టింది. ఆ కలహం గొప్ప ద్వంద్వ యుద్ధానికి దారి తీసింది. ఆ యుద్ధంలో చంద్రుడు రాహువుచే పీడితుడై శంభుని శరణు వేడగా ఆయన శీత కిరణుని శిరో భూషణంగా ధరించాడు. వెను వెంటనే రాహువు వచ్చి శంకరుని సాదరంగా స్తుతించగా భక్త వత్సలుడైన వృషభ ధ్వజుడు రాహువు తలను (కేతువును) తన మెడలో  అలంకారంగా ధరించాడు. మాయావి అయిన విష్ణు మాయచే మధుర గోక్షీర ధారా సమాన మైన అమృతం వేల్పులకు..... మృగ తృష్ణ (ఎండమావి) లోని నీరు వంటి అమృతం అసురులకు దక్కింది.

అలా విష్ణువు మాయచే అమృతాన్ని దక్కించుకొన్న గీర్వాణులు గర్వాంధులై హరితో కూడి పెల్లుబ్బి దంభోక్తు లాడు కొంటున్న వేళ శంభుడు యక్షుని రూపంలో వారి మధ్య నిలిచి మీ ఉబ్బుకు కారణ మేమని అడిగాడు. హరిని ముందుంచుకొని అమరులందరు "ఈ విష్ణు భగవానుని కృపచే మేమందరము సుధను గ్రోలి నిర్జరుల మైనాము. దైత్యులు పాతాళానికి పారిపోయారు. అయినా మా ముందు అల్పులైన ఆ అసురులెంత? – అని బీరాలు పలికారు." దానికి శంభుడు నవ్వి "ఓ విష్ణూ! ఓ అమృతాంధసులారా! అందరకు ఆశ్రయ భూతుడైన పరమాత్మ ఒకడున్నాడు! ఆయన ఆజ్ఞచే మాత్రమే సృష్టి నడుస్తూన్నది. ఆయన ఆజ్ఞలేనిచో తృణం కూడ కదలదు!" అని హితోపదేశం చేసి ఒక గడ్డి పరకను అక్కడ ఉంచి దానిని కదపమన్నాడు.

యక్షుని పల్కులకు వారి జాక్షుడు హేలగా నవ్వి...కొన గోట గోవర్ధన పర్వతాన్ని ఎత్తిన నాకిది దొడ్డదా! అని పలికి వామ పాదంతో దానిని తొలగ ద్రోశాడు! అది కదల లేదు. ఇంకా అనేక ప్రయత్నాలు చేశాడు. ఆ తృణం చలించ లేదు. నాడు వరాహావతార వేళ ధరా మండలాన్ని ఏక దంష్ట్రాగ్రం మీద ధరించిన విష్ణువు విస్మితుడై.....

సరిగంచుమేలి జలతారు ఉత్తరీయాన్ని నడుముకు కట్టి... దిక్కులు ప్రక్కళించగా కంఠ హుంకారం చేసి.... బాహా చతుష్టయాన్ని అప్పళించి...పాదఘట్టనం చేత ధాత్రిని అదలించి.... ఆ తృణాన్ని చతుర్భుజుడు నాల్గు చేతుల పట్టి కదలించబోయాడు. అది ఇసుమంత కూడా చలించ లేదు.

క్షీరసాగర మథన వేళ....

వక్షస్థలాన అలంకారంగా ధరించిన నవకంపు తులసి దండ వాడకుండ సిస్తుగా దిద్దిన కస్తూరి తిలకం చెమట బిందువుల చేత చెదరకుండ ...... మణి మకుటం మీద మయూర పింఛం ఒరగకుండ శ్రవణాలంకారంగా ధరించిన తామర మొగ్గ జారకుండ.... ముంగురులు రేగకుండ లీలగా శృంగార కందుకాన్ని చేతపట్టి నట్లు మందర మహీధరాన్ని పట్టి తెచ్చిన పద్మనాభుని ప్రయత్నానికి.... ఆ తృణం కదల లేదు. చివరి ప్రయత్నంగా సుదర్శన చక్రాన్ని ప్రయోగించగా అది మొక్క పోయింది. వాసుదేవుడే తృణాన్ని కదల్ప లేక భంగ పడితే ఇక ఇతర దేవతల మాట చెప్పే దేముంది.

అప్పుడాకాశవాణి ఇలా పలికింది: "ఓ! విష్ణూ! ఓ బృందారకులారా! మీ ఎదుట ఉన్న యక్షుడే పరబ్రహ్మ స్వరూపుడైన శంకరుడు. శివ మాయచే మీరందరు మోహితులై ఉన్నారు. గర్వాన్ని విడిచి ఆయనను శరణు వేడండి". వెంటనే వారందరు అహంకారాన్ని విడిచి రుద్రుని స్తుతించారు. ఈ యక్షేశ్వరావతార గాథ వేద సమ్మతమైనది. ఉపనిషత్తుల చేత ప్రతిపాదింప బడిన జ్ఞాన రూపమైనదీను."

**శివుని దశావతారములు**

సూత మహర్షి శౌనకాది ఋషులతో ఇలా చెపుతున్నాడు : "ఓ! తపోధనులారా! ఉపాసన కాండ ద్వారా తమ్ము ఆరాధించే సత్పురుషులకు భుక్తిని, ముక్తిని ఇచ్చే శివ-శక్తుల పది అవతారాలను గూర్చి చెబుతున్నాను వినండి. అందులో మహా కాలావతారము మొదటిది. అప్పుడు శక్తి మహాకాలి. 'తార' అను అవతారము రెండవది. దాని శక్తి 'తారా'. వీరిద్దరు తమ సేవకులకు భుక్తిని, ముక్తిని ఇస్తారు. బాల భువనేశుడు మూడవ అవతారము. దాని శక్తి బాల భువనేశ్వరి. షోడశ శ్రీ విద్యేశుడు నాల్గవ అవతారము. దాని శక్తి షోడశీ శ్రీవిద్యాదేవి. భైరవుడు ఐదవ అవతారము. దాని యందు పార్వతి భైరవి. శివుని ఆరవ అవతారం ఛిన్నమస్తకుడు. దాని యందు గిరిజా దేవి ఛిన్నమస్త అనబడుతుంది. ఏడవ అవతారం ధూమవంతుడు. దాని యందు శక్తి ధూమావతి. ఎనిమిదవ అవతారం బగళా ముఖుడు. దాని శక్తి బగళా ముఖి, మహానంద. తొమ్మిదవ అవతారం మాతంగుడు. దాని శక్తి మాతంగి. పదవ అవతారం కమలుడు. దాని యందు పార్వతి కమల.

తంత్ర శాస్త్రంలో నిగూఢంగా ఉన్న ఈ శక్తులను ఉపాసించిన వారికి సర్వమైన కోరికలు నెరవేరుతాయి.

**ఏకాదశ రుద్రుల అవతారం**

పూర్వం దేవత లందరు రాక్షసులచే పరాజితులై స్వీయ నగరమైన అమరావతాని విడిచి భయంతో పారిపోయి తమ తండ్రి ఐన కశ్యప మహర్షి వద్ద మొరపెట్టుకొన్నారు. శివ భక్తుడైన ఆయన వారిని ఓదార్చి కాశీ నగరాన్ని చేరి అక్కడొక లింగాన్ని స్థాపించి నిత్యము దానిని యథా శాస్త్రీయంగా అర్చిస్తూ విశ్వేశ్వరుని గూర్చి గొప్ప తపస్సు చేశాడు. అతని తపస్సుకు ప్రీతుడైన శంకరుడు ప్రత్యక్షమై నీ అభీష్టాన్ని తెలుప వలసిందని కోరగా కశ్యపుడిలా ప్రార్థించాడు. "ఓ! దేవ దేవా! శరణాగత వత్సలా! నా పుత్రులు, నీ భక్తులు ఐన దేవతలు అసురుల చేతిలో పరాజితులై దుఃఖిస్తున్నారు. ఈ విషయంలో విష్ణువు సైతం అసమర్థుడయ్యాడు. నీవు నా గర్భాన జనియించి దేవతలను రక్షించ వలసింది." – అతని ప్రార్థనను మన్నించి శంభుడు కశ్యపునకు సురభియందు పదకొండు రూపాలలో అవతరించాడు. కపాలి, పింగలుడు, భీముడు, విరూపాక్షుడు, విలోహితుడు, శాస్త, అజపాత్, అహిర్బుధ్న్యుడు, శంభుడు, చండుడు మరియు భవుడు... ఈ పేర్లు గల ఏకాదశ రుద్రులకు సురభీ తనయులని పేరు.

ఈ రుద్రులు యుద్ధంలో దేవతలకు సహాయులై రాక్షసులను సంహరించారు. వీరు దేవ కార్యం కొరకు జన్మించిన వారు. వీరు ఈశాన్య దిక్కున నివసిస్తూ సర్వదా భక్తులను రక్షిస్తూ ఉంటారు. వారి అనుచర గణం సర్వ లోకాల లోను కోట్ల సంఖ్యలో ఉన్నారు.

**దుర్వాసావతారము**

పూర్వం బ్రహ్మపుత్రుడు, తపశ్శాలి, బ్రహ్మవేత్త ఐన అత్రి మహర్షి అనసూయతో కూడి సుఖంగా ఆశ్రమ జీవితాన్ని గడుపు కొంటున్నాడు. ఒక రోజున భార్య పుత్ర వాంఛను వెల్లడించగా ఆయన నిర్వింధ్యా నదీ తీరానికి చేరుకొని ప్రత్యక్ష కులమను పర్వతం చెంత ఆశ్రమాన్ని నిర్మించుకొని..... అనసూయా దేవి తగు పరిచర్యలు చేస్తూండగా శివుని గూర్చి గొప్ప తపస్సు చేశాడు. పుత్రార్థియై ఆయన తీవ్రమైన తపస్సు చేస్తుండగా అగ్ని జ్వాలలు పుట్టి ముల్లోకాను తపింప జేయ సాగాయి. లోక హితాన్ని కోరి సృష్టి, స్థితి, లయ కర్తలైన బ్రహ్మ, విష్ణు, రుద్రులు ఆయన ముందు ప్రత్యక్షమై "నీ వాంఛితాన్ని తెలుప వలసింది" అని కోరగా ఆయనిలా అన్నాడు. "ఓ త్రిమూర్తులారా! మీ ముగ్గురు ముల్లోకాలకు వందనీయులు. సందేహం లేదు. కాని నేను పుత్రార్థినై ఈశ్వరుని మాత్రమే ధ్యానించాను. ఈశ్వర శబ్దం పార్వతీ పతీ ఐన శంకరుని యందు మాత్రమే వర్తిస్తుంది. పూజనీయు లైన మీ ముగ్గురు ఎందుకు వచ్చి నట్లు? ఇందులో మీ వాంఛితం కూడ ఏమైన ఉందా? దయతో తెలియ చేయ్యండి."

అతని పల్కులకు సంతసించి త్రిమూర్తులిలా బదులిచ్చారు: "ఓ! అత్రి మహర్షి! మేము ముగ్గురము ఒకే ఈశ్వర తత్త్వానికి చెందిన వారము. మాలో మాకు భేదం లేదు. సృష్టి వ్యక్తం కాక ముందు అవిభాజ్యంగా ఉన్న ఆ ఏకైక ఈశ్వర తత్త్వమే; సృష్టి వ్యక్తమైన తర్వాత సృష్టి సంసారాన్ని నిర్వహించటం కొరకు మూడు తత్త్వాలుగా విభాగింప బడింది. ఆ తత్త్వానికి చెందిన వారమే మేము. అతి పవిత్రులైన మీ దంపతులకు మా అంశంచే ముగ్గురు పుత్రులు జన్మించి మీ కీర్తిని వర్ధిల్ల చేయ గలరు." ఇలా వరమిచ్చి అంతర్హితులయ్యారు త్రిమూర్తులు. అత్రి మహర్షి అనసూయతో కూడి ఆనందంతో ఇంటికి చేరుకొన్నాడు.

కొంత కాలానికి బ్రహ్మ యొక్క అంశ వలన చంద్రుడు వారికి పుత్రుడై జన్మించగా దేవలతనిని సముద్రంలో పార వేశారు. తిరిగి చంద్రుడు సముద్రం నుండి ఆవిర్భవించాడు. విష్ణువు యొక్క అంశ వలన దత్తుడు ప్రభవించి సన్న్యాస పద్ధతిని వర్ధిల్ల చేశాడు. రుద్రుని అంశతో దుర్వాస మహర్షి జన్మించి లోకంలో ధర్మాన్ని ప్రవర్తిల్ల చేశాడు. దయానిధి, పరమ తపో నిరతుడు అగు దుర్వాసుడు బ్రహ్మ తేజస్సును వృద్ధి పొందించాలనే కోరికతో అనేక మంది యొక్క ధర్మ నిష్ఠను పరీక్షించాడు. వాటిలో అంబరీషుని వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి.

పూర్వం సూర్య వంశజుడైన అంబరీషుడనే మహారాజు సప్త ద్వీపాలతో కూడిన ఈ భూమిని పాలించాడు. అతను విష్ణు భక్తుడు. ఏకాదశీ వ్రతాన్ని నియమంగా ఆచరించేవాడు. ప్రతి ఏకాదశి తిథినాడు ఉపవాస ముండి వ్రతాన్ని ఆచరించి ద్వాదశి నాడు తిథి వెళ్ళకుండ పారణ (భోజనం) చేయటం దాని నియమం. ఒక రోజున అంబరీషుడు వ్రత నిష్ఠలో ఉండగా ద్వాదశి తిథినాడు దుర్వాస మహర్షి తన శిష్యులతో కూడి రాజ దర్శనానికి వచ్చేడు. రాజు మహర్షికి అతిథి సత్కారాలాచరించి భోజనానికి సిద్ధం కావలసిందిగా ప్రార్థించాడు. మహర్షి 'సరే' అని స్నానానికై నదికి వెళ్ళి రాజు యొక్క వ్రతనిష్ఠ ఎట్టిదో అని పరీక్షింప గోరి జాగు చేశాడు. ఇక్కడ అంబరీషుడు మహర్షి ఎంతకూ రాక పోయేసరికి ద్వాదశి తిథి దాటి పోతున్నదనే శంకతో నీటిని మాత్రమే త్రాగి మహర్షి రాక కోసం ఎదురు చూస్తున్నాడు.

ఇంతలో స్నానం ముగించుకిని దుర్వాసుడు తన శిష్యులతో కూడి వచ్చి రాజు జలపానం చేసినాడని తెలుసుకొని.... అతిథిని భోజనానికి ఆహ్వానించి అతిథి రాకుండ జలపానం చేసిన రాజు దౌష్ట్యానికి ఆగ్రహోదగ్రుడై అతనిని దహించ టానికి సిద్ధ పడ్డాడు.

వెంటనే రాజును రక్షిస్తున్న ఈశ్వర సంబంధమైన చక్రం మహర్షి శివ స్వరూపుడని ఎరుగక ఆయనను దహించటానికి ప్రజ్వరిల్లించి. ఇంతలో ఆకాశవాణి ఇలా పలికింది: "ఓ ! అంబరీషా! ఈ సుదర్శన చక్రాన్ని శంకరుడే విష్ణువుకు ఇచ్చాడు. ఈ దుర్వాసుడు సాక్షాత్తు రుద్ర స్వరూపుడు. ఈతడు అసాధారణ మహా మహిమాన్వితుడు! వెంటనే చక్రాన్ని శాంతింప చేయి. మహర్షి కేవలం నీ వ్రతనిష్ఠను పరీక్షించి నిన్ను అనుగ్రహించటం కొరకు మాత్రమే వచ్చాడు. ఆయనను శరణు వేడుకో! నీకు శుభాలు కలుగు తాయి." ఇలా పలికి విరమించింది. రాజు చక్రాన్ని ప్రార్థించి శాంతింప చేసి మహర్షిని స్తుతించి ఆయన ఆశీర్వచనాలను పొందేడు.

అంతేకాదు... దుర్వాస మహర్షి శ్రీరాముని కూడ పరీక్షించి ఆయన దృఢ నియమానికి ప్రీతుడై వరాలనిచ్చి అనుగ్రహించాడు. ఒక సందర్భంలో శ్రీ కృష్ణుని కూడ పరీక్షించి వరాలను ఇచ్చాడు. స్వతంత్ర ప్రవర్తనుడగు దుర్వాసుడు ద్వారకా నగరానికి కేగి కృష్ణ మందిరంలోనికి ప్రవేశించి అక్కడి వారిని చూచి ఒకసారి మందహాసం చేస్తూ, కోపిస్తూ సుముఖుడగుచు, విముఖు డగచు, భోజనం వద్దంటూ, తింటూ, అందరి వంట తనే తింటూ, మంచం మీద నిద్రిస్తూ, భూమిమీద దొర్లుతూ, ఎక్కడికో పోతూ, తిరిగి వస్తూ.... ఇలా స్వేచ్ఛాచారియై సంచరిస్తూ వచ్చాడు. ఒక రోజున "కృష్ణా! నాకు పాయసం మీద వేడుక పుట్టింది పెట్టింపవా!" అని కోరగా తక్షణం దానిని నేరవేర్చాడు. తాను కొంత తిని చెంత నున్న రుక్మిణి అంగములకు కొంత పూసి, కొంత తన శరీరానికి పూయ మనగా కృష్ణుడట్లే చేశాడు.

తదపరి రుక్మిణిని రథ్య (గుఱ్ఱం) గా చేసికొని రథానికి ఆమెను పూన్చి తాను రథమెక్కి సకల యాదవులు చూస్తూండగా కృష్ణుడు వెంటరాగా నగర సంచారం చేసి తిరిగి వచ్చి చేరాడు. అలసిన రుక్మిణి సొమ్మసిల్లి పడిపోగా ఆమె మీద ఇంత దుమ్ము చల్లి దక్షిణ దిక్కుగా విసవిస నడుచుకొంటు వెళ్ళి పోయాడు. ఆశ్యర్య భయాలతో రుక్మిణీ కృష్ణులు ఆయన వెంట నడిచారు. వారిని చూచి మహర్షి "కృష్ణా! మీ దంపతులను కష్టపెట్టి నట్లున్నాను. నువ్వు కోపాన్ని జయించావు! నీకు వరాన్నిస్తున్నాను. లోకంలోని జనులు తమ్ముతాము ఎంతగా ప్రేమించు కొంటారో అంతకు మించిన కూరిమిని, ప్రేమను నీయందు చూపుతారు. అతుల మహిమతో ఒప్పారుతూ లోకవంద్యుడవు అవుతావు. అతి భక్తితో పాయసాన్ని నా సర్వాంగాలకు పూసి అరకాళ్ళ యందు పూయ లేదు కనుక నీకక్కడే

అపాయం ఉంది. అది నీ పరమపద ప్రాప్తికి కారణ మవుతుంది కనుక దానిని అశుభం అనరాదు. ఋషుల యెడ, మునుల పట్ల, బ్రాహ్మణుల విషయంలోను భక్తిని విడువకు" – అని పలికి వెళ్ళి పోయాడు.

ఒక రోజు మహర్షి గంగా నదిలో స్నానం చేస్తూండగా వస్త్రం కొట్టుకు పోయింది. సిగ్గు పడి ఉత్కంఠతో ఎదురు చూస్తూ ఉండి పోయాడు. సమీపంలో స్నానం చేస్తూన్న ద్రౌపతి విషయాన్ని గ్రహించి తన చీరను చింపి ఆ శకలాన్ని మహర్షికిచ్చి మార్యాద కాపాడింది. ప్రవాహ వేగంచే ఎగువ నుండి దిగువకు వచ్చి చేరిన వస్త్ర శకలాన్ని గ్రహించి, దానిని ధరించి పాంచాలి యందు ప్రసన్న చిత్తుడై వస్త్రవృద్ధి అను వరాన్ని ఇచ్చాడు. పాండవులకు సుఖాలు కలిగేటట్లుగా ఆశీర్వదించాడు. ఒక సందర్భంలో హంస, డింభులను ఇద్దరు రాజులు తనను అవమానించగా వారిని హరిచే తుద ముట్టించాడు. తన బ్రహ్మ తేజస్సుచే భూలోకంలో యథా శాస్త్రవిధితో కూడిన సన్న్యాస పద్ధతిని స్థాపించాడు. అనేక మందికి జ్ఞానాన్నిచ్చి ముక్తులను చేశాడు. ఈ దుర్వాసావతార చరిత్ర పరమ పావన మైనది.

## హనుమచ్చరిత్ర

సూతుడు శౌనకాది మహర్షులతో ఇలా అంటున్నాడు. "మునులారా! రుద్రుని యొక్క మరొక అవతారమైన జగత్ప్రసిద్ధమైన హనుమదవతారాన్ని గూర్చి సంగ్రహంగా చెపుతున్నాను వినండి. దుర్వాసుడు రుద్రావ తారమే ఐనా కోపిష్ఠి ఐన కారణంగా భక్తజన ప్రియుడు కాలేకపోయాడు. ఈ హనుమ.....అఖిల లోకోపకారి! జగదుపకారి! ఆజన్మ బ్రహ్మచారి! దీనవత్సలుడు! కష్టాలలో ఉన్న వారిని చూచి కరిగి పోతాడు. ఆదుకొంటాడు. అది ఆయన వ్రతం. సాక్షాత్తు శ్రీరామ చంద్రుడే ఆయన అనుగ్రహానికై ఆరాట పడి అఙ్ఙులు సాచాడు. ఆది అక్ష్మి అయన సీతాదేవి సైతం "ఈ ఆపద నుండి గట్టెక్కించ ఓయి తండ్రీ!" అని ప్రార్థించింది.

మారుతి ప్రాజ్ఞుడు, తజ్ఞుడు, ఉత్తముడు, సర్వజ్ఞుడు, గొప్ప రాజనీతి విశారదుడు. కనుకనే విల్లంబులు ధరించి తపసి వేషాలలో ఉన్న రామలక్ష్మణులను అజ్ఞతతో విశ్వసించని సుగ్రీవునికి నచ్చ చెప్పి వారి ప్రజ్ఞలెరిగిన వాడై సత్యమృదు వచనాలతో మైత్రి ఘటించాడు.

సమీర కుమారుడు విద్వాంసులలో విద్వత్ శిరోమణి! కవులలో ఉత్తమ కవి. గాయకులలో ఉత్తమ గాయకుడు! భరత శాస్త్ర దురంధరుడు!

బలవంతులలో కెల్ల మహా బలవంతుడు! ధీమంతులలో కెల్ల ధీమంతుడు!

తపోనిధులలో అతుల తపశ్శాలి! యోగులలో పరమ యోగి!

గుణులలో కెల్ల లోకైక గుణ ధురీణుడు! వైరాగ్య పరులలో అతి విరక్తుడు!

వీరులలో వీరాధి వీరుడు! అప్రమేయుడు! అజేయుడు!

పవమాన సూనుడు విరుక్తుడే కాని రక్తి పుట్టు నట్లు జంత్ర గాత్రముల రాళ్లను కరిగించ గల గాంధర్వ విద్యాధురీణుడు! విజితేంద్రియుడైన వీరుడు. శాంతుడైన శత్రు భయంకరుడు!

విద్యాధికుడైన వినయ శీలి! బహు కార్య ధురంధరుడైన బ్రహ్మచారి!

చిత్తవృత్తి నిరోధాన్ని సాధించిన మనోవేగి! సౌశీల్యనిధి ఐన కపి ముఖ్యుడు! అతి బలైశ్వర్య యుక్తుడైన నిగర్వి! కామరూప ధరుడైన కామదూరుడు!

ఇతని అనంత కళ్యాణ గుణాలు త్రిలోకాద్భుతాలు !

లోకంలో గల వేలుపులు ఏకైక గుణ ప్రసక్తి, ప్రశస్తి కలవారు. ఈ హనుమ సకల గుణాకరుడు!

సకలదైవ ప్రభావాలు, సద్గుణాలు, పరమ సుజ్ఞాన వైరాగ్య భక్తి కరుణ కాంతి ప్రతాపాలు ఏక రూపాన్ని ధరించి పవన నందన రూపంలో మూర్తి మంత మయ్యాయి!

హనుమ చిరంజీవి! ఇతణ్ణి కొలిచిన వారికి ఇష్ట కామ్యార్థాలు వెంటనే సిద్ధిస్తాయి.

ఇతడు స్వతంత్రుడై ఉండి కూడ రాముని యందు భక్తి భావాన్ని, భృత్య భావాన్ని చూపించాడంటె ఇతని వినయాన్ని ఏమని స్తుతించాలి!

స్వామి భక్తి, నయ, వినయ, ఉద్యోగ, సౌమ్య, ధర్మ, దాక్షిణ్య, కార్య సంధాన, శౌర్య, ధైర్య, చాతుర్యాలు..... ఇతని ఆత్మగుణాలు!

గాన విద్యలో హనుమ పెట్టిన భిక్షతో తలెత్తుకు తిరుగు తున్న వారు.... తుంబురు నారదులు.

భరత శాస్త్రంలో సహస్రాంశం కూడా నేర్వని వారు రంభాదులు. హనుమ మహిమలో అణుమాత్ర మైన ఎరుగని వారు దిక్పాలకులు.

హనుమ ఉపదేశించిన వాక్యాల తాత్పర్య వేశంతో ముక్తులైన వారు గౌతమ అత్రి, చ్యవన భరధ్వాజాది మహర్షులు.

నిశ్చల భక్తితో తత్పరమతులై హర్ష పులకిత గాత్రులై ఆనందాశ్రువు లొలుక చేతులు జోడించి "ఆంజనేయా! హనుమా! మారుతీ! పవన నందనా! సువర్చలా ప్రియా! రామభక్తా!" అంటే చాలు వచ్చి వాలతాడు. పుణ్యం అంటె ఈ భరత వర్ష ప్రజలదే! ఎందుకంటె ఆ అవతారం ఈ కర్మ భూమిలో కోరి అవతరించింది. హనుమద్భక్తులు ధర్మార్థకామాలను ఇక్కడ సాధించి ఆపై మరుజన్మలో కింపురుష వర్షంలో జన్మించి నిరంతరము హనుమద్దర్శనాన్ని పొంది ఆపై పునరావృత్తి రహిత నిరతిశయా నంద అద్వైత సిద్ధిని పొందుతారు. ఇది నిశ్చయం.

**సముద్ర మథనం, వృషభావతారం**

పూర్వకాలంలో ..... మరణాన్ని నివారించే అమృతము, దానితో పాటు ఇతర శ్రేష్ఠ వస్తు సముదాయము క్షీర సాగర మధ్య మందు స్థిరంగా ఉన్నాయనే జ్ఞానాన్ని కలిగిన దేవదానవులు వాటిని సంపాదింపగోరి క్షీర వారాశిని మథించటానికి సిద్ధ పడ్డారు. దానికి అవసరమైన సాధన సామగ్రి, ఇతర ఉపాయాలను కానక శంకర దేవుని శరణు జొచ్చి అనేక విధాల ప్రార్థింపగా ఆయనిలా ఉపాయాన్ని బోధించాడు :"ఓ! దేవతలారా! ఓ! దానవులారా! మీ ఆలోచన మీ ఐక్యత మెచ్చుకొన తగినది. సాగర మథనం కష్టమైనదే కాని అసాధ్యం కాదు. రసాతలం వరకు దిగినా; మునగని మందర పర్వతాన్ని కవ్వంగాను, సర్ప రాజైన వాసుకిని కవ్వపు త్రాడుగాను, ఆది కమఠాన్ని క్రింది మట్టుగాను చేసికొని దర్ప దుర్వారులైన ఇంద్రాది సురలు బలి కాలకేయాది దనుజులు పాల మున్నీటిని త్రచ్చండి. నేను కార్య ప్రయోగ రక్షకుడనై ఉంటాను. సురాసురులతో కూడి ఈ హరి మందరాచలాన్ని పెరికి తెచ్చు గాక! పితామహుడును, నేనును సాగర తీర మందు ఉంటాం! మీరు వెళ్ళండి" ఇలా చెప్పి పంపించి బ్రహ్మతో కూడి పాల మున్నీటి దరికి చేరుకొన్నాడు శంకరుడు.

వృషభధ్వజుని ఆజ్ఞచొప్పున తోయజాక్షుడు జంభారి ప్రముఖ దిక్పాలురు వెన్నంటి రాగా, దేవ దానవ సేనా సమేతుడై పశ్చిమ దిశాముఖంగా కదిలి మందరాద్రిని సమీపించాడు. సమీపించి చిరునవ్వు నవ్వి దితి తనూభవులను దివిజ వరులను దూరంగా తొలగి పొమ్మని ఆజ్ఞాపించి, పాకశాసన పావక పరేత రాజాది దిక్పాలురను చేసంజ్ఞచే ఎడమగా ఉండమని సూచించి భుజావష్టంభనం చేసి చతుర్బాహువులచే మందర గిరిని చుట్టి, వక్షస్థలానికి

ఆనించి ఒత్తి పట్టి, కదలించి, పొతర లాడించి; రొమ్మున నున్న కలుముల చెలి... నలుగుడుకు కలగుండు పడగా.. అవలీలగా మందరాన్ని యెత్తి..... చేలాంచలంచే చిరుచెమట తడి ఒత్తు కొన్నాడు.

మాధవుడు మందరాద్రిని చతుర్బాహువుల పట్టి పాతర లాడిస్తున్న వేళ గిరి మీది కిన్నరులు విన్న బాటును పొందారు. కింపురుషులు భయ భ్రాంతు లయ్యారు. వానర సమూహం చెల్లాచెదరైంది. శార్దూలాలు ఘోషించాయి. సింహాలు గర్జించాయి. మత్త మాతంగాలు ఘూర్ణిల్లాయి. పక్షి సమూహం అంతరిక్షానికి ఎగసింది. ఏడు పాతాళాలు గగ్గోలు పడ్డాయి. గిరితో పాటు ధర కూడ కంపించింది.

ఆపై మాధవుడు మందరాద్రిని దేవదానవులచే మోయించి దుగ్ధాబ్ధి దరికి చేర్చాడు. అఖిల కార్యారంభములకు ముందు హేరంభుడు పూజనీయుడు కనుక వినాయకుని రత్న సింహసనా సీనుని చేసి దేవాసురులు అమిత భక్తి శ్రద్దలతో పూజించారు. గంధ కస్తూరీ సౌరభ మిళితమైన నదీ జలాలచే అభిషేకించారు. దివ్యాంబరాలను ఆభరణాలను అర్పించారు. కుంకుమ, అగరు, కస్తూరి, కర్పూర, చందనాదులను శరీరానికి మైపూతగా పూసేరు. ఉండ్రాళ్లు నువ్వుండలు, చెఱకు పానకం, తేనే, అరటి పండ్లు, బూరెలు, నేయి, పెసర పప్పు, పాలు, పెరుగు, అన్నం, పాయసం, పానకం, కొబ్బరి బొండాలు, మీగడ, నవనీతం, కుడుములు, కజ్జికాయలు, లడ్లు, చక్కిలాలు, మోరుండలు, చలిమిడి, వడపప్పు..... ఆదిగా భక్ష్య భోజ్య చోష్య లేహ్య పానీయాదులను నైవేద్యంగా సమర్పించారు. ఈ విధంగా లంబోదరుని పూజించి ఆయన ఆశీర్వచనాన్ని గైకొని దుగ్ధ పాథోది మంథనానికి పూనుకొన్నారు సురాసురులు.

పాల్కడలిని చిల్కటానికి కట్టువడి సురాసురులు పాతాళం క్రింది మట్టుగా ఆది కచ్ఛపం చుట్ట కుదురుగా, వాసుకి కవ్వపు త్రాడుగా....... చేసికొని తలవైపు దానవులు తోక వైపు దేవతలు నిలబడి మందరాచల మంథానం చేత దుగ్ధ సింధువును మధించటం మొదలు పెట్టారు. ఘుమఘుమ ధ్వానములచే దిక్కులు పిక్కటిల్లాయి. ఆకాశంలో మేఘ మండలాన్ని అతిక్రమించిన మందరగిరి తిరుగుడు ఒరిపిడికి మేఘాలలో మెరుపులు పుట్టాయి. పాల నురుగు తునుకలు పైకెగిరి వ్యోమాన్ని కప్పేసింది. పాల సంద్రపు సుడులలో గ్రహ నక్షత్ర తారకా మండలాలు చక్ర భ్రమణం చేశాయి. రాసులన్నీ గతులు తప్పాయి. నక్షత్రాలు చూర్ణ మయ్యాయి. జల చరాలు పైకి తేలాయి.

ఇలా సవ్యాప సవ్యంగా పాల్కడలిని తరువగా తరువగా సాగర మధ్యంలో పొగలు రేగ, నల్లని చిచ్చు పుట్టి వాసుకి విషజ్వాలతో కూడి ముల్లోకాలను నల్లగా మాడ్చి వేయ సాగింది. హరి విరించి సురాసురులు హాహాకారాలు చేస్తూ శంకరుని శరణు వేడగా ఆయన దానిని నేరేడు పండులా గుటుక్కున మ్రింగి కంఠంలో నిలిపాడు.

ఆపద తప్పినందుకు సంతోషించి సురాసురులు తరిగొండను తరువగా తరువగా కాంచన కమల కర్ణికాగ్రమందు ఆసీనమై లక్ష్మీ దేవి ప్రభవించి భృగు మహర్షి పుత్రికయై విష్ణుపత్ని ఐంది. చంద్రుడు పుట్టి శంకరుని శరోభూషణు డయ్యాడు. ఆపై వరుసగా ధన్వంతరి, పారిజాతము, మందారము, హరి చందనము, కల్ప వృక్షము, కామధేనువు, ఐరావతము, ఉచ్చైశ్రవము, వారుణి, విష్ణువు యొక్క శౌర్ఙమనే చాపం, శంఖం, కౌస్తుభం ఆ తరువాత అప్సరసలు, చింతామణి, తమలపాకు తీగ, తులసి, దూర్వాంకురాలు... ఇలా శ్రేష్ఠ వస్తు సముదాయం ఉద్భవించింది. అమృతాన్ని విష్ణు మాయచే దేవతలు దక్కించు కొన్నారు.

అమృత ప్రభవ కాలమందు బహిర్గతమై చెదరి పడిన బిందువుల నుండి శరత్పూర్ణేందు వదనలు, దివ్య రత్నాలంకృతలు ఐన యువతులు అనేక మంది ఆవిర్భవించారు. వారిని వెంట పెట్టుకొని రాక్షసులు రసాతలానికి వెళ్ళి వారితో హాయిగా విహరింప సాగారు. విష్ణువు దేవతలతో కూడి రసాతలానికి వెళ్ళి రాక్షసు లందరిని తన చక్రంచే సంహరించి అక్కడున్న దివ్య సౌందర్యవతులైన యువతులను చూచి శివమాయా మోహితుడై వారితో క్రీడించగా విష్ణు పుత్రులు అనేక మంది పుట్టారు. వారు బల గర్వితులై మునులను దేవతలను హింసింప సాగారు. విష్ణువు సైతం కామ మోహితుడై రసాతలం లోనే ఉండి పోయిన కారణంగా వారి అధార్మిక కృత్యములకు అంతు లేకుండ పోయింది.

అప్పుడు పితామహునితో కూడి గీర్వాణులు శివుని ప్రార్థింపగా ఆయన వృషభావతారాన్ని ధరించి విష్ణుపుత్రులను కొమ్ములతో చీల్చి, గిట్టలతో త్రొక్కి వారందరిని నిశ్శేషంగా సంహరించాడు. చచ్చి పడి ఉన్న మృత కళేబరాలను చూచి దుఃఖించి విష్ణువు మహా రౌద్రంతో ఆ వృషభాన్ని ఎదుర్కొని కొమ్ములను పట్టుకొని మెడలను విరువ బోయాడు. ఆ వృషభం కొమ్ములతో విష్ణువును పొడిచి నేలకు కూల్చి గిట్టలతో త్రొక్కి పట్టింది. ఎదురుగా రుద్రుడు సాక్షాత్కరించే సరికి విష్ణువుకు మాయ తెర తొలగి జ్ఞానోదయం కాగా చేతులు జోడించి అనేక విధాల స్తుతించాడు.

ప్రీతుడైన శంకరుడు "ఓ! లక్ష్మీపతీ! లోక పాలకుడవైన నీవు ఇంద్రియ భోగాలకు వశుడవు కారాదు. స్త్రీల యందు ఆసక్తుడవై విహరించుట నీకు తగదు. ఈ దురాచారాన్ని మానుకో! నీ లోకానికి వెళ్ళు! జగద్రక్షన, స్థితి పాలకత్వం ఈ రెండు నేను నీకు అప్పచెప్పిన కర్తవ్యాలు. వాటినే స్మరించు. ఈపైన ముల్లోకాలలోను పాలకత్వాన్ని వహించిన రాజులు స్త్రీ వ్యామోహంలో చిక్కుకొంటే రాజ్య భ్రష్టులై సర్వ నాశన మవుతారు. ఇది నా శాపం. ఈ సుదర్శన చక్రాన్ని పాతాళం లోనే క్షేమంగా ఉండనీ! అది నీ వంటి వాని చేతిలో ఉండరాదు! నా ఆజ్ఞకు లోబడి యుండే మరొక చక్రాన్ని నేను నీకు ఇస్తున్నాను. దాని సహాయంతో ఈ పైన లోక పాలకత్వాన్ని నిర్వహించు ". – అని హితోక్తులు పల్కి అంతర్ధాన మైనాడు రుద్రుడు.

**దధీచి పిప్పలాదుల వృత్తాతం**

సూతుడు శౌనకాది మునులతో ఇలా చెపుతున్నాడు : "మునులారా! రుద్రుని అవతారమైన పిప్పలాదుని చరిత్రను చెపుతున్నాను వినండి. పూర్వం ...... బ్రాహ్మణుడు, మహా శైవుడు, గొప్ప ప్రతాపం కలవాడు, భృగు వంశంలో జన్మించిన వాడు అగు దధీచి అనే మహర్షి ఉండేవాడు. ఆయన చ్యవన పుత్రుడు. ఆయన ఒకప్పుడు విష్ణువును నిర్జించి శపించాడు. ఆయన భార్య పేరు సువర్చ. ఆమె మహా పతివ్రత, సాధ్వి. ఆమె దేవతలను శపించింది. రుద్రుడు ఆ దంపతులకు పిప్పలాదుడనే నామధేయంతో కుమారునిగా జన్మించాడు. ఆ పరమ పవిత్రమైన గాథను చెపుతున్నాను వినండి!

పూర్వం ఒకప్పుడు దేవతలు వృత్రాసురుని చేతిలో పరాజితులై పారిపోయి వచ్చి దధీచి మహర్షి ఆశ్రమంలో తమ ఆయుధాలను భద్ర పరచుకొన్నారు. వారు ఇంద్రునితో కూడి పితామహుని దర్శించి దుఃఖాన్ని విన్నవించగా ఆయన వృత్ర వధోపాయాన్ని ఇలా ఉపదేశించాడు. "ఓ పురందరాది బృందారకులారా! కేవలం మిమ్ములను వధించుట కొరకె పూర్వం త్వష్ట ప్రజాపతి ఈ వృత్రుని సృష్టించాడు. వీడు మహా తేజశ్శాలి. సర్వ రాక్షసులకు సార్వభౌముడు. వీడు ఏ ఆయుధం వలన కూడ చావడు! చివరకు త్రిమూర్తుల మైన మా ఆయుధాల చేత, అస్త్రాల చేత కూడ! దీని కొక ఉపాయం ఉంది. తపశ్శాలి, జితేంద్రియుడు అగు దధీచి మహర్షి పూర్వం శివుని ఆరాధించి వజ్రతుల్యమైన ఎముకలను వరంగా పొందేడు. మనం ఆయన ఎముకలను యాచిస్తే పరోపకార పరాయణుడైన ఆయన తప్పక దాన మిస్తాడు. దానితో వజ్ర దండాన్ని నిర్మించి వృత్రుని సంహరిద్దాం."

దానికి సరే! అని వారందరు దధీచి మహర్షిని దర్శించారు. జ్ఞాన శ్రేష్ఠుడు, బ్రహ్మవేత్త ఆగు మహర్షి తన మనో నేత్రంచే వారి రాకలోని ఆంతర్యాన్ని గుర్తించి తన భార్యయగు సువర్చను ఇంట్లోకి పంపించి దేవ కార్యాన్ని తెలుప వలసిందిగా కోరాడు. వెంటనే స్వార్థాన్ని సాధించుకొనుటలో సమర్థుడు, నీతి శాస్త్ర కోవిదుడు అగు దేవరాజు వినయంగా చేతులు జోడించి వృత్రాసురుని వల్ల పడుతున్న బాధలను వివరించి పితామహుని ఆదేశాను సారంగా ఎముకలను యాచించాడు. దేవేంద్రుని అభిమతానికి మహదానందాన్ని పొంది. "దేవరాజా! మరణానంతరం చితికి ఆహుతియై బూడిదయ్యే ఈ శరీరం దేవకార్యానికి ఉపయోగిస్తుంది.... అంటె అంతకంటె ఈ పాంచ భౌతిక దేహానికి సద్వినియోగ మేముంటుంది?" అని మనసులో మహా దేవుని స్మరించి పాము కుబుసాన్ని విడిచినట్లు, దోసకాయ తీగను వీడినట్లు యోగ శక్తిచే శరీరాన్ని విడిచాడు.... దధీచి!

ఇంద్రుడు తక్షణం సురభి ధేనువును ఆహ్వానించి దేహం నుండి ఎముకలను వేరు చేయించి! ఆ ఎముకలతో దేవతలకు అస్త్రములను నిర్మించమని విశ్వకర్మను ఆదేశించాడు. దేవ శిల్పి దధీచి వెన్నెముకతో వజ్రదండాన్ని, బ్రహ్మశిరమను బాణాన్ని నిర్మించి ఇంద్రున కిచ్చాడు. ప్రక్కటెముకలతోను మిగిలిన ఎముకలతోను అనేక ఇతరాయుధాలను నిర్మించి దిక్పాలకులకు ఇతర దేవతలకు ఇచ్చాడు. ఇంద్రాది దేవతలు ఆ ఆయుధాలతో వృత్రాది దైత్యులను సంహరించి సంతోషంతో గొప్ప ఉత్సవాన్ని చేసికొన్నారు.

మునులారా! భర్త ఆజ్ఞను పాటించి సువర్చ ఆశ్రమం లోనికి వెళ్ళింది అని చెప్పాను గదా! ఆమె గృహ కృత్యాలను ముగించుకొని తిరిగి వచ్చి చూసే సరికి భర్త కనుపించ లేదు. అంతా అమంగళంగా గోచరించింది. ఆ పతివ్రత క్షణంలో దేవతలు చేసిన పనిని గ్రహించి "ఓ అమరులారా! మీరు దుష్టులు! లుబ్ధులు! స్వార్థపరులు. మీ కార్యం మీకు నెరవేరితే మీకంతే చాలు! ఇతరుల దుఃఖంతో మీకు పనిలేదు. మీరు జ్ఞానం లేని పశువులు! ఈ నాటి నుండి నా శాపంచే మీరు పశువులగుదురు గాక!" అని ఆగ్రహంతో శపించింది. భర్తలేని జీవితం ఉదర పోషణార్థమే గాని ఉత్తమ లోక ప్రాప్తికి సాధనం కాదని యెరిగి....పతి తోడిదే లోకమని నిశ్చయించుకొని అభిమానవతి ఐన ఆమె పవిత్ర సమిధలతో చితిని పేర్చుకొని పతివెళ్ళిన లోకానికే తను కూడా అనుగమించటానికి సిద్ధ పడింది.

అంతట శివ ప్రేరితమై ఆకాశవాణి "ఓ దేవీ ! సాహసం చెయ్యకు ! వేదసారమైన నా ధార్మిక వచనాలను విను. ఆత్మహత్య మహా పాపం ! అంతేకాదు ! నీ గర్భంలో బ్రహ్మతేజ స్సంపన్నుడైన దధీచి మహర్షి తేజం వృద్ధి చెందుతూన్నది. అఖండ తేజో విరాజమానుడైన బాలుడు రుద్రాంశతో జన్మించ బోతున్నాడు. గర్భిణి అగు స్త్రీ ఏ ఉపాయం చేతనైన సరే దేహాన్ని రక్షించు కొనాలని వేదాను శాసనం. ముందు గర్భస్థ శిశువుకు జన్మను ఇయ్యి. తరువాత నీ యిష్టం."– ఇలా ధర్మబోధ చేసింది. ఆకాశవాణి పల్కులకు విస్మితురాలై బాలుడు ఉదయించ బోతున్నాడని ఆనందించి సువర్చాదేవి నెలలు నిండగానే రాతితో తన గర్భాన్ని చీల్చుకొన్నది. ఆ గర్భం నుండి రుద్రుడు తన తేజస్సుతో దిక్కులను ప్రకాశింప చేస్తూ బాలుని రూపంలో ఉదయించాడు. ఆ తల్లి బాలుని సుందర రూపాన్ని దివ్య తేజస్సును ఇతర లక్షణాలను చూచి రుద్రుడని గుర్తించి ప్రీతితో ఇలా పలికింది : "ఓ ! పరమాత్మా ! ఈ రావి చెట్టు మొదట్లో నీవు జన్మించావు. దీని సన్నిధిలో చిరకాలం ఉండి లోకాలకు మేలు చేయి. నా భర్త సన్నిధికి చేరుకొన టానికి నాకు అనుజ్ఞను ఇయ్యి! రుద్ర రూపుడవైన నిన్ను నా పతితో కూడి అక్కడ ధ్యానం చేస్తాను." ఇలా పలికి ఆమె సమాధిని పొంది భర్తృ సాన్నిధ్యానికి చేరుకొంది. ఇంతలో సమస్తమైన దేవతలు అక్కడకు వచ్చి బాలుని స్తుతించి ఆశీర్వదించారు. పితామహుడు ఆ బాలునికి యథావిధిగా సంస్కారాలను చేసి, పిప్పలాదుడు అని నామకరణం చేసి మమ్ములను అనుగ్రహించ వలసిందని బాల రుద్రుని ప్రార్థించారు.

కాలక్రమంలో బాలుడు పెరిగి పెద్ద వాడై సమస్త విద్యలను నేర్చి అనరణ్య మహారాజు కుమార్తె ఐన పద్మాదేవిని వివాహమాడి ఆయె యందు తనతో సమానమైన పదిమంది పుత్రులకు జన్మ నిచ్చాడు. పిప్పలాదుడు లోకంలో సర్వులు అనివార్యంగా శని బాధ పడుతుండటాన్ని చూచి పుట్టి నప్పటి నుండి పదియారు సంవత్సరముల ప్రాయం వచ్చేవరకు మానవులకు శని భాధ లేకుండ శనిని శాసించి మహోపకారం చేశాడు. గ్రహ రాజైన శని పీడాకరుడే ఐనా శంకర భక్తులైన వారి జోలికి రాడు. గాధి, కౌశికుడు, పిప్పలాదుడు ఈ ముగ్గురు మహర్షులను స్మరిస్తే శని బాధ నిస్సందేహంగా మానవులకు తొలగి పోతుంది. శని పీడ ఒక్కటే కాదు అన్ని గ్రహాల దోషాలు తొలగుతాయి.

**వైశ్యనాథ అవతారము**

పూర్వం నందిగ్రామ మనే నగరంలో మహానంద అను పేరుగల ఒక అపూర్వ తేజోరాశి ఐన వేశ్య ఉండేది. శృంగార రసాధి దేవత ఐన ఆమె మహావిభవ సంపన్నురాలు! చతుర, ప్రగల్భ, చతుష్షష్టి

కలాన్విత, ప్రియవాదిని, రూప యౌవన సంపన్న, కలా ప్రయోగ కుశల, రాజోపచార ! శుభాచార ! విశేషించి శంకర భక్తురాలు. ఆమె నిత్యము విభూతి రుద్రాక్షలను ధరించి శివార్చన చేసేది. శివలీలా విలాసాన్ని మాత్రమే గానం చేస్తూ, ఆడి అభినయించేది. ఆమె ఒక కోతిని, కోడిని రుద్రాక్షలతో అలంకరించి వాటికి నాట్యాన్ని నేర్పి అవి చక్కగా ఆడుతూ ఉంటే చెలులతో కూడి చప్పట్లు కొడుతూ సంతోషించేది. ఇలా అన్ని వేళల సమస్తము శివాంకితంగా ఆట పాట మాటలతో చిదానందంతో సుఖంగా ప్రొద్దు బుచ్చు తున్న వేళ.... శంకరుడు ఆమె శివభక్తిని, సత్య నిష్ఠను పరీక్షింప గోరి వైశ్యుని రూపంలో ఆమె గృహానికి వచ్చాడు. శివభక్తుని రూపంలో ఉన్నాడు. చేతికి నవరత్నాలంకృతము, బహు శిల్ప చాతుర్య శోభితము అగు ఒక హేమ కంకణం అలంకారంగా ఉంది.

వచ్చిన వైశ్యుని సాదరంగా ఆహ్వానించి అతిథి మర్యాదలను ప్రీతితో చేసి.... అతని చేతి కంకణాన్ని ఇష్టంగా పలుమార్లు చూస్తూ సంభాషించింది. దానిని గమనించిన వైశ్యుడు "ఓ సుందరీ ఈ దివ్యాభరణంపై నీకు అంతగా అభిలాష ఉంటే తీసుకో ! వెల ఏమిస్తావో చెప్పు?" – అని పలికాడు. దానికి ఆ వార వనిత 'ఓ శివభక్తా ! మేము స్వేచ్ఛా సంచారుల మైన వెలయాండ్రము. వచ్చిన వారి వద్ద వెల తీసుకొని ఆ కొద్ది సేపు ఆలు (భార్య) వలె నటించెడి వార వనితలం. ఈకంకణాన్ని నాకు బహుమానంగా ఇస్తే నేను నీకు మూడు రాత్రులు, మూడు పగళ్ళు భార్యగా ఉండ గలను". అని నిశ్చయంగా పలికింది. దానికా శివభక్తుడు సరేయని "ఈ ఒప్పందానికి సూర్య చంద్రులే సాక్షి !" అని ఆమెచే ముమ్మారు పలికించి రత్న కంకణాన్ని దానితో పాటుగా ఒక రత్న లింగాన్ని కూడ ఇచ్చి ఈ లింగాన్ని మాత్రం శ్రద్ధగా రక్షించమని నొక్కి చెప్పాడు. ఆమె దానిని తన ఆట ఇంట్లో (నర్తన శాలలో) భద్రంగా దాచింది. ఆ రోజు రాత్రి శివభక్తునితో కూడి సుఖ శయనాన్ని సాగిస్తూన్న వేళ అర్ధరాత్రి అకస్మాత్తుగా నర్తన శాల నుండి పెద్ద ధ్వని పుట్టి మంటలు రేగాయి. దానికి గాలి తోడు కాగా క్షణంలో భస్మీపటలమై రత్న లింగం కూడా దగ్ధమైంది. మహానంద కోడిని, కోతిని కట్లు విప్పి రక్షించ గలిగింది కాని రత్న లింగాన్ని రక్షించ లేక దుఃఖించింది.

తన ప్రాణప్రదమైన లింగం కాలిపోగా కుములి పోతూ ఆ శివభక్తుడు "ఓ సుందరీ ! నా శివలింగం దగ్ధమైంది. నాకు జీవించాలనే ఆశ లేదు. వెంటనే చితిని ఏర్పాటు చేయి. అగ్ని ప్రవేశం చేస్తాను." అని ప్రతిజ్ఞా పూర్వకంగా పలికి ఎంత మంది నివారించినా లెక్కసేయక అగ్ని ప్రవేశం చేశాడు. దానికా వేశ్య సూర్య చంద్రులు సాక్షిగా

తానాడిన మాటను నెరవేర్చు కోలేక పోయినందుకు శోకించి మాట తప్పటం కంటే మరణమే మేలని నిశ్చయించుకొని తను కూడా చితి ప్రవేశానికి సిద్ధమైన వేళ.... దేవదేవుడు, త్రినేత్రుడు, చంద్ర కలాధరుడు అగు శంకరుడు ప్రత్యక్షమై ఆమెనిలా ఓదార్చాడు.

"ఓ సత్య సంధురాలా ! రుద్రుడనైన నేను నీ సత్య సంధతను పరీక్షింప గోరి ఇలా నా లీలను ప్రకటించాను. నేనే ఆ వైశ్యుడను నీ సత్యానికి, ధర్మానికి, ధైర్యానికి, భక్తికి సంతోషించాను. నీ కిష్టమైన వరాన్ని కోరుకో !" దానికామె పరవశించి సజల నేత్రాలతో "శంకరా ! త్రైలోక్య విషయ సుఖాల యందు నాకు ఆసక్తి లేదు. నీ పాద పద్మాలను పూజించుట యందే నాకు తృప్తి. అష్టైశ్వర్యాల కంటె అది అధికం. నా బంధువులు, చెలులు, దాసదాసీ జనం వీరందరికి నాతో పాటుగా పునరావృత్తి రహితమైన కైవల్య స్థానాన్ని ప్రసాదించు." – అని ప్రార్థించింది. శంకరుడు 'తథాస్తు' అని వారినట్లే అనుగ్రహించి రత్నలింగం అగ్ని దగ్ధమైన చోట తాను వైశ్య నాథేశ్వరునిగా అవతరించాడు. ఈ వైశ్యనాథేశ్వర ఆవిర్భావ గాథ పరమ పవిత్రము, సమస్త పాప హరము, సర్వకామదము, పుణ్య ప్రదమూను.

**ద్విజేశ్వరావతారము**

పూర్వ కాలంలో భద్రాయువు అనే రాజు ధర్మహాని లేకుండ, ప్రజలకు ఏలోటు రాకుండ, అరి వీర భయంకరుడై రాజ్యపాలన చేసుకొంటూ ఉండేవాడు. సీమంతినీ చంద్రాగదుల కుమారై ఐన కీర్తి మాలిని అతని పట్టపురాణి. అందంలో రతి, పతిభక్తిలో పార్వతి అగు ఆమె భూత దయాపరురాలు. ఒక నాడు వారిద్దరు తగు పరివారంతో కూడి వసంతకాలంలో వన విహారానికై అడవికి వెళ్ళి యథేచ్ఛగా విహరిస్తూన్న వేళ.... బ్రాహ్మణ దంపతులను భయంకరమైన పెద్ద పులి తరుముతూ కనుపించింది. వారు ప్రాణ భయంతో అరుస్తూ 'ఓ రాజా ! రక్షించు!" అంటూ కేకలు వేస్తూ పరుగెత్త సాగారు, వెంటనే భద్రాయువు విల్లెక్కు పెట్టి శరసంధానం చేసి పులిని కొట్టాడు. పర్వతం మీద పడిన వర్షధారల్లా అతని బాణాలు నిష్ఫలమయ్యాయి. పులి బ్రాహ్మణ పత్నిని నోట కరచుకుపోయింది తన కళ్ళముందే. ప్రాణప్రియ ఐన భార్యను పులి నోటకరచుక పోగా కుప్ప కూలిన బ్రాహ్మణుడు రాజుతో ఇలా అన్నాడు.

"ఓ రాజా ! ఆపదలో ఉన్న వారిని రక్షించటం క్షత్ర ధర్మం. ఆ ధర్మం నీ దగ్గర ఏదీ ? నీ చేతిలోని విల్లంబులు కేవలం ఆట వస్తువులుగా, అలంకార ప్రాయంగా మిగిలి పోయాయి. నీ అస్త్ర విద్య ఏమైంది? నువ్వు నేర్చిన క్షత్రియ కులోచిత విద్యలన్నీ వ్యర్థమయ్యాయి. ప్రజలను రక్షించ లేని రాజు చచ్చిన వానితో సమానం. ధనవంతుడై

ఉండి దానం చెయ్యని గృహస్థు, దీనులను అనాథలను రక్షించలేని పాలకుడు.... వీరిద్దరు గోడపై చిత్రించిన అరటిపండ్ల గెల వంటి వారు. క్రియా శూన్యులైన వారితో లోకానికి ఉపకార మేముంది? ఈ పైన నీకు జీవించి ఉండటం కంటె అగ్నిప్రవేశం చేస్తే మంచిదేమో ఆలోచించు !" ఇలా విషదగ్ధమైన బాణపు ములుకుల వంటి బ్రాహ్మణుని పలుకులకు భద్రాయువు మిక్కిలి చింతించి ఇలా సమాధాన మిచ్చాడు.

"ఓ బ్రాహ్మణోత్తమా ! క్షత్రియ కులానికి నింద తెచ్చిన నా జీవితం నిందింప తగినదే! నీ వాక్కులు యథార్థములే ! ఈ పైన రాజ్యంతో కాని, భార్యతో కాని మరే తదితరమైన క్షత్రియోచిత వస్త్రాలంకారాలతో నాకు పనిలేదు. నీకేం కావాలో కోరుకో! అదెంతంటి ప్రియమైన దైనా నీ హస్త గతం చేస్తాను." దానికి బ్రాహ్మణుడు నవ్వి "ఓ రాజా! ప్రస్తుతం నేను భార్యా విహీనుణ్ణి ! కనుక నీ పట్ట మహిషిని నాకు దానం చేయి!" అని కోరగానే రాజు సంభ్రమాశ్చర్య చకితుడై మాట తప్పటం మహాపాపము, నరక హేతువు కనుక పట్ట మహిషిని మంత్ర పూర్వకంగా బ్రాహ్మణునికి దానమిచ్చి తాను అగ్ని ప్రవేశం చేయటానికి నిశ్చయించు కొన్నాడు.

చితి జ్వాలలు నాలుకలు సాచి ఎగసి పడుతుండగా అగ్నికి ముమ్మారు ప్రదక్షిణం చేసి, మనసులో స్థిరంగా శివుని నిలుపుకొని మాట కొరకు ధర్మం కొరకు మంటల్లోకి దూక బోతున్న వేళ.....

పంచముఖుడు, త్రినేత్రుడు, పినాక పాణి, చంద్రకలా వతంసుడు, జటా కలాపుడు, గజచర్మాంబర ధారి, గంగాధరుడు, నాగేంద్ర హారావళీ కంఠభూషణుడు, వృషభ ధ్వజుడు అగు రుద్రుడు పార్వతీ సమేతుడై సాక్షాత్కరించి ఆ మహారాజు చేతిని పట్టుకొని నిలిపి ఇలా అన్నాడు. "రాజా ! మేమిద్దరం పార్వతీ పరమేశ్వరులం. నీ ధర్మ నిష్ఠను, భక్తిని పరీక్షింప గోరి ఇట్టి లీలను ప్రకటించాను. ఆ బ్రాహ్మణుడను నేనే ! పార్వతియే బ్రాహ్మణ పత్ని ! నీకిష్టమైన వరాన్ని అనుగ్రహిస్తాను. కోరుకో" అని ప్రీతితో పలికాడు. దానికి రాజు 'శంకరా! ఓ లోక మాతా! మీ ఇద్దరి దర్శనం కంటె కోరుకో తగిన వరం ఏముంటుంది? ఐనా నీ మాటను తృణీకరించటం ఇష్టం లేక వేడుకొంటున్నాను. నా తండ్రి అగు వజ్రబాహుడు, నాతల్లి, నేను, నా భార్య, నా సఖుడైన పద్మాకరుడను వైశ్యుడు, అతని కుమారుడగు సునయుడు మేమందరము నిరంతరము నీ సన్నిధి యందు నిలిచెదము గాక!" భర్త వెంట కీర్తి మాలిని "ఓ ఆది దంపతులారా ! ప్రత్యక్ష పార్వతీ పరమేశ్వరులైన నా జననీ జనకులకు చంద్రాగద–

సీమంతిను లకు కూడ సామీప్య సిద్ధిని ప్రసాదించండి అని కోరగా 'తథాస్తు' అని పలికి అంతర్ధాన మయ్యారు ఉమా మహేశ్వరులు. తరువాత ఆ రాజ దంపతులు మరణానంతరం శివ సాన్నిధ్యాన్ని పొందారు. ఇది పరమ పవిత్రమైన ద్విజేశ్వరావతార గాథ.

**యతి నాథ హంసావతారములు**

పూర్వం అర్బుదాచల పర్వత ప్రాంత అడవిలో ఆహుకుడనే భిల్లుడు నివసిస్తూ ఉండే వాడు. అతడు ఆ భిల్లులకు దొర. అతని భార్య పేరు ఆహుకి. మంచి నిష్ఠ గలది. ఇద్దరు శివపూజా నిరతులు. ఒక రోజున శివుడు ఆ దంపతులను పరీక్షింప గోరి యతీశ్వరుని వేషంలో వారింటికి వచ్చాడు. భిల్ల దంపతులు ఆ యతిని గొప్ప భయ భక్తులతో పూజించారు. ఇంతలో సూర్యాస్తమయం కాగా ఆ యతి రాత్రికి ఇక్కడే విశ్రమించి ఉదయాన్నే నిష్క్రమిస్తానని వేడగా అతిథి మార్యాదకు మించిన ధర్మం లేదని ఎరిగిన ఆ భిల్ల దొర అందుకు అంగీకరించాడు. రాత్రికి వెదురు బియ్యం భోజనం, పుట్ట తేనె, కొన్ని అడవి ఫలాలు, దుంపలు.... ఇలా వనంలో దొరికే వాటిని భోజనంగా సమకూర్చి, తాను రోజూ నిద్రించే మంచెను శయనీయంగా యతికి ఏర్పాటు చేసి యతి నిద్రించగానే తాను ఈవలకు వచ్చి విల్లంబులు, కత్తిని దరించి రాత్రి ఇంటి చుట్టూ ప్రహరి తిరుగు తున్నాడు.

రాత్రి చీకట్లో ఏదో క్రూరమృగం వచ్చి అతనిని భక్షించింది. అతను ఎంత ధీరుడైనా దానిని ఎదుర్కొనుటలో కృతకృత్యుడు కాలేక పోయాడు. తెల్లవారగానే నిద్రలేచి ఆ యతి భిల్లుని పిలిచే సరికి సమాధానం రాలేదు. భిల్లి, యతి ఇద్దరు ఆందోళనతో బయటకు వచ్చి చూచే సరికి భిల్లుడు లేడు సరిగదా అమంగళకర దృశ్యాలు కాన వచ్చాయి. దానికి యతి మిక్కిలి దుఃఖించాడు. ఆహుకి దుఃఖంతో కుమిలి పోతూ కూడ యతిని సమీపించి "ఓ యతీశ్వరా ! మీరు శోకించకండి! మాకు మంగళమే జరిగింది. అతిథి సేవలో ప్రాణాలను కోల్పోయిన నా పతి ధన్యుడు. స్త్రీకి పతి తోడిదే జీవితం ! చంద్రుడు లేని రాత్రి, నీరెండిన సరోవరం, విధవ రాలైన స్త్రీ బ్రతుకు "ఈ మూడు ఒక్కటే ! కట్టుట, కుడుచుట కొరకే గాక ఈ శరీరం చతుర్విధ పురుషార్థాలలో దేనిని సాధించటానికి అక్కరకు వస్తుంది ? కనుక స్త్రీలకు ఉచితము,సనాతన ధర్మము ఐన అగ్ని ప్రవేశాన్ని చేస్తాను అని నిశ్చయంగా పలికి; అగ్నిని ప్రజ్వలింప చేసి చేతులు జోడించి అగ్నికి, శివునకు స్థిర చిత్తంతో నమస్కరించి అందులోకి ప్రవేశించ బోయే సరికి ....

చంద్ర బింబానన, నీలకుంతలభార, ధవళాయ తేక్షణ, మదన సంజీవని, నాగేంద్రనిభయాన, భువన మెహన గాత్ర, గిరిరాజ కన్యక సర్వాంగ సుందరి అగు గౌరితో కూడి.... చంద్రరేఖా మౌళి, నీలగళుడు, ధవళాఖిలాంగుడు, మదనహరుడు, నాగ కుండల ధారి, భువన కర్త, గిరిరాజ నిలయుడు,సర్వ గురుడు అగు విశ్వేశ్వరుడు ఎట్ట ఎదుట సాక్షాత్కరించి "ఓ ! ధన్యులారా! నిలు! నిలు!" అని ప్రశంసించి ఇలా అన్నాడు : "ఓ పుణ్యాత్మురాలా! నీ ధర్మాచరణకు నేను ప్రసన్నుడనయ్యాను. జరిగిందంతా నా లీల ! నీ భర్త ఇడుగో ! మరుజన్మలో నీ పతి నిషధ రాజైన వీర సేనునికి తనయుడై పుట్టి నలుడు అను పేరుతో విఖ్యాతు డవుతాడు. నీవు విదర్భ రాజైన భీమరాజు కుమార్తెవై జన్మించి సకల సద్గుణ రాశివై దమయంతి అను పేరుతో ప్రసిద్ధిని పొంది.... మీ ఇద్దరు భార్యా భర్తలవుతారు. నా అంశంతో వచ్చిన ఈ యతి మరుజన్మలో హంసయై జన్మించి మీ ఇద్దరికి ప్రీతి పూర్వకంగా సంధానం చేసి మీ ప్రణయాన్ని పండించ గలడు. మీ చరిత త్రిలోక పావన మవుతుంది. కలి కల్మష నాశన మవుతుంది. మహారాజ భోగాలను అనుభవించి ఆపై ముక్తులవుతారు.

ఇలా ఆ భిల్ల దంపతులకు వరాలిచ్చి శంభుడు స్వయంగా లింగ రూపాన్ని పొందాడు. భిల్ల దంపతులు ధర్మాన్ని తప్పలేదు కనుక ఆ లింగానికి అచలేశ్వరుడు అను పేరు కలిగింది. ఇలా భూలోక వాసులకు మేలు చేసి శివ పార్వతులు అంతర్హితులయ్యారు. ఈ గాధ పరమ పవిత్రమైనది.

### కృష్ణ దర్శనావతారము

శ్రాద్ధ దేవుడను మనువుకు ఇక్ష్వాకువు మొదలుగా చాలా మంది పుత్రులున్నారు. అందులో నభగుడు తొమ్మిదవ వాడు. అతని కుమారుడు నాభగుడు. అతని కుమారుడే అంబరీషుడు. నభగుడు బుద్ధిమంతుడు విశేషించి శివజ్ఞానం కలవాడు. అతను విద్యాభ్యాసం నిమిత్తం గురుకులానికేగి అచట ఆశ్రమ ధర్మాన్ని పాటిస్తూ జితేంద్రియుడై చాలా కాలం అక్కడ ఉండి పోయాడు. ఈ లోపులో అతని సోదరులు అతని రాజ్య భాగాన్ని అతనికీయ కుండ తమలోతాము పంచుకొని రాజ్యపాలన చేస్తూ వస్తారు. కొంత కాలానికి బ్రహ్మచారి అగు నభగుడు సాంగో పాంగంగా వేద శాస్త్రాదుల నభ్యసించి గృహానికి వచ్చి తన రాజ్యభాగాన్ని తన కిమ్మని సోదరులను అడిగాడు. దుష్ట తలంపుతో వారిలా సమాధాన మిచ్చారు. "ఓ నభగా ! బ్రహ్మచర్యము, తపస్సు, వేదాధ్యయనము ఇట్టి బ్రాహ్మణోచిత ధర్మములు నీ కిష్టం అనే ఉద్దేశంతో నీకు రాజ్యంలో

భాగం విభాగించ లేదు. ఐనా నీవు కోరావు కనుక నీ తండ్రి అగు శ్రాద్ధ దేవుని బరువు బాధ్యతలను నీ భాగంగా తీసుకో! చక్కగా పితృసేవ చేసుకో.

సోదరుల మాటలకు విస్మితుడై నభగుడు తండ్రిని చేరి విషయాన్ని విన్నవించగా ఆయన ఆశ్చర్యపడి సత్యధర్మ నిష్ఠుడైన కుమారునితో ఇలా అన్నాడు : "పుత్రా ! వారి మోసపు మాటలను లెక్కచేయకు. తల్లి దండ్రుల సేవ దాయభాగం లోనికి రాదు.

నీకు జీవనోపాయాన్ని చెపుతాను విను. ఇప్పుడు సరస్వతీ నదీ తీరంలో అంగిరో వంశోద్భవులైన బ్రాహ్మణులు సత్ర యాగాన్ని అనుష్ఠిస్తున్నారు. వారు ప్రతిషష్ఠాహస్సు (ఆరవ రోజు) నందు చేయ దగిన కర్మ విషయంలో దారి తెలియక కొట్టు మిట్టాడుతున్నారు. నువ్వు వెళ్ళి వారికి సరియైన శ్రౌతజ్ఞానాన్ని ఇచ్చి, రెండు వైశ్వదేవ సూక్తాలను పఠించు. దాని వలన కర్మ లోపం లేకుండ సత్రయాగం పూర్తవుతుంది. నీ మనోరథం నెరవేరుతుంది."

పితృవాక్య పాలనా తత్పరుడైన నభగుడు సరేయని సత్రయాగం జరుగుతున్న స్థలానికి వెళ్ళి బ్రాహ్మణుల శంకలను తీర్చి రెండు వైశ్వదేవ సూక్తాలను సుస్వరంతో, స్పష్టంగా, శుద్ధంగా పఠించాడు. ఆ విధంగా సత్రయాగం పరిపూర్ణంగా పూర్తి అయి నందుకు సంతోషించిన ఆంగిరస బ్రాహ్మణులు స్వర్గానికి వెళ్ళి పోతూ మిగిలిన యజ్ఞ సంపదను నభగునకు ఇచ్చి వేశారు. అతనా సంపదను స్వీకరిస్తూండగా శివుడు అతని నిష్ఠను పరీక్షింప నెంచి కృష్ణదర్శనుడను పేర పురుష రూపంలో సాక్షాత్కరించి ఇలా అన్నాడు: "ఓ నభగా ! యజ్ఞంలో మిగిలి పోయిన వస్తు రూప మైన సంపద నాది. నువ్వెందుకు పరిగ్రహించి పట్టుకొని వెడుతున్నావు చెప్పు?" దానికి నభగుడు విస్మితుడై "ఓ కృష్ణ దర్శనా! (నల్లని కన్నులు గలవాడా!) ఈ సంపదను ఋషులు నాకిచ్చారు! నీవెందుకు నివారిస్తున్నావు? చెప్పు?" వారిద్దరి మధ్య వివాదం ముదరగా "ధర్మపరుడు, యోగ్యుడు.... అయిన నీ తండ్రిని అడిగి ఈ విషయాన్ని తేల్చుకో!" అని కృష్ణదర్శనుడు పరిష్కారాన్ని సూచించగా నభగుడు తండ్రిని చేరి జరిగిన దానిని చెప్పి ధర్మ నిర్ణయం చెయ్యమన్నాడు.

దానికి శ్రాద్ధదేవుడిలా అన్నాడు: "కుమారా ! ఆ పురుషుడు సాక్షాత్తు శివుడే ! సందేహం లేదు. ఈ సృష్టికంతకు ఆయనే విభుడు ! ప్రభుడు ! విశేషించి యజ్ఞం పరిసమాప్తి అయ్యాక మిగిలిన వస్తు సంబారాలకు 'రుద్రభాగములు' అని పేరు. కనుక వాటికి ఆయనే యజయాని ! వెళ్ళు ! ఆయనను ప్రసన్నుని చేసుకో ! నీకు మేలు జరుగుతుంది.

ఆ మాటలను పాటించి నభగుడు కృష్ణ దర్శనుని వద్దకు వచ్చి తండ్రి పలుకులను చెప్పి ఇంకా ఇలా అన్నాడు : "హేరుద్రా ! సర్వులు చిట్ట చివరకు నిన్ను చేరుకొన వలసిన వారై ఉండగా నీది కానిదేముంది! ప్రాణాలే నీ అధీనమై ఉండగా వాటిపై ఆధార పడిన దేహాలు నీ అధీనం కావా ! విరించి మాధవులు వారి సత్యలోక వైకుంఠాలు భస్మీభూతమై వారందరు చివరకు నిన్ను చేరవలసిన వారే గదా ! మానవుల లెక్కేమిటి ? జగత్తంతా రుద్రభూమి. చివరకు మిగిలేది భస్మరాశి. ఆ భస్మ సింహాసనం మీద యోగ నిష్ఠలో ఉంటావు ! నన్ను కరుణించు !".

అతని పితృభక్తికి, సత్యనిష్ఠకు సంతుష్టుడై రుద్రుడు స్వస్వరూపంతో సాక్షాత్కరించాడు. ఇంతలో విష్ణుబ్రహ్మేంద్రాది దేవతలు కూడా వచ్చి శంకరుని స్తుతించారు. శంభుడు ప్రసన్నుడై, కృపాపరుడై నభగుని వీక్షించి "వత్సా ! నీవు బ్రాహ్మణ ధర్మాలను పాటిస్తూ అహింసా వ్రతుడవై జీవించు. హింసా పరులకు నరకం తప్పదు. అన్ని జంతువుల పాదాలు ఏనుగు పాదంలో ఇమిడినట్లు అన్ని ధర్మాలు అహింసలో ఉన్నాయి. దైన్యంలేని జీవితాన్ని నీకు అనుగ్రహిస్తున్నాను. మరణానంతరం నా సన్నిధికి రాగలవు!" ఇలా పలికి అదృశ్యుడయ్యాడు శంకరుడు. ఈ అవతార రహస్యాన్ని దాని సందేశాన్ని అర్థం చేసికొన్న విజ్ఞుడు తప్పక మంచి కవి, మంత్రవేత్త అవుతాడు. ఉత్తమ గతిని పొందుతాడు.

**భిక్షువర్యావతారము**

పూర్వం సత్యధర్మ పరాయణుడు, శివదీక్షాపరుడు అగు సత్యరథుడనే రాజు విదర్భదేశాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఒక నాడు బల గర్వితుడైన శాల్వరాజు పెద్ద సైన్యంతో వచ్చి విదర్భ రాజధానిని ముట్టడించాడు. ఇద్దరి మధ్య భయంకరమైన యుద్ధం జరిగింది. యుద్ధంలో తన సేన నశింపగా తాను కూడా నేలకొరిగాడు....సత్యరథుడు. శత్రుసైన్యం అంతఃపురాన్ని పట్టుకొనటానికి ముందుకు వస్తూన్నదని ఎరిగి గర్భవతి అగు అతని పట్టపురాణి రహస్యమార్గం ద్వారా బయటపడి అడవిలో ఒక శిథిల శివాలయం చెంతకు చేరుకొంది. కొంత కాలానికి నెలలు నిండగా దైవానుగ్రహంచే సర్వ శుభలక్షణ సంపన్నుడైన కుమారుని కన్నది. పుత్రోత్సాహన్ని పొంది తానెవరో ఎవరికీ తెలియకుండ బాలుని పెంచుకొంటూన్నది రాణి. ఒక రోజున చెంతనే ఉన్న నదిలో స్నానం చేస్తూండగా ఆమె మొసలి నోట పడింది. ఇక్కడ అల్లారు ముద్దుగా పెరగ వలసిన బాలుడు శిథిల శివాలయంలో దిక్కులేక పడివుండి ఆకలికి తాళలేక ఏడుస్తున్నాడు. వర్షంకోసం ఎదురు చూస్తున్న జాతకపక్షిలా తల్లి కొరకు దిక్కులు చూస్తూ

ఆక్రోశిస్తున్నాడు. కష్టాలు కడలి తరంగాల వలె ఒకదాని వెంట మరొకటి వస్తాయి కాబోలు ! బంగరు తూగుటుయ్యలలో ఊగుతూ పెరిగి పెద్దవాడై రత్న సింహాసన్నాన్ని అధిష్ఠించి రాజ్యమేలవలసిన బాలుడేమి ! దిక్కుమాలిన వాడై ఆక్రోశించటమేమి !

దేవాలయం శిథిలమైనా శివుడు శిథిలం కాదుగా ! మానవుడు ఎన్ని కష్టాలలో చిక్కుకొన్నా బ్రతుకు మీది ఆశ చావకుండ మినుకు మినుకు మంటూ ఆశాజ్యోతిని మిగిల్చే ఉంచుతాడు శంకరుడు. ఇంతలో విధిప్రేరితయై ఒక భిక్షురాలు తన బిడ్డతో కూడి ఆ దారిలో వెడుతూ శిశువు రోదనాన్ని విని ఆ బాలుని ఎత్తుకొని ముద్దాడి పాలిచ్చి ఓదార్చింది. తేజశ్శాలి ఐన ఆ బాలుని జన్మవృత్తాంతం తెలియక ఆ బ్రాహ్మణ స్త్రీ కొట్టు మిట్టాడుతూ; ఎవరి బాలుడా అని దిక్కులను పరికిస్తూ; ఎవరైనా వస్తారేమో అని ఎదురు చూస్తూన్న వేళ......

శంభుడు భిక్షుక రూపంలో సాక్షాత్కరించి "ఓ యువతీ! మనస్సులో శంకను వీడి ఈ బాలుని నీ కుమారుని వలె పెంచు. ఈ బాలుని నిమిత్తంగా నీకు శీఘ్రంగా శ్రేయస్సు కలుగుతుంది" అని ఆదేశించాడు. దాని కామె "ఓ బిక్షుకా అసలు నీవెవరు? ఈ శిశువెవరు? ఈ శిశువు జన్మ వృత్తాంతం ఏమిటి ? ఈ పిల్లవానిని నేను తీసికొని వెళ్ళి పెంచితే రాజభటులు నాపై అపహరణ నేరాన్ని మోపి నన్ను ఉరితీస్తే నా కుమారుడు కూడ అనాథ అవుతాడే అని శంకించింది.

సందర్భోచితమైన ఆమె పల్కులకు శంకరుడు సంతోషించి "ఓ దయామతీ ! నేను సర్వజ్ఞుడైన శంకరుడను ! నా సంకల్పం చేతనే నువ్వు ఇక్కడకు వచ్చావు. ఈ బాలుని తీసుకొని వెళ్ళి పెంచు అని పల్కి తన నిజరూపాన్ని చూపించాడు. పిమ్మట ఆ బాలునికి సంబంధించిన సమస్తమైన వృత్తాంతాన్ని ఆ బ్రాహ్మణస్త్రీకి వివరించాడు. తక్షణం ఆమె శంకరుని కాళ్ళపై పడి కళ్ళకద్దుకొని "ఓ పార్వతీపతీ ! ఒకదాని వెంట మరొకటి అలా ఇన్ని దురదృష్టకర సంఘటనలు ఈ బాలుని విషయంలో సంభవించటానికి గల కారణాలేమిటి? నా ఈ కుమారుడు అత్యంత దరిద్రుడుగా విధవరాలైన బిచ్చగత్తె గర్భాన జన్మించటానికి హేతువేమిటి?" – అని ప్రశ్నించింది.

ఈశ్వరుడు ఆమెకిలా ప్రత్యుత్తర మిచ్చాడు : "ఓ కరుణామూర్తీ ! మానవుల చావు, పుట్టుకలకు సుఖదుఃఖాలకు వారుచేసుకొన్న సుకృత దుష్కృతాలే కారణం. మనస్సు చేత ఆలోచించేది, వాక్కు చేత పలికేది, కర్మేంద్రియాల చేత చేసేది... ఈ మూడు మనోవాక్కాయ

కర్మలని పిలువ బడుతాయి. ఆ కర్మలే మానవులు జీవితంలో అనుభవించే సుఖ దుఃఖాలకు కారణ మవుతున్నాయి. బీజములవుతున్నాయి. ఈశ్వరుడనైన నేను ఈ విషయంలో నిమిత్త మాత్రుడను. మంచి పనులు చేసేటప్పుడు కష్టంగాను ఫలానుభవ కాలమందు ఆహ్లాదకరంగాను ఉంటాయి. చెడ్డ పనులు ఆచరణ కాలమందు ఆహ్లాదకరంగాను ఫలానుభవ కాలమందు కష్టంగాను ఉంటాయి. కర్మ అంటె ప్రయత్నమే! భౌతిక ప్రపంచంలో ప్రయత్నం లేకుండ ఫలసిద్ది ఉంటుందా? ఫలకాంక్ష లేని ప్రయత్నం ఉంటుందా? ఫలసిద్ధి ఎప్పుడూ సుఖ దుఃఖ రూపంలోనే ఉంటాయి అవి తప్పవు. ఆచరణ కాలమందు అనాలోచితంగా చేసి అనుభవ కాలమందు దుఃఖిస్తే ప్రయోజనమేమిటి ?

ఈ రాకుమారుని తండ్రి అగు సత్యరథుడు పూర్వ జన్మలో పాండ్య రాజై ప్రజా రంజకంగా పరిపాలన చేస్తూ... పూర్వాపరాలను విచారించకుండ మహాక్రోధంతో నిరపరాధి ఐన సామంత రాజును ఉరి తీయించాడు. ఆ సామంత రాజు చేతిలోనే ఇప్పుడు హతుడయ్యాడు. పూర్వజన్మలో ఆ పాండ్యరాజు పుత్రుడే ఈ బాలుడు. ఈతని తల్లి పూర్వ జన్మలో తన సవతిని మోసంచే విషప్రయోగం చేసి చంపించింది. ఇక నీ కుమారుడు పూర్వ జన్మలో ఉత్తమమైన బ్రాహ్మణ జన్మను పొంది కూడ వర్ణాశ్రమాచార ధర్మాలను విడనాడి అతి నీచులైన వారివద్ద నుండి నీచ ద్రవ్యాన్ని దానములుగా స్వీకరించి ప్రాయశ్చిత్తాది కర్మలను విడిచి జీవించిన కారణంగా .... ఇప్పుడీ జన్మను పొందాడు.” ఇలా చెప్పి అంతర్ధానమైనాడు శంకరుడు.

ఆ బ్రాహ్మణ స్త్రీ ఇద్దరు బాలకులను తీసికొని ఏక చక్రపురాన్ని చేరుకొని అక్కడ నివాసమూంటూ, యుక్తవయసు రాగానే వారిద్దరకు ఉపనయనాది సంస్కారాలను జరిపించింది. వారికి నిత్యము శివలీలలను వినిపిస్తూ వారిచే శివ గాథలనే గానం చేయిస్తూ వారిని గొప్ప శివభక్తులుగా తీర్చి దిద్దింది. బ్రాహ్మణ బాలకునికి బ్రాహ్మణోచిత విద్యలను, క్షత్రియ కుమారునికి క్షత్రియోచితమైన విద్యలను ప్రయత్న పూర్వకంగా అతికష్టం మీద నేర్పించింది. వారిద్దరు గురువులను క్లేశ పెట్టక శీఘ్రంగా సమస్త విద్యలను నేర్చుకొని వాటిలో పరిపూర్ణులయ్యారు. బ్రాహ్మణ బాలుడు యుక్త వయసు రాగానే వివాహం చేసికొని ఆదేశపు రాజు వద్దనే రాజ పురోహితునిగా కుదిరాడు. క్షత్రియ కుమారుడైన ధర్మగుప్తుడు తనకు అన్న వంటి బ్రాహ్మణ బాలుని సహాయంతో ఆదేశపు రాజుయొక్క సైన్య సహాయాన్ని పొంది తానే స్వయంగా సేనను నడిపించి, శాల్వరాజును ఓడించి వంశపరంపరా గతమైన

విదర్భ రాజ్యాన్ని పొంది సత్య, ధర్మాలను తప్పకుండ రాజ్యపాలన చేశాడు. ఇది శివలీలలను తెలిపే భిక్షువర్యావతార గాథ.

**సురేశ్వరావతారము**

పూర్వం వ్యాఘ్రపాదుడనే ముని ఉండేవాడు. అతను గొప్ప శివపూజా దురంధరుడు. అతని కుమారుడు ఉపమన్యుడు. సత్పురుషుడు, బుద్ధిమంతుడూను. అందరికి ఇష్టుడు. అతని తల్లి కాలం కలిసి రాక దరిద్ర బాధచే బాలునితో కూడి పుట్టింటిలో ఉంటూ వచ్చింది. ఒకనాడు మేనమామ ఇంటిలో పెరుగుతున్న బాలునికి; తల్లి ఇచ్చిన పాలు సరిపోని కారణంగా మరి కొంచెం ఇమ్మని తల్లిని లాలనగా అడిగాడు. జాలిగా అడిగిన కుమారుని చూచి.... గ్లాసుడు పాలు సైతం ఇచ్చుకోలేని తన దుస్థితికి వగచి.... ఆ తపస్విని ఇంటి లోపలికి వెళ్ళి ఒక మంచి ఉపాయాన్ని ఆలోచించింది. తను ఉంఛ వృత్తిచే సంపాదించిన గింజలను పిండి చేసి ఆ పిండిని నీళ్ళతో కలిపి పుత్రునకు ఉపలాలిస్తూ ఇచ్చింది. తల్లి ఇచ్చిన ఆ పిండి పాలను త్రాగి 'ఇవి పాలు కావు ! నాకు నిజం పాలు కావాలి' అంటూ ఏడ్వసాగేడు. పార్వతీ దేవి వంటి ఆ తల్లి ఒకే ఒక్క పుత్రునికి సైతం పాలిచ్చు కోలేని తన లేమికి వగచి; రెండు చేతులతో బాలుని దగ్గరకు తీసికొని కన్నీటిని తుడిచి ఇలా బాలబోధ చేసింది.

"కుమారా ! పరాధీనులమై బ్రతుకుతున్న మనకు పాలెక్కడ లభిస్తాయి నాయనా? మన బోటి దైవోపహతులైన వారికది దుర్లభం ! దేనికైనా పెట్టి పుట్టాలి ! సర్వమునకు ఈశ్వరుడే కర్త! ఆయన అనుగ్రహం లేనిదే చివరకు గ్లాసుడు గంగ కూడ లభించదు. పూర్వ జన్మలో శంకరుని ఉద్దేశించి ఎంత ఆరాధన చేశామో.... మనకు అంత మాత్రమే లభిస్తుంది."

తల్లి మాటలను శ్రద్ధతో విన్న ఉపమన్యుడు దుఃఖానలంతో కుమిలిపోతున్న ఆమెను చూచి మాతృవాత్సల్యంతో ఇలా అన్నాడు: "అమ్మా ! ఎందుకు ఏడుస్తావు ! పాలేమైనా పరమార్థానికి దారి చూపించే వస్తువా ? ఏదో రుచిగా ఉంటుంది కనుక జిహ్వా చాపల్యం చేతను, బాల్య చాపల్యం చేతను నీ యందలి చనవు చేతను అడిగాను. శివుని అనుగ్రహం ఉంటే అన్నీ ఉన్నట్లే అని గదా చెప్పావు ! సరే! అట్టి శివానుగ్రహం కొరకే తపస్సు చేస్తాను. నువ్విప్పుడు పిండి కలిపిన పాలను ఇచ్చావు. నేను శంకరుని మెప్పించి క్షీర సముద్రాన్ని గుప్పెడు పిండిగా చేసి ఆ పిండిని భక్షించి వస్తాను." ఆ బాలుడు ఇలా పలికి మాతృమూర్తి ఆశీర్వచనాన్ని పొంది పరమోత్సాహంతో నమక చమకాలను పారాయణ చేసుకొంటూ గృహాన్ని విడిచి హిమాలయాలకు చేరుకొన్నాడు. దారిలో ఎన్నో శివస్తోత్రాలను పఠించాడు.

సగం తపస్సు అప్పుడే పూర్తయింది. అసహాయుడైన బాలునికి రుద్ర స్వరూపులైన సూర్య చంద్రులు సహాయంగా శిరసుపై వెల్ల గొడుగై నిలిచి వెంట నడిచారు.

అలా నడిచి శీత నగానికి వచ్చి పృధ్వి శాంత గంధాన్ని పరిమళించే చోట, మందానిలం సుగంధ బంధురమై వీచే చోట, జలాలు సుడులు నురుగులు లేకుండ స్వచ్ఛంగా పారే చోట, క్రిమి కీటకాలు లేని సత్త్వ గుణావహమైన భూమి మీద ఉచితాసనా సీనుడై ఎనిమిది ఇటుకలను పీఠంగా పేర్చి దానిపై మృణ్మయ లింగాన్ని స్థాపించి ఆ లింగము నందు పార్వతీ పరమేశ్వరులను ఆహ్వానించి తపస్సుకు ఉపక్రమించాడు. పంచాక్షర మంత్రాన్ని పఠిస్తూ నియతాహారుడై ఆయా ఋతువులలో లభించే పత్ర పుష్ప ఫలాలను నైవేద్యంగా సమర్పిస్తూ.... ఇంద్రియాలను అంతర్ముఖం చేసికొని, చిత్త వృత్తులను అరికట్టి, మనోలయాన్ని సిద్ధింప చేసికొని ఏకాగ్రమైన మనస్సుతో బుద్ధి యందు పార్వతీ పరమేశ్వరులను స్థిరంగా నిల్పి అనన్య భక్తితో తనను తాను మరిచి ధ్యానించటం మొదలు పెట్టాడు.

మనస్సుకు ఏ మాలిన్యమూ అంటని ఆ బాలుని తపస్సుకు లోకాలన్నీ ...... కౌముదీ ధావళ్యంతో, తెల్లని సూర్యకాంతి వంటి చల్లని వెలుగుతో, జగన్మాత సుందర మందహాసం వంటి కాంతులతో వెలిగి పోయాయి. కర్పూరపు రాశులలో వెన్నను మెదిపి, వెన్నెల నీరుతో తడిపి, ఐరావతంచే మట్టించి... ఆ సుధను దిక్కులనే గోడలకు పూసినట్లు; బాలుని సాత్త్విక తపః తేజస్సుకు ద్విజ్మండలం ధవళ కాంతులతో వెలిగి పోయింది. సుధా ధవళితమైన అష్ట దిక్కులే దళములుగా, విచ్చు కొన్న అష్టదళ పుండరీకంగా (తెల్ల తామరలా) వియత్తలం ......వేలుపులకు సైతం వెరగు కలిగించింది. ఇదంతా బాలుని సాత్త్విక గుణ సంపన్నమైన తపఃప్రభావమే ! బాలుని తపస్సుకు ఇంద్రో పేంద్ర పితామహాది దేవతలు విస్మితులై శంకరుని సమీపించి కుమారునిపై కరుణ చూపమని వేడగా బాలుని మనో గతాన్ని ఎరిగిన శంభుడు; పార్వతి శచీదేవి రూపాన్ని దాల్చగా తాను ఇంద్ర రూపాన్ని పొంది సాక్షాత్కరించి అనునయంగా ఇలా అన్నాడు: “వత్సా ! నీ తపస్సుకు సంతసించాను. స్వర్గాధిపతి ఐన ఇంద్రుడను నేను ! నీ కోర్కెలన్నిటిని తీరుస్తాను. సందేహం లేదు కోరుకో!”.

దానికి ఆ బాలుడు “శివుని యందు మాత్రమే నిశ్చల మైన భక్తిని కోరుకొంటున్నాను” అని దృఢంగా సమాధాన మిచ్చాడు. ఇంద్రుడిలా అన్నాడు : “కుమారా ! సర్వదేవతా నమస్కృతుడనగు ఇంద్రుడను నేను ! నీవు సర్వదా నా భక్తుడవై నన్ను ఆరాధించు. దేవతలందరిలోను అధికుడను నేను. నిర్గుణుడైన రుద్రుని విడిచిపెట్టు. అతడు దేవతల నుండి బహిష్కరింపబడిన వాడు. పిశాచ గణాధిపతి.”

తన తపస్సుకు విఘ్నాన్ని కలిగించడం కొరకు వచ్చిన ఇంద్రునితో బాలుడిలా అన్నాడు: 'ఓ సకల దేవతా సార్వభౌమా ! విను ! రుద్రుడు అందరికి ప్రభువు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు తండ్రి. ప్రకృతికి అతీతుడు. ఆయన కార్య కారణ స్వరూపుడు. నిత్యుడు, అద్వితీయుడు, బహురూపుడు. హేతువాదానికి లొంగడు. జ్ఞానయోగ ఫలమైన మోక్షాన్ని ఇచ్చేవాడు ఆయనే. గుణాతీతుడు. సర్వవ్యాపి, ఆయనే పరమాత్మ ! ఆయనను మించిన తత్త్వం లేదు. నాకు శివుడే వరమిచ్చుగాక! ఓ ఇంద్రా నా నిర్ణయాన్ని చెపుతున్నాను విను. శివ నిందను విన్న వ్యక్తి వెంటనే నిందించిన వానిని చంపి పిమ్మట తాను దేహత్యాగం చేసుకొనాలి. ఇది సనాతనమైన శైవ ధర్మం. నేనిప్పుడు ఆపనే చేస్తున్నాను. శివాస్త్రంచే నిన్ను సంహరించి నేను దేహత్యాగం చేస్తాను."

ఇలా ప్రతిజ్ఞా పూర్వకంగా పలికి శివలింగం పీఠం నుండి భస్మను తీసికొని అఘోరాస్త్రంతో అభిమంత్రించి పాకశాసనుని పైకి ప్రయోగించాడు. తన ఇష్ట దైవాన్ని స్మరించి ఆగ్నేయాస్త్రాన్ని ధారణ చేసి తన దేహాన్ని అగ్నికి అర్పించడం కొరకు సిద్ధపడ్డాడు. తక్షణం శివుడు ఇంద్రరూపాన్ని విడిచి సౌమ్యమైన నిజరూపాన్ని ధరించి ప్రత్యక్షమై అఘోరాస్త్రాన్ని శాంతింప చేసి, ఆగ్నేయాస్త్రాన్ని శమింప చేశాడు. బాలుడు ఆనంద తరంగాలు ఉప్పొంగగా పార్వతీ పరమేశ్వరులకు సాష్టాంగ ప్రణామాలను ఆచరించి స్తుతించాడు. శంకరుడు ఆ బాలుని దగ్గరకు తీసుకొని ఇలా ఆశీర్వదించాడు: "ఓ ఉపమన్యూ! నీ భక్తికి, తపస్సుకు సంతోషించాను. నీకు, నీ వారందరికి భక్ష్య, భోజ్యాది సమస్త వస్తువులు ఏ లోటు లేకుండ లభ్యమవుతాయి. నీకు అమరత్వాన్ని, శాశ్వతమైన గణాధ్యక్ష పదవిని ఇస్తున్నాను. పాశుపత వ్రతాన్ని, వ్రతంతో ఈశ్వరుని పొంద గలిగే జ్ఞాన యోగాన్ని, ప్రవచన శక్తిని, నా సాన్నిధ్యాన్ని, వరాలుగా నీకిస్తున్నాను. యోగశక్తిని, నిత్యానందమును, అవినాశి అగు బ్రహ్మ విద్యను నీకిస్తున్నాను. కుమార పదమును ఇస్తున్నాను.

నీవు జరామరణాదులు లేని వాడవు, దుఃఖ రహితుడవు, సర్వ పూజ్యుడవు, నిర్వికారుడవు, భక్త ప్రవరుడవు అవుతావు! నీ గోత్రం శాశ్వతంగా వర్ధిల్లుతుంది. నీ ఆశ్రమంలో నిత్యము నివసిస్తాను." ఇలా పల్కి క్షీరసాగర సారాన్ని వెన్న ముద్దగా చేసి బాలుని నోటికి అందించి తినిపించాడు.పార్వతి కూడ బాలుని చేరదీసి లాలించి అక్షయ కుమార పదాన్ని ఇచ్చింది. ఉపమన్యుడు చేతులు జోడించి స్థిరమైన శివభక్తిని అను గ్రహించమని ప్రార్థించాడు. 'తథాస్తు' అని పలికి గిరిజా శంకరులు అంతర్ధాన మయ్యారు. బాలుడు గృహానికి వచ్చి

తల్లికి జరిగిన వృత్తాంతాన్ని చెప్పి ఆమెను సంతోష పెట్టాడు. ఇది శివుని పవిత్రమైన సురేశ్వరావతార గాథ."

**జటిలావతారము**

పార్వతి తపశ్చర్యలో ఉండగా శివుడు బ్రహ్మచారి రూపంలో వెళ్ళి ఆమె మనస్సంకల్పాన్ని, దృఢత్వాన్ని, చిత్తస్థైర్యాన్ని, ఏకాగ్రతను, ప్రేమ నిష్ఠను పరీక్షించాడు. ఛత్రాన్ని, దండాన్ని పట్టుకొని జటాధారియై పార్వతి ముందు సాక్షాత్కరించిన శివుని స్వరూపమే 'జటిలావతారము.' ఆ బ్రాహ్మచారి రూపం ..... పరమ సుందరము, మనోహరమూను. ముద్దులు మూటకట్టే రూపం అది ! అతిలోక లావణ్యం! ఆహా! ఏమా సౌందర్యం ! జగత్త్రయాన్ని క్షణంలో సమ్మోహనంలో ముంచగల దివ్య తేజో రూపమది. ఉపాసకులకు సన్నిహిత మైనది ! అతి ప్రియమైనది. లోకంలో మర్త్యులలో సైతం బ్రహ్మచారి రూపం బహు ఆకర్షణీయ మైనది. దానికి పరమేశ్వర తేజం కూడితే ఎంత లోక సమ్మోహనంగా ఉంటుందో భావించండి ! ఈ జటిలావ తారాన్ని ఉపాసిస్తే కోరికలన్ని నేర వేరుతాయి. చిత్త శాంతి లభిస్తుంది. తప్పక ఆరోగ్యం సిద్ధిస్తుంది.

**నటావతారము**

పార్వతి తీవ్ర తపశ్చర్యలో మునిగి ఉండగా శివుడు సాక్షాత్కరించి ఆమె అభీష్టానికి తన సమ్మతిని తెలియజేసి చేయి పట్టుకొని కైలాసానికి రమ్మన్నాడు. అందుకామె తన తల్లిదండ్రులైన మేనకా హిమవంతుల అనుజ్ఞగైకొని యథావిధిగా పరిణయ మాడి తీసుకొని వెళ్ళమని కోరింది. ఆ సందర్భంలో శివుడు మహా నటుడై సాక్షాత్కరించి తన చారీ కరణ అంగహార పిండీబంధాది నాట్య విన్యాసాలచే మేనకా హిమవంతులను మెప్పించి పార్వతిని తనకు పత్నిగా ఈయవలసిందని భిక్షుకుడై యాచించాడు. ఆ సందర్భంలో ఆయన ధరించిన అవతారమే ఈ 'నటావతారము'. ఈ అవతారం చాలా విశిష్టమైనది. ఇందులో చతుర్ధశ భువనాలతో కూడిన సృష్టి అంతా ఆయన విరాట్ స్వరూపమే ! కవులకు, కళాకారులకు, పండితులకు, శాస్త్ర విద్వాంసులకు, వేద వేత్తలకు ఆరాధనీయమైనది...... ఈ అవతారం. ఎంత వ్యాఖ్యానించినా తరగని లోతైన తత్త్వ బోధతో కూడిన ఇలాంటి అవతారం మరొకటి లేదు. ఈ సృష్టి అంతా ఆయన తాండవమే ! ఈ అవతారమే నృత్యవిలాసి, నటరాజు అను పేర్లతో విఖ్యాతమైంది. ఈ నటావతారాన్ని గురించి 'రుద్ర సంహిత పార్వతీ ఖండం'లో చెప్పాను. ఇది పవిత్రమైనది.

**ద్విజావతారము**

పార్వతీ పరిణయానికి ముందు శంకరుడు కపట వైష్ణవ బ్రాహ్మణ వేషంలో మేనకా హిమవంతులను కలుసుకొని తన

నివాసాన్ని, వేష భూషాదులను, పరివారాన్ని, సుగుణాలను, సమస్తమైన ఐశ్వర్యాన్ని వ్యతిరేకంగా అన్వయించి చెప్పి వారి మనస్సులలో శంకా బీజాలను నాటాడు. ఆనాటి సాధు ద్విజావతారమే ఈద్విజావతారం. దీనిని గురించి కూడ మీకు 'రుద్ర సంహిత – పార్వతీ ఖండం'లో చెప్పాను. ఇది పవిత్రమైనది.

**అశ్వత్థామావతారము**

దేవ గురువైన బృహస్పతి అంశ వలన భరధ్వాజ మహర్షికి ద్రోణుడను కుమారుడు కలిగాడు. ద్రోణుడు అయోనిజుడు. ఆయన గొప్ప స్వాభిమానము కలవాడు. ధనురాచార్యులలో శ్రేష్ఠుడు. శూరుడు, చతుర్వేద పారంగతుడు. అస్త్రవిద్యా దురంధరుడు. ధనుర్వేదంలో, వేదంలో ఆయనకు తెలియని విషయం లేదు. కఠినమైన తపస్సును చేసి అగ్ని వేశుని వద్దనుండి, పరశురాముని వద్దనుండి ధనుర్వేద రహస్యాలను నేర్చాడు. తీవ్రమైన తపస్సుచే శంభుని మెప్పించి ఆయన అనుగ్రహంచే రుద్రాంశ సంభూతుడు, ఒరులచే జయింపబడని వాడు, మహా బలశాలి చిరంజీవి ఐన పుత్రుని వరంగా పొందాడు. ఆ కుమారుని పేరు అశ్వత్థామ. తండ్రీ, కొడుకులిద్దరూ మహాభారత యుద్ధంలో ధుర్యోధనుని పక్షాన పోరాడారు. అశ్వత్థామ ఒక్కడు....ద్రోణ కర్ణులిద్దరి కంటె పాండవ సైన్యానికి ఎక్కువ నష్టాన్ని కలిగించాడు. అదీ అతని పరాక్రమం. రుద్రతేజోద్భవుడు కదా! భీష్ముడు సైతం అశ్వత్థామ సహాయంతోనే యుద్ధం చేశాడు. వీరులైన పాండవులు అశ్వత్థామను గురించి భయపడ్డారు కాని భీష్మ ద్రోణ కర్ణులను గురించి కాదు. భీష్మద్రోణులు వయో వృద్ధులు! కర్ణుడు శాపోప హతుడూను ! అశ్వత్థామ మదపుటేనుగును మించిన బలం కలవాడు. సిద్ధ పురుషుడు. అస్త్ర విద్యా పారంగతుడు ! చిరంజీవి ! మీదు మిక్కిలి రారాజైన ధుర్యోధనుని యందు ఎల్లలులేని ప్రేమ కలవాడు.

యుద్ధంలో అశ్వత్థామను అడ్డగించటం కొరకే శ్రీకృష్ణుని ఉపదేశాను సారంగా శంకరుని గురించి తపస్సు చేసి అర్జునుడు అస్త్రాలను పొందాడు. విష్ణువు అంశతో పుట్టిన వాసుదేవుడు అర్జునునకు అస్త్రాలను అనుగ్రహించలేడా? అనుగ్రహించలేడు ! ఆ అస్త్రాలు రుద్రుని వద్దనే ఉన్నాయి. రుద్రుని ముందు హరి, విరించి ఇంద్రాదులు నిలబడలేరు. విష్ణువు స్థితి కారకుడు కనుక లోక రక్షణకు అవసరమైనంత వరకు అస్త్ర, శస్త్ర విద్యలను రుద్రుడు ఆయనకు అనుగ్రహించాడు. రుద్రుడు లయ కారకుడు కనుక క్షణంలో సృష్టిని భస్మీపటలం చేయగల అస్త్ర విద్య రుద్రుని అధీనంలో ఉంది.

మహాభారత యుద్ధం ముగిశాక; రుద్రాంశను తనయందు ఆరోపించుకొని అశ్వత్థామ అర్థరాత్రి పాండవ శిబిరంలో ప్రవేశించి దృష్టద్యుమ్న్యున్ని, పాండవ పుత్రులను, మిగిలిన సైన్యాన్ని నిశ్శేషంగా ఒక్కడూ సంహరించాడు. చిట్ట చివర "ఈ అస్త్రంచే జగత్తు నిష్పాండవమయ్యేదు గాక!" అని అభిమంత్రించి ఉత్తరా గర్భాన్ని ఉద్దేశించి బ్రహ్మాస్త్ర ప్రయోగం చేశాడు. వాసుదేవుడు బంధు ప్రీతితో సుదర్శన చక్రాన్ని అడ్డు పెట్టి ఆ గర్భాన్ని రక్షించాడు. అలా రక్షించి అద్భుతమైన రాజకీయ చతురత, ముందు చూపు, లోకజ్ఞత , సమయజ్ఞత, భవిష్య దర్శనము గల శ్రీకృష్ణుడు పాండవులను పిల్చి అశ్వత్థామ కాళ్ళపై పడి రక్షించమని శరణు వేడండి" అని ఆజ్ఞాపించాడు. అశ్వత్థామ అమృత సిద్ధిని పొందిన అమృత పురుషుడు! అతని సహకారము, ఆశీర్వచనము లేనిదే పాండవ వంశానికి మనుగడ లేదు. రుద్రుని ఆదేశంతో అశ్వత్థామ పాండవుల పట్ల తన మనసులోని వైమనస్యాన్ని తొలగించుకొని శ్రీకృష్ణునికి అతని సంతానానికి, పాండవులకు అనేక వరాలిచ్చాడు. శివావతారుడైన అశ్వత్థామ ఈనాటికీ గంగా తీరంలో ఉండి విశ్వేశ్వరుని సేవించుకొంటూ తపస్సు చేసుకొంటూ భక్తులను అనుగ్రహిస్తున్నాడు.

## శంకరుని కిరాతావతార గాథ – పాండవులకు వ్యాసోపదేశము

సూత మహర్షి శౌనకాది మునులతో ఇలా అంటున్నాడు. ''మునులారా ! శంకరుడు మూకాసురుని సంహరించి అర్జునునికి పాశుపత దివ్య సంజ్ఞగల అస్త్రాన్ని అనుగ్రహించిన దివ్య వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి. పాండవులు కపట ద్యూతంలో సుయోధనునిచే పరాజితులై పతివ్రత అగు పాంచాలితో కూడి సూర్యుడనుగ్రహించిన అక్షయపాత్ర మహిమచే ద్వైత వనంలో సుఖంగా రోజులు వెళ్ళబుచ్చుకొంటున్న వేళ....

పాండవులను స్వయంగా పరీక్షించి అనుగ్రహింప తలచినవాడై అత్రిపుత్రుడైన దుర్వాసుడు పదివేల మంది శిష్యులతో ఆతిథ్యానికి వచ్చాడు. వచ్చి అతిథి పూజలనుగైకొని శిష్యులతో కూడి నదీ తీరానికి స్నానానికై వెడుతూ వచ్చే లోపులో తన మనసుకు నచ్చిన భోజానాన్ని సిద్ధం చేయమని చెప్పి వెళ్ళాడు. అంత మాత్రంగా కాలం వెళ్ల బుచ్చు కొంటూన్న కుంతీనందనులు అంతమందికి ఆహారాన్ని ఎలా సిద్ధం చేయాలో తెలియక, కోపిష్టి వాడైన మహర్షికి భయపడి చింతాశోక మగ్నమానసులై విన్నదనంతో మిన్నకుండి పోయారు. అప్పుడు ద్రౌపతి శ్రీకృష్ణుని స్మరించగా తక్షణం వచ్చి, పాంచాలి వండిన కొద్దిపాటి కూరను తిన్నాడు.... పరమాత్మ. అందరియందు అంతర్యామి స్వరూపంగా ఉన్నవాడు ఆయనే

కనుక ఇక్కడ కూరను తిని సంతృప్తి చెందగానే అక్కడ మహర్షికి శిష్యులకు కూడా కడుపు నిండిపోయింది. పాండవులను అనుగ్రహించి వచ్చిన దారినే వెళ్ళాడు....మహర్షి తన శిష్యులతో. మహర్షి అంతమంది శిష్యులతో సుయోధనుని ప్రోత్సాహంతోనే వచ్చాడు. దుష్ట తలంపుతో రారాజు ప్రోత్సాహించి పంపినా పాండవులకది వరమే అయింది.

కష్టం గట్టెక్కినందుకు సంతోషించి కుంతీ పుత్రులు శ్రీకృష్ణుని చుట్టూ చేరి ఇలా మొర పెట్టుకొన్నారు." వాసుదేవా ! మా శత్రువైన దుర్యోధనుడు బలవంతుడు అంతేకాదు దుష్టుడు ! వనంలో ఉన్నా మమ్ములను వెంటాడుతున్నాడు. కర్తవ్యాన్ని చెప్పు." అని కోరగా స్వీయ వృత్తాంతాన్ని ఇలా చెప్పాడు "ఓ పాండవులారా ! నా ఆరాధ్య దైవం శంకరుడు ! ఆయన సేవను నేనెప్పుడూ విడువను ! నేను కూడా శత్రువులను నిర్జించే కోరికతో ఉపమన్యుని ఉపదేశాన్ని చక్కగా విచారించి పర్వత రాజమైన బటుకమునందు ఏడు నెలలు దీక్షగా శంభుని ఆరాధించి సఫల మనోరథుడనై ఉత్తమమైన సర్వ సామర్థ్యాన్ని పొంది ఉన్నాను. మీరు కూడా శంకరుని సేవించండి! అభ్యుదయం కలుగుతుంది." ఇలా ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు... శ్రీకృష్ణుడు.

దుర్ఘటమైన తపస్సును దుర్యోధనునకు తెలియకుండ ఎక్కడ నిర్విఘ్నంగా నెరవేర్చుకోవాలో తెలియక దాని పూర్వాపరాలను విచారిస్తున్న సమయంలో భస్మ భూషితుడు, రుద్రాక్ష మాలాలం కృతుడు, జటాధారి అగు వ్యాస భగవానుడు అక్కడ సాక్షాత్కరించాడు. పాండవులాయనకు ఉన్నతాసనాన్నిచ్చి పూజించి కర్తవ్యాన్ని గూర్చి ఇలా ప్రార్థించారు: 'భగవాన్ మీ దర్శనంచే మేము కృతార్థులమయ్యాం! మా పూజ, తపస్సు, దాన ధర్మాలు ఇంకా మా పూర్వపుణ్యం ఇవన్నీ మీ దర్శన రూపంలో సాక్షాత్కరించాయి! .....దుర్యోధనుని మాయోపాయాలకు అంతులేకుండ ఉంది. దుఃఖితులమై ఉన్నాం. నీ సందర్శనంతో మా కష్టాలు గట్టెక్కాయని భావిస్తున్నాం. మహాత్ముల దర్శనభాగ్యం వలన దుఃఖం దూరమై సర్వ కర్మలు సిద్ధిస్తాయి. వారి సన్నిధిలో కూడ దుఃఖం దురీకృతం కాకపోతే దానికి దైవమే కారణమని నిశ్చయించాలి. దుఃఖానికి కారణం కేవలం దరిద్రబాధే కనుక ఐతే అది కల్పవృక్షం వంటి మీ లాటి మహాత్ముల సన్నిధిలో తప్పక తొలగి పోతుంది. సూర్యోదయంతో చీకట్లు తొలగవా?

మహర్షీ ! మీబోటి మహాత్ములెప్పుడూ సర్వజీవులయందు ఆత్మ వస్తువునే దర్శిస్తారు. అందరియందు సమదృష్టిగల మీకు చిన్నవారని, పెద్దవారని భేదాలుండవు గదా? దీనులను

రక్షించటం మీ స్వభావం. దారిద్ర్యము, కష్టములు ఈ రెండు కూడ లోకంలో మానవునకు గొప్ప శ్రేయస్సును కలిగిస్తాయని పెద్దలంటారు. అట్టి సమయంలో భగవదారాధన యందు నిమగ్నం కావాలి. సత్పురుషాశ్రయాన్ని పొందాలి. నీ దర్శనం మాకు శుభకరం. నీ రాక మాత్రం చేతనే మా మనస్సులు సంతోషంతో నిండిపోయాయి. మా దుఃఖాన్ని శీఘ్రంగా పోగొట్టే ఉపాయాన్ని ఉపదేశించండి."

వారికి పారాశర్యుడిలా ఉపదేశించాడు : "ఓ పాండవులారా! నిజానికి ఇప్పుడు మీరనుభవిస్తున్న కష్టాలు మీకు రావలసినవి కావు. ఇట్టి కష్టకాలంలో కూడా మీరు సత్యాన్ని, ధర్మాన్ని న్యాయాన్ని తప్పలేదు. మీరు ధన్యులు. ప్రాణాపాయ స్థితిలో కూడ ధర్మాన్ని, సత్యాన్ని విడిచి పెట్టక పోవటమే సత్పురుషుల లక్షణం. నాకు కౌరవ పాండవులైన మీయందు సమభావమే ఉంది. ఐనా ధర్మాత్ముల యందు పక్షపాతాన్ని కలిగి ఉండటం ఆర్యసమ్మతమైన మాట కదా! ధృతరాష్ట్రుడు భౌతికంగా అంధుడు మాత్రమే కాదు.... జ్ఞానాంధుడు కూడా! తన పుత్రుడైన సుయోధనుని ఏనాడూ దురాగతాల నుండి వారించ లేదు.... సరిగదా అగ్నికి వాయువు తోడైనట్లు రాజ్యలోభంచే సహకరించాడు. ఇంతకీ విధివ్రాత ఎట్లా ఉందో అట్లా జరుగుతుంది. బీజాంకుర న్యాయం చేత బీజాన్ని అనుసరించి అంకురం వస్తుంది గదా ! మీరు సత్యధర్మ పరాయణులు. మీకు శుభం కలుగుతుంది.

ఓ పాండునందనులారా ! అన్నిటికి శివుడే కర్త. సర్వము శివస్వరూపమే ! సత్పురుషులకు శివుడే శరణ్యం. స్వల్పకాలంలో ప్రసన్నుడయ్యేవాడు శివుడు ! అట్టి శివుని గూర్చి తపస్సు చేసి ఆయన అనుగ్రహాన్ని పొందటం అవశ్యం. అందుకు అర్జునుడే తగిన వాడు. క్షత్రియుడు ముందుగా ఇంద్ర విద్యను ఉపదేశం పొంది; ఆయన ద్వారా శివమంత్రోపదేశాన్ని పొందాలి. ఈ మార్గం అమితమైన హితాన్ని చేకూరుస్తుంది."

వ్యాసమహర్షి ఇలా పలికి అర్జునుని పిలిచి ఇంద్ర విద్యను ఉపదేశించి పార్థివలింగ పూజా విధానాన్ని కూడా బోధించి గంగానది సమీప ప్రాంత మందలి ఇంద్ర కీలాద్రి చేరి తపస్సుకు ఉపక్రమించమని ఆదేశించాడు.

### అర్జునుని తపస్సు ఇంద్ర సాక్షాత్కారం

కేవలం వ్యాస మహర్షి మంత్రోపదేశం చేతనే విజయునిలో తేజం అద్భుతంగా ప్రకాశించింది. ప్రత్యక్ష ప్రమాణంగా కనుపించిన మంత్ర ప్రభావానికి వారు ఆశ్చర్యపోయి మనకు విజయం తథ్యం అని విశ్వసించారు. ఒక శుభ ముహూర్తాన వారందరు పార్థుని తపోదీక్షకై

పంపించారు. ద్రౌపదితో కూడి అందరు సజల నయానాలతో, దుఃఖభారంతో వీడ్కోలు చెప్పారు. విజయుడు కూడా వెనుకకు తిరిగి తిరిగి చూస్తూ విడిచి వెళ్ళలేక వెళ్ళలేక ముందుకు కదిలాడు. అతడు వెళ్ళిన రోజు నుండి పాండవులు అతని ముచ్చట్లనే చెప్పుకొంటూ కొద్దిసేపు; కఠినమైన తపశ్చర్యలో ఎంత కష్ట పడుతున్నాడో అని కొద్ది సేపు! ఇలా హర్ష సంతాప బాష్ప సంకలిత నయనాలతో విషణ్ణ చేతసులై ఉంటూ వచ్చారు.

అలా ఉండగా ఒకరోజున కృపాసింధువు, దయా నిధియైన వ్యాస భగవానుడు వారి యోగక్షేమాలను విచారించే నిమిత్తం స్వయంగా విచ్చేశాడు. పాండవులాయనను పూజించి "కొంతకాలం మీరిక్కడే ఉండి మా ఆతిథ్యాన్ని స్వీకరించి మమ్ములను కృతార్థులను చేయండి ! మీ సాన్నిధ్యంలో మాకు చాలా శాంతిగా ఉంటోంది. చంద్రోదయానికి కలువలు వికసించినట్లు మా మనస్సులు హర్షోన్మీలితమవుతున్నాయి." – అని ప్రార్థించారు. వారి ప్రార్థనను అంగీకరించి మహర్షి అక్కడే ఉండి వారికి అనేక గాథలను, తాత్త్విక విషయాలను చెపుతూ దుఃఖోపశమనం చేస్తూ వచ్చారు. ఒక రోజున ధర్మనందనుడు మహర్షికి ప్రణమిల్లి "భగవాన్ ! అంతటి మహా మహిమాన్వితమైన కురువంశంలో జన్మించామే! పంచాగ్నులవలె ప్రకాశిస్తున్న ఐదుగురు సోదరులమే మేము! శౌర్య, ప్రతాప, వీర విక్రమాలకు కొదవ లేదే! నా తమ్ములు నలుగురు నాలుగు దిక్కులను జయించగల సమర్థులే ! అయినా ఇన్ని కష్టాలు పడుతూ ఇంత దుఃఖాన్ని అనుభవిస్తున్నాం కదా! మా సంగతి సరే! ఈ యాజ్ఞసేనిని చూడు! ఆమె ఆ దుష్ట చతుష్టయం చేత పొందిన అవమానం చిన్నదా? చితిలా దహించివేస్తోంది! ఇంత దుఃఖాన్ని అనుభవిస్తున్న దైవోపహతులం మేమేనా? ఇంతకు పూర్వం ఎవరైనా ఉన్నారా?" అని కుతూహలంతో ప్రశ్నించాడు.

దానికి సమాధానంగా సాత్యవతేయుడు ఇలా అన్నాడు : "ఓ ధర్మరాజా ! నీకంటె ఎక్కువ ఉన్నతమైన రాజ వంశాలలో పుట్టి ఎన్నో విపత్తులపాలై మహా దుఃఖాన్ని అనుభవించిన మహాపురుషులు చరిత్రలో చాలా మంది ఉన్నారు. వారనుభవించిన కష్టాల కడలి కెరటాల ముందు నీ కన్నీరేపాటి! ఆ చరిత్రలను చెపుతున్నాను విను !" ఇలా ఉపోద్ఘాత పూర్వకంగా పల్కి నల చరిత్రను, హరిశ్చంద్ర మహారాజు ఉపాఖ్యానాన్ని, రామ గాథను...... ఇంకా అనేక మంది పూర్వ రాజన్యుల వృత్తాంతాన్ని విపులంగా ధర్మరాజుకు తక్కిన పాండవులకు చెప్పాడు. జెప్పి జీవిత సారాన్ని తత్త్వాన్ని ఇలా క్లుప్తంగా ఉపదేశించాడు.

"ఓ పాండు నందనులారా ! తత్త్వవేత్తలు ప్రకృతి పురుషాత్మకమైన ఈ సృష్టిని, పంచ భూతాత్మకమైన ప్రకృతిని, పాంచభౌతికమైన ఈ శరీరాన్ని ఎన్నో విధాలుగా వ్యాఖ్యానిస్తారు. మూలాల్లోకి వెళ్ళి వ్యాఖ్యానిస్తే ఎవరూ కాదన లేని తత్త్వాన్ని విశదీకరిస్తున్నాను వినండి. ఈ సర్వమైన సృష్టికి కారణభూతమై, కారణములన్నిటికి తానే కారణమై అజరము, అమేయము, నిత్యము, సత్యము ఐన ఒక మహాశక్తి విశ్వ వ్యాప్తంగా ఉంది. నామ రూపాదులను విసర్జించి విమర్శ దృష్టితో చూచే వారికి ఆ శక్తి తరంగం విశదమవుతుంది. దానికి నామరూపాదులు లేవు. లేవు కనుకనే అన్ని నామాలు, అన్ని రూపాలు దానికే చెందుతాయి. దానికి పురుష భావారోపణ చేస్తే పరమేశ్వరుడని, స్త్రీ భావారోపణ చేస్తే పరమేశ్వరి అని పేర్లు. అలాగే మహాదేవుడు, మహాదేవి అనిపేర్లు. దేనిని మించిన ఐశ్వర్యం లేదో అది పరమైశ్వర్యం. అది కలవాడు పరమేశ్వరుడు. సృష్టి అంతా ఆయన ఐశ్వర్యమే ! విభూతియే! ఆయన సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి. ఆయన తత్త్వంలో నిర్గుణుడే ఐనా భక్తులను అనుగ్రహించటం కొరకు సగుణుడైనాడు. తత్త్వం ఎప్పుడూ సిద్ధాంత రూపంలో నిర్గుణంగా ఉంటుంది. దానికి సగుణ రూపాన్ని కల్పించుకొని ఆరాధించాలి. పంచ భూతాలు శక్తి స్వరూపాలే ! కాని ఆ శక్తిని మానవుడు ఆచరణలోఉపయోగం లోనికి తెచ్చుకోవాలి. అలా వినియోగం లోనికి తెచ్చు కోవటమే జ్ఞానం యొక్క సార్థకత. ఆ విధంగానే నిర్గుణాన్ని కర్మ, భక్తి, యోగ, జప తపాదుల ద్వారా సగుణ రూపంలో ఆరాధిస్తే తత్త్వజ్ఞాన లబ్ధి సమకూరుతుంది. దీనిని అవగతం చేసుకొనటమే మానవ జీవిత పరమార్థం.

ఇక దుఃఖం అంటారా? జీవుడు గర్భ ప్రవేశం మొదలు శ్మశాన ప్రాప్తి వరకు అంతా దుఃఖమే! అందరూ అనుభవిస్తూన్న దానిని వేరే వర్ణించి చెప్పట మెందుకు ? ఇహంలో భుక్తిని, పరంలో ముక్తిని కాంక్షించేవాడు మహాదేవుడైన శంకరుని ఆరాధించాలి. ఆ శబ్దం ఆయనకు వినా మరెవరికి వర్తించదు." ఇలా చెప్పి విరమించాడు వ్యాసుడు. ఈ విధంగా ధర్మనందనుడు ద్వైత వనంలో కృష్ణ ద్వైపాయనునితోను మరియు అనేక మునులు, ఋషులతోను కూడి సత్కథాశ్రవణంతో సద్గోష్ఠితో కాలం వెళ్ళబుచ్చుతూ ఉండగా.... అక్కడ....

గాండీవి గంగానదీ ప్రాంతంలో గల ఇంద్ర కీలాద్రిని చేరుకొని అక్కడొక చక్కని ఆశ్రమాన్ని నిర్మించుకొని నిత్యమూ పార్థివలింగ పూజ చేస్తూ తపస్సుకు ఉపక్రమించాడు. శాకాహారుడై, నిర్జితేంద్రియుడై పాషాణ తల్పం మీద శయనిస్తూ, ఇంద్ర మంత్రాన్ని జపిస్తూ ఒంటికాలి మీద నిలబడి చేతులు జోడించి ఊర్ధ్వ బాహువై తీవ్రంగా ఇంద్రుని గూర్చి తపస్సు చేస్తూన్న వేళ.... ఇంద్రాను చరులు అతనిని గూర్చి పాకారికెరిగించారు. కుమారుని

నిష్ఠను పరీక్షింపగోరి ఆయన వృద్ధ బ్రాహ్మణుని వేషంలో ప్రత్యక్షమై నెమ్మదిగా కుశలప్రశ్నల అనంతరం మాట మాట కలిపి ఇలా అన్నాడు. "ఓ క్షత్రియ వీరా ! ఈ ధనుర్బాణా లేమిటి? ఈ తూణీర మేమిటి ? ఈకవచ శిరస్త్రాణాదు లేమిటి ? తపస్సేమిటి ? తపస్వులు జితేంద్రియులై శాంత మూర్తులై చంద్రునిలా చల్లగా ఉండాలి! నీవు వీర రసావతారుడవై సూర్య తేజస్సుతో వెలిగిపోతూ దుర్నిరీక్షంగా ఉన్నావు. ఇలాటి విరుద్ధ తనాన్ని నేనెక్కడా చూడలేదు. పైగా ఇంద్రుని గూర్చి తపస్సు అంటున్నావు ! త్రిమూర్తుల సాక్షాత్కారాన్ని కోరి తపస్సు చేసిన వారిని నేనెరుగుదును. వజ్రధరుడు నీకంటె వాసి కలవాడు గాదు ! వాడేమి భుక్తినిస్తాడా? ముక్తినిస్తాడా? వాడి గాథలు నువ్వు, నేను ఎరుగనివేమీ కావు! నీ వాంఛ పాడుగాను ! ఈ తపస్సు చాలించు ! పోనీ వాడెందులో ఘనుడో చెప్పమంటావా? ఆ సహస్రాక్షుని ఆత్మ సంశుద్ధి ఎంతటిదంటె.... అహల్యను అంటు పరచిన.... వెంటనే గాండీవి ఉగ్రుడై ఒక దుడ్డు కోల చేబూని "ఓ బ్రాహ్మణా ! చాలు నీ అధిక ప్రసంగం ! ఆపు! బ్రాహ్మణుడవు కనుక బ్రతికిపోయావు ! నీ వేషం చూస్తే వేదాధ్యయన సంపన్నునివలె ఉన్నావు ! వేదం ఇంద్ర స్థానాన్ని లోకోత్తరంగా కీర్తించలేదా?" అని తరిమాడు. తక్షణం ఇంద్రుడు బ్రాహ్మణ వేషాన్ని పరిత్యజించి వజ్రపాణియై సాక్షాత్కరించి తన కుమారుడైన విప్పచ్చునితో ఇలా అన్నాడు : "వత్సా! నీ మనోగతం నాకు తెలుసు. రాబోవు కాలంలో సుయోధనుడు మీ రాజ్య భాగాన్ని మీకీయడు. యుద్ధం తప్పదు. కౌరవ పక్షంలో భీష్మ, ద్రోణ, కర్ణాదులు దుర్జయులు ! రుద్రాంశుడైన అశ్వత్థామను నిర్జించటం సాధ్యంకాని పని. అశ్వత్థామ ఒక్కడూ చాలు మీ పని పట్టటానికి! నీకు సర్వ విధాల హితమును కూర్చే ఉపాయాన్ని చెపుతాను విను ! యుద్ధంలో విజయాన్ని కోరే వారందరు రుద్రుని అర్చించాలి. రుద్రుని మెప్పించి పాశుపతాస్త్రాన్ని వరంగా అడుగు, భక్త వత్సలుడైన ఆయన ఇచ్చి తీరుతాడు. యుద్ధంలో మీకు విజయం తథ్యం." – ఇలా చెప్పి శివ మంత్రాన్ని సాంగో పాంగంగా ఉపదేశించి, శివార్చనను విధి విధానంగా నేర్పి అదృశ్యుడైనాడు ఇంద్రుడు.

**అర్జునుని తపస్సు మూకాసుర వధ**

ఇంద్రోపదేశాన్ని పొందిన పార్థుడు రుద్ర సాక్షాత్కారాన్ని కోరి పాశుపత దీక్షారంభుడై పంచాక్షరీ మంత్ర జప పరాయణుడై ఒంటి కాలిపై నిలబడి సూర్యుని యందు ఏకాగ్ర చిత్తంతో చూపు నిలిపి తపశ్చర్యకు ఉపక్రమించాడు. అలా కొంతకాలం గడవగా దేవతలు శంకరుని సమీపించి పాండవ మధ్యముని వాంఛితాన్ని నెరవేర్చవలసిందని ప్రార్థించగా ఆయన ఔనని చెప్పి పంపించాడు.

ఇంతలో ఒకరోజున గాండీవి; పర్వతప్రాంత వనభూమియందు పూజార్థమై పువ్వులు కోసుకొంటున్న వేళ .....ప్రళయ కాల జీమూతం వంటి శరీరం, చంద్ర వంకలను పోలిన కోరలు, వజ్రాయుధం వంటి మూతి, వికసించిన నల్లకలువలను పోలిన చెవులు, ఎఱ్ఱని కన్నులు, ఇనుప గుదియల వంటి కాళ్ళు, పాషాణాలను సైతం పిండి చేయగల గిట్టలతో; ఘుర్ఘుర ధ్వనులతో దిక్కులు మార్మ్రోగగా, కాలుని వాహనమైన మహిషాన్ని మించిన భయంకరాకారంతో.... మహా వృక్షాలను ముట్టెతో పెకలిస్తూ, కొండ శిఖరాలను కూలుస్తూ కన్నుల విస్ఫులింగాలను వెదజల్లుతూ, ఉల్కలా మెరుపులు సృష్టిస్తూ, శరవేగాన్ని మించిన వేగంతో ఒక భీకర సూకరం బీభత్సుని వైపుకు దూసుకొని వచ్చింది.

అశనిపాతం వంటి దాని అరుపుకు అటువైపు దృష్టి మళ్ళించి అర్జునుడు ధనువినిర్ముక్త బాణంలా దూసుకొని వస్తున్న సూకరాకారాన్ని పరికించి దాని చేష్టను గమనించి, నేత్ర దృష్టిని అవలోకించి మాత్ర కాలంలో ఇది శత్రువే అని గ్రహించి గాండీవాన్ని చేపట్టి, గుణాన్ని కూర్చి, దనుష్టంకారం చేసి తూణీరాన్నుండి బాణాన్ని తీసుకొని శరసంధానం చేసి గురి చూసి కొట్టబోయేటంతలో ఆ సూకరం వెనుక....శంకరుడు పార్వతితో కూడి....

బిరుసైన తల వెంట్రుకలను పెడకొప్పుగా పెట్టి, జేగురు రంగును ఒడలంతాపూసుకొని, గైరిక (శిలాధాతువు) ద్రవాన్ని తిలకంగా దిద్ది గురిగింజ పూసలను మాలగా ధరించి విల్లంబులను చేత పట్టి కిరాతు వేషంలో తన పెంటి (భార్య)తో కూడి ప్రత్యక్ష మయ్యాడు. అతని వెంట 'భౌ భౌ' మని అరుస్తూ నాలుగు వేట కుక్కలు ఉన్నాయి. పందికి వెనుక కిరాతుడు, ముందు గాండీవి నిలబడి ఏక కాలంలో పుచ్ఛ భాగాన్ని గురిచూచి కిరాతుడు, ముఖ భాగాన్ని లక్ష్యంగా చేసుకొని పురందర నందనుడు వజ్రసన్నిభమైన బాణాలతో వరాహాన్ని కొట్టేసరికి అది క్షీర సాగరాన్ని చిలికేవేళ మందరగిరి తిరిగినట్లు సుడులు తిరుగుతూ, ప్రళయ కాల ఘనా ఘన గర్జితాన్ని మించి ఘుర్ఘురా రావాలను చేస్తూ, నోట నెత్తురు వరదలై పార నేల కూలింది.

ఆ సూకరం నిజమైన సూకరంగాదు ! దుర్యోధనుడు పంపించగా మూకాసురుడనే రాక్షసుడు ఆ రూపంలో వచ్చాడు. మరణానంతరం ఆ రాక్షసుడు నిజరూపంలో గోచరించే సరికి విజయుడు దిగ్భ్రాంతుడై నిజంగా శంకరుడే రక్షించాడని మనసులో స్తుతించాడు.

## కిరాత – అర్జున సంవాదము

వెనుక నుండి వేసిన కిరాతుని బాణం ముఖం నుండి బహిర్గతమై పాతాళంలోకి దూసుకు పోయింది ముందు

నుండి వేసిన అర్జునుని బాణం వెనుక నుండి దూసుకొచ్చి ప్రక్కనే పడింది. బాణం కొరకు కిరీటి మరియు కిరాతానుచరుడు ఏక కాలంలో పందిని సమీపించారు. "ఈ బాణం నాది!" అని ఒకరు "కాదు! ఈ బాణం నాది!" అని మరొకరు తగవులాడ జొచ్చారు. కిరాతాను చరుడిలా అర్జునుని ఉపాలంభించాడు. "ఓ తాపసా! నీవు కపట ముని వలె ఉన్నావు! నీ వేషం నీచర్యలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. ఈ బాణం మా కిరాత ప్రభువుది. మా ప్రభువు అడుగో! అచ్చట ఉన్నాడు. నీవు తాపసివై ఉండి అసత్యం పలుకుతున్నావు చోర బుద్ధితో బాణాన్ని స్వంతం చేసుకోవాలనుకొంటున్నావు. నీకు అంబులు కావాలనుకొంటే మా ఏలికను ప్రసన్నుని చేసుకో! ఆయనవద్ద ఇంతకంటె మేలైన అలుగులు చాలా ఉన్నాయి. మా ప్రభువు అన్నిటా సమర్థుడు! నిన్ను రక్షించటం కొరకే ఈ బాణాన్ని ప్రయోగించాడు."

ఆ భిల్లుడు పల్కిన "చోరబుద్ధి – యాచన " అనే పలుకులకు ఆగ్రహావేశుడై అర్జునుడిలా అన్నాడు: 'ఓ భిల్లా ! నీ మాటలలో సత్యం లేదు. మీకిరాతులు బందిపోట్లు ! దారి దోపిడి గాండ్రు! అందుకు తగినట్టే మాట్లాడావు ! నీవు సేవకుడవు ! సేవక బుద్ధినే ప్రదర్శించావు ! నీ ప్రభువు కూడా నీ వంటి వాడేనా ? నేను సుక్షత్రియవంశ సంజాతుడను. ప్రతిగ్రహం చేయటం మాకు తగని పని. ఒక వేళ ఈ బాణం విషయంలో పరాక్రమాన్ని ప్రదర్శించ వలసి వస్తే నీ ఏలికతోనే యుద్ధం చేస్తా ! వెళ్ళు ! నీ దొరకు విన్నవించు!"

వెంటనే వనచరుడు తన ప్రభువు వద్దకు వెళ్ళి జరిగిన సంభాషణ అంతా జెప్పి మిన్న కున్నాడు.

**కిరాతార్జునీయము**
**శంకర సాక్షాత్కారము**

వివ్వచ్చుని పలుకు లన్నింటిని తన సేవకుని నోట విన్న పుళింద రాజు కుపిత మానసుడై పార్థుని ముందుకు వచ్చి నిలిచి ఇలా అన్నాడు. "ఓ క్షత్రియ వీరా ! ఈ రాజ్యం నాది. ఇక్కడ నేనే రాజును. ఇక్కడ అడుగు పెట్టిన వారిని రక్షించడం నా కర్తవ్యం. అందుకే నీ మీదకు దూకబోతున్న పందిని శిక్షించాను. నువ్వు తాపసిలా లేవు ! చంకలో దుడ్డు కఱ్ఱ పెట్టుకు వచ్చిన శరణార్థిలా ఉన్నావు ! తిన్న ఇంటి వాసాలు లెక్క పెట్టి ఇంటిని మ్రింగివెయ్యటానికి వచ్చిన కపట అతిథిలా ఉన్నావు ! యుద్ధానికి సిద్ధమే అన్నావు! సరే! ఏదీ! నిలుచూద్దాం!" ఇలా పల్కి తన సైన్యానికి అనుజ్ఞ ఈయగా వారందరు పార్థునిపైకి బాణ వర్షాన్ని కురిపించారు. గాండీవి మనసులో శంకర ప్రభుని స్మరించి వాటిని తన బాణ పరంపరచే నడుముకు నరికి కిరాతునిపైకి అంపవాన కురిపించాడు. వాటిని ఆ వనచర ప్రభువు పూచిక పుల్లలవలె

పట్టి విరిచాడు. తన క్రూర నారాచాలను చీపురు పుల్లల్లా విరిచిన అతని నేర్పుకు 'బాపురే' అంటూ విస్మితుడై విజయుడు తన ధనుర్విద్యా నైపుణ్యాన్ని అంతటిని చూపించాడు. పరస్పర శస్త్రాస్త్ర ప్రయోగంచే ఆకాశం అంధకార బంధురమైంది.

వివ్వచ్చుని బాణాలు పుళింద రాజును తాకి పర్వతం మీద కురిసిన వర్షంలా జారిపోతున్నాయి. దివ్యాస్త్ర మంత్రాక్షరాలు స్ఫురణకు రావటం లేదు. శారద్వత కుంభసంభవుల బోధ నిష్ఫలమైంది. ధనుర్విద్యాభ్యాస శ్రమ...అంతా అడవి వెన్నెలలా అక్కరకు రాకుండ పోయింది. మండు వేసవిలో చెరువు ఎండిపోయినట్లు తూణీరం శరధి శూన్యమైంది. ప్రాగల్భ్యం చెడగా కుటిలంగా బొమలుముడిచి 'నిన్నింతటితో పోనిస్తానా?" అని గర్వంతో అరుస్తూ కిరాతుని సమీపించి ఉడుకుబోతు తనంతో బాహుబలమంతా కూడ దీసికొని గాండీవంతో కిరాత రాజు నెత్తిపై మొత్త సాగాడు.

పాండవ మధ్యముడైన ఆఖండల నందనుడు తన గాండీవంతో ఖండ పరశు పృథు జటా మండలాన్ని తాడిస్తూంటే....

జటాజూటంలోని మందాకిని యొక్క సుకుమార దేహం స్రుక్కిపోయింది ! పూదండలా శిరసున ధరించిన చంద్రరేఖ భయంతో బ్రహ్మ కపాల రంధ్రంలో దూరింది.

చుట్ట కుదురులా జటా మండలానికి చుట్టిన మహా భుజంగం బుస కొట్టి లలాటం మీద నుండి క్రిందికి దిగింది.

ఫాలనేత్రం కొలిమి తిత్తిలా జ్వలిస్తూ రెప్పల సందున నిప్పులుమిసింది. పర్వత రాజనందిని భయంతో వణికి నీలగ్రీవుని గాఢోపగూహనంతో దృఢంగా బంధించింది. ప్రమధులు భీతులై పలాయితులయ్యారు. వేదరాశి ఒక్క పెట్టున ఘొల్లున ఘోషించింది. అంత భక్త పరాధీనుడైన శంకరుడు విజయుని విక్రమానికి సంతసించి స్వస్వరూపంతో పార్వతితో కూడి ప్రత్యక్ష మయ్యాడు. పార్థుడు కృతార్థుడై ఆయన పాద పద్మాలపై తలను ఆనించి అపరాధాన్ని క్షమించమని ఇలా ప్రార్థించాడు:

**శ్లో ॥ నమస్తే దేవ దేవాయ నమః కైలాస వాసినే ।**
**సదాశివ నమస్తుభ్యం పంచవక్త్రాయతే నమః ॥**
**కపర్దినే నమస్తుభ్యం త్రినేత్రాయ నమోస్తుతే ।**
**నమః ప్రసన్నరూపాయ సహస్ర వదనాయచ ॥**
**నీలకంఠనమస్తేస్తు సద్యోజాతాయవై నమః ।**

**వృషధ్వజ నమస్తేస్తు వామాంగ గిరిజాయచ ॥**
**దశదోష నమస్తుభ్యం నమస్తే పరమాత్మనే ।**
**డమరు కపాల హస్తాయ నమస్తే ముండమాలినే ॥**
**శుద్ధ స్ఫటిక సంకాశ శుద్ధ కర్పూర వర్ష్మణే ।**
**పినాక పాణయే తుభ్యం త్రిశూల వరధారిణే ॥**
**వ్యాఘ్రచర్మోత్తరీయాయ గజాంబర విధారిణే ।**
**నాగాంగాయ నమస్తుభ్యం గంగాధర నమోస్తుతే ॥**
**సుపాదాయ నమస్తేఽస్తు ఆరక్త చరణాయచ ।**
**నంద్యాది గణసేవ్యాయ గణేశాయచ తే నమః ॥**
**నమో గణేశ రూపాయ కార్తికేయాను గాయచ ।**
**భక్తిదాయచ భక్తానాం ముక్తిదాయ నమోనమః ॥**
**అగుణాయ నమస్తేఽస్తు సగుణాయ నమోనమః ।**
**అరూపాయ సరూపాయ సకలాయా కలాయచ ॥**
**నమః కిరాత రూపాయ మదనుగ్రహ కారిణే ।**
**యుద్ధ ప్రియాయ వీరాణాం నానా లీలాను కారిణే ॥**

**తా ॥** ఓ మహా ప్రభూ ! భక్తప్రియుడవగు నీకు నేను ఏమి చెప్ప గలను ? ఓ దేవా! సదాశివా ! నీవు దయామూర్తివి ! దేవదేవుడు , కైలాసవాసి, సదాశివుడు, పంచవక్త్రుడు, జటాజూటధారి, ముక్కంటి అగు నీకు నమస్కారం !

ప్రసన్నరూపుడు, అనంతమైన ముఖములు గలవాడు, నీలకంఠుడు, సద్యోజాతుడు, వృషభధ్వజుడు, వామ భాగము నందు దయార్ద్ర హృదయ ఐన చల్లని చూపుల తల్లి పార్వతిని ధరించిన వాడు అగు నీకు నమస్కారం !

పది భుజములు కలవాడు, పరమాత్మ, డమరువును, కపాలమును చేతియందు ధరించిన వాడు, కపాల మాలను, దాల్చిన వాడు అగు నీకు నమస్కారం !

స్వచ్ఛమగు స్ఫటికము వలె (గుణ దోషము లేవీ అంటక) ప్రకాశించు వాడు, కర్పూరము వలె తెల్లని దేహము కలవాడు, పినాకమనెడి విల్లు కలవాడు, త్రిశూలమును ధరించిన వాడు అగు నీకు నమస్కారం!

వ్యాఘ్ర చర్మమే ఉత్తరీయంగా కలవాడు, గజ చర్మమును ధరించినవాడు, సర్పములను ఆభరణాలుగా అవయవములయందు ధరించినవాడు, ప్రాణాధారమైన గంగను (జల తత్త్వాన్ని) ధరించిన వాడు  అగునీకు నమస్కారం !

ఎఱ్ఱని అందమైన పాదములు గలవాడు, నంది మొదలగు గణములచే సేవింపబడు వాడు, సర్వ గణాధ్యక్షుడు అగునీకు నమస్కారం.

కార్తికేయ, గణపతుల రూపంలో ఆరాధింపబడేవాడు, భక్తులకు భక్తిని, ముక్తిని కూడ ఇచ్చువాడు అగు నీకు నమస్కారం !

నిర్గుణుడు, సగుణుడు, అరూపుడు, సరూపుడు, సకలుడు, నిష్కలుడు అగు నీకు నమస్కారం.

కిరాత రూపమును దాల్చి నన్నును గ్రహించిన వాడు, వీరులతో యుద్ధమును చేయుటయందు ప్రీతి గలవాడు, అనేక లీలలను ప్రకటించు వాడు అగు నీకు పునః పునః ప్రణామములు.

**శ్లో ॥ యత్కించి ద్దృశ్యతే రూపం తత్తేజస్తావకం స్మృతమ్ ।**
**చిద్రూపస్త్వం త్రిలోకేషు రమసేఽ న్వయ భేదతః ॥**
**గుణానాంతే న సంఖ్యాస్తి యథా భూరజసామిహ ।**
**ఆకాశే తారాకాణాం హి కణానాం వృష్ట్యపామపి ॥**
**నతే గుణాంస్తు సంఖ్యాతుం వేదా వై సంభవంతి హి ।**
**మందబుద్ధిరహం నాథ వర్ణయామి చ కం పునః ॥**
**స్యోఽ సి యోఽ సి నమస్తేఽ స్తు కృపాం కర్తు మిహార్హసి ।**
**దాసో-హం తే మహేశాన స్వామీ త్వం మే మహేశ్వర ॥**

**తా ॥** ఈ ప్రపంచంలో ఏ రూపం కానవచ్చినా అది నీ శివరూపమే ! చిద్ఘనుడవగు నీవు ఉపాధి భేదంచే ముల్లోకముల యందు రమిస్తూ ఉన్నావు ! భూమి యొక్క రేణువుల వలె, ఆకాశమందలి నక్షత్రములవలె, వర్షము నందలి జలకణముల వలె నీ కళ్యాణ గుణములు అనంతములు! అసంఖ్యాకములు ! నీ గుణములను లెక్కించుటకు, వర్ణించుటకు వేదములకు సైతం అసంభవం గదా! అట్టిచో మందబుద్ధినైన నేను ఎట్లు వర్ణించగలను ? నీవు ఏదియో అదే అవుతావు ! నీకు నమస్కారం! నన్ను దయతో చూడు నీ దాసుడను ! ఓ మహేశ్వరా ! జన్మ జన్మలకు నీవే నా ప్రభుడవు !

విజయుని తపస్సుకు, విక్రమానికి, స్తోత్రానికి సంతసించిన శంకర స్వామి...లోక రక్షయైన మహనీయ పాశుపత దివ్యాస్త్రాన్ని ససంప్రయోగ, సోపసంహార, సకీలక, సరహస్యంగా ఉపదేశించాడు. పార్వతీదేవి అక్షయ తూణీరాన్నిచ్చింది. అనేక మంది దేవతలు అనేక దివ్యాస్త్రాల నిచ్చారు. పార్వతీ పరమేశ్వరులు తమ అమృత హస్తాలను పార్థుని శిరుసుపై ఉంచి దీవించి అంతర్హితులయ్యారు. పార్థుడు కృతార్థుడై పరమానందంతో స్వస్థానానికి చేరుకొన్నాడు. ఈ కిరాతార్జునీయ గాథ పరమ పవిత్రమైనది.

**శ్రీ శివమహా పురాణంలో శత రుద్ర సంహిత సమాప్తము.**

**హరిః ఓం తత్సత్**

**శ్రీ కృష్ణార్పణమస్తు**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## కోటి రుద్ర సంహిత



వాస్తవంలో ఏ పరమాత్మ ఎట్టి వికారములు లేని వాడైనా, తన మాయచే జగద్రూపాన్ని ధరించి ఉన్నాడో, స్వర్గమోక్షములు రెండు ఎవని కృపాకటాక్ష వైభవములో, ఎవనిని యోగులు సచ్చిదానంద – అద్వితీయ – ఆత్మరూపంగా హృదయంలో దర్శిస్తూ ఉంటారో, ఎవని శరీరంలో సగభాగం పార్వతియో అట్టి తేజస్స్వరూపుడగు ఆ పరమేశ్వరునకు అనేక ప్రణామాలు.

కృపారసం తొణికిసలాడే లలితమైన చూపులు కలది, చిరునవ్వు వెన్నెలలు కురిపించే పద్మం వంటి ముఖం కలది, చంద్రకళతో ప్రకాశించేది, భయంకరమైన తాపత్రయాన్ని నశింపచేసేది, సచ్చిదానంద రూపమైనది, హిమగిరి రాజనందినీ బాహులతా పరివేష్టితమైనది అగు ఒకానొక వర్ణింప శక్యం కాని తేజస్సు సకలమైన శుభములను ఇచ్చుగాక!

**శ్లో ॥ యో ధత్తే నిజమాయయైవ భువనాకారం వికారోజ్ఝితో**
**యస్యాహుః కరుణాకటాక్ష విభవౌ స్వర్గాపవర్గాభిధౌ ।**
**ప్రత్యగ్బోధ సుఖద్వయం హృది సదా పశ్యంతి యం యోగినః**
**తస్మై శైలసుతాంజితార్ధవపుషే శశ్వన్నమస్తేజసే ॥**

**శ్లో ॥ కృపాలలిత వీక్షణం స్మిత మనోజ్ఞ వక్త్రాంబుజం ।**
**శశాంకకలయోజ్జ్వలం శమిత ఘోర తాపత్రయమ్ ॥**
**కరోతు కిమపి స్ఫురత్పరమ సౌఖ్యసచ్చిద్వపుః ।**
**ధరాధరసుతా భుజోద్వలయితం మహా మంగళమ్ ॥**

## ద్వాదశ జ్యోతిర్లింగములు

సూతుడు శౌనకాది మహర్షులతో ఇలా అంటున్నాడు: "ఓ తపోధనులారా! పరమేశ్వరుడు తత్త్వంలో నిర్గుణుడే అయినా భక్తులకు భోగమోక్షాల నిచ్చి వారిని అనుగ్రహించే నిమిత్తం సగుణ రూపంలో అంటే లింగ రూపంలో ఆవిర్భవించాడు. అలా ఆవిర్భవించిన వాటిలో ద్వాదశ లింగాలు ప్రముఖమైనవి. వాటిని ద్వాదశ జ్యోతిర్లింగాలంటారు. వాటిని స్పృశించి అర్చించిన మానవులకు భుక్తి, ముక్తులకు లోటుండదు.

**శ్లో ॥ సౌరాష్ట్రే సోమనాధశ్చ శ్రీశైలే మల్లికార్జునః ।**
**ఉజ్జయిన్యాం మహాకాల ఓంకారే చామరేశ్వరః ॥**
**కేదారో హిమవత్పృష్ఠే డాకిన్యాం భీమ శంకరః ।**
**వారాణస్యాంచ విశ్వేశ స్త్రంబకో గౌతమీ తటే ॥**
**వైద్యనాథశ్చితా భూమౌ నాగేశో దారుకావనే ।**
**సేతు బంధేచ రామేశో ఘుశ్మేశశ్చ శివాలయే ॥**

**1. సోమనాధుడు:** సౌరాష్ట్రదేశంలో (గుజరాత్) ఉన్నాడు. ఈయన చంద్రుని దుఃఖాన్ని పోగొట్టాడు. ఈయనను పూజిస్తే క్షయ, కుష్ఠువు మొదలుగా సమస్తమైన మొండి వ్యాధులు నశించి ఆరోగ్య సిద్ధి కలుగుతుంది. అక్కడ చంద్రకుండమనే తీర్థం ఉంది. అది సర్వ పాప హరం.

**2. మల్లికార్జునుడు:** త్రిలింగ దేశంలో శ్రీగిరి మీద నెలకొని ఉన్నాడు. ఈ లింగాన్ని అర్చిస్తే తప్పక పుత్ర సంతానం కలుగుతుంది. సాక్షాత్తు పరమేశ్వరుడు కైలాసం నుండి వచ్చి ఇక్కడ స్థిరుడై ఉన్నాడు. ఇది ముక్తి క్షేత్రం.

**3. మహాకాలుడు:** శివుని ఈ అవతారం ఉజ్జయినిలో ఉంది. దూషణుడను రాక్షసుడు బ్రాహ్మణులను హింసిస్తూ వేద ధర్మాన్ని పాడు చేస్తూంటే, వారు వేద మంత్రాలచే ప్రార్థించగా ఆయన వచ్చి కేవలం హూంకారం చేతనే రత్నమాల నగర నివాసి అగు ఆ రాక్షసుని సంహరించి అక్కడే లింగ రూపంలో స్థిరుడయ్యాడు.

**4. ఓంకారేశ్వరుడు:** వింధ్యుడు యథా శాస్త్రోక్తంగా శివ లింగాన్ని స్థాపించి భక్తితో అర్చించగా ఆ పార్థివ లింగం నుండి పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఆయన కోర్కెలను తీర్చాడు. అక్కడ రెండు లింగములున్నాయి. ఓంకారంలో ఓంకారేశ్వరుడు. రెండవది పరమేశ్వరుడు అను పేరుగల పార్థివ లింగం. ఈ రెండూ జ్యోతిర్లింగాలే!

**5. కేదారేశ్వరుడు:** హిమవత్పర్వత ప్రాంతమైన కేదారంలో హరి యొక్క అవతారమైన నరనారాయణులు ఉన్నారు. వారు ప్రార్థింపగా శంకరుడు కేదారేశ్వర నామంతో లింగరూపంలో ఆవిర్భవించాడు.

**6. భీమ శంకరుడు:** సుదక్షిణుడను పేరుగల కామరూపదేశ ప్రభువు భీమాసురుడు అను పేరు గల రాక్షసుని బాధలకు తాళలేక శంకరుని ప్రార్థింపగా ఆయన[1] డాకినీ నగరంలో ఆ రాక్షసుని సంహరించి అక్కడే జ్యోతిర్లింగ రూపంలో స్వయంగా స్థిరుడయ్యాడు.

**7. విశ్వేశ్వరుడు:** బ్రహ్మాండ స్వరూపుడు, భుక్తి ముక్తి ప్రదాయకుడు అగు పరమేశ్వరుడు కాశీ నగరంలో విశ్వేశ్వరుడై వెలసి హరి విరించి ఇంద్రాది దేవతలచే నిత్యమూ పూజలందుకొంటూ అక్కడ స్థిరుడై ఉన్నాడు.

**8. త్ర్యంబకావతారము:** గౌతమ మహర్షి ప్రార్థనచే శంకరుడు గోదావరీ తీరంలో త్ర్యంబకేశ్వరుడనే నామంతో ఉన్నాడు.

**9. వైద్యనాథేశ్వరుడు:** రావణుని కొరకు అవతరించిన ఈ రూపం చితాభూమి యందు వైద్యనాథేశ్వరుడను నామంతో ఉంది.

**10. నాగేశ్వరుడు:** తన భక్తుడైన వైశ్య ప్రభువు సుప్రియుని ప్రార్థనను మన్నించి; ధర్మ విధ్వంసి అగు దారుకాసురుని సంహరించి జ్యోతిర్లింగ రూపంలో స్థిరుడై నిలిచాడు.

**11. రామేశ్వరుడు:** శ్రీరామ చంద్రునిచే ప్రతిష్ఠింపబడిన ఈ అవతారం సేతుబంధంలో స్థిరంగా ఉంది.

**12. ఘుశ్మేశ్వరుడు:** పరమేశ్వరుడు సరస్సునందు ఆవిర్భవించి ఘుశ్మ అను భక్తురాలికి ప్రీతిని కలిగించిన ఈ అవతారం ఘుశ్మేశ్వరుడను పేరుతో దేవశైలానికి (దౌలతాబాదుకు) సమీపంలో ఉంది. ఈ ద్వాదశ జ్యోతిర్లింగాలను స్మరిస్తే సర్వపాపాలు తొలగుతాయి.

మునులారా! ఆ జ్యోతిర్లింగాల ఉపలింగాలను గూర్చి చెపుతున్నాను వినండి. సోమేశ్వరుని ఉపలింగం అంతకేశ్వరుడు. మల్లికార్జునుని ఉపలింగం రుద్రేశ్వర లింగం. మహాకాలుని ఉపలింగం దుగ్ధేశ్వరుడు. ఓంకారేశ్వరుని ఉపలింగం కర్దమేశ్వరుడు.

---

1. తూ॥గో॥ జిల్లా ముఖ్య పట్టణమైన కాకినాడకు దగ్గరలోని దక్షారామమే ఒకప్పుడు 'డాకిరేమి'గా పిలువబడేది. ఇది జ్యోతిర్లింగ క్షేత్రం. ప్రాచీన శాసనాలు, శ్రీనాథుని భీమఖండం దీనికి ఆధారం.

కేదారేశ్వరుని ఉపలింగం భూతేశ్వరుడు. భీమశంకరుని ఉపలింగం భీమేశ్వరుడు. నాగేశ్వరుని ఉపలింగం భూతేశ్వరుడు. రామేశ్వరుని ఉపలింగం గుప్తేశ్వరుడు. ఘుశ్మేశ్వరుని ఉపలింగం వ్యాఘ్రేశ్వరుడు.

మునులారా! కాశీలో ఉన్న లింగాలకు లెక్క లేదు. ప్రధాన లింగానికి అవిముక్తకమని పేరు. సాక్షాత్తు కృత్తివాసుడే ఆ విధంగా అక్కడ ఉన్నాడు. దశాశ్వమేధ ఘట్టం వద్ద ఉన్న తిలఖాండేశ్వరుడు భక్తజన సులభుడు. ఇంకా ఇతర నదీతీరాల్లో ఉన్న ఈశ్వర లింగాలను చెపుతున్నా! గంగా సాగర సంగమంలో సంగమేశ్వరుడు, భూతేశ్వరుడు, కౌశికీ నదీతీరంలో నారీశ్వరుడు, గండకీ నదీ తీరంలో బటుకేశ్వరుడు, ఫల్గు నదీతీరంలో పూరేశ్వరుడు మరియు సిద్ధనాథేశ్వరుడు, దూరేశ్వరుడు, శృంగేశ్వరుడు, వైద్యనాథుడు, వెలసి ఉన్నారు. జప్యేశ్వర, గోపేశ్వర, రంగేశ్వర, వామేశ్వర, వ్యాసేశ్వర, నాగేశ్వర, కామేశ్వర, విమలేశ్వర, సుకేశేశ్వర, భాండేశ్వర, హుంకారేశ్వర, సురోచనేశ్వర, భూతేశ్వర, కుమారేశ్వర, పూర్ణేశ్వర, బ్రహ్మేశ్వర, భారద్వాజేశ్వర, శూలటంకేశ్వర, మాధవేశ్వర, భువనేశ్వర, లోకేశ్వర, గంగేశ్వర, శక్రేశ్వర, వటేశ్వర, కపాలేశ్వర, వక్త్రేశ్వర, నందేశ్వర, నాకేశ్వర, కంటకేశ్వర, ధర్తుకేశ్వర, చంద్రేశ్వర, సిద్ధేశ్వర, అంధకేశ్వర, బిల్వేశ్వర, శరణేశ్వర, కర్దమేశ్వర, కోటీశ్వర, అచలేశ్వర, అనంతేశ్వర, సప్తేశ్వర, భద్రేశ్వర, చండీశ్వర, గౌతమేశ్వర రూపాలలో శంకరుడు ఒకప్పుడు పార్వతీ సహితుడై సాక్షాత్కరించి ఇప్పటికీ తన మహిమచే భక్తులను అనుగ్రహిస్తూనే ఉన్నాడు."

**అత్రీశ్వర మహాత్మ్యము**

చిత్రకూటం వద్ద బ్రహ్మపురి యందు పూర్వం బ్రహ్మగారిచే స్థాపింపబడిన మత్త గజేంద్రక లింగం ఉంది. అది సర్వకామదం. దానికి తూర్పు దిక్కున కోటీశ్వర లింగం, గోదావరీ నది పశ్చిమ తీరాన పశుపతీశ్వర లింగం, దక్షిణ దిక్కున అత్రీశ్వర లింగం ఉన్నాయి. ఒకప్పుడు గొప్ప అనావృష్టి ఏర్పడగా శంకరుడే స్వయంగా వెలసి ప్రాణులకు జీవనాన్ని కల్పించాడు.

చిత్రకూట పర్వత సమీపంలో సర్వజన హితకరమైన కామదము అనే అడవి ఉంది. అది పవిత్ర భూమి. తపోధనులకు పెన్నిధి వంటిది. అక్కడ బ్రహ్మ పుత్రుడైన అత్రి మహర్షి అనసూయతో కూడి, ఆశ్రమాన్ని నిర్మించుకొని తపస్సు చేసికొంటూ ఉండే వాడు. ఆ సమయంలో ఆ ప్రాంతంలో తీవ్రమైన అనావృష్టి పరిస్థితులేర్పడి జలవనరులన్ని ఎండిపోయాయి. చెట్లు శుష్కించాయి. ఆహారం దొరకని కారణంగా పశుపక్ష్యాదులు నశించాయి. ప్రాణులన్ని తల్లడిల్లి హాహాకారాలు చేశాయి. కంటికి పచ్చదనం అనేది

కానరాకుండ పోయింది. వృక్షాలను ఆశ్రయించిన పక్షులు ఎండుటాకుల్లా నేలరాలాయి. విషసర్పాలు నోళ్ళు తెరచి బుసలు కొట్టి విషజ్వాలలను క్రక్కినట్లు భూమి నెరియలు విచ్చి పొగలను చిమ్మింది. వనదేవత వైధవ్యాన్ని పొందినట్లు ప్రకృతిలో పచ్చదనం కనుమరుగైంది. భూమి తాబేలు డిప్పలా బిరుసెక్కింది.

ఆ సమయంలో భూతదయా పరురాలైన అనసూయాదేవి "నాథా! ఈ ప్రాణికోట్ల వినాశాన్ని చూడలేకుండ ఉన్నాను. వర్షాగమనం కొరకు వరుణదేవుని ప్రార్థించండి." అని అనుకంపతో వేడగా సకల ప్రాణి హితార్థి అయిన అత్రి మహాముని గంగాధరుడైన శంకరుని ఏకాగ్ర చిత్తంతో ధ్యానిస్తూ సమాధినిష్ఠుడయ్యాడు. ఆయన అలా తపస్సు చేసికొంటూన్నంత కాలం అనసూయా దేవి కూడా మట్టితో పార్థివ లింగాన్ని చేసి శివ పూజ, పతిసేవ మానకుండ నిష్ఠతో ధర్మాచరణ పరాయణురాలైంది. ఆమె నియమ నిష్ఠలకు, ముని తపో దీక్షకు ప్రీతుడైన శంకరుడు గంగతో కూడి అక్కడికేతెంచి ముని దంపతుల భూతదయా పరత్వానికి ముచ్చట పడి సమయం కొరకు వేచి ఉన్నాడు. నిజానికి అనసూయా దేవి నియమ నిష్ఠలకే శంకరుడు ప్రీతుడైనాడు.

ఇంతలో ఒకనాడు ముని సమాధినుండి బయటకు వచ్చి భార్యను మంచి నీళ్ళిమ్మని కోరాడు. ఆమె అవశ్యమని పలికి కమండలువును చేబూని అడవిలోకి వెళ్ళింది. ఎక్కడా జలం కానరాలేదు. ఆమె పక్షి సంచారం ఉన్నచోట జలం ఉంటుంది కదా అని వాటి సంచారం కొరకు పరికించింది. అట్టి సమయంలో గంగాదేవి కిరాత స్త్రీ రూపంలో ప్రత్యక్షమై "ఓ మంగళాంగీ! ఈ నిర్జనారణ్యంలో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నావు? నీ వెవరు?" అని ప్రశ్నించింది. దానికా పతివ్రతా శిరోమణి ఐన అనసూయాదేవి విషయాన్ని వివరించి "నీ వెవరో దేవతామూర్తిలా ఉన్నావు! చిరకాల తపోదీక్షను విరమించి బహిర్ముఖుడైన నా భర్త దాహార్తితో ఉన్నాడు. జల వనరును చూపించగలవా?" అని ప్రార్థించింది. వెంటనే ఆ కిరాత స్త్రీ "ఇక్కడ చేయిలోతు గోతిని త్రవ్వు! నీకు స్వచ్ఛమైన జలం సమకూరుతుంది" అని పల్కగా ముని పత్ని అలాగే చేసింది. గంగ ఆ గోతిలో ప్రవేశించింది. గొయ్యి జలపూర్ణమైంది. అనసూయా దేవి ఆ జలాలను గ్రహించి ఆ కిరాత స్త్రీతో "ఓ కరుణామూర్తీ నాయందు నీకు అనుగ్రహం ఉంటె నేను నా భర్తతో కూడి ఇక్కడకు వచ్చే పర్యంతము ఇక్కడే ఉండు! ఇప్పుడే మేమిద్దరం వచ్చి నీ దర్శనం చేసికొంటాము" అని పల్కి భర్తను చేరుకొంది.

అత్రి మహర్షి కనులు తెరచి చూచి మరుభూమిలా ఉన్న వనాన్ని పరికించి "ఇంకా వర్షం పడలేదా!" అని దురపిల్లసాగాడు. ఇంతలో అనసూయా దేవి వచ్చి జలపూర్ణమైన కమండలువును భర్తకు అందించింది. "చిర కాలంగా చినుకు లేని చోట ఇంత స్వచ్ఛమైన జలం ఎలా లభించింది?" అని ఆయన ప్రశ్నించాడు. దానికామె జరిగిన దానిని యథాతథంగా చెపితే తన ప్రభావంగా తోచి అహంకార మవుతుందేమో అని శంకించింది. చెప్పక పోతే తిరస్కరించి నట్లవుతుందేమో అని పాతివ్రత్య భంగానికి భయపడింది. చివరకు "స్వామీ! మీ సుకృతం వల్ల లభించింది!" అని సమాధానమిచ్చింది. ఆ పుణ్య తీర్థాన్ని స్వయంగా దర్శించాలనే కుతూహలాన్ని భర్త వెల్లడించగా, ఆమె భర్తను తోడ్కొని వెళ్ళి ఆ తీర్థాన్ని చూపించింది. అక్కడ గంగాదేవి ఆ ముని దంపతులకు ప్రత్యక్షమై వరాన్ని కోరుకొనమని పల్కగా వారు ఈ తపోవనంలో స్థిరంగా నివాసముండమని గంగను ప్రార్థించారు.

దానికామె "ఓ పతివ్రతా శిరోమణీ! మీ దంపతులు సంవత్సర కాలం శివుని అర్చించిన ఫలాన్ని నాకు ధారపోస్తే నేనిక్కడ స్థిరంగా ఉంటాను. నాకు పతివ్రతలంటె మహా ప్రీతి. వారిని చూస్తే కలిగే ఆనందం మరిదేనివలన కలుగదు! పతివ్రత ఐన స్త్రీ నన్ను స్పృశిస్తే నాకు అతిశయం అధిక మవుతుంది. స్నానం చేస్తే ఇక చెప్పనక్కర లేదు. పతివ్రత అయిన స్త్రీ పార్వతితో సమానం." వెంటనే అనసూయాదేవి తన సంవత్సర శివార్చనా ఫలాన్ని గంగకు ధారపోసింది. అనసూయా దేవి చేసిన పుణ్య కర్మకు ప్రసన్నుడైన మహాదేవుడు పంచముఖుడై సాక్షాత్కరించాడు. ముని దంపతుల ప్రార్థనను అంగీకరించి అనసూయాదేవి చేసిన పార్థివ లింగంలో శంకరుడు తేజోరూపంలో విలీనమయ్యాడు. గంగాదేవి ఆ గోతిలో స్థిరంగా నిల్చింది. ఆ లింగం అత్రీశ్వరుడనే పేరుతో అర్చనలందుకొంటున్నది. ఆ తీర్థంలో ఇప్పటికీ సర్వకాల సర్వావస్థలయందు పుష్కలమైన, స్వచ్ఛమైన జలం భక్తులకు లభిస్తున్నది. ఈ అత్రీశ్వర మహాత్మ్య గాథ పరమ పవిత్రమైనది."

## నందికేశ్వర మహాత్మ్యము

సూత మహర్షి మునులతో ఇలా చెపుతున్నారు: "మునులారా! రేవానదీ తీరంలో సర్వ సౌఖ్యాలను ఇచ్చే పవిత్ర శివలింగాలు అనంత సంఖ్యలో ఉన్నాయి. ఆ నది శివ స్వరూపం. అందులోని పాషాణాలన్నీ శివ స్వరూపాలే! ఆ నదీ తీరంలో ఆర్తేశ్వరుడు, పరమేశ్వరుడు, సింహేశ్వరుడు, శర్మేశ్వరుడు, కుమారేశ్వరుడు, పుండరీకేశ్వరుడు, మండపేశ్వరుడు, తీక్ష్ణేశ్వరుడు, దుంధేశ్వరుడు, శూలేశ్వరుడు, కుంభేశ్వరుడు, కుబేరేశ్వరుడు, సోమేశ్వరుడు, నీలకంఠేశ్వరుడు, మంగళేశ్వరుడు ఇత్యాది

నామములతో పవిత్రమైన లింగాలు చాలా ఉన్నాయి. మహా కపీశ్వర దేవుడు హనుమంతునిచే ప్రతిష్ఠింపబడిన వాడు. నందికేశ్వరుని మహాత్మ్యం చాలా గొప్పది. ఆ గాథను చెపుతున్నాను వినండి.

పూర్వ కాలంలో రేవా నదికి పశ్చిమ తీరంలో, కర్ణికి అనే పేరుగల నగరంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. మంచి శ్రోత్రియుడు. అతను తన భార్యను కుమారులకు అప్పచెప్పి తను కాశీ యాత్రకు వెళ్ళి అక్కడే మరణించాడు. పుత్రులతనికి శ్రాద్ధ కర్మలను యథావిధిగా నిర్వర్తించారు. శంకరానుగ్రహంచే వారికి ఏలోటు లేకుండ కాలం గడుస్తోంది. కాలగతిలో ఆ బ్రాహ్మణ పత్ని వృద్ధురాలై మరణానికి సిద్ధంగా ఉండి, తానెన్ని పుణ్య కర్మలను ఆచరించినా దైవ సంకల్పంచే మరణ బాధ పడుతున్నది. ఆమె పడుతూన్న కష్టాన్ని చూచి దుఃఖితులైన కొడుకులు ఆమెను సమీపించి “అమ్మా! నీకు ఏమి తక్కువైందని బాధ పడుతున్నావు! నీ కోరిక చెప్పు! వెంటనే తీరుస్తాం!” అని కోరగా ఆమె ఇలా అన్నది. “కుమారులారా! నా మనస్సులో కాశీకి వెళ్ళవలెననే కోరిక తీవ్రంగా ఉంది. కాని అది నెరవేర లేదు! మరణానంతరం నా ఎముకలను అశ్రద్ధ చేయకుండ గంగలో నిమజ్జనం చేయండి! ఇది నా అంతిమ కోరిక!” అని చెప్పి ప్రాణాలను వదిలేసింది. వారామెకు శ్రాద్ధ కర్మలన్నింటిని యథాశాస్త్రీయంగా నడిపారు.

అందులో పెద్ద వాడైన సువాదుడు తల్లి అస్థికలను తీసికొని, సేవకుని వెంటపెట్టుకొని కాశీ నగరానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో ఒక రోజున సూర్యాస్తమయా నంతరం వింశతి గ్రామంలో ఒక బ్రాహ్మణుని ఇంట్లో రాత్రి విశ్రాంతికై బస చేశాడు. ఆ ఇంటి యజమానికి ఒక మంచి ఆవు ఉంది. అతను చేరువ నున్న గ్రామానికి పనిమీద వెళ్ళాడు. బాగా చీకటి పడ్డాక తిరిగి వచ్చి భార్యను ఉద్దేశించి “ఆవు పాలు పితికేవా?” అని అడిగాడు. “లేదు!” అని ఆమె సమాధానమీయగా ఆ గృహస్థు దూడను కట్టు విప్పాడు. అది తుళ్ళుతూ గెంతుతూ పరుగెత్తి యజమాని కాలు తొక్కింది. ఆ బాధకు తాళలేక కోపంతో దూడను కొట్టాడు. అది సొమ్మసిల్లి పడిపోయింది. పాలను పితుక్కొని దూడను కట్టు రాటకు కట్టి ఇంట్లోకి వెళ్ళి పోయాడు యజమాని. ఆవుదూడకు పాలను ఇద్దామనుకొన్నా దూడ కట్టివేయబడి ఉన్న కారణంగా కుదరలేదు. దూడ యొక్క దుస్థితికి ఆవు కన్నీరు కారుస్తూ దుఃఖంతో కుమిలిపోయింది.

తల్లి దుఃఖాన్ని చూచిన దూడ “అమ్మా! ఎందుకలా కన్నీరు విడుస్తున్నావు?” అని జాలిగా అడిగింది. దానికా ఆవు “కుమారా! ఆ దుష్టుడు నిన్ను చాలా హింసించాడు. తల్లి

ప్రేమ గదా బిడ్డా! గుండె తరుక్కు పోతూన్నది! నేను కూడా కట్టురాటకు బంధింపబడి ఉన్నాను. ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి! ఇది మరింత బాధిస్తోంది! అందుకని దుఃఖిస్తున్నాను." అంది.

దానికి పూర్వ జన్మ సంస్కారంకల దూడ ఇలా హితబోధచేశింది: "అమ్మా! జీవులందరు కర్మపాశ బద్ధులు గదా! గత జన్మలలో మనం చేసిన కర్మలకు అనురూపమైన ఫలాలనే ఇపుడు మనం అనుభవిస్తున్నాం. జీవుడు నవ్వుతూ చేసిన కర్మ ఫలాలను ఏడుస్తూ అనుభవించాలి. సర్వము కర్మయందు ప్రతిష్ఠితమై ఉంది. కనుక ఇందులో ఎవరి ప్రమేయము లేదు! పరులను నిందించటం తగని పని దుఃఖించకు!"

గొప్ప జ్ఞానంతో కూడిన కుమారుని ఓదార్పు పలుకులకు సంతోషించి "కుమారా! జీవులు కర్మబద్ధులు అనే విషయం నాకూ తెలుసు. కాని మాయను దాటలేం కదా! నాకు కలిగిన దుఃఖం వంటి దుఃఖమే ఈ దుష్ట బ్రాహ్మణునికి కూడ కలగాలి! దానిని నేను చూడాలి. అప్పుడు నా శోకం ఉపశమిస్తుంది. రేపు ఉదయం వీని కొడుకును కొమ్ములతో పొడిచి చంపుతాను." అని తన నిర్ణయాన్ని చెప్పింది ఆవు.

తల్లి మాటలకు విస్తుపోయిన దూడ "అమ్మా! గత జన్మలలో చేసిన కర్మ ఫలాన్ని ఇప్పుడు అనుభవిస్తున్నాం! చాలదా! ఇంకా తిరిగి దుష్కర్మలను చేయాలా? తెలిసో తెలియకో చేసిన దుష్కర్మల ఫలితాన్ని ఇప్పుడు అనుభవిస్తే అక్కడికి కర్మానుభవం పూర్తవుతుంది. అవి పూర్తి కాగానే ముక్తి లభిస్తుంది. ఇంతకీ విచారించి చూస్తే ఎవరు తల్లి? ఎవరు కుమారుడు? వీరిద్దరి ఋణానుబంధం ఎట్టిది? ఒక జీవుడు తన కర్మ ననుసరించి సుఖదుఃఖాలను అనుభవించటం కొరకు తల్లిగర్భాన పుడతాడు. దానికి మించి ఎక్కువ వ్యామోహాన్ని పెంచుకొనటం వ్యర్థం. పరలోకంలో సుఖాలను అనుభవించాలంటె పుణ్య కార్యాలను చేయాలి. వద్దు! నీవు నా కోసం బ్రహ్మహత్యా పాతకానికి ఒడిగట్టకు!" అని హితవు చెప్పింది.

అంత ఆవు "కుమారా! నువ్వు ఎన్ని చెప్పు! ఆ బ్రాహ్మణుడు కూడా నేననుభవిస్తున్న శోకం వంటి శోకాన్నే పొందాలి! అంతే! ఇది నా నిర్ణయం. మరొక్కవిషయం, బ్రహ్మహత్యాదోషాన్ని పోగొట్టే పవిత్ర స్థలాన్ని నేనెరుగుదును. అక్కడకు వెళ్ళి నా దోషాన్ని పోగొట్టుకొంటాను." అని పల్కింది. దూడ కూడ మౌనంగా ఉండిపోయింది. బాటసారి బ్రాహ్మణుడు ఈ మాటలన్ని విన్నాడు. ఉదయాన్నే ఏమి జరుగుతుందో అనే కుతూహలంతో రాత్రి నిద్రించి ప్రొద్దుటనే లేచాడు.

తెలతెల వారగానే ఇంటి యజమాని పాలను పితుకమని తన కుమారునికి పురమాయించాడు. వాడు ఆవును సమీపించగానే అది కొమ్ములతో కుమ్మింది. దెబ్బలు మర్మస్థానానికి తగిలిన కారణంగా బ్రాహ్మణ కుమారుడు వెంటనే మరణించాడు. బ్రహ్మహత్యా దోషం కారణంగా తెల్లని ఆ గోవు వెంటనే నల్లని రంగును పొందింది. ఇలాటి గోవు ఇక ఉండ కూడదని భావించి గృహస్థు దానిని కొట్టి స్వేచ్ఛగా వదిలేశాడు. ఆ గోవు వెనుకనే బాటసారి బ్రాహ్మణుడు కూడ బయలు దేరాడు. అది తోకను ఎత్తిపెట్టి వేగంగా నర్మద వైపుకు వెళ్ళి నందీశ్వరుని సమీపంలోగల నంది తీర్థంలో మూడుసార్లు మునిగింది. వెంటనే బ్రహ్మహత్యాదోషం తొలగి ఎప్పటియట్ల తెల్లదనాన్ని పొందింది. సువాదుడు ఆశ్చర్యచకితుడై తనుకూడ సేవకునితో కూడి ఆ తీర్థంలో స్నానమాచరించి తిరిగి కాశీకి ప్రయాణమై వెళ్ళబోవునంతలో....

ఆ తీర్థ దేవత సర్వాభరణ భూషితురాలై దివ్యరూపంతో బ్రాహ్మణుని ముందు ప్రత్యక్షమై "ఓ విప్రోత్తమా! నేను గంగాదేవిని! నీ మాతృ భక్తికి సంతసించాను. వైశాఖ శుక్ల సప్తమి చాలా పవిత్రమైన రోజు. ఆ రోజున నేనిక్కడకు వస్తాను. నేడు సప్తమి. నీ తల్లి శ్రాద్ధ కర్మను ఇక్కడ నెరవేర్చుకో! కాశీకి పోనక్కర లేదు." అని చెప్పి అంతర్ధానమైంది. ఆమె చెప్పిన విధంగానే బ్రాహ్మణుడు తన తల్లి అస్థికలను ఆ తీర్థంలో నిమజ్జనం చేశాడు. తీర్థ మహిమచే తల్లి దివ్య రూపంతో సాక్షాత్కరించి అతనిని నిండుమనస్సుతో ఆశీర్వదించి అదృశ్యురాలైంది. బ్రాహ్మణుడు తృప్తితో ఇంటికి వెళ్ళాడు."

### మూఢాసుర సంహారం

సూతుడు శౌనకాది ఋషులతో ఇలా అంటున్నాడు: "మునులారా! గంగాదేవి ఈ తీర్థంలో ప్రవేశించిన గాథను చెపుతున్నాను వినండి! పూర్వం ఋషిక అనే పేరుగల దైవభక్తి పరాయణురాలైన బ్రాహ్మణ కన్య ఉండేది. ఆమెకు యుక్త వయసు రాగానే తండ్రి వివాహం చేశాడు. పూర్వ జన్మల కర్మ ప్రభావంచే ఆమె వైధవ్యాన్ని పొందింది. బాల్యం నుండి శివభక్తి పరాయణురాలైన ఆమె భర్త మరణించటంతో తీవ్రమైన వైరాగ్యాన్ని పొంది ఈ తీర్థసమీపంలో ఏకాగ్ర చిత్తంతో శివుని ధ్యానిస్తూ, కఠిన నియమాలను పాటిస్తూ, తపశ్చర్యకు ఉపక్రమించింది. ఆ సమయంలో మూఢాసురుడనే ఒక రాక్షసుడు ఈ ప్రాంతంలో సంచరిస్తూ యవ్వనంలో ఉన్న ఋషికను చూచి బలాత్కారం చేయబోయాడు. భయ విహ్వల ఐన ఆమె "శివా! శంకరా! పరమేశ్వరా! గంగాధరా! పాహిమాం! పాహిమాం!" అంటూ శివుని పలుమార్లు ప్రార్థించింది. వెంటనే

రుద్రుడు పార్వతితో కూడి ప్రత్యక్షమై తన తీవ్ర కోపానలంచే మూఢాసురుని భస్మం చేసి కృపాదృష్టితో ఋషికను విలోకించి వరాన్ని కోరుకొమ్మన్నాడు. దానికామె చేతులు జోడించి నమస్కరించి స్తుతించి "ఓ ఆది దంపతులారా! మీ పాద పద్మముల యందు నిశ్చలమైన భక్తిని అనుగ్రహించండి! అంతే చాలు! మరొక్కటి! శంకరా! లోకోపకారం కొరకు నీవిక్కడ స్థిరంగా ఉండు. అమ్మా! పార్వతీ! నా కొరకు వైశాఖ శుక్ల సప్తమి నాడు నీవీ తీర్థంలో ఉండి భక్తులను అనుగ్రహించు!" అని ప్రార్థించింది. ఆది దంపతులు 'తథాస్తు' అని పలికి అంతర్ధానమయ్యారు. అప్పటి నుండి ఈ తీర్థం నంది తీర్థంగా, ఇక్కడి శివుడు నందికేశ్వరుడుగా ప్రసిద్ధిని పొందారు."

## గోకర్ణక్షేత్ర – మహాబలేశ్వర మహాత్మ్యము

సూతుడు శౌనకాది ఋషులతో ఇలా అంటున్నాడు: "మునులారా! భూలోకంలో పశ్చిమ దిక్కున ప్రఖ్యాతి వహించిన శివలింగములను గూర్చి చెపుతున్నాను వినండి. కపిలా నగరంలో కాలరామేశ్వరుడు, పశ్చిమ సముద్రతీరంలో మహా సిద్ధేశ్వరులు, గోకర్ణ క్షేత్రంలో మహా బలేశ్వరుడు ఉన్నారు. గోకర్ణ క్షేత్రంలో కోట్ల కొలది శివ లింగాలు, తీర్థాలు ఉన్నాయి. శివుడు కృతయుగంలో తెల్లగాను, త్రేతాయుగంలో ఎర్రగాను, ద్వాపరంలో పచ్చగాను, కలిలో నల్లగాను ఉంటాడు. గోకర్ణంలో శివుడు ఏడు పాతాళాల వరకు వ్యాపించి ఉన్నాడు. **కలిలో ఆయన మృదు స్వభావాన్ని కలిగి ఉంటాడు.** రావణాసురుడు ఘోరమైన తపస్సు చేసి సంపాదించిన లింగాన్ని విఘ్నేశ్వరుడు గోకర్ణంలో ప్రతిష్ఠించాడు.

విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు, విశ్వే దేవతలు, మరుద్గణాలు, ఆదిత్యులు, వసువులు, అశ్వినీ దేవతలు, నక్షత్ర సమూహంతో కూడిన చంద్రుడు ఈ దేవతలందరు మహా బలేశ్వరుని తూర్పు ద్వారమందు ఉండి ఆయనను సేవిస్తూ ఉంటారు. యముడు, మృత్యుదేవత, చిత్రగుప్తుడు, అగ్ని, పితృదేవతలు, రుద్రులు వీరందరు దక్షిణ ద్వారాన్ని ఆశ్రయించుకొని ఉంటారు. వరుణుడు, సముద్రుడు, గంగ ఇత్యాది నదీ సముదాయ మంతా పశ్చిమ ద్వారాన్ని ఆశ్రయించుకొని ఉంటారు. వాయువు, కుబేరుడు, భద్రకాళి, చండిక మొదలగు మాతృమూర్తులు ఉత్తర ద్వారాన్ని ఆశ్రయించుకొని ఉంటారు. ఇక సకలదేవతలు, గంధర్వులు, పితరులు, సిద్ధులు, చారణులు, విద్యాధరులు, కింపురుషులు, కిన్నరులు, గుహ్యకులు, గరుడులు, పిశాచములు, వేతాళులు, రాక్షసులు, శేషుడు, నాగులు, సకల సిద్ధులు, మునులు వీరందరు నిత్యము ఆ మహాబలేశ్వరుని సేవిస్తూ సర్వ కామనలను పొంది సుఖంగా ఉంటున్నారు.

గతంలో అనేకమంది ఆ విభుని సేవించి పరమ సిద్ధిని పొందారు. మాఘ కృష్ణ చతుర్దశి నాడు మహా బలేశ్వరుని సేవిస్తే విశేషమైన ఫలాన్ని పొందుతారు. ఒక చండాల స్త్రీ ఆ స్వామిని సేవించి శివలోకాన్ని పొందిన విచిత్రగాథను చెపుతున్నాను వినండి!

పూర్వం ఒక గ్రామంలో సౌమిని అనే పేరుగల రూపసి, లావణ్య రాశి, లక్షణవతి అయిన ఒక బ్రాహ్మణ కన్యక ఉండేది. ఆమెకు యుక్త వయసు రాగానే వివాహం జరిపించి అత్తవారింటికి పంపించాడు తండ్రి. నూతన యౌవనంలో ఉన్న ఆమె భర్తతో చాలాకాలం కాపురం చేసింది. విధి వక్రించిన కారణంగా ఆమె భర్తను కోల్పోయింది. చాలా కాలం సౌశీల్య సదాచారాలతో ఆమె అతి పవిత్రంగా జీవితాన్ని గడిపింది. కాని యౌవనోద్రేకాన్ని అణచుకో లేక వ్యభిచారిణి అయింది. ఆమె దుష్ప్రవర్తనకు కినిసి బంధువులు, గ్రామస్థులు ఆమెను వెలివేశారు. ఆమె ఎక్కడకో పోయి స్వతంత్రంగా జీవిస్తూ వచ్చింది. ఆ స్థితిలో ఒక నీచునితో పొత్తు కుదిరి క్రమంగా మద్యమాంసాలకు అలవాడు పడింది. ఒక కుమారుడు కూడా కలిగాడు. ఒక రోజున ఆమె భర్త మేకల బేరానికై గ్రామాంతరం వెళ్ళాడు. చీకటి పడగానే సౌమిని మద్యాన్ని కడుపునిండుగా త్రాగి మాంసాన్ని అభిలషించి పశువుల శాలలోనికి వెళ్ళి మద్యం మత్తులో కన్ను గానక ఒక లేగదూడను సంహరించి లోపలికి తెచ్చింది. అది ఆవు దూడ అని గుర్తించి 'శివ! శివ!' అని ముహూర్త కాలం శివుని ధ్యానించి కూరగా వండుకొని తినేసింది.

కొంత కాలానికి ఆమె మరణించి పూర్వజన్మ కర్మ ఫలానుసారంగా చండాల జాతిలో జన్మించింది. ఆమె పుట్టు గ్రుడ్డి. బాల్యంలోనే ఆమెకు తల్లిదండ్రులు మరణించారు. వయస్సు కొంచెం వచ్చేసరికి కుష్ఠ వ్యాధి కూడా ప్రవేశించింది. అట్టి స్థితిలో ఆమెను ఎవరు వివాహం చేసికొంటారు? ఆమె బిచ్చమెత్తుకొంటూ జీవితాన్ని గడుపుకొంటూ ఉండేది. వృద్ధురాలైంది. ఒక రోజున గోకర్ణ క్షేత్రానికి వెడుతూన్న భక్త బృందంతో కలిసి గోకర్ణానికి వచ్చి అక్కడ కూడా యాచనతో బ్రతుకుతూ వచ్చింది. ఒకరోజున శివ చతుర్దశినాడు ఒక భక్తుడు ఆమె చేతిలో మూడు మారేడు దళాలను వేశాడు. అది తినే వస్తువు కాదని ఎరిగి ఆమె విసిరివేయగా శివలింగం మీద పడ్డాయి దళాలు. ఆనాడు తినటానికి ఆమెకు ఆహారం లభించలేదు. ఆ మరునాడు తిరిగి తన స్వస్థానానికి బయలుదేరింది. వయోభారం చేతను, తిండిలేని కారణంగాను కొంత దూరం నడిచి కుప్పకూలి మరణించింది. అనుకోకుండగానే ఆమెకు శివరాత్రి ఉపవాసము, బిల్వ పూజ, జాగరణము, నామస్మరణ ఇత్యాది పుణ్యకర్మల ఫలం లభించిన కారణంగా ఆమెకు మహాబలేశ్వరుని సన్నిధిలో స్థానం లభించింది."

సూతుడు మునులతో ఇలా అంటున్నాడు: "మునులారా మీకిప్పుడు గోకర్ణ క్షేత్ర మహాత్మ్యాన్ని చెపుతున్నాను వినండి. పూర్వం ఇక్ష్వాకు వంశంలో పరమ ధార్మికుడు, గొప్ప ధానుష్కుడు అగు మిత్రసహ మహారాజుండే వాడు. అతని భార్య పేరు మదయంతి. ఒకసారి ఆ మహారాజు సైన్యంతో కూడి దట్టమైన అడవిలోనికి వేటకు వెళ్ళాడు. జంతువులతో పాటు తనను సంహరించటానికి వస్తూన్న కమఠాసురుడనే దుష్టుని సంహరించాడు. ఆ దుష్టుని తమ్ముడు మహారాజును మోసంచే జయించాలని నిశ్చయించుకొని మారువేషంతో వచ్చి రాజును ఆశ్రయించాడు. రాజు వానిని వంట శాలకు అధిపతిగా నియమించాడు.

ఒక రోజున మహారాజు తన తండ్రి మరణ తిథి రోజున రాజగురువైన వసిష్ఠుని భోజనానికి ఆహ్వానించాడు. వచ్చిన వసిష్ఠునికి వంటవాని రూపంలో ఉన్న రాక్షసుడు కూరలో నరమాంసాన్ని కలిపి వడ్డించాడు. దానికి వసిష్ఠుడు కినిసి రాజును "నరమాంస భక్షకుడవగు రాక్షసుడవు కమ్ము!" అని శపించాడు. కాని జరిగిన దాంట్లో రాజు యొక్క తప్పిదం లేదని గ్రహించి శాపావధిని పన్నెండు సంవత్సరాలకు మాత్రమే కట్టడి చేశాడు. వసిష్ఠుని శాపానికి కుపితుడైన రాజు తిరిగి గురువును శపించటానికి ఉద్యుక్తుడై శాపజలాన్ని అందుకోగా భార్యఐన మదయంతి వారించింది. రాజు నిగ్రహించుకొని ఆ జలాన్ని తన పాదాలపై చల్లుకోగా తక్షణం అవి నల్లగా అయ్యాయి. అప్పటి నుండి ఆ మిత్రసహ మహారాజు కల్మాషపాదుడు అను పేరుతో విఖ్యాతుడయ్యాడు.

గురువైన వసిష్ఠ మహర్షి శాపాన్ని అనుసరించి ఆ రాజు రాక్షస రూపాన్ని ధరించి అడవిలో జంతువులను, నరులను చంపి భక్షిస్తూ తిరుగుతూ, ఒకరోజున నూతన వధూవరులైన ఇద్దరు ముని దంపతులను చూచాడు. చూచి యౌవనంలో ఉన్న ముని కుమారుని పట్టుకొన్నాడు రాక్షసుడు. అతని భార్య ఎంత బ్రతిమిలాడినా కించిత్తైనా కరుణ చూపక ఆ ముని కుమారుని ఎముకలు మాత్రం మిగిల్చి; తక్కిన మాంసాన్ని తినేశాడు రాక్షస రూపంలో ఉన్న రాజు. ఆ బ్రాహ్మణ స్త్రీ అస్థికలను పేర్చి చితిని ఏర్పాటుచేసికొని అందు అగ్నిప్రవేశం చేయబోతూ "ఈనాటి నుండి నువ్వు ఏ స్త్రీతో సంగమించినా వెంటనే నీకు మృత్యువు సంప్రాప్తిస్తుంది! నాకు భర్తృసుఖం లేకుండా చేసిన నీ కర్మకు ప్రతికర్మ రూపంగా లభించే ఫలాన్ని నీవనుభవింపక తప్పదు. ఇది నా శాపం!" ఇలా శపించి ఆ పతివ్రత అగ్ని ప్రవేశం చేసింది.

రాజు శాపావధి పర్యంతము రాక్షస రూపంలో సంచరించి అనంతరం తన నిజరూపాన్ని పొంది రాజధానికి చేరుకొన్నాడు. సంతానం లేని రాజు బ్రాహ్మణ యువతి శాపానికి భయపడి రాజ్యం ఉన్నా రాజ్య సుఖాలను అనుభవించ లేక వైరాగ్యాన్ని ఆశ్రయించి వనసంచారానికి వెళ్ళిపోయాడు. అతని వెనుకనే బ్రహ్మహత్యా దోషం భయపెడుతూ మహా దుఃఖాన్ని కలిగిస్తూ సంచరిస్తూ వచ్చింది. తద్దోష నివారణార్థం రాజు అనేక జపాలు, వ్రతాలు, యజ్ఞాలు చేయించాడు గాని అవన్నీ నిష్ఫలమయ్యాయి. ఒకరోజున మిథిలా నగర ప్రాంతంలో సంచరిస్తూండగా గౌతమ మహర్షి దర్శనమైంది. ఆయన ముందు తన దుఃఖాన్ని వెళ్ళబుచ్చుకొన్నాడు రాజు. ఆయన కల్మాషపాదుని దుస్థితికి చింతించి గోకర్ణ క్షేత్రమహాత్మ్యాన్ని మహాబలేశ్వర మహిమను విపులంగా చెప్పి వెళ్ళి అక్కడ శరణాగతిని పొందమన్నాడు. మహర్షి మాట చొప్పున రాజు అక్కడకు వెళ్ళి అక్కడి తీర్థాలలో స్నానమాచరించి, నియమ నిష్ఠలతో విధివిధానంగా మహాబలేశ్వరుని పూజించి బ్రహ్మహత్యా దోషంతోపాటు సకలమైన పాపాలనుండి విముక్తుడై మరణానంతరం శివ సాయుజ్యాన్ని పొందాడు.

మునులారా! గోకర్ణక్షేత్రంలో మహా పవిత్రమైన చంద్రభాలేశ్వర లింగం ఉంది. దానిని కైలాసం నుండి రావణుడు తెచ్చాడు. నైమిశారణ్యక్షేత్రంలో ఋషీశ్వర లింగం మహిమాన్వితమైనది. దేవ ప్రయాగలో లలితేశ్వరుడు, నయపాల నగరంలో పశుపతీశ్వర లింగం ఉంది. ఈ పశుపతీశ్వర లింగం తల ఆకారాన్ని పోలి ఉంటుంది. దానికి దగ్గరలో ముక్తి నాథేశ్వర లింగం ఉంది. ఇవన్నీ పరమ పవిత్రమైన లింగములు!".

**హాటకేశ్వరుని ఆవిర్భావము**

సూత మహర్షి శౌనకాది ఋషులతో ఇలా అంటున్నాడు: "ఓ తపోధనులారా! శివుడు లింగ రూపంలోను పార్వతి బాణరూపంలోను ఆవిర్భవించిన గాథను మా గురువుగారైన వ్యాస భగవానుని ముఖతః విన్నదానిని మీకు చెపుతున్నాను వినండి. ఈ గాథ శ్వేత వరాహ కల్పం లోనిది కాదు. దానికి ముందు గతించిన కల్పం లోనిది. కాలం అనంతం కదా! కథా భేదాలను కల్ప భేదాలుగా అన్వయించుకోవాలి! గతించిన కల్పంలో జరిగిన శివుని దారుకా వన విహార గాథను చెపుతున్నాను వినండి!

హిమవత్పర్వత ప్రాంత దారుకావనం చాలా గొప్పది. మహా మహిమాన్వితమైనది. అక్కడి గాలిని పీల్చి, జలపానం చేస్తే చాలు ప్రాణులకు ఆకలి దప్పికలుండవు! అక్కడ

మనస్సు నిర్మలంగా ఉండి యోగం త్వరగా సిద్ధిస్తుంది. జరా, మరణాదులు దరిజేరవు! అనారోగ్యం అనేది లేదు. క్షణంలో సమాధి స్థితి లభిస్తుంది. అక్కడ అనేక మంది శివ భక్తులైన మునులు సుబల, మార్కండేయ, శునక, మౌంజాయన, మాండవ్య, బక, దాల్భ్య, రైభ్యక, భల్లకి, జతుకర్ణ, కుత్స, అగస్త్య, అత్రి, భార్గవ గోత్ర సంభవులు పత్నులతో కూడి సుఖంగా తమ తమ అనుష్ఠానాలను నెరవేర్చుకొంటూ ఆశ్రమ జీవితాలను నడుపు కొంటున్నారు. పరమేశ్వర పద సమారాధనను ఎన్నడు విడువని శివభక్తులు వారు!

మునుల శివ భక్తిని, ముని పత్నుల పాతివ్రత్యాన్ని పరీక్షింప నెంచి పరమేశ్వరుడు దిగంబరుడై, విరూపియై సాక్షాత్కరించి హస్తంతో లింగాన్ని ధరించి కొన్ని దివ్య లీలలను ప్రదర్శించాడు. సర్వజ్ఞ శేఖరుడు, మహా తేజస్వి, దిగంబరుడు ఐన పరమాత్మ కేవల పరీక్షార్థం ప్రకటించిన చారీ, కరణ, అంగహార, పిండీ బంధాలతో కూడిన నర్తన విలాసానికి మునిపత్నులు సమ్మోహితులై విస్మితులయ్యారు. ఆ సమయంలో అక్కడ ఉండి పరమేశ్వర లీలా విలాసాన్ని ప్రత్యక్షంగా గమనించిన జ్ఞాన స్వరూపుడైన నందికేశ్వరుడు; భూలోకంలోని మనుష్యులకు పరమ ప్రయోజనాన్ని చేకూర్చ తలచి, లోక కళ్యాణ వాంఛాతత్పరుడై ఆ లీలలను క్రోడీకరించి సంగ్రహంగా నాట్య శాస్త్రాన్ని, కామ శాస్త్రాన్ని వ్రాశాడు. నందీశ్వరుని (తండువు) నుండి వరుసగా బ్రహ్మ, వాసుకి, నారద, వ్యాస, ఆంజనేయులు నాట్య శాస్త్ర ప్రవర్తకులు. భగవాన్ నంది నుండి శ్వేతకేతువు, బాభ్రవ్యుడు, చారాయణుడు, సువర్ణనాభుడు, ఘోటక ముఖుడు, గోనర్దీయుడు, దత్తకుడు, గోణికా పుత్రుడు, కుచుమారుడు వాత్స్యాయనుడు వీరు కామశాస్త్ర ప్రవర్తకులు.

ఇంతలో అగ్ని కార్యానికి, గృహావసరాలకు తగిన సామగ్రిని తెచ్చుకోటానికి వనానికి వెళ్ళిన ఋషులు వచ్చి; అవధూత రూపంలో ఉన్న శివుని చూచి పరబ్రహ్మానుసంధాన లబ్ధి చేకూరిన యోగులవలె పారవశ్యంలో మునిగి తేలుతున్న ముని పత్నులను చూచి అద్భుత రసంలో మునిగి పోయారు. శివమాయా మోహితులైన ఋషులు అవధూత రూపంలో ఉన్న శివుని "నీవెవరు?" అని అనేక సార్లు ప్రశ్నించినా ఆయన నుండి సమాధానం రాకపోయే సరికి కుపితులై ఇలా శపించారు: "ఓ దిగంబరావధూతా! నీ ప్రవర్తన సనాతనమైన వేద ధర్మానికి విరుద్ధంగా ఉంది! లింగం ఉన్న పురుషుడు సిగ్గుపడి బట్టచే దానిని ఆచ్ఛాదించుకొంటాడు! లజ్జా విహీనుడవై వస్త్ర పరిత్యాగం చేసిన నీకు లింగంతో పనేమిటి? నీ లింగం తక్షణం తెగి నేలపై పడుగాక!"

ఋషుల వాక్కు అమోఘం కనుక మరుక్షణంలో లింగం భూపతితమైంది. అగ్ని సదృశమైన ఆ లింగం ముల్లోకాలలోను సంచరిస్తూ దహించటం మొదలుపెట్టింది! ఊహించని వైపరీత్యానికి దుఃఖితులైన ఋషులు, దేవతలు పితామహుని శరణువేడగా ఆయనిలా కర్తవ్యబోధ చేశాడు. "ఓ ఋషులారా! పరమశివ తత్త్వాన్ని తెలుసుకోలేక ఆయన విషయంలో మీరు అపచారం చేశారు. సర్వసృష్టికి కారణభూతమైన ఆ మహా తేజోలింగాన్ని గిరిజాదేవి తక్క మరెవరూ స్థిరంగా ధరించలేరు! ఆమెను ప్రార్థించండి! ఆమె పానవట్ట రూపాన్ని (యోని రూపాన్ని) ధరిస్తే ఆ అగ్నిలింగం దానియందు శాంతించి స్థిరమవుతుంది. అప్పుడు లోకాలకు శాంతి కలుగుతుంది. శతరుద్రీయ మంత్రాలను పఠిస్తూ, వేదోక్త విధానంగా పూజించి పానవట్టం మీద లింగాన్ని ఉంచి అభిషేకించండి! అప్పుడది స్థిరంగా ఉంటుంది."

బ్రహ్మగారు చెప్పినట్లుగా ఋషులు పార్వతీ పరమేశ్వరులను ప్రార్థించారు. జగన్మాత ఐన పార్వతి యోని రూపంలో (పానవట్టం రూపంలో లేదా పీఠ రూపంలో) ఆవిర్భవించి ఆ తేజో లింగాన్ని ధరించింది. దానికి హాటకేశ్వరుడని, శివాశివులని పేరు ప్రఖ్యాతమైంది. ఆ లింగాన్ని పూజించిన వారు ఇహంలో సర్వ సమృద్ధిగా నానా సుఖాలను అనుభవించి పరంలో ముక్తిని పొందుతారు."

**వటుకోత్పత్తి అనగా శివాలయాలలో తంబళి జాతి (శివార్చకుల) ఉత్పత్తి గాథ**

సూతుడు మునులతో ఇలా అంటున్నాడు: "మునులారా! పూర్వం అంధకాసురుడనే రాక్షసుడు సముద్రంలో లోతైన స్థానంలో ఒక బిలాన్ని ఏర్పాటు చేసికొని అక్కడ నివాసముంటూ బయటికి వచ్చి ప్రజలను పీడిస్తూ ఉండేవాడు. దేవతల ప్రార్థనపై రాక్షసుడు బయటకు వెళ్ళగా చూచి శివుడు ఆ బిలంలో ప్రవేశించి వాడు తిరిగి రాగానే శూలంతో పొడిచి చంపాడు. వాని కోర్కెపై అక్కడే శంకరుడు అంధకేశ్వర నామంతో ఇప్పటికీ ఉన్నాడు. ఆ లింగాన్ని ఆరునెలలు పూజిస్తే నిస్సందేహంగా కోర్కెలు నెరవేరుతాయి.

మునులారా! ఈ సందర్భంలో వటుకోత్పత్తి గాథను అనగా శివాలయములలో అర్చకులుగా ఉంటూ పొట్ట పోషించుకొనే తంబళి జాతి వ్యవస్థ యొక్క పుట్టుకను చెపుతున్నాను వినండి! ఏ బ్రాహ్మణుడైతే శివార్చనను జీవనోపాధిగా చేసికొని బ్రతుకుతాడో వానికి 'దేవలకుడు' అని పేరు. వానికి వైదిక కర్మలయందు అధికారం లేదు. అట్టి వాని కర్తవ్యాన్ని, సంఘంలో వాని స్థానాన్ని గురించి చెపుతున్నాను వినండి. వారికి తంబళిజాతి వారని శివార్చకులని లోకంలో నామాంతరాలున్నాయి.

పూర్వ కాలంలో ధర్మాత్ముడు, వేదపారంగతుడు, శివభక్తి రతుడు అగు దధీచి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. వానికి సుదర్శనుడనే కొడుకున్నాడు. వాని భార్యపేరు దుకుల. ఆమె దుష్టకుల సంజాత. ఆమె యందు వానికి నలుగురు పుత్రులు కలిగారు. సుదర్శనునికి భార్య అంటే వల్లమాలిన ప్రేమ! క్షణం కూడ ఆమెను విడిచి ఉండలేక పోయేవాడు! ఒక రోజున తండ్రిఐన దధీచి గ్రామాంతరం వెడుతూ కొడుకుతో శివారాధన మానవద్దని చెప్పి వెళ్ళాడు. తిరిగి రావటం ఆలస్యమైంది. బంధువుల కోర్కెపై కొంతకాలం అక్కడ ఉండిపోయాడు. ఇంతలో ఒకనాడు శివరాత్రి పర్వదినం వచ్చింది. ఆ రోజున సుదర్శనుడు ఉపవాసముండి శివపూజ చేసి గుడిని విడిచి ఇంటికి వెళ్ళాడు. అతి కాముకుడైన కారణంగా సుదర్శనుడు ఆరోజు మహా పర్వదినం అనే జ్ఞానం ఇసుమంత కూడా లేక భార్యను కలిసి స్నానం కూడా చేయకుండా తిరిగి దేవాలయంలో ప్రవేశించి లింగోద్భవ కాలం వరకు పూజాదికాలను నిర్వర్తించాడు. దానికి శివుడాగ్రహించి ఆ రాత్రి కలలో కనుపించి "నీకు నన్ను స్పృశించే అధికారం లేదు! జడునివలె ప్రవర్తించావు కనుక జడుడవు అవుతావు!" అని శపించాడు.

ఇంతలో కొద్ది రోజులకు దధీచి గ్రామాంతరం నుండి వచ్చి సుదర్శనుని ద్వారా జరిగింది తెలుసుకొని చాలా దుఃఖించాడు. విజ్ఞుడు శివ తత్త్వాన్ని తెలిసిన వాడు కనుక దధీచి పుత్ర సుఖాన్ని కోరి చండీ పూజా విధానాన్ని అనుసరించి కొడుకుతో కూడి పార్వతిని పూజించాడు. వారిద్దరి భక్తికి, నిష్ఠకు ప్రసన్నురాలైన పార్వతి సుదర్శనుని తన పుత్రునిగా స్వీకరించింది. అర్ధనారీశ్వరుడైన శంకరుడు కూడా ప్రసన్నుడయ్యాడు. జగన్మాత ఐన పార్వతి సుదర్శనుని తన ఒడిలో కూర్చుండపెట్టుకొని మూడుపేటలతో మరియు ఒక ముడితో ఉన్న యజ్ఞోపవీతాన్ని వాని ఎడమ భుజంపై వేసి పదహారు అక్షరాలుగల శివగాయత్రిని ఉపదేశించింది. అపుడా సుదర్శనుడు శ్రీకారంతో కూడిన 'ఓం నమశ్శివాయ' మంత్రాన్ని పదహారు పర్యాయాలు జపించి శాస్త్రోక్త విధివిధానంగా పార్వతీపరమేశ్వరులను పూజించాడు.

అప్పుడా ఆది దంపతులు వాని పూజకు సంతసించి ఇలా వరాలిచ్చారు. "ఓ సుదర్శనా! ఈ నాటినుండి నీవు నీ సంతానము శివపూజార్చనా నిమగ్న మానసులై దానినే జీవనోపాధిగా చేసికొని జీవించండి! అందులో మీకు ఏదోషమూ అంటదు! మా ఇద్దరకు చేసే పూజలన్నింటిలో నీవే ప్రధానుడవు. భక్తులు మాకు సమర్పించే నూనె, నేయి ఇత్యాది పూజా ద్రవ్యాలను నీవు గ్రహించవచ్చు. ప్రాజాపత్య వ్రత సందర్భంలో నీవు ఒక్కడవు

మాత్రమే అక్కడ ఉండతగిన వాడవు. అప్పుడు మాత్రమే ఆ పూజ సఫలమవుతుంది. లేనిచో వ్యర్థమే. రోజూ స్నానం చేసి భస్మను ధరించి తిలకధారణానంతరం శివగాయత్రిని జపించి శివపూజకు ఉపక్రమించు. శుభ-అశుభ కర్మలన్నిటియందు నీకు స్థానం ఉంటుంది. ముందు నిన్ను పూజించ కుండ శివపూజ చేయరాదు. అట్లు చేస్తే అది వ్యర్థమే." ఇలా వరాలిచ్చి ఉమాశంకరులు సుదర్శనుని నలుగురు పుత్రులను వటువులుగా (శివుని ప్రతీకలుగా) నాలుగు దిక్కులలో కూర్చోపెట్టి అభిషేకించి ఆకల్పాంతం వర్థిల్లమని ఆశీర్వదించారు. వారు పార్వతీ పరమేశ్వరులచే స్థాపింప బడినారు కనుక వటువులని, తపస్సు ప్రధానంగా గల బ్రాహ్మణ ధర్మం నుండి జారిపోయారు కనుక 'తపోధములు' అని పిలువబడుతున్నారు. వటువులు ఎప్పుడైనా, ఎక్కడైనా శ్రేష్ఠులే. శివపూజానంతరం "మీ పూజ పూర్ణమగు గాక!" అని శివార్చకుడు అంటేనే ఆ పూజ సఫలమవుతుంది."

## ద్వాదశ జ్యోతిర్లింగ ప్రాదుర్భావ చరిత్ర

**సోమనాథేశ్వర జ్యోతిర్లింగ పాదుర్భావము**

సూతుడు శౌనకాది మహర్షులతో ఇలా అంటున్నాడు: "ఓ తపోధనులారా! ద్వాదశ జ్యోతిర్లింగములు ఆవిర్భవించిన చరిత్రను, వాటి మహాత్మ్యాన్ని చెపుతున్నాను వినండి. పూర్వం దక్ష ప్రజాపతి తన అశ్విన్యాది ఇరవై ఏడుగురు కన్యలను చంద్రునికిచ్చి వివాహం చేశాడు. చంద్రుడు రోహిణియందు మిక్కిలి అనురాగం కలవాడై ఉండి తక్కిన భార్యలను నిర్లక్ష్యం చేయగా వారు తండ్రితో భర్త విషయంలో తమ అసంతృప్తిని గూర్చి మొరపెట్టుకొన్నారు. దక్షుడు అల్లుడైన చంద్రుని వద్దకు వచ్చి భార్యలందరి యందు సమభావాన్ని కలిగి ఉండమని కొన్ని హితోక్తులు చెప్పాడు గాని ప్రారబ్ధం బలీయమైన కారణంగా చంద్రుడు ఆయన మాటలను లెక్కచేయలేదు. అలాపలుమార్లు చెప్పినా నిర్శక్ష్యం చేసిన చంద్రుని "క్షయ వ్యాధి పీడితుడవు కమ్ము!" అని శపించాడు దక్షుడు. మరుక్షణంలో చంద్రుడు క్షయరోగి అయ్యాడు. చంద్రుడు క్షీణించగానే దేవతలు, ఋషులు, మనుష్యులాదిగా ముల్లోకాల ప్రాణికోట్లు తల్లడిల్లిపోయాయి. తనువు నిచ్చిన తండ్రి తనయ నిచ్చిన మామ ఈ ఇద్దరూ సమానంగా గౌరవింప తగిన వారు. అట్టి మామగారి మాటను ధిక్కరించినందుకు తగిన ప్రాయశ్చిత్తం జరిగిందని చంద్రుడు కూడా బహిరంగంగానే కుమిలిపోసాగాడు. తొందరపడి శపించి నందుకు దక్షుడు కూడ దుఃఖించాడు.

అందరు కలిసి వెళ్ళి పితామహునితో జరిగిన దానిని చెప్పి మీది కర్తవ్యాన్ని ఉపదేశించ వలసిందని కోరగా ఆయన "చంద్రునితో కూడి మీరందరు ప్రభాసక్షేత్రానికి వెళ్ళి అక్కడ శివలింగాన్ని స్థాపించి మృత్యుంజయ మంత్రాన్ని జపిస్తూ వేదోక్తంగా శివుని ఆరాధించండి! ఆయన అనుగ్రహంతో మీ అభీష్టాలన్ని సఫలమవుతాయి!" అని చెప్పి పంపించాడు. వారలాగే చేశారు. వారి పూజకు ప్రసన్నుడైన శంకరుడు ప్రత్యక్షమై "ఓ దేవతలారా! మీ మనోగతం నాకు తెలుసు, దక్షుని శాపం తప్పదు. తపోధనులైన వారి వాక్కు తిరుగు లేనిది. ఇక ఈపైన చంద్రుడు ప్రతిరోజు షోడశకళా ప్రపూర్ణుడై ప్రకాశించటం అనేది ఉండదు. లోక హితాన్ని కోరి నేనొక వరాన్ని ఇస్తున్నాను. ఓ చంద్రా! ఈపైన నీ కళలు శుక్లపక్షంలో దినానికి ఒకటి చొప్పున వృద్ధిచెంది పూర్ణిమ నాడు మాత్రం పదహారు కళలతో ప్రకాశిస్తావు. ఆపై కృష్ణపక్షంలో ప్రతిరోజు ఒక్కొక్క కళ క్షయించి అమావాస్యనాడు కళ అనేది లేకుండ పూర్తిగా క్షయిస్తావు." అని వరమిచ్చాడు.

శంకరుని పల్కులకు సంతుష్టాంత రంగులైన దేవతలు "మహాదేవా! హే కృపాసింధో! నీ అనుగ్రహంచే లోకాలకు ముప్పు తప్పింది. మాదొక్క విన్నపం. జరిగిన దానికి నిదర్శనంగా పార్వతితో కూడి ఈ క్షేత్రంలో స్థిరంగా ఉండిపో! చంద్రునిపై కరుణ చూపినట్లుగానే మానవులపై కూడ నీ మహిమను విస్తరించు" అని ప్రార్థించారు. అంత శంభుడు 'తథాస్తు' అని పలికి తన తేజస్సును అక్కడ నిలిపి అంతర్ధానమయ్యాడు. దేవతలు అక్కడ ప్రతిష్ఠించిన కుండానికి చంద్రకుండమని పేరు. ఆ కుండంలో మానకుండ ఆరు నెలలు స్నానం చేస్తే క్షయ, కుష్ఠ మొదలుగా సమస్తమైన వ్యాధులు నశిస్తాయి. చంద్రుని పేరుతో వెలసిన లింగమే సోమనాథేశ్వర జ్యోతిర్లింగం."

**మల్లికార్జున జోతిర్లింగ ఆవిర్భావం**

సూతమహర్షి మునులతో ఇలా అంటున్నాడు: "మునులారా! కుమార స్వామి వృత్తాంతాన్ని మీకు 'రుద్రసంహిత – కుమార ఖండం'లో చెప్పాను. కుమారస్వామి తనకంటె ముందు గణేశునికి వివాహం చేశారనే కారణంగా తల్లిదండ్రుల మీద కినిసి క్రౌంచ పర్వతాన్ని ఆశ్రయించుకొని ఉంటూవచ్చాడు. పుత్రప్రేమచే పార్వతీ పరమేశ్వరులు కుమారునికి నచ్చచెప్పితమ కైలాసానికి తోడ్కొని వద్దామనే సంకల్పంతో క్రౌంచ పర్వతం దగ్గరకు వెళ్ళారు. వారు వస్తున్నారని తెలిసి షణ్ముఖుడు ఆ పర్వతాన్ని విడిచి మూడు యోజనాల దూరం వెళ్ళి అక్కడున్నాడు. పార్వతీ పరమేశ్వరులు అప్పటినుండి ఆ క్రౌంచపర్వతం మీద జ్యోతిస్స్వరూపులై

నిల్చి ఉన్నారు. వారు కుమారుని చూచుటకై అమావాస్యనాడు శంభుడు, పూర్ణిమనాడు పార్వతి స్వయంగా వచ్చి ఆ పర్వతం మీద ఉంటారు. ఆనాటి నుండి ఆ గిరి మీద మల్లికార్జున లింగం వెలసి ముల్లోకాలలో విఖ్యాతమైంది.

**మహాకాళేశ్వర ఆవిర్భావం**

మీకు మహా కాళేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ చరిత్రను దాని మహాత్మ్యాన్ని చెపుతున్నాను వినండి. పూర్వం అవంతీ నగరంలో వేదకర్మరతుడు, వేదాధ్యయన సంపన్నుడు, నిత్యాగ్నిహోత్రి, శివార్చనా శీలుడు అగు ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి నలుగురు కొడుకులు. తండ్రితో సమానులు. పెద్దవాని పేరు దేవప్రియుడు, రెండవవాడు ప్రియమేధసుడు, మూడవవాడు సుకృతుడు, నాల్గవవాడు ధర్మవాహి. వారి శీలము, తపస్సు కారణంగా అవంతీ నగరం బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తూ గొప్పకీర్తి ప్రతిష్ఠలను పొందింది.

ఆ కాలంలో రత్నమాలా పర్వతం మీద దూషణాసురుడు అనే రాక్షసుడు వైదిక ధర్మం మీది ద్వేషంతో దానికి ఆధారభూతులైన బ్రాహ్మణులను హింసిస్తూ ఉండేవాడు. అవంతీ నగర కీర్తిని, ఆ నలుగురు బ్రాహ్మణుల ధర్మనిష్ఠను, శివారాధనా తత్పరతను గూర్చి విని వాడు నగరం మీదకు దండయాత్రచేసి ముట్టడించాడు. నగరాన్ని వశం చేసికొని బ్రాహ్మణులున్న చోటికి వచ్చి నిలిచాడు. వారప్పుడు పరమేశ్వరారాధనా నిమగ్నమానసులై ఉండి రాక్షసుని పట్టించుకొనలేదు. బ్రాహ్మణుల నిర్లక్ష్యానికి మిక్కిలి కోపించిన అసురుడు "ఈ బ్రాహ్మణులను చంపండి" అని భటులను ఆజ్ఞాపించాడు. భటులు వాని ఆజ్ఞను నెరవేర్చబోయేటంతలో ఆ బ్రాహ్మణులు పూజిస్తున్న పార్థివ లింగ ప్రదేశంలో పెద్ద బిలం ఏర్పడి దాని నుండి హూంకారం చేస్తూ ఒక భయంకర ఆకారం ఆవిర్భవించి క్షణంలో దూషణాసురుని వాని సైన్యాన్ని భస్మీపటలం చేసింది. ఆ ఆకారాన్ని బ్రాహ్మణులు రుద్రుని మహాకాల స్వరూపంగా గుర్తించి అనేక విధాల స్తుతించి ఆ బిలమునందే స్థిరంగా ఉండమని ప్రార్థించారు. శంకరుడు 'తథాస్తు' అని పలికి అంతర్ధానమయ్యాడు. ఆ లింగం యొక్క ఆధార పీఠం నాలుగు దిక్కుల క్రోసు వరకు విస్తరించి ఉంది. ఇది మహాకాళేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ చరిత్ర.

మునులారా! ఈ మహాకాళేశ్వరుని అర్చించి ఉజ్జయినీ నగర పాలకుడైన చంద్రసేన మహారాజు ఉత్తమ గతిని పొందాడు. ఆయన పరిపాలన లోనే ఒక గొల్లపిల్లవాడు బాల్యంలోనే తీవ్ర శివభక్తి యుతుడై మనసులోనే మహాకాలుని ధ్యానించి శివానుగ్రహమును పొందాడు.

ఆ బాలునికి హనుమంతుడు సాక్షాత్కరించి "వత్సా! నీ వంశంలో ఇప్పటికి ఎనిమిదవ తరంలో నందుడనే వాడు జన్మించి కీర్తిశాలి అవుతాడు. నారాయణుడు స్వయంగా శ్రీకృష్ణుడను పేరుతో జన్మించి వానికి పుత్రుడవుతాడు. ఈనాటి నుండి నీవు శ్రీకరుడు అనే పేరుతో ఖ్యాతిని పొందగలవు!" అని వరమిచ్చాడు. ఇది పుణ్యగాథ.

### ఓంకారేశ్వర ఆవిర్భావ గాథ

త్రిలోక సంచారి ఐన నారదుడు సంచారంలో భాగంగా పుణ్యక్షేత్ర, తీర్థ సంసేవనం చేస్తూ పశ్చిమ సముద్ర తీరమందున్న గోకర్ణేశ్వరుని సేవించి నర్మదలో అవగాహనం చేసి పర్వతరాజమైన వింధ్యను దర్శించాడు. అతిథి అభ్యాగత సేవా తత్పరుడైన వింధ్యరాజు ఆకాశవీధి నంటిన తన స్థావర రూపం అలా ఉండగానే జంగమ రూపాన్ని ధరించి భయభక్తులతో ఎదురేగి నమస్కరించి, నారదుని ఉచితాసనాసీనుని చేసి గర్వంతో ఇలా అన్నాడు. "ఓ నారద మహర్షీ! గతి తప్పకుండ ధరాభారాన్ని వహించే నా పర్వత కులంలో నే ధన్యుణ్ణి! కృతార్థుడను! భాగ్యవంతుడను! నా అంతటి వాడు లేడు. నా యందు సర్వము ఉంది. ఏ కాలంలోను నాకు ఏ లోపము లేదు!" ఇలా గర్వోక్తులాడి "మీరేమంటారు?" అన్నట్లుగా నారదుని ముఖంలోకి చూచాడు. దానికి కలహాశనుడైన నారదుడిలా ఇన్నాడు:

"ఓ పర్వత శ్రేష్ఠా! నేను గతంలో మేరువును సందర్శించినప్పుడు అతను కూడా నీలాగే మాట్లాడేడు! మాబోటి తీర్థయాత్రా పరాయణులకు మీ బోటి పెద్దల పట్టుదలలతోను, పంతాలతోను, స్పర్థలతోను పనేమిటి? అడిగినప్పుడు తెలిసి చెప్పకపోతే అదీ దోషమే! మీ ఇద్దరు అంతరంగముల యందు ఎట్టి భావాన్ని కలిగి ఉన్నారో ఆ విషయంలో తారతమ్య వివక్ష నేను చెయ్యలేను కాని లోకం మాత్రం మేరువును దేవతా స్వరూపంగా భావిస్తోంది! అతడు నీకంటె ఎత్తైన వాడు కూడా!" ఇలా పలికి వెళ్ళిపోయాడు నారదుడు.

వెంటనే వింధ్య పర్వత ప్రధానత్వాన్ని, దేవతా స్థానాన్ని కోరి ఓంకారేశ్వర స్థానానికి వెళ్ళి పార్థివ లింగాన్ని స్థాపించి శంకరుని గూర్చి తపస్సును ప్రారంభించింది. శంకరుడు ప్రత్యక్షం కాగా "నా కార్యాన్ని సాధించగల శక్తియుక్తులను, బుద్ధిని, బలాన్ని, సామర్థ్యాన్ని ఇయ్యవలసింది." అని ప్రార్థించగా శంకరుడు "నీ ఇచ్ఛ ననుసరించి అలాగే నడచుకో!" అని వరమిచ్చాడు. అదే సమయంలో హరి, బ్రహ్మేంద్రాది దేవతలు వచ్చి శంకరుని పూజించి అక్కడనే స్థిరంగా ఉండమని ప్రార్థించారు. భక్త పరాధీనుడైన శంభుడు లోకహితాన్ని కోరి రెండు రూపాలలో నిలిచాడు. ఒకటి ప్రణవ స్వరూపమైన ఓంకారేశ్వర లింగం.

రెండవది పార్థివమూర్తి నుండి పుట్టిన పరమేశ్వర లింగం. ఇది ఓంకారేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథ.

**కేదారేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథ**

తొల్లి నరనారాయణులు బదరికాశ్రమంలో పార్థివ లింగాన్ని స్థాపించి శంకరుని గూర్చి, అనేక కష్టనష్టాల కోర్చి తీవ్రమైన తపస్సును బహుకాలం చేయగా ఆయన ప్రత్యక్షమై వారి కోర్కెపై తుషార సంచ్ఛన్నమైన కేదారమందు కేదారేశ్వర నామంతో జ్యోతిర్లింగ రూపంలో స్థిరంగా ఉండిపోయాడు. బహుమహిమాన్వితమైన క్షేత్రం అది. సకల దేవతా సమూహం ఆయనను నిత్యము సేవిస్తూ ఉంటారు. ఆయనను సేవించిన మానవులకు ఏ దుఃఖము ఉండదు. పాండవులు ఆయన దర్శనానికి వెళ్ళినప్పుడు శివుడు వారి భక్తిని పరీక్షింప గోరి మహిష రూపంలో ప్రత్యక్షమై పారిపోబోతూంటే వారాయన తోకను పట్టుకొని పలుమార్లు ప్రార్థించారు. అప్పుడాయన శిరోభాగం నేపాలులో ఆ రూపంలోనే స్థిరపడింది. పాండవులాయనను పూజించి ముందుకు సాగారు. కేదారంలో శివుని సందర్శించి ఆయన రూపంలో ఉన్న కంకణాన్ని దానం చేసిన భక్తుడు శివునకు మిక్కిలి ప్రీతిపాత్రుడవుతాడు. ఆయన సర్వేశ్వరుడే అయినా భరత ఖండానికి విశేషించి ప్రభువు. భరత ఖండం ఆయన రూపంలో అంటే లింగరూపంలో ఉంటుంది. ఇది పవిత్ర గాథ.

**భీమేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథ**

మునులారా! లోక హితార్థం శంకరుడు కామరూప ప్రాంతంలో భీమశంకరుడై స్థిరంగా నిలిచిన వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి! పూర్వం ఈ సహ్యా పర్వత ప్రాంతంలో భీముడనే రాక్షసుడు ఉండేవాడు. వాని తల్లి పేరు కర్కటి. ఆమె భర్త విరాధుడు. విరాధుని శ్రీరామచంద్రుడు సంహరించగా కర్కటి తన తల్లిదండ్రులైన పుష్కసి–కర్కటుల వద్దనే ఉంటూ వచ్చింది. ఒక రోజున కుంభకర్ణుడు అరణ్య సంచారం చేస్తూ ఈ ప్రాంతానికి వచ్చి కర్కటితో స్నేహం చేసి కొంతకాలం ఉన్నాడు. ఫలితంగా ఆమె గర్భాన్ని ధరించి భీముని కన్నది. కుంభకర్ణుడు వారిద్దరిని విడిచి లంకకు వెళ్ళిపోయాడు. కర్కటి తల్లిదండ్రులను అగస్త్య శిష్యుడైన సుతీక్ష్ణుడు అనే ఋషి భస్మం చేశాడు. ఈ పరిస్థితులలో కర్కటి కొడుకుతో కూడి రోజులు వెళ్ళబుచ్చుకొంటూ ఉండగా...

ఒక రోజున భీమాసురుడు తల్లిని “అమ్మా! నా తండ్రి ఎవరు? ఎక్కడున్నాడు? నా జన్మ వృత్తాంతం చెప్పవలసింది” అని అడిగాడు. ఆమె అంతా వివరంగా చెప్పింది. తల్లినోట

రావణ కుంభకర్ణులు శ్రీరాముని చేతిలో హతులైనారని విన్న భీముడు అందరు రాక్షసులవలెనె విష్ణువు మీద ద్వేషాన్ని పూని పగను సాధింప నెంచి బ్రహ్మను గూర్చి పదివేల సంవత్సరాలు తపస్సుచేసి వరాలను పొంది దేవతలను, ఋషులను, సాధువులను, సజ్జనులను బాధించటం మొదలు పెట్టాడు. గొప్ప శివభక్తుడైన కామరూప దేశాధిపతిని జయించి అతని రాజ్యాని హస్తగతం చేసికొని అతనిని అతని భార్య ఐన దక్షిణా దేవిని కారాగారంలో బంధించాడు. వారు చేసేదేమీ లేక కారాగారంలోనే మట్టితో లింగాన్ని చేసి ప్రాణప్రతిష్ఠ జరిపి మానసిక పూజ మొదలు పెట్టారు.

ఇంద్రాది దేవతలు కూడా విధి మాధవులను ముందుంచుకొని శంకరుని వద్దకేగి భీమాసురుని సంహరించి లోకాలను రక్షించమని వేడుకొన్నారు. శంకరుడు వారికి అభయాన్నిచ్చి పంపించి తన భక్తులైన కామరూప దేశ రాజదంపతులను రక్షించటం కొరకు అక్కడ ప్రత్యక్షమయ్యాడు. ఇంతలో... తనను మట్టుపెట్టటానికి కామరూప రాజు ఏదో తాంత్రిక ప్రక్రియ నడుపుతున్నాడని విని భీమాసురుడు ఆయనను సంహరించటానికి అక్కడికి వచ్చి ముందుగా పార్థివ లింగాన్ని కత్తితో నరకటానికి సిద్ధపడే సరికి శంకరుడు ప్రత్యక్షమై భీమాసురుని వాని సైన్యాన్ని తన క్రోధాగ్ని జ్వాలలచే దహించాడు. వనమంతా రాక్షసుల భస్మరాసులచే నిండిపోయింది. అక్కడ అనేక సిద్ధులను ఇచ్చే ఓషధులు పుట్టాయి. ఆ భస్మకు అనేక మహిమలున్నాయి. ఆ భస్మను ధరిస్తే భూతప్రేత పిశాచాదుల బాధ ఉండదు. ఎలాటి రోగాలైనా నయమవుతాయి. ఇప్పటికి ఆ ప్రాంత ప్రజలు శివాగ్ని సంపర్క జనితమైన వనౌషధులను, భస్మను ఉపయోగించుకొని అనేక ప్రయోజనాలను పొందుతున్నారు. నారదాది మునులు ఇతర ఋషులు, దేవతలు ప్రార్థింపగా శంకరుడు జ్యోతిర్లింగ రూపంలో అక్కడ స్థిరంగా నెలకొని ఉన్నాడు. ఇది భీమాసుర జ్యోతిర్లింగావిర్భావ గాథ! పరమ పవిత్రమైనది.

## కాశీ విశ్వేశ్వర జ్యోతిర్లింగ కాశీక్షేత్ర ఆవిర్భావ చరిత్ర

మునులారా! మీకిప్పుడు కాశీ విశ్వేశ్వర జ్యోతిర్లింగ ప్రభావాన్ని కాశీ క్షేత్ర మాహాత్మ్యాన్ని గూర్చి సంగ్రహంగా చెపుతున్నాను వినండి! దాని చరిత్రను వంద సంవత్సరాలు చెప్పినా సమగ్రంగా వర్ణించలేం! సృష్టి అవ్యక్త స్థితిలో ఉన్నప్పుడు సృష్టికి కారణభూతమైన పరబ్రహ్మము మాత్రమే ఉండేది. అది నిత్యము, శాశ్వతము, చిదానంద ఘనము, అద్వితీయమూను! ఆ బ్రహ్మమునకు రెండవదాని యందు ఇచ్ఛ లేదా సంకల్పం కలిగింది.

ఆ నిర్గుణ, నిరాకార పరబ్రహ్మమే సగుణమై, సాకారమై శివ నామ విఖ్యాతిని పొందింది. ఆ సగుణ రూపమైన "శివమ్" స్త్రీ, పురుష భేదంచే రెండు రూపాలను పొందినప్పుడు పురుష రూపానికి 'శివుడు' అని, స్త్రీ రూపానికి 'శక్తి' అని ఖ్యాతి కలిగింది. చిదానంద స్వరూపులు, ఇంద్రియాతీతులు అగు శివ శక్తుల నుండి వారి మాయా ప్రభావంచే ప్రకృతి–పురుషులు ఉద్భవించారు. ఇక్కడ మాయ అంటె అది వారి కంటె వేరైనదేమీ కాదు. అది వారి జగన్నిర్మాణ సామర్థ్యరూపమైన శక్తి. పంచ జ్ఞానేంద్రియాలచే మనం ఏ ప్రపంచజ్ఞానాన్ని పొందుతున్నామో అదంతా ప్రకృతి. దానికి ఆధార భూతంగా నిలిచిన చైతన్యమే పురుషుడు.

ప్రకృతి పురుషులకు, నిర్గుణ పరబ్రహ్మము నుండి, తపస్సు చేసి ఆపైన సర్వశ్రేష్ఠమైన సృష్టిని చేయండి అని సందేశం (శబ్దం) వినవచ్చింది. అప్పుడా ప్రకృతి–పురుషులు విస్మితులై "ఓ ప్రభూ! తపస్సు చేయటానికి తగిన స్థలం లేదు. తపస్సు అంటే ఏమిటి? దానిని ఎలా చేయాలి? ఎక్కడ కూర్చుని చేయాలి?" అని ప్రశ్నించారు. అప్పుడు నిర్గుణుడైన శివుడు తేజో ఘనము, శుభకరము, పంచక్రోశాత్మకము, సమస్తమైన పరికరాలతో కూడినది అగు సుందరమైన నగరాన్ని (భూభాగాన్ని) నిర్మించాడు. అంతరిక్షంలో దానిని చూచిన పురుషుడు (శ్రీమన్నారాయణుడు) దానిని అధిష్ఠించి శివుని ధ్యానిస్తూ చిరకాలం తపస్సు చేశాడు. ఆయన శ్రమ (తపన) నుండి అంతులేని దివ్యజలం ఆవిర్భవించి ఆ శూన్యమంతా ఆ జలంచే నిండి పోయింది. ఇతరమైనదేమీ లేదు. అప్పుడు నారాయణుడు అద్భుతరస నిమగ్నుడయ్యాడు. ఇంతలో శివ ప్రభువు చెవినుండి జారి ఒక మణి నారాయణుని ఎదురుగా ఆ భూభాగం మీద పడింది. ఆ మణి పడిన స్థలమే మణికర్ణిక అను మహిమాన్వితమైన తీర్థం ఐంది. మణి అంటే దివ్యమైన రత్నం (శిల) అని మాత్రమే కాకుండ దివ్యమైన ఓషధి అనే అర్థాన్ని కూడ కొందరు చెపుతారు. దివ్య జలాలలో పంచక్రోశ విస్తీర్ణమైన భూభాగం కొట్టుకొని పోకుండ నిర్గుణుడైన శివ పరమాత్మ దానిని తన త్రిశూలం మీద ఎత్తి నిలపెట్టాడు. అప్పుడు పురుష శబ్ద వాచ్యుడైన శ్రీమన్నారాయణుడు తన భార్య అయిన ప్రకృతి (లక్ష్మి)తో కూడి ఆ దివ్య జలాలమీద నిద్రించాడు. నిద్ర అంటే శంకరుని ధ్యానించాడు. ఆ ధ్యానంలో శంకరుని శాసనంచే ఆయన నాభికమలం నుండి బ్రహ్మ పుట్టాడు. ఆయన శివుని ఆజ్ఞను పొంది చతుర్దశ భువనాత్మకమైన ఈ సృష్టిని నిర్మించాడు.

అప్పుడు శివ పరమాత్మ తన త్రిశూలం మీద ఎత్తినిలపెట్టిన పంచక్రోశ విస్తీర్ణమైన భూభాగాన్ని (కాశీ నగరాన్ని) బ్రహ్మాండంలోని మనుష్య లోకంలో విడిచి పెట్టి బ్రహ్మ, విష్ణువుల నుద్దేశించి ఇలా అన్నాడు: "ఈ కాశి లోకంలో శుభాలనిచ్చేది, కర్మ బంధాలను నశింప చేసేది, మోక్ష సాధనమైన జ్ఞానాన్ని ప్రకాశింప చేసేదీను! ఇది నాకు మిక్కిలి ప్రియమైనది. ఓ విష్ణూ! నీవు ఈ దివ్యక్షేత్రాన్ని ఎప్పటికీ విడిచి పెట్టవద్దు" ఇలా చెప్పి తను స్వయంగా అవిముక్త లింగాన్ని స్థాపించాడు. ప్రలయ కాలంలో కూడ కాశీనగరం నశించదు. ఆ సమయంలో శంకరుడు దానిని త్రిశూలం మీద ఎత్తి పట్టుకొని తిరిగి బ్రహ్మగారు సృష్టిని చేయగానే భూమి మీదికి దింపుతాడు. కర్మలను ఆకర్షించి నశింప చేస్తుంది కనుక దీనికి 'కాశి' అనే పేరు వచ్చింది. మునులారా! ఇతర క్షేత్రాలలో సారూప్యముక్తి (భగవానునితో సమానమైన రూపాన్ని కలిగి ఉండటం) మాత్రమే లభిస్తుంది. కాశీలో సాయుజ్య ముక్తి (భగవానునిలో ఐక్యం కావటం) లభిస్తుంది. దేవతలు సైతం ఇక్కడ మరణాన్ని కోరుకొంటారు అంటే ఇతరుల గురించి చెప్పేదేముంది!

కాశీ నగరం బ్రహ్మసృష్టిలోనిది కాదు. ఇది మహేశ్వరునిచే స్వయం నిర్మితం. క్షేత్రము, తీర్థము, దైవతము ఈ మూడు ముక్తి ప్రదములే! ఈ మూడూ కలిసిన క్షేత్రం కాశి. మోక్షదాయకమైన సప్త పురముల అంశలు కాశీలో ఉన్నాయి. అవిముక్త క్షేత్రము, ఆనంద కాననము, మహాశ్మశానము, రుద్రగేహము ఈ పేర్లన్ని కాశీకి నామాంతరాలు. లక్షతీర్థాలాడినా కాశికా తీర్థంలో మునక వేయకపోతే మోక్షం లేదు. మరణ కాలంలో జీవులకు చెవులలో శివుడు ఓంకారాన్ని ఉపదేశించి మోక్షాన్ని ఇస్తాడు. ఆ దృశ్యాన్ని చూచి అమరులు తమ వృథా జీవనానికి సిగ్గుపడుతూ ఉంటారు. చావులేని మొండి బ్రతుకులు కల బృందారకులకు మోక్షమెక్కడ? తెలియకుండ స్పృశించినా అగ్ని ఎలా దహిస్తుందో అలాగే ఇచ్ఛలేకుండ స్నానం చేసినా గంగ పాపాలను దహిస్తుంది. ఈ కాశీక్షేత్ర మహిమ చాల గొప్పది.

## గోదావరి మరియు త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథ

పూర్వం గౌతమ మహర్షి తన భార్య ఐన అహల్యతో కూడి దక్షిణ దిక్కున గల బ్రహ్మగిరి ప్రాంతంలో తపస్సు చేసికొంటూ ఆశ్రమ జీవితాన్ని గడుపుకొంటూ ఉండేవాడు. ఎంతటి వారికైనా కాలం ఒక్క రీతిగా వెళ్ళదు గదా! సుఖదుఃఖాలు కాలంలోనే సంప్రాప్తమవుతాయి! ఒకప్పుడు ఆ ప్రాంతంలో భయంకరమైన అనావృష్టి పరిస్థితులు

ఏర్పడ్డాయి. ప్రాణాధారమైన నీరు, ఆహారము లభించని కారణంగా మనుష్యులు, పశువులు, పక్షులు ఇతర ప్రాణికోట్లు వలసలు వెళ్ళిపోయాయి. కొన్ని అసువులు విడిచాయి. అట్టి సమయంలో తక్కిన మహర్షులందరు పరమ తపోనిధి ఐన గౌతముని సమీపించి "ఓ కృపా నిధీ! పరమదయాళూ! శివ భక్తాగ్రగణ్యా! తపోజ్ఞాననిధీ! నీ తపః ప్రభావంచే వర్షాన్ని కురిపించి సకల ప్రాణికోట్ల ప్రాణాలను కాపాడండి! భూతదయను మించిన ధర్మం లేదు గదా! ఈ విషయంలో మేము అశక్తులము!" అని ప్రార్థించారు.

అంత ధర్మనిరతుడు, సకల ప్రాణిహితుడు, సకలామ్నాయ పారంగతుడు అయిన గౌతముడు వరుణుని ఉద్దేశించి సాత్త్వికమైన తపస్సును చేశాడు. వరుణుడు ప్రీతుడై వరాన్ని కోరుకొమ్మనగా శాశ్వత ఫలాలను ఇచ్చేది, స్థిరమైన పుణ్యాలను అగణ్యంగా ఒసగేది, సకల ప్రాణికోట్లకు జీవనాధారమైనది, సిరిసంపదలకు ఆలవాలమైనది అగు అక్షయ జలాలను అనుగ్రహించ వలసిందని గౌతముడు ప్రార్థించాడు. మహర్షి పరోపకార బుద్ధికి సంతసించిన వరుణుడు చేయి లోతు గోతిని త్రవ్వమని ఆదేశించగా ఆయన అలాగే చేశాడు. జలాధిపతి ఐన వరుణుడు దానిని మధురమైన అక్షయ జలాలతో నింపి ఇలా ఆశీర్వదించాడు: "ఓ మహర్షీ! ఈ జలాలు అక్షయమగుటే కాక ఇది గొప్ప తీర్థమై నీ పేరుతో ప్రసిద్ధిని పొందుతుంది. ఇక్కడ చేసిన తపస్సు, హోమము, దేవ యజ్ఞం, పితృతర్పణం, శ్రాద్ధ కర్మలు, దానాదులు ఇవన్నీ కూడ అక్షయ పుణ్యలోకాలను మానవులకు ప్రసాదిస్తాయి." ఇలా పలికి అంతర్ధాన మయ్యాడు వరుణుడు.

మునులారా! లోకంలో పరోపకారాన్ని మించిన ధర్మం లేదు గదా! ఉత్తములెప్పుడూ వారికి కలిగిన కష్టాన్ని సహించి ఇతరుల దుఃఖాన్ని పోగొట్టటానికే ప్రయత్నిస్తారు. చెట్లు, చందనం, చెఱకు, బంగారం ఇవి పరోపకారం కొరకే పుట్టాయి. దయాస్వభావుడు, అహంకారం లేనివాడు, పరోపకారి, జితేంద్రియుడు ఈ నలుగురు పుణ్యమూర్తులు ఈ భూమండలాన్ని నిలచెట్టే స్తంభాలవంటి వారు.

ఆ అక్షయ జలాలతో ఆ ప్రాంతమంతా సస్యశ్యామలమైంది. కరువు అనేది లేకుండ మాయమైంది. అనేక మంది మునులు తమ తమ భార్యాబిడ్డలతో, పశుసంపదతో అక్కడకు వచ్చి స్థిర నివాసం ఏర్పరచుకొన్నారు. శ్రవణ సుఖాన్ని ఇచ్చే పక్షి గణాల కిలకిలా రావాలతో ఆ వనమంతా శోభాన్వితమైంది. పాడి పంటలతో, సిరి సంపదలతో తులతూగింది. గౌతముని ప్రభావంతో ఆ ప్రాంతమంతా ఆనందం వెల్లి విరిసింది. క్రమంగా గౌతమ మహర్షి ఆశ్రమ

ప్రాంతం నాల్గువైపులా విస్తరించింది. అనేక మంది శిష్యులు వచ్చి చేరారు. అది ఒక పెద్ద గురుకులమైంది. ఆయన పేరు ప్రఖ్యాతులు శరత్కాల కౌముదివలె వ్యాపించాయి.

మునులారా! ఇలా ఉండగా ఆ వనంలోని ఇతర మునులకు, ముని పత్నులకు అహల్యా గౌతముల యందు ఈర్ష్యా అసూయలు పొటమరించాయి. ఎంతటి వారైనా అరిషడ్వర్గాలను జయించలేరు! ఈర్ష్యా – అసూయలను అణచుకోలేరు! వారందరు అహల్యా గౌతములను అక్కడి నుండి పంపించి వేయాలనే విషయంలో ఏకాభిప్రాయానికి వచ్చారు. వారు తమ తపశ్శక్తిచే బక్క చిక్కిన ఒక మాయాగోవును సృష్టించి గౌతముని ఆశ్రమం లోనికి తోలారు. ఆ ఆవు గౌతముని పంట పొలంలో పడి మేస్తూ ఉండగా గౌతముడు చూచి ఎండుగడ్డి పరకలతో దానిని అదలించాడు. గడ్డిపోచ తగలగానే ఆ మాయాగోవు మరణించింది.

వెంటనే అదే అదనుగా మునులు, ముని పత్నులు అహల్యా గౌతములను చుట్టుముట్టి "ఓ గౌతమా! నువ్వు గోహత్య చేశావు. అంతకంటె మహా పాతకం మరొకటి లేదు. నీ ముఖం కూడ చూడరాదు. నీ ముఖ దర్శన మాత్రం చేతనే మాకు పాపాలు అంటుకొంటాయి. నువ్విక్కడ ఉంటే మా కర్మకాండ అంతా వ్యర్థమే! అవి ఫలాలను ఇయ్యవు! ఇంద్రాది దేవతలు మా హవిస్సులను స్వీకరిస్తారనేది ఈ పైన కల్ల. కనుక నీవు నీ కుటుంబంతో, శిష్యులతో కూడి కాశీ నగరానికి వెళ్ళిపో. అక్కడ నిత్యుడు, శాశ్వతుడు ఐన విశ్వేశ్వరుడున్నాడు. సకల కల్మష హారిణి అయిన గంగ ఉంది. శాశ్వతంగా అక్కడ ఉండిపో" అని నిందించారు. ఇంకా అనేక నిందావాక్యాలను పలికి దూషించారు. మునుల కాపట్యాన్ని గ్రహించలేని గౌతముడు భార్యతో కూడి కాశీ నగరాన్ని చేరుకొన్నాడు. చేరుకొని తీవ్రమైన తపశ్చర్యకు ఉపక్రమించాడు. శివుడు ప్రత్యక్షమై గౌతమ మునికి బ్రహ్మగిరిని చేరుకొని అక్కడే తపస్సును కొనసాగించమని చెప్పాడు. గౌతముడు కాశీ నగరాన్ని విడిచి కొద్ది రోజులు పయనించి భార్యతో కూడి బ్రహ్మగిరికి వచ్చి చేరాడు. వచ్చి...

ఆ పర్వతానికి నూటొక్క సార్లు ప్రదక్షిణం చేసి గౌతమీ తీర్థం చెంత కూర్చొని మట్టితో పార్థివ లింగాన్ని నిర్మించి ప్రతిష్ఠ చేసి యథావిధిగా అర్చించటం మొదలు పెట్టాడు. ఆయన భార్య, శిష్యులు కూడ ఆయనకు తోడుగా నిలిచారు. ఆయన సద్బుద్ధికి మెచ్చిన శంకరుడు పార్వతితో, ప్రమథ గణాలతో కూడి ప్రత్యక్షమై ఇలా అన్నాడు. "ఓ గౌతమమునీ! పరోపకార పరాయణుడవైన నీవు ధన్యుడవు! కృతార్థుడవు! సర్వ కాలములలోను

పాపరహితుడవు! మీ దంపతుల నామ స్మరణ మాత్రం చేతనే మానవులు పాప విముక్తులవుతారు! అట్టిచో మీకు పాపమెక్కడిది? నీ తపశ్శక్తిని చూచి సహించలేని కొందరు కృతఘ్నులు ఈ నీచపు పనికి సిద్ధపడి మాయా గోవును సృష్టించి అభిచార క్రియచే దానిని వారే చంపి ఆ హత్యానేరాన్ని నీమీద మోపి నిన్ను బహిష్కరించారు. ఏ దురాత్ములైతే నీకు ఆపదను కలిగించారో వారే పాపాత్ములు, దురాచారులు, కృతఘ్నులు అవుతారు. గోహత్యా మహా పాతకం వారినే చుట్టుకొంటుంది వారికి ఎక్కడైనా నిష్కృతి లేదు. ఈ పాప కార్యానికి ఒడిగట్టిన వారు ఐదుగురు. మిగిలినవారు వారి మాయలో పడ్డారు. నీకు ఏమి వరం కావాలో కోరుకో!"

గోహత్యా పాపంతో కుమిలిపోతున్న గౌతముడు అందరుమునులు వింటూ ఉండగా మహాదేవుడు పల్కిన ప్రేమదయార్ద్ర వచనాలకు సంతసించి ఇలా ప్రార్థించాడు. "ఓ మహేశ్వరా! ఆ ఐదుగురు మునులు నాకు మహోపకారం చేశారు. వారలా చేసి ఉండకపోతే నీ దర్శనం లభించి ఉండేది కాదు కదా! నాకింత మహద్భాగ్యాన్ని కలిగించిన వారు ధన్యులు. నీ శిరసు మీది గంగను ఇక్కడ విడిచి లోకోపకారం చేయి. నేనింతకంటె కోరేదేమీ లేదు.

భక్తవత్సలుడైన గంగాధరుడు సంతసించి తన జటాజూటము నందలి గంగను అక్కడ విడిచి దానికి పుష్కర ప్రభావాన్ని కల్పించాడు. దేవతలు, మరియు అక్కడి శివభక్తులైన మునుల కోరికచే తానక్కడ త్ర్యంబకేశ్వర నామంతో జ్యోతిర్లింగ స్వరూపంగా ఉండిపోయాడు. గౌతమమునిని ఇంకా ఇలా ఆశీర్వదించాడు "ఓ మహర్షీ! ఇక ఈపైన ఈ జలాలు అక్షయంగా ప్రవహిస్తాయి. ఇది గొప్ప తీర్థమవుతుంది. ఈ దివ్య వాహిని నీ పేరుతో "గౌతమి" నదిగా దక్షిణ భారత ఖండంలో ప్రసిద్ధి వహించి ప్రజలచే నిత్యము పూజింపబడుతుంది. ఇది 'దక్షిణ గంగ'గా వాసికెక్కుతుంది. దీని మహిమ వర్ణనాతీతం! దీనిని ఆశ్రయించిన మనుజులకు ఈ గంగ సకల సంపదలను ఇస్తుంది." ఇలా ఆశీర్వదించి అంతర్హితుడయ్యాడు మహేశ్వరుడు.

సూతుడు శౌనకాది మహర్షులతో ఇలా అంటున్నాడు: "ఓ ఋషులారా! గౌతముడు స్వయంగా ప్రార్థించగా అ గంగ బ్రహ్మగిరి నుండి ఉదుంబర వృక్షం కొమ్మనుండి ఆవిర్భవించి క్రిందికి దిగి ప్రవహించింది. గౌతముడు, శిష్యులు ఇతర మహర్షులు అందులో ఆనందంతో మునకలు వేశారు. ఆయనతో విరోధాన్ని పూనిన మునులు రాగానే గంగ అదృశ్యమైంది. గౌతముడు చేతులు జోడించి గంగా స్తోత్రాన్ని పఠించి వారిని క్షమించి కరుణతో దర్శనమీయ

వలసిందని ప్రార్థించాడు. అప్పుడు ఆకాశవాణి ఇలా పలికింది. "ఓ మునులారా! వినండి! పరమ దయాళువైన గౌతముని విషయంలో ఈర్ష్యను, అసూయను పొందిన వీరు పరమ దుర్మార్గులు. కృతఘ్నులు! ద్రోహులు! పాపాత్ములు! నాస్తికులు. కనుక వీరి ముఖం చూడరాదు."

దానికి సమాధానంగా గౌతముడు "తల్లీ! పాపులను ఉద్ధరించటం కొరకు ఉద్భవించిన దానవు! రాగద్వేషాదులతో నీకు పనిలేదు. ఆగ్రహించకు! వారిని క్షమించు. ఎవడైతే అపకారం చేసిన వానికి ఉపకారం చేస్తాడో వాని వలన ఈ లోకంలో నేను పవిత్రుడనవుతున్నానని భగవానుడు సెలవీయ లేదా? అందరూ ముక్తికి అర్హులే కదా! బిడ్డల అజ్ఞాన విలసితమైన దుడుకు చేష్టలను తల్లి క్షమించక పోతే లోకంలో ఇతరులెవరు క్షమిస్తారు?" అని ఆత్మజ్ఞాన పూర్వకమైన బుద్ధితో ప్రార్థించాడు. ఆమె ముని సద్బుద్ధిని ప్రశంసించి పాపాత్ములైన మునులకు ప్రాయశ్చిత్తాన్ని విధించి వారిని గౌతముని అదుపు, ఆజ్ఞలలో ఉండమని ఆజ్ఞాపించి అంతర్హితురాలైంది. వారలాగే ప్రాయశ్చిత్త కర్మను నెరవేర్చి గౌతముని క్షమించమని వేడుకొన్నారు. ముని గంగాద్వారానికి క్రింది భాగములో కుశావర్తమనే గోతిని తీసి గంగాదేవిని అందులో స్థిరంగా ఉండవలసిందని ప్రార్థించగా ఆ అమ్మ అందులో ప్రవేశించింది.

మునులారా! ఈ సందర్భంలో గౌతమ మహర్షి శివద్వేషులైన ఆ మునులను శపించినట్లుగా కూడా నేను పెద్దల ద్వారా వినియున్నాను. కల్ప భేదాన్ని అనుసరించి అది కూడా నిజమే. గౌతముడు వారినిలా శపించాడు: "ఓ మునులారా! దుర్మార్గులైన మీరు శివభక్తుడనైన నాకు మోసబుద్ధితో మాయను పన్ని విశేష దుఃఖాన్ని కలిగించారు. మీరు సర్వదా ఈశ్వర స్వరూపమైన వేదమునందు శ్రద్ధలేనివారు అగుదురు గాక! ఈనాటి నుండి మీకు వేద విహితమైన సత్కర్మల యందు, విశేషించి మోక్షము నిచ్చే శైవ మార్గము నందు శ్రద్ధ కలుగకుండు గాక! ఈనాటి నుండి మీకు మోక్షమార్గ విరుద్ధమైన, వేద బాహ్యమైన చెడు మార్గము నందు నిత్యము శ్రద్ధ కలుగు గాక! ఈనాటి నుండి మీ లలాటములు మట్టి పూసినవి అగుగాక. ఓ బ్రాహ్మణులారా! మట్టిని పూసిన లలాటములుగల మీరు నరకములో పడెదరు గాక! మీరు శివుడు మాత్రమే పరదేవతగా కలవారు కాకుందురు గాక! మీరు అద్వితీయుడగు శివుని ఇతర దేవతలతో సముడని భావించెదరు గాక! మీకు శివపూజ మొదలగు కర్మలయందు, శివపరాయణులగు భక్తులయందు మరియు శివ సంబంధమైన

పర్వదినముల యందు ఎన్నటికైనను ప్రీతి కలుగకుండు గాక! ఓ బ్రాహ్మణులారా! మీ పుత్ర పౌత్రాది సంతానము శివభక్తి లేనివారు అగుదురు గాక! మీరు మీ సంతానముతో కూడి నిశ్చయముగా నరకమును పొందెదరు గాక! మీరందరు దుఃఖముచే మరియు దారిద్ర్యముచే పీడింపబడు వారు, మోసగాళ్ళు, ఇతరులను నిందించు వారు, కాల్చిన ముద్రల చిహ్నములను శరీరముపై ధరించువారు అగు చండాలురు అగుదురు గాక!"

పరమ పవిత్రుడైన గౌతమ ముని తనపై మోస బుద్ధితో గోహత్యా నేరాన్ని మోపిన దుష్టమునులను ఇలా శపించి అహల్యతో కూడి తన ఆశ్రమంలో శివారాధనా తత్పరుడై జీవించాడు. ఆ మునులు గౌతమ శాపానికి దుఃఖించి శైవ ధర్మబహిష్కృతులై కాంచీ నగరంలో నివాసాన్ని ఏర్పాటు చేసికొని జీవించటం మొదలు పెట్టారు. వారి సంతానం కూడా వారి వలెనే శివధర్మనుండి బహిష్కరింపబడ్డారు. గోదావరి పుట్టుక, త్ర్యంబకేశ్వర ఆవిర్భావగాథ ఈ రెండు పరమ పవిత్రమైనవి.

### వైద్యనాథేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథ

పూర్వం రాక్షస శ్రేష్ఠుడు, గర్విష్ఠి, అభిమానధనుడు ఐన రావణుడు హిమవత్పర్వతం మీద ఉన్న కైలాస శిఖర ప్రాంతానికి చేరి శివుని గూర్చి భయంకరమైన రాజస తపస్సును చేశాడు. ఐనా శంకరుడు ప్రసన్నం కాలేదు. మరింత పట్టుదలతో సిద్ధిస్థానమనే పేరుగల హిమవత్పర్వత దక్షిణ భాగాన్ని చేరుకొని అక్కడ పెద్ద గోతిని తీసి దాని యందు అగ్నిని స్థాపించి దాని సమీపంలో శివుని ప్రతిష్ఠించి హోమాలను చేస్తూ వచ్చాడు. వేసవి కాలంలో పంచాగ్ని మధ్యమందు, వానాకాలం నేలమీద మరియు శీతకాలంలో పీకలోతు నీళ్ళలోను మునిగి ఘోరమైన తపస్సును చేశాడు. ఐనా శంకరుడు ప్రసన్నుడు కాలేదు. కార్యాన్ని సాధింపనెంచి కఠోరము, సాహసోపేతము ఐన నిర్ణయాన్ని తీసుకొన్నాడు రావణుడు. వరుసగా ఒక్కొక్క తలను నరికి శంకరుని స్తుతిస్తూ హోమగుండంలో హవిస్సుగా సమర్పిస్తూ అర్చించటం మొదలు పెట్టాడు. అలా తొమ్మిది తలలను నరికి సమర్పించి పదవ తలను ఖండించుకో బోయే సరికి శంకరుడు ప్రత్యక్షమై నీ వాంఛితాన్ని నెరవేరుస్తాను కోరుకొమ్మని పల్కగా శంకరుడు సైతం నిత్యమూ పూజించే ఆత్మలింగాన్ని కోరుకొన్నాడు.

శంకరుడు సంకట స్థితిలో పడ్డాడు కాని తామసులకు తపశ్శక్తులు వారి నాశనానికే దారితీస్తాయి అని స్మరించి సరే అని పల్కి ఇలా అన్నాడు: "ఓ రావణా! ఈ లింగాన్ని నీవు లంకకు చేరి ప్రతిష్ఠించే పర్యంతము నేలమీద పెట్టవద్దు. నేలపై పెడితే అది అక్కడే

స్థిరంగా ఉండిపోతుంది. దానిని కదపటం ఎవరివల్ల కాదు! మంచి పనులకు విఘ్నాలు అనేకం గదా!" అంత రావణుడు "ఇరవై చేతులు గల నాకు అదేమంత దుర్ఘటమైన విషయం కాదు! నేలను తాకించకుండ లింగాన్ని లంకకు చేరుస్తాను." అని ఆత్మ విశ్వాసంతో పలికి లంకకు పయనమయ్యాడు. మార్గ మధ్యంలో మూత్ర విసర్జన ఆవశ్యకమైంది. రావణునికి తెలియకుండ అతని వెంట పడ్డాడు వినాయకుడు. తనను పూజించకుండ కార్యాన్ని ప్రారంభించిన రావణుని ప్రయత్నానికి విఘ్నం కలిగించాలని ఎదురు చూస్తున్నాడు. రావణుడు ఒక చోట ఆగి గోవులను కాస్తున్న గోపాలకుని పిలిచి లింగాన్ని వాని చేతపెట్టి నేలపై పెట్టవద్దని హెచ్చరించి అలా దూరంగా వెళ్ళాడు దశగ్రీవుడు. శంకరుని మహిమచే ఆ లింగం బరువు క్రమంగా అధికంకాగా దానిని నేలపై పెట్టి అంతర్హితుడైనాడు గోపాలుని వేషంలో ఉన్న విఘ్నేశ్వరుడు. ఆ వజ్రలింగం నేటికీ స్థిరంగా అక్కడే ఉండి వైద్యనాథేశ్వరుడు అనే పేరుతో పూజలందుకొంటూ దివ్య మహిమతో విరాజిల్లుతూ ఉన్నది.

శంకరుని నుండి అనేక వరాలను పొందిన రావణుడు లంకను చేరి ప్రియురాండ్రతో కూడి సమస్త ఐశ్వర్యాలను అనుభవిస్తూ ఇష్టకథా వినోదాలతో ప్రొద్దుపుచ్చుతూ వచ్చాడు. ప్రతి నిత్యము వైద్యనాథేశ్వరుని సేవిస్తూ ఉండేవాడు. ఇలా ఉండగా శంకర వరప్రసాదలబ్ధ బలగర్విత తేజోవిరాజమాన బాహుపరాక్రమ సంపన్నుడైన దశగ్రీవుని వలన భవిష్యత్తులో కీడును శంకించారు ఇంద్రాది బృందారకులు. నీలగ్రీవుని చేతనే దశగ్రీవుని శపింపచేసి వాని మదమణచాలనే సంకల్పంతో నారదుని ప్రార్థించగా అతను వారికి అభయమిచ్చి కదిలాడు. రావణుని కొలువు కూటానికి చేరాడు. అతిథి సత్కారాలను గైకొని ఇలా అన్నాడు నారదుడు: "ఓ దశకంఠా! నువ్వీమధ్య గతంలో ఎవరూ చేయని సాహసాన్ని చేసి కాలకంఠుని మెప్పించి అనేక వరాలను పొంది అజేయుడవై వచ్చావని విన్నాను. ఆ వృత్తాంతాన్ని చెప్పు. చెవులారా వింటాను!" పూసగ్రుచ్చినట్లు అంతా వివరించాడు రావణుడు. నారదుడు తలపంకించి "ఓ రావణా! ఈ త్రిమూర్తులను నమ్మరాదు. దేవతలు ఎలాగూ ఆగర్భ శత్రువులే! విష్ణువు దానవులకు బహిరంగ శత్రువు. రుద్రునకు దేవదానవుల విషయంలో రాగద్వేషాదులు లేవు. నిజానికి అతను తటస్థుడు. ఐనా ఎంత వరకు విశ్వసించ వచ్చో నాకైతే అనుమానమే! వస్తువును కొన్న చోటే పరీక్షించుకొనవలసి ఉంటుందిగదా! ప్రయోగ సమయంలో అది విఫలమైతే దుఃఖం తప్పదు!" అంటూ చాలా చక్కగా తర్కబద్ధంగా మాట్లాడి రావణుని మనసులో శంకా బీజాలను నాటాడు.

"నువ్వు చెప్పింది చాలా యుక్తియుక్తంగాను, లోకనీతి పురస్సరంగాను ఉంది. నారదా! ఇప్పుడు నన్ను ఏం చెయ్యమంటావు?" అన్నాడు రావణుడు.

"ఇందులో చెయ్యటానికి ఏముంది? దీనికి పది తలకాయలను ఉపయోగించ నక్కర లేదు. ఇప్పుడు నీ బాహు బలానికి కదా పరీక్ష! కైలాసానికి వెళ్ళు. నీ ఇరవై చేతులతో దానిని ఒక్కసారి కదిపి చూడు. అది కదిలెనా శంకరుని వరం సక్రమమైనదే! కదలకపోతే ఉత్తుత్తి వరం! మీది కర్తవ్యం తర్వాత ఆలోచించవచ్చు. ఇప్పటికిదే కర్తవ్యం! తర్వాత నీ ఇష్టం." అని రావణ పతనానికి హేతుభూతమైన దుర్మంత్రాన్ని బోధించి వెళ్లాడు నారదుడు.

బుద్ధిహీనుడైన రావణుడు పూర్వాపరాలను ఆలోచించక కైలాసానికి వెళ్ళి సాలవృక్ష ప్రమాణాన్ని మించిన తన ఇరవై బాహువులతో మందరాన్ని వాసుకితో చుట్టినట్లుగా కైలాసాన్ని బంధించి కదపసాగేడు. కైలాసం ఉయ్యాల లూగింది. సర్వమంగళ భయకంపితయై గంగాధరుని దృఢాలింగనంతో బంధించింది. సర్వజ్ఞుడైన శంకరుడు విషయాన్ని గ్రహించి రావణుని ఉద్దేశించి "ఓ దుర్బుద్ధీ! నీ బాహువుల దర్పాన్ని అణచే వాడు త్వరలోనే ఆవిర్భవించగలడు." అని శపించాడు. మూర్ఖుడైన దశకంఠుడు శంకరుని శాపాన్ని లెక్కసేయక తన బాహుబలంతో కైలాసాన్ని కదిపాననే దృఢమైన నిశ్చయాన్ని పొంది విజయోత్సాహంతో లంకను చేరుకొని ముల్లోకాలను జయించాడు. ఈ గాథ నీతిదాయకమైనది. ఇహపర సాధకమైనది.

**నాగేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథ**

మునులారా! పశ్చిమ సముద్ర తీరంలో ఎటుచూచినా పదహారు యోజనములు విస్తీర్ణంగల దారుకావనం అనుపేరుగల ఒక వనం నందన వనాన్ని మించిన శోభతో అలరారుతూ ఉండేది. ఆ వనంలో పార్వతీ భక్తురాలైన దారుక అనే రాక్షసి దారుకుడనే తన భర్తతోను ఇతర పరిజనంతోను మరికొంత మంది రాక్షసులతోను కలిసి ఉండేది. ఆ రాక్షస దంపతులు నరులను హింసిస్తూ సర్వులకు భయాన్ని కల్పిస్తూ ఉండేవారు. వారిచే పీడితులైన జనులు, అక్కడకు దూరంగా తపస్సు చేసుకొంటూన్న ఔర్వ మహర్షిని దర్శించి శరణుపొందగా ఆయన ఇలా వరమిచ్చాడు: "ఈ రాక్షసులు ఈ వనంలోని ప్రాణులను హింసించినా, యజ్ఞాలను ధ్వంసం చేసినా తక్షణం వారు మరణిస్తారు. వెంటనే దేవతలు వచ్చి రాక్షసులను తరిమారు. రాక్షసులు ఆ వనాన్ని విడిచి దానికి కొంచెం దూరంగా సముద్రంలో ఉన్న ద్వీపానికి చేరి అక్కడొక నగరాన్ని నిర్మించుకొని అందులో నివసిస్తూ వచ్చారు. వారందులో

ఉంటూనే ఆ మార్గంలో పయనిస్తూన్న వ్యాపార నౌకలను పట్టుకొని అందులోని మనుజులను బంధించి వారి వస్తువులను దోచుకొని వారిని హింసిస్తూ ఉండేవారు. ఈ విధంగా ఔర్వుని శాపానికి భయపడి వనాన్ని విడిచి ద్వీపాన్ని చేరి ఓడ దొంగతనాలను వృత్తిగా చేసికొని బ్రతుకుతున్నారు రాక్షసులు.

ఒకరోజున ఒక సుందరమైన పెద్ద నావను పట్టుకొన్నారు రాక్షసులు. ఆ నావ సుప్రియుడనే గొప్ప శివభక్తునికి చెందినది. అందులో అనేక ధన, కనక, వస్తు సామగ్రి పుష్కలంగా ఉంది. వాటిని వాటితో పాటు సుప్రియుడనే వైశ్యుని పట్టుకొని బంధించారు. సుప్రియుడు కారాగారంలో ఉంటూనే నిత్యము పార్థివ లింగ పూజ చేస్తూ ఉండేవాడు. ఆ విషయాన్ని తెలుసుకొన్న దారుకుడు తనను చంపటానికి ఈ కోమటి ఏదో మంత్ర పూజ చేస్తున్నాడని అనుమానించి ఆ వైశ్యుని చంపబోగా శంభుడు ప్రత్యక్షమై రాక్షసుని సంహరించి దారుకా వనంలో నాగేశ్వర నామధేయంతో జ్యోతిర్లింగ రూపంలో స్థిరంగా కొలువయ్యాడు. పార్వతీదేవి నాగేశ్వరి అనుపేరుతో అక్కడ స్థిరపడింది. ఇది పవిత్ర గాథ!

**శ్రీరామేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథ**

పూర్వం భూమిమీద రాక్షసపీడ అధికం కాగా సత్పురుషులకు ఆశ్రయ భూతుడు, స్థితిపాలకుడు అగు శ్రీమహా విష్ణువు దుష్ట శిక్షణ మరియు శిష్ట రక్షణార్థం శ్రీరాముడై కౌసల్యా గర్భాన అవతరించాడు. ఆయన భార్య జనక రాజు నందిని అయిన సీత. పితృవాక్య పరిపాలనార్థం ఆయన భార్యతోను తమ్ముడైన లక్ష్మణునితోను కూడి అరణ్యవాసం చేస్తూండగా సీతను రావణాసురుడు అపహరించాడు. భార్యా వియోగంచే దుఃఖిస్తూ వనసంచారం చేస్తూండగా కిష్కింధలో సుగ్రీవునితోను అతని మంత్రి ఐన హనుమంతుని తోను తద్వారా అసంఖ్యాకమైన వానర సైన్యంతోను పరిచయం ఏర్పడింది. రుద్రాంశ సంభూతుడైన హనుమ సహాయంతో సీతాదేవి లంకలో ఉన్నదని తెలుసుకొన్న వాడై శ్రీరాముడు లంకపైకి దండయాత్రకు సిద్ధమైనాడు.

ఆయన సనాతనమైన వేద ధర్మాన్ని చక్కగా తెలిసికొన్నవాడు కనుక వేదం రుద్రుని సర్వోత్కృష్టునిగా వర్ణించింది కనుక వేదశాస్త్ర మర్మజ్ఞుడైన శ్రీరాముడు రుద్రానుగ్రహాన్ని కోరి దక్షిణ సముద్ర తీరంలో శివ లింగాన్ని స్థాపించి పూజించాడు. మునులారా! ఒక్క రహస్యం చెపుతున్నాను వినండి! రుద్రుడు లయకారుడు! ఆయన అనుగ్రహం లేనిదే ఎంతటి వారికి యుద్ధంలో విజయం లభించదు. శ్రీరాముని భక్తికి మెచ్చి శంకరుడు ప్రత్యక్షమై

యుద్ధంలో విజయాన్ని వరంగా అనుగ్రహించాడు. ఆపై వానర సహాయంతో సముద్రంపై సేతువును నిర్మించి లంకను చేరి రావణుని సంహరించి సీతతో కూడి అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడైనాడు శ్రీరామచంద్రుడు. ఆనాడు శ్రీరామునిచే ప్రతిష్ఠకాబడిన లింగమే రామేశ్వర జ్యోతిర్లింగంగా ముల్లోకాలలోను వాసికెక్కింది. ఈ గాథ పరమ పవిత్రమైనది.

**ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథ**

ఓ తపోధనులారా! పూర్వం దేవగిరి అను పర్వతరాజ సమీపంలో భారద్వాజ గోత్రీకుడు, వేదశాస్త్ర పారంగతుడు, నిత్యాగ్నిహోత్రి, బ్రహ్మవేత్త, శివార్చనా శీలుడు అగు సుధర్ముడనే బ్రాహ్మణుడుండే వాడు. అతని భార్యపేరు సుదేహ. ఆమె కూడా శివభక్తి తత్పరురాలు, సుగుణాల రాశి. వారికి ఎంతకాలం గడిచినా సంతానం కలుగలేదు. స్త్రీ సహజమైన మాతృప్రేమ చేత సంతానం కోసం పరితపిస్తూ ఉండేది సుదేహ. వేదాంతి ఐన భర్త "ఓసి వెఱ్ఱిదానా! ఎవరికెవరు? లోకంలో పిల్లలుగల వారి పాట్లు చూస్తున్నాం కదా! పుత్రుని వల్లనే ఉత్తమ గతులు కలుగుతాయనేది కల్ల. మనం చేసుకొన్న కర్మలే ఇహంలో సుఃఖ దుః ఖాలకు, పరంలో ఉత్తమ లోకాలకు కారణ మవుతాయి. మానవ సంబంధాలు ఋణానుబంధాలే కాని ఇతరమేమీ కావు! నూరుగురు పుత్రులను కనిన గాంధారీ ధృతరాష్ట్రులు చివరకు పరాధీనులై భీముని మర్మఘాత వచనాలను సహించలేక అడవికి పోయి అక్కడ దావానలంలో చిక్కుకొని మరణించారు! దశరథ మహారాజు అంత్యకాల ఘట్టం నీవు విన్నావు కదా! సంతానంలేక పరితపించి పుత్రకామేష్టి చేసి నలుగురు కొడుకులను కని అంత్యకాలంలో చెంత ఒక్క కొడుకు లేక వంతతో మరణించాడు. పాండవులకు సంతానం కలిగినా వారు అశ్వత్థామ చేతిలో హతులుకాగా చివరకు వారికి పుత్రశోకం మిగిలింది. శ్రీకృష్ణానుగ్రహంచే ఒక నలుసు మిగిలేడు, మూలాల్లోకి వెళ్ళి తరచి చూస్తే మానవ జీవితం ఇసుక పునాది మీద కట్టిన ఇల్లు వంటిది. ఎప్పుడు కూలుతుందో తెలియదు.

నీవు కూడా విద్యావంతురాలవే కదా! రామాయణం మొత్తానికి శ్రీరామచంద్రుడు, భారతం మొత్తానికి భీష్ముడు తక్క తల్లిదండ్రుల యందు భక్తిప్రపత్తులు చూపిన తనయులు ఉన్నారంటావా? చెప్పు! ఇంతకి ఈశ్వర సంకల్పం ఎలా ఉందో?" అంటూ సాంత్వన వచనాలను పలికి ఓదార్చేవాడు.

ఆ దంపతులు సంతానం కొరకు చేసిన ప్రయత్నాలన్ని వ్యర్థం కాగా ఒక రోజున సుదేహ ముఖ్యంగా పుత్రసంతాన కాంక్షను అతిక్రమించలేక భర్తను ద్వితీయ వివాహానికి

ప్రోత్సహించింది. దాని వల్ల వచ్చే అనర్థాలను సుధర్ముడు ఆమెకెన్నో విధాల చెప్పిచూచాడు కాని ఆమె చెవికెక్కించుకోలేదు. భార్య ప్రోత్సాహంతో ఆమెకు స్వయంగా చెల్లెలు ఐన ఘుశ్మ అనే కన్యను సుధర్ముడు యథా శాస్త్రీయంగా వివాహం చేసికొని కాపురానికి తీసుకొచ్చాడు. ఆమె కూడ తీవ్రమైన శివభక్తి తత్పరురాలు కనుక ఆ ముగ్గురు నిత్యము శివారాధనలో మునిగి తేలుతూ, శివుని కథలనే చెప్పుకొంటూ, నృత్యగీత వినోదాలతో ప్రొద్దుపుచ్చుతూ సంతోషంతో కాలక్షేపం చేసికొంటూ వచ్చారు. ప్రతి నిత్యము పార్థివ లింగార్చనానంతరం ఆ నిర్మాల్యాన్ని ఘుశ్మ సమీప మందున్న చెరువులో విసర్జిస్తూ వచ్చింది. ఇలా కొంతకాలం గడవగా శంకరానుగ్రహంచే ఘుశ్మ నెల తప్పింది. ఆమెకు అక్కగారైన సుదేహ దాసీదానికంటె ఎక్కువగా సేవలను చేస్తూ వచ్చింది. క్రమంగా గర్భం వృద్ధి చెంది నెలలు నిండగా ఒక శుభ లగ్నంలో సౌభాగ్యరేఖావళీ యుక్తుడు, తేజశ్శాలి అయిన కుమారుని కన్నది ఘుశ్మ.

చంద్రోదయానికి పాల సముద్రం ఉప్పొంగినట్లు పుత్రోదయంతో కుటుంబ సభ్యులు, బంధువులు, ఇరుగు పొరుగు వారు అందరూ ఉప్పొంగి పోయారు. ఉయ్యాల తొట్టెలోని బాలుని బోసినవ్వులకు ఇంట్లోని వారంతా ఇంతంత అనరాని ఆనందాన్ని పొందారు. బాలుడు పెరిగి పెద్దవాడవుతున్నాడు. అతి చంచలమైన మనస్సు యొక్క వ్యాపారం కోతి చేష్టల వంటిది గదా! దేని మీదకు దూకుతుందో తెలియదు, ద్వేషం అనేది బుద్ధికి పట్టిన కుష్ఠువంటిది. బాలుడు పెరిగి పెద్దవాడయ్యే కొలది సుదేహ మనసులో ద్వేషంకూడ అధికం కాజొచ్చింది. అంత వరకు శీతల ప్రసన్నంగా ఉన్న ఆమె హృదయం ద్వేషాగ్ని జ్వాలలతో కొలిమి తిత్తిలా మండజొచ్చింది.

కాలం గడుస్తూన్నది. కుమారునికి యుక్త వయస్సు వచ్చింది. అనుకూలవతి ఐన కన్యతో వివాహాన్ని జరిపించారు. నూతన వధూవరులు సుదేహను అన్ని విధాల అత్తగారి వలెనె ఆదరిస్తూ వచ్చారు. అయినా ఆమె ద్వేషం చల్లారలేదు. అంతఃకరణ మాలిన్యం తొలగలేదు. దుష్టులైన వారికి కార్యాకార్య విచారణ, ఉచితానుచిత వివేకము ఉండవు గదా! సృష్టిలో తామసగుణ ప్రధానమైన దోమలు, నల్లులు, ఈగలు ఇత్యాదులు సత్త్వగుణ ప్రధానమైన సృష్టిని బాధిస్తాయి. అలాగే మానవులలో కూడ తామస గుణాధిక్యత కలిగి జీవించే మనుష్యులు సత్త్వ గుణాధిక్యత గల తాపసులను బాధించి తాము ఆనందాన్ని పొందుతారు.

సుదేహ మనుసులో ద్వేషం రోజురోజుకు అధికం కాజొచ్చింది. అణచుకోలేక పోయింది. వివేకాన్ని కోల్పోయింది. నేత్రరోగి సూర్యకాంతిని చూచి ఓర్వలేనట్లు రతీమన్మథుల వలె ఉన్న ఆ నూతన దంపతులను చూచి కళ్ళల్లో నిప్పులు పోసుకొంది. ముఖ్యంగా సుబ్రహ్మణ్య స్వామిలా ఉన్న ఘుశ్మ కుమారుని కడతేరిస్తే తప్ప తనకు మనశ్శాంతి ఉండదని నిశ్చయించుకొని ఒక నిశీథిలో మాయోపాయంచే కడతేర్చి శవాన్ని చెరువులో పారవేసి ఏమీ ఎరుగని దానివలె ఇంటికి వచ్చి నిద్రించింది.

ఉదయమే ఇంట్లోని వారు లేచి రక్తసిక్తమైన శయ్యను చూచి కుమారుడు కనుపించక పోయే సరికి హతాశులై దుఃఖించారు. అట్టి సమయంలో కూడ సుధర్ముడు, ఘుశ్మ, ఆమె కోడలు శివపూజను మానలేదు. యథా విధిగా ఘుశ్మ మధ్యాహ్న పూజానంతరం శివ నిర్మాల్యాన్ని విసర్జించటానికి చెరువు వద్దకు వచ్చేసరికి కుమారుడు "అమ్మా" అంటూ ఆప్యాయంగా పలకరిస్తూ వచ్చి ఆమె పాదాలకు నమస్కరించాడు. ఆమె హత్యకు గురైన తన కుమారుడు సజీవుడై తిరిగి రావటం కేవలం భక్తవత్సలుడైన శివుని అనుగ్రహంగా భావించి భక్తిపారవశ్యంతో శరీరం పులకాంకితం కాగా ఆనందాశ్రువులు చెక్కిళ్ళపై జార చేతులు జోడించి శంకరుని అనేక విధాల స్తుతించింది. శంకరుడు ప్రత్యక్షమై వరాన్ని కోరుకొమ్మనగా "తండ్రీ! ఈశ్వరా! ఈ విషయంలో నా అక్కగారైన సుదేహను శిక్షించకు! నన్ను అనుగ్రహించినట్లుగానే నువ్విక్కడ స్థిరుడవై ఉండి నీ దర్శనానికి వచ్చే భక్తులను కూడ అనుగ్రహించు." అని ఆమె ప్రార్థించింది. ఆనాటి నుండి శంకరుడు ఘుశ్మ పేరుతో ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగంగా స్థిరపడి భక్తులకు భోగమోక్షాలను ప్రసాదిస్తున్నాడు. ఇది పరమ పవిత్రమైన గాథ! మునులారా! మీకింత వరకు ద్వాదశ జ్యోతిర్లింగ ఆవిర్భావ గాథలను, వాటి మహాత్మ్యాన్ని చెప్పాను. ఇవన్ని పాపహరములు! పుణ్య ప్రదములూను! భుక్తి-ముక్తి దాయకములు."

**విష్ణువుకు శివుడు సుదర్శన చక్రమును ఇచ్చుట**

సూతుడు మునులతో ఇలా అంటున్నాడు: "మునులారా మీకిప్పుడు హరికి సుదర్శన చక్రం లభించిన గాథను చెపుతున్నాను వినండి. పూర్వం ఒకానొక సమయంలో రాక్షసులు బలవత్తరులై లోకాలను పీడిస్తూ ధర్మహాని కలిగిస్తూ దేవతలను సైతం నొప్పిస్తూ లోకకంటకులై తిరుగాడజొచ్చారు. సుపర్వులు ఆపదలపాలై హరిని ఆశ్రయించగా ఆయన కైలాస పతిని ఆరాధించి మీ కార్యాన్ని నెరవేరుస్తానని అభయమిచ్చి పంపించాడు. పంపించి హరి కైలాస సమీపానికి చేరి అగ్నిప్రతిష్ఠాపన చేసి పార్థివ పూజా

విధానంచే వృషభ ధ్వజుని సేవిస్తూ తపస్సు చేయడం ప్రారంభించాడు. "శంభుని అనుగ్రహం లభించేటంత వరకు వైకుంఠానికి వెళ్ళను" అని నిశ్చయించుకొని తపోదీక్షలో మునిగి పోయాడు.

శంకరుడు ప్రసన్నుడు కాలేదు. హరి ప్రతిరోజు శివుని సహస్ర నామాలతో సహస్ర కమలాలతో పూజించటానికి నిశ్చయించుకొని సహస్ర నామార్చన మొదలు పెట్టాడు. అప్పుడు ఒకరోజున శంకరుని లీలచే పూజాంతమందు ఒక కమలం తక్కువ వచ్చింది. హరి ఒక కమలాన్ని సంపాదించటం కొరకు ఎంత ప్రయత్నించినా లభ్యం కాలేదు. అంత పద్మదళాయతాక్షుడైన విష్ణువు తన నేత్రాన్ని పెల్లగించి కమలంగా సమర్పించాడు. ఆయన భక్తి విశ్వాసాలకు ముగ్ధుడైన శంభుడు ప్రత్యక్షమై నీ అభీష్టాన్ని నెరవేరుస్తాను... తెలుప వలసిందని కోరగా విష్ణువు ఇలా ప్రార్థించాడు. "ఓ సదాశివా! నీకు తెలియనిది ఏముంది! ఈ సర్వసృష్టి ఒక రంగ స్థలం. మేమందరము పాత్రలం. అందరిని ఆడించే సూత్రధారుడవు, నటరాజువు నీవే! మా పాత్రాభినయం పూర్తికాగానే మేము తప్పుకొంటాము. అంత్యకాలంలో మిగిలేది నీవొక్కడివే! అందరియందు అంతర్యామి స్వరూపంగా ఉంటూ శివునిగా ఆరాధింపబడుతున్నావు! ఈ జగత్తంతా రాక్షస శక్తులచే పీడింప బడుతూన్నది. నా ఆయుధాలు వారిని శిక్షింప తగిన సామర్థ్యాన్ని కలిగినవి కావు! నీవు నాకు లోకపాలకత్వాన్ని ఇచ్చినా ఆయుధ సంపత్తి లేక అసమర్థునిగా మిగిలిపోయాను. మీది కర్తవ్యాన్ని మీరే ఆలోచించండి."

ఇలా దైన్యంగా పలికిన విష్ణుని నిర్మలాంతఃకరణాన్ని ప్రశంచించి దేవదేవుడైన మహేశ్వరుడు రుద్రతేజో రూపమైన సుదర్శన చక్రాన్ని, సకల దైత్య, దానవ, అసుర, రాక్షస నిర్మూలనా సామర్థ్యమైన దానిని హరికి ఇచ్చాడు. ఆ చక్రంతో విష్ణువు అసుర శక్తులను సంహరించగా లోకాలకు శాంతి లభించింది.

## శివ సహస్ర నామములు

మునులారా! ఆనాడు విష్ణువు పఠించిన శివసహస్ర నామాలను పఠిస్తున్నాను వినండి.

**శ్లో ॥ శివో హరో మృడో రుద్రః పుష్కరః పుష్పలోచనః ।**
**అర్థిగమ్యస్సదాచారశ్శర్వశ్శంభుర్మహేశ్వరః ॥**
**చంద్రాపీడశ్చంద్రమౌలిర్విశ్వం విశ్వంభరేశ్వరః ।**
**వేదాంతసారసందోహః కపాలీ నీలలోహితః ॥**
**ధ్యానాధారోఽపరిచ్ఛేద్యో గౌరీభర్తా గణేశ్వరః ।**

**అష్టమూర్తిర్విశ్వమూర్తిస్త్రివర్గస్స్వర్గసాధనః ॥**
**జ్ఞానగమ్యో దృఢప్రజ్ఞో దేవదేవస్త్రిలోచనః ।**
**వామదేవో మహాదేవః పటుః పరివృఢో దృఢః ॥**
**విశ్వరూపో విరూపాక్షో వాగీశశ్శుచిసత్తమః ।**
**సర్వప్రమాణసంవాదీ వృషాఙ్కో వృషవాహనః ॥**
**ఈశః పినాకీ ఖట్వాంగీ చిత్ర వేషశ్చిరంతనః ।**
**తమోహరో మహాయోగీ గోప్తా బ్రహ్మా చ ధూర్జటిః ॥**
**కాలకాలః కృత్తివాసాస్సుభగః ప్రణవాత్మకః ।**
**ఉన్నధ్రః పురుషో జుష్యో దుర్వాసాః పురశాసనః ॥**

**తా॥** మంగళస్వరూపుడు, పాపములను హరించువాడు, అనుగ్రహమును వర్షించువాడు, దుఃఖమును పారద్రోలు వాడు, పోషించువాడు, పుష్పములవంటి నేత్రములు గలవాడు, కోరికలు గలవారిచే ఆరాధింపబడువాడు, సదాచారస్వరూపుడు, ప్రాణిహింసకుడు, మంగళప్రదాత, సర్వమునకు నియంత. చంద్రుడు శిరోభూషణముగా గలవాడు, శిరస్సుపై చంద్రవంకను ధరించువాడు, జగత్స్వరూపుడు, జగత్తును పోషించు ఈశ్వరుడు, మూర్తీభవించిన వేదాంత ప్రతిపాద్యతత్త్వము, కపాలమును ధరించువాడు, కంఠమునందు నీలవర్ణము ఇతరావయవములయందు రక్త వర్ణము గలవాడు, ధ్యానమునకు ఆలంబనమైన మూర్తిగలవాడు, దేశకాలవస్తుపరిచ్ఛేదములు లేనివాడు, పార్వతీపతి, గణములకు అధిపతి, భూమి–జలము– అగ్ని–వాయువు–ఆకాశము–సూర్యుడు–చంద్రుడు–సోమయాజి అనే ఎనిమిది రూపములు గలవాడు, జగద్రూపముగా భాసించువాడు, ధర్మార్థకామస్వరూపుడు, స్వర్గమునకు సాధనమైనవాడు, జ్ఞానముచే పొందదగినవాడు, సర్వోత్కృష్టమైన ప్రజ్ఞగలవాడు, దేవతలకు దేవత, ముక్కంటి, సుందరమైన దేవత, గొప్ప దేవత, సమర్థుడు, నాయకుడు, ధృఢమైనవాడు, బేసి కన్నులవాడు, వాక్కునకు అధిపతి, పరమపవిత్రమైనవాడు, ప్రమాణములన్నింటియొక్క సమన్వయస్వరూపుడు, వృషభము చిహ్నముగా గలవాడు, వృషభము వాహనముగా గలవాడు, పాలకుడు, పినాకమనే ధనస్సును ధరించువాడు, ఖట్వాంగమనే ఆయుధమును ధరించువాడు, చిత్రమైన వేషము గలవాడు, శాశ్వతుడు, తమోగుణమును పోగొట్టువాడు, యోగులలోకెల్ల గొప్పవాడు, రక్షకుడు, బ్రహ్మరూపుడు, జటాభారము గలవాడు, మృత్యువునకు మృత్యువు, చర్మమును ధరించువాడు, సుందరమైనవాడు,

ఓంకారస్వరూపుడు, సర్వోపరి ఉండువాడు, పూర్ణస్వరూపుడు, సేవించదగినవాడు, దుర్వాసమహర్షి రూపములో అవతరించినవాడు, త్రిపురాసురులను సంహరించినవాడు.

**శ్లో ॥ దివ్యాయుధస్స్కందగురుః పరమేష్ఠీ పరాత్పరః ।**
**అనాదిమధ్యనిధనో గిరీశో గిరిజాధవః ॥**
**కుబేరబంధుశ్శ్రీ కంఠో లోకవర్ణోత్తమో మృదుః ।**
**సమాధివేద్యః కోదండీ నీలకంఠః పరశ్వధీ ॥**
**విశాలాక్షో మృగవ్యాధస్సురేశస్సూర్యతాపనః ।**
**ధర్మధామ క్షమాక్షేత్రం భగవాన్ భగనేత్రభిత్ ॥**
**ఉగ్రః పశుపతిస్తార్క్ష్యః ప్రియభక్తః పరంతపః ।**
**దాతా దయాకరో దక్షః కపర్దీ కామశాసనః ॥**
**శ్మశాననిలయస్సూక్ష్మశ్శ్మశానస్థో మహేశ్వరః ।**
**లోకకర్తా మృగపతిర్మహాకర్తా మహౌషధిః ॥**
**ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః ।**
**నీతిస్సునీతిశ్శుద్ధాత్మా సోమస్సోమరతస్సుఖీ ॥**
**సోమపోఽమృతపస్సౌమ్యో మహాతేజా మహాద్యుతిః ।**
**తేజోమయోఽమృతమయోఽన్న మయశ్చ సుధాపతిః॥**

**తా॥** దివ్యమగు ఆయుధములు గలవాడు, కుమారస్వామియొక్క తండ్రి, సర్వమునకు అతీతమైనవాడు, ఆదిమధ్యాంతములు లేనివాడు, కైలాసపతి, పార్వతీపతి, కుబేరుని మిత్రుడు, కంఠమునందు విషమును దాల్చినవాడు, లోకములోని వర్ణములన్నింటిలో ఉత్తమమైన వర్ణము గలవాడు, మెత్తనివాడు, సమాధిలో తెలియబడువాడు, ధనస్సుగలవాడు, నల్లని కంఠము గలవాడు, పరశుధారి, నిడివి కన్నులవాడు, మృగములను సంహరించే కిరాతుడు, దేవతలకు ప్రభువు, సూర్యుని నియంత్రించువాడు, ధర్మమునకు నిధానమైనవాడు, క్షమకు ఆకరమైనవాడు, షడ్గుణైశ్వర్య సంపన్నుడు, భగుని నేత్రములను ఊడబెరకినవాడు, భయంకరాకారుడు, జీవులకు నియంత, గరుడుడు, భక్తులయందు ప్రీతి గలవాడు, శత్రువులను తపింపజేయువాడు, దాత, దయానిధి, సమర్థుడు, జటాజూటము గలవాడు, మన్మథుని సంహరించినవాడు, శ్మశాసనమునందు నివసించువాడు, ఇంద్రియములకు గోచరము కానివాడు, లోకములను సృష్టించినవాడు, మృగములకు ప్రభువు, నిరతి శయకర్త, గొప్పమందు,

సర్వాతీతుడు, వాక్కులకు ప్రభువు, రక్షకుడు, సనాతనుడు, మంచి నీతియే స్వరూపముగాగలవాడు, పవిత్రమగు అంతఃకరణము గలవాడు, చంద్రుడు, సోమయాగము నందు ప్రీతి గలవాడు, సుఖస్వరూపుడు, సోమపానమును చేయువాడు, అమృతపానము చేయువాడు, ఆహ్లాదకరుడు, గొప్ప తేజస్సు గలవాడు, గొప్ప ప్రకాశము గలవాడు, తేజస్స్వరూపుడు, అమృత స్వరూపుడు, అన్నస్వరూపుడు, అమృతమునకు ప్రభువు.

**శ్లో ॥ అజాతశత్రురాలోకసంభావ్యో హవ్యవాహనః ।**
**లోకకారో వేదకరస్సూత్రకారస్సనాతనః ॥**
**మహర్షిః కపిలాచార్యో విశ్వదీప్తిస్త్రిలోచనః ।**
**పినాకపాణిర్భూదేవస్స్వస్తిదస్స్వస్తికృత్సుధీః ॥**
**ధాతృధామా ధామకరస్సర్వగస్సర్వగోచరః ।**
**బ్రహ్మసృగ్విశ్వసృక్సర్గః కర్ణికార ప్రియః కవిః ॥**
**శాఖోవిశాఖో గోశాఖశ్శివో భిషగనుత్తమః ।**
**గంగాప్లవోదకో భవ్యః పుష్కలః స్థపతిః స్థిరః ॥**
**విజితాత్మా విధేయాత్మా భూతవాహనసారథిః ।**
**సగణో గణకాయశ్చ సుకీర్తిశ్ఛిన్నసంశయః ॥**
**కామదేవః కామపాలో భస్మోద్ధూలితవిగ్రహః ।**
**భస్మప్రియో భస్మశాయీ కామీ కాంతః కృతాగమః ॥**
**సమావర్తో నివృత్తాత్మా ధర్మపుంజస్సదాశివః ।**
**అకల్మషశ్చ పుణ్యాత్మా చతుర్బాహుర్దురాసదః ॥**

**తా॥** శత్రువు అనే ప్రసక్తి లేనివాడు, చైతన్యప్రకాశముచే తెలియదగినవాడు, అగ్నిహోత్రుడు, లోకములను సృష్టించినవాడు, వేదములను సృష్టించినవాడు, సూత్రములను సృష్టించినవాడు, శాశ్వతుడు, మహర్షి కపిలాచార్యునిగా అవతరించినవాడు, జగత్తును ప్రకాశింపజేయువాడు, బ్రాహ్మణస్వరూపుడు, మంగళములనిచ్చువాడు, మంగళములను సృష్టించినవాడు, జ్ఞానస్వరూపుడు, బ్రహ్మకు ఆశ్రయమైనవాడు, ప్రకాశమునిచ్చువాడు, సర్వవ్యాపకుడు, సర్వమునందు దర్శనమునిచ్చువాడు, బ్రహ్మను సృష్టించినవాడు, విశ్వమును సృష్టించినవాడు, సృష్టిస్వరూపుడు, కర్ణికారపుష్పములయందు ప్రీతి గలవాడు, త్రికాలజ్ఞుడు, కుమారస్వామి, ఆదిభిక్షువు (లేదా విశాఖఋషి), వేదశాఖా స్వరూపుడు, భవరోగమునకు

సాటిలేని వైద్యుడు, గంగాజలరూపములో ప్రవహించువాడు, ఉదాత్తమైనవాడు, పూర్ణుడు, శిల్పశాస్త్ర వేత్త, కూటస్థుడు, ఇంద్రియజయము గలవాడు, మనోనియంత్రణ గలవాడు, శరీరమనే రథమునకు బుద్ధి రూపములో సారథి అయినవాడు, గణసమేతుడు, గణములచే రక్షింపబడువాడు, పవిత్రమగు కీర్తి గలవాడు, సంశయములు లేనివాడు, మన్మథస్వరూపుడు, మన్మథుని పాలించినవాడు, భస్మ లేపనముతో గూడిన దేహము గలవాడు, సుందరుడు, ఆగమములను రచించినవాడు, సంసారచక్రమును త్రిప్పువాడు, లయము చేయబడిన మనస్సు గలవాడు, మూర్తీభవించిన ధర్మము, సర్వదా మంగళస్వరూపుడు, పాపసంసర్గము లేనివాడు, పుణ్యస్వరూపుడు, నాలుగు భుజములు గలవాడు, సమీపించ శక్యము కానివాడు.

**శ్లో ॥ దుర్లభో దుర్గమో దుర్గస్సర్వాయుధవిశారదః ।**
**ఆధ్యాత్మయోగనిలయస్సుతంతుస్తంతువర్ధనః ॥**
**శుభాంగో లోకసారంగో జగదీశో జనార్దనః ।**
**భస్మశుద్ధికరో మేరురోజస్వీ శుద్ధవిగ్రహః ॥**
**అసాధ్యస్సాధుసాధ్యశ్చ భృత్యమర్కటరూపధృక్ ।**
**హిరణ్యరేతాః పౌరాణో రిపుజీవహరో బలీ ॥**
**మహాహ్రదో మహాగర్తస్సిద్ధో బృందారవందితః ।**
**వ్యాఘ్రచర్మాంబరో వ్యాలీ మహాభూతో మహానిధిః॥**
**అమృతోఽ మృతపః శ్రీమాన్ పాంచజన్యః ప్రభంజనః ।**
**పంచవింశతితత్త్వస్థః పారిజాతః పరాత్పరః॥**
**సులభస్సువ్రతశ్శూరో వాఙ్మయైకనిధిర్నిధిః ।**
**వర్ణాశ్రమగురుర్వర్ణీ శత్రుజిచ్ఛత్రుతాపనః ॥**

**తా॥** అరుదైనవాడు, లభింప శక్యము కానివాడు, పొంద శక్యము కానివాడు, ఆయుధములన్నింటియందు నైపుణ్యము గలవాడు, అధ్యాత్మయోగమునందు నివసించి యుండువాడు, మంచి సంతానరూపములో నుండువాడు, సంతానమును వృద్ధి చేయువాడు, శుభకరములగు అవయవములు గలవాడు, సర్వ జగత్తు యొక్క సారస్వరూపుడు, జగత్ప్రభువు, దుష్టజనులను శిక్షించువాడు, భస్మచే శుద్ధిని కలిగించువాడు, మేరుపర్వతస్వరూపుడు, మహాబలశాలి, పవిత్రదేహము గలవాడు, సాధించ శక్యము కానివాడు, సాధుపురుషులచే సాధించబడువాడు, సేవను చేసే కోతి రూపమును దాల్చినవాడు, తేజస్సు బీజముగా

గలవాడు, సనాతనుడు, శత్రువుల ప్రాణములను హరించువాడు, బలశాలి, సముద్రస్వరూపుడు, పెద్ద బిలము స్వరూపముగా గలవాడు, సిద్ధపురుషుడు, దేవతలచే నమస్కరింపబడువాడు, వ్యాఘ్రచర్మమును ధరించువాడు, పాములను ధరించువాడు, పంచమహాభూతస్వరూపుడు, గొప్ప నిధి, అమృతస్వరూపుడు, అమృతపానము చేసినవాడు, శోభాయుక్తుడు, పంచవిధజనులకు ప్రియుడు, గాలివాన రూపములో వచ్చువాడు, ఇరువది ఐదు తత్త్వములలో ఉండువాడు, పారిజాతవృక్షస్వరూపుడు, తేలికగా లభించువాడు, గొప్ప వ్రతనిష్ఠ గలవాడు, శూరుడు, వాఙ్మయము అనే ఏకైకనిధి, నిధిస్వరూపుడు, వర్ణాశ్రమములకు గురువు, బ్రహ్మచారి, శత్రువులను జయించువాడు, శత్రువులను తపింపచేయువాడు.

**శ్లో ॥ ఆశ్రమః క్షపణః క్షామో జ్ఞానవానచలేశ్వరః ।**
**ప్రమాణభూతో దుర్జ్ఞేయస్సువర్ణో వాయువాహనః ॥**
**ధనుర్ధరో ధనుర్వేదో గుణశ్శశిగుణాకరః ।**
**సత్యస్సత్యపరోఽదీనో ధర్మో గోధర్మశాసనః ॥**
**అనంతదృష్టిరానందో దండో దమయితా దమః ।**
**అభిచార్యో మహామాయో విశ్వకర్మావిశారదః ॥**
**వీతరాగో వినీతాత్మా తపస్వీ భూతభావనః ।**
**ఉన్మత్తవేషః ప్రచ్ఛన్నో జితకామోఽజితప్రియః ॥**
**కళ్యాణప్రకృతిః కల్పః సర్వలోకప్రజాపతిః ।**
**తరస్వీ తారకో ధీమాన్ ప్రధానః ప్రభురవ్యయః ॥**
**లోకపాలోఽంతర్హితాత్మా కల్పాదిః కమలేక్షణః ।**
**వేదశాస్త్రార్థతత్త్వజ్ఞోఽనియమో నియతాశ్రయః ।**
**చంద్రస్సూర్యశ్శనిః కేతుర్వరాంగో విద్రుమచ్ఛవిః ॥**
**భక్తివశ్యః పరం బ్రహ్మ మృగబాణార్పణోఽనఘః ॥**
**అద్రిరద్ర్యా లయః కాంతః పరమాత్మా జగద్గురుః ।**
**సర్వకర్మాలయస్తుష్టో మంగల్యో మంగలావృతః॥**

**తా॥** ఆశ్రమస్వరూపుడు, సన్న్యాసి, బక్కచిక్కినవాడు, జ్ఞాని, పర్వతాధిపతి, ప్రమాణస్వరూపుడు, తెలియ శక్యము కానివాడు, సుందరమగు రెక్కలు గలవాడు, గంధస్వరూపుడు, ధనుర్ధారి, ధనుర్వేదస్వరూపుడు, త్రిగుణస్వరూపుడు, చంద్రుని ఆహ్లాదకర

గుణమునకు నిధానమైనవాడు, సత్యస్వరూపుడు, సత్యమునందు నిష్ఠగలవాడు, దైన్యమునెరుంగనివాడు, ధర్మస్వరూపుడు, వేదధర్మముద్వారా శాసించువాడు, అనంతమగు దృష్టిగలవాడు, ఆనందఘనుడు, దండస్వరూపుడు, దండించువాడు, దయాస్వరూపుడు, సమీపించదగినవాడు, గొప్ప మాయ గలవాడు, విశ్వకర్మ, నిపుణుడు, రాగము లేనివాడు, వినయముతో కూడిన మనస్సు గలవాడు, తపశ్శాలి, భూతములను సృష్టించువాడు, ఉన్మత్తునివలె వేషమును ధరించువాడు, దాగియుండువాడు, కామమును జయించినవాడు, ప్రీతిపాత్రులకు అపజయమును కలిగించనివాడు, మంగళస్వభావము గలవాడు, కల్ప స్వరూపుడు, సకలలోకములకు ప్రజాపతి, వేగము గలవాడు, రక్షించువాడు, బుద్ధిశాలి, ప్రధానస్వరూపుడు, ప్రభువు, నాశము లేనివాడు, లోకపాలకుడు, దాగియున్న స్వరూపము గలవాడు, కల్పాది స్వరూపుడు, కమలములవంటి కన్నులు గలవాడు, వేదశాస్త్రముల సారమునెరిగినవాడు, నియమములు లేనివాడు, స్థిరమగు నివాసము గలవాడు, చంద్రుడు, సూర్యుడు, శని, కేతువు, శ్రేష్ఠమగు అవయవములు గలవాడు, పగడపు కాంతి గలవాడు, భక్తిచే వశమగువాడు, పరంబ్రహ్మ, మృగముపై బాణములను ప్రయోగించినవాడు, పాపసంపర్కము లేనివాడు, పర్వతము, పర్వతముపై నివసించువాడు, సుందరుడు, పరమాత్మ, జగత్తునకు గురువు, సర్వకర్మలకు నిలయము, సంతోషము గలవాడు, మంగళనిధానము, మంగళములచే చుట్టువారబడి ఉండువాడు.

**శ్లో ॥ మహాతపా దీర్ఘతపాః స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ।**
**అహస్సంవత్సరో వ్యాప్తిః ప్రమాణం పరమం తపః ॥**
**సంవత్సరకరో మంత్రః ప్రత్యయస్సర్వతాపనః ।**
**అజస్సర్వేశ్వరస్సిద్ధో మహాతేజా మహాబలః ॥**
**యోగీ యోగ్యో మహారేతాస్సిద్ధిస్సర్వాదిరగ్రహః ।**
**వసుర్వసుమనా స్సత్యస్సర్వపాపహరో హరః ॥**
**సుకీర్తిశ్శోభనస్స్రగ్వీ వేదాంగో వేదవిన్మునిః ।**
**భ్రాజిష్ణుర్భోజనం భోక్తా లోకనాథో దురాధరః ॥**
**అమృతశ్శాశ్వతశ్శాంతో బాణహస్తః ప్రతాపవాన్ ।**
**కమండలు ధరో ధన్వీ హ్యవాఙ్మానసగోచరః ॥**
**అతీంద్రియో మహామాయస్సర్వావాసశ్చతుష్పథః ।**

**కాలయోగీ మహానాదో మహోత్సాహో మహాబలః॥**
**మహాబుద్ధిర్మహావీర్యో భూతచారీ పురందరః ।**
**నిశాచరః ప్రేతచారీ మహాశక్తి ర్మహాద్యుతిః ॥**
**అనిర్దేశ్యవపుశ్శ్రీ మాన్ సర్వాచార్యమనో గతిః ।**
**బహు శ్రుతిర్మహామాయో నియతాత్మా ధ్రువో ధ్రువః ॥**

**తా॥** గొప్ప తపస్సు గలవాడు, దీర్ఘకాలము తపస్సును చేయువాడు, స్థూలస్వరూపుడు, ముసలివాడు, ధ్రువమండలస్వరూపుడు, పగటి కాలమునకు అధిష్ఠానమైన దేవతాస్వరూపుడు, సంవత్సరస్వరూపుడు, నిత్య సంబంధస్వరూపుడు, ప్రమాణస్వరూపుడు, శ్రేష్ఠతపస్స్వరూపుడు, సంవత్సరమనే కాలమును చేయు సూర్యస్వరూపుడు, మంత్రస్వరూపుడు, శ్రద్ధాస్వరూపుడు, సర్వులను తపింపజేయువాడు, పుట్టుక లేనివాడు, సర్వేశ్వరుడు, సిద్ధుడు, మహాతేజశ్శాలి, మహాబలశాలి, యోగి, యోగ్యమైన వాడు, సర్వజగత్తునకు బీజము, సిద్ధిస్వరూపుడు, సర్వకారణుడు, సర్వమునకు ముందు ఉన్నవాడు, సంపత్స్వరూపుడు, కొనియాడదగిన మనస్సు గలవాడు, సత్యస్వరూపుడు, సర్వపాపములను పోగొట్టే హరుడు, మంచి కీర్తి గలవాడు, శోభ గలవాడు, మాలను ధరించువాడు, వేదాంగస్వరూపుడు, వేదములను తెలిసినవాడు, ముని, ఉజ్జ్వలముగా ప్రకాశించువాడు, అన్నస్వరూపుడు, భోక్తృస్వరూపుడు, లోకములకు ప్రభువు, జయింప శక్యము కానివాడు, అమృతుడు, శాశ్వతుడు, శాంతుడు, బాణము చేతియందు గలవాడు, ప్రతాపము గలవాడు, కమండలమును పట్టుకున్నవాడు, ధనస్సు గలవాడు, వాక్కునకు మరియు మనస్సునకు గోచరము కానివాడు, ఇంద్రియములకు గోచరము కానివాడు, గొప్ప మాయ గలవాడు, సర్వమునందు నివసించువాడు, నాలుగు మార్గములు గలవాడు, కాలముతో సంబంధము గలవాడు, గొప్ప నాదము గలవాడు, గొప్ప ఉత్సాహము గలవాడు, గొప్ప బలము గలవాడు, గొప్ప బుద్ధి గలవాడు, గొప్ప పరాక్రమము గలవాడు, భూతములతో కలిసి సంచరించువాడు, త్రిపురములను వినాశము చేసినవాడు, రాత్రియందు సంచరించువాడు, ప్రేతములతో కలిసి తిరుగువాడు, గొప్ప శక్తి గలవాడు, గొప్ప కాంతి గలవాడు, ఇదమిత్థముగా నిర్దేశించ శక్యము కాని దేహము గలవాడు, శ్రీమంతుడు, అందరు ఆచార్యుల మనస్సులలో ధ్యానించబడువాడు, సర్వశాస్త్ర జ్ఞానప్రవర్తకుడు, నిత్యుడు, అనిత్యుడు.

శ్లో ॥ తేజస్తేజోద్యుతిధరో జనకస్సర్వశాసకః ।
నృత్యప్రియో నృత్యనిత్యః ప్రకాశాత్మా ప్రకాశకః ॥
స్పష్టాక్షరో బుధో మంత్రస్సమానస్సారసంప్లవః ।
యుగాదికృద్యుగావర్తో గంభీరో వృషవాహనః ॥
ఇష్టో విశిష్ట శ్శిష్టేష్టస్సులభస్సారశోధనః ।
తీర్థరూపస్తీర్థనామా తీర్థదృశ్యస్తు తీర్థదః ॥
అపాం నిధిరధిష్ఠానం విజయో జయకాలవిత్ ।
ప్రతిష్ఠితః ప్రమాణజ్ఞో హిరణ్యకవచో హరిః ॥
విమోచనస్సురగణో విద్యేశో బిందుసంశ్రయః ।
వాతరూపోஉమలోన్మాయీ వికర్తా గహనో గుహః ॥
కరణం కారణం కర్తా సర్వబంధవిమోచనః ।
వ్యవసాయో వ్యవస్థానః స్థానదో జగదాదిజః ॥
గురుదో లలితోஉభేదో భావాత్మాత్మని సంస్థితః ।
వీరేశ్వరో వీరభద్రో వీరాసనవిధిర్గురుః ॥
వీరచూడామణిర్వేత్తా చిదానందో నదీధరః ।
ఆజ్ఞాధారస్త్రి శూలీ చ శిపివిష్టశ్శివాలయః ॥

**తా॥** తేజస్సులకు తేజస్సు, కాంతి గలవాడు, తండ్రి, సర్వులను శాసించువాడు, నృత్యమునందు ప్రీతి గలవాడు, నిత్యము నాట్యమును చేయువాడు, ప్రకాశస్వరూపుడు, ప్రకాశింప జేయువాడు, స్పష్టాక్షరస్వరూపుడు, పండితుడు, మంత్రస్వరూపుడు, సర్వసముడు, సారస్వరూపుడు, యుగాదిని చేయువాడు, యుగచక్రమును త్రిప్పువాడు, గంభీరుడు, వృషభము వాహనముగా గలవాడు, ప్రీతి పాత్రుడు, గొప్పవాడు, శిష్టులయందు ప్రీతి గలవాడు, తేలికగా లభించువాడు, జీవుని సారస్వరూపమును శోధించువాడు, తీర్థస్వరూపుడు, తీర్థముల నామము గలవాడు, తీర్థములయందు దర్శింపబడువాడు, తీర్థములను ఇచ్చువాడు, జలనిధి, జగదధిష్ఠానము, విజయుడు, జయమును ఇచ్చే కాలము తెలిసినవాడు, ప్రతిష్ఠించ బడినవాడు, ప్రమాణజ్ఞానము కలవాడు, తేజస్సు కవచముగా గలవాడు, విష్ణుస్వరూపుడు, ముక్తిని ఇచ్చువాడు, దేవతలచే సేవించబడువాడు, విద్యలకు ప్రభువు, బిందువు నందు ఉండువాడు, వాయుస్వరూపుడు, దోషవర్జితుడు, జగత్కర్త, తెలియ శక్యము కానివాడు, గుహస్వరూపుడు, కరణము, కారణము, కర్త, బంధములన్నింటినుండి విడిపించువాడు,

దృఢనిశ్చయస్వరూపుడు, సువ్యవస్థయే స్వరూపముగా గలవాడు, స్థానమునొసంగువాడు, జగత్తునకు ఆదిలో హిరణ్యగర్భరూపములో జన్మించినవాడు, గురువును అనుగ్రహించువాడు, లలితుడు, అభేదస్వరూపుడు, మనోవృత్తి స్వరూపుడు, హృదయగుహలో నుండువాడు, వీరులకు ప్రభువు, వీరభద్రరూపుడు, వీరాసనమునందు ఉపవిష్టుడై ఉండువాడు, గురువు, వీరులకు చూడామణివంటి వాడు, జ్ఞాత, చిదానందస్వరూపుడు, నదులను ధరించువాడు, ఆజ్ఞాచక్రమునందు ఉండువాడు, త్రిశూలము గలవాడు, కాంతిస్వరూపుడు, మంగళకరమగు నివాసము గలవాడు.

**శ్లో ॥ వాలఖిల్యో మహావీరస్తిగ్మాంశుర్బధిరః ఖగః ।**
**అభిరామస్సుశరణస్సుబ్రహ్మణ్యస్సుధాపతిః ॥**
**మఘవాన్ కౌశికో గోమాన్ విరామస్సర్వసాధనః ।**
**లలాటాక్షో విశ్వదేహస్సారస్సంసారచక్రభృత్ ॥**
**అమోఘదండీ మధ్యస్థో హిరణ్యో బ్రహ్మవర్చసః ।**
**పరమార్థః పరో మాయీ శంబరో వ్యాఘ్రలోచనః ॥**
**రుచిర్బ హురుచిర్వైద్యో వాచస్పతిరహస్పతిః ।**
**రవిర్విరోచనస్స్కందశ్శాస్తా వైవస్వతో యమః ॥**
**యుక్తిరున్నతకీర్తిశ్చ సానురాగః పురంజయః ।**
**కైలాసాధిపతిః కాంతస్సవితా రవిలోచనః ॥**
**విశ్వోత్తమో వీతభయో విశ్వభర్తాఽనివారితః ।**
**నిత్యో నియతకల్యాణః పుణ్యశ్రవణకీర్తనః ॥**
**దూరశ్రవో విశ్వసహో ధ్యేయో దుస్స్వప్ననాశనః ।**
**ఉత్తారణో దుష్కృతిహా విజ్ఞేయో దుస్సహోఽభవః ॥**
**అనాదిర్భూర్భువో లక్ష్మీః కిరీటీ త్రిదశాధిపః ।**
**విశ్వగోప్తా విశ్వకర్తా సువీరో రుచిరాంగదః ॥**
**జననో జనజన్మాదిః ప్రీతిమాన్నీతిమాన్ ధ్రువః ।**
**వశిష్ఠః కశ్యపో భానుర్భీమో భీమపరాక్రమః ॥**
**ప్రణవస్సత్పథాచారో మహాకోశో మహాధనః ।**
**జన్మాధిపో మహాదేవస్సకలాగమపారగః ॥**

**తా॥** వాలఖిల్యమహర్షిస్వరూపుడు, మహావీరుడు, తీక్ష్మమగు కిరణములు గలవాడు, చెవిటివాడు, పక్షి, ఆహ్లాదకరమైనవాడు, శరణు పొందదగినవాడు, సుబ్రహ్మణ్యుడు, అమృతమునకు ఆధీశ్వరుడు, ఇంద్రుడు, కౌశికుడు, సూర్యుడు, విశ్రాంతిస్థానము, సర్వమును సాధించువాడు, లలాటమునందు కన్ను గలవాడు, జగత్తు దేహముగా గలవాడు, సారస్వరూపుడు, సంసారచక్రమును ధరించువాడు, అమోఘమైన దండము గలవాడు, రాగద్వేషములు లేనివాడు, తేజస్స్వరూపుడు, బ్రహ్మవర్చస్స్వరూపుడు, పరమార్థస్వరూపుడు, గొప్ప మాయావి, మేఘస్వరూపుడు, పెద్దపులి కన్నులు గలవాడు, సుందరుడు, అధికమగు ప్రకాశము గలవాడు, వైద్యుడు, బృహస్పతి, సూర్యుడు, ఆదిత్యుడు, విరోచనుడు, స్కందుడు, శాస్త, సూర్యపుత్రుడగు యముడు, యుక్తిస్వరూపుడు, గొప్ప కీర్తి గలవాడు, ప్రేమగలవాడు, త్రిపురాసురసంహర్త, కైలాసాధిపతి, సుందరమైనవాడు, జగత్తునకు తండ్రి, సూర్యుడే కన్నుగా గలవాడు, సర్వోత్తముడు, భయము లేనివాడు, జగత్తును పోషించువాడు, నివారింప శక్యము కానివాడు, నిత్యుడు, నిశ్చితమైన మంగళము గలవాడు, శ్రవణకీర్తనములచే పుణ్యమునొసంగువాడు, దూరమునుండియే వినువాడు, సర్వమును సహించువాడు, ధ్యానించబడువాడు, చెడు కలలను పోగొట్టువాడు, తరింపజేయువాడు, పాపకృత్యములను నశింపజేయువాడు, తెలియదగినవాడు, సహింప శక్యము కానివాడు, పుట్టుక లేనివాడు, కారణము లేనివాడు, భూస్వరూపుడు, భూమియందలి సంపదయే స్వరూపముగా గలవాడు, కిరీటము గలవాడు, దేవతలకు అధిపతి, జగత్తును రక్షించువాడు, జగత్తును సృష్టించువాడు, గొప్ప వీరుడు, సుందరమగు అవయవములనిచ్చువాడు, జన్మను ఇచ్చువాడు, జనుల జన్మకు కారణమైనవాడు, ప్రీతి గలవాడు, నీతి గలవాడు, నిత్యుడు, వశిష్ఠుడు, కశ్యపుడు, సూర్యుడు, భయంకరుడు, భయంకరమగు పరాక్రమము గలవాడు, ఓంకారస్వరూపుడు, సన్మార్గమునందు సంచరించువాడు, గొప్ప నిధి, గొప్ప ధనము గలవాడు, జన్మకు అధిపతి, మహాదేవుడు, సకలవేదముల సారస్వరూపుడు.

**శ్లో ॥ తత్త్వం తత్త్వవిదేకాత్మా విభుర్విష్ణువిభూషణః ।**
**ఋషిర్బ్రాహ్మణ ఐశ్వర్యజన్మమృత్యుజరాతిగః ॥**
**పంచయజ్ఞసముత్పత్తిర్విశ్వేశో విమలోదయః ।**
**ఆత్మయోనిరనాద్యంతో వత్సలో భక్తలోకధృక్ ॥**
**గాయత్రీవల్లభః ప్రాంశుర్విశ్వావాసః ప్రభాకరః ।**
**శిశుర్గిరిరతస్సమ్రాట్ సుషేణస్సురశత్రుహా ॥**

**అనేమిరిష్టనేమిశ్చ ముకుందో విగతజ్వరః ।**
**స్వయంజ్యోతిర్మహాజ్యోతిస్తనుజ్యోతిరచంచలః ॥**
**పింగలః కపిలశ్మశ్రుర్భాలనేత్రస్త్ర యీ తనుః ।**
**జ్ఞానస్కందో మహానీతిర్విశ్వోత్పత్తిరుపప్లవః ॥**
**భగో వివస్వానాదిత్యో గతపారో బృహస్పతిః ।**
**కల్యాణగుణనామా చ పాపహా పుణ్యదర్శనః ॥**
**ఉదారకీర్తిరుద్యోగీ సద్యోగీ సదసన్మయః ।**
**నక్షత్రమాలీ నాకేశస్స్వాధిష్ఠానషడాశ్రయః ॥**
**పవిత్రః పాపహారీ చ మణిపూరో నభోగతిః ।**
**హృత్పుండరీకమాసీనశ్శక్రశ్శాంతో వృషాకపిః ॥**
**ఉష్ణో గ్రహపతిః కృష్ణస్సమర్థోఽనర్థనాశనః ।**
**అధర్మశత్రురజ్ఞేయః పురుహూతః పురుశ్రుతః ॥**
**బ్రహ్మగర్భో బృహద్గర్భో ధర్మధేనుర్ధనాగమః ।**
**జగద్ధితైషీ సుగతః కుమారః కుశలాగమః ॥**
**హిరణ్యవర్ణో జ్యోతిష్మాన్నానాభూతరతో ధ్వనిః ।**
**ఆరోగ్యో నమనాధ్యక్షో విశ్వామిత్రో ధనేశ్వరః ॥**

**తా॥** పరమార్థస్వరూపుడు, ఆత్మతత్త్వము తెలిసినవాడు, అద్వితీయ ఆత్మ, సర్వవ్యాపి, విష్ణువునకు అలంకారము, మహర్షి, బ్రాహ్మణుడు, ఐశ్వర్యము పుట్టుక మరణము మరియు వృద్ధాప్యము అను వాటికి అతీతుడు, పంచయజ్ఞములను సృష్టించినవాడు, విశ్వేశ్వరుడు, స్వచ్ఛమగు ఉదయము గలవాడు, ఆత్మయందు నివాసము ఉండువాడు, ఆద్యంతములు లేనివాడు, ప్రేమస్వరూపుడు, భక్తజనులను ధరించువాడు, గాయత్రియందు ప్రీతి గలవాడు, పొడుగైనవాడు, జగత్తు నివాసముగా గలవాడు, సూర్యుడు, బాలకుడు, పర్వతమునందు ప్రీతి గలవాడు, చక్రవర్తి, గొప్ప సైన్యము గలవాడు, దేవశత్రువులను సంహరించువాడు, పరిచ్ఛేదములు లేనివాడు, భక్తులకు మోక్షమునిచ్చువాడు, ముకుందుడు, దుఃఖము లేనివాడు, స్వయంప్రకాశస్వరూపుడు, గొప్ప తేజశ్శాలి, సూక్ష్మజ్యోతిస్స్వరూపుడు, చలనము లేనివాడు, పింగలవర్ణము గలవాడు, కపిలవర్ణముగల గెడ్డము గలవాడు (దుర్వాసుడు), లలాటము నందు కన్ను గలవాడు, వేదమే శరీరముగా గలవాడు, జ్ఞానమునిచ్చువాడు, గొప్ప నీతి గలవాడు, జగత్కారణుడు, జగత్సంహారకుడు, సంపద, సూర్యుడు, ఆదిత్యుడు, సంసారమునకు

ఆవల ఉండువాడు, బృహస్పతి, మంగళకరములగు గుణములు మరియు నామములు గలవాడు, పాపములను పోగొట్టువాడు, దర్శనముచే పుణ్యమును ఇచ్చువాడు, మహోత్తమమగు కీర్తిగలవాడు, గొప్ప యోగము గలవాడు, పవిత్రమగు యోగము గలవాడు, కార్యకారణ స్వరూపుడు, నక్షత్రమండలస్వరూపుడు, స్వర్గాధిపతి, స్వాధిష్ఠానచక్రమునందు ఉండువాడు, షట్చక్రములయందు ఉండువాడు, వజ్రమువలె భయంకరమగు సంసారమునుండి రక్షించువాడు, పాపములను హరించువాడు, మణిపూరచక్రమునందు ఉండువాడు, ఆకాశమార్గమునందు సంచరించు వాడు, హృదయపద్మమునందు నివసించువాడు, ఇంద్రుడు, శాంతుడు, ధర్మస్వరూపుడు, ఉష్ణస్వరూపుడు, గ్రహములకు అధిపతి, శ్రీకృష్ణుడు, సమర్థుడు, అనర్థములను పోగొట్టువాడు, అధర్మమునకు శత్రువు, తెలియ శక్యము కానివాడు, యజ్ఞమునందు పదే పదే ఆహ్వానించబడువాడు, గొప్ప కీర్తి గలవాడు, బ్రహ్మ గర్భమునందు గలవాడు, పెద్ద గర్భము గలవాడు, ధర్మదేవత, ధనమును ఇచ్చువాడు, జగత్తునకు హితమును కోరువాడు, బుద్ధుడు, కుమారుడు, క్షేమమునకు నిధి, బంగారు రంగువాడు, తేజస్స్వరూపుడు, సర్వప్రాణులయందు ప్రీతి గలవాడు, శబ్దస్వరూపుడు, ఆరోగ్య స్వరూపుడు, సంధ్యావందనాదులకు అధిష్ఠానదేవత, విశ్వామిత్రుడు, కుబేరుడు.

శ్లో ॥ **బ్రహ్మజ్యోతిర్వసుధామా మహాజ్యోతిరనుత్తమః ।**
**మాతామహో మాతరిశ్వా నభస్వాన్నాగహారధృక్ ॥**
**పులస్త్యః పులహోఽగస్త్యో జాతూకర్ణ్యః పరాశరః ।**
**నిరావరణనిర్వారో వైరంచ్యో విష్టరశ్రవాః ॥**
**ఆత్మభూరనిరుద్ధోఽత్రిర్ జ్ఞానమూర్తిర్మహాయశాః ।**
**లోకవీరాగ్రణీర్వీరశ్చండస్సత్యపరాక్రమః ॥**
**వ్యాలకల్పో మహాకల్పః కల్పవృక్షః కలాధరః ।**
**అలంకరిష్ణురచలో రోచిష్ణుర్విక్రమోన్నతః ॥**
**ఆయుశ్శబ్దపతిర్వాగ్మీ ప్లవనశ్శిఖిసారథిః ।**
**అసంసృష్టోఽతిథిశ్శత్రు ప్రమాథీ పాదపాసనః ॥**
**వసుశ్రవా కవ్యవాహః ప్రతప్తో విశ్వభోజనః ।**
**జప్యో జరాదిశమనో లోహితశ్చ తనూనపాత్ ॥**
**వృషదశ్వో నభోయోనిస్సుప్రతీకస్తమిస్రహా ।**
**నిదాఘస్తవనో మేఘభక్షః పరపురంజయః ॥**

**సుఖానిలస్సునిష్పన్నస్సురభిశ్శిశిరాత్మకః ।**
**వసంతో మాధవో గ్రీష్మో నభస్యో బీజవాహనః ॥**
**అంగిరా గురురాత్రేయో విమలో విశ్వపావనః ।**
**పావనః పురజిచ్ఛక్రస్త్రైవిద్యో వరవాహనః ॥**

**తా॥** పరబ్రహ్మ, జ్యోతిస్స్వరూపుడు, సుందరమగు ధామము గలవాడు, గొప్ప తేజస్సు గలవాడు, నిరతిశయుడు, తల్లికి తండ్రి, ఆకాశమునందు సంచరించే వాయుదేవత, పాములనే హారములుగా ధరించువాడు, పులస్త్యుడు, పులహుడు, అగస్త్యుడు, జాతూకర్ణ్యుడు, పరాశరుడు, ఆవరణము మరియు ఆటంకము లేనివాడు, బ్రహ్మపుత్రుడు, విస్తృతమగు కీర్తి గలవాడు, స్వయంభువుడు, అనిరుద్ధుడు, అత్రి, జ్ఞానస్వరూపుడు, గొప్ప కీర్తి గలవాడు, లోకములోని వీరులలో అగ్రేసరుడు, వీరుడు, భయంకరుడు, యథార్థమైన పరాక్రమము గలవాడు, మహాసర్పమును పోలియున్నవాడు, మహాకల్పస్వరూపుడు, కల్పవృక్షము, చంద్రుడు, అలంకరించుకునే స్వభావము కవాడు, చలనము లేనివాడు, సుందరుడు, విక్రమముచే ఉన్నతమైనవాడు, కాలస్వరూపుడు, శబ్దములకు ప్రభువు, వక్త, ఎగురువాడు, అగ్ని సారథిగా గలవాడు, అసంగుడు, అతిథి, శత్రుసంహారకుడు, వృక్షమే ఆసనముగా గలవాడు, సుందరమగు కర్ణములు గలవాడు, పితృదేవతలకు ఈయబడే కవ్యమును వారికి సమర్పించువాడు, అత్యుష్ణస్వరూపుడు, జగత్తును భక్షించువాడు, జపించ దగినవాడు, వృద్ధాప్యము మొదలగు వాటిని పోగొట్టువాడు, ఎర్రనివాడు, అగ్నిహోత్రుడు, వాయువు, ఆకాశమునకు కారణము, మంచి ప్రతీకలు గలవాడు, తమస్సును పోగొట్టువాడు, గ్రీష్మఋతువు, సూర్యుడు, మేఘములను భక్షించువాడు, శత్రునగరములను జయించువాడు, సుఖకరుడగు వాయువు, సుందరమైన జన్మ గలవాడు, సుగంధము, శిశిరస్వరూపుడు, వసంతుడు, మాధవుడు, గ్రీష్మము, భాద్రపదము, బీజములను ప్రవర్తిల్లు జేయువాడు, అంగిరస్సు, గురువు, ఆత్రేయుడు, శుద్ధుడు, జగత్తును పావనము చేయువాడు, పవిత్రుడు, త్రిపురములను జయించినవాడు, ఇంద్రుడు, వేదస్వరూపుడు, శ్రేష్ఠమగు వృషభవాహనము గలవాడు.

**శ్లో ॥ మనో బుద్ధిరహంకారః క్షేత్రజ్ఞః క్షేత్రపాలకః ।**
**జమదగ్నిర్బలనిధిర్విగాలో విశ్వగాలవః ॥**
**అఘోరో௨నుత్తరో యజ్ఞః శ్రేయో నిః శ్రేయసప్రదః ।**
**శైలో గగనకుందాభో దానవారిరరిందమః ॥**

చాముండో జనకశ్చారుర్నిశ్శల్యో లోకశల్యధృక్ ।
చతుర్వేదశ్చతుర్భావశ్చతురశ్చతురప్రియః ॥
ఆమ్నాయోఽథ సమామ్నాయస్తీర్థదేవశివాలయః ।
బహురూపో మహారూపస్సర్వరూపశ్చరాచరః ॥
న్యాయనిర్ణాయకో నేయో న్యాయగమ్యో నిరంజనః ।
సహస్రమూర్ధా దేవేంద్రస్సర్వశస్త్ర ప్రభంజనః॥
ముండీ విరూపో వికృతో దండీ నాదీ గుణోత్తమః ।
పింగలాక్షో హి బహ్వక్షో నీలగ్రీవో నిరామయః॥
సహస్రబాహుస్సర్వేశశ్శరణ్యస్సర్వలోకధృక్ ।
పద్మాసనః పరం జ్యోతిః పారంపర్యఫలప్రదః ॥
పద్మగర్భో మహాగర్భో విశ్వగర్భో విచక్షణః ।
పరావరజ్ఞో వరదో వరేణ్యశ్చ మహాస్వనః ॥
దేవాసురగురుర్దేవో దేవాసురనమస్కృతః ।
దేవాసురమహామిత్రో దేవాసురమహేశ్వరః ॥
దేవాసురేశ్వరో దివ్యో దేవాసురమహాశ్రయః ।
దేవదేవోఽనయోఽచింత్యో దేవతాత్మాత్మసంభవః ॥
సద్యో మహాసురవ్యాధో దేవసింహో దివాకరః ।
విబుధాగ్రచరః శ్రేష్ఠస్సర్వదేవోత్తమోత్తమః ॥
శివజ్ఞానరతః శ్రీమాన్ శిఖీ శ్రీపర్వతప్రియః ।
వజ్రహస్తస్సిద్ధఖడ్గో నరసింహనిపాతనః ॥

**తా॥** మనస్సు, బుద్ధి, అహంకారము, క్షేత్రమును తెలియువాడు, క్షేత్రమును పాలించువాడు, జమదగ్ని, బలమునకు నిధానము, జటలనుండి గంగను ప్రవహింపజేయువాడు, విశ్వమునకు ఆశ్రయము, శాంతస్వరూపుడు, నిరతిశయుడు, యజ్ఞస్వరూపుడు, మోక్షస్వరూపుడు, మోక్షమును ఇచ్చువాడు, పర్వతస్వరూపుడు, చంద్రునివలె ప్రకాశించువాడు, రాక్షసశత్రువు, శత్రువుల సంహరించువాడు, చాముండీ స్వరూపుడు, తండ్రి, సుందరుడు, హృదయవేదన లేనివాడు, జనులకు హృదయవేదనను కలిగించువాడు, నాల్గు వేదముల స్వరూపుడు, నాల్గు భావములు గలవాడు, నిపుణుడు, నిపుణలయందు ప్రీతి గలవాడు, వేదము, వేదపఠనము, తీర్థములు, వాటియందలి దేవతలు, శివాలయము,

అనేకరూపములు గలవాడు, పెద్ద రూపము గలవాడు, సర్వస్వరూపుడు, కదిలే మరియు కదలని ప్రాణులే స్వరూపముగా గలవాడు, న్యాయనిర్ణేత, భక్తులకు వశమై ఉండువాడు, ధర్మముచే పొందదగినవాడు, కర్మలేపము లేనివాడు, అనంతశిరస్సులు గలవాడు, దేవేంద్రుడు, అయుధములనన్నిటినీ భగ్నము చేయువాడు, ముండితశిరస్కుడు, భయంకరరూపుడు, వికృతరూపుడు, దండధారి, నాదమును చేయువాడు, గుణములచే ఉత్తముడు, పింగలవర్ణముగల నేత్రములతో ప్రకాశించువాడు, అనేకనేత్రములు గలవాడు, నల్లని కంఠము గలవాడు, దోషములు లేనివాడు, అనంతబాహువులు గలవాడు, సర్వేశ్వరుడు, శరణు పొందదగినవాడు, లోకములనన్నిటినీ ధరించువాడు, పద్మాసనమునందుండు వాడు, పరమప్రకాశస్వరూపుడు, పరంపరాప్రాప్తమగు ఫలములనిచ్చువాడు, పద్మమునందుండు వాడు, విశాలమైన గర్భము గలవాడు, గర్భమునందు విశ్వమును ధరించువాడు, జ్ఞాని, మిథ్యాసత్యములనెరింగినవాడు, వరములనిచ్చువాడు, సర్వశ్రేష్ఠుడు, పెద్ద ధ్వని గలవాడు, దేవతలకు మరియు రాక్షసులకు తండ్రి, ప్రకాశస్వరూపుడు, దేవతలకు మరియు రాక్షసులకు గొప్ప మిత్రుడు, వారిచే నమస్కరింపబడువాడు, వారిపై అధీశ్వరుడు, వాళ్ళందరికి గొప్ప ఆశ్రయము, దేవదేవుడు, కుటిలనీతి లేనివాడు, మనస్సునకు అందనివాడు, దేవతలకు ఆత్మస్వరూపుడు, స్వయంభువుడు, సద్యో జాతుడు, గొప్ప రాక్షసులను సంహరించు కిరాతుడు, దేవతలలో శ్రేష్ఠుడు, సూర్యుడు, దేవతలలో అగ్రేసరుడు, శ్రేష్ఠుడు, దేవతలందరిలో ఉత్తమోత్తముడు, శివజ్ఞానమునందు ప్రీతి గలవాడు, శోభాయుక్తుడు, అగ్ని, శ్రీశైలమునందు ప్రీతి గలవాడు, వజ్రము చేతియందు గలవాడు, పరాజయమునెరుంగని ఖడ్గమును ధరించువాడు, నరసింహుని పడగొట్టినవాడు.

**శ్లో ॥ బ్రహ్మచారీ లోకచారీ ధర్మచారీ ధనాధిపః ।**
**నందీ నందీశ్వరోఽనంతో నగ్నవ్రతధరశ్శుచిః ॥**
**లింగాధ్యక్షస్సురాధ్యక్షో యుగాధ్యక్షో యుగాపహః ।**
**స్వధామా స్వగతః స్వర్గీ స్వరస్స్వరమయస్స్వనః ॥**
**బాణాధ్యక్షో బీజకర్తా కర్మకృద్ధర్మసంభవః ।**
**దంభో లోభోఽథ వై శంభు స్సర్వభూతమహేశ్వరః ॥**
**శ్మశాన నిలయ స్త్ర్యక్షస్సేతురప్రతిమాకృతిః ।**
**లోకోత్తరస్ఫుటో లోకస్త్ర్యంబకో నాగభూషణః ॥**

**అంధకారిర్మఖద్వేషీ విష్ణుకంధరపాతనః ।**
**హీనదోషోఽ_క్షయగుణో దక్షారిః పూషదంతభిత్ ॥**
**పూర్ణః పూరయితా పుణ్యః సుకుమారస్సులోచనః ।**
**సన్మార్గప్రియో ధూర్తః పుణ్యకీర్తిరనామయః ॥**
**మనోజవస్తీర్థకరో జటిలో నియమేశ్వరః ।**
**జీవితాంతకరో నిత్యో వసురేతా వసుప్రదః ॥**
**సద్గతిస్సిద్ధిదస్సిద్ధిస్సజ్జాతిః ఖలకంటకః ।**
**కలాధరో మహాకాలభూతస్సత్యపరాయణః ॥**
**లోకలావణ్యకర్తా చ లోకోత్తరసుఖాలయః ।**
**చంద్రసంజీవనశ్శాస్తా లోకగ్రాహో మహాధిపః ॥**

**తా॥** బ్రహ్మచారి, లోకసంచారి, ధర్మపాలకుడు, కుబేరుడు, వృషభస్వరూపుడు, నందీశ్వరుడు, అనంతుడు, దిగంబరవ్రతమును పాలించువాడు, అగ్ని, లింగములకు అధిష్ఠానదేవత, దేవతలకు అధిపతి, యుగములకు అధిపతి, యుగములను ఉపసంహరించువాడు, స్వయంప్రకాశస్వరూపుడు, ఆత్మారాముడు, స్వర్గలోకనివాసి, స్వరస్వరూపుడు, అక్షరమాతృకాస్వరూపుడు, బాణములకు అధిపతి, బీజశక్తిని సృష్టించువాడు, యజ్ఞాది కర్మలను చేయువాడు, ధర్మమునుండి ఉదయించువాడు, దంభస్వరూపుడు, లోభస్వరూపుడు, మంగళస్వరూపుడు, సర్వప్రాణులకు అధీశ్వరుడు, శ్మశానమునందు ఉండువాడు, ముక్కంటి, ధర్మవిధారకుడు, సాటిలేని ఆకారము గలవాడు, లోకములకు అతీతుడై వెలుగొందువాడు, జగత్స్వరూపుడు, ముక్కంటి, పాములు అభరణములుగా గలవాడు, అంధకుని శాసించినవాడు, దక్షయజ్ఞవినాశకుడు, యజ్ఞ రూపుడు, విష్ణువుయొక్క మెడను నరికినవాడు, దోషరహితుడు, అనంతగుణసంపన్నుడు, దక్షశత్రువు, పూషయొక్క దంతములను ఊడబెరకినవాడు, పూర్ణుడు, పూరించువాడు, పవిత్రుడు, ధూర్తుడు, పవిత్రమగు కీర్తి గలవాడు, రోగరహితుడు, మనస్సుతో సమమైన వేగము గలవాడు, తీర్థములను నిర్మించువాడు, జటాజూటధారి, నియమములకు అధిపతి, జీవితములను అంతము చేయువాడు, నిత్యుడు, సంపదకు బీజమైనవాడు, సంపదలనిచ్చువాడు, సద్గతి, సిద్ధిని ఇచ్చువాడు, సిద్ధి, పవిత్రమగు జన్మ గలవాడు, దుష్టులను హింసించువాడు, చంద్రకళను ధరించువాడు, మహాకాలస్వరూపుడు, సత్యమునందు నిష్ఠ గలవాడు, లోకములలోని సౌందర్యమును నిర్మించువాడు, అతీంద్రియసుఖమునకు నిధానమైనవాడు, చంద్రునకు

జీవితమును అనుగ్రహించినవాడు, శాస్త్ర, లోకములను ఉపసంహరించువాడు, సర్వేశ్వరేశ్వరుడు.

శ్లో ॥ లోకబంధుర్లోకనాథః కృతజ్ఞః కృత్తిభూషితః ।
అనపాయోఽక్షరః కాంతస్సర్వశస్త్ర భృతాం వరః ॥
తేజోమయో ద్యుతిధరో లోకమానీ ఘృణార్ణవః ।
శుచిస్మితః ప్రసన్నాత్మా హ్యజేయో దురతిక్రమః ॥
జ్యోతిర్మయో జగన్నాథో నిరాకారో జలేశ్వరః ।
తుంబవీణో మహాకాయో విశోకశ్శోకనాశనః ॥
త్రిలోకపస్త్రి లోకేశస్సర్వశుద్ధిరధోక్షజః ।
అవ్యక్తలక్షణో దేవో వ్యక్తోవ్యక్తో విశాం పతిః ॥
పరశ్శివో వసుర్నాసాసారో మానధరో యమః ।
బ్రహ్మా విష్ణుః ప్రజాపాలో హంసో హంసగతిర్వయః
వేధా విధాతా ధాతా చ స్రష్టా హర్తా చతుర్ముఖః ।
కైలాసశిఖరావాసి సర్వావాసీ సదాగతిః ॥
హిరణ్యగర్భో ద్రుహిణో భూతపాలోఽథ భూపతిః ।
సద్యోగీ యోగవిద్యోగీ వరదో బ్రాహ్మణప్రియః ॥
దేవప్రియో దేవనాథో దేవకో దేవచింతకః ।
విషమాక్షో విరూపాక్షో వృషదో వృషవర్ధనః ॥
నిర్మమో నిరహంకారో నిర్మోహో నిరుపద్రవః ।
దర్పహా దర్పదో దృప్తస్సర్వార్థపరివర్తకః ॥
సహస్రార్చిర్భూతిభూషస్స్నిగ్ధాకృతిరదక్షిణః ।
భూతభవ్యభవన్నాథో విభవో భూతినాశనః ॥
అర్థోఽనర్థో మహాకోశః పరకార్యైకపండితః ।
నిష్కంటకః కృతానందో నిర్వ్యాజో వ్యాజమర్దనః ॥
సత్త్వవాన్ సాత్త్వికస్సత్యః కృతస్నేహః కృతాగమః ।
అకంపితో గుణగ్రాహీ నైకాత్మా నైకకర్మ కృత్ ॥

**తా॥** లోకులకు బంధువు, లోకములకు ప్రభువు, కృతజ్ఞుడు, గజచర్మమును అలంకరించుకున్నవాడు, దుఃఖరహితుడు, వినాశములేనివాడు, సుందరుడు, శస్త్రధారులందరిలో శ్రేష్ఠుడు, తేజస్స్వరూపుడు, కాంతిని ధరించువాడు, లోకములకు పూజనీయుడు, దయాసముద్రుడు, స్వచ్ఛమైన చిరునగవు గలవాడు, ప్రకాశస్వరూపుడు, జగన్నాథుడు, ఆకారహీనుడు, జలాధిపతి, ఆనపబుర్రతో చేసిన వీణ గలవాడు, పెద్ద శరీరము గలవాడు, శోకము లేనివాడు, శోకమును నశింపజేయువాడు, ముల్లోకములను రక్షించువాడు, ముల్లోకములకు ప్రభువు, సర్వమును శుద్ధము చేయువాడు, విరాట్ స్వరూపుడు, తెలియబడని లక్షణములు గలవాడు, ప్రకాశస్వరూపుడు, ఇంద్రియగోచరుడు, ఇంద్రియ గోచరము, మానవులకు అధిపతి, పరంబ్రహ్మ, మంగళకరుడు, సంపత్స్వరూపుడు, నాసికకు సారమైన శ్వాసస్వరూపుడు, మానమును కాపాడువాడు, యముడు, బ్రహ్మ, విష్ణువు, ప్రజలను పాలించువాడు, హంస, హంసయొక్క గమనమువంటి గమనము గలవాడు, పక్షి, జ్ఞాని, కర్మఫలదాత, పోషించువాడు, సంహారకుడు, నాల్గు ముఖములుగలవాడు, కైలాసశిఖరమునందు నివసించువాడు, సర్వమునందు నివసించువాడు, సర్వదా చలనము గలవాడు, హిరణ్యగర్భుడు, బ్రహ్మ, భూతనాయకుడు, రాజు, గొప్ప యోగి, యోగవేత్త, యోగి, వరములనిచ్చువాడు, బ్రాహ్మణుల యందు ప్రీతి గలవాడు, దేవతలకు ప్రియమైనవాడు, దేవతలకు ప్రభువు, ప్రకాశించువాడు, దేవతల హితమును గోరువాడు, బేసి కన్నులవాడు, వికృతరూపముగల కన్నులు గలవాడు, ధర్మమును ఇచ్చువాడు, ధర్మమును వర్ధిల్ల జేయువాడు, మమకారము లేనివాడు, అహంకారము లేనివాడు, మోహము లేనివాడు, ఉపద్రవములు లేనివాడు, దర్పమును పోగొట్టువాడు, దర్పమును కలిగించువాడు, గర్వించినవాడు, సర్వపదార్థములలోని మార్పులకు కారణమైనవాడు, వేయి కన్నులు గలవాడు, భస్మయే అలంకారముగా గలవాడు, సుందరమైన ఆకారము గలవాడు, సరళమగు మనస్సు గలవాడు, భూతవర్తమాన భవిష్యత్కాలములకు ప్రభువు, సంపత్స్వరూపుడు, సంపదను నాశనము చేయువాడు, ధనము, కష్టము, గొప్ప నిధి, పరోపకారపారీణుడు, ఆటంకములు లేనివాడు, ఆనందమును కలిగించువాడు, మోసము లేనివాడు, మోసమును దండించువాడు, సత్త్వగుణమూర్తి, సత్పురుషుడు, సత్యస్వరూపుడు, ప్రేమను చూపువాడు, వేదకర్త, చలనము లేనివాడు, గుణమును గ్రహించువాడు, సర్వాత్మ, సర్వకర్మలను చేయువాడు.

శ్లో ॥ సుప్రీతస్సుఖదస్సూక్ష్మస్సుకరో దక్షిణానిలః ।
నందిస్కందో ధరో ధుర్యః ప్రకటప్రీతివర్ధనః ॥
అపరాజితస్సర్వసహో గోవిందస్సత్త్వవాహనః ।
అధృతస్స్వధృతస్సిద్ధః పూతమూర్తిర్య శోధనః ॥
వారాహశృంగధృక్ శృంగీ బలవానేకనాయకః ।
శ్రుతిప్రకాశశ్శ్రు తిమానేకబంధురనేకధృక్ ॥
శ్రీవత్సలశ్శివారంభశ్శాంతభద్రస్సమో యశః ।
భూయశో భూషణో భూతిర్భూతికృద్భూతభావనః ॥
అకంపో భక్తికాయస్తు కాలహానిః కలావిభుః ।
సత్యవ్రతీ మహాత్యాగీ నిత్యశాంతిపరాయణః ॥
పరార్థవృత్తిర్వరదో విరక్తస్తు విశారదః ।
శుభదశ్శుభకర్తా చ శుభనామా శుభస్స్వయమ్ ॥
అనర్థితో గుణగ్రాహీ హ్యకర్తా కనకప్రభః ।
స్వభావభద్రో మధ్యస్థశ్శత్రుఘ్నో విఘ్ననాశనః ॥
శిఖండీ కవచీ శూలీ జటీ ముండీ చ కుండలీ ।
అమృత్యుస్సర్వదృక్ సింహస్తేజోరాశిర్మహామణిః ॥
అసంఖ్యేయోఽప్రమేయాత్మా వీర్యవాన్ వీర్యకోవిదః ।
వేద్యశ్చ వై వియోగాత్మా పరావరమునీశ్వరః ॥

**తా॥** మిక్కిలి ప్రీతి గలవాడు, సుఖమునిచ్చువాడు, సూక్ష్మమైనవాడు, తేలికగా లభించువాడు, దక్షిణవాయు స్వరూపుడు, ఆనందముతో గూడిన స్కందుడు గలవాడు, ధారకుడు, సర్వశ్రేష్ఠుడు, ప్రీతిని ప్రకటించి వర్ధిల్ల జేయువాడు, పరాజయమునెరుంగనివాడు, సర్వమును సహించువాడు, గోవిందుడు, సత్త్వగుణమును కలిగించువాడు, ఆధారము లేనివాడు, స్వయముగా తనకు తాను ఆధారమైనవాడు, సిద్ధుడు, పవిత్రమగు మూర్తి గలవాడు, కీర్తియే ధనముగా గలవాడు, వరాహముయొక్క కొమ్మును ధరించువాడు, కొమ్ము గలవాడు, బలవంతుడు, ఏకైకనాయకుడు, వేదములచే తెలియబడువాడు, వేదవేత్త, ఏకైకబంధువు, సర్వమునకు ఏకైకపాలకుడు, లక్ష్మియందు వాత్సల్యము గలవాడు, మంగళకరమగు ఆరంభము గలవాడు, శాంతుడు మరియు మంగళస్వరూపుడు, సముడు, కీర్తి,

భూమండలమునందు కీర్తింపబడువాడు, అలంకారము, సంపద, సంపదనిచ్చువాడు, ప్రాణులను సృష్టించువాడు, చలనము లేనివాడు, భక్తియే దేహముగా గలవాడు, కాలమును కబళించువాడు, కళలకు ప్రభువు, సత్యవ్రతము గలవాడు, గొప్ప త్యాగి, నిత్యము శాంతి మాత్రమే ఏకైకలక్ష్యముగాగలవాడు, పరోపకారముకొరకై శ్రమించువాడు, వరములనిచ్చువాడు, విరాగి, నిపుణుడు, శుభములనిచ్చువాడు, శుభములను చేయువాడు, శుభకరమగు నామము గలవాడు, స్వయముగా శుభస్వరూపుడు, ఇతరములచే వృద్ధిని పొందనివాడు, గుణమును గ్రహించువాడు, కర్తృత్వము లేనివాడు, బంగరు కాంతి గలవాడు, స్వభావముచేతనే మంగళుడు, మధ్యస్థుడు, శత్రువులను సంహరించువాడు, విఘ్నములను నాశనము చేయువాడు, శిఖ గలవాడు, కవచము గలవాడు, శూలము గలవాడు, జటలు గలవాడు, ముండితశిరస్కుడు, కుండలము గలవాడు, మృత్యురహితుడు, సర్వసాక్షి, సింహము, తేజోనిధి, గొప్ప మణి, పరిగణించ శక్యము కాని వాడు, ఇంద్రియగోచరము కాని తత్త్వము గలవాడు, పరాక్రమశాలి, పరాక్రమపండితుడు, తెలియదగినవాడు, అసంగమగు ఆత్మస్వరూపుడు, పరాపరబ్రహ్మల నెరింగిన మహర్షుల రూపములో నున్నవాడు.

**శ్లో ॥ అనుత్తమో దురాధర్షో మధురః ప్రియదర్శనః ।**
**సురేశస్స్మరణస్సర్వశ్శబ్దః ప్రతపతాం పరః ॥**
**కాలపక్షః కాలకాలః సుకృతీ కృతవాసుకిః ।**
**మహేష్వాసో మహీభర్తా నిష్కలంకో విశృంఖలః ॥**
**ద్యుమణిస్తరణిర్ధన్యస్సిద్ధిదస్సిద్ధిసాధనః ।**
**విశ్వతస్సంప్రవృత్తస్తు వ్యూఢోరస్కో మహాభుజః ॥**
**సర్వయోనిర్నిరాతంకో నరనారాయణప్రియః ।**
**నిర్లేపో యతిసంగాత్మా నిర్వ్యంగో వ్యంగనాశనః ॥**
**స్తవ్యస్తవప్రియః స్తోతా వ్యాసమూర్తిర్నిరాకులః ।**
**నిరవద్యమయోపాయో విద్యారాశిశ్చ సత్కృతః ॥**
**ప్రశాంతబుద్ధిరక్షుణ్ణస్సంగ్రహో నిత్యసుందరః ।**
**వైయాఘ్రధుర్యో ధా త్రీశస్సంకల్పశ్శర్వరీపతిః ॥**
**పరమార్థగురుర్దత్తస్సూరిరాశ్రితవత్సలః ।**
**సోమో రసజ్ఞో రసదస్సర్వసత్త్వావలంబనః ॥**

**ఏవం నామ్నాం సహస్రేణ తుష్టావ హి హరం హరిః ।**
**ప్రార్థయామాస శంభుం వై పూజయామాస పంకజైః ॥**
**తతస్స కౌతుకీ శంభుశ్చకార చరితం ద్విజాః ।**
**మహాద్భుతం సుఖకరం తదేవ శృణుతాదరాత్ ॥**

**తా॥** సర్వోత్తముడు, జయించ శక్యము కానివాడు, మధురమైనవాడు, ప్రియమును కలిగించే దర్శనము గలవాడు, దేవదేవుడు, స్మృతిరూపుడు, సర్వము తానే ఐనవాడు, శబ్దస్వరూపుడు, తపించువారిలో శ్రేష్ఠుడు, కాలమే రెక్కలుగా గలవాడు, కాలునకు కాలుడు, శుభకర్మలు గలవాడు, వాసుకి ఆభరణముగా గలవాడు, గొప్ప ధనస్సు గలవాడు, భూమండలమునకు ప్రభువు, దోషరహితుడు, బంధనములు లేనివాడు, ఆకాశములో మణివలె ప్రకాశిస్తూ భక్తులను సంసారసముద్రమునుండి తరింపజేసే నౌకవంటి సూర్యుడు, ధన్యుడు, సిద్ధిని ఇచ్చువాడు, సిద్ధికి సాధనమైన వాడు, అన్నివైపులయందు కర్మయందు నిమగ్నుడై యున్నవాడు, విశాలమైన వక్షఃస్థలము గలవాడు, పొడుగైన భుజములు గలవాడు, సర్వకారణుడు, భయము లేనివాడు, నరనారాయణులయందు ప్రీతి గలవాడు, ఆసక్తి లేనివాడు, యతుల సంగమునందు లభించువాడు, అంగవైకల్యము లేనివాడు, అంగవైకల్యమును పోగొట్టువాడు, స్తుతించదగినవాడు, స్తోత్రప్రియుడు, స్తుతించువాడు, వ్యాసునిగా అవతరించినవాడు, ఆదుర్దా లేనివాడు, దోషరహితమైన సాధనములు గలవాడు, విద్యానిధి, సత్కరించబడువాడు, ప్రసన్నమైన బుద్ధిగలవాడు, తెలియ శక్యము కానివాడు, సర్వసంహారకుడు, నిత్యసుందరుడు, మృగములలో వ్యాఘ్రమువలె దేవతలలో అగ్రేసరుడు, భూలోకాధిపతి, సంకల్పస్వరూపుడు, రాత్రికి అధిపతి, యథార్థమైన గురువు, దత్తాత్రేయుడు, విద్వాంసుడు, ఆశ్రితులయందు ప్రేమ గలవాడు, ఉమాసమేతుడు, రసజ్ఞానము గలవాడు, రసమునిచ్చువాడు, సర్వప్రాణులకు ఆలంబనమైనవాడు.

అగు శివుని ఈ విధంగా విష్ణువు సహస్ర నామాలతో, సహస్ర కమలాలతో పూజించాడు. చివరి నామమైన 'సర్వ సత్త్వావలంబనః' అను నామం దగ్గరకొచ్చేసరికి ఒక కమలం తక్కువ కాగా తన నేత్రాన్నే కమలంగా సమర్పించాడు. సుదర్శన చక్రాన్ని వరంగా పొందాడు. ఆ సందర్భంలో శంభుడు లోకులకు కూడా ఇలా వరమిచ్చాడు: "ఎవరైతే ఈ సహస్ర నామాలను నిత్యము పఠిస్తారో లేదా శ్రవణం చేస్తారో వారికి దుఃఖం అనేది దరిజేరదు. అనారోగ్యం ఉండదు. అపమృత్యు దోషం తొలగిపోతుంది. సంతానం

కలుగుతుంది. శత్రుజయం లభిస్తుంది. సర్వ కామనలు సిద్ధిస్తాయి. మరణానంతరం సాయుజ్య ముక్తి లభిస్తుంది. ఎల్లప్పుడు శివానుగ్రహం తోడుగా ఉంటుంది.

**ప్రాచీన కాలంలో ఏకేశ్వరోపాసన శివుడొక్కడే దైవం**

ఓ మునులారా! సృష్టి ప్రారంభంలో జనులందరికి ఒక్కటే దైవం! ఒక్కటే ధర్మం! శివుడొక్కడే దైవం. శైవ సిద్ధాంతమే సిద్ధాంతం. శైవధర్మమొక్కటే ధర్మం. పార్థివ లింగపూజ ఒక్కటే పూజ.

లక్ష్మీనారాయణులు, సరస్వతీ పితామహులు నిత్య మహేశ్వరార్చనా శీలురు. ఇంద్రాది బృందారకులు, దిక్పాలురు, లోక పాలకులు సప్తర్షులు వారి భార్యలు శివపూజా నిరతులు. సమస్తదేవతలు, రాక్షసులు, శివ భక్తులు, ఋషులు, మునులు శివపూజా నిరతులు. ఈ భూలోకంలో వారివారి వంశాలను ప్రవర్తిల్ల చేసిన సూర్యచంద్రులు ఆ వంశాలలో జన్మించిన సార్వభౌములు, చక్రవర్తులు తర్వాత వచ్చిన రాజులు అందరూ శివపూజా తత్పరులే. మనువులు వారికుమారులు వారి వారి వంశాలలో జన్మించిన రాజన్యులు అందరూ శివారాధకులే. ఇక్ష్వాకువు మొదలుగా ఆ వంశీకులందరూ ఈశ్వరార్చనా శీలురు.

దశరథ మహారాజు పుత్ర సంతానాన్ని కోరి వశిష్ఠ మహర్షి ఆజ్ఞచే శివుని పార్థివ మూర్తిని భక్తిశ్రద్ధలతో ఆరాధించి కృతకృత్యుడయ్యాడు. శివుని ఆజ్ఞచే విష్ణువు నాలుగు అంశలతో దశరథునికి నలుగురు కుమారులుగా జన్మించాడు. శ్రీకృష్ణుడు కూడ ఉత్తమమైన బదరీ వనంలో ఏడు మాసములు ఏకాగ్రచిత్తంతో శివుని పూజించి అనేక వరాలను పొంది లోకోత్తర దివ్యపురుషుడయ్యాడు. ముల్లోకాలలోను శివపూజ ఒక్కటే ఉండేది. శివుడొక్కడే దైవం. బ్రహ్మాండమంతా లింగాకారంలో ఉంటుంది. సర్వము శివుడే. అన్యదైవం లేదు.

**శివారాధన మరియు శివరాత్రి మహాత్మ్యము**

మునులారా! సర్వము శివాత్మకమే ఐనా లోకాచారాన్ని అనుసరించి ఆయనకు ప్రీతికరమైన ఉపాసనా పద్ధతులను చెపుతున్నాను వినండి. భుక్తిని, ముక్తిని ఇచ్చే శివ వ్రతములు అసంఖ్యాకంగా ఉన్నాయి. వాటిలో ముఖ్యమైన పది ఉన్నాయి. జాబాల శ్రుతిలో పదిశైవ వ్రతాలు చెప్పబడ్డాయి. సర్వులు వాటిని అనుష్ఠించవచ్చు. ప్రతి అష్టమి తిథియందు పగలు ఉపవాసముండి రాత్రి మాత్రమే భోజనం చేయాలి. కాలాష్టమి నాడు రోజంతా ఉపవాసముండాలి. శుక్ల పక్షంలో ఏకాదశి నాడు భోజనం చేయరాదు. కృష్ణ పక్షంలో ఏకాదశి నాడు పగలు ఉపవాసముండి రాత్రి శివుని పూజించి భుజించాలి. శుక్లపక్ష

త్రయోదశి నాడు రాత్రి మాత్రమే భుజించాలి. వ్రతాన్ని అనుష్ఠించే వారికి కృష్ణపక్షంలో త్రయోదశి నాడు రాత్రి భోజనం నిషిద్ధం.

సోమవారం శివునకు మహా ప్రీతికరమైన రోజు. ప్రతి సోమవారం పగలు ఉపవాసముండి సాయంత్రం కాగానే నక్షత్ర దర్శనం చేసికొని శివాలయానికి వెళ్ళి ఆయనను దర్శించి ఇంటికి వచ్చి భోజనం చేయాలి. కనీసం ఒక్క ఏడాది ఇలా వ్రతాన్ని పాటిస్తే శివానుగ్రహ ఫలం ప్రత్యక్ష నిదర్శనంగా కనుపిస్తుంది. ఓపిక ఉన్నంత వరకు జీవితాంతము ఇలా నడచుకొన్న మానవునకు మరణానంతరం శివలోకప్రాప్తి తథ్యం. ఉపవాసమున్న ప్రతి సోమవారం ఒక సత్పురుషునికి భోజనం పెట్టి స్వల్పంగా దక్షిణ ఇవ్వాలి. ఉపవాస వ్రతానుష్ఠానం వల్ల ఆదా అయిన దానిని తాను మిగుల్చుకొనటం వ్రతోద్దేశం కాకూడదు. దానిని మరొకరికి పెట్టాలి. పాపక్షయానికి ఇంతకు మించిన ఉత్తమమార్గం లేదు.

శివపూజ, రుద్రజపం, ఉపవాసముండి శివాలయంలో ఉండటం, వారణాసిలో మరణం. ఈ నాలుగు సనాతనమైన ముక్తిమార్గాలు. అష్టమీతిథితో కూడిన సోమవారం, కృష్ణపక్ష చతుర్దశి ఈ రెండు శివునకు మహా ప్రీతికరములు. శివరాత్రి వ్రతం సర్వోత్తమమైనది. ఈ వ్రతాన్ని ప్రతినెల చేయాలి. నిష్కామంగా చేసిన వానికి ముక్తి కరతలామలకం. వ్రతం ముగిసిన తర్వాత శివునకు పుష్పాంజలి సమర్పించి ఇలా ప్రార్థించాలి:

"ఓ మృడా! నేను నీ వాడను. నా ప్రాణములు నీయందే ఉన్నాయి. నా మనస్సు సర్వదా నీపై లగ్నమై ఉంది. ఓ దయానిధీ! ఈ విషయాన్ని గుర్తించి తరువాత యథాయోగ్యంగా చేయి. ఓ భూతనాథా! నేను తెలిసిగాని తెలియకగాని జప, పూజ ఇత్యాదులలో లోపం చేస్తే దానిని దయానిధివైన నీవు గమనించినా ప్రసన్నతను విడనాడ వద్దు. ఈ ఉపవాసంచే ఏఫలం కలిగిందో దానిచే సుఖదాయకుడగు శంకర దేవుడు ప్రసన్నుడగు గాక! ఓ మహాదేవా! నా వంశంలో సర్వదా నీ భజనము ఉండుగాక! నిన్ను ఆరాధించని వ్యక్తి నా కులంలో జన్మించకుండును గాక!

శివరాత్రి వ్రతాన్ని పదునాలుగు సంవత్సరాలు చేసిన తదపరి ఉద్యాపన విధిని భక్తిశ్రద్ధలతో అనుష్ఠించటంతో ఆ వ్రతం పూర్తి అవుతుంది.

మునులారా! తెలిసి ముట్టుకొన్నా తెలియక ముట్టుకొన్నా అగ్ని దహిస్తుంది. అలాగే తెలిసి చేసినా తెలియకుండ చేసినా పాప పుణ్య ఫలాలు కూడా చుట్టుకొంటాయి. దానికి సోదాహరణంగా శివరాత్రి మహాత్మ్య గాథను చెపుతున్నాను వినండి! పూర్వం ఒక అడవిలో

గురుద్రుహుడు అనే కిరాతుడు ఉండేవాడు. అతను మృగాలను, పక్షులను వేటాడుతూ కిరాత వృత్తితో జీవించేవాడు. బాల్యం నుండి వాడు చేసిన మంచిపని అంటూ ఒక్కటి లేదు. వానికి తిథి, వార, నక్షత్రాలతో పనిలేదు. పున్నమ అమావాస్యలు రెండు ఒకటే.

ఒకరోజున వాడు విల్లంబులు ధరించి వేటకు వెళ్ళాడు. ఆరోజు శివరాత్రి. వానికి ఆహారం దొరకలేదు. ఇంతలో సూర్యాస్తమయమైంది. చాలా దుఃఖ పడ్డాడు. వానికి వృద్ధులైన తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు ఉన్నారు. ఏమైనా సరే ఏదో ఒక జంతువును వేటాడకుండ ఇంటికి వెళ్ళకూడదనుకొన్నాడు. వానికి దగ్గరలో ఒక జలాశయం ఉంది. దాని ఒడ్డున ఒక మారేడు చెట్టు ఉంది. మృగాలు మంచి నీళ్ళకు అక్కడకు వస్తాయని తెలిసి చెట్టుపైకి ఎక్కి అక్కడ మాటు వేశాడు.

ఇంతలో ఒక ఆడులేడి దప్పికచే బాధపడుతూ నీళ్ళ కొరకు జలాశయాన్ని చేరింది. నిషాదుడు ఆనందంతో బాణాన్ని సంధించి విల్లుఎక్కు పెట్టాడు. ఆ ప్రయత్నంలో వాని తాబేటికాయలోని నీరు, మారేడు పత్రి క్రిందనున్న శివలింగం మీద పడ్డాయి. దానిని గమనించిన లేడి భయపడి కీడును శంకించి కిరాతుని ఉద్దేశించి ఇలా ప్రతిజ్ఞా పూర్వకంగా సత్యవాక్యాలను పలికింది. "ఓ కిరాతుడా! నన్ను చంపటానికి బాణాన్ని సంధించి సిద్ధంగా ఉన్నావని తెలుసు. నేను సర్వాంతర్యామి అయిన శివుని మీద శపథం చేసి కొన్ని సత్యవచనాలను పలుకుతున్నాను, విను. విన్న పిమ్మట నీ ఆత్మసాక్షిగా ఆచరించు.

నా శరీర మాంసంచే నీకు నీ కుటుంబ సభ్యులకు సుఖం కలుగుతుంది అంటే... అనర్థదాయకమైన ఈ శరీరానికి అంతకంటె ఉత్తమమైన ప్రయోజన మేముంటుంది? నేను ధన్యురాలను! పరోపకారాన్ని మించిన పుణ్యం లేదు గదా! నీవలెనె నాకు కూడా పిల్లలు, కుటుంబము ఉంది. వారంతా ఆశ్రమంలో ఉంటున్నారు. వారంతా నాకొరకు ఒళ్ళంతా కళ్ళు చేసికొని ఎదురు చూస్తూ ఉంటారు. ముఖ్యంగా పిల్లలు, వాళ్ళింకా పాలు విడువ లేదు. 'అమ్మ వస్తుంది! కమ్మగా పాలిస్తుంది. ఆకలి తీరుస్తుంది' అని ఆశతో ఎదురుచూస్తూ ఉంటారు. నువ్వు నన్ను ఇప్పుడే చంపి తీసికొని పోతే వాళ్ళ ఆశలు అడియాశలే అవుతాయి! కనుక నాకు అనుజ్ఞ ఇస్తే ఒక్కసారి ఇంటికి వెళ్ళి ఈ పాడు లోకంలో ఎలా బ్రతకాలో పిల్లలకు కొన్ని బుద్ధులు చెప్పి వస్తాను. అప్పుడు వాళ్ళకు, నాకు కూడా బెంగ ఉండదు. నేను లేకపోతే నా పిల్లలు ఈ లోకంలో అనాథలై తల్లిలేని పిల్లలవుతారు.

ఓ కిరాత శ్రేష్ఠా! నీకు తెలియనిధర్మాలు ఏమీ లేవు గాని నా పేగు నా చేత ఇలా మాట్లాడిస్తోంది. తామరతూడు లోని దారం చులకన దాని కంటె తేలిక దూది. దూది కంటె తేలిక ధూళి! ధూళి కంటె చులకన యాచకుడు! అందరికంటె చులకన తల్లి లేని పిల్లలు! అట్టి దురవస్థ ఎవరికీ రాకూడదు. అట్టి దురవస్థ విధివశం చేత నా పిల్లలకు సంప్రాప్తించింది. నా పిల్లలను నా చెల్లెలికి అప్పగించి తప్పక తిరిగి వస్తాను. నా మాట నమ్ము! సత్యం మీద ప్రమాణం చేసి చెపుతున్నాను. కుల పర్వత కానన సహితమైన ఈ ధరామండలం సత్యం మీద ఆధారపడి ఉంది. సత్యానికి భయపడి సముద్రం హద్దుల్లో ఉంది. కనీసం నలుగురైనా సత్యసంధులు లేనినాడు ఆ ప్రాంతభూమిని సముద్రం పోటెత్తి ముంచేస్తుంది. సత్యం అనే ఇరుసు మీద గ్రహ నక్షత్ర తారకా మండలాలన్నీ తిరుగుతున్నాయి. సర్వము సత్యమునందే ప్రతిష్ఠితమై ఉంది. అట్టి సత్యము మీద ప్రమాణం చేసి మాట్లాడుతున్నాను. ఒక్కసారి నన్ను విడిచిపెట్టు. ఇంటికి వెళ్ళి తిరిగి వచ్చి నీకు ఆహారమవుతాను."

సత్యం అనే మాటను సైతం ఎప్పుడూ వినని కిరాతుడు ఆ ఆశ్రమ మృగం మనుష్యభాషలో చేసిన సత్ప్రసంగాన్ని నమ్మక "నిన్ను విడిచిపెడితే నాకు నా కుంటుంబానికి ఆహారం ఏదీ?" అంటూ బాణం విడవబోయాడు. దానికి భయకంపితురాలై ఆ హరిణి తిరిగి ఇలా పలికింది.

"ఓ కిరాత రాజా! నా మాట విను. శపథం చేసి మాట్లాడుతున్నాను. నేను నా ఇంటికి వెళ్ళి నీ సమీపానికి తిరిగి రాని పక్షంలో... త్రికాల సంధ్యావందనాన్ని విడిచి వేదాన్ని అమ్ముకొని జీవించే బ్రాహ్మణుడు... వృద్ధాప్యంలో తల్లిదండ్రుల యోగక్షేమాలను పట్టించుకొనకుండా వారిని పరిత్యజించిన కొడుకు... భర్త మాటను లెక్క చేయకుండా వ్యవహరించే స్త్రీ... అగ్నిసాక్షిగా పరిణయ మాడిన భార్యకు అన్యాయం చేసిన భర్త పరులనుండి తాను పొందిన ఉపకారాన్ని మరచిన కృతఘ్నుడు... అసత్య సాక్ష్యాన్ని చెప్పిన వాడు... పరులు తనవద్ద దాచుకొన్న సొమ్మును అపహరించిన వాడు... తప్పుడు తూకాలను తూచి, కొలతలను కొలిచి ధనాన్ని ఆర్జించిన వాడు... కూలికి తగిన పని చేయని వాడు... నమ్మిన వారిని మోసం చేసిన వాడు... సామర్థ్యం ఉండి ఉపకారం చేయని వాడు... పన్నులు వసూలు చేస్తూ ప్రజల యోగక్షేమాలను పట్టించుకోని ప్రభువు... శివనామాన్ని ఉచ్చరించని వాడు, భస్మ రుద్రాక్షలను ధరించని వాడు, శివరాత్రి నాడు భోజనం చేసిన వాడు, శివుని ద్వేషించిన వాడు...

వీరందరు ఎట్టి పాపాన్ని పొంది మరణానంతరం ఎట్టి నరక లోకాలను పొందుతారో నేను అట్టి పాపాన్నే పొందుతాను. ఇలా ప్రతిజ్ఞా పూర్వకంగా పల్కిన హరిణి మాటల మీద విశ్వాసం కుదిరి కిరాతుడు ఎక్కుపెట్టిన బాణాన్ని దించి మృగాన్ని వదిలేశాడు. అలా శివరాత్రి నాటి రాత్రిలో మొదటి యామం గడిచింది. తదుపరి మేతకు వెళ్ళిన తన భార్య ఎంతకూ రాకపోయే సరికి దాని జత హరిణం వెతుక్కొంటూ జలాశయం చెంతకు చేరింది. దానిని చూడగానే కిరాతుడు బాణాన్ని సంధించాడు. మొదటి దాని విషయంలో ఎలా జరిగిందో క్రమం తప్పకుండా రెండవదైన హరిణం విషయంలో కూడా అలాగే జరిగింది. సత్యం మీద ప్రమాణం చేసి ఇలా పలికింది...

"ఓ నిషాదా! అనిత్యమైన ఈ శరీరంతో పరోపకారం సిద్ధించబోతూన్నది. అంటే అంతకంటె ఈ జన్మకు ధన్యత ఏముంటుంది చెప్పు. ఇంటికి వెళ్ళి పిల్లలను నా భార్యకు అప్పచెప్పి తిరిగి వస్తాను. సత్యం మీద ధర్మం మీద శివుని మీద శపథం చేసి చెపుతున్నాను. మాట తప్పిన నాడు...

వృద్ధాప్యంలో ఎద్దులను కసాయి వానికి అమ్మిన వాడు... విష్ణువును ఆరాధిస్తూ శివనింద చేసిన వాడు... వేద నింద, శాస్త్ర నింద, బ్రాహ్మణ నింద చేసిన వాడు... ఎట్టి పాపాలను పొంది మరణానంతరం దుర్గతిని పొందుతారో అట్టి, దుర్గతిని పొందుతాను. మాట తప్పినచో నా పుణ్యకర్మలు క్షయమగును గాక! అని ఇలా ఇంకా కొన్ని శపథాలను చేసింది ఆ హరిణం. ఆ శపథాలను విన్న కిరాతునికి ధర్మంమీద గురి కుదిరి హరిణాన్ని చంపకుండ వదిలేశాడు. అలా శివరాత్రి రెండవ యామం గడిచిపోయింది.

ప్రథమ యామంలో ప్రమాణాలను పల్కి వెళ్ళిన హరిణి (ఆడు లేడి) ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాడు కిరాతుడు. గాలికి కదిలే ఆకుల చప్పుడు కూడ లేడి రాక కాబోలు అని భావించి రెప్పవేయకుండ నిరీక్షిస్తున్నాడు. ఇంతలో ఒక లేడి అక్కడకు వచ్చింది. వ్యాధుడు బాణాన్ని సంధించాడు. అదికూడ ఇంతకు ముందు వాటివలెనె పల్కి కొన్ని శపథాలను చేసింది. ఆ ప్రమాణాలను విన్న బోయవాడు మొదట్లో అనుమానించినా వాటి ద్వారా విధినిషేధాలను, ధర్మాధర్మాలను తెలిసికొన్న వాడై సత్యాన్ని నమ్మి దానిని కూడా విడిచిపుచ్చి తొందరగా వెళ్ళి తిరిగి రమ్మని ఆదేశించాడు. అలా శివరాత్రి మూడవ యామం కూడ గడిచిపోయింది.

ఈ విధంగా శివరాత్రి నాడు శివుని మీద ప్రమాణం చేసి వెళ్ళిన ఆ ఆశ్రమ మృగాలన్ని ఒక చోట కలుసుకొని జరిగిన వృత్తాంతాన్ని ఒకరి ద్వారా మరొకరు విని సత్యము అనే పాశముచే బంధింప బడినవై, అందులో మొదటిదైన ఆడు లేడి పిల్లలను ఇలా ఓదార్చింది: “చూడండి! పిల్లలూ! ఇక ఈ పైన మీకు అమ్మ ఉండదు. బెంగపెట్టుకొనకండి. నాన్న చెప్పిన మాట వినండి! మీకు మొదటి నుండి నా దగ్గర చనవు ఎక్కువ. చీకటి పడితే చాలు నా ఒళ్ళో దూరి పడుకొనే వారు. అమ్మ పాలకమ్మదనం, అమ్మ ఒడి వెచ్చదనం ఇంకీపైన మీకెలా దొరుకుతాయి? మీలో మీరు ప్రతి చిన్నదానికి తగవులాడుకోకండి. మీ నాన్న కోపిష్ఠి. కొడతారు. ఆ పైన మీరేడుస్తారు. అమ్మ ఉండదు మిమ్ములను ఓదార్చటానికి. ఆ పైన... తిండికోసం ఎక్కడ ఎక్కడికో దూర దూరంగా పోయి తిరుగకండి! కష్టపడి చెమటోడ్చి వ్యవసాయం చేసికొని జీవించే రైతుల పొలాల్లోకి వెళ్ళవద్దు. దేవ బ్రాహ్మణ మాన్యాలను తొక్క వద్దు. పండించిన పంటను ముట్టవద్దు. పడిమొలిచిన వాటిని మాత్రమే తినండి. చిగుళ్ళను కొరకండి. మొదళ్ళను పెల్లగించవద్దు. ఆట పాటల్లో పడి ఇల్లు మరచి పోకండి. చీకటి పడకుండ ఇల్లు చేరుకోండి. ఈ ఆశ్రమ ప్రాంతంలోనే సంచరించండి!” ఈ విధంగా ఆ తల్లి లేడి పిల్లలకు బుద్ధులు చెప్పి ప్రేమతో ఒడలంతా నాలుకుతో స్పృశించి తన భర్తవైపు తిరిగి ఇలా అప్పగింతలు పెట్టింది:

“ఓ ప్రభూ! ధర్మపాశ బంధితురాలనైన నేను ఆ కిరాతునికి ఆహారంగా వెడుతున్నాను. ఇది శివాజ్ఞ! తప్పదు. సంయోగాలన్నీ వియోగాలతోనే అంతమవుతాయి! కొంచెం ముందు వెనక! సర్వం కాలాధీనం! ఆ కాలం ఈశ్వరాధీనమై ఉంది. ప్రాణం నిల్పుకొనటానికి ఆహారం అవసరం. ప్రాణానికి ప్రాణమే ఆహారం. ఇది విధి నియమం! కొండలు ఆధారంగా వృక్షతరు లతాగుల్మాదులు, చెట్లు చేమలతో కూడిన అడవి ఆధారంగా (ఆహారంగా) అడవి ప్రాణులు అడవిని అడవి జంతువులను మచ్చిక చేసికొని వాటి ఆధారంగా మానవుడు, మానవుడు ఆధారంగా దేవతలు, దేవతలు ఆధారంగా పరమాత్మ, ఇలా పరస్పర ఆధార ఆధేయ భావంతో సృష్టి నడుస్తోంది. ఇది సృష్టి నియమం! తలొగ్గక తప్పదు. సర్వము శివుడే!

ఇదంతా ఎందుకు చెప్పానంటారా... పాపం ఆ కిరాతుడు వాని కుటుంబం నిన్న రోజంతా ఆహారం దొరకక ఉపవాసం. ప్రతి జీవికి మరణం ఎలాగూ తప్పదు. ముసలి తనానికి, అనారోగ్యానికి గురై మరణించడం కంటె ఆరోగ్యంగా ఉన్నప్పుడే మనిషికి ఆహారంగా, హవిస్సుగా, అర్పణ కావటం మృగజాతికి పుణ్యలోక సాధనం కదూ!

పిల్లలను జాగ్రత్తగా చూచుకోండి. ఏదో అల్లరి చేస్తారు. కళ్ళెర్ర చెయ్యండి చాలు! కొట్టకండి. కొడితే బిక్కచచ్చి పోతారు. ఇక ఈ పైన మీ బాధ్యత పిల్లల బాధ్యత మీరే చూచుకోవాలి. నే లేను కదా అని పరస్త్రీ వ్యామోహంలో పడి నా పిల్లలకు అన్యాయం చెయ్యకండి! మరి వెళ్తాను. వెళ్తున్నాను!" ఈ విధంగా ఆ హరిణి శివ జ్ఞానంచే మనుష్య భావంతో పలికి... భర్తను, పిల్లలను విడిచి వెళ్ళలేక ఒక కంట దుఃఖాశ్రువులు జాలు వారగా, శివరాత్రి పర్వదినాన శివస్వరూపుడైన వ్యాధునికి సత్యమే ప్రమాణంగా హవిస్సుగా (ఆహారంగా) అర్పణ కాబోతూన్నందుకు హర్షాశ్రువులు ఒకకంటగ్రమ్మగా హర్ష విషాదాల ద్వైదీభావంతో హృదయ భారంతో అడుగు ముందుకు వేసి కదలబోయింది.

వెంటనే మగలేడి హరిణికి అడ్డం వెళ్ళి ఆపి ఇలా అంది: ప్రియా! సత్యవాక్య పాలన మనిద్దరకు సమానమే! కనుక ఆ బోయకు ఆహారంగా నే వెళ్తాను. పిల్లల రక్షణ విషయంలో తల్లివైన నీ మనుగడ చాలా అవసరం. అది సృష్టి ధర్మం. లోకమాత, జగజ్జనని అయిన పార్వతి ప్రకృతి రూపంలో ఈ సృష్టిని కని, పెంచి, పోషిస్తోంది. జగత్తుకు తండ్రి ఐన పరమాత్మ పురుష భావంతో ఆధార భూతుడుగా ఉంటున్నాడు. ఆయన ఎలా ఆధారభూతుడుగా వుంటున్నాడో చెపుతాను విను.

సర్వ ప్రాణులు ప్రాణాన్ని రక్షించుకొనటానికి ఆహారం అవసరం. ఆహారోత్పత్తికి మధుర జలాలు ఆధారం. జలాలకు నదులు ఆధారం. నదులకు వర్షం అధారం. వర్షానికి మేఘాలు ఆధారం. మేఘాలకు సముద్రుడు ఆధారం. సముద్ర జలాలే మేఘోత్పత్తికి కారణమవుతున్నాయి. సముద్రుడు తండ్రి, నదులన్నీ నదీమ తల్లులు. సముద్రుడు భర్త, నదులు భార్యలు, నదుల ప్రయోజనం ప్రత్యక్షంగా గోచరిస్తున్నట్లు సముద్ర ప్రయోజనం అవగతం కాదు. కనుక ఈ దృశ్యమాన జగత్తుకు ఆధారభూతుడైన వాడు పరమాత్మ ఒక్కడే. కార్యాన్నిబట్టి కారణాన్ని ఊహించుకొన్నట్లే, ప్రకృతిని అనుభవిస్తూ తదాధార భూతుడైన పరమాత్మను మనసులో ధ్యానించాలి. ఈ ప్రకృతి నియమాలను గూర్చి చెప్పటానికి కొన్ని శాస్త్రాలున్నాయి. వాటికి ప్రకృతి శాస్త్రాలని పేరు. పరమాత్మను గూర్చి చెప్పటానికి మానవ కల్పితమైన శాస్త్రాలు లేవు. దానికి త్రికాలజ్ఞులైన ఋషులు చెప్పిన వేదమే ఆధారం. అట్టి వేదం మహా దేవుడైన శంకరుని సర్వోత్కృష్టునిగా కీర్తించింది.

కనుక ప్రియా! నీవు జీవించి ఉండి ప్రత్యక్షంగా పిల్లల పోషణ భారాన్ని వహించు. సర్వులకు తండ్రి ఐన శంకరుని అనుగ్రహం ఎప్పుడూ ఉంటుంది. తల్లిబిడ్డలను సాకినట్లు

తండ్రి పెంచలేడు. ఉప్పునీటితో చెట్లు పెరగవు గదా! శివతేజో రూపుడైన కుమార స్వామిని తల్లులే పెంచారు గదా! పాండు రాజు మరణానంతరం పాండవులను వీరమాత అయిన కుంతి పెంచి వారిని జగదేక వీరులను చేసింది. నీవు కూడా అట్టి బాధ్యతనే వహించు. వ్యాధునికి ఆహారంగా నేవెడుతున్నాను. ఆ హరిణం శివజ్ఞానంచే ఇలా మనుష్య భావంతో పల్కి ముందుకు సాగబోయింది.

వెంటనే మరొక లేడి (మూడవది) అడ్డం వచ్చి ఇలా అంది: "ఓ సహచర దంపతులారా! సత్యవాక్య పరిపాలనావ్రతం మీతోపాటు నాకూ సమానమే. నేను బ్రహ్మచారిని! నాకు భార్య, పిల్లలు లేరు. నే మరణిస్తే విచారించే వారు కూడా లేరు. వేద శాస్త్ర పురాణాదులన్నీ పరోపకారం కంటె మించిన ఉత్తమ ధర్మం లేదని ఘోషిస్తున్నాయి. అలాటి ఉత్తమ అవకాశం మహాపర్వ దినమైన శివరాత్రి వ్రత సందర్భంగా వచ్చింది. ఇదుగో! నేను వెడుతున్నాను బోయకు ఆహారంగా! మీరు నిశ్చింతగా సుఖంగా ఉండండి!" ఇలా పల్కి సమాధానం కొరకు ఎదురు చూడకుండ చెంగు చెంగున గంతులు వేస్తూ పరుగెత్తింది. దాని వెంటనే లేళ్ళ జంట, వాటి వెంట పిల్లలు ఇలా ఒకరివెంట మరొకరు అహమికతో కిరాతునికి ఆహారంగా తమకు తాముగా సమర్పణ కావటానికి సిద్ధపడి వేగంగా పరులెత్తుకొని వెళ్ళి బోయవాని ముందు నిలబడి ముక్త కంఠంతో ఇలా అన్నాయి.

"ఓ కిరాత శ్రేష్ఠా! నీకిచ్చిన మాట ప్రకారం మేము వచ్చాము. మా యందు దయవుంచి మా దేహాలను సార్థకం చేయి. మా జన్మలను సఫలీకృతం చేయి. మాకు ఉత్తమ లోకప్రాప్తికి కారణభూతుడవు కమ్ము!" ఇలా పరమానందంతో "నన్ను ముందు చంపు! నన్ను ముందు వధించు! నాకు ముందు ఉత్తమ లోకాలను ప్రాప్తింప చెయ్యి" అంటూ తలలు వంచి నిలబడిన లేళ్ళను చూచి ఆ కిరాతుడు శివానుగ్రహంచే పొందిన జ్ఞానం కారణంగా ఇలా చింతించాడు.

"ఆహా! ఏమి ఈ అద్భుత సన్నివేశం! దేవతలకు సైతం దుర్లభం కదా! జ్ఞానహీనమైనవి అని సర్వులు భావించే ఈ మృగాలు తమ శరీరాలను పరోపకారం కొరకు అర్పించటానికి సత్యనిష్ఠను కలిగి ఉన్నాయి. వీటి జీవితాలు ధన్యములయ్యాయి. నేను మనుష్య జన్మ ఎత్తి ఏమి సాధించాను? ఇలాటి అనేకమైన మూగ జీవాలను వధించి పొట్టపోషించుకొన్నాను. అనేకమైన పాపాలను చేస్తూ మృగాలను వధిస్తూ, బాట సారులను చంపి దోచుకొంటూ ఇప్పటి వరకు కుటుంబాన్ని పోషించుకొంటూ వచ్చాను. అధర్మాచరణ వలన కలిగే

దుఃఖము, హాని, దుర్గతి, నరకలోక ప్రాప్తి, జన్మజన్మల పాపము నాకు చుట్టుకొంటుంది. నే కూడబెట్టిన విత్తం వలన కలిగే సర్వసౌఖ్యాలు ఈ భార్యాబిడ్డలు హాయిగా అనుభవిస్తారు. ఎంత అజ్ఞానం. ఇదంతా పరమాత్మ జ్ఞానం లేని కారణం చేతనే గదా! ఛీ! పాడుజన్మ!" ఇలా భావించి లేళ్ళను అభినందించి స్వేచ్ఛను ప్రసాదించాడు. ఇక ఈపైన మాంసాన్ని ముట్టనని బోయ నిశ్చయించుకొన్నాడు.

తక్షణం అతని ధర్మనిష్ఠకు ప్రసన్నుడై శివుడు ప్రత్యక్షమై ఇలా వరమిచ్చాడు. "ఓ కిరాతా! నీవు తెలియ కుండానే చేసిన శివరాత్రి వ్రతానికి, పశ్చాత్తాప పూర్వకమైన తపస్సుకు, నీవు చూపిన భూతదయకు, నీ అహింసా వ్రత నిర్ణయానికి పరమ ప్రీతుడనైనాను. నీవు నాకు పుత్రసముడవు, నా కుమారుడైన షణ్ముఖుని పేరే నీకు పెడుతున్నాను. రాబోవు జన్మలో నీవు గుహుడు అనే నామధేయంతో కీర్తిప్రతిష్ఠలను ఆర్జించగలవు. శ్రేష్ఠమైన శృంగభేరి పురం రాజధానిగా కిరాత రాజువై సర్వభోగాలను అనుభవిస్తావు. నీ వంశం ఆకల్పాంతం వర్ధిల్లుతుంది. శ్రీరామచంద్రుడు నిశ్చయంగా నీ గృహానికి వచ్చి నీతో మైత్రిని చేయగలడు. మరణానంతరం దుర్లభమైన ముక్తిని పొందగలవు!"

ఇలా ఆశీర్వదించి మృగాలకు కూడా ముక్తిని అనుగ్రహించాడు శంకరుడు. ఈ గాథకు ప్రత్యక్ష నిదర్శనంగా శివుడు అర్బుద పర్వత ప్రాంతంలో 'వ్యాధేశ్వరుడు' అనే పేరుతో స్థిరుడై వెలసి ఇప్పటికీ పూజలందుకొంటూ భక్తకోటిని అనుగ్రహిస్తూనే ఉన్నాడు. ఈ శివరాత్రివ్రత మాహాత్మ్య గాథ దివ్యమైనది."

**ముక్తి స్వరూప నిర్ణయం**

ఋషులు ప్రార్థించగా సూత మహర్షి ఇలా అంటున్నాడు: "మునులారా! ముక్తిని గూర్చి, దానికి సాధన భూతమైన భక్తి, జ్ఞానములను గూర్చి చెపుతున్నాను. వినండి. ఇది రహస్యమైనది సుమా! సంసార దుఃఖాన్ని పోగొట్టి పరమానందాన్ని ఇచ్చే ముక్తి నాలుగు విధాలు. వాటికి 1. సాలోక్యము, 2. సాన్నిధ్యము లేక సామీప్యము, 3. సారూప్యము, 4. సాయుజ్యము అని పేర్లు. కేవలం శివుడు మాత్రమే ముక్తిని ఈయగలడు. తక్కిన హరి బ్రహ్మాదులు ధర్మ-అర్థ-కామములను ఇచ్చు వారు మాత్రమే. శివుడు త్రిగుణాతీతుడు, నిర్వికారుడు, పరబ్రహ్మ, తురీయుడు, జ్ఞానస్వరూపుడు, అవ్యయుడు, సర్వసాక్షి, జ్ఞాన గమ్యుడు, అద్వితీయుడు.

మునులారా! ఈ నాలుగు కాకుండ మానవులకు దుర్లభమైన 'కైవల్యము' అను ఐదవ ముక్తి కూడ ఉంది. దాని లక్షణాన్ని చెపుతున్నాను వినండి. ఎవని నుండి ఈ జగత్తు సర్వము ఉదయిస్తూన్నదో, ఎవనిచే పాలించబడుతున్నదో, ఎవని యందు లీనమగుచున్నదో, ఎవనిచే ఈ జగత్తు వ్యాపించబడి ఉన్నదో అదే శివస్వరూపమని చెప్పబడుతున్నది. అది సకల-నిష్కల భేదంచే రెండు విధాలని వేదం అంటున్నది. దానిని ఎవరూ తెలుసుకోలేరు.

**బ్రహ్మము**

అది సత్యజ్ఞానానంతం. దానికి సచ్చిదానందము అని పేరు. అది నిర్గుణము, నిరుపాధికము, అన్యయము, శుద్ధము, నిరంజనమూను. అది పంచ జ్ఞానేంద్రియాలకు అందనిది. వాక్కుకు, మనస్సుకు కూడ అందనిది. ఆ పరబ్రహ్మమే శివనామధేయంచే చెప్పబడుతూన్నది. అది ఆకాశంవలె సర్వ వ్యాపకము, మాయాతీతము, ద్వంద్వాతీతము. అరిషడ్వర్గాదులు లేనిది. శివ జ్ఞానం వలన గాని, శివారాధన వలన గాని సత్పురుషులు ఆ తత్త్వాన్ని ఇహంలోనే నిశ్చయంగా పొందవచ్చు. జ్ఞానం దుష్కరం! భక్తి సుకరం. అనేక మంది భక్తిచే శివానుగ్రహాన్ని పొంది మోక్షాన్ని పొందారు.

పూర్వ పుణ్యవశంచేత శివానుగ్రహం లభిస్తుంది. ఆయన అనుగ్రహం చేతనే ఆయన యందు పరిశుద్ధమైన ప్రేమ అంకురిస్తుంది. ఆ ప్రేమయే భక్తిగా మారి దాని నుండి జ్ఞాన ఫలం లభిస్తుంది. సగుణ-నిర్గుణ భేదంచే భక్తి రెండు విధాలు. స్వభావసిద్ధమైన భక్తి సర్వశ్రేష్ఠమైనది. ఆ భక్తి నైష్ఠికి (పూజాదికములు కలది) అనైష్ఠికి (పూజాదికములు లేనిది) అని రెండు విధాలు. నైష్ఠికీ భక్తిలో ఆరు భేదాలు ఉన్నాయి. అనైష్ఠికీ భక్తిలో (మానసిక భక్తిలో) భేదాలు లేవు. భక్తికి శ్రవణ, సంకీర్తనాదులు మొదలుగా తొమ్మిది అంగములున్నాయి. భక్తిలేని వానికి జ్ఞానం లభించదు. మహేశ్వరుని యందు ముందు భక్తిని సాధించాలి. ఆయన అనుగ్రహం ఉంటే అన్నీ ఉన్నట్లే."

**సగుణ-నిర్గుణ భేదం**

సూత మహర్షి ఋషులతో ఇలా అంటున్నాడు. "మునులారా! ఈ ప్రపంచం వ్యక్తం కావటానికి ముందు ఉన్న నిర్గుణ పరమాత్మ నుండి ఏదైతే ప్రథమంలో వ్యక్తమైందో దానికి 'శివమ్' అని పేరు. భక్తులను అనుగ్రహించే నిమిత్తం అదే 'శివుడు'గా, అదే 'రుద్రుడు'గా వ్యవహరింపబడుతూన్నదని వేదం అంటున్నది. త్రిగుణాతీతుడైన శివునకు త్రిమూర్తులలో ఒకడైన రుద్రునకు భేదం లేదు. బంగారానికి ఆభరణానికి వస్తు తత్త్వంలో భేదం లేదు గదా! వారిద్దరు భక్తులను సమానంగానే అనుగ్రహిస్తారు. మిగిలిన వారందరు ఏక్రమంలో జన్మించారో ఆక్రమంలోనే లయమవుతారు.

కాని రుద్రుడు మాత్రం లయంకాడు. ఆయన శివునిలో ఐక్యమవుతాడు. ప్రకృతి నుండి పుట్టిన కార్యములన్ని రుద్రునిలో లయమవుతాయని వేదానుశాసనం. బ్రహ్మ విష్ణువులు సైతం ప్రకృతి నుండి పుట్టిన వారు కనుకను, గుణములు కలవారే కనుకను వారు కూడా రుద్రునిలో లయమవుతారని వేదం నొక్కి వక్కాణిస్తూన్నది.

గడ్డిపోచ మొదలుగా బ్రహ్మగారి వరకు ఈ జగత్తులో తెలియవచ్చే సర్వము మిథ్య. ఈ నానాత్వం కల్పితం. శివుని కంటె భిన్నంగా ఏదీ లేదు. సృష్టికి ముందు, సృష్టికి మధ్యలో, సృష్టి నశించిన తరువాత ఉండేది శివుడే. సగుణుడు, నిర్గుణుడు కూడా ఆయనే. ఈ సృష్టికి కారణభూతమైన శక్తి కూడ ఆయన నుండే పుట్టింది. అది ఆయన తపశ్శక్తి. ఆయనే వేదాలను, మాత్రలను, మాత్రాబద్ధమైన అక్షరాలను, ధ్యానమును ఒకటేమిటి సర్వమైన దానిని విష్ణువుకు ఇచ్చాడు. బ్రహ్మ, విష్ణువులతో కూడా కలిపి అందరికి ఆయుర్దాయం ఉంది. కాని శివునకు ఆయుర్దాయం లేదు. ఆయన నిత్యుడు, శాశ్వతుడు. ఆయనే మహాకాలితో కూడి మహాకాలుడై ఉన్నాడు. ఆయన కారణ స్వరూపుడు. ఆయనకు కారణం లేదు. బీజంలో వృక్షం-వృక్షంలో బీజం ఉన్నాయి. శివస్వరూపుడైన మహేశ్వరుని విషయంలో కూడ ఇదే వ్యవస్థ. ఇదే శివుని యొక్క పరమ జ్ఞానం.

**జ్ఞాన నిరూపణము**

మునులారా! పరమ రహస్యమైన శివజ్ఞానాన్ని నేను పెద్దల వలన విన్న దానిని యథాతథంగా చెపుతున్నాను వినండి. ఇది సర్వవేద సారం. వేద వేత్తలైన బ్రహ్మ, నారదుడు, కుమార స్వామి, వ్యాసుడు, కపిలుడు ఇంకా అనేకమంది బ్రహ్మ జ్ఞానులైన వారి సమాజంలో నిశ్చయింపబడి ప్రవచింపబడింది. మానవుడు సర్వము శివాత్మకమని ముందు తెలుసుకోవాలి. ఆ శివుడు ప్రకాశస్వరూపుడు. ఆయన సంకల్పం నుండి ఈ జగత్తు ఉద్భవించింది. ఆయన సర్వజ్ఞుడు. ఆయన ఈ జగత్తులో చైతన్య రూపంలో ఉన్నాడు కాని కర్మలేపం లేనివాడు. ఆయన కేమీ అంటదు. సూర్యుడు జలముల యందు ప్రతిఫలిస్తాడు కాని ఆయనకు జలస్పర్శలేదు. శివుడు కూడా అట్లే చేతనుడై ప్రతిఫలిస్తున్నాడు. శుభకరుడైన శివుడే జగద్రూపంలో భాసిస్తున్నాడు. బుద్ధియందలి అజ్ఞానం కారణంగా ద్వైతబుద్ధి, భేద దృష్టి కలుగుతూన్నది. వాస్తవంగా ద్వితీయ వస్తువు లేదు. దర్శన శాస్త్రకారులు ఈ జగత్తును గురించి, ఆత్మను గురించి, పరమాత్మను గురించి, జీవేశ్వరులను గురించి ఎవరెన్ని విధాలుగా నిర్వచించినా వారు వేదం యొక్క సమీపానికి కూడా రాలేక పోయారు. వారికి వేద తాత్పర్యం బోధపడలేదు. **వేదాంతులు చెప్పే అద్వైతం ఒక్కటే పరమ సత్యం.** జీవుడు తత్త్వంలో సాక్షాత్తు పరమేశ్వరుడే

అయినా ప్రకృతి మాయలో పడి అజ్ఞానం చేత తనను తాను ఈశ్వరుని కంటె భిన్నునిగా భావిస్తున్నాడు. ఆ మాయావకుంఠనం తొలగిపోగానే జీవుడు సాక్షాత్తు శివుడే అగుచున్నాడు.

శివుడు జగత్తంతా వ్యాపించి సర్వ వ్యాపకుని గాను సకల ప్రాణులయందు అంతర్యామి స్వరూపంగాను ఉన్నాడు. ఉపనిషత్ర్పతి పాదితమైన అద్వైత మార్గంలో పయనిస్తే దర్శనం లభిస్తుంది. అగ్ని కట్టెలలో అంతర్నిహితంగా వ్యాపకుడై ఉన్నా రాపిడి చేసిన వానికే అగ్ని దర్శనం లభిస్తుంది. నానాత్వ దర్శనం భ్రాంతి మూలకం. ద్వైత దృష్టి అజ్ఞాన విలసితం. తీపి పదార్థాలన్నీ చెరకు యొక్క వికారాలే! భాండ సముదాయ మంతా మట్టి యొక్క వికారాలే! నగలన్నీ బంగారం యొక్క వికారాలే! వస్త్రం అనేది ఏ రూపంలో ఉన్నా ప్రత్తి యొక్క వికారాలే! ఇలా సమస్త ప్రపంచమూను అని భావించాలి. ఉపాధి భేదాన్ని అనుసరించి నానాత్వం గోచరిస్తూన్నది. అట్లే పరమేశ్వరుడు కూడా ఉపాధి భేదం చేత అనేకంగా గోచరిస్తున్నాడు. కార్యకారణముల మధ్య తత్త్వంలో భేదం లేదు. ద్వైతబుద్ధి కేవలం భ్రాంతి. రజ్జువునందు సర్పభ్రాంతి, శుక్తియందు రజిత భ్రాంతి, ఎండమావుల యందు జలభ్రాంతి సర్వము భ్రాంతి మూలకం. భ్రాంతి తొలగితే యదార్థ వస్తువు గోచరిస్తుంది. భ్రాంతికి కారణం అజ్ఞానం. అజ్ఞానానికి కారణం ప్రకృతి (మాయ). ప్రకృతి ప్రత్యక్షంగా గోచరించి పరమాత్మను కప్పేస్తూన్నది.

సృష్టి, స్థితి కారకులైన బ్రహ్మ, విష్ణువు లిరువురు ప్రకృతి మాయలో పడి కొట్టుకొంటూన్న వారే! లయ కారకుడైన రుద్రుడు ప్రకృతి మాయలో పడి లయకారకుడు కాలేదా? అంటే కాలేదు. పుట్టిన ప్రతి వస్తువు లయమై తీరుతుందనేది ప్రకృతి నియమం. అలా లయమైనది రుద్రుని చేరుతుంది. అందువల్ల రుద్రునికి కర్తృత్వం లేదు. కర్తృత్వం లేని చోట అహంకారం లేదు. అహంకారం లేని చోట జీవభ్రాంతి లేదు. జీవభ్రాంతి లేని చోట మాయ లేదు. మాయ లేని చోట ఈశ్వరుడు జ్ఞానస్వరూపుడై, జ్యోతిస్వరూపుడై, స్వయం ప్రకాశ స్వరూపుడై ఉంటున్నాడు.

ఏక రూపుడైన శివుని నుండి నానాత్వంతో కూడిన ప్రపంచం వ్యక్తమై తిరిగి ఆయనలోనే లీనమవుతూ ఉంటుంది. ఎలాగంటె బీజం ఏక రూపంలో ఉంటుంది. దాని నుండి చెట్టు ఉద్భవిస్తుంది. చెట్టు అంటే కాండము, కొమ్మలు, ఆకులు, చిగుళ్ళు, పుష్పాలు, ఫలాలు ఇత్యాదిగా నానాత్వం ప్రకటిత మవుతూన్నది. తిరిగి ఈ నానాత్వం బీజంలో ఏకరూపంలో ఒదిగి ఉంటూన్నది. శివుడు-ప్రపంచము ఈ రెండింటి సంబంధము అంతే! సృష్టిలో

సూర్యుడు ఒక్కడే అయినా అనేకమైన వాటిలో ప్రతిఫలిస్తున్నాడు. అవన్నీ ఆయన ప్రతిబింబాలు. ప్రతిబింబాలు అనంతం. అవన్నీ ఉపాధి భేదం చేత ఏర్పడుతాయి. ఉపాధులు నశించగానే ప్రతిబించాలు నశిస్తాయి. కాని బింబం అంటే సూర్యుడు అద్వితీయుడై వెలుగుతూనే ఉంటాడు జీవులు అనంతం. శివుడు ఒక్కడే! ఆకాశం సర్వ వ్యాపకమే అయినా దానికి దేనితోనూ సంగము లేదు. అది అన్నిటికి ఆధారభూతంగా, అధిష్ఠానంగా ఉంటుంది. అలాగే శివుడు సర్వానికి అధిష్ఠానంగా ఉంటున్నాడు. ఆయనకు దేనితోను సంబంధం లేదు. పాపపుణ్యాలతో కూడిన కర్మఫలాలు ఆయనకు అంటవు.

అహంకారంతో కూడిన చైతన్యమే జీవుడు. అహంకార రహితమైన చైతన్యమే శివుడు. స్వచ్ఛమైన బంగారం ఎంత శ్రేష్ఠమైనదైనా వెండి, రాగి తదితర నీచ లోహాలతోడి సంపర్కం కారణంగా బంగారం మలిన మవుతుంది. దాని శ్రేష్ఠత్వానికి భంగం కలుగుతుంది. అలాగే ఉపాధిని ఆశ్రయించిన జీవుడు తత్త్వంలో శివస్వరూపుడే అయినా అహంకారం వలన మలిన మవుతున్నాడు. జీవుని మహత్త్వం తగ్గుతూన్నది. తిరిగి బంగారాన్ని శుద్ధి చేస్తే దానికి పూర్వపు శ్రేష్ఠత్వం లభిస్తుంది. అలాగే మానవుడు కూడా సద్గురువును ఆశ్రయించి ఆయన చేసిన ఉపనిషత్ప్రతి పాదితమైన జ్ఞాన బోధచే అహంకార మాలిన్యంతో పాటుగా సర్వమైన మాలిన్యాలను తొలగించుకొంటే స్వచ్ఛమైన మేలిమి బంగారంలా స్వస్వరూప జ్ఞానంతో ప్రకాశిస్తాడు. అద్దానికి అంటుకొన్న మాలిన్యం తొలగించగా అద్దంలో ప్రతిబింబించిన రూపం స్పష్టంగా గోచరించినట్లు అజ్ఞానం తొలగగానే మానవుని హృదయ పుండరీకంలో కొలువై ఉన్న పరమాత్మ స్వస్వరూపంతో సాక్షాత్కరిస్తాడు. అప్పుడు నేనే శివుడను అనే అద్వైత జ్ఞానం కలుగుతుంది. అట్టి మనుజుడు జీవన్ముక్తుడని పిలువబడుతాడు. జీవన్ముక్తునికి సుఖదుఃఖాది ద్వంద్వములు, భేద దృష్టి ఇత్యాది ద్వైత భావనలు ఉండవు. అట్టివాడు ఇషువేగ న్యాయం చేత ప్రారబ్ధం ఉన్నంత వరకు శరీరాన్ని ధరించి ఈ ప్రపంచంలో బ్రతికి మరణానంతరం శివ సాయుజ్యాన్ని పొందుతాడు.

ఈ ముక్తిని పొందటానికి కొంత మానవ ప్రయత్నం అవసరం. దాని క్రమం ఇలా ఉంటుంది. ముందు జీవునికి పూర్వజన్మ సంస్కారం చేత శివుని యందు భక్తి, దానినుండి ప్రేమ, ప్రేమ నుండి సేవ, సేవ నుండి శ్రవణం, శ్రవణం నుండి సత్సంగం, సత్సంగం నుండి గురువు, గురువు ద్వారా జ్ఞానం, జ్ఞానం నుండి ముక్తి లభిస్తాయి.

మునులారా! మీకింత వరకు నే చెప్పిన ఈ శివమహాపురాణం లోని విషయాలన్నీ శివుడే స్వయంగా విష్ణువుకు చెప్పాడు. ఆయన బ్రహ్మకు, బ్రహ్మ సనకాది మహర్షులకు, తరువాత వారు నారదునకు, నారదుడు వ్యాసునకు క్రమంగా చెప్పారు. దయానిధి అయిన వ్యాస భగవానుడు నాకు చెప్పిన దానిని మీకు నేను చెప్పాను. ఈ కలిలో వ్యాపించిన విజ్ఞానమంతా వ్యాస ప్రోక్తమే. వ్యాస భగవానుడు సమస్తమైన వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాసాదులను పలుమార్లు పరిశీలించి సారభూతమైన జ్ఞానమనే వెన్న ముద్దను మనకందించాడు. తొల్లి కృతయుగంలో వేదాలతో పాటుగా వేదసారమైన పురాణం కూడా పుట్టింది. దాని పేరు 'ఆది పురాణం'. పురాణ వాఙ్మయం తత్త్వంతో పాటు గాథలతో కూడా నిండి ఉంటుంది. ఆ ఆది పురాణ సారాన్నే వ్యాస భగవానుడు అష్టాదశ పురాణాలలో నిక్షేపించాడు. పురాణాల ద్వారానే వేద తాత్పర్యాన్ని నిర్ధారించుకోవలసి ఉంటుంది. పురాణ జ్ఞానం లేని వానికి వేదం అంధుని ముందు అద్దంవలె వ్యర్థం.

మునులారా! నే చెప్పిన శివజ్ఞానాన్ని వ్యాపింపచేయండి. కాని నాస్తికునకు, శ్రద్ధలేని వానికి, కపటికి, మోసగానికి, భక్తిహీనునకు, వినుట యందు ఆసక్తి లేని వానికి, ప్రపంచమే శాశ్వతమని నమ్మిన వానికి, వితండ వాదం చేసే హేతువాదికి మాత్రం చెప్పవద్దు. శివుడు సర్వోత్కృష్టుడు అనే జ్ఞానాన్ని ఎప్పుడూ కలిగి ఉండండి. మీకు తప్పక అభ్యుదయం కలిగి నిశ్రేయసం లభిస్తుంది. ఎంతో శ్రమపడి చెప్పిన సూతుని అమృత వాక్కులను విని మునులాయనకు పరమానందంతో ఆదర పూర్వకంగా పూజించి సత్కరించారు.

**శ్రీ శివమహా పురాణంలో కోటిరుద్ర సంహిత సమాప్తము.**

**శ్రీ సాంబసదాశివార్పణమస్తు**

**శ్రీకృష్ణార్పణమస్తు**

**హరిః ఓం తత్సత్**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## ఉమా సంహిత



శ్రీ గౌరీ శంకరాభ్యాం నమః

**శ్లో ॥ యో ధత్తే భువనాని సప్త గుణవాన్ స్రష్టా రజస్సంశ్రయః**
**సంహర్తా తమసాన్వితో గుణవతీం మాయామతీత్యస్థితః ।**
**సత్యానందమనంత బోధమమలం బ్రహ్మాది సంజ్ఞాస్పదం**
**నిత్యం సత్త్వ సమన్వయా దధిగతం పూర్ణం శివం ధీమహి ॥**

**తా ॥** గుణములకు అధిష్ఠానమగు ఏ పరమేశ్వరుడైతే రజోగుణమును ఆశ్రయించి ఏడు లోకములను ధరించి పాలించుచున్నాడో; తమోగుణము నాశ్రయించి సంహరించుచున్నాడో; ఏ పరమేశ్వరుడు త్రిగుణాత్మికయగు మాయకు అతీతుడై ఉన్నాడో; అట్టి సత్యస్వరూపుడు, ఆనందఘనుడు, సర్వపరిచ్ఛేద రహితుడు, జ్ఞాన ఘనుడు, సంసార దోష వర్జితుడు, బ్రహ్మ-విష్ణు-రుద్రులను పేర్లతో వ్యవహరింపబడువాడు, నిత్యుడు, సాత్త్విక భావమును పెంపొందించు కొనుట వలన లభించు వాడు, పూర్ణుడు అగు శివుని మేము ధ్యానించు చున్నాము.

### శ్రీకృష్ణ-ఉపమన్యు సంవాదము

సూత మహర్షి ఋషులతో ఇలా అంటున్నాడు: "ఓ! తపోధనులారా! మా గురువుగారైన వ్యాస భగవానుడు సనత్కుమారుని వలన తెలుసుకొన్న ఉమా సంహితను నేను మీకు చెపుతున్నాను వినండి! పూర్వం వసుదేవ తనయుడైన శ్రీకృష్ణుడు పుత్రార్థియై శివుని గూర్చి తపస్సు చేయగోరి కైలాసానికి వెళ్ళాడు. అక్కడ శ్రేష్ఠమైన హిమవత్పర్వత శిఖరంపై తపస్సు చేస్తూన్న ఉపమన్యు మహర్షిని చూచి భక్తితో చేతులు జోడించి ప్రణామం చేసి వినయంగా ఇలా ప్రశ్నించాడు.

"ఓ! ఉపమన్యూ! నీవు మహా ప్రాజ్ఞుడవు! శివ భక్తులలో అగ్రగణ్యుడవు! నేను పుత్రార్థినై శివానుగ్రహాన్ని పొందగోరి వచ్చాను. భక్తులకు సర్వదా ఆనందాన్ని కలిగించే శివుని మహిమను, తత్త్వాన్ని, నీ అనుభవాన్ని నీ ముఖకమలం నుండి శ్రవణం చేయాలని ఉవ్విళ్ళూరుతున్నాను. ఆపై నీవు చెప్పిన దానిని చక్కగా మనసుకు పట్టించుకొని శివుని గూర్చి తపస్సుకు ఉపక్రమిస్తాను. శివానుగ్రహం లేనివాడు ఈ లోకంలో ఎట్టి అభ్యుదయాన్ని పొందలేడు గదా!"

శ్రీకృష్ణుని భక్తికి, వినయానికి మిక్కిలి సంతోషించి, శివుని మనసులో ధ్యానించి ఉపమన్యు మహర్షి ఇలా చెప్పసాగాడు: "మహా శైవాగ్రగణ్యుడవైన వాసుదేవా! విను. మహేశ్వరుని మహిమను నేను ప్రత్యక్షంగా చూచాను. నేను తపస్సు చేస్తూండగా సమస్త పరివార సహితుడైన శంకరుని, ఆయన యొక్క ఆయుధాలను చూచాను. విధి, మాధవ, ఇంద్రాది బృందారక బృందమంతా కరకమలాలను జోడించి శిరసున గీలించి ఆయనను పరివేక్షించి స్తుతిస్తూండగా... ఆ సుందర దృశ్యాన్ని తన్మయత్వంతో దర్శించాను. తన స్వరూపంలో మూడు అంశలతో ప్రకాశించువాడు, నిత్యానంద స్వరూపుడు, ఒక అంశచే జగద్రూపంగా ప్రకటమైన వాడు, మహా దంష్ట్రుడు, అగ్నిజ్వాలా మండితుడు, సహస్రకోటి మార్తాండ మండల తేజో విరాజమానుడు, సహస్రాక్షుడు, సహస్ర పాదుడు, సహస్రానేక దివ్యాయుధ సంపన్నుడు, విరాట్ స్వరూపుడు ఐన శంకరుని దివ్య రూపాన్ని దర్శించాను.

కల్పాంతమందు సర్వ జగత్తును ఆయన ఉపసంహరిస్తాడు. ఆయన చెంత పరమ గుహ్యమైన ఆయన శూలాన్ని వీక్షించాను. దానికి 'విజయము' అని పేరు. అది భూమిని చీల్చగలదు. సముద్రాలను శోషింప చేయగలదు. జ్యోతిర్మండలంలోని నక్షత్రాలన్నిటిని సూదితో పువ్వులను గ్రుచినట్లు పూలదండగా గ్రుచ్చగలదు. యవనాశ్వుని కుమారుడైన మాంధాత చక్రవర్తిని అది పూర్వం ససైన్యంగా వధించింది. బల గర్వితుడైన లవణాసురుడు పూర్వం శతృఘ్నుని ఆలానికి ఆహ్వానించగా క్షణంలో ఆ రాక్షసుని సంహరించింది. పరశు రాముడు ఏ కుఠారంతో ఇరవై ఒక్క సార్లు దుష్ట క్షత్ర కులాన్ని నరికాడో కల్పాంతదహన రూపమైన ఆ గండ్రగొడ్డలిని శివ సన్నిధిలో పరికించాను. వేయి అంచులు గలది, సాటిలేనిది అగు సుదర్శన చక్రాన్ని తిలకించాను. పినాకమనే ధనుస్సును, శక్తిని, కత్తిని, పాశాన్ని, అంకుశాన్ని, గదను ఇంకా పేర్లు తెలియని అనేక శస్త్రాస్త్రాలను అవలోకించాను. కృష్ణా! ఒక్క వాక్యంలో చెపుతున్నాను విను! లోకాలోకాలతో కూడియున్న ఈ ఖగోళమంతా ఆయన చుట్టూ కుమ్మరిసారెలా పరిభ్రమిస్తూ ఉండగా దిగ్భ్రమతో ఆ దివ్య రూపాన్ని దర్శించాను.

నాయందు ప్రసన్నుడైన శంకర భగవానుడు నాకు త్రికాలజ్ఞానాన్ని, ఆయన యొక్క నిత్య సన్నిధిని అనుగ్రహించాడు. జరా, మరణాదులు లేకుండ ఆకల్పాంతం చిరంజీవివై వర్ధిల్లమని వరమిచ్చాడు. నేను కోరదగినవి ఏమీ మిగలకుండ అన్నిటిని అనుగ్రహించాడు. వేయేల! ఆయన ఈశత్వాన్ని నాకు అనుగ్రహించాడు! వాసుదేవా! భక్తవత్సలుడైన శంకరుడు నిన్ను తప్పక అనుగ్రహిస్తాడు. ఆయనను గూర్చి తపస్సు చెయ్యి. పూర్వం అనేక మంది ఆయనను ఆరాధించి అభీష్ట సిద్ధిని పొందారు. శివారాధనా తపస్సును అనగా పాశుపతవ్రత దీక్షను నేను నీచే నడిపిస్తాను.

**శ్రీకృష్ణుడు తపస్సుచేసి శంకరుని అనుగ్రహించే వరాలను పొందుట**

ఉపమన్యు మహర్షి ఇలా పలికి గతంలో దేవదానవులలో ఋషులలో, ఋషిపత్నులలో చక్రవర్తులలో, సామాన్యులలో శివుని ఆరాధించి ఆయన అనుగ్రహాన్ని పొందిన వారి గాథలన్నిటిని చెప్పాడు. చెప్పి భుక్తి, ముక్తి దాయకమైన 'నమశ్శివాయ' మంత్రాన్ని ఉపదేశించి శ్రీకృష్ణునికి దీక్షను ఇచ్చాడు. మాధవుడు తన కాలి బొటన వ్రేలిపై శరీరం బరువునుంచి పదహారు మాసాలు శంభుని గూర్చి తపస్సు చేశాడు. ఆయన నిష్ఠకు సంతసించిన పరమేశ్వరుడు పార్వతీ సహితుడై దర్శనమిచ్చి ఎట్టి దుర్లభమైన వరాలనైనా కోరుకొమ్మని పల్కగా శ్రీకృష్ణుడిలా ప్రార్థించాడు: "ఓ దేవదేవా! మహాదేవా! నా యందు నీవు ప్రీతుడవైనచో ఎనిమిది వరాలచే నన్ననుగ్రహించు. నిత్యము శివ ధర్మము నందు నా బుద్ధి నిలుచుగాక! శాశ్వతమైన కీర్తి కలుగును గాక! స్థిరమైన నీ సన్నిధి లభించును గాక! నీ యందు నిత్య భక్తి సిద్ధించును గాక! నా కుమారులందరకు ఒక్కొక్కరికి పదిమంది పుత్రులు కలిగి నా వంశం తామర తంపరయై వర్ధిల్లు గాక! నా శత్రువులు సంగ్రామ రంగంలో వధింపబడుదురు గాక! నాకు శత్రువులవలన అవమానం కలుగకుండును గాక! నేను యోగులందరకు ప్రియాతి ప్రియమైన వాడను అగుదును గాక!"

శూలపాణి ఐన శంకరుడు వాటన్నిటికి 'తథాస్తు' అని పలికి ఇంకా ఇలా అన్నాడు. "కృష్ణా! నీకు నా అనుగ్రహంచే పరాక్రమశాలి ఐన కుమారుడు జన్మించగలడు. అతనికి సాంబుడు అని నామకరణం చేయి. ఆ కుమారుడు పూర్వ జన్మలో ప్రళయ కాలమందలి ఆదిత్యుడు. మునులు అతనిని "మనుష్యుడవు కమ్ము!" అని శపించిన కారణంగా అతను నీకు పుత్రుడుగా జన్మించ బోతున్నాడు." ఇలా పల్కి శంకరుడు విరమించాడు.

అంత పార్వతీదేవి కృష్ణుని కృపాతరంగితావ లోకనం చేసి సుధామధురంగా ఇలా పలికింది. "ఓ! వాసుదేవా! నీ ఈశ్వర భక్తికి, తపస్సుకు సంతోషించాను. నా నుండి కూడ దుర్లభమైన వరములను పొందు."

దానికి గోవిందుడు ఆనందించి భక్తియుక్తుడై ఇలా అన్నాడు. "జగన్మాతా! నీ దయకు పాత్రుడనయ్యాను. అదే పదివేలు! అయినా వరాలకు, ధనార్జనకు 'ఇక చాలు!' అనటం ఉండదు కదా! నాకు ఎన్నడైనను బ్రాహ్మణులపై ద్వేషము కలుగకుండును గాక! సర్వకాల సర్వావస్థలయందు బ్రాహ్మణ భక్తి స్థిరమై నిల్చును గాక! మంగళకరమగు గోబ్రాహ్మణ సేవను సర్వదా చేసెదను గాక! నా తల్లి దండ్రులు సంతోషముతో ఉందురు గాక! సర్వ ప్రాణులయందు నేను అనురాగమును కలిగి ఉందును గాక! మీ ఆదిదంపతుల దర్శన భాగ్యముచే నా వంశంలో యోగ్యమైన సంతానం కలుగును గాక! నేను వంద యజ్ఞములను చేసి ఇంద్రుని, దేవతలను సంతోషపెట్టుదును గాక! నేను ఇంటిలో సర్వదా యతులకు మరియు అతిథులకు శ్రద్ధచే పవిత్రమైన భోజనమును సమర్పించెదను గాక! నేను స్త్రీజనోద్ధారకుడను అగుదును గాక! నాకు అందరి యందు సమభావము ఉండు గాక! మీ దంపతులు నాకు సర్వదా రక్షకులై ఉందురు గాక!"

ఈ విధంగా ప్రార్థించిన శ్రీకృష్ణుని అన్ని విధాల అనుగ్రహించి అంతర్ధానమయ్యారు ఆది దంపతులు. వాసుదేవుడు సఫల మనోరథుడై ఉపమన్యు మహర్షికి కృతజ్ఞతలను వెల్లడించి ఆయన నుండి సెలవు తీసుకొని మనసులో శివ సహస్రనామాలను పఠిస్తూ ద్వారకను చేరి ఇష్టకథా వినోదాలతో సుఖంగా ఉన్నాడు.

మునులారా! ఈ సర్వజగత్తు ఈశ్వర మాయచే కప్పబడి ఉంది. ఎనిమిది విధాలైన పుట్టుక గల దేవజాతులు, ఒకే ఒక విధానంలో పుట్టుకగల మనుష్య జాతి, ఐదు విధాలుగా పుట్టుకగల పశు పక్ష్యాదులు మొత్తం పదునాలుగు విధాలైన పుట్టుకలున్నాయి. ఆ జీవులన్నీ శివుని నుండే ఉత్పన్నమవుతున్నాయి. తిరిగి ఆయనలోనే లీనమవుతున్నాయి. ఆయన మాయను ఎవరూ దాటలేరు.

ఓ మహర్షులా! శివ మాయా ప్రభావంచే లోక పాలకుడైన విష్ణువు కామ మోహితుడై పరకాంతాసక్తిచే శాపగ్రస్తుడయ్యాడు!

సకల బృందారక సార్వభౌముడైన అమరేంద్రుడు తన కనుసన్నలలో మెలగే రంభోర్వశీమేనకాద్యనేక దివిజ సుందరులను కాదని తపసి ఇల్లాలికై తాపత్రయపడి చీకటి తప్పుచేసి తాపసి శాపంచే తలచుట్టూ కళ్ళు తెచ్చుకొన్నాడు.

సర్వాన్ని పవిత్రీకృతం చేసే పావకుడు కూడా కామానల పీడితుడయ్యాడు. జగత్ప్రాణుడైన వాయువు మన్మథ ప్రతాపానికి లొంగి పరాంగనాసక్తుడయ్యాడు. జ్ఞానాశ్రయుడు, కర్మసాక్షి ఐన భాస్కరుడు కుసుమ కోదండుని బారిని పడి అన్యకాంతాసక్తుడై ఔన్నత్యాన్ని కోల్పోయాడు. కుముద బాంధవుడు మదన బాణ పీడితుడై గురుపత్నిని అపహరించి తన శీలానికి కళంకం తెచ్చుకొన్నాడు! ఫలితంగా బుధుడు జన్మించాడు. మిత్రావరుణులు ఘోరమైన తపస్సును ఆచరించి కూడా ఊర్వశిని చూచి కంతు సంతాపానికి లోనయ్యారు. ఫలితంగా మిత్రునికి వసిష్ఠుడు, వరుణినికి అగస్త్యుడు పుట్టారు. బ్రహ్మ మానస పుత్రుడైన దక్షుడు సోదరి యందు చిత్త చాంచల్యాన్ని పొందేడు.

బ్రహ్మగారు సైతం పలుమార్లు మనసిజుని మాయలో పడి మనో వికారానికి లోనయ్యాడు. మహా యోగి అగు చ్యవనుడు కూడా సుకన్యను చూచి మన్మథ భావాన్ని పొందేడు.

కశ్యప మహర్షి కుసుమశర పీడితుడై ధన్వమహరాజు తనయను యాచించాడు!

విష్ణువు వాహనమైన గరుడుడు కామ వికారానికి లోనై శండిలుని కన్యను అపహరింప పూనుకొని రెక్కలు కాల్చుకొన్నాడు! విభాండక మహర్షి స్త్రీని చూచి చిత్త చాంచల్యాన్ని పొంది తపస్సునుండి జారి పోయాడు! ఫలితంగా ఋష్యశృంగుడు జన్మించాడు.

గౌతమ మహర్షి శారద్వతిని చూచి వలపును నిగ్రహించుకోలేక క్షుభిత మానసుడై ఆమెను కలియగా ద్రోణుడు పుట్టాడు. పరాశర మహర్షి అనంగ భావాన్ని అణచుకోలేక దాసకన్యా రతుడయ్యాడు. విశ్వామిత్రుడు చెఱకు విల్కాని కఱకుటమ్ముల పదును కోర్వక మేనక వెంట పడ్డాడు! ఫలితంగా శకుంతల పుట్టింది.

జితేంద్రియుడైన బృహస్పతి కందర్ప కార్ముక వినిర్ముక్త కుసుమ బాణ పీడితుడై సోదరుని భార్యను కూడగా భరద్వాజుడు జన్మించాడు.

విశ్రవసుని కుమారుడైన రావణుడు వేదపారంగతుడై ఉండి కూడా పరవధూ కాంక్షచే రాక్షసకుల వినాశనానికి ధూమకేతువయ్యాడు. వీరందరు శివమాయా మోహితులై, కామపీడితులై మలభూయిష్ఠపు తోలు బొమ్మలైన స్త్రీలతో రమించి తమ తపస్సును, ఔన్నత్యాన్ని, ఉచ్చస్థితిని, అతిశయాన్ని, ప్రాభవాన్ని ప్రాగల్భ్యాన్ని పోగొట్టుకొన్న వారే! కామ దహనం చేసి విరాగి అయిన వాడు త్రినేత్రుడైన శంకరుడు ఒక్కడే!

**సుఖ-దుఃఖ హేతువులైన పుణ్య-పాప కృత్యాలు**

మునులారా! లోకంలో సకల ప్రాణులు అనుభవించే సుఖ-దుఃఖాలకు కారణభూతమైన పుణ్య-పాప కర్మల రహస్యాన్ని చెపుతున్నాను. వినండి! లోకంలో ఏ ఆధారమూ లేకుండా, ఏ ప్రయత్నము లేకుండా ఏదీ పుట్టదు. దానికి కర్మ కారణంగా చెప్పబడుతూన్నది. కర్మ నుండి పుట్టిన సుఖ-దుఃఖ రూపమైన ఫలమే కార్యంగా చెప్పబడుతూన్నది. సర్వము కార్యకారణ సంబంధమే! ఇలా కార్య, కారణములు దేనికదే విడివిడిగా (ద్వైతంగా) కనుపించినా వాస్తవంలో రెండూ ఒక్కటే (అద్వైతమే).

మేఘం కారణంగా జలాలు వర్షిస్తున్నాయి. మేఘం నశిస్తూన్నది. జలాలు కారణంగా మేఘం పుడుతున్నది. జలాలు అదృశ్యమౌతున్నాయి. బీజం కారణంగా వృక్షం పుడుతున్నది. బీజం నశిస్తూన్నది. వృక్షం కారణంగా బీజములు ఉద్భవిస్తున్నాయి. వృక్షం నశిస్తూన్నది. సృష్టి అంతా అద్వైతమే! ద్వైతమనేది లేదు. రెండు వస్తువులు ఉన్నాయనుకొనటం కేవలం భ్రాంతి! లోకంలో దేనిని మించిన మాదక వస్తువు లేదో అట్టి స్త్రీ విషయంలో వివేచన చేస్తే పరస్పర విరుద్ధంగా తోచే రెండు వస్తువులు, లేవు అనేది బోధపడుతుంది. మూత్ర పతన స్థలం అపవిత్రం కదా! ఎంతటి వారైనా కామదాసులై అచ్చోటనే కదా రమించి ఆనందాన్ని పొందుతున్నారు. అదే పవిత్రము అపవిత్రమూను! అదే రక్తి-విరక్తులకు కారణమూను.

కారణరూపమైన కర్మలనుండి కార్యరూపమైన సుఖదుఃఖాలు పుట్టుతున్నాయి. ఫలానుభవం పూర్తికాగానే కర్మబీజం నశిస్తూన్నది. కర్మఫల రూపమైన సుఖదుఃఖాలను అనుభవించేటప్పుడు తిరిగి పుణ్య పాపరూపమైన కర్మలను చేస్తున్నాం. ఈ విధంగా కర్మనుండి ఫలం, ఫలం నుండి కర్మ పుట్టి సృష్టిచక్రం నడుస్తూన్నది. అయితే దీనికి అంతం లేదా? కర్మబంధం నుండి విముక్తి ఎప్పుడు? అంటే ఉంది. సర్వానికి శివుడే కారణం అనే శివజ్ఞానం కలిగి, సర్వమైన కర్మలను 'శివార్పణం'గా నిష్కామ బుద్ధిచే చేసి, వాటి ఫలాలను కూడా శివునికే అర్పించినప్పుడు ముక్తి లభిస్తుంది. శివ జ్ఞానాగ్ని సంపర్కం కర్మలకు కలిగినప్పుడు అవి పునర్జన్మ హేతువులు కావు. అగ్ని సంపర్కంచే వేపిన విత్తనాలు మొలకెత్తవు కదా! అదే ముక్తి.

ఇప్పుడు మీకు విధి నిషేధ రూపమైన పుణ్య-పాప కర్మలను గూర్చి దాని ఫలితంగా వచ్చే స్వర్గ-నరకాదులను గూర్చి సంగ్రహంగా చెపుతున్నాను వినండి! మానసిక, వాచిక, కాయిక పాపములని మూడు విధాల పాపాలున్నాయి. మనస్సులో పరస్త్రీ, పరధనాలను

కోరుట, పరులకు హాని తలపెట్టుట, చేయకూడని పనియందు పట్టుదల ఈ నాలుగు మానసిక పాపములు. అనుచిత ప్రలాపము, అసత్యమును చెప్పుట, అప్రియమును పల్కుట, పరోక్షములో కొండెమును చెప్పుట ఈ నాలుగు వాచిక పాపములు. తినకూడని పదార్థములను తినుట, హింసించుట, వ్యర్థ కార్యముల యందు లగ్నమగుట, పరద్రవ్యాన్ని అపహరించుట. ఈ నాలుగు కాయిక పాపాలు. ఈ విధంగా పన్నెండు విధాలైన ప్రధాన పాపములు ఉన్నాయి. వీటిలోగల అవాంతర భేదం వల్ల పాపములు అనంతం. వాటివలన ప్రాప్తించే నరక యాతనలు కూడా అనంతం.

శివుని, శివభక్తులను, తల్లిదండ్రులను, గురువును, వేదమును, బ్రాహ్మణులను, సత్పురుషులను, శాస్త్రమును, గ్రహాలను, అన్నం పెట్టిన వానిని, పంచ భూతములను ఎవరైతే నిందిస్తారో వారికి నరకం నిశ్చయం. వేట, జూదము, సురాపానము, దేవ, బ్రాహ్మణ ద్రవ్యాపహరణ, ఇతరుల ఆస్తికి నష్టాన్ని కలిగించుట. ఇవి మహా పాతకాలు. నరక హేతువులు, ఆస్తిని పంచుకొనుటలో దాయాదులను మోసం చేయటం, దురహంకారాన్ని కలిగి ఉండటం, చేసిన మేలును మరచుట, ఇంద్రియ భోగముల యందు అధికమగు ఆసక్తి, కన్యను, పరస్త్రీని చెడగొట్టుట, జలములను కలుషితం చెయ్యటం, మోసగించి వైద్యం చెయ్యటం, స్వధర్మాన్ని విడిచి పరధర్మాన్ని స్వీకరించటం, తూకంలో మోసం, బాటసారులకు ఆటంకాన్ని కల్పించుట ఇవన్నీ మహా పాపాలు. పరోపకారమే పుణ్యం – పరపీడనమే పాపం. పుణ్యానికి ఫలం స్వర్గం, పాపానికి ఫలం నరకం. నరకముల పేర్లు కొన్ని చెపుతున్నా. రౌరవం, మహారౌరవం, సుఘోరం, మహాతమస్సు, విలోమము, కంటకం, తీవ్రవేగం, కరాలం, ప్రకంపనం, మహావక్రం, కాలసూత్రం, సూచీముఖం, బాదకం, కుంభీపాకం, సుపాకం, క్రకచం, అతిదారుణం, అంగారరాశిభవనం, మహాసంవర్తకం, తప్తజంతువు, పంకలేపం కుంభీపాకం ఇత్యాదులు అనేకం ఉన్నాయి.

## అన్నదాన మహిమ

సూత మహర్షి ఋషులతో ఇలా అంటున్నాడు: "మునులారా! ఈ జన్మలోను, జన్మాంతరమందు సుఖాలను కోరుకొనే మానవుడు ఆచరించవలసిన కొన్ని శుభకర్మలను గురించి చెపుతున్నాను వినండి. లోకంలో ప్రతి మానవుడు తన పేరు ప్రఖ్యాతులు, కీర్తి, ప్రతిష్ఠలు మరణానంతరం కూడా శాశ్వతంగా ఉండాలని కోరుకొంటాడు. తన వంశం ఆకల్పాంతం వర్ధిల్లాలని ఆశిస్తాడు. తన సంతానం తామర తంపరగా వృద్ధి చెందాలని కాంక్షిస్తాడు. మరణానంతరం శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలు

కోరుకొనే వారికి సప్తసంతాన ప్రతిష్ఠలు చెప్పబడ్డాయి. 1. పుత్రుడు, 2. శివాలయ ప్రతిష్ఠ, 3. తోటను (ఆరామమును) వేయించుట 4. చెరువును త్రవ్వించుట, 5. నూతిని త్రవ్వించుట, 6. పాంథశాల (సత్రము)ను నిర్మించుట, 7. కృతి స్వీకారము. సప్త సంతానములలోను నశించకుండ ఉండేది కృతి ఒక్కటే! ఉత్తముడైన పండితకవి రచించిన ఉత్తమ కావ్యానికి నాశనం లేదు.

మునులారా! కలవారు లేనివారికి దేనినైనా ఇచ్చి సహాయపడవచ్చు. లోకంలో దాన-ధర్మములని రెండు మాటలున్నాయి. వేద శాస్త్రాదులను పోషించే నిమిత్తం వాటిలో నిష్ణాతులైన ఉత్తమ గుణ, శీలాదులుగల విప్రులకు సత్కార రూపంలో ఇచ్చేదానికి 'దానము' అని పేరు. పేదరికంతో బాధపడే వారికి సహాయం చేస్తే దానికి 'ధర్మము' అని పేరు. దాన-ధర్మములు రెండూ గొప్పవే!

దానము లన్నిటిలోను అన్నదానం చాలా గొప్పది అని ప్రాచీన ఋషులు చెప్పారు. దానిని మించిన దానం లేదు. అన్నదానం వెంటనే ప్రీతిని, ఉల్లాసాన్ని కలిగించి బలాన్ని, బుద్ధిని వర్ధిల్ల చేస్తుంది. సకల ప్రాణులు అన్నం నుండి పుట్టుతున్నాయి. అన్నం లేనిచో మరణిస్తాయి. రక్తము, మాంసము ఇత్యాది సప్తధాతువులు అన్న రసం నుండే ఉద్భవిస్తున్నాయి. చివరిదైన శుక్రధాతువునుండి ప్రాణులు పుట్టుతున్నాయి. గర్భస్థ శిశువులు మొదలుగా దేవదానవుల వరకు అందరూ అన్నమునే కోరుతూ ఉన్నారు. అన్ని రోగాలలోను ఆకలి రోగం చాలా పెద్దది. అన్నం అనే ఓషధీ, లేపంచే అది నశిస్తుంది. ఆకలితో సమానమైన దుఃఖం లేదు. హితకరమైన భోజనాన్ని తృప్తిగా ఆరగించి ఆరోగ్యంగా ఉండటం కంటె మించిన సుఖంలేదు. కోపముతో సమానమైన శత్రువు లేడు. అన్నదానం చేస్తే ప్రాణదానం చేసినట్లే. ప్రాణదానం చేస్తే సర్వమూ ఇచ్చినట్లే. అన్నదానం చేసిన వాడు తన కోసం పరలోకంలో గొప్పనిధిని భద్రంగా ఏర్పాటు చేసికొన్నవాడే అగుచున్నాడు. అన్నం సాక్షాత్తు బ్రహ్మ స్వరూపం! నారాయణ స్వరూపం! పరమేశ్వర స్వరూపం! సాక్షాత్తు త్రిమూర్త్యాత్మకమైన పరబ్రహ్మ స్వారూపం! భూత, భవిష్య, వర్తమాన కాలాలలో అన్నదానాన్ని మించిన దానం లేదు, ఉండబోదు. అన్నదానాన్ని చేసిన వానికి ఎన్ని జన్మలెత్తినా అన్నానికి కొరత ఉండదు. అన్నవస్త్రాలకు లోటు ఉంటే అదే దైన్యం. దైన్యం లేని జీవితాన్ని ప్రతి మానవుడు వాంఛిస్తాడు. కనుక ప్రతి మానవుడు ఉన్నంతలోనే అన్నదానం చెయ్యాలి! అన్నం దానాన్ని చేసిన వాడు శాశ్వత బ్రహ్మలోకాన్ని పొందుతాడు! ఇది వేదం చెప్పిన సత్యం!

**తటాకారామ మహిమాను వర్ణనము**

మునులారా! సమస్తమైన దానాలలోను త్రాగునీటిని దానం చేయటంకంటె ఉత్తమమైన దానం లేదు. జలం ప్రాణాధారమైనది కనుక దానికి జీవనము అని పేరు. శాశ్వత పుణ్యలోకాలను కోరే మానవుడు వాపీకూప తటాకాదులను నిర్మించాలి. సర్వకాలాలలోను చలివేంద్రాలను ఏర్పాటుచేసి మధుర జలాలను అందించాలి. చెరువును త్రవ్వించటం గొప్ప పుణ్యకార్యం. ఉద్భిజ్జ, అండజ, స్వేదజ, జరాయుజములనే నాలుగు రకములైన ప్రాణులకు చెరువులోని జలం ప్రాణాధారమవుతున్నది కనుక చెరువును త్రవ్వించిన వ్యక్తి ఆ ప్రాణులన్నిటికి ప్రాణదానం చేసిన వాడగుచున్నాడు. ఇంతకంటె గొప్ప పుణ్యం ఏముంది? చెరువును త్రవ్వించిన పుణ్యమూర్తి భూలోకంలో ఆ చెరువు ఉన్నంతవరకు మరణానంతరం ఆదిత్యలోకంలో హాయిగా ఉంటాడు. జలదానం చేసినవాని పాపాలు ఇక్కడే పటాపంచలవుతాయి.

దేవతలు, గంధర్వులు, పితృ దేవతలు, నాగులు, రాక్షసులు, మనుష్యులు, చెట్లు, జలచరాలు ఇలా ఒకటేమిటి సమస్త ప్రాణులు జలాలను ఆశ్రయించుకొనే జీవిస్తున్నాయి. చెరువును త్రవ్వించిన వానికి సహస్రాధిక గోదానఫలం, అగ్నిష్టోమం మొదలుగా అశ్వమేధం వరకు క్రతువులను ఆచరించిన ఫలం లభిస్తుందని విద్వాంసులు అంటున్నారు. లోకులు ధర్మ, అర్థ, కామాలను సాధించటానికి జలాశయంలోని జలం సాధనభూత మవుతున్నది కనుక అట్టి జలాశయాన్ని నిర్మించిన పుణ్యమూర్తికి లోకులు ఆర్జించిన పుణ్యంలో సగం పుణ్యం లభిస్తుందని వేదవేత్తలు అంటున్నారు.

మునులారా! ఇప్పుడు చెట్లను నాటటం వలన వచ్చేఫలాన్ని చెపుతున్నాను వినండి. లోకులకు పుత్ర సంతానంతో సమానమైన ప్రేమ చెట్లమీద ఉంటుంది. చెట్లు తమ పూలతో ఫలాలతో సమస్త దేవతా గణాలను, మానవులను సంతృప్తి పరుస్తున్నవి. నీడతో అతిథులను ఆదరిస్తున్నవి. మఱ్ఱి, రావి, జువ్వి, మేడి, మారేడు ఇత్యాది పవిత్రమైన వృక్షాలను ఆశ్రయించుకొని అనేక దేవ, రాక్షస గణాలు ఉంటాయి. చెట్టు ఏదైనా అది ఓషధియే. దాని మహాత్మ్యం అనంతం. మానవుడు వృక్షం యొక్క భాషలో మాట్లాడ గలిగితే ఆ వృక్షం ఇచ్చే ఫలం అనంతం. మానవజాతి అభ్యుదయమంతా వృక్షసంపద మీదనే ఆధారపడి ఉంది. చెట్టు పుత్రునితో సమానం. అకారణంగా ఆకును కూడా కోయకూడదు. కొమ్మను నరికిన వాడు మరుజన్మలో బాహువులు లేనివాడై పుడతాడు. లేదా చేతులను పోగొట్టుకొన్న వాడవుతాడు.

సప్త సంతాన ప్రతిష్ఠను, సత్యవ్రతాన్ని పాటించిన మానవునకు స్వర్గం నిశ్చయం. సత్యమే పరంబ్రహ్మ! సత్యమే గొప్ప తపస్సు! సత్యమే యజ్ఞము! సత్యమే పాండిత్యం! సత్యమే పరమపదం! సత్యమే సర్వానికి ఆధారభూతమై నిల్చి ఉంది. పుణ్యము, దేవపూజ, పితృపూజ, ఋషిపూజ, విద్య, మంత్రములు, పంచభూతములు, దానములు, బ్రహ్మచర్యము, సరస్వతి, సూర్యుడు, చంద్రుడు, సర్వవేదములు సత్యము యొక్క స్వరూపములే! వేయి అశ్వమేధములు, లక్ష క్రతవులు ఆచరించిన వచ్చే ఫలం, సత్యం యొక్క ఫలంకంటె తక్కువే! బ్రాహ్మణులయందు ఎన్ని ధర్మాలు, ఎన్ని సుగుణాలు ఉన్నా సత్యవ్రతం లేనినాడు అవన్నీ వ్యర్థమే! మానవులందరు సత్యవ్రతులైననాడు దుఃఖానికి తావు లేదు.

**తపస్సు యొక్క మహిమ**

ఋషులారా! మీకిప్పుడు తపస్సు యొక్క ఫలాన్ని గూర్చి చెపుతున్నాను వినండి. తపస్సు వలన ఇహలోకంలో సమస్త సంపదలు లభిస్తాయి. పుత్రులు కలుగుతారు, స్వర్గం లభిస్తుంది, మోక్షం సిద్ధిస్తుంది. భోగ, భాగ్యాలు కలుగుతాయి. తపస్సువలన పరమేశ్వర సాక్షాత్కారాన్ని పొందుతారు. సర్వమైన దేవతలు, త్రిమూర్తులు, సూర్యచంద్రులు ఒకరేమిటి లోకపాలక వ్యవస్థలో ఉన్నవారంతా తపస్సుచేతనే ఆయా ఆధికారిక స్థానాలను పొందియున్నారు. లోకులకు మేలుకీడులను ఒసగే గ్రహ, నక్షత్రాలు తపస్సు చేతనే జ్యోతిర్మయ స్వరూపాన్ని పొంది ప్రకాశిస్తున్నాయి. పారమార్థిక జ్ఞానం, లౌకిక విజ్ఞానం, ఆరోగ్యం, సంపద, సౌభాగ్యం, సౌందర్యం, సుఖం సమస్తము తపస్సు వలననే సాధ్యమని వేదవిదులు అంటున్నారు. విశ్వామిత్రుడు కఠోరమైన తపస్సును ఆచరించి బ్రహ్మజ్ఞాని అయ్యాడు. బ్రహ్మజ్ఞానాన్ని పొందిన తదుపరి పొందదగిన వస్తువు ముల్లోకాలలోను లేదు.

**పురాణ మహిమ**

మునులారా! అరణ్యంలో కందమూలాలను భక్షిస్తూ తపస్సు చేయటంకంటె వేదాధ్యయనము ఉత్తమం. అధ్యయనంకంటె తాను నేర్చిన విద్యను శిష్యులకు బోధించటం శ్రేష్ఠం. అంతకంటె పురాణాలను అధ్యయనం చేసి లోకులకు చెప్పటం అత్యుత్తమం. వేదశాస్త్రాధ్యయనంలోని శ్రమను గుర్తించి పితామహుడు సర్వమైన విజ్ఞానము లోకులందరకు అందుబాటులోనికి రావాలనే ఆకాంక్షతో ఈ పురాణ ప్రక్రియను సృష్టించాడు. పురాణాలలో లేని విజ్ఞానం బయట ప్రపంచంలో లేదు. బయట ప్రపంచంలో ఉన్న విజ్ఞానం పురాణాలలో చెప్పకుండ విడువబడలేదు. సూర్యచంద్రులు లేని యెడల జగత్తు అంధకారబంధురమవుతుంది. అలాగే పురాణాలు లేకపోతే సాహిత్య

సృష్టికి ఆధారభూతమైన కథా వాఙ్మయం లేదు. ధర్మ, అర్థ, కామ, మోక్షాలను సాధించటానికి సాధనమైన ఉపాయాలను, వాటికి సంబంధించిన విధి, నిషేధాలను పురాణాలద్వారానే తెలుసుకొనాలి. సృష్టి, స్థితి, లయములను గూర్చి ప్రాచీన రాజవంశాల చరిత్రను గూర్చి పురాణాలలో విపులంగా చెప్పబడింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను గురించిన గాథలు, పంచభూతములు, అష్టదిక్పాలకులు ఇతర దేవతలకు సంబంధించిన గాథలు, ఉపాసనా పద్ధతులు, కర్మకాండ, రాజనీతి, లోకనీతి, ధర్మ–అధర్మములను గురించిన విచారణ ఇలా ఒకటేమిటి సమస్తమైన విషయాలు వేదం ఆధారంగా పురాణాలలో చెప్పబడ్డాయి. పురాణాలను చదవకుండా ఎంతటి విద్వాంసుడైనా వేద తాత్పర్యాన్ని గ్రహించలేడు.

పురాణవేత్త విద్వాంసులందరిలోను శ్రేష్ఠుడు! వేదవేత్తలైన వారికంటె పూజ్యుడు! సర్వజ్ఞుడు! పురాణ ప్రవచనంచే దేవతలందరు సంప్రీతులవుతారు. పురాణము లన్నింటిలోను శివపురాణం శ్రేష్ఠం. అసలు మానవజన్మయే దుఃఖభూయిష్టం. అందులోను కలియుగంలో మానవుడు విషక్రిమి న్యాయంతో బ్రతుకుతాడు. పాపం నుండి జన్మ, జన్మ నుండి పాపం పుట్టుతున్నాయి. పాపం నుండి లేదా దుఃఖం నుండి విముక్తిని పొందటానికి పురాణ పఠనం, లేదా శ్రవణం ఈ రెంటికంటె మించిన ఉత్తమ సాధనం లేదు. ధనవంతుడైన మనుజుడు ఉత్తముడైన బ్రాహ్మణ విద్వాంసుని చేత ప్రయత్న పూర్వకంగా ఏదేని ఒక ఆలయంలోగాని, మంటపంలోగాని, సభాభవనంలోగాని పురాణాన్ని చెప్పించాలి. దుష్టమైన ఈ కలిలో మోక్షప్రాప్తికి ఇంతకంటె సులభమైన తరుణోపాయం లేదు.

**దాన–ధర్మముల విచారణ**

మునులారా! పుణ్య–పాప కర్మల విచారణ అతి గహనమైనది. ఒక పువ్వునుగాని, ఆకునుగాని ప్రయత్నపూర్వకంగా కోసి చెట్టునుండి వేరు జేస్తే పాపమే! వాటితో భగవంతుని అర్చిస్తే పుణ్యం. కనీసం దర్భను కోసినా పాపమే. ధర్భలతో అగ్నిని అర్చిస్తే పుణ్యం. పచ్చగడ్డిని కోస్తే పాపం, ఆ గడ్డితో గోవును మేపితే పుణ్యం. నిజానికి ఇవి అత్యల్ప విషయాలు. వీటికి కోటిరెట్లు అధికమైన బ్రాహ్మణహత్య పర్యంతముగల అనేకమైన పాపకృత్యాలను చేస్తున్నాడు మానవుడు. రోగానికి మందు ఉన్నట్లే ప్రతి పాపానికి పరిహారం కూడా ఉంది. పాపపరిహారార్థం దానములను చెయ్యవలసిందని చెప్పారు పూర్వ ఋషులు. దప్పిగొన్న వానికి మంచినీళ్ళను దానం చెయ్యటం మొదలుగా అన్నదాన, వస్త్రదాన, గృహదాన, భూదాన, విద్యాదాన, గోదాన, సువర్ణదాన పర్యంతము అనేక దానాలను మహర్షులు చెప్పారు. దానాలను చెయ్యటం వలన పాపక్షయం ఒక్కటే గాదు పుణ్యలోకప్రాప్తికూడా లభిస్తుంది.

ఐతే దానం ఎవరికి చేయాలి అనే ప్రశ్న రాగా చక్కని గుణశీలాదులుగల వేదశాస్త్ర పారంగతుడైన బ్రాహ్మణునకు మాత్రమే దానం చేయాలని ఋషులు చెప్పారు. విప్రుని ఆశ్రయించుకొని వేదశాస్త్రాదులు బ్రతుకుతున్నాయి. అతి కఠినమైన వేదశాస్త్రాధ్యయనం చేసి బ్రాహ్మణుడు జీవిస్తున్నాడు. ఆపైన బ్రాహ్మణునకు యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహములనే షట్కర్మాధికారములున్నాయి. బ్రాహ్మణునకు మాత్రమే ఇచ్చేది దానం. ఇతరులకిచ్చేది ధర్మం. బ్రాహ్మణులకు అన్నం పెడితే అది సమారాధన ఇతరులకు అన్నం పెడితే అది సంతర్పణ. సర్వధర్మ సారభూతమైన అహింసా వ్రతంతో బ్రాహ్మణుడు జీవిస్తున్నాడు. వేదాధ్యయనంతో, అగ్నికార్యంతో సకల దేవతా సమూహాన్ని సంతృప్తులుగా చేస్తున్నాడు. బ్రాహ్మణుడు మాతృగర్భం నుండి బయటకు వస్తూనే “నా వలన ఏ ప్రాణికీ భయం లేదు!” అని సకల ప్రాణులకు అభయమును ఇస్తూ జన్మిస్తున్నాడు. అట్టి బ్రాహ్మణుడు గ్రామానికి ఒక్కడున్నా ఆ గ్రామం సకల సౌభాగ్యాలతో, సుఖశాంతులతో వర్ధిల్లుతుంది. గ్రామంలోని సంపన్నులైన పెద్దలు ప్రయత్నపూర్వకంగా ప్రార్థించి అయినా సరే అట్టి బ్రాహ్మణుని గ్రామంలో నిలుపుకోవాలి. అట్టి కృత్యం సర్వులకు శ్రేయోదాయకం.

మునులారా! దానకృత్యాలను ఆచరించటంలోగల పరమార్థాన్ని చెపుతున్నాను వినండి. వేదాధ్యయన సంపన్నుడు, స్నాన సంధ్యానుష్ఠాన తత్పరుడు, జ్ఞాననిష్ఠాగరిష్ఠుడు, వేదశాస్త్ర అధ్యాపకుడు ఐన వానికి మాత్రమే దానమివ్వాలి. అట్టి బ్రాహ్మణుడు లభించని యెడల చక్కని గుణశీలాదులు కల బ్రాహ్మణునికి దానమివ్వాలి. వేదశాస్త్రాధ్యయనం చేసిన బ్రాహ్మణుని దానాదులచే ప్రోత్సహిస్తే వేద విద్యను ప్రోత్సహించినట్లే. తద్వారా సకల దేవతలు సుప్రసన్నులవుతారు. వేదం పరమాత్మ స్వరూపం కదా!

‘నేను’ అనే అహంకారము, ‘నాది’ అనే మమకారము ఈ రెండే మానవుని దుఃఖానికి కారణం. దానాదులను ఆచరించటం వలన ఆ రెండింటి నుండి మానవుడు ముక్తుడవుతాడు. ఎలాగంటె నిజానికి జీవుడు తత్త్వంలో ఈశ్వరుడే ఐనా ‘నేను’ అనే అహంకారం వలన పరిచ్ఛిన్న భావాన్ని పొంది అఖండ అద్వయ చైతన్యం నుండి వేరై, తననుతాను జీవునిగా భావించుకొంటూ ద్వైత భావాన్ని పొందుతున్నాడు. ‘అహం’ భావనతో కర్మాచరణ నిమగ్నుడవుతున్నాడు. తద్వారా ధనార్జన చేస్తున్నాడు. ఆ ధనంతో గృహ, ఆరామ, క్షేత్ర, వాహన, సువర్ణాదికాలను సముపార్జిస్తున్నాడు. ‘నేను’ అనే ద్వైత భావంతో కష్టపడి ధనార్జన చేసి సంపాదించుకొన్న వస్తువులందు సహజంగానే అహంకార-మమకారములు

ఏర్పడుతాయి. ఆ రెంటిని విడిచిన వాడెవడో వాడే వాటిని దానం చేయగలుగుతాడు. నాది అనే మమకారాన్ని చంపుకొనకుండా ఒక జీర్ణవస్త్రాన్ని కూడా బిచ్చగానికి సైతం ధర్మం చెయ్యలేం గదా! ఆ విధంగా దానాదికాది కర్మాచరణ అహంకార, మమకార నిర్మూలనకు తోడ్పడి చిట్టచివరకు జీవునకు ఆత్యంతిక దుఃఖనివృత్తి రూపము, పునరావృత్తి రహితము ఐన అద్వైత మోక్షసిద్ధికి హేతువు అవుతూన్నది! కేవలం ఒక్క త్యాగం వలన మాత్రమే మానవుడు మృత్యుభయాన్ని వీడి అమృతుడు అగుచున్నాడు! ఇది వేదం చెప్పిన సత్యం.

**బ్రహ్మాండ దానమహిమ**
**బ్రహ్మాండ వర్ణనము**

సూత మహర్షి ఋషులతో ఇలా అంటున్నాడు. "మునులారా! అన్ని దానములలోను బ్రహ్మాండదానం చాలా గొప్పది. ఈ దానం మానవుని ప్రకృతిబంధం నుండి తప్పించి ముక్తికి హేతుభూత మవుతూన్నది. ఈ దానాన్ని చేయగోరే మానవుడు ముందుగా శివపురాణాన్ని పఠించి, తద్వారా బ్రహాండ స్వరూపాన్ని ఆకళింపు చేసికొని అట్టి బ్రహ్మాండాన్ని గుణశీలాదులు కల బ్రాహ్మణునకు దానిమిస్తూన్నట్లుగా భావించి ప్రత్యామ్నాయంగా ధనాన్ని దానం చెయ్యాలి. ముందుగా బ్రహ్మాండ స్వరూపాన్ని సంక్షేపంగా చెపుతాను వినండి. నామరూపాదులు లేని శివతత్త్వం నుండి ఆవిర్భవించిన త్రిమూర్తులలో ఒకడైన బ్రహ్మనుండి ఈ బ్రహ్మాండం వ్యక్తమైంది. ఈ బ్రహ్మాండంలో ఏడు ఊర్ధ్వలోకములు, ఏడు అధోలోకములు ఉన్నాయి. వీటికి ఆధారభూతము సర్పము, సర్పమే విష్ణువు అని కీర్తించబడుతూన్నది. దేవతలు, ఋషిగణాలు ఆ విష్ణువునే అనంతుడు అని ప్రశంసిస్తున్నారు. ప్రకాశించే స్వస్తికయే ఆభరణంగాగల అనంతుడు తన వేయి తలలతో ఈ బ్రహ్మాండాన్ని ధరిస్తున్నాడు, భరిస్తున్నాడు. ఆ అనంతుడు అనంత శక్తిస్వరూపుడు. శేషుడు అనికూడా పిలువబడే ఆ అనంతుడే సంకర్షణుడు. అతనే రుద్రుడు. ప్రళయకాలంలో అతని నోటినుండి భయంకరమైన విషాగ్ని జ్వాలలు ఉద్భవించి లోకాలను దహించివేస్తాయి. ఆ అనంత శక్తిమంతుడైన శేషుడు ఈ భూమిని సిగపూవుగా భరిస్తున్నాడు. మదఘూర్ణిత లోచనుడైన అనంతుడు సాగినప్పుడు కుల పర్వతకానన సహితమైన ఈ భూమి కంపిస్తుంది.

అతల–వితల–సుతల–రసాతల–తల–తలాతల–పాతాళములు అను అధోలోకములు ఏడున్నాయి. అక్కడి భూములు, ప్రాసాదములు అన్నీకూడా శ్రేష్ఠమైన రత్నములచే ప్రకాశిస్తూ ఉంటాయి. అవన్నీ హిరణ్మయ సమృద్ధిగల లోకములు. అక్కడ సూర్యచంద్ర ప్రకాశం ఉండదు. స్వచ్ఛమైన మణుల ప్రకాశంచే ఆ లోకాలు వెలుగుతూ ఉంటాయి. అక్కడ

పగలు, రాత్రి, చలి, ఎండకాలము అనేవి లేవు. ఆ లోకాలు స్వర్గంకంటె ఉన్నతమైన భోగభూములు. అక్కడ దానవులు, దైత్యులు, నాగజాతులు, మహానాగములు, రాక్షసులు నివసిస్తూ ఉంటారు. మొదటగా వాటిని చూచి లోకానికి వెల్లడి చేసినవాడు నారద మహర్షి.

మునులారా! మీకిప్పుడు నరకములను గూర్చి చెపుతున్నాను వినండి. దుఃఖమునకే పాపమని, నరకమని పేర్లు. సుఖమునకే పుణ్యమని, స్వర్గమని పేర్లు. సుఖములన్నీ దుఃఖాంతములే! మానవుని అంత్యావస్థ అయిన మరణదశలో అనుభవించే మరణయాతనకంటె మించిన దుఃఖం ఏముంటుంది? అట్టి మరణభయం నిత్యము నీడలా వెన్నాడుతుంటె సుఖం అనేది ఎక్కడుంది? సుఖం అంటే మరణభయం కొద్దిసేపు స్మృతిపథంలో లేకపోవటమే! వాక్కుచే పరనింద మొదలుగా గోహత్య, బ్రహ్మహత్య పర్యంతము పాపపు పనులను చేసిన మనుజులు ఆ నరకలోకాలలో దారుణమైన దుఃఖాన్ని అనుభవిస్తారు. క్రియకు–ప్రతిక్రియ అలాగే చర్యకు ప్రతిచర్య తప్పదు. కర్మలు ఎప్పుడూ నిష్ఫలం కావు. నిష్ఫల కర్మ అంటూ ఉండదు.

కర్మలన్నింటిలోను సారము (పంట), వ్యర్థము (పొల్లు) అనే ఈ రెండూ ఉంటాయి. మధుర పానీయాలు, పాలు, పండ్లు, జలము, అన్నము వీటినుండి కూడా మాలిన్యం ఉత్పన్నమవుతున్నది కదా! బంగారంలో సైతం మాలిన్యం ఉంది కదా! విధాత చేసిన సృష్టికార్యంలో సారభూతమైన లోకాలు ఉత్తమ లోకాలైన స్వర్గాదులు కాగా... మలిన (వ్యర్థ) పదార్థాలతో కూడుకొన్న లోకాలు నరకాదులు. మరణానంతరం పుణ్యకార్యాచరణ చేసిన జీవులకు ఉత్తమలోకప్రాప్తి, పాపాలను చేసిన జీవులకు దుఃఖభూయిష్ఠమైన నరకలోక ప్రాప్తి అనే వ్యవస్థ సృష్టి ప్రారంభంలోనే పితామహునిచే నిబంధన చేయబడి ఉంది. సృష్టి అంతా ద్వైతమే! సృష్టికర్త అద్వితీయుడు! సృష్టికర్త అయిన పితామహుని కర్మజనితమైన సృష్టికార్యంలో వెలువడిన వ్యర్థపదార్థములతో కూడుకొన్న లోకాలకే నరకములు అని పేరు. ద్వైతం అంటే రెండు లేదా అంతకంటె ఎక్కువ అని అర్థం. కర్మ ఎప్పుడూ ద్వైతమే! ద్వైతం ఉన్నచోట సుఖ దుఃఖములు తప్పవు. కేవలం సారభూతమైన దానిని ఆశించియే మానవుడు కర్మలను ఆచరిస్తాడు. ప్రపంచం ద్వైతం కనుక సారంతోపాటే వ్యర్థ పదార్థం కూడా పుడుతుంది. సారమైనది సుఖాన్ని ఇస్తుంది. మాలిన్యం (వ్యర్థ పదార్థం) దుఃఖాన్ని కల్పిస్తుంది. పానీయం నుండి మూత్రం, అన్నం నుండి మలం, ధాన్యం నుండి పొల్లు, చెరకు నుండి పిప్పి ఇలా ప్రతి ఒక్క దాని నుండి వ్యర్థం పుడుతూన్నది. కర్మలు ఎప్పుడూ

మలినాశ్రయములే! పంచభూతాత్మకమైన సృష్టికార్యంలో మాలిన్యం లేకుండా ఎలా ఉంటుంది? జ్ఞానం ఒక్కటే ఏ మాలిన్యము అంటని వెలుగుముద్ద. అట్టి స్వయం ప్రకాశస్వరూపుడు శివుడు!

ఈ ద్వైత ప్రపంచంలో, కేవలం సుఖాన్ని మాత్రమే కోరి మానవుడు ఆచరించే కర్మలనుండి, సుఖప్రాప్తికి హేతుభూతమైన కర్మఫలసారము (పరిశుద్ధము), దానితోపాటే మాలిన్యము (అపరిశుద్ధం) పుడితే పుట్టనీయండి! అది పాపం ఎందుకవుతుంది? పాపం అనేది ఎలాపుడుతుంది? అనేది ప్రశ్న? మునులారా! వినండి! దుర్బుద్ధితో, దుష్టచింతనతో, ద్రోహతలంపుతో, మలినమైన మనస్సుతో, కపట చిత్తంతో, చేసిన కర్మ ఏదైనా పాపకృత్యమే అవుతుంది. దానికి ఫలం మలినభూయిష్ఠమైన, దుర్గంధ పూరితమైన నరకం. అంతేకాదు...

అవిద్యతో, అజ్ఞానంతో, అహంకారంతో చేసిన పుణ్యకర్మలుకూడా బంధములే అవుతాయి. అవి మోక్ష హేతువులు కాజాలవు. సర్వము ఈశ్వరాధీనం అనే జ్ఞానంతో చేసిన కర్మలు ముక్తి సాధనములు అవుతాయి. స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తు అంతయు జ్ఞాన స్వరూపుడైన శివునికంటె భిన్నంగా లేదు అను నిశ్చయ జ్ఞానమే అద్వైతసిద్ధికి హేతువు. ఈ జ్ఞానాన్ని పొందటంకంటె మించిన జపం, తపస్సు, యోగం, అగ్నిహోత్రం, హోమం, వ్రతం, ఉపాసన, దానం, ప్రాయశ్చిత్తం ఇత్యాది కర్మలు లేనేలేవు. కర్మాచరణ జ్ఞానలబ్ధి కొరకే. అట్టి జ్ఞానాన్ని పొందిన తదుపరి కర్మలతో పనేముంది?

నిష్కామ కర్మాచరణ–ఈశ్వరార్పణబుద్ధి ఈ రెండే మోక్ష సాధనాలు! సుఖప్రాప్తి హేతువులు! మిగిలినవన్నీ దుఃఖప్రాప్తికి హేతువులు.

**పురుషార్థ నిరూపణం**

ఋషులారా! జీవుడు తత్త్వంలో శివస్వరూపుడై ఉండికూడా అజ్ఞానంచే ఆవరింపబడి, ప్రకృతిమాయా మోహితుడై దుఃఖపీడితుడగుచున్నాడు. ఎవరైతే పవిత్రమైన కర్మలను చేస్తూ, పరిశుద్ధమైన మనస్సుతో, నిత్యము శివుని చక్కగా ఆరాధిస్తారో వారు ఇహంలో దుఃఖాన్ని దాటి మరణానంతరం శివసాయుజ్యాన్ని పొందుతారు. జన్మయెత్తిన ప్రతి మానవుడు ధర్మ–అర్థ–కామ–మోక్షములనే చతుర్విధ పురుషార్థాలను తప్పక సాధించాలి. దుర్లభమైన మానవజన్మను పొంది కూడా ఎవడైతే వాటి కొరకు ప్రయత్నించడో వాని జన్మ వ్యర్థం. ముందుగా ధర్మ స్వరూపాన్ని తెలుసుకొని ఆపైన ధర్మబద్ధమైన అర్థకామాలను సాధించిన వానికి మోక్షం కరతలామలకం.

మునులారా! ఎవరైతే పవిత్రమైన కర్మలను ఆచరిస్తూ, పరిశుద్ధమైన మనస్సుతో నిత్యము ఆ శివుని చక్కగా ఆరాధిస్తారో వారికి శివ సాయుజ్యం నిశ్చయం. దుఃఖ రహితమైన శివలోకాన్ని తపస్సు చేయనివారు పొందలేరు. సకలదేవతా సమూహాలు, ఋషులు మరియు మునులు తపస్సు యొక్క ప్రభావం చేతనే స్వర్గాది ఉత్తమ లోకాలను పొందియున్నారు. ఇది ప్రత్యక్షం మరియు సత్యము. సర్వమును తపస్సుచే సాధింపవచ్చు. త్రిమూర్తులు, దేవీమూర్తులు అందరు నిత్యము తపస్సునందు ఉన్నవారై దుర్లభమైన ఫలాన్ని పొందారు.

ఆ తపస్సు సాత్త్విక-రాజస-తామస భేదంచే మూడు విధాలుగా ఉంది. దేవతలు, ఊర్ధ్వరేతస్కులగు యతులు సాత్త్విక తపస్సును, దానవులు మరియు మానవులు రాజస తపస్సును, రాక్షసులు మరియు క్రూరమైన పనులను చేయుటయందు ఆసక్తిగల మానవులు తామస తపస్సును ఆచరిస్తారు. జపము, ధ్యానము, భక్తితో దేవతలను పూజించుట అనునవి శుభకరమైన సాత్త్విక తపస్సు. కోర్కెలతో చేసేది రాజసిక తపస్సు. దేహాన్ని శోషింపచేసి, మిక్కిలి పీడకు గురిచేసి సహించుటకు కష్టమైన విధంగా చేస్తే అది తామసిక తపస్సు.

**జీవుని పుట్టుక**

మునులారా! మీకిప్పుడు జీవుని పుట్టుక క్రమాన్ని సంగ్రహంగా వివరిస్తున్నాను వినండి. దీని శ్రవణం వలన వైరాగ్యం కలుగుతుంది. తద్వారా సంసారం మీద విరక్తి కలుగుతుంది. విరక్తి కలిగిన మరుక్షణంలో జన్మరాహిత్యానికి ఉపాయాన్ని అన్వేషిస్తాడు మానవుడు. అట్టి పునరావృత్తి రహితమైన స్థితియే మోక్షం.

మనం తినే ఆహారం జీర్ణమైన తదుపరి రెండు విధాలుగా విడిపోతుంది. అందులో సారభూతమైన అన్నరసం దేహంలో ప్రసరించి శరీరానికి పుష్టిని చేకూరుస్తుంది. మాలిన్యం విసర్జింపబడుతుంది. చెవులు, కన్నులు, ముక్కు, నాలుక, దంతములు, జననేంద్రియము, విసర్జనేంద్రియము, గోళ్ళు, శరీరము ఇవి మాలిన్య స్థానములు. గులిమి, పుసి, కఫము, చెమట, మలమూత్రములు ఇత్యాదులు ఈ మాలిన్యములు పంద్రెండు రకాలుగా ఉన్నాయి. నాడులన్నీ అన్నివైపులనుండి హృదయ పద్మానికి కలుపబడి ఉన్నాయి. మన శరీరంలో ఉండే ప్రాణశక్తి సూక్ష్మమైన అన్నరసాన్ని నాడుల యొక్క ముఖ స్థానాలలో స్థాపిస్తుంది. అంతేకాకుండ ప్రాణశక్తి ఆ నాడులను అన్నరసంతో నింపుతుంది. ఈ విధంగా అన్నరసం దేహమంతా ప్రసరిస్తుంది. తరువాత నాడుల మధ్యనున్న అన్నరసాన్ని శరీరం జీర్ణం చేసికొని తనలో కలుపుకొంటుంది. ఈ జీర్ణ ప్రక్రియ లేదా పచనం రెండు విధాలుగా సాగుతుంది.

ముందుగా శరీరం చుట్టూ చర్మం నిర్మాణమై తరువాత రక్తం పుడుతుంది. రక్తం నుండి రోమములు, మాంసము పుట్టుతాయి. మాంసం నుండి శిరస్సుపై కేశములు కండరములు సంభవిస్తాయి. కండరముల నుండి ఎముకలు, ఎముకల నుండి గోళ్ళు మరియు ఎముకల మధ్యనుండే మజ్జ సంభవిస్తాయి. అన్నరస పరిణామక్రియలో ఈ మజ్జనుండే శుక్రం ఉద్భవిస్తుంది. శుక్రమే సంతాన హేతువు. ఈ విధంగా అన్నం పన్నెండు రూపములుగా పరిణమిస్తోంది. అన్నం నుండి శుక్రము, శుక్రము నుండి మరొక చేతన దేహము పుట్టుతూన్నది.

దోష రహితమైన శుక్రము ఋతుకాలమందు స్త్రీ జననేంద్రియ మందు నిక్షిప్తమై అచటి ప్రాణశక్తితో కూడిన, దోషరహితమైన స్త్రీ యొక్క రక్తంతో ఐక్యమవుతూన్నది. అజ్ఞానావృతుడైన జీవుడు పూర్వ కర్మలచే నియంత్రింపబడి స్త్రీ యోని యందు శుక్రమును నిక్షేపించు సమయంలో సూక్ష్మరూపంలో స్త్రీ గర్భంలో ప్రవేశిస్తాడు. ఆ విధంగా స్త్రీ పురుషుల శోణిత–శుక్రసముదాయం గర్భాశయము అనే ఏక స్థానమందు కలుసుకొని ఒక రోజు సమయంలో పిండ రూపాన్ని ధరిస్తుంది. ఐదు రోజులలో ఆ పిండం బుడగ ఆకారాన్ని పొందుతుంది. ఆ బుడగ ఏడు రోజులలో మాంసపేశంగా మారుతుంది. ఆ మాంసపు ముద్దలో రెండు మాసాల లోపులో మెడ, తల, భుజములు, వెన్నెముక, పొట్ట, చేతులు, కాళ్ళు, పార్శ్వ భాగములు, నడుము ఇలా ఒక పూర్ణ శరీరం పుట్టటానికి అవసరమైన సంస్థానం ఏర్పాటవుతుంది.

మూడు మాసాలలో కీళ్ళు, నాలుగు మాసాలలో వ్రేళ్ళు, అయిదు మాసాలలో క్రమంగా నోరు, ముక్కు, చెవులు ఏర్పాటవుతాయి. ఆరు మాసముల లోపులో పళ్ళవరుస, జననేంద్రియము, గోళ్ళు మరియు చెవుల లోపలి రంధ్రము ఏర్పాటవుతాయి. ఏడు మాసాలలో విసర్జనేంద్రియము, మూత్రాశయము, జననేంద్రియము, నాభి మరియు శరీర అవయవముల యందలి కీళ్ళు నిర్మాణమై ఆ శిశువు సర్వావయవ పరిపూర్ణుడై తల్లిగర్భంలో జరాయువు (మావి లేక పిండాన్ని చుట్టి ఉండే పొర) చేత కప్పబడి ఉంటాడు.

ఆ శిశువు తల్లి తీసికొనే ఆరు రుచులతో కూడిన ఆహారాన్ని నాభినాళం ద్వారా స్వీకరిస్తూ దినదిన ప్రవర్ధమానుడై ఉంటాడు. అంగప్రత్యంగ పూర్ణుడైన ఆ జీవుడు స్మృతి జ్ఞానాన్ని కలిగి ఉంటాడు. ఆ జ్ఞానం కారణంగా పూర్వ జన్మలలో తాననుభవించిన సుఖ దుఃఖాలు, చేసిన పుణ్య పాపకర్మలు ఇవన్నీ ఆ జీవునికి స్వప్నంలో వలె సాక్షాత్కరిస్తాయి.

అప్పుడా జీవుడు మనసులో ఇలా అనుకొంటాడు: "నేను గతంలో అనేక లక్షల జన్మలను ఎత్తాను. పుట్టిన ప్రతిసారి మరణించాను. మరణించిన ప్రతిసారి తిరిగి జన్మించాను. ఈ జన్మలో పుట్టిన వెంటనే తిరిగి జన్మలేని విధంగా మోక్షం కొరకు తప్పక ప్రయత్నిస్తాను. నేను ఈ గర్భవాస నరకం నుండి బయట పడగానే సంసార బంధం నుండి విముక్తిని కలిగించే శివజ్ఞానాన్ని గూర్చి అన్వేషిస్తాను!" అని తలపోస్తూ ఉంటాడు.

మునులారా! గర్భవాస క్లేశాన్ని గురించి చెపుతున్నాను వినండి! మాతృ గర్భోదకంలో ఉన్న శిశువు (జీవుడు) సముద్రంలో మునిగి పోతూన్న మానవునివలె మహాభయంతో కూడి మహా దుఃఖాన్ని అనుభవిస్తూ ఉంటాడు. మావిచే కప్పబడిన శిశువు (జీవుడు) మహాపర్వత శకలాలమధ్య భారంచే నలిగిపోతున్న వానిలా రోదిస్తూ ఉంటాడు. మాతృగర్భమనే బానలో ఉండి జఠరాగ్నిచే తప్తమై పోతూన్న జీవుడు, బానలో సలసల మరుగుతూన్న నీటిలో ఉడికిపోతూన్న శిశువులా రోదిస్తూ ఉంటాడు. ఎఱ్ఱగా కాల్చిన సూదులతో నిరంతరంగా పొడిచినప్పుడు ఎట్టి దుఃఖం కలుగుతుంతో గర్భస్థ జీవుడు అంతకంటె మహా దుఃఖాన్ని అనుభవిస్తూ ఉంటాడు. ప్రాణులకు గర్భవాస దుఃఖాన్ని మించిన ఘోరము, అతి సంకటము అయిన పెద్ద దుఃఖం మరొకటిలేదు. ఈ దుఃఖం ఏడవనెల నిండగానే మొదలవుతుంది. అందువల్లనే ధర్మాత్ములైన జీవులు ఏడునెలలు నిండగానే గర్భవాస క్లేశాన్ని చవిచూడకుండానే జన్మిస్తారని పెద్దలంటారు.

మునులారా! గర్భవాస క్లేశాన్ని మించిన మహా క్లేశాన్ని, దుఃఖాన్ని ప్రసవ సమయంలో అనుభవిస్తాడు జీవుడు. రంపపుపళ్ళవంటి యంత్రకోరల మధ్య చిక్కుకొని నలిగిపోతున్న మానవునిలా; యోనియంత్ర కండరాల చేత పీడింపబడిన వాడై, జన్మ సమయంలో మహా దుఃఖాన్ని అనుభవిస్తూ, తల్లిని బాధకు గురిచేస్తూ, తాను బాధను అనుభవిస్తూ జన్మిస్తాడు పాపియైన జీవుడు. యంత్రంలో నలగకొట్టబడిన చెరుకుగడవలె నలిగిపోతూ, పాపం అనే రోకలి నెత్తిమీద మొత్తుతున్నదా అనునట్లు అధికమైన పీడను పొందుతాడు జన్మసమయంలో పాపియైన జీవుడు. గానుగలో ఆడబడిన నువ్వులు క్షణంలో పిప్పి అవుతాయి. ఆ విధంగానే జన్మసమయంలో పీడను పొందిన జీవుని దేహం నిస్సారమవుతుంది.

మునులారా! ఈ దేహం భోగ తృష్ణకు, మోహానికి, రాగద్వేషాలకు, అజ్ఞానానికి నిలయమైన ఒక మట్టికొండ వంటిది. ఎముకలే స్తంభాలు! పాదాలే క్రిందిమట్టు! కండరాలే త్రాళ్ళు, రక్తమాంసములే అడుసు! కేశములు, రోమములు, గోళ్ళు ఇవియే రక్షణకొరకు

నిర్దేశింపబడిన కంచె, చర్మమే పైన కప్పిన ఆవిరిగడ్డి! నోరే ద్వారం! పెదవులే తలుపులు! నాలుక అడ్డగడియ! నోరు మినహా మిగిలిన నవరంధ్రాలు కిటికీలు.

జీవుడు జనన సమయంలో ఒకదానితో ఒకటి చిక్కుకొనియున్న అవయవములు కలవాడై ఒక ఇరుకు మార్గంద్వారా అతికష్టం మీద బయట పడతాడు. ఆ సమయంలో ఒక బంధ స్థానం నుండి బయటపడిన ఆ దేహం మల మూత్రాదులతో, రక్తంతో నిండి ఉంటుంది. ఈ కారణాల వల్లనే జ్ఞానులైన ఋషులు జీవునికి మరణంకంటె పుట్టుకే బహు దుఃఖ క్లేశ భూయిష్ఠమైనదని నొక్కి వక్కాణించారు. గర్భవాసం నుండి బయటకు రాగానే జీవుడు పూర్వజన్మ స్మృతి జ్ఞానాన్ని కోల్పోతాడు. ఈ శరీరంలో మూడువందల అరవై ఎముకలు, అయిదు వందల కండరాలు, మూడున్నర కోట్ల రోమాలు ఉన్నాయి. ఈ దేహంలో అంతటా అదే సంఖ్యలో నాడులు వ్యాపించి ఉన్నాయి. నాడులలో కొన్ని స్థూలంగా ఉండి కంటికికాన వస్తాయి. కొన్ని సూక్ష్మంగా ఉండి కంటికి కానరావు. దేహం లోపల స్రవించే మాలిన్యాలు చెమట రూపంలో బయటకు వస్తాయి. దీనికి ముప్పదిరెండు పళ్ళు, ఇరవై గోళ్ళు ఉన్నాయి.

దేహంలో పిత్తం యొక్క పరిమాణం ఒక కుడవము (పండ్రెండు దోసిళ్ళు), కఫం యొక్క పరిమాణం ఒక ఆఢకము (శేరు), వస (మాంసంలోని క్రొవ్వు) యొక్క పరిమాణం ఇరువది పలములు, కుంకుమరంగుగల ఘన పదార్థం పది పలములనియు చెప్పబడింది. క్రొవ్వు పదార్థం యొక్క పరిమాణం పదిహేనున్నర పలములు, శుద్ధ రక్తం మూడు పలములు శుక్రం అర్ధ కుడవకం (ఆరు దోసిళ్ళు) అని విజ్ఞులు చెప్పారు. ప్రాణుల దేహశక్తి మరియు ప్రజనన సామర్థ్యము శుక్ర ధాతువుమీద ఆధారపడి ఉంటుంది. ఒక దేహంలోని మాంసం వేయి పలముల పరిమాణం కలిగి ఉంటుంది. రక్తం యొక్క పరిమాణం వంద పలములు, మల మూత్రములు నాలుగు నాలుగు గుప్పిళ్ళ పరిమాణంలోను ఉంటాయి. ఈ అనిత్యమైన దేహమనే గృహంలో నిత్యమైన ఆత్మనివసిస్తున్నది. విశుద్ధమైన ఆత్మకు కర్మబంధం వలన అశుచి అయిన ఈ దేహం నిర్మితమైంది.

**దేహ స్వభావం**

మునులారా! దేహం స్వభావం చేతనే అశుచియైనది. శుక్రశోణిత సంయోగంచే పుట్టిన ఈ దేహం నిరంతరము మలమూత్రాదులతో నిండి ఉంటుంది. అందువల్లనే ఈ దేహం అశుచి అని చెప్పబడింది. లోపల మలంతో కూడియున్న కుండ బయట ఎంత శుభ్రంగా ఉంచినా అది మలపాత్రయే అవుతుంది. పరమ పవిత్రమైన పంచగవ్యాన్ని (పాలు, పెరుగు, వెన్న మొదలగు వాటి మిశ్రమం) యజ్ఞ

ప్రసాదాన్ని భక్షించిన తర్వాత కూడ వెంటనే ఈ దేహం అశుచి అవుతూన్నది. మధురమైన అన్నము, పరిమళోల్లాసభరిత పానీయములు ఈ దేహాన్నిపొంది శ్రీఘ్రంగా అశుచి అవుతున్నాయి. కొండనుండి జలం కొండవాగుల రూపంలో ప్రవహించినట్లు ఈ దేహం నుండి శ్లేష్మము, కఫము, స్వేదము, మలమూత్రాది మాలిన్యాలు నిరంతరము స్రవిస్తూనే ఉంటాయి. మల విసర్జన, మూత్రపతన స్థానములు అపవిత్రములు. దేహమునుండి వెలువడే మాలిన్యాన్ని ముట్టుకొన్న వెంటనే చేతిని జలంతో పరిశుద్ధం చేసికొంటున్నాం కదా! అట్టి మాలిన్యానికి ఆశ్రయ భూతమైన ఈ దేహానికి బానిసయైన మానవుడు భ్రష్టుడు కాడా ఏమి? అందువల్లనే జ్ఞానులెప్పుడూ దేహభ్రాంతిని విడిచి ఆత్మనిష్ఠులై ఉంటారు.

దుర్గంధాన్ని ఆ ఘ్రాణించి ముక్కు మూసికొనే మానవుడు తన మాలిన్యాన్ని గుర్తించలేక పోవటం ఆశ్చర్యం కదూ! ఈ సర్వ జగత్తులోను మానవ దేహం మాత్రమే అతిశయించిన మాలిన్యాలను కలిగిఉంది. ఈ మాలిన్యాలను తొలగించుకొనే నిమిత్తమై శౌచ క్రియలు బోధింపబడ్డాయి. ఇవి బాహ్య ఆభ్యంతర భేదం చేత రెండు విధాలు. ఇందులో ఆభ్యంతరమైన భావశుద్ధి ప్రధానమైనది. దుష్టమైన అంతఃకరణగల మానవుడు ఎన్ని ధర్మకార్యాలను చేసినా అవన్ని వ్యర్థమే! అగ్నిలో దూకినా పరిశుద్ధుడు కాలేడు. నదులలో చేపలు సంచరించినా గుడిగోపురాలపై పక్షులు నివసించినా వాటికి భగవద్భావం లేని కారణంగా ఫలము లభించదు. అందువల్ల భావశుద్ధి ప్రధానమైనది.

కర్మలన్నింటి యొక్క పవిత్రత పూర్తిగా అంతఃకరణ శుద్ధిమీదనే ఆధారపడి ఉంది. ఒక స్త్రీ భర్తను కౌగిలించుకొని ముద్దాడినప్పుడు, కుమారుని ఆలింగనం చేసికొని ముద్దాడినప్పుడు మనోభావం వేరుగా ఉంటుంది గదా! కనుక మునులారా! దేహం ఎంత అశుచియైనదైనా వైరాగ్యం అనే మట్టితో తోముకొని, జ్ఞాన జలంతో కడుక్కొంటే శుచి అవుతుంది. అలాటి పరమ జ్ఞానులైన వారి శరీరాలు పుణ్యతీర్థాలతో సమానం. వారికి జంగమ తీర్థములు అనిపేరు. వారు స్వతః పవిత్రులు. ఇతరులను పవిత్రులను చేయగలరు కూడ! “నేను” అనే అహంకారం, “నాది” అనే మమకారం ఈ రెండే దుఃఖ హేతువులు. ఈ అహంకార మమకారాలను జయించిన వారే జ్ఞానులు. జీవుడు గర్భస్థుడై ఉండగా కొంత వివేకాన్ని కలిగి ఉంటాడు. గర్భం నుండి బయటకు రాగానే ఆ వివేకాన్ని కోల్పోతాడు. భయంకరమైన మోహంలో చిక్కుకొంటాడు. చిక్కుకొని ఆత్మస్వరూప వివేకాన్ని, శివతత్వాన్ని తెలుసుకోలేక కర్తవ్యాన్ని విడిచి కర్మబంధంలో చిక్కుకొని తిరిగి చావు పుట్టుకల చక్రభ్రమణంలో పరిభ్రమిస్తూ ఉంటాడు.

మానవునికి స్వర్గ–మోక్షాలను సంపాదించిపెట్టే గొప్పది దివ్యమైనది అయిన జ్ఞానాన్ని సాక్షాత్తు పరమ శివుడే శివమహాపురాణ రూపంలో మనకు అందించాడు. ఈ శివజ్ఞానం మనకు ఉపలభ్యంగా ఉన్నా ఆత్మ శ్రేయస్సు కొరకు ప్రయత్నించక పోవటం అవివేకం కదూ! మానవ జీవితంలో సుఖమనేది కల్ల! సుఖమనేది భ్రాంతి మాత్రమే. కోరికలే పట్టిపీడిస్తున్నాయి. అవి తీరటమనేది ఉండదు. ఒకదానివెంట మరొకటి పుడుతూనే ఉంటాయి. కుష్ఠు వ్యాధి పీడితుడు దేహాన్ని గోకుకొని నప్పుడు, కురుపునుండి చీము బయటకు వచ్చినప్పుడు ఎలాటి సౌఖ్యం కలుగుతున్నదో అట్టి సౌఖ్యమే కామభోగములయందు కూడా ఉన్నది అని అభిజ్ఞులు చెపుతున్నారు. అతి వేగంగా మలమూత్రాదులు బాధిస్తూన్నప్పుడు వాటి విసర్జన సమయంలో పొందే సుఖం వంటిదే స్త్రీ పురుషు లిరువురు కామభోగంలో పొందుతున్నారని తత్త్వాన్ని తెలిసిన జ్ఞానులు అంటున్నారు. కాని మూర్ఖులు అందులో ఏదో అధిక సౌఖ్యం ఉందని భ్రమిస్తున్నారు.

నారద–పంచచూడ సంవాదంలో కామభోగములు సర్వదోషాలకు ఆశ్రయమని, సర్వ పాప కృత్యాలకు హేతువులని, అవి యధార్థములు కావని, వాటియందు నిజమైన సుఖం లేశమాత్రమైనా లేదని పంచచూడ అనే అప్సరస చెప్పింది. సమ్మానం వెంట అవమానం, సంయోగం వెంట వియోగం, యౌవనం వెంట వృద్ధాప్యం, బ్రతుకు వెంట మృత్యుభయం నీడలా వెన్నంటె ఉన్నాయి. ఇక సుఖానికి తావెక్కడు? జరాభార పీడితుడైన వాడు ఈగను సైతం అదలించ లేడుగదా! అట్టిచో ధర్మార్థకామమోక్ష పురుషార్థాలను ఎలా సాధించగలడు? అందుకని యవ్వనంలోనే ధర్మాన్ని అనుష్ఠించి శివజ్ఞానాన్ని పొందాలి.

**నారద–పంచచూడ సంవాదం – కామోపభోగమందలి దోషములు**

మునులారా! దుష్ట స్త్రీ స్వభావాన్ని గురించి పంచచూడ అనే అప్సరస నారద మహర్షికి చెప్పిన విషయాన్ని మీకు చెపుతున్నాను శ్రద్ధగా వినండి. దానిని విన్నమాత్రాన ఉత్తమమైన వైరాగ్యం కలుగుతుంది. బహుప్రాచీన కాలం నుండి పెద్దలు చెపుతూ వచ్చిన ఉపాఖ్యానం ఇది. చపల చిత్తం గల స్త్రీలు సర్వకాలములయందు ఉంటారు. వారే సర్వదోషాలకు మూలం. అలాటి వారి విషయంలో ముముక్షువులైన వారు కడు జాగరూకులై వారియందు ఆసక్తిలేని వారై ఉండాలి.

పూర్వ కాలంలో బుద్ధిశాలి, దేవర్షి అయిన నారదుడు లోకసంచారం చేస్తూ అతిలోక సుందరి, మహా లావణ్యరాశి ఐన పంచచూడ అనే అప్సరసను చూచాడు. చూచి ఆమెను

ఇలా ప్రశ్నించాడు: "ఓ సుందరీ! నా మనస్సులో ఒక సందేహం ఉంది. దానిని నీవు తప్పక తీర్చాలి" అప్పుడా అప్సరస ఇలా బదులిచ్చింది: "ఓ బ్రాహ్మణోత్తమా! నేను సమాధానం చెప్పగలనని భావిస్తే అడుగు. అది నాకు తెలిసిన విషయమైతే సమాధానం చెప్పగలను."

"ఓ సుందరీ! నీకు తెలియని విషయాన్ని చెప్పుమని నిన్ను ఇబ్బంది పెట్టే ప్రసక్తి లేదు. నేను నీ నుండి స్త్రీ స్వభావాన్ని గురించి తెలియగోరుచున్నాను." అన్నాడు నారదుడు.

అప్పుడు పంచచూడ ఇలా బదులిచ్చింది: "ఓ మునీ! విను! నేను స్త్రీని అయి ఉండి స్త్రీ యొక్క దుష్టస్వభావాన్ని వెల్లడించటం తగదు. స్త్రీలు ఎటువంటి వారు అనే విషయం, వారి స్వభావం నీకు తెలియనిది కాదు. నీవు నన్ను ఇట్టి ప్రశ్నను అడగటం సంభావ్యం కాదు." ఇలా పలికి మౌనం వహించింది.

ఆమె మాటను వినిన నారదుడు లోకహితాన్ని కోరి "ఓ సుందరీ! అసత్యం పలికినచో దోషం సంక్రమిస్తుంది. సత్యం పలికితే దోషం లేదు. దానివలన లోకానికి మేలు జరుగుతుంది. కనుక సత్యమైన దానినే చెప్పు." అని కోరగా పంచచూడ స్త్రీలయందలి దోషములను ఇలా చెప్పటం ప్రారంభించింది.

"ఓ దేవర్షీ! సత్యములు, నిత్యములు అయిన విషయాలను చెపుతున్నాను విను. సుందరులైన స్త్రీలు సత్కులంలో జన్మించినా, భర్త ఉన్నవారే అయినా మర్యాదాతిక్రమణం చేస్తారు. ఇదే వారిలోని దోషం. దుష్టులైన స్త్రీలకంటె ఎక్కువ పాపహేతువు మరొకటి లేదు. పాపాలకు మూలం ఇట్టి స్త్రీలే! వారి భర్తలు విద్యావంతులు, ఆర్జనపరులు, ధనవంతులు, రూపవంతులు, తాము కోరుకొన్నవారే అయినా ఈ దుష్టస్త్రీలు అవకాశం లభిస్తే తప్పు చేయటానికి వెనుకాడరు. ఓ ప్రభూ! మా స్త్రీలలో ఈ దుర్లక్షణం ఉంది! మేం సిగ్గును విడిచి హీనజాతి కాపురుషులను, పాపాత్ములను సేవిస్తాం. ఎవరైతే వీరికి కొంచెం సన్నిహితంగా వస్తారో, వీరి అందచందాలను స్తుతిస్తారో, కొద్దిగా సేవ చేస్తారో, ప్రార్థిస్తారో అట్టి పురుషులను స్త్రీలు వాంఛిస్తారు. స్త్రీలు తమకు రహస్యమైన ఏకాంత ప్రదేశము దొరకనప్పుడు, తీరిక లేనప్పుడు, తమ్ము వరించి ప్రార్థించు వారు లభ్యంకానప్పుడు మాత్రమే మర్యాదాతిక్రమణం చేయకుండ ఉంటారు. అత్త–మామల భయం, భర్త భయం, దండన భయం ఇవి కూడా స్త్రీల పాతివ్రత్య రక్షణకు ఉపాయాలు. స్త్రీల దృష్టిలో అయోగ్యుడు లేడు. వీరికి వయస్సుతో పనిలేదు. వీరు అందగాడైనా కాకపోయినా పురుషునితో భోగిస్తారు.

ఓ మహర్షీ! ఈ దుష్ట స్త్రీల స్వభావాన్ని గూర్చి చెపుతున్నాను విను. ఈ స్త్రీలు సవిలాసంగా ఓయారాలను ఒలకపోస్తూ ఒకనితో మాట్లాడుతూ ఉంటారు. మరొక్కని వైపు చూస్తూ ఉంటారు. వేరొక్కని హృదయంలో స్మరిస్తారు. స్త్రీలకు ఒక్కనియందే అనురాగం అనేది లేదు. దుష్టలైన స్త్రీలను ఎంత గౌరవించినా, ప్రేమించినా, రక్షించినా, చివరకు ప్రాణాలకు తెగించి ప్రాణాపాయ స్థితిలో ఉన్న అట్టి స్త్రీలను రక్షించినా; వారు అట్టి సత్పురుషుని విడిచి, ఎట్టి అవలక్షణాలు కలిగిన వాడైనా సరే పరపురుషుని వాంఛిస్తారు. స్త్రీలు కామించరాని పురుషుడు ముల్లోకాలలో ఒక్కడు కూడా లేడు. కేవలం శిక్షకు, దండనకు భయపడి మాత్రమే స్త్రీలు పరపురుష వాంఛను వదలుకొంటారు.

ఎన్ని కట్టెలైనా అగ్నిహోత్రుని తృప్తిపరచలేవు! ఎన్ని నదులైనా సముద్రుని సంతోషపెట్టలేవు! ఎన్ని జీవులైనా యముణ్ణి 'చాలు' అని అనిపించలేవు. ఎంతమంది పురుషులైనా ఒక స్త్రీని చాలనిపించలేరు. ఇట్టి దుష్ట స్త్రీలకు పురుష సంయోగం లభించని సందర్భాలలో వారు అన్యోన్యం రమించటానికి వెనుకాడరు. వీరియందు భర్తను అనుసరించి ఉండే లక్షణం లేదు.

ఓ దేవర్షీ! స్త్రీలకు సంబంధించిన ఒక్క రహస్యం చెపుతాను విను! వీరికి పురుషుని చూడగానే కామవికారం కలుగుతుంది. వీరి దృష్టిలో శ్రేష్ఠమైన వస్త్రాలకు, విలువైన ఆభరణాలకు, సంపదకు, కామమును భోగించుటకు ఉన్న విలువ భర్తపైన ఉండదు. ప్రాణాలనుసైతం లెక్కసేయక మానాన్ని రక్షించి, కష్టాలలో ఓదార్చి, సర్వస్వాన్ని అర్పించిన భర్తపై కూడ ఈ దుష్టస్త్రీలు ప్రేమను కలిగి ఉండరు. వీరికి సద్భావం అనేది లేదు.

కీకారణ్యంలో తిరుగుతూన్న పెద్ద పులిని పట్టుకోవచ్చు. ఆకాశంలో ఎగురుతున్న పక్షిని బంధించవచ్చు. సముద్రంలో సంచరిస్తూన్న మహా మీనాన్ని పట్టవచ్చు. చపల బుద్ధిగల స్త్రీలను స్వాధీనం చేసుకొన్న వీరుడైన పురుషుడు ఇంత వరకు పుట్టలేదు. యౌవనంలో ఉండి ఉజ్జ్వలమైన వేషభూషాదులను ధరించి స్వేచ్ఛగా సంచరించే ఇట్టి స్త్రీలను చూచి కులస్త్రీలు కూడా అట్టి జీవితాన్నే కోరుకొంటారు. మృత్యుదేవత, పాతాళము, నరకము, బడబాగ్ని, కత్తిధార, విషము, పాము, అగ్ని వీటన్నిటిని కలిపిన దానికంటె దుష్టస్త్రీ వలననే హాని అధికం.

మహర్షీ! లోకంలో ఎట్టి జ్ఞాని అయినా చెప్పలేనివి కొన్ని ఉన్నాయి. అవేమిటంటే గుఱ్ఱం యొక్క దుముకు, మబ్బుయొక్క ఉఱుము (పిడుగుపాటు), అతివృష్టి, అనావృష్టి,

పురుషుని అదృష్టం (భాగ్యం). వీటిని సైతం లెక్కలుకట్టి చెప్పగలవారు ఉండవచ్చు. కాని చపలచిత్తలైన స్త్రీలయొక్క మనోభావాన్ని గుర్తించగల పురుషుడు ఇంకా పుట్టలేదు. దేవతలకే తెలియదు అంటే నరుల లెక్కేమిటి? ఒకప్పుడైనా హీనునకు రాజ్యసంపద కలుగవచ్చు. ఆకాశానికి పువ్వులు పూయవచ్చు. కాని స్త్రీలకు మనశ్శుద్ధి కలుగనే కలుగదు!

కష్టసుఖాలను, లాభనష్టాలను, జయాపజయాలను చివరకు చావుపుట్టుకలను సైతం చెప్పగల తత్త్వవేత్తలు కూడా స్త్రీ స్వభావాన్ని గణించలేరు సరిగదా వారి భ్రూకటాక్ష విక్షేపాలకు లొంగి పోతున్నారు. కార్యహేతువు చేత ఈ స్త్రీలు ఒకప్పుడు చంద్రికా విభవాన్ని ధిక్కరించేటట్లు నవ్వుతారు. రాళ్ళు కరిగేటట్లు ఏడుస్తారు. మగవానిని నమ్మిస్తారు. వారుమాత్రం నమ్మరు. కనుక కులశీల విద్యాగుణ సంపత్తిగల ఆర్య పురుషుడెల్ల వేళలా ఇట్టి స్త్రీలను శ్మశానం లోని పువ్వులవలె విడిచిపెట్టాలి.

కాకికి శౌచము, కాముకునికి సత్య వాక్యము, నపుంసకునికి శౌర్యము, త్రాగుబోతుకు తత్త్వచింతన, సర్పానికి ఓర్పు, రాజులకు స్నేహం, స్త్రీలకు కామోపశాంతి అనేవి లోకంలో లేనే లేవు. సంపదలకు స్థిరత్వము, మూర్ఖునకు వివేకము, చేసిన కర్మలకు నాశనము స్త్రీలకు సద్భావము ఇంతవరకు ఎప్పుడు కనలేదు వినలేదు. లోకంలో బంగారు లేడి ఎక్కడా ఉండదు అని తెలిసికూడా కేవలం భార్యకోరింది గదా అనే తృష్ణ (ఆశ)చే దాని వెంటపడిన రఘునందనుని వివేకాన్ని ఏమనాలి? పురుషుని కీలుబొమ్మను చేసికొని స్త్రీలు వారి కార్యాలను అలా చక్కపెట్టుకొంటారు! బృందారక సార్వభౌముడైన పురందరునికి స్వర్గంలో అచ్చరమెఱుగు బోండ్లకు కొదవా ఏమి? కేవలం వనవాసిని, ఒక తపసి ఇల్లాలు అయిన అహల్యపై మనసు పారేసుకొన్నాడంటే మన్మథ ప్రతాపాన్ని ఏమనాలి? హృదయమనే పర్ణశాలను కామాగ్ని దహించి వేస్తూంటే ఎంత పండితుడైనా ఉచిత అనుచితములను ఎఱగడు! ఎట్టి యంత్ర సహాయం, మంత్ర సహాయం లేకుండగానే స్త్రీలు ఎంతటి ప్రజ్ఞాధనునైనా వశం చేసికోగలరు! సస్యము (పంట), భార్య ఈ రెండుకూడా స్వీయ పర్యవేక్షణ లేకపోతే పరుల పాలవుతాయి.

కాళిందీ (యమున) నదీ ప్రవాహంలో మహా శోభాయమానంగా ప్రకాశిస్తూన్న నల్లకలువ మొగ్గల వెలుగును మించి మనోహరంగా ఒప్పారుతూ ఉన్న కామినుల కాటుకకండ్ల చూపులు ఎంత వరకు పురుషుని హృదయానికి గ్రుచ్చుకొనవో; అంతవరకే ఆ పురుషుని పాండిత్యము, ప్రతిష్ఠ, గౌరవము నిలబడతాయి. పంచబాణుని పూవుటమ్ములను మించిన

పదునుగల కామినీజనుల కడకంటి చూపులు ఒక్కసారి సోకెనా ఎంతటి తపోధనుని వజ్రపంజర సన్నిభమైన మనస్సైనా కరిగి నీరై పారుతుంది. పరాశర, వ్యాస, కౌశిక, శీతాంశులకే దిక్కు లేదు.

మహర్షీ! ముగ్ధేందు వదనల ముఖ విలాసాలకు, చిగురుబోడుల కుచాశ్లేషములకు, మహిళాజనాల మధుర వచనాలకు, పద్మగంధుల నిశ్వాస వాసనలకు, కువలయాక్షుల కలికి చూపులకు, కలకంఠకంఠుల పాటలకు, చంద్రముఖుల మందహాసాలకు, మత్తేభయానల మందగమనాలకు, బింబాధరోష్ఠుల వాతెర మధువులకు, అంగనల హస్తపాద విన్యాసాలకు ముని, వన, శైల, వృక్షతతులు వెంట పరుగెత్తుతాయి అంటే విషయ సౌఖ్యపరతంత్రుడైన నరుడు వశుడు కావటంలో ఆశ్చర్యమేముంది?

సంపదలను పొంది గర్వపడని వాడు, సంసారంలో ఉండి ఆపదలను పొందని వాడు, యముని ముఖం చూడని వాడు, యాచకుడై ఉండి గౌరవాన్ని పొందిన వాడు, దుర్జన సాంగత్యం చేసి క్షేమంగా బయటపడిన వాడు, వర్షంలో తడవని వాడు, సూర్యకిరణం మేన సోకని వాడు, స్త్రీల మాయాజాలంలో చిక్కుకొనని వాడు లోకంలో లేడు. పంచమహా భూతములు, లోకములు, సూర్యచంద్రులు, పురుషులు మరియు స్త్రీలు ఏ కాలంలో బ్రహ్మగారిచే సృష్టింపబడినారో అప్పటినుండి సర్వ కాలాలలోను ఇట్టి దోషంగల స్త్రీలు ఉన్నారు.

ఈ ద్వైత ప్రపంచంలో ద్వంద్వ ప్రవృత్తి ఎప్పుడూ ఉంటుంది. అసత్యం వలన సత్యమునకు, హింస వలన అహింసకు, చీకటి వలన వెలుగుకు, చెడు వలన మంచికి, అధర్మం వలన ధర్మమునకు, వ్యభిచారం వలన పాతివ్రత్యానికి మన్నన, మర్యాద కలిగింది.

ఓ బ్రహ్మజ్ఞాన కళానిధీ! త్రిలోక సంచారివైన నీకు తెలియని విషయాలు ముల్లోకాలలోను లేవు. అయినా నీవు ప్రశ్నించావు కనుక చెప్పాను. అసత్యదోషం నాకు వాటిల్లకుండ ఉండటం కొరకు చెప్పాను. ఇలా పలికి మునికి నమస్కరించి ఆయన నుండి అనుజ్ఞ తీసుకొని తన లోకానికి వెళ్ళింది పంచచూడ.

మునులారా! వస్తుతత్త్వాన్ని, దుష్ట స్త్రీ స్వభావాన్ని గురించి చెప్పిన సంవాద రూపమైన ఈ ఉపాఖ్యాన శ్రవణం వలన వైరాగ్యం కలుగుతుంది. ఆ వైరాగ్యం శివజ్ఞానాన్ని పొందాలనే శుభేచ్ఛకు కారణమవుతుంది. ఆధ్యాత్మిక ఔన్నత్యానికి వైరాగ్యమే కదా మొదటి మెట్టు.

## యోగ సాధన మరియు యోగ మహిమాను వర్ణనం

మునులారా! సర్వ ప్రాణులకు మృత్యువు కాలంలోనే సంప్రాప్తిస్తుంది. అట్టి కాలాన్ని (మృత్యువును) జయించే యోగాన్ని గూర్చి సంగ్రహంగా చెపుతున్నాను. శ్రద్ధగా వినండి! ఈ అనంతమైన సృష్టికి కారణ భూతమైనది; నిత్యము, సత్యము, శాశ్వతము అయినది ఒకటి ఉంది. దానికి 'ప్రధానము' అనిపేరు. అది కార్యకారణ రూపంగా ఉంటుంది. దానినుండే చైతన్య రూపుడైన పురుషుడు ఆవిర్భవించాడు. జడమైన ప్రకృతి కూడా ఉద్భవించింది. వారిద్దరి సమ్మేళనంతో ఈ సృష్టి ఇలా అనంతంగా సాగిపోతూ ఉంటుంది. ఇక్కడ పురుషుడు అంటే అన్ని ఉపాధుల యందు చైతన్య రూపంగా ఉన్నవాడు అని అర్థం.

భూమిమీద సర్వమైన ప్రాణికోట్లలోను ఆడ-మగ భేదం ఉంది. పురుషునికి ప్రతీక మగవాడు. ప్రకృతికి ప్రతీక స్త్రీ. వీరిద్దరి సమ్మేళనంతో భూమి మీద ప్రాణికోట్ల ఆవిర్భావం అనంతంగా సాగిపోతూ ఉంటుంది. మనిషి మనుగడకు ప్రకృతియే ఆధారం. ప్రకృతి పంచభూతాత్మకం. స్త్రీ అయినా పురుషుడైనా ఉపాధులన్నీ పంచభూతాత్మకాలే. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ప్రకృతి గుణాలు. ఈ గుణాలతో కూడిన ప్రకృతియే పురుషుని మోహింపచేసి బంధంలో ఉంచుతూన్నది. ఈ బంధానికే సంసారం అని పేరు. ఆ బంధం నుండి విడివడితే కాని పురుషునికి మోక్షం లేదు. ప్రకృతికే మాయ అని మరొకపేరు.

దేని యొక్క యథార్థ స్వరూపాన్ని తెలుసుకొనాలనుకొన్నా ముందు దాని తత్త్వాన్ని వివేచన చెయ్యాలి. మోక్షార్థి అయిన వాడు సృష్టికి కారణమైన ప్రకృతి-పురుష తత్త్వాన్ని వివేచన చేసేముందు; దానికి ప్రతీకలైన స్త్రీ-పురుష తత్త్వాన్ని అంటే దారాపుత్రాదులతో కూడిన ఇక్కడి జీవ సంసార తత్త్వాన్ని ముందు వివేచన చేయాలి. సంసారం స్త్రీ వల్లనే ఏర్పడుతూన్నది కనుక ముందుగా స్త్రీ యొక్క యథార్థ స్వరూపాన్ని, తత్త్వాన్ని అర్థం చేసుకోవాలి.

నిజానికి ప్రకృతి-పురుష బంధాన్ని విడగొట్టటం అసాధ్యం. అది ప్రళయకాలంలో మాత్రమే జరిగేపని. ప్రళయకాలంలో ప్రకృతి కార్యములన్నీ ఒక్కొక్కటి కారణంలో లీనమవుతూ వస్తాయి. అప్పుడు అనాది అయిన ప్రధానం ఒక్కటే మిగులుతుంది. ముందుగా ప్రకృతి స్వరూపిణి అయిన స్త్రీ తత్త్వాన్ని వివేకించి ఆ మోహం నుండి ఆ బంధం నుండి బయట పడితే వైరాగ్యం సిద్ధిస్తుంది. ఆ వైరాగ్యం క్రమంగా మోక్షానికి దారి తీస్తుంది.

మునులారా! తీవ్రమైన వైరాగ్యం కలిగితే మినహా మనిషి (జీవుడు) సంసారం నుండి బయట పడలేడు. అట్టి వైరాగ్య ప్రాప్తి ముముక్షువులకు కలిగే నిమిత్తమై మీకు నారద–పంచచూడ సంవాద రూపమైన ఉపాఖ్యానాన్ని చెప్పి ఉన్నాను. అంతే కాని మాతృ మూర్తులైన తల్లులనుగాని, శక్తి రూపిణి అయిన ప్రకృతినిగాని నిందించటం నా తాత్పర్యంగాదు. ప్రకృతి ప్రసవరూపిణి గదా! తీవ్ర వైరాగ్య సంపన్నులైన ముముక్షువులకు సైతం సర్వాన్ని సమకూర్చి పెట్టేది ప్రకృతియే.

ఓ తపోధనులైన మునులారా! కేవలం జ్ఞానమొక్కటే మోక్షహేతువు కాజాలదు. జ్ఞానమార్గం సిద్ధాంత మార్గం. దానికి ఆచరణ కావాలి. అట్టి ఆచరణకే 'యోగం' అని పేరు. ఆ యోగాన్ని గూర్చి మీకు చెపుతున్నాను. శ్రద్ధగా వినండి. అవిద్యా మోహితులైన వారు పాంచభౌతికమైన ఈ ఉపాధి శరీరంతో తాదాత్మ్యాన్ని చెంది 'నేను' అనే ఆత్మ ప్రత్యయంతో లోక వ్యవహారాలను చక్కపెట్టుకొంటూ ఉంటారు. ఉపాధి శరీరాన్ని ఆశ్రయించుకొని ఉండి జీవుడు ఆత్మాధిష్ఠానంగా ప్రకృతి వలన కలిగే సుఖదుఃఖాలను అనుభవిస్తూ ఉంటాడు. నిజానికి జీవుణ్ణి ప్రకృతి బాధించదు. ప్రకృతి గుణాలే బాధిస్తాయి – ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి ఈ ఐదు పంచభూతాలు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు వాటి గుణాలు. ఈ గుణాలే బాధిస్తాయి. ప్రకృతిని జయించటం అంటే వాటి గుణాలను జయించటమే. అఖండాకార అద్వైత స్వరూపుడైన పరమాత్మను మనకు తోపింపనీయకుండా ఆచ్ఛాదించి ఉంటున్నది మాయారూపిణి అయిన ప్రకృతి. ప్రకృతియే పరిచ్ఛిన్నత్వాన్ని కల్పిస్తూన్నది. ప్రకృతిని స్వాధీనం చేసికొన్న మరుక్షణంలో పరిఛిన్నత్వం (ద్వైతభావం లేదా భేద భావం) తొలగి యోగికి అద్వైత దర్శనం కలుగుతుంది. ఏకత్వ దర్శనం కలుగగానే యోగికి కొన్ని శక్తులు కలుగుతాయి. వాటికి 'సిద్ధులు' అని పేరు. సిద్ధి అనగానే అదేదో క్రొత్తగా వచ్చింది అనిగాదు అర్థం. పరమాత్మకు అష్టసిద్ధులు సహజ గుణాలు. అలాగే జీవబ్రహ్మైక్య భావనను పొందిన వానికి కూడా సిద్ధులు సహజగుణాలే అవుతాయి.

మునులారా! కాలాన్ని జయించగోరు యోగి నిత్యము ఆయా కాలాల్లో సూక్ష్మ పంచభూతముల నుండి జనించిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే వాటి గుణాలను ధ్యానించాలి. యోగవేత్త నిశా సమయంలో ఉచితాసనంపై కూర్చొని, దీపాన్ని ఆర్పివేసి చీకటిలో ప్రాణాయామాన్ని చేసి మనస్సును ధారణ చేయాలి. చూపుడు వ్రేళ్ళతో రెండు

చెవులను మూసి కొద్దిసేపు నొక్కిపెట్టినచో చెవులలోపలి నుండి భగభగమండే అగ్నియొక్క శబ్దమును పోలిన శబ్దం వినవస్తుంది. ఆ శబ్దంపై ధారణ చేయాలి. ధ్యాన సమయంలో పిడుగు చప్పుళ్ళను విన్నయోగి ఇంద్రియ జయాన్ని తప్పక సాధిస్తాడు. క్రమంగా ఆ శబ్దం మరింత సూక్ష్మమవుతుంది. వివేకవంతులైన వారు శబ్దబ్రహ్మ స్వరూపుడైన పరమ శివుని తప్పక ధ్యానం చేయాలి.

శబ్ద బ్రహ్మ అనగా అది పదార్థముల యందలి కంపము వలన పుట్టినది కాదు. దానిని నోటితో ఉచ్చరించటం సాధ్యం కాదు. అది ఓంకారం కాదు. మంత్రం కాదు. బీజాక్షరం కాదు. అది ప్రాణస్వరూపం. అట్టి దానిని నాదసిద్ధిని అనుసరించి సరియైన క్రమంలో చెపుతున్నాను వినండి. అది తొమ్మితి విధాలు, అందు మొదటిది ఘోషము (సరళమగు హల్లుల ఉచ్చారణలో వచ్చే శబ్దం). రెండవది కాంస్యం (కంచు మ్రోత). మూడవది శృంగం (కొమ్ము బూరా నాదం). నాల్గవది ఘంటానాదం. ఐదవది వీణానాదం. ఆరవది వేణునాదం. ఏడవది దుందుభి స్వనం. ఎనిమిదవది శంఖధ్వని. తొమ్మిదవది మేఘ స్వనం. ఈ తొమ్మిది ధ్వనులను ఉపాసించి ఆ పైన వాటిని విడిచి 'తుం' కారమును చక్కగా ధ్యానించాలి. అట్టి అభ్యాసం వలన క్రమంగా యోగికి మృత్యువును జయించే శబ్దం ఉత్పాద్య మవుతుంది. ఘోషం మొదలుగా మేఘనాదం వరకు ఈ తొమ్మిది విధాలైన శబ్దబ్రహ్మ స్వరూపాన్ని చక్కగా ధారణచేసి ఉపాసించిన యోగికి సమస్త సిద్ధులు లభిస్తాయి. సిద్ధించని కోరిక అంటూ ఏమీ ఉండదు. ఈ విధంగా శబ్ద బ్రహ్మమును ఉపాసించిన యోగి ఆకాశ గుణమైన శబ్దంతో అద్వైతసిద్ధిని పొంది దానిని జయిస్తాడు.

మునులారా! మీకిప్పుడు వాయు లక్షణమైన స్పర్శ గుణాన్ని జయించే ఉపాయాన్ని చెపుతున్నాను వినండి. వాయువు సర్వవ్యాపకం. ఆ కారణంగా వాయువును జయించిన యోగి సర్వమును (జగత్తును) జయించిన వాడే అవుతున్నాడు. హృదయమునందు ఉండే ప్రాణవాయువు సర్వదా అగ్నిని ప్రజ్వరిల్ల చేస్తూనే ఉంటుంది. జ్ఞానము, విజ్ఞానము, ఉత్సాహము సర్వము వాయువునుండే ఉద్భవిస్తున్నాయి. యోగులు మూడు వ్యాహృతులతో మరియు శిరోమంత్రంతో కూడిన గాయత్రిని మూడుసార్లు జపించి ప్రాణవాయువును స్తంభింపజేసి నిలిపి ఉంచాలి. ఇది ప్రాణాయామం. ఎవరైతే తెల్లవారు జామునలేచి ప్రాణాయామాన్ని శ్రద్ధగా అభ్యసించి సిద్ధిని పొందుతారో వారికి వాయు లక్షణమైన స్పర్శగుణం స్వాధీన మవుతుంది.

మునులారా! మీకిప్పుడు అగ్ని లక్షణమైన తేజోగుణాన్ని జయించే ఉపాయాన్ని చెపుతున్నాను వినండి! యోగి జనసమ్మర్దం లేనిచోట సుఖాసనంలో కూర్చొని సూర్య చంద్రులతో కూడిన అగ్నిని భ్రూమధ్యమందు ధ్యానించాలి. ఈ ధ్యానం సిద్ధిస్తే అగ్నితత్త్వం సిద్ధించినట్లే, అట్టి యోగికి అనేక యోగ సిద్ధులు లభిస్తాయి.

మీకిప్పుడు జల లక్షణమైన రసగుణాన్ని జయించే ఉపాయాన్ని చెపుతున్నాను వినండి. యోగి ఏకాంతంలో సుఖాసనంలో ఉండి నాలుకను అంగుటి వైపునకు వంచి అభ్యాసం చేయాలి. అలా చేయగా కొద్ది రోజులలో అతని నాలుక కొండ నాలుకను స్పృశిస్తుంది. అలా స్పృశించగానే దానినుండి అమృతం స్రవిస్తుంది. ఆ అమృతం బిందు రూపంలో స్రవిస్తూ ఉంటుంది. ఈ విధమైన సిద్ధి లభించగానే యోగి అమృతుడు అవుతాడు. అమరత్వం సిద్ధిస్తుంది.

## ఛాయా పురుష విద్య

ఇంతవరకు అత్యంత శ్రద్ధా భక్తులతో సూత మహర్షి చెప్పిన విషయాలను వినిన శౌనకాది మునులు వినయంగా ఆయనను ఇలా ప్రార్థించారు. "ఓ! పురాణనిధీ! జ్ఞాన స్వరూపా! నువ్వింత వరకు లోకోపకారకమైన అనేక గాథలను, తాత్త్విక విషయాలను చెప్పావు. నీ పల్కులు అమృతోపమానంగా ఉన్నాయి. ఎంతవిన్నా గంగా స్నానం వలె తనివితీరటం లేదు. భౌతిక సంపదలు సంపదలు కావు. జ్ఞాన సంపదయే నిత్యమైన సంపద! మాకు ఛాయా పురుష లక్షణాన్ని గురించి చెప్పండి."

వెంటనే జ్ఞానార్జన యందు మునులకుగల లక్ష్యానికి సంతసించి సూత మహర్షి ఇలా చెప్ప సాగేరు. మునులారా! తొల్లి పార్వతి ప్రశ్నించగా పరమేశ్వరుడు ఈ విద్యను ఆమెకు ఉపదేశించాడు. దానిని మా గురువుగారైన వ్యాసభగవానుడు నాకుపదేశించారు. దానిని నేను మీకు చెపుతున్నాను వినండి.

సాధకుడైన వాడు శివభక్తియుతుడై పరిశుద్ధమైన తెల్లని వస్త్రాలను ధరించి, పుష్పమాలలను అలంకరించుకొని, సుగంధ ద్రవ్యాలను మైపూతగా పూసుకొని, చెంత పరిమళాన్ని వెదజల్లే ధూపాన్ని ఉంచుకొని సూర్యుడుగాని చంద్రుడుగాని వెనుకవైపు ఉండేటట్లు ఆసీనుడు కావాలి. అప్పుడు తన నీడ తనముందు పడుతుంది. సర్వకామ ఫలప్రదమైన నవాత్మక శివమంత్రాన్ని జపిస్తూ ఆ నీడను నిశితంగా వీక్షించాలి. అలా కొంత సేపు వీక్షించి తిరిగి ఆకాశం వైపు చూస్తే తెల్లని మెరిసే రూపం కానవస్తుంది. ఆ ఛాయా పురుషునిలో శివుణ్ణి దర్శించాలి. ఇలా ఒక సంవత్సరకాలం సాధన చేస్తే ఈ విద్య సిద్ధిస్తుంది.

ఆ సాధకునికి అష్టసిద్ధులు లభిస్తాయి. ఆ ఛాయా పురుషుడు తెల్లగా గోచరిస్తే సాధకుడు పరమ ధార్మికుడవుతాడు. నల్లగా కనుపిస్తే పాపి అవుతాడు. ఎఱ్ఱగా కనుపిస్తే బంధాలలో చిక్కుకొంటాడు. పచ్చగా కనుపిస్తే విద్వేషి అవుతాడు. ఆ ఛాయా పురుషునిలో అవయవ లోపం ఏదైనా కనుపిస్తే అరిష్టం (కీడు) సంప్రాప్తిస్తుంది. నిజానికి కేవలం ఆ ఛాయా పురుషుని దర్శన మాత్రం చేతనే సాధకుడు పవిత్రుడవుతాడు. అతనికి వాయుజయం సిద్ధిస్తుంది.

ఆ ఛాయా పురుషుణ్ణి ప్రార్థిస్తే సాధకునికి భూత, భవిష్యత్, వర్తమాన విషయాలన్ని తెలుస్తాయి. దీర్ఘజీవనం కలుగుతుంది. అకాల మరణం ఉండదు. అన్నిట జయమే! కొందరు ఆ ఛాయను బ్రహ్మముగా ఉపాసిస్తారు. కొందరు మృత్యువుగా కూడా ఉపాసిస్తారు. అట్టి వారికి రోగాదులు, మృత్యుభయం ఉండవు. కొందరు నీడయొక్క కంఠ భాగమందు మాత్రమే నిశ్చలంగా దృష్టిని నిలిపి శివుణ్ణి ధ్యానిస్తారు. అజ్ఞానావృతమైన ఏకాగ్రతతో హృదయంలో ఉన్న దేవతయే మృత్యువు. దానిని ఉపాసించి ప్రశ్నిస్తే అది అన్నిటికి సమాధానాలను చెపుతుంది.

**పితృదేవతల ప్రభావం**

శౌనకాది మునులు సూతుణ్ణి ఇలా ప్రశ్నించారు: ఓ! వ్యాసశిష్యా! పితృదేవతలు శ్రాద్ధముచే సంతోషించి మానవులకు శ్రేయస్సును కలిగిస్తారని అంటారు కదా! అట్టి పితృ లోకాలను గురించి పితృదేవతలను గురించి మాకు సవిస్తరంగా చెప్ప వలసింది. అంతే గాకుండా మానవులు ఇచ్చే శ్రాద్ధఫలం పితరులకు ఎలా చేరుతుంది? మరణించిన వారు ఏ లోకంలో ఎక్కడ ఏ రూపంలో ఉంటారో తెలియదు కదా?" దానికి సూతుడిలా చెప్పసాగేడు.

"మునులారా! వేద తాత్పర్యం తెలిసిన వారికి మాత్రమే అవగతమయ్యే విషయాన్ని గూర్చి మీరు ప్రశ్నించారు. సమాధానం చెపుతున్నాను. శ్రద్ధగా వినండి! తొల్లి సనత్కుమారుడు మార్కండేయునకు ఈ విషయాలన్నిటిని చెప్పాడు. మార్కండేయుడు ఈ పితృసృష్టిని గూర్చి భీష్మునకు వివరించాడు. శరతల్ప గతుడైన భీష్ముడు ధర్మరాజు ప్రశ్నించగా ఈ వివరాలను ఆయనకు చెప్పాడు. అట్టి ధర్మవేత్త అయిన భీష్ముడు ప్రవచించిన దానిని చెపుతున్నాను వినండి. మునులారా! మానవులకు ఇహలోకంలో సంతానాన్ని, సకలమైన భోగభాగ్యాలను, సంపదలను ఇయ్యటంలో దేవతలకంటె పితృదేవతలు ముందుంటారు. దేవతలు స్వార్థపరులు. పితృదేవతలు నిస్స్వార్థపరులు. మానవులు వారి సంతానమే కనుక వారికి మానవులయందు

వాత్సల్యం మెండు. కనుక ఇహలోక సుఖాన్ని కోరేవాడు తండ్రిని, తాతను, ముత్తాతను ఉద్దేశించి మూడు పిండాలను శ్రద్ధతో అర్పించి శ్రాద్ధం పెట్టాలి. స్వర్గంలో దేవతలు కూడా పితృదేవతలను పూజిస్తారు.

శంతన మహారాజు మరణించిన తరువాత శ్రాద్ధ సమయంలో భీష్ముడు తండ్రి కొరకు పిండాన్ని సిద్ధం చేశాడు. శంతనుడు భూమిని పగులకొట్టుకొని వచ్చి పిండం కొరకు చెయ్యి చాచేడు. భీష్ముడు తండ్రి చేతిలో పిండమును ఉంచకుండ శ్రాద్ధకల్పంలో చెప్పిన రీతిగా దర్భలపైనే సమర్పించాడు. దానికి వసు రూపుడైన శంతనుడు సంతసించి "ఓ భారతశ్రేష్ఠ! ధర్మనిధీ! నీవు వేద ధర్మాన్ని నిలపెట్టావు. రాజు ఏ ధర్మాన్ని ఆచరించి ప్రమాణభూతుడవుతాడో ప్రజలు కూడ ఆ ధర్మాన్నే ఆచరిస్తారు." అని పలికి భీష్మునకు మరణభయం లేకుండ స్వచ్ఛంద మరణాన్ని అనుగ్రహించాడు. ఆ సమయంలో భీష్ముడు తండ్రిని పితృకల్పాన్ని వివరంగా చెప్పమని కోరగా మార్కండేయుని ద్వారా తాను తెలుసుకొన్న దానిని శంతనుడు భీష్మునకు చెప్పాడు. మునులారా! దానినే నేను మీకు చెపుతున్నాను వినండి.

ఒకరోజున మార్కండేయ మహర్షి అంతరిక్షాన్ని అవలోకిస్తూ ఉండగా పర్వత సమీపంనుండి వస్తూన్న పెద్ద విమానం గోచరించింది. అందులో అగ్నిలో ఉంచబడిన అగ్నివలె మహాతేజో విరాజమానుడైన అంగుష్ఠమాత్ర (బొటన వ్రేలంత) పురుషుడు విశ్రమిస్తూ దర్శనమిచ్చాడు. మార్కండేయుడు ఆయన పరిచయాన్ని కోరగా "నేను బ్రహ్మ మానస పుత్రుడనైన సనత్కుమారుడను!" అని ఆయన బదులిచ్చాడు. ఆ సందర్భంలో మార్కండేయ మహర్షి పితృదేవతల ఆదిమ సృష్టిని గూర్చి చెప్పవలసిందని కోరగా ఆయన సవిస్తరంగా బోధించాడు. మునులారా! మీకు దాని సారాంశాన్ని చెపుతున్నాను వినండి.

పూర్వం బ్రహ్మ దేవతలను సృష్టించి 'నన్ను పూజించుడు' అని వారితో చెప్పాడు. కాని వారు ఫలార్థులై తమను తాము ఆరాధించుకొనగా బ్రహ్మ కోపించి 'బుద్ధి నశించగా మూర్ఖులు కండు' అని శపించాడు. అప్పుడు దేవతలు పశ్చాత్తప్తులై అనుగ్రహించమని బ్రహ్మను ప్రార్థించగా ఆయన 'మీ పుత్రులను (పితరులను) అడిగి మీరు జ్ఞానాన్ని పొందండి!" అని బదులిచ్చాడు. బ్రహ్మ చెప్పిన మాట చొప్పున దేవతలు వారి పితరులను సమీపించి ప్రార్థించగా వారు 'ఓ పుత్రులారా! వెళ్ళుడు!' అని బదులిచ్చి అంతర్హితులయ్యారు. వెంటనే దేవతలకు బుద్ధి కలిగింది కాని పుత్ర వ్యామోహ పీడితులై బ్రహ్మవద్దకు వెళ్ళి 'ఆ పుత్రులు

వెళ్ళిపోయారు' అని చెప్పి దుఃఖించారు. దానికి బ్రహ్మ 'ఓ దేవతలారా! మీకు బుద్ధి కలిగింది కాని జ్ఞానోదయం కాలేదు! అందుకే దుఃఖిస్తున్నారు. సందేహాన్ని విడిచి జ్ఞానులలో శ్రేష్ఠులైన మీ పుత్రులు (పితరులు) చెప్పిన దానిని మననం చెయ్యండి. మీకు జ్ఞానోదయ మవుతుంది! దేవతలు-పితరులు (పూర్వదేవతలు) మీ ఇద్దరు మహా ప్రీతితో ఒకరినొకరు పూజించు కొనండి, పరస్పరం ప్రీతి కలిగి ఉండండి.' అని చెప్పి పంపించాడు. వెంటనే దేవతలు పుత్రులను (పితరులను) కలుసుకొని "మీరు మమ్ములను 'ఓ పుత్రులారా!' అని సంబోధించారు కనుక మీరు మాకు పితరులు అగుచున్నారు. ఇందులో సందేహం లేదు. ఏ మానవులైతే పుష్టిని అభ్యుదయాన్ని కోరి పితృదేవతల నుద్దేశించి శ్రాద్ధాలను పెడతారో అలాగే తండ్రులు, తాతలు, ముత్తాతల నుద్దేశించి పిండాలను పెడతారో దానికి వారు సంతోషించి వారిని వెన్నంటి యుండి అభ్యుదయాన్ని కలిగిస్తారు. సోముడు ప్రీతుడై సముద్రాన్ని పర్వతాలను, అడవులను, పంటలను వర్ధిల్ల చేస్తాడు. మనందరము పరస్పరం మైత్రితో ఉందాం!" అని పలికి మైత్రీ భావాన్ని పొందారు. ఈ విధంగా పితృదేవతల ఆరాధన భూలోకంలో వ్యాప్తిలోకి వచ్చింది."

**ఏడు పితృగణాల చరిత్ర**

సూత మహర్షి శౌనకాది ఋషులతో ఇలా అంటున్నాడు. "ఓ! మునులారా! దేవపూజ కంటె పితృశ్రాద్ధం గొప్పది. అందువల్ల మానవులు విధిగా తమ తండ్రితాతల యందు వంశకర్తల యందు భక్తికలిగి శ్రాద్ధక్రియలను పెట్టాలి. స్వర్గంలో ఏడు పితృగణాలున్నాయి. వాటిలో నాల్గు గణాలు మూర్తి మంతములు. వైరాజులు, అగ్నిష్వాత్తులు, బర్హిషదులు ఈ మూడు గణాలు అమూర్తములు. వీరు ప్రాణులందరిలో అమితమైన ఓజస్సు (సామర్థ్యం) కలవారు. వైరాజులను పితరుల మానస పుత్రికయే మేన. ఆమె హిమవంతుని భార్య అయింది. మేనా హిమవంతులకు ఒక్కడే కొడుకు. అతని పేరు మైనాకుడు. అతని కొడుకు క్రౌంచుడు. మేనకు ఉమ, ఏకపర్ణ, అపర్ణ అనే నామధేయాలు కల ముగ్గురు కుమార్తెలు జన్మించారు. వారిలో ఉమను రుద్రునకు, ఏకపర్ణను భృగువునకు, అపర్ణను జైగిషవ్యునకు ఇచ్చి వివాహం చేశారు.

అగ్నిష్వాత్తులు అను అమూర్త పితృగణం యొక్క మానస పుత్రికయే 'అచ్ఛోదా' అను కన్య. ఆమెకే 'అమావాస్యా' లేక 'అమావస్య' అనే పేర్లున్నాయి. ఈమెయే ఇరువది ఎనిమిదవ ద్వాపర యుగంలో వసువీర్యానికి చేప కడుపున జన్మించి సత్యవతి అనే పేరుతో దాశరాజుకు కూతురై, వ్యాసభగవానునికి తల్లి అయింది. శంతనునికి భార్యయై చిత్రాంగద, విచిత్రవీర్యులను

ఇద్దరు కుమారులను కన్నది. ఈమెకు పితృలోకంలో 'అష్టక' అని పేరు (భాద్రపద శుక్ల పూర్ణిమ గడిచిన వెంటనే వచ్చు సప్తమీ తిథికి 'అష్టక' అని పేరు).

బర్హిషదులు అను పితరులు పులస్త్య ప్రజాపతి కుమారులు. వీరి మానసకన్య 'పీవరి' అనే పేరుతో ద్యులోకంలో ప్రసిద్ధయై ఉంది. ఈమె యోగవిద్యకే తల్లి అనదగిన యోగిని. ఈమె తపస్సుచే శంకరుని మెప్పించి తపః ఫలంగా వ్యాసపుత్రుడు, యోగాచార్యుడైన శుకునకు భార్యయై కృత్తి అను కుమార్తెను కన్నది. కృత్తి మానవుడైన పాంచాలదేశ రాజుకు భార్యయై, యోగి మరియు సర్వప్రాణుల ధ్వని విశేషాలను యెరిగిన బ్రహ్మదత్తునకు తల్లి అయింది

మునులారా! మీకింత వరకు మానవుల కగోచరమైన అమూర్తిమంతములైన మూడు పితృగణాల గురించి చెప్పాను. ఇప్పుడు మూర్తిమంతములైన నాలుగు పితృగణాలు గూర్చి చెపుతున్నాను వినండి. వీరు సుకాలిన్లు బర్హిష్మంతులు – అజ్యపులు – సోమపులు అను నామధేయాలు కలవారు.

సుకాలిన్లు వసిష్ఠుని మానసపుత్రులు. వారు ద్యులోకానికి పైన 'జ్యోతిర్భాసి' అనే లోకంలో ఉంటారు. వీరి మానస పుత్రి పేరు 'గౌః' ఈమె శుక్రాచార్యుని భార్య. శూద్రులు వీరికిష్టం.

బర్హిష్మంతులు అంగిరః ప్రజాపతి మానసపుత్రులు. సూర్యమండల మందున్న 'మరీచి గర్భములు' అనే లోకంలో వారుంటారు. వీరి మానసపుత్రి 'యశోద'. ఈమె పంచజనుని కుమారుడైన అంశుమంతుని భార్య. దిలీప చక్రవర్తి తల్లి. భగీరథుని నాయనమ్మ. క్షత్రియులు వీరికిష్టం.

అజ్యపులు కర్దమ ప్రజాపతి కుమారులు. కామభోగ ఫలప్రదములైన 'కామదుఘములు' అనే లోకాలు వీరి నివాస స్థానం. వీరి మానస పుత్రిక పేరు 'విరజ'. ఈమె తర్వాత కాలంలో నహుషుని భార్యయై యయాతికి తల్లి అయింది. ఈమె బ్రహ్మలోకానికి చేరుకొని 'ఏకాష్టక' అను పేర ప్రసిద్ధురాలైంది. వైశ్యులు వీరికిష్టులు.

సోమపులు వీరు బ్రహ్మ లోకంలో గల మానసములు అనే లోకాలలో ఉంటారు. వీరు 'స్వధ' నుండి జన్మించారు. వీరి మానస పుత్రియే నర్మదా నది.

శ్రాద్ధకర్త శ్రద్ధతో శ్రాద్ధంలో సమర్పించిన ఆహారం ఏదైనా సరే; వసు, రుద్ర, ఆదిత్య రూపాలలో ఉన్న తన తండ్రి, తాత, ముత్తాతలకు వారెక్కడ ఏ రూపాలలో ఉన్నా పంచభూతముల తేజో విశేషం ద్వారా వారికి అందుతుంది.

**కౌశిక వంశీయులు శ్రాద్ధఫలముగా విష్ణు లోకమును పొందుట**

మునులారా! శ్రాద్ధ ఫలాన్ని చక్కగా వివరించే ఒక అద్భుతమైన పూర్వ గాథను చెపుతున్నాను! వినండి. పూర్వం కురుక్షేత్రంలో కౌశికుడు అనే ధర్మాత్ముడైన మహర్షి ఉండేవాడు. ఆయనకు ఏడుగురు కుమారులు. వారు వరుసగా వాగ్దుష్టుడు (చెడుగా మాటలాడు వాడు), క్రోధనుడు (కోపిష్టి), హింస్రుడు (హింసించే స్వభావం కలవాడు), పిశునుడు (కొండెములను చెప్పువాడు), కవి (గ్రంథరచనా కుశలుడు), స్వసృషుడు (స్వయముగా సృష్టించు వాడు), పితృవర్తి (పితరులను సేవించు వాడు). వారంతా సార్థక నామధేయులు. వారు గర్గ మహామునికి శిష్యులై విద్యాభ్యాసం చేస్తూండే వారు. అలా ఉండగా కొంత కాలానికి తండ్రి మరణించాడు. వారు పితృ కర్మను లెస్సగా నిర్వహించి గురువు వద్ద విద్యాభ్యాసాన్ని కొనసాగిస్తున్నారు. కాలం గడుస్తోంది. ఇంతలో అనావృష్టి కారణంగా కరవు వచ్చింది. ఆహారానికి కొరత ఏర్పడింది. వారు నిత్యము అడవికి వెళ్ళి గురువుగారి కపిల గోవును (దూడతో సహా) మేపటం, కట్టెపుల్లలు తేవటం ఇత్యాది గురుసేవను చేస్తూండే వారు. ఒర రోజున వారిలో కొందరు ఆకలి బాధకు తాళలేక "ఈ గోవును వధించి క్షుద్బాధను నివారించు కొందాం! అడవిలో పులి గోవును భక్షించిందని గురువు గారితో చెపుదాం. దూడను మాత్రం అప్ప చెపుదాం!" అనే దుష్ట ఆలోచన చేశారు. అందులో పితృవర్తి అనేవాడు గోవధ మహా పాతకమని చెప్పి ఒకవేళ తప్పనిసరి ఐతే పితృ శ్రాద్ధం జరిపి అందులో గోమాంసాన్ని వినియోగించి తిందాం. అప్పుడు మనకు పాపం అంటదు... అని ఉపాయాన్ని చెప్పాడు. అతని మాటకు తక్కిన వారందరు సరే యని యథా శాస్త్రీయంగా ఆ కార్యాన్ని నిర్వహించారు. పిమ్మట గురువును చేరి గోవును పులి తినేసిందని చెప్పి దూడను మాత్రం అప్ప చెప్పారు. పిమ్మట కాలగతిలో వారందరు మరణించారు.

మరుజన్మలో వారు గోవధ అనే క్రూరకర్మను ఆచరించిన దానికి ఫలంగా దశార్ణ దేశంలో ఒక కిరాతునకు పుత్రులై జన్మించారు. కాని శ్రాద్ధంలో పితృదేవతలను సంతోష పెట్టిన కారణంగా పూర్వజన్మ జ్ఞానాన్ని కలిగియుండి ధర్మబద్ధంగా జీవించారు. వారికి గత

జన్మల శాస్త్ర జ్ఞానం కూడా ఉంది. తరువాత కొంత కాలానికి వారు కాలధర్మాన్ని పొంది తిరిగి కాలంజర పర్వత సమీపంలో లేళ్ళుగా జన్మించారు. అప్పుడు కూడా పితృదేవతారాధన ఫలంగా పూర్వజన్మ స్మృతి జ్ఞానాన్ని కలిగియుండి శివ సన్నిధిలో జ్ఞానవైరాగ్యాలతో జీవించి కాలగతిని పొందారు, మరుజన్మలో వారు మానస సరోవరంలో చక్రవాక పక్షులై జన్మించి పూర్వజన్మస్మృతి జ్ఞానం కలిగి యోగులై జీవించారు. ఆ పక్షుల పేర్లు: సుమనస్కుడు, సువాక్, శుద్ధుడు, పశ్చిముడు, ఛిద్రదర్శకుడు, స్వతంత్రుడు, సుయజ్ఞుడు. వారు పేరుకు తగినట్లు కర్మలను ఆచరిస్తూ ఉండేవారు.

మునులారా! ఒకరోజున ఒక చిత్రమైన సంఘటన జరిగింది. చెపుతున్నాను వినండి. పాంచాల దేశ రాజైన వైభ్రాజుడు తన అంతఃపుర స్త్రీలతోను, పరివారంతోను ఉద్యానవన విహారానికై వచ్చి సవిలాసంగా విహరిస్తూ ఉండగా ఆ చక్రవాక పక్షులు చూచాయి. కౌశికుని కుమారులలో పితృవర్తి అనువాడు రాజు యొక్క వైభవాన్ని చూచి తానుకూడా మరుజన్మలో రాజు. కావలెనని సంకల్పం చేశాడు. మరో ఇద్దరు మంత్రులను చూచి మరుజన్మలో మంత్రులుగా పుట్టాలని సంకల్పం చేశారు. మిగిలిన నలుగురు ఏమీ సంకల్పం చెయ్యలేదు.

కొంతకాలం తర్వాత చక్రవాక పక్షులు కాలధర్మాన్ని పొందాయి. అందులో పితృవర్తి అనేవాడు పాంచాలదేశ రాజైన వైభ్రాజునకు బ్రహ్మదత్తుడను పేర కుమారుడై జన్మించాడు. మిగిలిన వారిలో ఇద్దరు కండరీకుడు, సువాలకుడు అను పేర్లతో జన్మించి; బ్రహ్మదత్తుడు పట్టాభిషిక్తుడు కాగానే అతనికి మంత్రులయ్యారు. మిగిలిన నలుగురు పాంచాల రాజధాని ఐన కౌంపిల్య నగరంలో నివసించే ఉత్తమ శ్రోత్రియుడైన విద్యాచండుడనే బ్రాహ్మణునకు పుత్రులై జన్మించారు. వీరు పూర్వ జన్మస్మృతి జ్ఞానం కలవారు. శ్రాద్ధ కర్మలో ఉపయోగింపబడిన గర్గుని కపిల గోవు, దేవలుడను రాజుకు సన్నతి అనుపేర కుమార్తెగా జన్మించి బ్రహ్మదత్తునికి భార్యయై వేదవేత్రి అయింది.

ఒక రోజున బ్రహ్మదత్తుడు తన దేవేరి సన్నతితో కూడి ఉద్యానవనంలో విహరిస్తూ... కామ ప్రవృత్తి హేతువుగా కలహించుకొంటూన్న చీమల దంపతులను చూచాడు. సకలప్రాణి ధ్వని విశేషాల నెరిగిన బ్రహ్మదత్తుడు చీమల దంపతుల సంభాషణ అంతటిని విన్నాడు. మగచీమ కామశర పీడితయై గద్గదస్వరంతో ఆడచీమను ఇలా బ్రతిమాలుతూ అనునయిస్తోంది:

"ప్రియురాలా! సుందరీ! కళ్యాణీ! జగన్మోహినీ! నీ అంత అందగత్తెను నేనెక్కడా చూడలేదు! నీ నడుము సన్నగా ఎంత అందంగా ఉంది! దానికి ఆకాశం అందదు మనోహరమైన ముఖం మెరిసే చెక్కిళ్ళు విశాలమైన నేత్రాలు ప్రసన్నమైన చూపులు! ఓయారంపు నడక! మేలిమి బంగారపు మేనిఛాయ! నాయందు నీకు అమితమైన భక్తి! నేనెప్పుడైన పొరుగూరు వెడితే నీవు దీనురాలవై ఉంటావు. నీకు బెల్లము మీద చక్కెర మీద ప్రీతి యెక్కువ. నేను భుజించనిదే నీవు భుజించవు. నా బాధను చూచి నీవు కన్నీరు కారుస్తావు! అట్టి నీవు నా యెడ ఎందుకని కోపంతో ఉన్నావు? చెప్పవూ!"

మగచీమ మాటలకు ఆడుచీమ శోకంతో ఇలా బదులిచ్చింది: "ఓ! శఠా! (తప్పుచేసి కప్పిపుచ్చుకొనే వాడు) నన్నెందుకు బ్రతిమాలుతావు? నిన్నటి రోజున పారవశ్యంతో ఒడలెరుగక ఒక మధుర భక్ష్యాన్ని పొడిచి నాకీయకుండ అతిప్రేమతో మరొక ఆడుచీమకు ఇచ్చి లాలనతో తినిపించావు! ఈ కపట నాటకాలు కట్టిపెట్టు! నీ పొగడ్తలకు పొంగిపోయే వారెవరూ ఇక్కడ లేరు! వెళ్ళు! వచ్చిన దారినే వెళ్ళు!"

దానికి సమాధానంగా మగచీమ ఇలా అంది: "ఓహో! అదా సుందరీ! నువ్వెప్పుడూ నా చెంతనే ఉంటావు! ఆకారణంగా నీ పోలికతో ఉన్న మరొక చీమకిచ్చాను... నువ్వే అని అనుకొని! క్షమించు! మరెప్పుడూ అలాటి పొరపాటు పని చెయ్యను! కేవలం భ్రమ ప్రమాదం వల్ల జరిగిన పని అది! సత్యం ప్రమాణంగా నీ పాదాలను పట్టుకొంటున్నాను. నన్ను క్షమించు! అనుగ్రహించు! నాయందు సముఖురాలవు కమ్ము! ప్రసన్నురాలవు కమ్ము!" మగచీమ మాటలకు ఆడచీమ మిక్కిలి ప్రసన్నురాలై తనను తాను ప్రియునకు సమర్పించుకొన్నది.

చీమ దంపతుల సంభాషణను వినిన బ్రహదత్తుడు అమితాశ్చర్యాన్ని పొంది నవ్వేడు. చెంతనే ఉన్న అతని భార్య సన్నతి అతని నవ్వును చూచి కారణాన్ని అడిగింది. రాజు చీమ దంపతుల సంభాషణను తాను వినిన దానిని ఉన్నదున్నట్లుగా చెప్పాడు. కాని సన్నతి దానిని నమ్మక తన విషయంలోనే రాజు నవ్వినట్లుగా అనుమానించి నిజం చెప్పమని హఠం చేసింది. "నాయందు అనురాగము, విశ్వాసము లేని నీతో జీవించను!" అని ప్రతిజ్ఞ చేసింది.

"నేను చెప్పిన దానికి రేపు ఉదయం నీకు సాక్ష్యాన్ని కనబరుస్తాను!" అని పలికి రాజు మౌనాన్ని వహించి ఆ రాత్రి శివుని ధ్యానించాడు. బ్రహ్మదత్తుడు గొప్ప శివభక్తుడు.

శివానుగ్రహం చేతనే ఆయనకు సకల ప్రాణుల ధ్వని విశేషాలను తెలుసుకొనే సామర్థ్యం లభించింది. రాజునకు ఆ రాత్రి ధ్యానంలో శివుడు ప్రత్యక్షమై "రాజా! రేపు ఉదయమే నీ భార్యతోను, మంత్రులతోను కలిసి నగర సంచారం చేయి! నీకొక వృద్ధ బ్రాహ్మణుడు కనుపిస్తాడు. అతని మూలంగా నీకు సమస్తము విశదం కాగలదు!" అని చెప్పి అంతర్హితుడయ్యాడు.

**వృద్ధ బ్రాహ్మణుని వృత్తాంతం**

మునులారా! ఏడు చక్రవాక పక్షులలోను నాలుగు పక్షులు కాంపిల్య నగరంలో విద్యాచండుడనే ఉత్తమ శ్రోత్రియునకు నలుగురు పుత్రులుగా జన్మించారని చెప్పాను గదా! వారు పూర్వజన్మ స్మృతిజ్ఞానం కలిగి ఉండేవారు. వారు పెరిగి పెద్దవారై వైరాగ్యాన్నిపూని తపస్సాచరించి ఉత్తమగతిని పొందాలనే దృఢ సంకల్పంతో తండ్రి అనుమతి కోరగా ఆయన "వృద్ధుడు, నిర్ధనుడు ఐన తండ్రిని విడిచి వెళ్ళటం మీకు న్యాయం కాదు. అది ధర్మవిరుద్ధం. కనుక అనుమతించ లేను!" అని సమాధాన మిచ్చాడు.

దానికి వారిలా ప్రత్యుత్తరమిచ్చారు: "తండ్రీ! కురుక్షేత్రంలో కౌశిక బ్రాహ్మణునకు పుత్రులుగా జన్మించి, ఆపై దశపురంలో వ్యాధులుగా పుట్టి, పిమ్మట కౌలంజర పర్వతంవద్ద లేళ్ళుగా, అటు పిమ్మట మానస సరస్సునందు చక్రవాక పక్షులుగా జన్మించిన మేము ఈ జన్మలో నీ పుత్రులుగా జన్మించాం. నీవు వెళ్ళి రాజైన బ్రహ్మదత్తుని ఆశ్రయించు. మా పూర్వజన్మ వృత్తాంతాన్ని అతనితో చెప్పు. నీకు రాజు వసతిని కల్పిస్తాడు. అని చెప్పి వారు తపస్సు ఆచరించటం కొరకు వనానికి వెళ్ళిపోయారు.

బ్రహ్మదత్తుడు తన భార్య ఐన సన్నతితోను, మంత్రులతోను కలిసి ఉదయమే నగర సంచారానికి బయలుదేరాడు. దారిలో విద్యాచండుడు ఎదురై రాజుతో ఇలా అన్నాడు. "కురుక్షేత్రంలో కౌశిక పుత్రులుగా పుట్టిన వారే మరుజన్మలో దశపురంలో వ్యాధులుగా, తరువాత జన్మలో లేళ్ళుగా, ఆపై జన్మలో చక్రవాక పక్షులుగా జన్మించి ఇప్పుడిక్కడ పుట్టి యోగసిద్ధిని పొందగోరుచున్నారు!"

వృద్ధ బ్రాహ్మణుని మాటను వినగానే రాజునకు సన్నతికి మంత్రులకు పూర్వజన్మ స్మృతి కలిగింది. బ్రహ్మదత్తుడు బ్రాహ్మణునకు వసతిని కల్పించి, భూములను, ధనాన్ని ఇచ్చి సత్కరించాడు. మంత్రులలో సువాలకుడు పంచాల దేశంలో 'బాభ్రవ్య' గోత్రంలో జన్మించిన కారణంగా పాంచాల బాభ్రవ్యుడను పేరుతో లోక ప్రసిద్ధుడై బృహత్తరమైన

కామశాస్త్ర గ్రంథాన్ని వ్రాశాడు. తరువాత కాలంలో ఆ గ్రంథం "బాభ్రవ్య స్మర దర్శనము" అను పేరుతో లోక ప్రసిద్ధమై దర్శన గౌరవాన్ని పొంది తదనంతర కామశాస్త్ర ఆచార్యులందరకు ప్రామాణికమై, ఆధార గ్రంథమై మన్నన కెక్కింది. ఈ యుగంలో ఈ లోకంలో కామశాస్త్ర ప్రవర్తకుడతడే. నిర్మల చిత్తుడైన కండరీకుడు లోక హితార్థం వైద్యశాస్త్ర గ్రంథాన్ని నిర్మించి వాసికెక్కాడు.

తర్వాత కొంతకాలానికి బ్రహ్మదత్తుడు సకల సద్గుణ సంపన్నుడైన తన కుమారుని రాజుగా అభిషేకించి తన మంత్రులతో కూడి అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ వారందరు వానప్రస్థ జీవితాన్ని గడిపి యోగంచే ఉత్తమ లోకాలను పొందారు.

ఇది పితృదేవతారాధన వల్ల లభించే ఉత్తమలోక ప్రాప్తిని గురించి వివరించే చక్కని పూర్వగాథ. ఈ గాథను శ్రాద్ధ సమయంలో సత్పురుషుడైన ఆచార్యునిచే చదివించుకొని శ్రద్ధాభక్తులతో విని ఆచార్యుని పూజించాలి. యథాశక్తి ఆయనను సత్కరించాలి.

### వ్యాస భగవానుని జన్మ వృత్తాంతం

సూత వచనాలను శ్రద్ధతో ఆలకించిన మునులు పరమప్రీతులై అష్టాదశ పురాణ కర్త, మహాభారత సంహితా రచనా ధురంధరుడు, సత్యవతీ పుత్రుడు అయిన వ్యాస భగవానుని జన్మ వృత్తాంతాన్ని సవిస్తరంగా చెప్పవలసిందని వినయంగా వేడగా సూతమహర్షి పరమ హర్షంతో తన గురువుగారి జన్మ వృత్తాంతాన్ని ఇలా చెప్పసాగేడు: "మునులారా! పరమ తపోనిధి, జ్ఞాన భాస్కరుడు, సర్వ మానవాళికి జ్ఞాన తేజస్సును పంచి ధర్మాధర్మాలను వివరించి చెప్పి మనుష్యులలోని పశుత్వాన్ని మాన్పినవాడు అయిన మా గురువుగారి దివ్యమైన జన్మ వృత్తాంతాన్ని చెపుతున్నాను వినండి!

పూర్వం చేది దేశాన్ని పాలించే వసువు అనే రాజు మృగయా వినోదార్థం అడవికి వెళ్ళి అక్కడ తపస్సు చేసుకొంటున్న ఒక మునిని చూచి నిర్వేదంతో అస్త్ర సన్న్యాసం చేసి తానుకూడా మహానిష్ఠతో తపశ్చర్యకు ఉపక్రమించాడు. అతని ముందు ఇంద్రుడు ప్రత్యక్షమై వసురాజుకు దేవత్వాన్ని కల్పించి బహుమానంగా ఒక దివ్య విమానాన్ని, వాడని పద్మమాలను, దుష్ట శిక్షణ శిష్ట రక్షణా సామర్థ్యం గల వేణుయష్టిని (రాజ దండాన్ని) ఇచ్చి; ఈ స్నేహాన్ని కాపాడుకొనవలసింది అని చెప్పి అంతర్హితుడయ్యాడు. అప్పటి నుండి వసురాజు ఇంద్రుడిచ్చిన విమానం మీద ఉపరి లోకాలలో విహరిస్తూ ఉండేవాడు. ఆ కారణంగా అతనికి 'ఉపరిచర వసువు' అనే పేరు రూఢికెక్కింది. ఏటేట వసురాజు వేణు యష్టికి (రాజ దండానికి)

పూజలు చేసి ఇంద్రోత్సవాన్ని జరిపించే వాడు. అది మొదలు రాజులందరు లోకంలో ఇంద్రోత్సవాన్ని జరిపించటం పరిపాటి అయింది. అతనికి బృహద్రథుడు, మణివాహనుడు, సౌబలుడు, యదువు, రాజన్యుడు అను ఐదుగురు పుత్రులు. వారందరిని వేరువేరు దేశాలకు అభిషిక్తులను చేసి వసురాజు రాజర్షియై రాజ్యం చేస్తూండగా ఒకరోజున...

తన రాజధాని సమీపంలో ప్రవహిస్తున్న శుక్తిమతి అనే నదిని కామించి కోలాహలుడనే పర్వతరాజు నదిని అడ్డగించి బాహువులతో బంధించాడు. శుక్తిమతి మొరాలకించి వసురాజు తన కాలితో ఆ పర్వతాన్ని తొలగ ద్రోశాడు. పర్వత సమాగమంచే శుక్తిమతికి వసుపదుడు అనే కుమారుడు, గిరిక అనే కూతురు ఉద్భవించారు. తనకుఉపకారం చేసిన వసురాజుకు తన సంతానమైన ఆ ఇద్దరిని కృతజ్ఞతా సూచకంగా అప్పగించింది శుక్తిమతి. వసురాజు గిరకను తన ధర్మపత్నిగా చేసికొని వసుపదుణ్ణి సేనాపతిగా నియమించాడు.

ఒకరోజున ఋతుమతి ఐన గిరకకు మృగమాంసాన్ని తెచ్చిపెట్టమని పితృదేవతలు శాసించగా వసురాజు వేటకు వెళ్ళి వనంలో గిరికయొక్క సౌందర్యాన్నే తదేకనిష్ఠతో ధ్యానం చేయగా రాజుకు రేతఃస్థలనమైంది. రాజు ఆ వీర్యాన్ని శీతల పర్ణపుటంలో సంగ్రహించి బంధించి దానిని ఒక డేగ మెడకు కట్టి గిరికాదేవికి ఇమ్మని పంపించాడు. ఆ డేగ అతిత్వరిత గతిని ఆకాశ మార్గంలో పయనిస్తూ ఉండగా, ఒక గ్రద్ద ముక్కున నున్నది మాంసఖండమనే భ్రాంతిచే పర్ణపుటాన్ని కాళ్ళచే గ్రహించబోయింది. ఆ రెండింటి పెనగులాటలో పర్ణపుటం జీర్ణమై వసువీర్యం చెదరి యమునా నదీ మధ్యలో పడింది. బ్రహ్మ శాపవశం చేత అద్రిక అనే అప్సరస యమునా నదిలో మీనమై తిరుగుతూ వసువీర్య బిందుద్వయాన్ని త్రావి గర్భాన్ని దాల్చింది. పదిమాసములు నిండింది. ఒకరోజున జాలరులు చేపలవేటకై వచ్చి వలలు వేయగా అద్రిక వలలో చిక్కింది. జాలరులు పెద్ద చేప చిక్కింది అనే సంబరంతో చేప ఉదరాన్ని ఛేదించగా అందులో ఆడ-మగ శిశువులను చూచి తక్షణం వారిద్దరిని తమ ప్రభువైన దాశరాజు కిచ్చారు. అద్రిక శాపవిమోచనాన్ని పొంది అదృశ్యమైంది. కొడుకు పెరిగి పెద్దవాడై మత్స్యరాజుగా పిలువబడి రాజయ్యాడు. మత్స్యరాజుచే పాలింపబడిన దేశం మత్స్యదేశం అయింది. ఆడపిల్లకు మత్స్యగంధి అని పేరుపెట్టి దాశరాజు అల్లారుముద్దుగా పెంచుకొంటున్నాడు. మత్స్యగంధి పెరిగి పెద్దయై తండ్రికి చేదోడు వాదోడుగా ఉంటోంది.

ఒక రోజున వసిష్ఠ పౌత్రుడు, శక్తిమహర్షి పుత్రుడు అయిన పరాశర మునీంద్రుడు తీర్థయాత్ర సలుపుతూ యమునానదీ తీరానికి చేరుకొని అక్కడ ఉన్న దాశరాజుతో ఆవలి తీరానికి చేర్చమని కోరేడు. భోజనం చేస్తున్న దాశరాజు తన కుమార్తెయైన మత్స్యగంధిని పిలిచి మహర్షిని శీఘ్రంగా నది ఆవలి తీరానికి చేర్చమని ఆజ్ఞాపించాడు. భాస్కర తేజుడైన మహర్షి పడవలో ఆసీనుడయ్యాడు. ఏకవస్త్రయైన మత్స్యగంధి పడవ నడుపుతూ ఉండగా ఆమె శరీర రూప రేఖాలావణ్య సౌష్ఠవ విభ్రమ హేలా లీలా విలాసాలను చూచి మోహవిభ్రాంతుడైనాడు మహర్షి. తననింతగా మన్మథతాపానికి గురిచేస్తూన్న ఆమె పూర్వజన్మ వృత్తాంతాన్ని యోగమహిమచే తెలుసుకొన్నాడు. గ్రహగతులను పరిశీలించాడు. కాలమహిమను గుర్తించాడు. భవిష్యత్తును పరికించాడు. అప్సరసల సౌందర్యానికి సైతం మోహితుడు కాని మహర్షి తన కోర్కె తీర్చమని కుడిచేతితో ఆమె కుడిచేతిని పట్టుకొన్నాడు. మునిచర్యకు ఆశ్చర్యపడిన ఆమె, ఆయన కోర్కెను తిరస్కరిస్తే శపిస్తాడేమో అని భయపడి లజ్జా, వినయ, సాధ్వస, సంభ్రమ, సందేహ, శంకా సంకలిత మానసయై ఇలా అంది:

"ఓ వాచంయమీ! తపశ్శాలురైన వారికి తగని పనిని చేస్తున్నావు. మీ బోటి వారికిది అతినిందితమైన కర్మ. ఎనుబదినాలుగు కోట్ల జీవరాసులలో మానవజన్మ దుర్లభం! అందులో బ్రాహ్మణ జన్మ మరీ దుర్గభం. తపశ్శాలి కాగల్గుట అత్యంత దుర్లభం. నేను పల్లెపడుచును. శరీరమంతా చేపల వాసన! పైగా కన్యను! నా తండ్రి ఒడ్డున ఉన్నాడు. దివాభాగం ఆ పనికి నిషిద్ధం. నల్లని వర్ణంగల ఈ జాలరిదాని కోసం మీ తపస్సును వృథా చేసికోకండి!"

కన్యయైన మత్స్యగంధి పల్కులను విని పరాశరుడు దాని ఇంగితాన్ని గుర్తించి యోజన దూరం వరకు పరివ్యాప్తమయ్యే దివ్య పరిమళంగల దానినిగా దానిని తీర్చి... కన్యాత్వం దూషితం కాకుండా వరమిచ్చి... దాని పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలియ చెప్పి... అనేక దివ్యాంబరాభరణాదుల నిచ్చి... తన తపోమహిమచే ఒరులకు కానరాకుండా దట్టమైన నీహార తిమిరాన్ని సృష్టించి... లోక కళ్యాణాన్ని మనసులో సంకల్పించి మత్స్యగంధిని కూడి... తన ఆజ్ఞను సత్యం చేసినందుకు ఆమెకు 'సత్యవతి' అని నామకరణం చేసి... నిత్య సుగంధాన్ని, నిత్య యౌవనాన్ని వరాలుగా ఇచ్చి... తనంతటి పుత్రుడు కలుగుతాడని ఆశీర్వదించి... యమునా జలాలలో స్నానమాడి యథేచ్ఛగా వెళ్ళిపోయాడు.

పరమేష్ఠి కల్పుడైన పరాశర మునీంద్రు సమాగమంచే, పరమగుణైకాభరణ, అనవద్య మనోహరమూర్తి అయిన సత్యవతి, సద్యోగర్భాన్ని దాల్చి... కృష్ణాజిన జటా దండ

కమండలుధారి, వేదమయుడు, అఖిల మునీంద్రాద్యుడు అయిన పుత్రుని కన్నది. ఆ పుత్రుడు సత్యవతి కుమారుడు కనుక సాత్యవతేయుడని, పరాశర మహర్షికి పుట్టాడు కనుక పారాశర్యుడని, ద్వీపంలో జన్మించాడు కనుక ద్వైపాయనుడని, వేదాలకు శాఖా విభాగం చేశాడు కనుక వేదవ్యాసుడని లోక ప్రసిద్ధిని పొందేడు. పుట్టిన వెంటనే ఆ తేజశ్శాలి "నువ్వు నన్ను స్మరించిన వెంటనే నేను వచ్చి నీ కోరికను నెరవేరుస్తాను!" అని తల్లికి చెప్పి తపస్సుకై బదరీ వనానికి వెళ్ళిపోయాడు. మునులారా! ఇదీ మా గురువుగారి జన్మ వృత్తాంతం!"

**వ్యాస భగవానుని కాశీ క్షేత్ర దర్శనం**

భగవానుడైన వ్యాసుడు వివిధ పుణ్యక్షేత్ర, తీర్థాలలో తపస్సును చేయ సంకల్పించి ముందుగా నైమిషాన్ని దర్శించి తరువాత కురుక్షేత్రాన్ని, గంగాద్వారాన్ని, అవంతికను, అయోధ్యను, మథురను, ద్వారకను, అమరావతిని, సరస్వతిని, సింధునదీ సంగమాన్ని, గంగా సంగమాన్ని, కాంచి, శ్రీకాళహస్తి, త్ర్యంబకం, గోదావరీ తీరమందలి ఏడు క్షేత్రాలను, కాలంజరం, ప్రభాసం, బదరికాశ్రమం, మహలయం, ఓంకారం, పురుషోత్తమం, గోకర్ణం, భృగుకచ్ఛం, భృగుతుంగం, పుష్కరం, శ్రీ పర్వతం, ధారాతీర్థం మొదలైన పుణ్యక్షేత్రాలను సందర్శించి పుణ్య తీర్థాలలో స్నానమాచరించి గొప్ప తపస్సు చేశాడు. అలా పర్యటిస్తూ వారాణసీ నగరాన్ని చేరి మణికర్ణికలో స్నానమాచరించి అన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శనం చేశాడు. అక్కడగల కుండములు, బావులు, దిగుడు బావులు అన్నిటిలోను స్నానం చేసి అక్కడగల వినాయకులను గౌరీ దేవతలను దర్శించి కాలరాజులను, భైరవులను పూజించాడు. అక్కడగల దండనాయక గణాలకు నమస్కరించి, ఆదికేశవాది దేవతలను స్తుతించి లోలార్కాది సూర్యదేవతలకు పలుమార్లు మ్రొక్కాడు.

కాశీలోగల ఓంకారేశ్వర, కృత్తివాసేశ్వర, కేదారేశ్వర, కామేశ్వర, చంద్రేశ్వర, కాలేశ్వర, వృద్ధ కాలేశ్వర, జ్యేష్ఠేశ్వర, జంబుకేశ్వర, జైగీషవ్యేశ్వర, దశాశ్వమేధేశ్వర, ద్రుమిచండేశ్వర, దృక్కేశ్వర, గరుడేశ్వర, గోకర్ణేశ్వర, గణేశ్వర, ప్రసన్నవదనేశ్వర, ధర్మేశ్వర, తారకేశ్వర, నందికేశ్వర, నివాసేశ్వర, పత్రీశ్వర, పర్వతేశ్వర, పశుపతీశ్వర, హాటకేశ్వర, బృహస్పతీశ్వర, తిలభాండేశ్వర, భారభూతేశ్వర, మహాలక్ష్మీశ్వర, మరుతేశ్వర, మోక్షేశ్వర, గంగేశ్వర, నర్మదేశ్వర, కృష్ణేశ్వర, పరమేశ్వర, రత్నేశ్వర, యామునేశ్వర, లాంగలీశ్వర, శ్రీమద్విశ్వేశ్వర, అవిముక్తేశ్వర, విశాలాక్షీశ్వర, వ్యాఘ్రేశ్వర, వరాహేశ్వర, విద్యేశ్వర, వరుణేశ్వర, విధీశ్వర, హరికేశేశ్వర, భవానీశ్వర, కపర్దీశ్వర, కందుకేశ్వర, అజేశ్వర, విశ్వకర్మేశ్వర, వీరేశ్వర, నాదేశ్వర, కపిలేశ్వర,

భువనేశ్వర, బాష్కలీశ్వర, మహాదేవేశ్వర, సిద్ధీశ్వర, విశ్వేదేవేశ్వర, వీరభద్రేశ్వర, భైరవేశ్వర, అమృతేశ్వర, సతీశ్వర, పార్వతీశ్వర, మతంగేశ్వర, భూతేశ్వర, ఆషాఢేశ్వర, ప్రకామేశ్వర, కోటిరుద్రేశ్వర, మదాలసేశ్వర, తిలపర్ణేశ్వర, హిరణ్యగర్భేశ్వర, మధ్యమేశ్వర ఇత్యాది కోటి లింగాలను దర్శించి, పూజించి, స్తుతించాడు.

ఈ మధ్యమేశ్వర లింగం అవిముక్త క్షేత్రంలో నగర మధ్యన ఉన్న కారణంగా దానికాపేరు వచ్చింది. ఆ లింగాన్ని ఆరాధించి బ్రహ్మ సృష్టికర్త, విష్ణువు స్థితికర్త, రుద్రుడు లయకర్తలయ్యారు. వాసవుడు స్వర్గాధిపతి అయ్యాడు. యమ, వరుణ, కుబేరాదులు లోకపాలకులు కాగలిగారు. తుంబురు, నారాదాదులు సంగీత విద్యలో నిష్ణాతులు కాగలిగారు. వామదేవుడు శివభక్తులకు అధీశ్వరుడైనాడు. ఖట్వాంగుడనే రాజు సంతానాన్ని పొంద గలిగాడు. భక్తిపూర్ణయగు చంద్రభామ అనే అప్సరస నృత్యగానాలతో మధ్యమేశ్వరుని అర్చించి లింగ మధ్యంలో దేహంతో లయమైంది. శ్రీకరుడనే గొల్లపిల్లవాడు గణాధ్యక్ష స్థానాన్ని పొందేడు.

ఈ విషయాలను ఎఱిగిన వ్రతశీలుడైన వ్యాసుడు తాను వేద విజ్ఞానాన్ని బడయగోరి, పురాణకర్త కాదలచి మధ్యమేశ్వర లింగాన్ని నియమ పాలనతో ఆరాధిస్తూ అతి కఠోరమైన తపస్సును అవిముక్త క్షేత్రంలో ఆచరించాడు. వ్యాసుని తపోదీక్షకు మెచ్చిన ఉమాభూషిత వామాంగుడు, వ్యాఘ్రచర్మాంబరధరుడు, జటాజూట చలద్గంగా తరంగ శోభితుడు, బాలేందు శేఖరుడు, భస్మోద్ధూలిత ధూసరాంగుడు, కర్పూరార్జున విగ్రహుడు, కర్ణాంతాయత విశాలనేత్రుడు, చారుకపోల భాసితుడు, నీలకంఠుడు, ఫాలలోచనుడు అయిన శంకరుడు ఐందేండ్ల బాలుని రూపంలో సామగానం చేస్తూ నవ్వు ముఖంతో లింగ మధ్యంలో సాక్షాత్కరించాడు. శతకోటి కందర్ప సమాన సౌందర్య విలసితుడు, శారద పూర్ణిమా సంకాశ సుందర మందహాస వదనారవిందుడు అయిన బాలుని చూచి ఆ బాలుడు పార్వతీపతి అని గుర్తెరిగి మేన పులకాంకురాలు పొడమ, హర్షోన్మీలితారవిందాక్షుడై, కన్నుల ఆనందాశ్రువు లొలుక వ్యాసుడు బుద్ధిసమంచితమైన వాక్కుల ఇలా స్తుతించాడు:

**శ్లో॥ దేవదేవ! మహాభాగ! శరణాగత వత్సల ।**
**వాఙ్మనః కర్మ దుష్ప్రాపయోగినా మప్యగోచర ॥**
**మహిమానం న తే వేదా విదామాసురుమాపతే ।**
**త్వమేవ జగతః కర్తాధర్తాహర్తా తథైవ చ ॥**

**త్వమాద్య స్సర్వదేవానాం సచ్చిదానంద ఈశ్వరః ।**
**నామగోత్రే న వా తే స్తస్సర్వజ్ఞోఽసి సదాశివ ॥**
**త్వమేవ పరమం బ్రహ్మ మయాపాశ నివర్తకః ।**
**గుణత్రయైర్న లిప్తస్త్వం పద్మపత్రమివాంభసా ॥**
**నతే జన్మ న వా శీలం న దేశో న కులం చ తే ।**
**ఇత్థం భూతోఽపీశ్వరత్వం త్రిలోక్యాః కామమావహేః ॥**
**నచ బ్రహ్మే న లక్ష్మీశో న చ సేంద్రా దివౌకసః ।**
**న యోగీంద్రా విదుస్తత్వం యస్యతం త్వాముపాస్మహే ॥**
**త్వత్తస్సర్వం త్వం హి సర్వం గౌరీశస్త్వం పురాంతకః ।**
**త్వం బాలస్త్వం యువా వృద్ధ స్త్వం త్వాం హృది యువజ్మహమ్ ॥**
**సమస్తస్మై మహేశాయ భక్తధ్యేయాయ శంభవే ।**
**పురాణ పురుషాయాద్యా శంకరాయ పరాత్మనే ॥**

**తా॥** ఓ దేవదేవా! మహాభాగా! శరణాగత వత్సల! నీవు వాక్కులకు, మనస్సుకు, కర్మలకు అందవు. యోగులకు సైతం అగోచరుడవు! హే ఉమాపతీ! నీ మహిమను వేదాలు సైతం తెలుసుకో లేవు. జగత్తుకు కర్తవు, ధర్తవు, హర్తవు నీవే! సచ్చిదానంద ఈశ్వరుడవగు నీవే సర్వ దేవతలలోను ఆది దైవానివి! సర్వజ్ఞుడవైన సదాశివా! నీకు నామ గోత్రములు లేవు! మాయాపాశమును నివర్తించు పరంబ్రహ్మవు నీవే! తామరాకును అంటని నీరువలె సత్త్వరజస్తమో గుణాలు నిన్ను అంటవు. నీకు జన్మ, శీల, దేశ, కులాదులు లేవు! ఐనా నీవు నీ ఇచ్ఛ చేతనే ముల్లోకాలకు ఈశ్వరుడవై ఉన్నావు! త్రిమూర్తులు, ఇంద్రుడు, దేవతలు, యోగీంద్రులు సైతం నిన్ను తెలుసుకోలేరు! అట్టి నిన్ను నేను ఉపాసిస్తున్నాను! ఓ గౌరీశా! త్రిపురాంతకా! సర్వము నీవే, సమస్తము నీవే, బాలుడవు నీవే, యువకుడవు నీవే, వృద్ధుడవు నీవే! నిన్ను హృదయంలో ప్రతిష్ఠించుకొన్నాను. మహేశా! భక్తధ్యేయా! పురాణ పురుషా! శంకరా! నీకు అనేక ప్రణామాలు.

ఈ విధంగా స్తుతించి సాత్యవతేయుడు శంకరునికి అనేక సార్లు దండప్రణామాలాచరించి ఆ బాలుని ముందు చేతులు జోడించి నిలబడ్డాడు. బాలుని రూపంలో ఉన్న సర్వజ్ఞుడైన శంకరుడిలా వరమిచ్చాడు. "ఓ బ్రహ్మవిదుడా! నీ హృదయంలో ఉన్న 'అభిలాష' నిశ్చయంగా నెరవేరుతుంది. సకల ప్రాణులలోను అంతర్యామి స్వరూపంగా

శివస్వరూపంలో ఉన్న నేను నీ కంఠమందుండి ఇతిహాస పురాణాలను నీవు చక్కగా వ్రాసేటట్లు నీకు వరమిస్తున్నాను. నీ పేరు, నీ వాఙ్మయం జగద్వ్యాప్త మవుతుంది. నీ వాఙ్మయం ప్రళయంలో కూడా నశించదు. నీవు చేసిన స్తుతికి 'అభిలాషాష్టకము' అని పేరు. దీనిని పఠించిన వారి అభిలాష (కోరిక లేక ఇచ్ఛ) తప్పక నెరవేరుతుంది." అని శంభుడు వరమిచ్చి అదృశ్యుడయ్యాడు.

ఈ విధంగా శివానుగ్రహాన్ని పొంది పారాశర్యుడైన వ్యాసుడు పద్దెనిమిది పురాణాలను వ్రాశాడు. బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, భాగవత, భవిష్య, నారద, మార్కండేయ, అగ్ని, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, వామన, కూర్మ, మత్స్య, గరుడ, స్కాంద, బ్రహ్మాండములు అనునవి వాటి పేర్లు. బ్రహ్మ పురాణం మొదటిది. చతుర్ముఖ బ్రహ్మ స్వయంగా చెప్పిన కారణంగా దానికా పేరు వచ్చింది. పద్మపురాణం రెండవది. పద్మకల్పం యొక్క మహిమ దానిలో వర్ణింప బడింది. మూడవదైన విష్ణు పురాణం పరాశరప్రోక్తం. అది విష్ణువును గూర్చి బోధిస్తుంది, తండ్రి–కొడుకులకు భేదం లేదు కనుక అది వ్యాసప్రోక్తంగానే పరిగణింప బడుతూన్నది. నాల్గవదైన శివమహా పురాణంలో శివ గాథలు వర్ణింపబడ్డాయి. దుర్గా భగవతి యొక్క చరిత్రను, మహిమను బోధిస్తుంది. కనుక ఐదవదైన దానికి దేవీ పురాణమని, దేవీ భాగవతమని పేర్లు. నారదుడు చెప్పినది నారద పురాణం. మార్కండేయుడు చెప్పినది మార్కండేయ పురాణం. అగ్నిపురాణం అగ్నికి సంబంధించినది. భవిష్యత్తును గూర్చి చెప్పేది భవిష్య పురాణం. పరబ్రహ్మ జగత్తుకు వివర్తోపాదాన కారణమని చెప్పేది బ్రహ్మవైవర్తం. లింగము యొక్క చరిత్రను చెప్పేది లింగ పురాణం. వరాహవతారమును చెప్పే పురాణం వరాహ పురాణం. మహేశ్వరుడు చెప్పగా స్కందుడు విన్న పురాణం స్కాందం. వామనుని చరిత్రను చెప్పేది వామన పురాణం. కూర్మావతార గాథను చెప్పేది కూర్మ పురాణం. మత్స్య రూపంలో భగవానుడు చెప్పింది మత్స్య పురాణం. గరుడుడు స్వయంగా చెప్పింది గరుడ పురాణం. బ్రహ్మాండం యొక్క చరిత్రను చెప్పేది బ్రహ్మాండ పురాణం.

ఇట్టి పద్దెనిమిది పురాణాలను రచించి, సంహితలను, అనేక గీతలతో కూడియున్న మహాభారత సంహితను రచించాడు వ్యాస మహర్షి. ఓ మునులారా! ఇదీ వ్యాస జనన గాథ! సత్యవతికి పరాశరునితో సంయోగముండగా శంతన మహారాజుకు భార్య ఎలా అయింది అనే సందేహం పెట్టుకోకండి. మహర్షులు లోకోపకారం కొరకు జన్మించినవారు. వారి జన్మ వృత్తాంతాలు చిత్రంగా ఉంటాయి. వివేకులైన వారు మహాత్ముల చరిత్రలలోని

గుణాలను మాత్రమే గ్రహిస్తారు. అది రాజహంస లక్షణం. కాకులు కుళ్ళు మాంసాన్ని ఎంగిలి మెతుకులను తింటాయి. మానవుడు రాజహంసలా బ్రతకాలి. వ్యాస జనన గాథ పరమ పవిత్రమైనది, పాపహరమైనది.

**మహాకాళీ ప్రాదుర్భావం**

మునులు సూత మహర్షిని ఇలా ప్రార్థించారు. "ఓ బ్రహ్మవేత్తా! మానవులకు భుక్తి- ముక్తి ప్రదమైనది, అనేక ఉపాఖ్యానాలతో కూడినది అగు శంభు చరిత్రను వినిపించావు. ఉమాదేవి యొక్క సతి-పార్వతి అనే రెండు అవతారాలను గురించి కూడా సుధామధురంగా వినిపించావు. మిగిలిన అవతారాలను గురించికూడా ప్రసంగించు. జగన్మాత ఐన భగవతి యొక్క చరిత్రను చెప్పు."

మహర్షుల ప్రార్థనను మన్నించి సూతుడిలా చెప్పసాగేడు. "ఓ ఋషులారా! పావనమైన శ్రీమాత చరితను చెపుతున్నాను వినండి. దీని శ్రవణం వలన మాయ తొలగి సకల శుభాలు కలుగుతాయి. మాయ తొలగగానే పాపాలన్నీ పటాపంచలవుతాయి. ఆ దేవి యొక్క స్మరణ మాత్రం చేతనే ధర్మ-అర్థ-కామ- మోక్షములనే చతుర్విధ పురుషార్థాలు సిద్ధిస్తాయి. పూర్వం సురథుడనే రాజుకు మేధసుడనే మహర్షి చెప్పిన దానిని చెపుతున్నాను వినండి.

స్వారోచిష మన్వంతరంలో విరథుడనే రాజుండే వాడు. ఆయన పుత్రుని పేరు సురథుడు. సురథుడు ఇంద్రుని వంటి బలపరాక్రమాలు కలవాడే అయినా కర్మగతిచే శత్రురాజుల చేతిలో ఓడిపోయి ప్రాణభీతిచే బహుదూరం పయనించి ఒక అడవిలో ప్రవేశించాడు. అక్కడ బ్రహ్మవేత్త, తపోనిధి అయిన మేధసుని ఆశ్రమాన్ని చూచి ఆ ఋషిని దర్శించి ఆయన ఆతిథ్యాన్ని పొందాడు. ఋష్యాశ్రమంలో ఉన్నా తన రాజ్యభ్రష్టత్వాన్ని గురించే దుఃఖిస్తూ ఉండేవాడు ఆ రాజు. ఇలా ఉండగా ఒక రోజున సమాధి అను పేరుగల ధనిక వైశ్యుడు విన్నమైన వదనంతో అక్కడకు వచ్చి చేరాడు. అతని దీన స్థితిని గమనించి కారణమేమని ప్రశ్నించిన రాజుకు తనను తాను పరిచయం చేసుకొని ఇలా చెప్పి దుఃఖించాడు "రాజా! నా ఆస్తి, నా ధనం మీది లోభంచే నా భార్యాపుత్రులు, కోడళ్ళు అందరు ఏకమై విషప్రయోగంచే నన్ను చంపటానికి ప్రయత్నం చేయగా, అది తెలిసి నేనిలా పారిపోయి వచ్చాను. అక్కడ నా భార్యాపుత్రుల, బంధుమిత్రుల క్షేమ సమాచారం తెలియక బాధపడుతున్నాను." వైశ్యుని మాటలు విని అతని అజ్ఞానానికి, మోహానికి నవ్వుకొని, జాలిపడిన రాజు అతనితో కలిసి మహర్షిని సందర్శించాడు. విషయాన్ని చెప్పి అజ్ఞాన నివర్తకమైన ఉపదేశాన్ని చేయ వలసిందిగా వేడుకొన్నాడు.

అప్పుడు బ్రహ్మర్షి అయిన మేధసుడు మాయాపాశాన్ని నాశనం చేసే దేవీ చరిత్రను వారిద్దరికి ఇలా చెప్పసాగేడు. "ఓ రాజా! ఓ వైశ్యోత్తమా! వినండి అనాది, ఆద్యంత రహితమైనది ఐన ఆ మహామాయను త్రిమూర్తులు సైతం దాటలేరు. ఇక మానవుల లెక్కేమిటి? త్రిమూర్తులచే సృష్టి, స్థితి, లయములను కార్యాలను నిర్వహింప చేసేది ఆ జగన్మాతయే! సృష్టి ప్రారంభంలో జగత్తు అంతా జలమయమై ఉండగా యోగీశ్వరుడైన విష్ణువు శేషతల్పంపై యోగనిద్రలో ఉండగా అతని కర్ణరంధ్రాలలోని మాలిన్యం నుండి మధుకైటభులను ఇద్దరు రాక్షసులు ఉద్భవించారు. వారు పుడుతూనే భయంకరాకారులై నోళ్ళు తెరచి నాభికమల మందున్న బ్రహ్మను మ్రింగబోయారు. విధాత భయకంపితుడై పరమేశ్వరిని రక్షించమని ఈ విధంగా ప్రార్థించాడు: "ఓ మహామాయా! జగన్మాతా! రక్షించు, సర్వ కారణములకు కారణమైన దానవు నీవే మోహకారకమైన అజ్ఞానమనే చీకటి నీవే! తద్విచ్ఛేద కారకమైన జ్ఞానమనే వెలుగు నీవే! త్రిదేవ జనని నీవే! దేవతలకు హవిస్సులను అర్పించే స్వాహాకారము నీవే, పితరులకు పిండము నర్పించే స్వధాకారము నీవే! ఓ తల్లీ! సంతోషము, పుష్టి, తుష్టి, శాంతి, సహనము, దయ, తృష్ణ, భ్రాంతి, స్మృతి అన్నీ నీవే! ఆకలి, సంపద, మనోవృత్తి, చైతన్యం అన్నీ నీవే. ఈ రాక్షసులను మోహింపచేయి. యోగనిద్రా పరవశుడైన నారాయణుని నీవు మేల్కొలుపు.

పరమేష్ఠి చేసిన స్తవానికి సంతసించిన ఆ జగన్మాత ఫాల్గుణ శుద్ధ దశమి నాడు ఆవిర్భవించి 'మహాకాళి' నామాన్ని పొంది బ్రహ్మకు అభయమిచ్చి విష్ణువును ఆవహించింది. వెంటనే విష్ణువు యోగనిద్రనుండి లేచి మధుకైటభులతో యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఐదువేల సంవత్సరాలు కేవలం చేతులతో యుద్ధం చేసికూడా వారిని సంహరించలేక పోయాడు. అప్పుడు మహామాయా ప్రేరితులైన మధుకైటభులు మోహాన్ని పొంది విష్ణువు నుద్దేశించి "నీ పరాక్రమానికి, బాహుబలానికి సంతోషించాం! ఏదైనా వరం కోరుకో!" అని గర్వంతో పలికారు. వెంటనే మాయావి అయిన విష్ణువు "మీ ఇద్దరు నా చేతిలో మరణించాలి" అని కోరగా వారిలా అన్నారు.

"హే విష్ణో! ప్రస్తుతం ఈ భూమి అంతా జలాల్లో మునిగి ఉంది. మునగకుండ తేలియున్న స్థలంలో మమ్ము సంహరించు." వెంటనే విష్ణువు 'అట్లే అగుగాక' అని పలికి వారిద్దరిని తన ఒడిలోకి చేర్చుకొని చక్రంతో సంహరించాడు. ఇది మోహవిచ్ఛేద కారకమైన మహాకాళీ ప్రాదుర్భావ చరిత్ర."

**మహాలక్ష్మీ స్వరూపమైన దుర్గాదేవి ప్రాదుర్భావం**

సూతుడు శౌనకాది మునులతో ఇలా అంటున్నాడు. "మునులారా! మీకింత వరకు మేధసుడు చెప్పిన మహాకాళీ ప్రాదుర్భావాన్ని చెప్పాను. అతను చెప్పిన మహా లక్ష్మీ ప్రాదుర్భావ చరిత్రను వినండి. పూర్వం రంభుడనే రాక్షసుడుండేవాడు. వాని పుత్రుడే మహిషాసురుడు. వాడు దేవతలను, దిక్పాలకులను, ఇంద్రుని సైతం జయించి స్వర్గాధిపత్యం చేపట్టాడు. దేవతలంతా బ్రహ్మను వెంటపెట్టుకొని శివ, విష్ణువులను ఆశ్రయించి శరణు పొందారు. దేవతల నోటవిన్న మహిషాసురుని దుశ్చేష్టలకు ఆగ్రహోదగ్రులైన శివకేశవుల ముఖముల నుండి గొప్ప తేజస్సు పుట్టింది. అదే సమయంలో దిక్పాలకుల నుండి, దేవతల నుండి కూడ గొప్ప తేజస్సు పుట్టి ఒకచోట ముద్దగా చేరింది. ఆ తేజస్సు క్రమంగా స్త్రీ రూపాన్ని పొందింది. ఆమెయే దుర్గాదేవి. ఆమెకు శివుని తేజస్సుచే ముఖము, విష్ణువు తేజస్సుచే బాహువులు, యముని తేజస్సుచే కేశములు, చంద్రుని తేజస్సుచే స్తనద్వయం, ఇంద్రుని తేజస్సుచే నడుము, వరుణుని తేజస్సుచే ఊరువులు, భూమి యొక్క తేజస్సుచే నితంబము, బ్రహ్మ తేజస్సుచే పాద ద్వయము, సూర్య తేజస్సుచే కాలివ్రేళ్ళు, కుబేరుని తేజస్సుచే ముక్కు, ప్రజాపతి తేజస్సుచే దంతములు, అగ్ని తేజముచే మూడు కన్నులు, సంధ్యా తేజస్సుచే రెండు కనుబొమలు, వాయు తేజముచే రెండు చెవులు నిర్మాణమయ్యాయి. ఈ విధంగా అనేక దేవతాకోటి తేజస్సుల కలయికచే ఆ పరమేశ్వరి ఆవర్భవించింది. ఆమె పద్మాసనాసీనయై ఉంది. ఆమెను చూచి త్రిమూర్తులతో కూడి దేవతలందరు ఆనందించి వారివారి ఆయుధాలను ఇచ్చారు.

దుర్గాదేవికి మహేశ్వరుడు శూలాన్ని, విష్ణువు చక్రాన్ని, వరుణుడు శంఖాన్ని మరియు పాశాన్ని, అగ్ని శక్తిని, వాయువు ధనుస్సును మరియు శరాసనాన్ని, ఇంద్రుడు వజ్రాన్ని మరియు గంటను, యముడు మృత్యుదండాన్ని, ప్రజాపతి అక్షమాలను, బ్రహ్మ కమండలువును, సూర్యుడు రోమములయందు కిరణాలను, మృత్యు దేవత కత్తిని డాలును, విశ్వకర్మ మనోహరమైన గండ్ర గొడ్డలిని మరియు అనేక అస్త్రములను అభేద్యమైన కవచాన్ని, హిమవంతుడు సింహాన్ని మరియు వివిధ రత్నములను, కుబేరుడు మణిరత్నస్థగిత పానపాత్రను, ఆదిశేషుడు నాగహారాన్ని సమర్పించారు. సముద్రుడు సుందరమైన మాలను పద్మాన్ని భద్రంగా ఇచ్చాడు. క్షీరసాగరుడు హారాన్ని, చూడామణిని, మణికుండల ద్వయాన్ని, హస్తాభరణాలను, చంద్రవంకను, కేయూరాలను, నూపురాలను, హారాన్ని, అంగుళీయకాలను,

దుకూల ద్వయాన్ని భక్తితో అర్పించాడు. ఇలా దేవతలంతా అనేక దివ్యాస్త్రాలను, దివ్యభూషణాలను ఇచ్చి దేవిని సత్కరించారు. స్తుతించారు.

అలా అస్త్రశస్త్రాదులచే, ఆభరణాలచే అలంకృతయైన దుర్గాదేవి అట్టహాసంగా సింహనాదం చేసింది. ఆ నాదం వ్యోమ మండలమంతా వ్యాపించి ప్రతిధ్వనించింది. భూమి కంపించింది. సముద్రాలు అల్లకల్లోలమయ్యాయి. పర్వతాలు కూలేయి. నక్షత్రాలు నేల రాలాయి. వాయువులు ప్రచండంగా వీచాయి. ఆ సంక్షోభాన్ని గమనించిన రాక్షసులు కీడును శంకించి ఆయుధాలను ధరించి యుద్ధ సన్నద్ధులై నిలిచారు. ఆ సింహనాదాన్ని ఆకర్ణించిన మహిషాసురుడు కోపాన్ని ఆపుకోలేక అలాత చక్రాల్లా కనుగ్రుడ్లను త్రిప్పుతూ నిప్పులవాన కురియ దేవికి అభిముఖంగా పరుగెత్తాడు. అతని వెంట సైన్యం నడిచింది. చిక్షురుడు, చామరుడు, ఉదగ్రుడు, కరాలుడు, ఉద్ధతుడు, బాష్కలుడు, తామ్రుడు, ఉగ్రాస్యుడు, ఉగ్రవీర్యుడు, బిడాలుడు, అంధకుడు, దుర్ధరుడు, దుర్ముఖుడు, త్రినేత్రుడు, మహాహనుడు ఇత్యాది దానవ సైన్యాధ్యక్షులంతా తమతమ సేనలతో వారి భయంకరమైన అరుపులకు ఆకాశం త్రుళ్ళిపడ, పదఘట్టనలకు భూమి వణక మహిషాసురుని వెంట నడిచారు.

శతకోటి శంపాలతా కాంతుల తనుద్యుతులతో లోక భీకరంగా అట్టహాసం చేస్తూన్న దుర్గాదేవిని చూచాడు మహిషుడు. మహారోషంతో ఎదుర్కొన్నాడు. సైన్యాన్ని ఆమెతో తలపడమని చేయూచాడు. సంకుల సమరం మొదలైంది. దేవి యొక్క నిశ్శ్వాసము నుండి అనేక వీర గణాలు పుట్టుకొచ్చాయి. పోరు ఘోరంగా సాగుతోంది. వారిలో కొందరిని మహిషుడు డెక్కలతో, కొందరిని కొమ్ములతో, మరికొందరిని ముట్టెతోను, తోకతోను పలుమార్లు కొట్టి సంహరించాడు. ముందుకు ఉరికాడు. దేవి సైన్యం అడ్డం వచ్చింది. చెంతనున్న పర్వతాలను తోకతో కొట్టాడు. పర్వతాలు పగిలి బండరాళ్ళు దొర్లిపడగా వాటి క్రింద పడి నలిగి మరణించారు దేవీగణం. దానికాగ్రహించిన దేవి వానిపైకి పాశాన్ని విసిరి బంధించింది. వెంటనే మాయావి అయిన మహిషుడు ఆ రూపాన్ని వదలి సింహ రూపాన్ని ధరించి దేవీగణాలను చీల్చటం మొదలు పెట్టాడు. దానికి కోపించిన దేవి కత్తితో వానితల నరకబోగా వాడు మదగజరూపుడై దేవి వాహనమైన సింహాన్ని తన తోకతో లాగేడు. దేవి కత్తితో వాని తోకను నరికింది. అపుడా రాక్షసుడు తన వాస్తవ రూపాన్ని ధరించాడు. ధరించి ముల్లోకాలను దద్దరిల్ల జేశాడు.

వెంటనే దుర్గ వాడిని ఉపేక్షించటం లోకాలకుమేలు కాదని యెంచి వానిపైకి కుప్పించి దూకి కావితో ఆ రాక్షసుని కంఠాన్ని త్రొక్కిపట్టి భయంకరమైన శూలంతో పొడిచి కత్తితో నరికి వాణ్ణి యమసదనానికి పంపింది. దేవతలందరు హర్షధ్వానాలు చేశారు. గంధర్వాప్సరగణాలు బృందనాట్యం చేశాయి. ఈ గాథ పరమ పావనమైనది.

**మహా సరస్వతీ ఆవిర్భావగాథ - శుంభ నిశుంభుల వృత్తాంతం**

సూతుడు మునులతో ఇలా అంటున్నాడు. "మునులారా! మీకిప్పుడు మహా సరస్వతీ ప్రాదుర్భావ చరితను చెపుతున్నాను వినండి! పూర్వం శుంభుడు-నిశుంభుడు అనే ఇద్దరు క్రూరులైన రాక్షసులు ఉండేవారు. వారు తమ ప్రతాపంచే ముల్లోకాలను ఆక్రమించారు. వారిచే పీడింపబడిన దేవతలు హిమగిరి ప్రాంతాలకు వెళ్ళి సర్వభూత జనని, కామదాత్రి అయిన గౌరీదేవికి నమస్కరించి ఇలా ప్రార్థించారు. "ఓ దుర్గా! ఓ మహేశ్వరీ! భక్తజనప్రియా! నీకు జయమగు గాక! శివకామినీ! ముక్తి ప్రదాయినీ! సంసారోత్పత్తి స్థిత్యంతకారిణీ! నీకు జయము! తల్లీ! కాళికా-తారా-ఛిన్నమస్తా-శ్రీవిద్యా-బగళాముఖి-ధూమావతి-త్రిపుర సుందరి-మతంగపుత్రి అను నామధేయాలతో యోగులచే ఉపాసింపబడే లోక సామ్రాజ్ఞివి నీవే! అపరాజిత-నిత్య- రుద్రాణి-గోరూపిణి-మంగళగౌరి అనునీకు నమస్కారం. ఉపనిషత్తులచే మాత్రమే తెలియబడే జ్ఞానరూపిణి అగునీకు ప్రణామాలు. మమ్ములను రక్షించు!"

ఆ సమయంలో దేవతల ప్రార్థనకు ప్రసన్నురాలైన గౌరీదేవి యొక్క దేహం నుండి ఒక కుమారి ఆవిర్భవించింది. పార్వతియొక్క దేహము అనే కోశమునుండి ఉద్భవించింది కనుక ఆమె 'కౌశికి' అనుపేర వాసికెక్కింది. ఆమెకు ఉగ్రతారిక, మహోగ్రతారిక అనే పేర్లుకూడా ఉన్నాయి. తల్లి యొక్క శరీరంనుండి సాక్షాత్తుగా పుట్టింది కనుక లోకంలో 'మాతంగి' అను పేరుతో ప్రసిద్ధురాలైంది. ఆమెదేవతలతో "మీరు నిర్భయులై ఉండండి! మీ అభిలాష త్వరలోనే నెరవేరుతుంది" అని అభయమిచ్చి పంపించి వేసింది.

ఆ సమయంలో శుంభ-నిశుంభుల సేవకులు చండ-ముండులనే వారు ప్రచ్ఛన్నంగా ఉండి గౌరీదేవి యొక్క మనోహరమైన కుమారీ రూపాన్ని చూచి విశేషమైన మోహాన్ని పొంది వెంటనే తేరుకొని శుంభుని వద్దకు వెళ్ళి ఇలా అన్నారు: "ఓ! దైత్య సార్వభౌమా! త్రిలోకాధిపా! మేమిప్పుడే ఒక అతిలోక సుందరిని చూచాం. ఆమె సింహవాహిని. హిమగిరి శిఖరంపై ఆ సొగసులన్నీ చూస్తూ చెలికత్తెలతో విహరిస్తూ ఉంటుంది. ఆ సౌందర్యం

వర్ణనాతీతం. గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస, కిన్నర, కింపురుష, విద్యాధర, వీణాధర, శోణాధర స్త్రీలలో ఎవరూ కూడా ఆమెకు సాటిరారు. దేవతా స్త్రీలు, దిక్పాలకుల కాంతలు ఆ దేవిని అనేక విధాలుగా సేవిస్తున్నారు. ఓ దానవ శ్రేష్ఠా! ఆమె తమకు పట్టపు రాణిగా ఉండతగును." ఇలా చెప్పి ప్రక్కకు తప్పుకొన్నారు చండ-ముండులు. వారి పల్కులను విని వెంటనే మోహవిభ్రాంతిలో మునిగిపోయిన శుంభుడు సుగ్రీవుడనే దూతకు చెప్పవలసిన మాటలను చెప్పి జగన్మాత అయిన మహేశ్వరి వద్దకు రాయబారిగా పంపించాడు.

వాడు మహామాయ వద్దకు వెళ్ళి శుంభుని సందేశాన్ని చెప్పి శుంభ-నిశుంభులలో ఎవరినో ఒకరిని వరించమని తన రాజు ఆజ్ఞగా దేవికి విన్నవించాడు. వెంటనే దేవి మందహాసం చేసి "ఓ దూతా! నువ్వు మీ రాజు చెప్పిన సందేశాన్నే చెప్పి సత్యాన్నే పలికావు. నా ప్రతిజ్ఞను విను. ఎవడైతే నన్ను యుద్ధంలో జయిస్తాడో వానినే నేను పతిగా వరిస్తాను. ఇతరులు నాకు ఇష్టులు కారు. నా ప్రతిజ్ఞను మీ రాజుతో చెప్పు" అని చెప్పి పంపించింది. వాడు వెంటనే వచ్చి భువనేశ్వరి యొక్క ప్రతిజ్ఞను శుంభుని కెరిగించాడు.

భండనాన్ని పండుగగా భావించే శుంభుడు దూతనోట పరమేశ్వరి ప్రతిజ్ఞను విని మహదానంద పడ్డాడు. ధూమ్రాక్ష చండ-ముండ-రక్తబీజులనే సైన్యాధిపతులను యుద్ధానికి సైన్యాన్ని సిద్ధం చేయమని ఆజ్ఞాపించాడు. తమ్ముడైన నిశుంభుని వెంటపెట్టుకొని శుంభుడు బొబ్బలు పెడుతూ, జబ్బలు చరుస్తూ ఉత్సాహం ఉరకలు వేయగా, శౌర్యాగ్ని దీపింప, అక్షులు అగ్ని గోళాలై వెలుగ వీరరసాతిరేకంతో పెండ్లికొడుకులా రణరంగానికి కదిలాడు. అతనివెంట సకలాయుధ సంపన్నమై సమరోత్సాహంతో సైన్యం కదిలింది. అతని సేన కదులుతూ ఉంటే చూచు వారికి ప్రవహిస్తూన్న నదిలా తోచింది. రెపరెప లాడుతూన్న తెల్లటి జండాలు నదిపై ఎగురుతూన్న కొంగల గుంపులా ఉన్నాయి. సైన్య పదాహతికి రేగిన ధరాపరాగం ఆకాశాన్ని క్రమ్మి పగటిచీకట్లు వ్యాపించాయి. రథ, గజ, తురగ పదాతులతో కూడిన సైన్యం హిమాలయగిరి ప్రాంతాలకు చేరింది.

రాక్షస సైన్యాన్ని దూరాన్నుండే చూచింది అంబిక. లేళ్ళకదుపును చూచిన వ్యాఘ్రంలా ఉత్సాహంతో; నారిని వింట తొడిగి ఒక్కసారి ధనుష్టంకారం చేసింది. రాక్షసులకా శబ్దం పిడిగుపాటైంది. శత్రుభయంకరమైన ఘంటను మ్రోగించింది. ఆ నాదం రాక్షస సైన్యంలో మంటలను పుట్టించింది. ఆహవోత్సాహంతో వచ్చి అంబికకు ఎదురుగా రథస్థుడై నిలిచాడు శుంభుడు. చారుకుంతల, చంపకనాసాభ, పద్మపత్ర విశాలాక్షి, పక్వబింబాధరోష్ఠి, అర్ధచంద్రధర,

అసితేక్షణ, మణికుండల ధారిణి, గ్రైవేయకలసత్కంఠి, రమ్యవేణి, దివ్యమాల్యాంబర ధారిణి, లోచనత్రయ విరాజిత, లాక్షారంజిత చరణద్వయ శోభిత, అష్టభుజ ఆయుధ పాణి అయిన అంబికను చూచాడు. దిగ్భ్రమ చెందాడు. ఫాలభాగాన్ని కేల్దోయి సోకగా మ్రొక్కాడు. అంతలోనే ఆ జ్ఞానం కనుమరుగైంది. మబ్బు కమ్మేసింది. జగద్వ్యాప్తమైన ఆ జగన్మాత మహా సౌందర్యాన్ని స్వంతం చేసికొనాలని ఉవ్విళ్ళూరాడు. పంచభూతాత్మకమైన ప్రకృతి ఎవరికీ కైవశం కాదు అని గ్రహించలేక పోయాడు. ఉమాదేవితో ఇలా అన్నాడు:

"ఓ చతుర్దశ భువనైక మోహినీ! సుకుమార వాసంతికా! కుసుమ స్పర్శకే వాడిపోయే మేను నీది! చందనాగరు కస్తూరీ కుంకుమ పంకం నీ మేనికి బరువు! అలకామోదం నీ కుంతలాలకు భారం! లాక్షాద్రవ స్పర్శకు నీ చరణ పల్లవాలు ఓర్చుకోలేవు! అట్టి సుకుమారివైన నీవు నాతో ఎలా యుద్ధం చేయగలవు? మావిచిగురు స్పర్శకే కందిపోయే నీపైకి నిశిత శరాలను, క్రూర నారాచాలను గుప్పించటం నాకిష్టం లేదు. నా మాట విను! లొంగిపో! నిన్ను చతుర్దశ భువనాధీశ్వరిని చేస్తాను!"

అప్పుడు దేవి తగురీతిగా సమాధానం చెప్పి శుంభుని యుద్ధానికి పురిగొల్పింది. ఆమె మాటలకు క్రుద్ధుడైన రాక్షసుడు శరపరంపరలను ఆమె మీదికి నేర్పుతో మర్మభేదనంగా అంపవానలా కురిపించాడు. ఆమె వాటిని మధ్యలోనే తెగనరికింది. రాక్షసుని ప్రోత్సాహంతో సైన్యం ఉమాదేవిని చుట్టుముట్టింది. అసురులు వివిధ మారణాయుధాలను ప్రయోగిస్తున్నారు. తానొకతయే ఐనా తలకొక రూపై లోకభీకరంగా రణం చేస్తున్నది గౌరి. రేగిన ధరాపరాగం మబ్బులు కాగా నిశిత ఆయుధాల తళతళలు మెరుపులు కాగా, ఆభరణాల కాంతులు భూమిపై తటిల్లతా ద్యుతులు కాగా, రివ్వురివ్వున దూసుకుపోయే అలుగుల సవ్వడి ఈదురుగాలి హోరు కాగా, తెగిపడుతూన్న సైనికుల తలకాయలు వడగళ్ళు కాగా, శరపరంపర వర్షపు జల్లు కాగా, యుద్ధభేరీల మ్రోత పిడుగు చప్పుళ్ళు కాగా, భండన భూమి ప్రళయకాల పుష్కలావర్త సంవర్తక మేఘాడంబరంతో విలసిల్లే ఆకాశంలా భీతావహంగా ఉంది. రక్తసిక్తమైన రణరంగం రక్తార్ణవంలా ఉంది. రుధిరంలో తేలియాడుతున్న శవాలు మహాసాగరంలో కదలియాడుతున్న జలచరాల్లా ఉన్నాయి.

ఇట్టి సమయంలో బీరాలను పల్కుతూ నిశుంభుడు దేవిని ఎదుర్కొన్నాడు. ఆమె ఆశీవిష సమమైన బాణాలతో వాణ్ణి సంహరించింది. తమ్ముని మరణాన్ని చూచి కించిత్తు దైన్యాన్ని పొంది అంతలోనే తేరుకొని అష్టభుజుడైన శుంభుడు తేరెక్కి దేవికి అభిముఖంగా

స్థిరంగా నిల్చుని శ్రవణపుట భేదనంగా శంఖధ్వని చేసి, పిడికిట ధనుర్మధ్యాన్ని పట్టి, అల్లెత్రాటిని కొనకు చుట్టి, నాకలోక వాసులు శోక వికలు లయ్యేటట్లు నారిని సారించి, మహా భుజంగాల వంటి మార్గణాలను దేవి మీదికి ప్రయోగించి సింహనాదం చేశాడు. అపుడు దేవి వాని బాణాలను నేర్పుతో నడుముకు త్రెంచి త్రిశూలంతో పొడిచింది. దానికి వాడు నేలకూలి యమ సదనానికి చేరుకొన్నాడు.

దేవి చేతిలో మరణించిన వారందరూ శివ సాయుజ్యాన్ని పొందారు. ఇది ఉమనుండి ఆవిర్భవించిన మహా సరస్వతీ దేవి ప్రాదుర్భావ గాథ. ఈ గాధను చదివినా వినినా సకలాభీష్టములు నెరవేరుతాయి.

### ఉమా ప్రాదుర్భావం

ఇంతవరకు శ్రద్ధతో ఆలకించిన మునులు సూతుని ఉమాదేవి ప్రాదుర్భావాన్ని చెప్పవలసిందని కోరగా సూతుడిలా చెప్పసాగేడు: "మునులారా! పూర్వం జరిగిన దేవాసుర సంగ్రామము లన్నిటి యందు మహామాయా ప్రభావంచే దేవతలకే విజయం దక్కింది. అన్ని యుద్ధములందు చివరకు రాక్షసులు పరాజితులయ్యారు. దేవతలు గర్విష్ఠులయ్యారు. ఒక రోజున దేవతలందరు ఒక చోటున చేరి, సాధించిన యుద్ధ విజయాలను గురించి ముచ్చటించుకొంటూ, పరస్పరం ప్రశంసించుకొంటూ, వీరాలాపా లాడుకొంటూ ఉండగా దూరంగా ఒక అద్భుతమైన తేజస్సు గోచరించింది. దానిని చూచి వారు ఆశ్చర్యచకితులయ్యారు. "మీరు వెళ్ళి దాని యథార్థ స్వరూపాన్ని తెలుసుకొని రండి" అని దేవరాజు ఆజ్ఞాపించగా దేవతలలో మొదటి వాడైన వాయువు ఆ తేజస్సును సమీపించాడు.

"నీవెవరు?" అని ఆ తేజస్సు వాయువును ప్రశ్నించింది. "నేను వాయువును. దేవతలందరిలోను అతి బలవంతుడను! నా మీద ఆధారపడి ఈ లోకాలన్నీ జీవిస్తున్నాయి!" అని గర్వంతో సమాధాన మిచ్చాడు వాయువు. వాయువు యొక్క అజ్ఞానానికి నవ్వుకొని ఆ తేజస్సు ఒక గడ్డిపరకను అతని ముందుంచి దానిని కదల్చమని కోరింది. సంపూర్ణంగా ప్రయత్నించి కదల్చలేక విఫలుడై వాయువు సిగ్గుతో వెనుదిరిగి దేవరాజుకు ఆ విషయాన్ని చెప్పాడు. అప్పుడు అమరేంద్రుడు మిగతా దేవతల నందరిని పంపాడు. వారందరు కూడా ఆ గడ్డిపోచను కదల్చలేక విఫలులై అవమాన భారంతో తిరిగి వచ్చారు. అపుడింద్రుడు తానే స్వయంగా బయలుదేరాడు. ఇంద్రుని చూచి ఆ శక్తి అదృశ్యమైంది. తక్షణం దేవతలందరు పునరాలోచనలో పడి తర్కించుకొని తమకింతవరకు తెలియని అదృశ్య శక్తియేదో ఈ

సృష్టిని నడిపిస్తోంది అనే నిశ్చయానికి వచ్చారు. అందరూ కూడి ఆ శక్తినే ధ్యానించారు. దానికే మ్రొక్కి దానినే శరణువేడారు.

అపార కృపారాశి అయిన పార్వతి దేవతల అజ్ఞానాన్ని పోగొట్టి వారిని అనుగ్రహించే నిమిత్తమై చైత్రశుక్ల నవమినాడు సూర్యుడు నడినెత్తిపై ఉండగా ఉమాదేవిగా సాక్షాత్కరించింది. రక్తాంబర ధారిణి, రక్తమాల్యానులేపన అయిన ఆమె నాల్గుచేతులలోను వరదాభయ ముద్రలను, పాశాంకుశాలను దాల్చి, వేదములు బోటులై సేవిస్తూండగా స్పష్టంగా దేవతల కందరికి "బ్రహ్మమును నేనే" అను మహా వాక్యాన్ని బోధించింది. ఇంకా ఇలా చెప్పింది:

"దేవతలారా! సర్వజగత్తుకు కారణమైన చైతన్యాన్ని నేనే! ఓంకారాన్ని నేనే! నాకంటె భిన్నంగా ఏదీ లేదు. త్రిమూర్తులు సైతం నా ఆజ్ఞనే పాలిస్తున్నారు. ఇక ఇతరుల గురించి చెప్పేదేముంది? ఐంద్రజాలికుడు కఱ్ఱబొమ్మలను ఆడించునట్లు నేనే ప్రాణులందరి చేత జీవ నాట్యాన్ని చేయిస్తున్నాను. పంచ మహాభూతములు నా ఆజ్ఞచేతనే వాటి వాటి కర్మల యందు ప్రవర్తిస్తున్నాయి. నాకు రెండు రూపాలున్నాయి. మాయ ఉపాధిగా గలది సగుణం. మాయాతీతమైనది నిర్గుణము. కనుక మీరు అహంకారాన్ని విడిచి సనాతన మూల ప్రకృతి అయిన నన్ను సేవించండి" అని పల్కి అంతర్హితమైంది.

ఇదీ ఉమాప్రాదుర్భావ గాథ. ఈ గాథ యొక్క ఆంతర్యాన్ని, తత్త్వాన్ని చింతన చేసిన మానవుడు తప్పక జ్ఞానియై పునరావృత్తి రహితమైన అద్వైత సిద్ధిని పొందుతాడు."

**దుర్గా చరితము**

మునులు సూతుణ్ణి దుర్గాదేవి తత్త్వాన్ని తెలిపే మరొక గాథను చెప్పమని కోరగా సూతుడిలా చెప్పసాగేడు: "మునులారా! పూర్వం రురు పుత్రుడైన దుర్గముడు అనే రాక్షసుడుండేవాడు. వాడు బ్రహ్మవర ప్రభావంచే నాలుగు వేదాలను స్వాధీనం చేసికొన్నాడు. వెంటనే భూలోకంలో వేదములు అంతర్హితమైనాయి. వేదోక్త కర్మలు నశించాయి. దేవతలకు హవ్యములు లేవు. పితృదేవతలకు కవ్యములు లేవు. సూర్యునకు అర్ఘ్యంలేదు. స్వర్గంలో దేవతలు, భూలోకంలో బ్రాహ్మణులు దురాచార పరాయణులయ్యారు. ముందు బ్రాహ్మణుడు పతనం కాగానే మిగతా వర్ణముల వారు సహజంగానే ఆచార భ్రష్టులు, ధర్మ భ్రష్టులు అయ్యారు. దాన-ధర్మాలు లేవు. జప-తపాదులు లేవు. యజ్ఞ-యాగాదులు లేవు. అగ్న్యారాధన లేదు. హోమాదులు లేవు. పూజలు లేవు. పురాణ పఠనాదులు లేవు. ఫలితంగా వంద సంవత్సరాలు అనావృష్టి ఏర్పడింది. భూమిమీదగల జల వనరులన్నీ ఇంకిపోయాయి. ప్రజల హాహాకారాలు, ఆర్తనాదాలు మిన్నుముట్టాయి.

భూలోకంలోని జనుల దైన్యస్థితిని చూచి జాలిపడిన దేవతలు యోగమాయా స్వరూపిణి అయిన మహేశ్వరిని అనేక విధాల ప్రార్థించారు. అపరాధాలను క్షమించమని స్తుతించారు. వెంటనే దయామూర్తి అయిన ఉమాదేవి వారి ప్రార్థనను మన్నించి అనంతమైన నేత్రాలతో, ప్రసన్నమైన చూపులతో, పద్మంవంటి ముఖంతో సాక్షాత్కరించింది. ఆమె నాలుగు చేతులలోను ధనుస్సు, బాణము, పద్మము, అనేకమైన దుంపలు, కూరలు, ఫలాలు ఉన్నాయి. ఆ తల్లి తన బిడ్డలైన మానవుల కష్టాలను, దుఃఖాన్ని చూడలేక వారి ఆర్తనాదాలకు కుమిలిపోయి తొమ్మిది రాత్రుళ్ళు, తొమ్మిది పగళ్ళు రోదించింది. అపుడామె కన్నులనుండి సంతతధారాపాతంగా కన్నీరు ప్రవహించింది. ఆ కన్నీటి ధారలచే భూమి అంతా తడిసి జల వనరులన్ని నిండాయి. తరులతాగుల్మాదులు వృద్ధిచెందాయి. పంటలు పుష్కలంగా పండాయి. కందమూలాదులు పెరిగాయి. కూరలు విపరీతంగా కాపుకొచ్చాయి. పచ్చిక చేయెత్తు దుబ్బులుగా ఎదిగింది. ఫలభారంచే తరువులు వంగాయి. ఆ తల్లి దయామృత వర్షధారలచే భూమిమీద చైతన్యం వెల్లి విరిసింది.

ఆ దేవి దేవతలను "నావల్ల జరగవలసిన దానిని మీరు కోరుకోండి!" అని వరమీయగా వారు వేదాలను తిరిగి అనుగ్రహించమని ప్రార్థించారు. తక్షణం ఆమె దేవతల రక్షణ కొరకు తేజోరూపమైన చక్రాన్ని ఏర్పాటు చేసి దుర్గముని మీదికి దండెత్తింది. నూరు అక్షౌహిణీల సైన్యంతో వాడు ఆమెను ఎదిరించాడు. దేవి శరీరం నుండి కాలి, తార, భిన్నమస్త, శ్రీవిద్య, భువనేశ్వరి, భైరవి, బగళ, ధూమ్ర, శ్రీమత్త్రిపుర సుందరి, మాతంగి అను పదిమంది స్త్రీమూర్తులు బయల్వెడలి వాడి సైన్యాన్ని నిశ్శేషంగా సంహరించారు. శివాదేవి శూలాగ్రంతో పొడిచి దుర్గముని సంహరించి నాల్గు వేదాలను తెచ్చిదేవతలకిచ్చింది.

అంత దేవతలాతల్లిని ఇలా కీర్తించారు: "ఓ అంబికా! నీవు మా కొరకు అనంత నేత్రాలతో అవతరించావు కనుక నీ భక్తులు నిన్ను శతాక్షి అని కీర్తిస్తారు. నీవు నీ దేహంనుండి ఉద్భవించిన శాకములతో జనులను పోషించావు కనుక నిన్ను నీ భక్తులు శాకంభరి అనే పేరుతో పూజిస్తారు. ఓ శివాదేవి! నీవు దుర్గముడనే రాక్షసుని సంహరించావు కనుక మానవులు నిన్ను దుర్గ, భగవతి, భద్ర అను పేర్లతో కొలుస్తారు. అమ్మా! ఎవరైనా కలిమి కలిగియుంటే కలిగినంతలో కడుపు నింపుతారుగాని తొమ్మిది రోజులు అహోరాత్రాదులు సంతత ధారాపాతంగా బిడ్డలకొరకు కన్నీరు కార్చిన అమ్మలగన్న అమ్మవు నీవే! ఇంతటి దయను ఎవరు చూపుతారు తల్లీ! ముల్లోకాలలోను నీ భక్తులకు ఎప్పుడూ ఎట్టి ఆపద, పరాభవము లేకుండా ఉండేటట్లు ఇట్టి దయనే ఎప్పుడూ చూపు."

అపుడా తల్లి ఇలా అంది: "బిడ్డలారా! దూడ 'అంబా' అని అరవగానే ఆవు ఎలా కంగారుగా పరుగెత్తుకొచ్చి తన దూడను నిమురుతుందో నేనూ అలాగే నా భక్తులు 'అమ్మా!' అని పిలువగానే... "నా బిడ్డలకు ఏ ఆపద వచ్చిందో?" అని అక్కడ ప్రత్యక్షమవుతాను. మీరు నన్ను తలచుకొనక పోతే నేనెంత కుమిలిపోతానో తెలుసా! అందరూ నా సంతానమే. గతంలో వలెనే భవిష్యత్తులో కూడ నా సంతానాన్ని రక్షించుకొంటాను. భవిష్యత్తులో శుంభనిశుంభులు ఉదయించగలరు. నేను నందుని భార్య అయిన యశోదయందు నందజనై జన్మించి వారిని సంహరిస్తాను. నేను తుమ్మెద రూపాన్ని దాల్చి అరుణుడనే రాక్షసుని హతమారుస్తాను. ఆ కారణంగా నన్ను భ్రామరి అని పిలుస్తారు. భయంకర రూపాన్ని దాల్చి రాక్షసులను భక్షిస్తాను. అప్పుడు నన్ను భీమాదేవి అంటారు. నా బిడ్డలకు ఏ ఆపద వచ్చినా నేరక్షిస్తాను" అని చెప్పి దేవి అదృశ్యమైంది."

### క్రియాయోగ నిరూపణం

సూతుడు మునులతో ఇలా అంటున్నాడు: "మునులారా! మీకిప్పుడు జగన్మాత అయిన ఉమాదేవి యొక్క క్రియాయోగమును గూర్చి చెపుతున్నాను వినండి. శ్రీమాతను చేరే ఉపాయాలు మూడున్నాయి. అవి జ్ఞాన-కర్మ-భక్తి యోగములు. అవి భుక్తిని, ముక్తిని కూడ ఇస్తాయి. సాధకుని మనస్సు ఆత్మతో కలియుటయే జ్ఞానయోగం. బాహ్య వస్తువులతో కలియుట క్రియాయోగం. దేవికి-ఆత్మకు ఐక్యాన్ని భావన చేయుట భక్తియోగం. నేనిప్పుడు క్రియా యోగాన్ని గురించి చెపుతున్నాను. కర్మవలన భక్తిపుడుతుంది. భక్తిచే జ్ఞానం కలుగుతుంది. జ్ఞానంచే ముక్తి కలుగుతుంది. మోక్షానికి ప్రధాన హేతువు యోగం. యోగ ఫలాన్ని పొందటానికి క్రియా యోగం సర్వోత్తమ సాధనం. సర్వమైన జగత్తుకు కారణం మాయ. ఆ మాయను వశంచేసికొన్నది శాశ్వత బ్రహ్మ తత్త్వం. దేవి యొక్క రూపం బ్రహ్మము కంటె భిన్నము కాదని తెలుసుకొన్న వాడు ముక్తుడవుతున్నాడు.

ముందుగా దేవీ మందిరాన్ని నిర్మించుకొనాలి. అందులో దేవిని ప్రతిష్ఠించి నిత్యము నాలుగు దిక్కులయందు శివ, విష్ణు, సూర్య, గణపతులను స్థాపించాలి. నిత్యము షోడశోపచార పూజా విధానంతో అర్చించాలి. కృష్ణ పక్షంలోని పంచమి, అష్టమి, నవమి, దశమి, అమావాస్య తిథులలో విశేషంగా అర్చించాలి. విష్ణుక్రాంత మరియు తులసిని మినహాయిస్తే మిగిలిన పువ్వులన్ని శ్రీమాతకు ఇష్టమే. పూజ పూర్తయ్యాక దేవ్యపరాధ స్తోత్రాన్ని విధిగా పఠించాలి. చైత్ర శుక్ల తదియ నాడు భవాని వ్రతాన్ని చేసిన భక్తుడు నిస్సందేహంగా పరమ పదాన్ని

పొందుతాడు. అలాగే వైశాఖ శుక్ల తదియకు అక్ష తదియ అని పేరు. ఆనాడు దేవీ వ్రతాన్ని విధిగా చేయాలి. కనీసం చూడాలి. ఆషాఢ శుక్ల తదియ నాడు దేవికి ప్రియమైన రథోత్సవం చేయాలి లేదా ఉత్సవంలో పాల్గొనాలి. ఆ రథమే భూమి అని, చక్రములే సూర్యచంద్రులని, వేదములే గుర్రములని, సారథియే బ్రహ్మయని భావన చేయాలి. లోకులను రక్షించే ఉద్దేశ్యంతో జగన్మాత సంచారం చేస్తున్నదని సాధకుడు రథోత్సవాన్ని భావన చేయాలి. అన్ని మాసములలోను శుక్లపక్ష తదియ దేవికిష్టమైన తిథి.

**ఉమా సంహిత సమాప్తము**

**హరిః ఓం తత్సత్**

**శ్రీకృష్ణార్పణమస్తు**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## కైలాస సంహిత



శ్లో॥ నమశ్శివాయ సాంబాయ సగణాయ ససూనవే ।
ప్రధాన పురుషేశాయ – సర్గస్థిత్యంత హేతవే ॥

**తా ॥** జగన్మాతతో, గణములతో మరియు పుత్రులతో కూడియున్నవాడు, ప్రకృతిని మరియు జీవులను నియంత్రించు వాడు, సృష్టి స్థితి లయములకు కారణమైనవాడు అగు శివుని కొరకు నమస్కారం.

**ఓంకార స్వరూపం**

మహర్షులు సూతునితో ఇలా అంటున్నారు. "ఓ మహాత్మా! వ్యాసశిష్యా! నువ్వు మాకింతవరకు శివమహాపురాణంలోని ఉమా సంహితను చెప్పావు. తెలియని శివ – పార్వతుల గాథలను, వారి తత్త్వాన్ని నీద్వారా విని కృతార్థులమయ్యాం! మాకిప్పుడు కైలాస సంహితను చెప్పండి! ముందుగా ఓంకార స్వరూపాన్ని వివరించండి. దాని తత్త్వాన్ని బోధించండి!"

మునుల శివజ్ఞాన సముపార్జనా లక్ష్యానికి సంతసించి సూతుడిలా చెప్పసాగేడు : "ఓ! మహర్షులారా! మీరు భాగ్యవంతులు! చక్కగా ప్రశ్నించారు. పూర్వజన్మ సుకృతం వల్ల గాని ఇలాంటి విషయాలను తెలుసుకొనాలనే ఇచ్ఛ పుట్టదు. తొల్లి మీరడిగిన ప్రశ్ననే ఉమాదేవి శంకరుని ప్రశ్నించగా ఆయనామెకు వివరించాడు. సర్వజ్ఞుడైన మా గురువుగారు ఆ జ్ఞానాన్ని పొంది నాకు బోధించారు. దానినే మీకు ఉపదేశిస్తున్నాను వినండి. వేదములు ఓంకారంనుండే పుట్టాయి. మహేశ్వరుడే ఓంకారం యొక్క లక్ష్యం. శివానుగ్రమము లేనిదే ఓంకార స్వరూపం అవగతం కాదు. ఓంకారమనే మంత్రానికి ప్రణవము అని పేరు. అదే అన్ని ఉపాసనలకు మూలం. అది మర్రిచెట్టు విత్తనంవలె సూక్ష్మమైనది. సృష్టికి

కారణభూతమైనది ఓంకారమే. అది సకల వేదసారం. విశేషించి అది శివస్వరూపం. పరమేశ్వరుడు దాని యందు ప్రతిష్టితుడై ఉన్నాడు. సత్త్వ –రజః –తమోగుణముల కలయికలోని హెచ్చుతగ్గుల వలన ఈ జగత్తులోని సకలము నిర్మాణమై ఉంది. ఈ సృష్టి సమస్తము దానిలోని అంశములే. త్రిగుణములు ఓంకారార్థంలో అంతర్గతమై ఉంటాయి. కావున ఓంకారమే సర్వజగత్తుకు అధిష్ఠానం. అవినాశి అయిన పరబ్రహ్మమే ఓంకారం. పరమేశ్వరుడు ఓంకారం చేతనే సకల జగత్తును సృష్టించాడు. వాచకమైన ఓంకారానికి వాచ్యమైన శివునకు భేదం లేదు. జ్ఞానులైనవారు ఈ ఓంకారాన్ని కేవల శివునకే కాక మాయాతీతుడైన పరబ్రహ్మకు కూడా ఐక్యాన్ని భావన చేస్తున్నారు. ప్రణవోపాసన మినహా ముక్తి సాధన మరొకటి లేదు. కనుకనే కాశీలో విశ్వేశ్వరుడు, సర్వమంత్రములలో శ్రేష్టమైన ప్రణవాన్ని మరణ సమయంలో జీవులకు ఉపదేశిస్తాడు.

మునులారా! ఈ ఓంకారంలో అ–ఉ–మ అనేమూడు, అక్షరాలున్నాయి. ఆ అక్షరాలకే మాత్రలని పేరు. తర్వాత బిందువు ఉంది. పూర్ణానుస్వారం అనగా సున్న (ం) కే బిందువు అని పేరు. ఆపైన నాదం . మూడు మాత్రలు, మరియు బిందువు, నాదము కలిపి ఐదు వర్ణములతో కూడిన ప్రణవాన్ని ఉద్ధారము (మంత్ర రహస్యాలను వెలికి తీయుట) చేసి నిత్యము జపించే వానికి ముక్తి నిశ్చయం. బ్రహ్మ మొదలుగా గడ్డిపోచ వరకు గల సకల ప్రాణుల ప్రాణము ఈ 'ఓం' కారమే. అందుకే దీనికి ప్రణవము అను పేరు వచ్చింది. మనం రెండు చేతుల చూపుడు వ్రేళ్లతో రెండు చెవులను మూసుకొంటే మనకు వినిపించే నాదమే ప్రణవం. ఇలా వినిపించే నాదం సత్యజ్ఞానాది లక్షణాలుగల పరబ్రహ్మను చెపుతుంది. దానికి 'పరప్రణవము అని పేరు. పంచవర్ణాత్మకమై వాచకమగు శబ్ద రూపమైన 'ఓమ్ ' కారాన్ని'అపర ప్రణవము'అని సంకేతం.

ఈ ప్రణవానికి అనేక పర్యాయ పదాలున్నాయి. బ్రహ్మము, జ్ఞానము, శివాత్మకము, సర్వాత్మకము. సర్వవిద్యా బీజము, తేజో బీజము, ముక్తి బీజము, నిష్కళము, నాదము, నాదాది, హృన్నాదము, వేదాది, వేద భూమి, మంత్ర ప్రాణము, బ్రహ్మ స్వరూపము, ఆత్మ మంత్రము..... ఇత్యాదిగా అనేక పర్యాయ పదాలున్నాయి. ఓంకారంలో మొదటి వర్ణమైన 'అ' కారం ....... సర్వజగత్తుకు బీజమైన మహత్తత్త్వానికి, రజోగుణానికి, సృష్టికర్తయైన బ్రహ్మకు ప్రతీక. ఇదే వామనాసాపుట అయిన ఇడానాడి అనే చంద్రుడు. 'ఉ' కారం మహత్తత్త్వానికి కూడ కారణమైన మాయాశక్తికి, సత్త్వ గుణానికి, స్థితి పాలకుడైన విష్ణువుకు ప్రతీక. ఇదే దక్షిణ (కుడి) నాసాపుట అయిన పింగళ నాడి అనే సూర్యుడు.

'మ' కారం మాయాశక్తి సమేతుడైన ఈశ్వరునకు, తమోగుణానికి, లయ కారకుడైన రుద్రునకు ప్రతీక. ఇదే మధ్యనాడి అయిన సుషుమ్న అనబడే అగ్ని. ఇక బిందువు ప్రకాశ స్వరూపుడగు మహేశ్వరునకు, తిరో భావమునకు ప్రతీక. తిరోభావ మనగా కార్య జగత్తు కారణ రూపం లోనికి విలీనం కాగా ఆ కారణం కూడా పరమాత్మతో విలీనమగుట. చివరిదైన 'నాదము' సర్వమును అనుగ్రహించే సదాశివునకు ప్రతీక. ప్రకృతి కంటె పరుడైన శివుని నాదాగ్రమందు భావన చెయ్యాలి.

అకార, ఉకార, మకార,బిందు, నాదముల యందు వరుసగా పంచముఖుడైన పరమేశ్వరుని యొక్క సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన స్వరూపములు (పంచ బ్రహ్మలు) ప్రతిష్ఠితములై ఉన్నాయి. 'అ' కారమునందు సద్యోజాతుని నుండి పుట్టిన ఎనిమిది కళలు, 'ఉ ' కారమునందు వామదేవుని పదమూడు కళలు, 'మ' కారము నందు అఘోరుని యొక్క ఎనిమిది కళలు, బిందువునందు తత్పురుషుని యొక్క నాలుగు కళలు నాదమునందు ఈశానుని యొక్క ఐదు కళలు ప్రతిష్ఠితమై ఉన్నాయి. మంత్రము, యంత్రము, దేవత,ప్రపంచము, గురువు, శిష్యుడు..... ఈ ఆరు ....తత్త్వములు. ఈ ఆరింటిని ఐక్యం చేసి భావన చేయాలి. ఆ భావనా సిద్ధియే ప్రపంచం యొక్క ఆత్మ. అదే ప్రణవసిద్ధి. ప్రణవ మంత్రానికి బ్రహ్మఋషి, దైవీ గాయత్రి చందస్సు. పరమ శివుడు అధిదేవత. ' అ ' కారం బీజం. 'ఉ' కారం శక్తి, 'మ' కారం కీలకం. మోక్షమే వినియోగం."

### సన్న్యాస దీక్షా విధానం

మునులారా! మీకిప్పుడు సన్న్యాస ఆశ్రమ స్వీకార విధానాన్ని గురించి చెపుతున్నాను వినండి. ముందుగా శాంతుడు, జితేంద్రియుడు, తపశ్శాలి, వైరాగ్య సంపన్నుడు, వేదశాస్త్ర పారంగతుడు, శైవ దీక్షితుడు అయిన బ్రాహ్మణుని గురువుగా యెంచు కోవాలి. అట్టి ఆచార్యుని సమీపించి సాష్టాంగ నమస్కారం చేసి ప్రయత్న పూర్వకంగా ఆయనను సంతోష పెట్టాలి. ఎవడు గురువో వాడే శివుడు. ఎవడు శివుడో వాడే గురువు. ఇలా మనసులో నిశ్చయించుకొని గురువును ప్రార్థించాలి. ఆపై గుర్వాజ్ఞను పొంది సాధకుడు పన్నెండు రోజులు పాలను మాత్రమే ఆహారంగా తీసికొని జీవించాలి. ఆపై నదీతీరంలో గాని, శివాలయంలోగాని శుక్ల పక్ష పంచమినాడు గాని, ఏకాదశినాడు గాని ఉదయమే స్నానం చేసి పవిత్రాంతఃకరణంతో నిత్యకర్మలను ఆచరించి గురు సన్నిధిలో, యధా విధిగా నాందీ శ్రాద్ధం చేసి యధా శాస్త్రీయంగా క్షుర కర్మను ముగించుకొని వెంటనే స్నానం చేసి ఏకాగ్ర చిత్తంతో శివుణ్ణి

ధ్యానించాలి. ఆ రోజు సాయంత్రం స్నానం చేసి, సంధ్యావందన మాచరించి ఔపాసనా కార్యక్రమాన్ని ముగించుకొని గురువును సత్కరించి హోమద్రవ్యాలతో స్వశాఖా సూత్రానుసారంగా అగ్ని కార్యం చెయ్యాలి. ఆహితాగ్ని అయిన బ్రాహ్మణుడైతే ప్రాజాపత్యేష్టిచే ఆధానం చేయబడిన శ్రౌతాగ్నియందు చక్కగా ఆహుతులను సమర్పించి తరువాత ఆ అగ్నిని తనయందు సమారోపం చేసికొని సన్న్యసించాలి.

తరువాత అతడు స్థిరచిత్తుడై చరువు (హోమద్రవ్యం) ను వండి అగ్ని యందు సమిధలు, చరువు, నెయ్యి మొదలైన హోమ ద్రవ్యాలను పురుష సూక్తాన్ని పఠిస్తూ ప్రతిఋక్కు యొక్క అంతమునందు హోమం చేసి స్విష్టకృత్ హోమంతో పరిసమాప్తి చెయ్యాలి. ఆ తరువాత ఆ విద్వాంసుడు తంత్రోక్త విధానంగా కూడా హోమం చేసి అగ్ని హోత్రానికి ఉత్తర దిక్కునందు దర్భాసనంపై కూర్చుని బ్రహ్మ ముహూర్తం వరకు గాయత్రిని జపించాలి. తరువాత హోమం కొరకు చరువును వండి పురుష సూక్తంతో మొదలిడి విరజాసూక్తం వరకు హోమం చేయ్యాలి. తరువాత శేషహోమాన్ని పూర్తి చేసి ప్రాత రౌపాసన చేయాలి. తదనంతరం అగ్నిని తనయందు ఆరోపించుకొని ప్రాతస్సంధ్యా వందనం చేసి సూర్యోదయానంతరం గాయత్రిని జపించాలి. తరువాత క్రమంగా ధనేషణ, దారేషణ, పుత్రేషణలను విడిచి సన్న్యసించే సమయంలో చెప్పే ప్రేష మంత్రములను ఉచ్చరించి పిలక, యజ్ఞోపవీతం, మొలత్రాడు మొదలైన వాటిని విసర్జించాలి. తర్వాత ఉత్తర దిక్కుకు గాని, తూర్పు దిక్కుకు గాని వెళ్ళాలి. పిమ్మట లోక సంచారమునందు ఇష్టుడైనచో దండ, కమండలువులను, కౌపీనాన్ని స్వీకరించాలి. ఇష్టం లేకపోతే అక్కరలేదు.

పిదప గురువు వద్దకు వెళ్ళి మూడుసార్లు సాష్టాంగ నమస్కారమును చేయాలి. గురువు విరజాహోమం చేయగా మిగిలిన తెల్లని భస్మను శిష్యునికి యధావిధిగా పూయాలి. పిమ్మట 'అగ్నిరితి' అని మొదలయ్యే మంత్రంతో త్రిపుంద్రమును ధరింప చెయ్యాలి. శిష్యుని శిరస్సుపై చేతినుంచి వాని కుడి చెవిలో ఋషి, దేవత, చంధస్సులతో కూడిన ప్రణవ మంత్రాన్ని మూడుసార్లు చక్కగా ఉచ్చరించాలి. పిమ్మట ఉపాసనా సహితంగా ఆరు విధాల అర్థాన్ని భోదించాలి. పిమ్మట శిష్యుడు పన్నెండు సార్లు గురువుకు సాష్టాంగ దండ ప్రణామం చేసి వేదాంతాన్ని శ్రవణం చేయాలి. ఆపై నిత్యము మనస్సులో సాక్షిస్వరూపుడు, అంతర్యామి స్వరూపుడు అయిన పరమేశ్వరుని పార్వతీ సహితంగా హృదయ పద్మంలో ధ్యానించాలి. అట్టి సాధకుడు తప్పక శివసాయుజ్యాన్ని పొందుతాడు.

**ప్రణవార్థ వివరణం**

మునులారా! ఇప్పుడు ప్రణవార్థాన్ని వివరిస్తున్నాను. శ్రద్ధగా వినండి, శివుడు, మహేశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, పితామహుడు, సంసార వైద్యుడు, సర్వజ్ఞుడు, పరమాత్మ... ఈ ఎనిమిది నామములు నిత్యుడు, శాశ్వతుడు అయిన శంకరుని ప్రతిపాదిస్తాయి. శంకరునకు అయిదు కళలున్నాయి. అందు నివృత్తి కళ మోకాళ్ళ వరకు, ప్రతిష్ఠా కళ నాభి వరకు, విద్యాకళ కంఠం వరకు, శాంతకళ లలాటం వరకు, ఆ పైన శాంత్యతీతమనే సర్వ శ్రేష్ఠమైన కళ ఉంటుంది. సగుణ రూపుడైన శివుని యందు ఈ అయిదు కళలు అయిదు మార్గాలలో వ్యాపించి ఉంటాయి. వీటికే 'పంచాధ్వలు' అని సంకేత వ్యవహారం. ఎనిమిది నామములలోను మొదటి అయిదు నామములు ఉపాధి సహితమైన ఆత్మనే భోధిస్తాయి. మిగిలిన మూడు నామములు నిరుపాధికమైన ఆత్మను బోధిస్తాయి. జగత్తు యొక్క ఉపాదాన కారణ భేదాలను అనుసరించే ఆ నామాలు ఏర్పడ్డాయి. పదము అనగా శబ్దం నిత్యం. పదముచే తెలియబడే పదార్థము (వస్తువు లేక ఉపాధి) అనిత్యం. గోవు చనిపోతుంది కాని 'గో' శబ్దం నశించదు. ఆ కారణంగా ఉపాధి భేదంచే పరమాత్మకు కూడా నామభేదం సిద్ధించింది. ఇప్పుడు ఆ నామాల యొక్క అర్థాన్ని వివరిస్తున్నాను.

**శివుడు :** పరమాత్మ తన స్వరూపమునందు అవిద్య లేక అజ్ఞానంతో సంపర్కం లేదా సంశ్లేషం (లేపము) లేని వాడు కనుక ఆయనకు 'శివ' నామధేయం కలిగింది. ఆయన అత్యంత పరిశుద్ధుడు. సకల కళ్యాణ గుణములకు ఆయన ఆస్పదుడు కనుక 'శివుడు'.

**మహేశ్వరుడు :** ప్రకృతి ఇరవై నాలుగు తత్త్వములతో కూడి ఉంటుంది. అవియేవనగా మూల ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారం. శబ్ద స్పర్శరూప రసగంధాది తన్మాత్రలు ఐదు. జ్ఞానేంద్రియ పంచకం. కర్మేంద్రియ పంచకం మనస్సు. ఆకాశాది పంచ మహాభూతములు. ఇట్టి ప్రకృతికి అతీతంగా ఉంటాడు 'పురుషుడు'. ఇతడు అపరిణామి. ఈ ప్రకృతి, పురుష లిద్దరకు అతీతుడు కనుక శంకరుడు 'మహేశ్వరుడు' అయ్యాడు. మరోవిధంగా చెపుతున్నాను. సత్త్వ – రజః – తమో గుణాలతో కూడిన ఈ ప్రకృతి అంటే జగత్తు మాయ. అది అవినాశి. అట్టి మాయను తన వశంలో ఉంచుకొన్నాడు కనుక మహేశ్వరుడు. జీవులను ఆ మాయ నుండి తప్పిస్తాడుకనుక మహేశ్వరుడు.

**రుద్రుడు :** 'రుత్' అనగా దుఃఖం లేదా దుఃఖానికి హేతువు. అట్టి దుఃఖాన్ని తొలగిస్తాడు కనుక రుద్రుడు.

**విష్ణువు :** ఈ జగత్తునందు అంతట లోపల, బయట కూడ వ్యాపించి ఉన్నాడు కనుక శివునకు విష్ణువని పేరు.

**పితామహుడు :** జగత్తుకు, త్రిమూర్తులకు కూడ తండ్రి అయిన కారణంగా శివునకు పితామహుడని పేరు.

**సంసారవైద్యుడు :** లోకంలో రోగ నిదానం తెలిసిన వైద్యుడు రోగాన్ని నయం చేసి ఎలా స్వస్థతను చేకూరుస్తాడో అలాగే శంకరుడు సంసార మహాదుఃఖాన్ని నాశనం చేస్తాడు కనుక సంసార వైద్యుడయ్యాడు.

**సర్వజ్ఞుడు :** లోకంలో మనుష్యులు పంచ జ్ఞానేంద్రియములచే జ్ఞానాన్ని పొందుతున్నారు. అలాగే పంచ కర్మేంద్రియములచే కర్మలను ఆచరిస్తున్నారు. అయినా లోకుల జ్ఞానం పరిపూర్ణం కాదు. కాని సదాశివుడు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు లేకున్నా జ్ఞానానికి అధిష్ఠానంగా ఉన్నాడు కనుక సర్వజ్ఞుడు.

**పరమాత్మ :** లోకంలో మనుష్యులు చైతన్య స్వరూపమైన ఆత్మాధిష్ఠానంగానే మనస్సంకల్పాలను బుద్ధిచే తర్కించుకొని కార్యాలను చక్కపెట్టుకొంటున్నారు. అట్టి ఆత్మలకు అదిష్ఠానంగా ఉంటున్నాడు కనుకను, తనకంటె పరుడు ఎవ్వరూ లేరు కనుకను పరమాత్మ ఐనాడు.

మునులారా ! ' ఓం ' కారాన్ని పలికేటప్పుడు ఆ నాదం మూలాధారంలో పుడుతుంది. ఆ నాదాన్ని క్రమంగా షట్చక్రాలను దాటించి సహస్రారంలో ఉన్న శివునితో ఐక్యం చెయ్యాలి. దీనిని సాధించిన యోగి తప్పక జీవన్ముక్తు డవుతాడు.

**శివుని ఉపాసనా మూర్తి వివరణ**

మునులారా! మీకిప్పుడు సదాశివుని నుండి మహేశ్వరుడు మొదలుగా నలుగురు బ్రహ్మలు ఉద్భవించిన ఉత్తమమైన విధానాన్ని చెపుతున్నాను శ్రద్ధతో వినండి. సహస్రాతీతమైన నామము లన్నీ శివునివే అయినా.... సృష్టి, స్థితి, లయము, తిరోభావము, అనుగ్రహము అనే పంచకృత్యములను ఆచరించేటప్పుడు కార్యభేదం చేత ఆయనకు నామబేధాలు ఏర్పడింది.

ఈ సృష్టి ఆద్యంతములు లేనిది. అయినా లోక వ్యవహారాన్ని అనుసరించి చెప్పుకొంటే తొలుత అనాదియైనది, సర్వాశ్రయమైనది, కారణము లన్నింటికి తానే కారణమైనది ఒకటి ఉన్నది. అదే 'శ్రీ గురు శంభు లింగం. దాని నుండి 'చిత్' శక్తి ఆవిర్భవించింది. దాని

నుండి బిందువు పుట్టింది. శివతత్త్వమైన బిందువు నుండి శక్తి తత్వం వ్యక్తమైంది. దానినుండి భక్తులకు, యోగులకు భోగమోక్ష ప్రదుడైన చంద్రకళావతంసుడు, పంచముఖుడు, దివ్య వస్త్రాభరణ గంధ మాల్యాలంకృతుడు, మనోన్మనీ శక్తి సహితుడు అయిన సదాశివుడు ఆవిర్భవించాడు. ఆయన నుండి మహేశ్వరుడు, ఆయన నుండి రుద్రుడు, రుద్రుని నుండి వామ దేవుడు (విష్ణువు) ఆయన నుండి బ్రహ్మ ఉద్భవించారు.

సదాశివుడు ఆకాశాభిమాని. అది సమష్టి స్వరూపం. ఆయన నుండి వ్యక్తమైన మహేశ్వరుని ముఖం పురుష రూపాన్ని పోలియున్న కారణంగా ఆయన తత్పురుషుడై వాయువుకు అధిపతి అయ్యాడు. సగుణుడు, క్రియా శక్తి ప్రధానుడు అగు ఆయన ఎడమ భాగంలో మాయాశక్తి ఉంటుంది. 1. ఈశ్వరుడు. 2. విశ్వేశ్వరుడు, 3. పరమేశ్వరుడు, 4. సర్వేశ్వరుడు.... ఈ నలుగురు మహేశ్వరుని వ్యష్టిరూపాలు, వీరితో కూడినదే..... ఉత్తమమైన తిరోధాన చక్రం. ఇదే మహేశ్వర ధామం.

మహేశ్వరుని నుండి రుద్రుడు ఆవిర్భవించాడు. 1. శివుడు, 2.హరుడు, 3. భవుడు, 4, మృడుడు....ఈ నలుగురు రుద్రుని వ్యష్టిరూపాలు. ఈ రుద్రుడు శాంతమైన ముఖం కలవాడు కనుక అఘోరుడనబడి అగ్నితత్త్వానికి అధిపతి అయ్యాడు. సర్వసంహారకుడైన రుద్రుని ఎడమభాగంలో గౌరీ శక్తి ఉంటుంది. ఇదే ఉత్తమమైన సంహార చక్రం. ఇదే రుద్ర ధామం. ఈ సంహారం మూడు రకాలుగా ఉంటుంది. జీవుడు పొందే నిద్రావస్థ నిత్యసంహారం. బ్రహ్మగారు నిద్రించగానే జరిగేది నైమిత్తిక సంహారం. బ్రహ్మ కూడా లయం కాగానే జరిగేది మహా సంహారం. జీవులకు దుఃఖ నివృత్తి కొరకు మరియు కర్మ పరిపక్వత కొరకు ఈ సంహారక్రియ కల్పింపబడింది.

రుద్రుని నుండి వామదేవ చక్ర స్వరూపుడు, జలతత్త్వాభిమాని అయిన విష్ణువు పుట్టాడు. 1. వాసుదేవుడు, 2. అనిరుద్ధుడు, 3. సంకర్షణుడు, 4. అధోక్షజ ఈ నల్గురు విష్ణువుకు వ్యష్టిరూపాలు. విష్ణువు యొక్క ఎడమ భాగంలో లక్ష్మి ఉంటుంది. ఇదే ఉత్తమమైన స్థితిచక్రం. ఇదే వైకుంఠమని పిలువబడే విష్ణులోకం. సృష్టించబడిన జగత్తుకు స్థితిని కల్పించటం విష్ణువు యొక్క కర్తవ్యం.

విష్ణువు నుండి సద్యోజాతముఖ స్వరూపుడు, పృథ్వీతత్త్వాభిమాని అగు బ్రహ్మ పుట్టాడు. రజోగుణ స్వరూపుడైన ఈయన ఎడమ భాగంలో సరస్వతి ఉంటుంది. హిరణ్య గర్భుడు, విరాట్, పురుషుడు, కాలుడు.... ఈ నలుగురు బ్రహ్మ యొక్క వ్యష్టి రూపులు.

బ్రహ్మ మానస పుత్రులచే, ఋషులచే సేవింపడే ఉత్తమ సృష్టి చక్రం ఇదే. ఇదే బ్రహ్మలోకం. ప్రకృతి యందు ఉపసంహరింపబడియున్న జీవులను..... క్రమంగా సుఖ దుఃఖాది భోగములను అనుభవించే నిమిత్తం వెలికి తెచ్చి కర్మలతోను, అంగములతోను, ఫలములతోను సంబంధాన్ని కల్పించే ప్రక్రియకు సృష్టి అనిపేరు. సృష్టి మొదలుగా తిరోధానం వరకు అయిదు అవయవములు గల ఈ జగచ్చక్రానికి 'పంచార (అయిదు ఆకులుగల) చక్రము' అని పేరు.

ఈ భూమి విస్తరించి యున్న కారణంగా దానికి పృథ్వి అనిపేరు. ఈభూమి నీటి చేతను, నీరు అగ్ని చేతను, అగ్ని వాయువు చేతను, వాయువు ఆకాశము చేతను, ఆకాశం అహంకారం చేతను, అహంకారం మహత్తత్త్వము చేతను, మహత్తత్త్వము అవ్యక్తం చేతను ఆవరింపబడి ఉంది. ఈ సర్వజగత్తు శక్తి సహితుడైన శివ స్వరూపమే!

**శివతత్త్వ వర్ణనం**

మునులారా! తొల్లి వామదేవ మహర్షి సుబ్రహ్మణ్యుని ద్వారా విన్న దానిని మీకు చెపుతున్నాను. ఈ శివతత్త్వాన్ని పార్వతి ప్రశ్నించగా శివుడే చెప్పాడు. కుమార స్వామి పాలుత్రావుతూ విన్నాడు. ఆ కారణంగా అతడు సుబ్రహ్మణ్యుడైనాడు.

ముందుగా మీకు సృష్టి తత్త్వాన్ని చెపుతున్నాను వినండి. ఇది చాలా గహనమైనది రహస్యమైనది కూడాను. ఈ సృష్టి మనకు ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉంది కనుక మనం సర్వమునకు ఆధార భూతుడు, ఆత్మస్వరూపుడు అయిన శివుని గూర్చి విచారణ చెయ్యవలసిన అవసరం ఉంది. జగత్తులోని ప్రాణులన్నీ స్త్రీ –పురుష రూపంలో గోచరిస్తూనే ఉన్నాయి. పిండములో ఆరు కోశములు కలవని అందు మూడు తండ్రియొక్క అంశలనియు మూడు తల్లి యొక్క అంశలనియు వేదం చెపుతూన్నది. ఎల్ల శరీరధారులందు స్త్రీ–పురుష లక్షణాలను చూచిన విద్యాంసులు పరమాత్మయందు కూడా ఆ లక్షణాలనే భావన చేశారు. పరమాత్మ సచ్చిదానంద (సత్ + చిత్ + ఆనందము) రూపుడని శ్రుతి నొక్కి వక్కాణిస్తున్నది. అసలు 'సత్' అనే శబ్దానికి ఉనికికి ఆధారభూతమైనది అనే అర్థం. కనుక పరమాత్మ లేదా భగవంతుడు లేడు అనే అ భావాన్ని చెప్పటం కుదరదు. "నేను లేను!" – అని చెప్పటం ఎంత అవివేకమో "భగవంతుడు లేడు!" అని చెప్పటం కూడా అట్టి అవివేకమే! 'ఆత్మాసత్' అను ప్రమాణం చేత సత్ (ఉనికి) ఆత్మయే. ఇక్కడకు సృష్టికి కర్త ఉన్నాడు అని చెప్పినట్లైంది. 'సత్' శబ్దం మూడు లింగాల్లోను ఉంది. కాని ఇక్కడ పురుషుని మాత్రమే బోధిస్తూన్నది.

ఇక పోతే ఆ కర్త జడమా? లేక చైతన్యమా! అనేది మరొక సందేహం? 'చిత్' అనగా ప్రకాశము అని అర్థం. జ్ఞానము అనే అర్థంలో అది స్త్రీ లింగం. "చితి స్వతంత్రా విశ్వసిద్ధి హేతుః" – అనే శక్తి సూత్రం చేత చైతన్య విలసితమైన ఈ విశ్వానికి కారణ భూతమైనది చిత్తే. 'సత్' ప్రకాశ రూపమైనది కాగా 'చిత్' చైతన్యము లేక జ్ఞాన రూపమైనది. ఈ జంటయే జగత్తుకు కారణభూత మవుతున్నది. "సత్" పురుష రూపుడైన శివుడనియు, "చిత్" జ్ఞాన రూపిణి అయిన శక్తి (పార్వతి) అనియు ఈ శివ – శక్తుల సమ్మేళనమే పరమాత్మ స్వరూపమని వేదం పలుమార్లు చెప్పింది. ఒకే ఆత్మ తత్త్వంలో శివ–శక్తులు రెండూ ఉన్నాయని గ్రహించాలి. లోకంలో నూనె – వత్తి వీటి మాలిన్యం వలన దీప ప్రకాశానికి (కాంతికి) కూడా మాలిన్యం ఉంది. కాని తన ప్రకాశానికి తానే కారణభూతు డవుతున్నాడు కనుక 'సత్' స్వరూపుడైన పరమాత్మ ( శివుని) ప్రకాశానికి మాలిన్యం లేదు. అలాగే లోకంలో జీవులను ఆశ్రయించుకొని ఉంటున్న చైతన్యానికి దుర్బలత్వం ఉంది. జ్ఞానానకి మరపు ఉంది. కాని జ్ఞాన చైతన్య రూపమైన 'చిత్' స్వతంత్రమైనది కనుక దానికి (శక్తికి) దుర్బలత్వము, మరపులేవు. ఇక్కడకు సృష్టికర్త జ్ఞాన, చైతన్య స్వరూపుడే అనేది స్థిరపడింది.

ఇక శివ–శక్తుల సమ్మేళన స్వరూపం యెట్టిది అని శంక రాగా ఆనంద స్వరూపమని శ్రుతి పలుమార్లు బోధించింది. దుఃఖ స్పర్శ లేదా? అంటే లేదు అనేదే సిద్ధాంతం. మునులారా! వేదంతో పరిచయం లేనివారి నిమిత్తం ఈ విషయంలో లోకం నుండే ఉదాహరణ చూపుతాను. లోకంలో యువతీ – యువకులైన స్త్రీ – పురుషులు సృష్టి కార్యంలో నిమగ్నమై ఉన్నప్పుడు ఒకానొక అలౌకికమైన ఆనందాన్ని పొందుతున్నారు. అనేది ఎల్లరకు అనుభవ సిద్ధమేకదా! ఆ సమయంలో ఇరువురి భావములు ఏకీకృత మవుతాయి! ప్రపంచం యొక్క ఉనికి తొలగిపోతుంది! 'నేను – నీవు' – అనే ద్వైత భావన నశిస్తుంది. అనిర్వచనీయము, అఖండము, ఆత్మ సాక్ష్యావిదితము, అద్వయము, అనంతము అయిన సుఖాన్ని ఆ దంపతులు పొందుతూ ఉన్నారు. కాక పోతే మానవుల విషయంలో అది స్వల్పకాలం మాత్రమే! కాని అనంతమైన సృష్టికార్యం ఎడతెరపి లేకుండా, విరామం లేకుండా, అవిశ్రాంతంగా, అఖండంగా శివశక్తుల సంయోగంతో సాగి పోతున్నది. క్రొత్త సృష్టి పుడుతూన్నది. పాత సృష్టి నశిస్తున్నది. ఇదొక నిరంతర ప్రక్రియ. ఆ కారణంగా సత్–చిత్‌ల సమ్మేళనంలో ఆనందం ఉద్భవించి.... పరమాత్మ సచ్చిదానంద స్వరూపుడైనాడు. శివ శక్తుల కలయికయే ఆనందం.

ఇట్టి అద్వైత స్థితిలో సర్వాత్మ భావాన్ని కలిగియున్న శివ – శక్తులను ఉపనిషత్తులు బ్రహ్మముగా పేర్కొన్నాయి. బ్రహ్మ శబ్దం బృంహి ధాతువునుండి పుట్టింది. ఆ ధాతువుకు వ్యాపకత్వము, విశాలత్వము అనే అర్థాలున్నాయి. కావున బ్రహ్మ శబ్దం ఆ రెండు అర్థాలను నిత్యము కలిగియున్న శంభుని బోధిస్తూన్నది. దీనికి శ్రుతి ప్రమాణం. సద్యోజాతాది పంచబ్రహ్మలతో కూడిన ఒక్క పరమేశ్వరుడు తక్క అన్యులెవరూ బ్రహ్మశబ్ద వాచ్యులు కారు.

మునులారా! మీకిప్పుడు 'ఓం' కారము యొక్క పుట్టుకను బోధిస్తున్నాను. వినండి! 'హంస' శబ్దాన్ని తలక్రిందులుగా ఉచ్చరిస్తే 'సోఽ హమ్' అనే శబ్దం ఏర్పడి దాని నుండి 'ఓమ్' పుట్టింది. 'సోఽ హమ్' నుండి సకార, హకారములనే హల్లులను తీసివేస్తే మిగిలేది 'ఓం' కారమే! ఇది పరమాత్మను బోధిస్తుంది. ఇది మహా మంత్రం. 'స' కారము, విసర్గ, 'అ' కారము, 'హ' కారం మరియు అనుస్వారం కలిసి 'సోఽ హమ్ ' (సః అహమ్) అనే మహా మంత్రం ఏర్పడింది. ఈ మంత్రంలోని 'స' కారము శివుని బోధిస్తుంది. 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్యంలో ప్రజ్ఞాన శబ్దానికి చైతన్యమనియే అర్థం. ఆ చైతన్యం ఆత్మయే. ఆ ఆత్మ శివుడే అని శివ సూత్రములు బోధిస్తున్నాయి. ఈ జగత్తులో ప్రాణుల యొక్క ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులన్నీ చైతన్యమే. స్వాతంత్ర్యము (మోక్షము) దాని స్వరూపం, అదే 'ఆత్మ'.

'జ్ఞానం బంధః' – అనేది రెండవ శివ సూత్రం. జ్ఞానం బంధమెలా అవుతుంది? అన్నది ప్రశ్న. మనుజుల జ్ఞానం మరియు అక్షర జ్ఞానం (పుస్తక జ్ఞానం) పరిమితము, అల్పమే కనుక అట్టి అల్పజ్ఞానం బంధమే! కనుక జీవుల అల్పజ్ఞాన క్రియా శక్తులు బంధమే! ఈ సూత్రం జీవుల నుద్దేశించి చెప్పినది మాత్రమే అని గ్రహించాలి. ఇచ్ఛా–జ్ఞాన – క్రియా శక్తులు శంభుని మూడు కన్నులు అని బ్రహ్మర్షులు చెపుతున్నారు. మనుజులలో ఈ మూడు శక్తులు ఎలా పనిచేస్తాయో చెపుతున్నాను వినండి. ఆత్మ (చైతన్యం లేక శక్తి) అధిష్ఠానంగా జీవించే మనుజుని మనస్సులో ఒక సంకల్పం (కోరిక లేక భావం) పుడుతుంది. దీనికే 'ఇచ్ఛ' అని పేరు. ఆ ఇచ్ఛా శక్తి జ్ఞానేంద్రియములలో ప్రవేశించి, బుద్ధి సహాయంతో ప్రేరేపించబడి; కర్మేంద్రియాలను ఉద్దీపించి వాటి ద్వారా కర్మలను చేయిస్తోంది. ఆ కర్మలే సుఖదుఃఖాలకు కారణభూత మవుతున్నాయి. కనుక దుఃఖ రాహిత్యానికి సత్సంకల్పం వినా వేరే ఉపాయం లేదు. సత్సంకల్పములు పుట్టాలంటే సత్సాంగత్యమే శరణ్యం. సత్సాంగత్యమే జీవన్ముక్తికి సోపానం.

పరమాత్మయందు శివ–శక్తుల సమ్మేళనం ఉంది. పరాశక్తి నుండి చైతన్య శక్తి, దాని నుండి ఆనంద శక్తి, దాని నుండి ఇచ్ఛా శక్తి, దాని నుండి జ్ఞాన శక్తి, దాని నుండి క్రియా శక్తి పుట్టుతున్నాయి. నిజానికి ఇవన్నీ స్థితిభేదం చేత, గతి భేదం చేత ఒకే శక్తియొక్క విలాసాలు మీకిప్పుడు ఓం కారోత్పత్తిని చెపుతున్నాను వినండి. పరాశక్తి నుండి చైతన్యం దాని నుండి నాదము, ఆనందము నుండి బిందువు, ఇచ్ఛా శక్తి నుండి మకారము, జ్ఞాన శక్తి నుండి 'ఉ' కారము, క్రియా శక్తి నుండి 'అ' కారము పుట్టాయి.

ఇక పంచ బ్రహ్మల ఉత్పత్తి విశేషాన్ని చెపుతున్నాను వినండి! శివుని నుండి ఈశానుడు, ఈశానుని నుండి తత్పురుషుడు, ఆయన నుండి అఘోరుడు, అఘోరుని నుండి వామదేవుడు, వామ దేవుని నుండి సద్యోజాతుడు వ్యక్తమయ్యారు. 'ఓం' కారము నుండి అయిదు అచ్చులు, ముప్పది మూడు హల్లులు మొత్తం ముప్పది ఎనిమిది మాతృకాక్షరములు పుట్టాయి. ఈశానుని నుండి శాంత్యతీత కళ, తత్పురుషుని నుండి శాంతి అనే కళ, అఘోరుని నుండి విద్యాకళ, వామదేవుని నుండి ప్రతిష్ఠ అనే కళ, సద్యోజాతుని నుండి నివృత్తి అనే కళ పుట్టాయి. ఈశాన విభుని నుండి చిచ్ఛక్తి ద్వారా మిథున పంచకం పుట్టింది. సృష్టి మొదలుగా తిరోధానం వరకు పంచకృత్యములను ఆ మిథున పంచకం నెరవేరుస్తూ ఉంటుందని శివతత్త్వం తెలిసిన పెద్దలు బోధిస్తున్నారు.

భువనాలన్ని భూమ్యాది తత్త్వములను ఆశ్రయించి ఉన్నాయి. భూమ్యాది తత్త్వములు నివృత్త్యాది కళలను ఆశ్రయించి, ఆ కళలు బిందువును ఆశ్రయించి ఉంటున్నాయి. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి..... ఈ ఐదు పంచభూతములు. సృష్టిలో ఏలోకానికి వెళ్ళినా ఆరవభూతం లేదు. కొన్ని లోకాలలో నాలుగు, మూడు, రెండు, ఒకటి..... అలా ఉండవచ్చు. ఆకాశమునకు శబ్దము అనే ఒక గుణం, వాయువుకు శబ్ద, స్పర్శలు, అగ్నికి శబ్ద, స్పర్శ, రూపములు, నీటికి శబ్ద, స్పర్శ, రూప, రసములనే నాలుగు గుణములు, పృథివికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే ఐదు గుణములు ఉన్నాయి.

ఈ పంచ భూతములు ఆకాశం మెదలుగా ఒకదాని నుండి మరొకటి పుట్టాయి. ఆకారణంగా పైభూతము యొక్క గుణం క్రింది భూతం లోనికి ప్రసరిస్తుంది. పైది వ్యాపకము కాగా క్రిందిది వ్యాప్యం అవుతుంది.

మొత్తం బ్రహ్మాండమనే స్థూల దేహాభిమానికి 'విరాట్' అనే పేరు. పృథివీ తత్త్వంతో ప్రారంభమై శివతత్త్వం వరకు గల తత్త్వ సముదాయమునకు, 'బ్రహ్మాండము' అని పేరు.

సృష్టి ఏ క్రమంలో అవరోహణ క్రమంలో పుట్టిందో తిరిగి ప్రళయకాలంలో ఆరోహణ క్రమంలో క్రిందిది పైదానిలో విలీనంకాగా; అంతమునందు ప్రాణరూపుడైన ఈశ్వరుని యందు లీనమవుతుంది. తిరిగి ఈశ్వరుని మాయాశక్తి ప్రభావంచే జగద్రూపంగా సకల శక్తులతో ప్రకట మవుతుంది. అంతకు ముందు ఏ నామరూపాది గుణములు లేకుండ నిర్వికారంగా ఉన్న ఈశ్వర తత్త్వంలో; "సృష్టిని చేయాలి" – అనే సంకల్పంతో కూడిన 'ప్రథమ స్పందన' యే 'శివతత్త్వం' అని పిలువబడుతూన్నది. ఈ విషయాన్ని శివుని నుండి పుట్టిన 'స్పంద కారికలు' స్పష్టంగా చెప్పాయి. ఈ ప్రథమ స్పందనయే (చలనమే) లేక ఈశ్వరుని సంకల్పమే 'ఇచ్ఛాశక్తి' అనబడే తత్త్వం. ఈ స్పందనయే 'నేను' అనబడే అహంవృత్తిగా తత్త్వవేత్తలచే చెప్పబడుతూన్నది. జ్ఞాన శక్తి – క్రియాశక్తులలో జ్ఞాన ప్రధానుడు సదాశివుడు. క్రియా ప్రధానుడు మహేశ్వరుడు. జ్ఞాన – క్రియా శక్తుల సమానావస్థకు 'శుద్ధ విద్యాతత్త్వము' అని పేరు. శివుని అంగములే ఐన చతుర్దశ భువనములందలి సర్వ పదార్థములయందు మనకు గోచరించే భిన్నత్వానికి, భేద బుద్ధికి 'మాయ' అని పేరు. ప్రళయ కాలంలో సర్వ సృష్టి ఆయనయందు విలీనమైన స్థితిలో ఆయన 'పురుషుడు' అని పిలువబడు తున్నాడు. శ్రుతి ఈ విషయాన్నే "తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్" (పరమేశ్వరుడు జగత్తును సృష్టించి దాని లోనికి ప్రవేశించెను) అనే మంత్రంలో స్పష్టంగా చెప్పింది.

మాయా మోహితుడై, శివజ్ఞాన రహితుడై, వివిధ కర్మల యందు తగుల్కొని యున్న మనస్సు గలవాడై ఉండే జీవుడు సంసారి అని పిలువ బడుతున్నాడు. "ఈ జగత్తు శివునికంటె భిన్నంగా లేదు. శివుడు నాకంటె వేరుగా లేదు!" – అనే నిశ్చయమైన అభిప్రాయాన్ని కలిగి ఉండటమే.... శివజ్ఞానం. తద్వ్యతిరేక జ్ఞానమే...... అజ్ఞానం. ఆకాశంలో మెరిసే మెఋపు తీగ ఆటలోను, వాయువు యొక్క మందగమనంలోను, అగ్ని జ్వాలల చలనంలోను, నీటియందు తరంగ లాలిత్యం లోను, భూమి మీది ప్రకృతి వర్ణములలోను (రంగులలో) గోచరించే శివలీలా విలాసాన్ని గమనించి ముగ్ధులు కానేరక; శివుడు ఎక్కడో ఉన్నాడని భావించి భ్రమించే వారు మూర్ఖులు కారా? ఈ శివజ్ఞాన్నాన్ని గురువుద్వారా పొందిన జీవుడు చైతన్య ఘనుడైన శివుడే అగుచున్నాడు. సర్వకర్తృత్వం, సర్వజ్ఞత్వం, పూర్ణత్వం, నిత్యత్వం, వ్యాపకత్వం... ఈ అయిదు శక్తులు శివుని అధీనంలో ఉంటాయి. తద్వ్యతిరేక లక్షణాలు జీవునిలో ఉంటాయి. వాటికి కళ, విద్య, రాగము, కాలము, నియతి అని పేర్లు. వాటి నిర్వచనాన్ని చెపుతున్నాను. వినండి. అల్పమైన కార్యములను మాత్రమే చేయగల సామర్థ్యానికి లేదా హేతువుకు 'కళ' అని పేరు. అల్పమగు పరిజ్ఞానానికి హేతువు 'విద్య'.

ఇంద్రియ సుఖములయందు ఆసక్తి కలిగి ఉండటమే 'రాగము'. వస్తువుల (పదార్థముల) ఉనికికి మరియు వాటి అభావము (లేకపోవుట) ఈ రెంటికి హేతువు 'కాలము'. కాలానికి లొంగి ఉండుట మరియు కర్తవ్యము-అకర్తవ్యము అనే విషయములచే నియంత్రింపబడి ఉండుట అనేది 'నియతి'. ఈ ఐదింటికి 'పంచ కంచుకములు' అని పేరు. గురువు మరియు అంతరంగ సాధన... ఈ రెండూ జీవునకు జ్ఞానోపలబ్ధికి ముఖ్యం.

మునులారా! మీకింత వరకు చెప్పిన కైలాస సంహితలోని విషయాలు చాల రహస్యమైనవి, గహనమైనవి. పూర్వ జన్మపుణ్య విశేషం చేతనే వీటిని శ్రవణం చేసే అదృష్టం లభిస్తుంది. వీటిని ప్రతి ఒక్కరు తెలుసుకొని తరించాలి."

**శివాద్వైత జ్ఞానం**

మహర్షులు సూత ప్రసంగాన్ని విని అతనితో ఇలా అంటున్నారు: "ఓ సూత మహర్షీ! శాస్త్ర ప్రసంగములు గహనమైనవి. అవి తత్త్వంతో కూడి ఉంటాయి. అట్టి శాస్త్ర విషయమైన దానిని శివాద్వైతాన్ని నీ ముఖతః వినాలని కుతూహలపడుతున్నాం. సర్వులకు ముక్తికారకమైన ఆ జ్ఞానాన్ని మాకు ఉపదేశించండి." మునుల మాటలకు ప్రీతుడై సూతుడిలా చెపుతున్నాడు. "మునులారా! శివాద్వైత సిద్ధాంతం ద్వైతాన్ని లేశమైనా చెంతకు చేరనీయదు. ద్వైత సిద్ధాంతంలో ఉపాసకుడు-ఉపాస్యదైవము *ఈ ఇద్దరుకూడా చివరకు నశిస్తారు. అద్వైత పరబ్రహ్మకు వినాశం లేదు.* శివుడు సర్వజ్ఞుడు, సర్వకర్త, సర్వేశ్వరుడు, నిర్గుణుడు, త్రిమూర్తులకు తండ్రి, పరబ్రహ్మ మరియు సచ్చిదానంద స్వరూపుడు. ఆ శివుడే తన ఇచ్ఛచే జగత్తును సృష్టించి తనను తాను సంకోచ పరచుకొని పురుషుడు లేక జీవుడైనాడు. ఈ శరీరానికి 'పురము' అనే పేరున్నది. పురమునందు ఉంటాడు కనుక పురుషుడైనాడు. ఆ పురుషుడే కళమొదలుగా నియతి వరకు పంచ కంచుకము లనబడే తత్త్వములతో కూడినవాడై, ప్రకృతితో తాదాత్మ్యాన్ని పొంది, తనయందు భోక్తృత్వాన్ని కల్పించుకొని ప్రకృతి గుణములను అనుభవిస్తున్నాడు. ఈ స్థితిలో జీవుడని పిలువ బడుతున్నాడు. తత్త్వంలో ఇద్దరికి భేదం లేదు. జీవుడు ముమ్మూర్తులా ఈశ్వరుడే! సందేహం లేదు. *జీవుడు వేరు - దేవుడు వేరు అని విశ్వసించే ద్వైతుల కొరకే మహాపాతక ఫలరూపమైన నరకాదులు సృష్టించ బడ్డాయి.*

మీకిప్పుడు సృష్టి క్రమాన్ని చెపుతున్నాను వినండి మహత్తత్త్వం నుండి అహంకారము, దాని నుండి పంచతన్మాత్రలు, దాని నుండి పంచ మహాభూతములు ఉద్భవించాయి. పంచభూతముల సూక్ష్మరూపములకే తన్మాత్రలని వ్యవహారం. తన్మాత్రలకే కళలని కూడా

పేరు. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి... ఈ ఐదు పంచభూతములు. అవకాశ ప్రదానం అనగా దేనికైనా చోటును కల్పించటం ఆకాశం యొక్క కార్యం. శబ్దం దాని గుణం. వాహకత్వం వాయువు కార్యం. స్పర్శ దాని గుణం. దాహకత్వం అనగా దేనినైనా దహించటం అగ్ని యొక్క కార్యం. రూపం దాని లక్షణం. జలము యొక్క కార్యం ప్రవహించటం. అది ఆస్వాదయోగ్యమైనది. అది దాని లక్షణం. దేనినైనా ధరించటం భూమి యొక్క కార్యం. గంధగుణం దాని లక్షణం. ఆకాశం మొదలుగా భూమి వరకు పంచభూతములు ఒకదాని నుండి ఒకటి పుట్టాయి.

శరీరం పంచభూతాత్మకం. చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు ఈ ఐదు జ్ఞానేంద్రియాలు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అనేవి క్రమంగా వాటిచే తెలియబడే విషయాలు. నోరు, చేతులు, కాళ్ళు, గుదము, జననేంద్రియము అనేవి పంచ కర్మేంద్రియములు. మాట్లాడుట, పనిచేయుట, నడచుట, విసర్జించుట, ఆనందించుట అనునవి వాటి వ్యాపారాలు.

ఈ విధంగా స్థూల, సూక్ష్మ భూతములతో కూడియున్న ఈ అనంతమైన విశ్వాన్ని, స్త్రీ-పురుషాత్మకమైన దానిని సాధకుడు అంతర్ముఖత్వంతో శివ-శక్తి స్వరూపంగా ఉపాసన చేయాలి. సదాశివుడే ప్రపంచ రూపంలో ఉన్నాడని భావించాలి. ఈ జగత్తు ముప్పది ఎనిమిది కళల సమాహార స్వరూపమైన కారణంగా, (ద్వైతభావన ఉన్నా) సదాశివుడను నేనే అను విచారణచే ఆత్మస్వరూపాన్ని తెలుసుకొన్న గురువు నిశ్చయంగా శివుడే! అట్టి జ్ఞానంగల వాడే యోగ్యుడైన శిష్యుడు.

మునులారా! రాగాది దోష రహితమైనది, వేదసారమైనది, సాక్షాత్తు శివుని చేతనే ఉపదేశింపబడినది ఐన ఈ శివాద్వైతాన్ని మీకు బోధించాను. మీరు నానుండి ఇంకేమి వినాలని కుతూహల పడుతున్నారు? అడగండి! జిజ్ఞాసువులైన శ్రోతలు దొరకటం కూడా దుర్లభం కదా!" అని సూతుడు మౌనాన్ని వహించాడు.

## మహావాక్య తాత్పర్య నిర్ణయం

శౌనకాది మునులు సూత మహర్షిని "ఓ సూత మహర్షీ! శివాద్వైత జ్ఞానాన్ని పొందిన గురువు తన శిష్యుని యోగ పట్టమునకు అర్హుణ్ణి చేసే సమయంలో ఉపదేశించే మహా వాక్యములను తాత్పర్యంతో సహా మాకు బోధించవలసింది." అని ప్రార్థించగా సూత మహర్షి ఇలా చెప్పసాగారు.

"ఓ మునులారా! చెపుతున్నాను వినండి. ముందుగా గురువు శిష్యునికి అన్ని సంస్కారాలను విధివిధానంగా చేసి తాను తూర్పుముఖంగా ఆసీనుడై భస్మాలంకృతమైన తన హస్తాన్ని తన పుత్రుని వంటి శిష్యునితలపై ఉంచి కుడి చెవిలో "హంసస్సోఽహమ్ (పరబ్రహ్మ స్వరూపుడను నేనే) అని స్పష్టంగా ఉపదేశించాలి. ఆ మంత్రంలో 'హం' పదమునకు శక్తి స్వరూపమని, 'స' కారమునకు సాక్షాత్తు శివుడని అర్థం. ఆత్మ స్వరూపుడగు ఆ శివుడను నేనే అని శిష్యుడు భావన చెయ్యాలి. తర్వాత గురువు "అణోరణీయాన్..." (సూక్ష్మమైన దానికంటె కూడ ఆత్మ సూక్ష్మమైనది) అనే మంత్రాన్ని ఉపదేశించి ఆత్మ తత్త్వాన్ని బోధించాలి. ఆ పైన గురువు శిష్యుని ఉద్దేశించి "ఓ బ్రహ్మస్వరూపుడా! నీకు కొన్ని మహా వాక్యాలను చెపుతున్నాను. సావధానుడవై విని నీ చిత్తంలో ధారణ చేయి" అని చెప్పి పిమ్మట మహా వాక్యాలను వాటి తాత్పర్యాన్ని బోధించాలి. అవి యేవనగా:

**1. ప్రజ్ఞానం బ్రహ్మ:** ప్రజ్ఞాన శబ్దమునకు చైతన్యము అని అర్థం. చైతన్యము ఆత్మయే.

**2. అహం బ్రహ్మాస్మి:** అక్షరములకు మొదటిదైన 'అ' కారము ప్రకాశ స్వరూపుడైన పరమ శివుణ్ణి బోధిస్తుంది. ఆకాశ స్వరూపమగు 'హ' కారం శక్తి స్వరూపం. శివశక్తుల సంయోగం శాశ్వతానందానికి హేతువు. బ్రహ్మ శబ్దం ఆ శివశక్తులే సర్వజగద్రూపంగా భాసిస్తున్నారని స్పష్టం చేస్తూన్నది. అట్టిబ్రహ్మము నేనే అని స్థిరంగా భావన చేయాలి.

**3. తత్వమసి:** అది నీవే అయి ఉన్నావు అని చెప్పే ఈ గురూపదేశ వాక్యంలో తత్ అనే పదమునకు సోఽహమస్మి అను వాక్యంలోని సః అను పదమునకు అర్థం సమానమే. అలాకానియెడల 'సోఽహమస్మి' అనే వాక్యానికి విరుద్ధార్థం సంప్రాప్తమవుతుంది. ఎలాగంటె 'అహమ్' అనేది పులింగ శబ్దం. కాగా 'తత్' అనేది నపుంసక లింగం. లింగభేదం కారణంగా వాటికి పరస్పర అన్వయం కుదరదు. స్త్రీ-పుంసాత్మకమైన జగత్కారణం లింగాతీతమై ఉండి తీరాలి. 'అది నేనే' అనగా ఆ బ్రహ్మమును నేనే అని భావన చేయాలి.

**4. అయమాత్మా బ్రహ్మ:** ఈ ఆత్మ బ్రహ్మయే అని భావన చేయాలి. ఈ రెండు పదములు పుంలింగ పదములే.

**5. ఈశావాస్యమిదం సర్వమ్:** ఈ జగత్తును రక్షించువాడు ఈశ్వరుడు. కావున ఈ జగత్తును ఈశ్వర భావనచే కప్పివేయాలి.

**6. ప్రాణోఽస్మి:** ఇక్కడ ప్రాణ శబ్దానికి ఆత్మ అనే అర్థం. నేను ఆత్మను అని ఆత్మభావన చేయాలి.

**7. ప్రజ్ఞానాత్మా:** ఆత్మచైతన్య ఘనము అని భావనచేయాలి.

**8. యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ:** ఇందులో యత్‌నకు యః అనియు తత్‌నకు సః అనియు అర్థం. ఏడవదాంట్లో చెప్పబడిన చైతన్య ఆత్మయే (ప్రజ్ఞానాత్మయే) ఈ దేహంలో మాత్రమే గాక పరలోకంలో లభ్యమయ్యే దేహంలో కూడా పురుష రూపంలో ఉంటాడని విద్వాంసుల సిద్ధాంతం. అలాగే భావన చెయ్యాలి.

**9. అన్యదవ తద్విదితాదథో అవిదాతపి:** ఈ ఆత్మ తెలిసినవానికంటె మరియు తెలియని దానికంటె భిన్నమైనది. ఇక్కడ తెలిసిన దానికంటె (విదితముకంటె) అనే దానికి అర్థమేమంటే: కొందరు జగత్తును, జీవాత్మను పరమాత్మ కంటె భిన్నంగా భావిస్తున్నారు. ఇదే తెలియటం అనేదానికి అర్థం. కాని అట్టి భావన మోక్షహేతువు కాజాలదు. నిజంగా రెండు ఆత్మలు లేవు. జీవాత్మ అనే మాట లోక వ్యవహారం కొరకు కల్పింపబడింది. జీవాత్మ-పరమాత్మ శబ్దాలు లోక వ్యవహారంలో 'నేను-నీవు' వంటివి. నిజంగా అంతటా వ్యాపించి యున్నవాడు పరమాత్మ ఒక్కడే! అలాగే భావన చేయాలి.

**10. ఏష త ఆత్మాంతర్యామ్యమృత:** నీ లోపల ఉండి నిన్ను నియంత్రించే అంతర్యామి స్వరూపంగా ఉన్నవాడెవరనగా... ఏ వినాశంలేని అమృతుడైన శివుడే. శిష్యుడలానే భావన చేయాలి.

**11. స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే, స ఏకః:** ఈ పురుషుని యందు ఏ శివుడు కలడో ఆయన సూర్యుని యందుకూడా స్థిరుడై ఉన్నాడు. సః = అతడు. అసౌ = వీడు. సః అను ఈ మూడు కలిసి భేద భావాన్ని నిరాకరించి సర్వము శివుడే అని సిద్ధాంతం చేసి బోధిస్తున్నది. లోకంలో ఉపాధి భేదం చేత పురుషుడు-ఆదిత్యుడు అనే గౌణ వ్యవహారం కలిగింది.

**12. అహమస్మి పరంబ్రహ్మ పరం పరపరాత్పరమ్:** అహం అను పదానికి శక్తి స్వరూపుడైన శివుడని అర్థం. అట్టి శివుడను నేనే అగుచున్నాను అని ఈ వాక్యానికి తాత్పర్యం. సర్వమునకు ఆత్మ మరియు సర్వముకంటె ఉత్కృష్టుడు అగు ఆ పరబ్రహ్మ పరుడనియు, అపరుడనియు మరియు పరాత్పరుడనియు మూడు విధములుగా వర్ణింపబడుచున్నాడు.

ప్రకాశ స్వరూపుడగు శివుడు త్రిమూర్తుల కంటె ఉత్కృష్టుడు కనుక వేదములాయనను పరశబ్దంచే కీర్తించాయి.

**13. వేద శాస్త్ర గురుత్వాత్తు స్వయమానంద లక్షణమ్:** అజ్ఞాని అయిన శిష్యుడు (సాధకుడు), గురువుచే ఉపదేశించబడిన వేద శాస్త్రముల వాక్యములను అభ్యాసం చేయుట వలన పరిపూర్ణానంద స్వరూపుడైన శివుడే అగుచున్నాడు.

**14. సర్వభూతస్థితం బ్రహ్మ తదేవాహం న సంశయః:** సకల ప్రాణులలోను ఉన్న శంభుడను నేనే! సందేహం లేదు. సకల తత్త్వముల ప్రాణమును నేనే! శివుడను నేనే! ఇలాగే భావన చేయాలని జీవభావంతో ఉన్న వారికి వేదం బోధించి ఇంకా ఇలా బోధిస్తూన్నది.

**15. తత్త్వస్య ప్రాణోఽహమస్మి పృథివ్యాః ప్రాణోఽహమస్మి! అపాంచ ప్రాణోఽహమస్మి తేజసశ్చ ప్రాణోఽహమస్మి! వాయోశ్చ ప్రాణోఽహమస్మి ఆకాశస్య ప్రాణోఽహమస్మి! త్రిగుణస్య ప్రాణోఽహమస్మి!:** మూడు తత్త్వములకు ప్రాణమగు శివుడను నేనే అగుచున్నాను. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము వీటికి ప్రాణమగు శివుడను నేనే అగుచున్నాను. సాధకుడిట్లు నిశ్చయ బుద్ధితో సాధన చేయాలి.

**16. సర్వోఽహం సంసారీ । యద్భూతం । యచ్చభవ్యం యద్వర్త మానం । సర్వాత్మకత్వాదద్వితీయోఽహమ్:** ఈ మంత్రంలో సర్వమ్ అనే శబ్దం వాడిన కారణంగా విద్యాతత్త్వమునందు శివుడు మరియు ఆత్మ అను తత్త్వముల యందు గల ప్రాణశక్తిని నేనే అగుచున్నాను అని స్పష్టం చేయబడింది. నేను సర్వుడను! సర్వము యొక్క స్వరూపుడను నేనే! నేను సర్వ కాలములలోను జీవుని యందు అంతర్యామినై ఉన్నాను కనుక జీవుని ప్రాణశక్తిని నేనే! భూతభవిష్యద్వర్తమాన కాలములలోని సర్వము నాతో నిండియున్నది కనుక సర్వము నేనే! "సర్వోవై రుద్రః" (సర్వము రుద్రుడే) అను శ్రుతి వాక్యం చేత జగత్కారణమైన గుణముల యందు సర్వ కాలములలోను అనుగతుడై ఉన్న కారణంగా సర్వమునకు ఆత్మ శివుడే అనేది నిశ్చయం. నాకంటె భిన్నంగా మరొక ఆత్మ లేదు కనుక నేను అద్వితీయుడను. సాధకుడు ఏ పనిచేస్తున్నా, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ వ్యాపారాలెన్నిటిలోనో మునిగి తేలుతున్నా పుంఖాను పుంఖంగా విషయములందు తత్పరుడైఉన్నా "నేనే శివుడను! నేను అద్వితీయుడను!" అనే భావనము విడిచిపెట్టకూడదు.

**17. సర్వం ఖల్విదం బ్రహ్మ:** "ఇదంతా" బ్రహ్మమే అయిఉన్నది. అదినేనే అనే భావన చెయ్యాలి.

**18. సర్వోఽహం విముక్తోఽహమ్:** నేను సత్త (ఉనికి)యే స్వరూపముగా కలవాడను కనుక పూర్ణుడను. పూర్ణుడను కనుక సర్వకాలములలో ముక్తుడనే! జీవులు నా స్వరూపమైన చైతన్యాన్ని ఆశ్రయించి నా అనుగ్రహం చేతనే ముక్తులవుతారు.

**19. యోఽసౌ సోఽహం హంసస్సోఽహమస్మి:** సర్వమునకు ఆత్మయగు శివుడను నేనే! అజ్ఞాన నాశకుడగు శివుడను నేనే!

మునులారా! సర్వాత్మ స్వరూపుడైన శివుని కంటె నేను భిన్నుడను అని ఎవడైతే భేద భావనను కలిగి ఉంటాడో వాడు మహా భయాన్ని పొందుతాడని వేదం సద్రూపమైన ఆత్మతత్త్వాన్ని బోధించింది. కనుక సర్వులు 'శివోఽహం' అనే మంత్రాన్ని మానకుండా పఠిస్తూ ఆత్మసామ్రాజ్య పట్టభద్రులు కావాలి. అలా పట్టభద్రులైన సాధకులు శ్రీవర్ధనుడైన శివుని యోగ స్వరూపులే కనుక వారందరు 'శ్రీపాద' బిరుద నామంతో విరాజమానులై సంచరిస్తూ లోకానికి భయాన్ని పోగొట్టి శాంతి కళ్యాణప్రదులవుతున్నారు.

ఇలా గురువు ద్వారా శివజ్ఞానాన్ని పొంది యోగ పట్టభద్రులైన యతీశ్వరులందరు లోక కళ్యాణం కొరకు, శాంతి స్థాపన కొరకు కృషి చేయాలి. సద్యోజాతాది పంచవక్త్రుడైన శివుని అయిదు ముఖాలలోను అఘోర స్వరూపం ఒకటి. ఘోరం కానిది అఘోరం. అంటే భయంకరం కానిది శాంతరూపమైనది అని అర్థం. అట్టి శాంతమూర్తులైన యతీశ్వరులు "సాక్షరాః" (అక్షర పరబ్రహ్మ స్వరూపులు / ఓంకార స్వరూపులు) అని పిలువబడుతారు. వారే లోభులై యతి ధర్మాలకు విరుద్ధంగా, వ్యతిరేకంగా ప్రవర్తిస్తే "రాక్షసాః" అనగా రాక్షసులు అవుతారు. కావున యతులు విపరీత కర్మను చేయరాదు. యతి తనవద్దకు వచ్చిన వారందరిని శివస్వరూపులుగానే భావించాలి. తాంబూలము, బంగారము, రేతస్సేచనం (స్త్రీ సంపర్కం), తెల్లని వస్త్రములు, పగటి నిద్ర, రాత్రి భోజనం... వీటిని విసర్జించాలి. ఈ నియమాలను ఉల్లంఘిస్తే యతి భ్రష్టుడైనట్లే. స్త్రీలతో మాట్లాడ రాదు. శివ నామాన్ని విడువరాదు. ఎప్పుడూ ఆత్మనిష్ఠుడై ఉండాలి.

### సన్న్యాసి అంతిమలోక యాత్ర

మునులారా! మీకిప్పుడు జీవన్ముక్తులగు యతుల మరియు సన్న్యాసుల అంతిమలోక ప్రయాణాన్ని గూర్చి చెపుతున్నాను వినండి. జీవన్ముక్తులైన అట్టి వారికి దహనం ఉండదు. ఖననం మాత్రమే చేయాలి.

సన్న్యాసి నిత్యమూ ఉపనిషద్వ్యాక్యాలను, ఆగమ వాక్యాలను, గురూపదేశాన్ని స్మరిస్తూ మననం చేసికొంటూనే ఉండాలి. జీవుడు–జగత్తు–ఈశ్వరుడు... ఈ మూడింటి తత్త్వాన్ని అనుక్షణము విచారణ చేస్తూనే ఉండాలి. ఆరు శాస్త్రములలోను పాండిత్యంగల సన్న్యాసికి పూర్వోత్తర మీమాంసలు శ్రవణోపయోగి. న్యాయ–వైశేషిక దర్శనాలు మననానికి ఉపయోగిస్తాయి. సాంఖ్యయోగ దర్శనాలు నిదిధ్యాసలకు సహకరిస్తాయి. యమనియమాది యోగాంగములతో కూడిన యోగాన్ని అభ్యసిస్తూ, ఓంకారము నందు లగ్నమైన మనస్సు కలవాడై శివధ్యాన తత్పరుడై ఉండాలి. శివభావంతో నిండిన వాడై సమాధియందు దేహ త్యాగం చేసిన సన్న్యాసి నిస్సందేహంగా పరిపూర్ణుడైన శివుడే అవుతున్నాడు. ఎవరికైతే శరీర దౌర్బల్యం కారణంగా సమాధినిష్ఠ కుదరదో అట్టి సన్న్యాసి సమస్తమైన కోరికలను విడిచి శివుణ్ణే స్మరిస్తూ శివుణ్ణే మనసులో ధ్యానిస్తూ శిథిల దేహాన్ని జీర్ణ వస్త్రంలా త్యజించాలి.

జ్ఞాననిష్ఠులు అయినవారు మరణిస్తే వారిని పుణ్య లోకాలకు గొంపోయే నిమిత్తం అయిదుగురు అతి వాహిక దేవతలున్నారని వేదం చెపుతూన్నది. వారు సదాశివుని అనుగ్రహించే నందీశ్వరుని అధికారంలో ఉంటారు. అందులో ఒక దేవత సర్వాన్ని దహించే అగ్నియొక్క అభిమాని. మరొక దేవత ఒక కాంతిపుంజం. మిగతా ముగ్గురు దేవతలు ఒక దేవత పగటికి, మరొక దేవత శుక్ల పక్షానికి, ఇంకొక దేవత ఉత్తరాయనానికి అభిమాన దేవతలు. మరణానంతర జీవులను ఈ దేవతలు తీసికొనివెళ్ళే మార్గానికి 'ఉత్తరాయన మార్గమని', 'దేవయాన మార్గమని', 'అర్చిరాది మార్గమని' ఇంకా చాలా పేర్లున్నాయి. పంచాగ్ని విద్యను తెలిసికొనిన వారు, వానప్రస్థులు, యతులు, సన్న్యాసులు, యోగులు, నైష్ఠిక బ్రహ్మచర్యవ్రతులు, తపోనిష్ఠులైన వారు వీరందరు మరణానంతరం ఈ మార్గంలో వెడతారు.

జ్ఞాన మార్గంతో పరిచయం లేకుండ కేవల కర్మ మార్గంలో జీవించిన వారు: నోములు, వ్రతాలు, ఉపవాసాదులు, పూజలు, దాన ధర్మాదులు, ప్రజోపయోగ కార్యక్రమాలను ఆచరించిన పుణ్యజీవులు మరణానంతరం వెళ్ళే మార్గానికి 'దక్షిణాయన మార్గము', 'ధూమాది మార్గము', 'పితృ యానము' అని పేర్లు. ఈ మార్గంలో జీవులను గొంపోయే దేవతలు ఐదుగురున్నారు. వారిలో ఒక దేవత ధూమాన్ని (పొగను) అభిమానించేది – ధూమ్ర, మరొక దేవత చీకటిని అభిమానించేది – తమస్విని, కృష్ణపక్షాభిమాని, దక్షిణాయన అభిమాని, మరియు రాత్రి అభిమాని.

మునులారా! ఉత్తరాయణ మార్గంలో వెళ్ళే పుణ్యజీవుల లోకాంతర ప్రయాణాన్ని, వారు పొందే స్థానాన్ని గూర్చి చెపుతున్నాను వినండి. ఇది వేద ఋషులు చెప్పిన విషయం. దీనికి వేదమే ప్రమాణం. సామాన్యులకు అంతుపట్టనిది. సందేహించవలసిన పనిలేదు. ఋషులెప్పుడూ సత్యవాక్కులు.

సన్న్యాసి దేహత్యాగానంతరం ఆ జీవుడు పగటిని అభిమానించు దేవతా స్థానాన్ని పొంది, తద్దేవతా సహాయంతో శుక్ల పక్షాభిమాని దేవతా స్థానమును, తత్సహాయంతో ఉత్తరాయణాభిమాని దేవతా స్థానాన్ని, తత్సహాయంతో సంవత్సరాభిమాని దేవతా స్థానాన్ని, తద్దేవతా సహాయంతో దేవ లోకాన్ని, తత్సహాయంతో వాయు లోకాన్ని, తత్సహాయంతో ఆదిత్య లోకాన్ని, తత్సహాయంతో చంద్రలోకాన్ని (ఈ చంద్రలోకం మనకు కనిపించే చంద్రమండలం కాదు), తత్సహాయంతో విద్యుల్లోకాన్ని తత్సహాయంతో వరుణ లోకాన్ని, అచటినుండి ఇంద్రలోకాన్ని, అక్కడనుండి ప్రజాపతి లోకాన్ని, అక్కడనుండి కార్యబ్రహ్మలోకమైన సత్యలోకాన్ని చేరుకొంటాడు. శివాద్వైత జ్ఞానాన్ని పొంది శివదీక్షా పరులైన యోగులు అక్కడనుండి వైకుంఠానికి, అక్కడ నుండి షణ్ముఖ లోకానికి, అచటినుండి గౌరీ లోకానికి, అచటనుండి కామధేను లోకానికి, అచటనుండి రుద్రలోకానికి, అక్కడనుండి ఈశ్వర లోకానికి, అక్కడనుండి సదాశివ లోకానికి, అక్కడ నుండి శక్తితత్త్వ లోకానికి, అక్కడనుండి పరశివ లోకానికి చేరుకొంటారు. అచటనుండి శివతత్త్వమనబడే బిందువును, అక్కడనుండి చిచ్ఛక్తిని పొంది చివరకు శ్రీగురు శంభులింగంలో ఐక్యమై పునరావృత్తి రహితమైన స్థానాన్ని పొందుతాడు.

మునులారా! ఈ శివతత్త్వం భూలోకంలో ఎలా వ్యాపించిందో ఆ గురుశిష్య పరంపరను చెపుతున్నాను. వినండి. దీనిని స్వయంగా శివుడే పార్వతికి చెపుతూండగా కుమారస్వామి విన్నాడు. కుమార స్వామి వామదేవునికి చెప్పాడు. వామదేవుడు సనత్కుమారునికి బోధించాడు. ఆయన వ్యాసునకు ఉపదేశించాడు. వ్యాసుడు శుక మహర్షికి చెప్పాడు. అగస్త్యుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు మహాత్ములైన ఈ నలుగురు వామదేవుని శిష్యులు. సనక, సనందన, సనాతన, సనత్సుజాతులు అనే మహర్షులు సనత్కుమారుని శిష్యులు. వైశంపాయనుడు, పైలుడు, జైమిని, సుమంతుడు మహాతేజస్సంపన్నులైన ఈ నలుగురు వ్యాసభగవానుని శిష్యులు. సూతుడనైన నేను ఆయన నుండి పురాణ విజ్ఞానాన్ని మాత్రమే పొందాను. మీరు నేను చెప్పిన వేద రహస్యము, సంసార తారకము ఐన ఓంకార

తత్త్వాన్ని, శివ తత్త్వాన్ని ధ్యానించండి. నేను మా గురువుగారైన వ్యాస భగవానుని పాదపద్మాలను సేవించటానికై బదరీ వనానికి వెడుతున్నాను. నాకు మరల మీతో సత్సంభాషణము కలుగు గాక!" అని పలికి సూతుడు వెళ్ళిపోయాడు. మునులాయనకు ఆదరాభిమానాలతో వీడ్కోలిచ్చి సాగనంపారు.

**శ్రీ శివమహా పురాణంలో ఆరవదియగు కైలాస సంహిత సమాప్తము.**

**శ్రీ కృష్ణార్పణమస్తు**

**॥ శ్రీ సాంబసదాశివార్పణమస్తు ॥**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## వాయవీయ సంహిత - (పూర్వభాగం)



శ్లో॥ నమశ్శివాయ సోమాయ - సగణాయ ససూనవే ।
ప్రధాన పురుషేశాయ - సర్గస్థిత్యంత హేతవే ॥

**తా ॥** చంద్రునితో, గణములతో, పుత్రులతో కూడియున్నవాడు, ప్రకృతిని మరియు జీవులను నియంత్రించువాడు, సృష్టి స్థితి లయములకు కారణమైనవాడు అగు శివుని కొరకు నమస్కారం.

**విద్యాస్వరూపం పురాణ ప్రాశస్త్యం**

సూతిడింత వరకు చెప్పిన దానిని హర్షంతో వినిన ఋషులు పరమానందంతో ఇలా వేడుకొన్నారు: "ఓ రోమహర్షణా! నువ్వు త్రికాలవేత్త అయిన వ్యాస భగవానుని శిష్యుడవు. మధురంగా కథలను చెప్పటంలో నేర్పరివి. కాల స్వరూపం తెలిసిన వాడవు. నీతిశాస్త్ర వేత్తవు! మహాజ్ఞానివి! ధర్మశాస్త్ర నిధివి! పురాణాలలో శ్రేష్ఠమైనది, వేదసారభూతమైనది, సకల శ్రేయోదాయకమైనది అయిన శివమహాపురాణాన్ని చాలాభాగం వినిపించావు. అందులో ఏడవదైన వాయవీయ సంహితను సుధామధురంగా చెప్పవలసింది."

మునుల భక్తి, శ్రద్ధలకు ప్రీతుడైన సూతుడు ఇలా చెప్పసాగేడు: "ఓ తపోధనులైన మునులారా! వినండి. ఈ భరత ఖండంలో అనాదిగా, గురుశిష్య పరంపరా గతంగా వస్తూన్న విద్యాసంప్రదాయాన్ని చెపుతున్నాను. ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదములు నాలుగు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము, కల్పము, నిరుక్తము అను వేదాంగాలు ఆరు, మీమాంస న్యాయశాస్త్ర పురాణ ధర్మశాస్త్రములు నాలుగు, ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వవేద, అర్థశాస్త్రములు నాలుగు... కలిపి మొత్తం పదునెనిమిది. వీటినే

విద్యలు అని మహర్షులు తీర్మానించారు. ఈ విద్యలను సాక్షాత్తు సర్వజ్ఞుడైన శివుడే తనపుత్రుడైన బ్రహ్మకు బోధించాడు. సనాతనుడైన ప్రజాపతి ముఖంనుండి ముందుగా వందకోట్ల శ్లోకముల సంఖ్యగల పురాణములు ఆయననుండి వెలువడ్డాయని పురాణ సంప్రదాయం. ఇప్పటికీ దేవలోకంలో ఆ సంఖ్యగల పురాణములు వ్యాప్తిలో ఉన్నాయి. వేదార్థమును ఇతిహాస, పురాణముల సహాయంతోనే వ్యాఖ్యానించాలి. ఈ పదునెనిమిది విద్యల సహకారంతో మాత్రమే వేదం యొక్క సంపూర్ణ విజ్ఞానం అవగతమవుతుంది. తక్కువ విద్యగల వానిని చూచి వీడు నన్ను వంచన చేస్తాడేమో అని వేదమాత వణకిపోతుంది. మునులారా! ఈ పురాణ వాఙ్మయ విషయాలను గతంలో చెప్పాను."

## నైమిషోపాఖ్యానం

మునులారా! మోక్షదాయకమైనది, శివ తత్త్వంతో కూడినది అయిన నైమిషోపాఖ్యానాన్ని చెపుతున్నాను వినండి. ఇది అర్థగాంభీర్యం గలది. తత్త్వజ్ఞానంతో కూడినదీను. ఈ శ్వేత వరాహకల్ప ప్రారంభంలో ఆరు కులములకు చెందిన మునుల సమావేశంలో "సర్వోత్కృష్టమైన తత్త్వం ఏది?" – అను విషయంలో గొప్ప వివాదం ఏర్పడింది. శివుడని, శక్తియని, విష్ణువని, బ్రహ్మయని, ఇంద్రుడని, రుద్రుడని, గణపతియని, కుమారస్వామియని, హిరణ్యగర్భుడని, అంబికయని, ఆదిత్యుడని, ప్రకృతియని, పురుషుడని, అణువుయని, కర్మయని... ఇలా తలకొక విధంగా వాదింప సాగేరు. వారిలో వారికి అనేక పూర్వపక్ష సిద్ధాంతాలతో కూడిన శాస్త్రచర్చలు నడిచినవెనుక సమన్వయం కుదరక ఒక సిద్ధాంతానికి రాలేక పోయారు. అపుడు వారు సత్యలోకానికేగి బ్రహ్మను సందర్శించి విషయాన్ని విన్నవించి "ఓ సనాతనా! ఆదిపురుషా! పరమాత్మా! పరబ్రహ్మా! పురాణ పురుషా! ప్రజాపతీ! సృష్టిలో సర్వోత్కృష్టమైన అవ్యయ తత్త్వమేది?" అని ప్రశ్నించారు.

మునుల ప్రశ్నకు పితామహుడు మందహాసం చేసి **"రుద్రుడు"** అని పిలువబడే పరమేశ్వరు డొక్కడే సర్వోత్కృష్టుడు అని సమాధానం చెప్పి ఆ తత్త్వాన్ని ఇలా వ్యాఖ్యానించాడు: "మునులారా! ఎవనిని వర్ణించలేక వాక్కులు మనస్సుతో సహా వెనుదిరుగుతున్నాయో అట్టి సచ్చిదానంద స్వరూపుడు శంకరు డొక్కడే! త్రిమూర్తులు, ఇంద్రుడు సర్వభూతములు సృష్ట్యాదియందు ఆయననుండియే ఉద్భవించాయి. ఈ జగత్తు ఆయనకంటె భిన్నంగా లేదు. సకలైశ్వర్య సంపన్నుడు, పూర్ణుడు, సర్వేశ్వరుడు ఆయనే! మోక్షం అనేది ఆయన శ్రీ భాండాగారంలో ఒక మూలన పడియున్న వస్తువు. ఆయన స్వయం ప్రకాశ స్వరూపుడు. గ్రహ నక్షత్ర తారకా సముదాయ జ్యోతిర్మండలాలన్నీ ఆయన ప్రకాశం చేతనే

ప్రకాశిస్తున్నాయని వేదం చెపుతూన్నది. ఆయన ఏ వికారములు లేనివాడు. సర్వ ప్రాణులయందు క్రియాశక్తి స్వరూపుడై ఆయనే ఉన్నాడు. సర్వమునకు ఆయనే అధిష్ఠానం. సర్వజనుల హృదయాలలోను శివుడు సుస్పష్టంగా చైతన్య రూపంలో ప్రకటమవుతున్నా అవివేకులైన మనుజులు తెలుసుకోలేకుండ ఉన్నారు. ఈ అజ్ఞానాన్నే అవిద్యయని, మాయ అని అంటారు. ఆయనకు దేశ, కాల, వస్తు పరిచ్ఛేదం లేదు. ఆయన స్వతంత్రుడు, సర్వజ్ఞుడు.

సర్వకాలములలోను జీవునకు శివానుగ్రహం వలన మాత్రమే భుక్తిముక్తులు రెండూ లభిస్తాయి. అట్టి అనుగ్రహానికి ధర్మమే సాధనం. ధర్మమునకు వేదం ఆధారం. ధర్మాచరణ వలన పూర్వజన్మల పుణ్యపాపములు సమాన మవుతాయి. అట్టి సామ్యావస్థ వలన పరమేశ్వరానుగ్రహం సిద్ధిస్తుంది. దాని వలన ధర్మాచరణ ఇనుమడిస్తుంది. ఆ హేతువుచే జీవుని పాపములు పూర్తిగా నశిస్తాయి. పాపక్షయం వలన భక్తి సిద్ధిస్తుంది. ఆ సిద్ధి సంపర్కంచే కర్మ సన్న్యాస నిష్ఠ కుదురుతుంది. దాని వలన శివధర్మనిష్ఠ లభిస్తుంది. శివ జ్ఞానం కలుగగానే సంసారం మీద విరక్తి కలిగి ఇంద్రియ సుఖాలమీద వైరాగ్యం స్థిరపడుతుంది. సుస్థిరమైన వైరాగ్యమే అంతఃకరణ శుద్ధికి హేతువు. అంతఃకరణ శుద్ధికల వానికి మాత్రమే ధ్యాననిష్ఠ కుదురుతుంది. ధ్యాననిష్ఠ స్థిరపడగానే యోగం ప్రారంభమవుతుంది. యోగసిద్ధి వలన సర్వోత్కృష్టమైన పరాభక్తి నెలకొని వెంటనే ఈశ్వరానుగ్రహం సిద్ధించి అట్టి జీవుడు మోక్షాన్ని పొంది శివ స్వరూపుడవుతాడు.

మునులారా! శివానుగ్రహం ఈ క్రమంలో ఇలాగే లభిస్తుంది అని చెప్పటం కుదరదు. పురుషుని (జీవుని) యోగ్యత ననుసరించి... మాతృగర్భంలో ఉన్నది మొదలు వృద్ధుడై మరణించేలోవులో ఎప్పుడైనా ముక్తుడు కావచ్చు. ఉపాధి శరీరం ఏదేనా పశుపక్ష్యాది జీవరాసులలో ఏ శరీరంతో ఉన్నా మోక్షాన్ని పొందవచ్చు. కనుక మీరందరు శివ పరమాత్మను మాత్రమే పరమలక్ష్యంగా పెట్టుకొని తపస్సు చేయండి. నేను నా మనస్సుచే సృష్టించబడిన ఈ చక్రాన్ని విడిచి పెడుతున్నాను. ఈ చక్రం యొక్క అంచు ఏ స్థలంలోపడి భగ్నమవుతుందో ఆ స్థలంలో మీరు తపస్సు చేయండి. అక్కడ వాయువు మీకు ప్రత్యక్షమై జ్ఞాన బోధ చేస్తాడు. మీకు శ్రేయస్సు కలుగుతుంది. వెళ్ళిరండి!'' అని మునుల నాదేశించి పితామహుడదృశ్యుడయ్యాడు. మునులారా! ఆ చక్రం ఒకానొక వనంలో సుందరమైన రాతి పలకపై పడి భగ్నమైంది. ఆ వనమునకు నైమిషారణ్యము అని పేరు. ఆ వనం

నిరంతరము యక్షగంధర్వ విద్యాధరేత్యాది దేవజాతి సంకులమై ఉంటుంది. పూర్వం ఒకప్పుడు పురూరవ చక్రవర్తి ఊర్వశితో కూడి విహరిస్తూ, ఆ స్థలానికి వచ్చి అచట యజ్ఞం చేస్తూన్న ముని గణాన్ని చూచి హిరణ్మయమైన వారి యజ్ఞ వాటికను హరింప తలపెట్టగా, మునులాయనను మంత్రపూతమైన దర్భలతో పడగొట్టారు. అచటి జలం అమృతతుల్యంగా ఉంటుంది. ఆ పవిత్ర స్థలంలో పశుపక్ష్యాదులు సైతం పరస్పర జాతి వైరాన్ని విడిచి అన్యోన్యం మిత్రభావంతో ఉంటాయి. అది తపస్సుకు మిక్కిలి అనుకూలమైనది.

## శివతత్త్వ జ్ఞానము – జీవేశ్వర స్వరూప నిర్ణయము

పరమేష్ఠి యొక్క ఉపదేశానుసారంగా ఋషులందరు నైమిషారణ్యాన్ని చేరి అచట సత్రయాగాన్ని ప్రారంభించారు. ఆ యాగం పరిసమాప్తమయ్యే సమయం వచ్చేసరికి... బ్రహ్మగారి శిష్యుడు, ప్రాణ రూపంలో ఉండి సకల ప్రాణులను నడిపించేవాడు అయిన వాయుదేవుడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు. పితామహుడు చెప్పిన చొప్పున నిజరూపంతో దర్శనమిచ్చిన వాయుదేవునికి అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించి, ఉచితాసనాసీనుణ్ణి చేసి సత్కరించిన ఋషులు ఆయనకు బ్రహ్మగారు చెప్పిన విషయాలను చెప్పి, ఈశ్వర జ్ఞానాన్ని బోధించ వలసిందని ప్రార్థించారు.

ఋషుల ప్రార్థనను మన్నించి సంప్రీతుడైన వాయువు ఇలా చెప్పసాగేడు: "ఋషులారా! తొల్లి ఇరువది ఒకటవ కల్పమైన శ్వేతలోహిత కల్పంలో చదుర్ముఖ బ్రహ్మ సృష్టికాముడై తపస్సు చేయగా; మహేశ్వరుడు 'శ్వేతుడు' అను మహర్షి రూపంలో సాక్షాత్కరించి బ్రహ్మకు సృష్టి విజ్ఞానాన్ని, సామర్థ్యాన్ని అనుగ్రహించాడు. నేనుకూడా నా తపస్సుచే విధాతను మెప్పించి ఆ ఈశ్వర జ్ఞానాన్ని పొందాను. ఆ జ్ఞానాన్ని మీకు అందిస్తున్నాను. సావధాన మనస్కులై గ్రహించండి.

జీవునకు (మనుజునకు) దుఃఖం ఉంది. దుఃఖానికి కారణం అజ్ఞానం. జీవుడు అనాది–అజ్ఞానం కూడా అనాదియే! అజ్ఞానం జ్ఞానం వలన మాత్రమే తొలగిపోతుంది. వస్తు తత్త్వాన్ని యథాతథంగా ఎరుగుటయే జ్ఞానం. ఈ జగత్తు అంతా చేతన అచేతనములతో నిండి ఉంది. చేతనమునకు పశువు అనియు జడమునకు (అచేతనమునకు) పాశమనియు ఆ రెంటిని నియంత్రించే శక్తికి ఈశ్వరుడనియు లేక పతి అనియు పేర్లు. ఇది తాంత్రికుల మర్యాద. ఈ పాశుపత మతాన్ని అనుసరించి శివుడు పశుపాశ విమోచకుడు. తత్త్వవేత్తలు దీనినే మరొక విధంగా... పశువే అక్షరుడని, పాశమే క్షరమని పతికే క్షరాక్షరపరమని వ్యాఖ్యానిస్తారు.

తత్త్వవేత్తలు మరొక విధంగా... క్షరమనగా ప్రకృతి (మాయాశక్తి) అని, అక్షరుడనగా పురుషుడని, ఆ రెంటిని ప్రేరేపించే తత్త్వానికి పరుడు అనబడే పరమేశ్వరుడని అంటారు. ప్రకృతియే మాయ. పురుషుడు మాయచే కప్పబడి ఉన్నాడు. అనాదిగా ఉన్న అజ్ఞానము లేక కర్మ అనునవియే ఈ రెంటికి సంబంధాన్ని కల్పిస్తోంది. వీటిని ప్రేరేపించేవాడు ఈశ్వరుడు... అనగా శివుడు. మహేశ్వరుని శక్తియే మాయ. చైతన్యం మాయచే కప్పబడి ఉంది. మాయావృతంకాని స్వభావసిద్ధమైన స్థితియే శివ తత్త్వము. చైతన్యము సర్వవ్యాపకమే అయినా దానికి ఆవరణము తప్పదు. భోగములకు కారణం కర్మ. అది దోషముల నాశనంచే తొలగుతుంది. పుణ్య, పాప రూపమైన కర్మ సుఖ, దుఃఖ రూపమైన ఫలములను ఇస్తుంది. కళ, విద్య, రాగము, కాలము, నియతి వీటిని ఆశ్రయించుకొని కర్మ ఉంటుంది. ఈ కర్మకు ఆది లేదు. ఇది జీవుని ఆశ్రయించుకొని ఉంటుంది. అనుభవం వలన క్షయమవుతుంది. జీవులు ఏ భోగములనైతే భోగిస్తున్నారో అది అవ్యక్తం. ఆత్మాధిష్ఠానమైన మనస్సు బాహ్యముఖమైన ఇంద్రియముల ద్వారా భోగాలను అనుభవిస్తూన్నది. దానికి క్షేత్రం శరీరమే. అతిశయించిన భక్తి వలన లభించే ఈశ్వరానుగ్రహం కారణంగా భోగాసక్తి అనే అజ్ఞానదోషం తొలగగానే జీవుడు శివుడవుతాడు.

ఈ జగత్తు పుట్టటానికి కారణభూతమైన దానికి అవ్యక్తము అని పేరు. జగత్తు దానినుండే అభివ్యక్తమై తిరిగి దానిలోనే లయమవుతుంది. సత్త్వ–రజః–తామసము లనబడే మూడు గుణములతో కూడియున్న అవ్యక్తమునకే ప్రధానమనియు, ప్రకృతి అనియు పేర్లు. నువ్వులలో నూనెవలె ప్రకృతియందు త్రిగుణములు సూక్ష్మరూపంలో ఉన్నాయి. సుఖము మరియు సుఖహేతువు సాత్త్వికం. దుఃఖము మరియు దుఃఖహేతువు రాజసం. జడత్వము మరియు మోహము తామసం. సాత్త్విక గుణం మనిషి మరణించిన పిమ్మట జీవుణ్ణి పుణ్యలోకాలకు, తామసగుణం జీవుణ్ణి పాప లోకాలకు తీసుకొని పోతాయి. రాజస స్వభావం మధ్యమ గతిని (భూలోకంలో మనుష్య జన్మను) ఇస్తుందని మహర్షులు అంటున్నారు.

ఇక ఆత్మతత్త్వాన్ని గురించి వివరిస్తున్నాను వినండి. పంచేంద్రియములచే మనుష్యులు పొందుతున్న జ్ఞానంకంటె విలక్షణమైన సర్వవ్యాపకమైన దానికే ఆత్మ అని పేరు. అది శరీరము, ఇంద్రియములు, బుద్ధి, మనస్సు అనువాటికంటె విలక్షణమైనది. అది అంతర్యామి. సర్వసాక్షి. జ్ఞానముచే ప్రకాశించే వారి అంతఃకరణములందు ఆత్మ ప్రత్యక్షంగా అనుభవంలోకి వస్తుంది. అది అవినాశి. అవికారి.

రైతు పొలంలో విత్తనాలను చల్లుతాడు. అది తప్పక కర్మ అని పిలువబడుతుంది. పొలానికి నీరు పెడితే బీజములు అంకురిస్తాయి. అలాగే మనిషి చేసే కర్మలు అజ్ఞానమనే నీటిచే తడుపబడి తిరిగి పునర్జన్మకు కారణమవుతాయి. జ్ఞానాగ్నిచే దగ్ధం కాబడిన కర్మలు పునర్జన్మ హేతువులు కానేరవు. వేపిన విత్తనాలు మొలకెత్తవు కదా!"

**శివతత్త్వ జ్ఞానము**

సత్రయాగ పరిసమాప్తి సందర్భంలో ఋషులకు వాయుదేవుడు బోధించిన శివతత్త్వ జ్ఞానాన్ని... సూతమహర్షి మునులకిలా ఉపదేశించ సాగేడు. "మునులారా! అనంత కళ్యాణగుణ సంపన్నుడు, అపారకృపాశీలుడు, విశ్వనిర్మాత, పశుపాశ విమోచనుడు అగు ప్రభువు ఒకడున్నాడు. జీవుడు అజ్ఞాని. పాశము జడము. జ్ఞాన, చైతన్య స్వరూపుడైన ఈశ్వరుడు లేనిచో ఈ సృష్టి కార్యం ఎలా సంభవిస్తుంది? కార్యానికి కర్త ఉండి తీరాలి కదా? పరమాణువులు మొదలుగా జడవస్తువులను జగద్రూపంగా మలిచిన కర్త ఈశ్వరుడే. జీవునియందుగల కర్తృత్వం ఈశ్వర ప్రేరణ వలన మాత్రమే సంభవిస్తున్నది. గ్రుడ్డివాని నడకవలె ఇంద్రియాలు యథార్థ జ్ఞానాన్ని ఇయ్యలేవు. ఆరంభంలో అహంకారంతో "అన్నిటికి కర్తను నేనే!" అని భావించిన జీవుడు; రెండవ దశలో అనేక అనుభవాలను పురస్కరించుకొని తనలో అంతర్గతంగా ఉన్న ఈశ్వర చైతన్యాన్ని గుర్తిస్తాడు. మూడవ దశలో గురూపదేశం వలన ఆ ఈశ్వరుడను నేనే అనే నిశ్చయ జ్ఞానాన్ని పొంది మోక్షార్హుడవుతున్నాడు.

భోక్త (కర్మ ఫలములను అనుభవించే జీవుడు) భోగ్యము (అనుభవింపబడేది – ప్రకృతి) మరియు ప్రేరకుడు (ఈశ్వరుడు) అనే మూడు తత్త్వములు మాత్రమే కలవని మహర్షులు వర్ణిస్తున్నారు. కార్యరూపంలో ఈ మూడు తత్త్వాలు వేరైనా కారణావస్థలో అంతా ఈశ్వర తత్త్వమే అని గ్రహించటమే శివ జ్ఞానతత్త్వం యొక్క పరమార్థం. చేతనాచేతనాత్మకమైన ఈ సృష్టియందు అంతట... నువ్వులలో నూనెవలె, పెరుగులో నేయివలె, అరణియందు అగ్నివలె పరమాత్మ వ్యాపించి అంతర్యామిగా ఉన్నాడు. అణురూపుడైన ఈశ్వరుడు తత్త్వంలో తానొక్కడే అయ్యును, తన ఇచ్ఛ చేతనే జగద్రూపుడై, బహురూపియై ప్రకాశిస్తున్నాడు. తానే కారణమై తానే కర్తయై తానే కార్యమై, అద్వితీయుడై ఈశ్వరుడు సర్వవ్యాపియై ఉన్నాడు. సృష్టి అంతా ఆయన విరాట్ స్వరూపం. సమస్తమైన ధ్వనులు ఆయన భాషయే. ప్రకృతి అంతా ఆయన వేషభూషాదులే. ఆంతర్యంలో ఇలా దర్శించిన జ్ఞానయోగి సచ్చిదానంద స్వరూపుడవుతున్నాడు.

సమస్త ప్రాణుల బుద్ధి గుహలో ప్రేరకుడై ఈశ్వరుడే ఉంటున్నాడు. కాని ఆయనకు ఏదీ అంటదు. ఈశ్వరుని పరాశక్తికి (సృష్టిశక్తికి) అజ (పుట్టుకలేనిది) అని పేరు. ఆ శక్తియే ఈ జగత్తుకు ఉపాదాన కారణం. జీవుడు ఈశ్వరుడు అనే రెండు పక్షులు ఈ సంసారమనే వృక్షాన్ని ఆశ్రయించుకొనే కలిసిమెలిసి జీవిస్తున్నాయి. ఈ రెంటిలోను ఒక పక్షి (జీవుడు) కర్మఫలం అను పండును భక్షిస్తూండగా; రెండవ పక్షి (ఈశ్వరుడు) ఫలాన్ని తినకుండా సాక్షిమాత్రంగా ఉండి చూస్తున్నాడు. జీవుడు దుఃఖిస్తున్నాడు. ఈశ్వరుడు సాక్షిమాత్రంగా ఉన్న కారణంగా చిదానందభాసుడై ఉన్నాడు. వేదం చెప్పిన ఈ ఉపమానంలోని ఉపదేశమేమంటే: జీవుడు కూడా సంసారంలో వచ్చే సుఖదుఃఖాలను సాక్షి మాత్రంగా ఉండి చూస్తూ, ఆపైన సర్వమైన జగత్తును సర్వసాక్షిగా ఉండి నడుపుతూన్న శంకరుని గుర్తించి, పిమ్మట సాక్షియైన తాను మరియు సర్వసాక్షి అయిన శివుడు తత్త్వంలో ఒక్కటే అని గ్రహించటమే... శివతత్త్వ జ్ఞానం. సర్వమూ శివుడే! సందేహం లేదు. శివుడు అంటే అదొక రూపం కాదు. 'శివమ్' అంటే మంగళము, శుభము, కళ్యాణము, ఆనందము, శ్రీ... అని ఇలా అనేక ఆహ్వానింప తగిన, కోరదగిన అర్థాలున్నాయి. కొందరు ఈ ఈశ్వర తత్త్వాన్ని తెలుసుకోలేక జగత్కారణము అణువులని, స్వభావమని, నియతి అని, కాలమని ఇలా అనేక విధాలుగా భ్రాంతిపడుతున్నారు.

**కాల మహిమ**

మునులారా! మీకిప్పుడు వాయువు చెప్పిన కాల మహిమను చెపుతున్నాను. వినండి. పుట్టుట, పెరుగుట, నశించుట... అను మూడు లక్షణాలు గల ఈ జగత్తు సర్వము కాలాధీనమై ఉంది. అట్టి కాలం ఈశ్వరాధీనమై ఉంది. ఇక్కడ అధీనం అనే మాటకు ఈశ్వరుడు కాలాన్ని చేతితోనో, కాలితోనో పట్టి బంధించాడు అనే అర్థం కాదు. ఈశ్వరుని నుండి జగత్తు వ్యక్తమైంది. వెంటనే కాలం పుట్టింది. జగత్కారణమైన ఈశ్వరతత్త్వం అవ్యక్తం. వ్యక్తమే కాని దానిని కాలం ఎలా బాధించగలదు? అందుకని ఈశ్వరుడు కాలాతీతుడు. పుట్టని శిశువుకు వృద్ధి, క్షయాలు ఎక్కడున్నాయి?

ఈశ్వరుని యొక్క సర్వోత్కృష్టమైన తేజస్సులోని అంశమే కాలం. ఆ కాలం... కళ, కాష్ఠ, నిమేషము, రాత్రి, పగలు, పక్షము, మాసము, సంవత్సరము ఇత్యాది అవయవములు కలిగి కల్పాంతం వరకు సాగి ప్రళయ కాలంలో జగత్తు పరమేశ్వరునియందు లీనంకాగా కాలం కూడా ఆయనలో లీనమవుతుంది. కమ్మరివాడు కొలిమి తిత్తిని ఊదేటప్పుడు నిప్పురవ్వలు ఎగసిపడతాయి. తరువాత మాయమవుతాయి. కాలంలో బ్రహ్మాండాది లోకాలు,

జీవులు, తదితరమైన వాటి చావు పుట్టుకలు... విస్ఫులింగాల సామ్యమే! సర్వమూ కాలానికి సంబంధించే ఉంటుంది. త్రిమూర్తులు మొదలుగా ఎవ్వరూ కాలాన్ని అతిక్రమించలేరు. కాల ప్రభావాన్ని సర్వులు ప్రత్యక్షంగా చూస్తూన్నది, అనుభవిస్తూన్నదే కదా! ప్రాణులకు సంయోగ వియోగాలు కాలంలోనే సంభవిస్తాయి. ఎవనికి బంధ-మోక్షములు లేవో, ఎవడు కాలాతీతుడో ఎవడు ప్రకృతిగాని, పురుషుడుగాని, జగత్తుగాని కాడో అట్టి విచిత్రమగు స్వరూపము కలవాడు, మంగళకరుడు, సర్వాతీతుడు అగు పరమేశ్వరుడగు శివునకు నమస్కారం."

**యుగ సంఖ్యా వర్ణనము**

సూతుని పలుకులకు సంతసించిన మునులు నిమేషము మొదలుగా కల్పాంతం వరకు కాలపరిగణనాన్ని చెప్పవలసిందని కోరగా సూతమహర్షి ఇలా చెప్పసాగేరు: "మునులారా! మానవుని ఆయుర్దాయంలో మొట్టమొదటి మానమునకు 'నిమేషము' అని పేరు. కనురెప్పపాటు అనగా రెప్పను మూసి తెరిచేలోపు కాలానికి నిమేషము అని పేరు. పదిహేను నిమేషములు ఒక కాష్ఠ. ముప్పది కాష్ఠలు ఒక కళ. ముప్పది కళలు ఒక ముహూర్తం. ముప్పది ముహూర్తములు ఒక రోజు (రాత్రి+పగలు). ముప్పది రోజులు ఒకనెల. ఒక నెలలో రెండు పక్షములు (కృష్ణ మరియు శుక్ల పక్షములు) ఉన్నాయి. అట్టి నెల పితృదేవతలకు ఒక రోజు. ఆరు నెలలు ఒక అయనం. ఉత్తరాయణ, దక్షిణాయణములు రెండున్నూ కలిసి ఒక సంవత్సరం. ఈ భూలోకంలో మనుష్యమానముచే ఏ కాలము సంవత్సరమో అదే కాలము దేవతలకు ఒక రోజు అవుతుంది. అనగా మన ఉత్తరాయణం దేవతలకు పగలు, దక్షిణాయనం రాత్రి అవుతుంది. అలాటి ముప్పది దివ్య దినములు దేవతలకు ఒక దివ్యమాసం. అట్టి పన్నెండు దివ్యమాసములు దేవతలకు ఒక సంవత్సరం. మనుష్య మాసంచే మూడు వందల అరవై సంవత్సరాలు దేవతలకు ఒక సంవత్సరం అవుతుంది. యుగముల సంఖ్యను దివ్యమానంచే గ్రహించాలి.

యుగములు నాలుగు. అవి వరుసగా కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు. కృతయుగ సంఖ్య నాలుగువేల ఎనిమిది వందల దివ్య సంవత్సరాలు. త్రేతాయుగం మూడువేల ఆరువందలు, ద్వాపరం రెండువేల నాలుగు వందలు, కలియుగం పన్నెండు వందలు (సంధ్య మరియు సంధ్యాంశలతో కలిపి) మొత్తం పన్నెండు వేల దివ్య సంవత్సరాలు. కొందరీ సంఖ్యను మనుష్య సంవత్సరాలుగానే లెక్కిస్తారు. నాలుగు యుగాలకు కలిపి ఒక

చతుర్యుగ మవుతుంది. డెబ్బది యొక్క చతుర్యుగాలు ఒక మన్వంతరం. పదునాలుగు మన్వంతరాలు బ్రహ్మగారికి పగలు. ఈ లెక్కన బ్రహ్మగారి ఆయుర్దాయం వంద సంవత్సరాలు. బ్రహ్మగారి ఒకరోజులో పదునాలుగు మంది ఇంద్రుల ఆయుర్దాయం పూర్తి అవుతుంది.

అట్టి బ్రహ్మగారి ఆయుర్దాయం విష్ణువుకు ఒకరోజు. విష్ణువు ఆయుర్దాయం రుద్రునకు ఒక రోజు. ఆ విధంగా రుద్రుని వంద సంవత్సరాల ఆయుర్దాయం సదాశివునకు ఒకరోజు. సదాశివుని ఆయుర్దాయం ఈశ్వరునకు ఒకరోజు. ఈ విధంగా సర్వము కాలాధీనమే! వాస్తవంగా ఈశ్వరునకు పగలు-రాత్రి భేదం లేకపోయినా ఆయన యొక్క పగలు సృష్టి. రాత్రియే ప్రళయం. చీమ మొదలుగా బ్రహ్మ, విష్ణు, రుద్రాదులు ఈశ్వరుని పగటిభాగంలో మాత్రమే ఉనికిని కలిగి ఉన్నారు. రాత్రి భాగంలో ఆయన యందే లీనమై ఉంటారు. అట్టి పరబ్రహ్మ స్వరూపుడైన శంకరునకు నమస్కారం.

**సృష్టి, స్థితి, లయముల కథనం**

మునులారా! మీకిప్పుడు సృష్టియొక్క ఆవిర్భావాన్ని గురించి చెపుతున్నాను వినండి. ముందుగా పరమేశ్వరునినుండి మాయ పుట్టింది. మాయ ఆయన యొక్క జగన్నిర్మాణ సామర్థ్య శక్తియే. మాయాశక్తినుండి శాంత్యతీత పదము, దానినుండి శాంతి పదము, దానినుండి విద్యాపదము, దానినుండి ప్రతిష్ఠా పదము, దానినుండి నివృత్తి పదము పుట్టినవి. జగత్తు అంతయు ఈ కళలయందే ప్రతిష్ఠితమై ఉంది. ఆరోహణ క్రమంలో ఈ ఐదు కళల తిరోభావమే ప్రళయం. ఈ ఐదుకంటె ఉత్కృష్టుడు ఈశ్వరుడు. ప్రధానం (ప్రకృతి) మొదలుగా పరమాణువుల వరకు సర్వము జడమే. పురుషుడు అజ్ఞాని. కనుక వారికి జగత్కర్తృత్వం పొసగదు. పైగా జగత్తు కార్యం కనుక కర్త ఉండి తీరాలి. భవనం సున్నము, ఇటుకలు, రాయి, కలప ఇత్యాది ఉపాదాన కారణములచే నిర్మాణమవుతున్నా వాటికి స్వయం కర్తృత్వం పొసగదు. కర్త ఒకడు ఉండి తీరాలి. జగత్తుకంటె విలక్షణంగా, అధిష్ఠానంగా ఉంటున్న వాడే ఈశ్వరుడు. అట్టి ఈశ్వరునికి నమస్కారం. ఆ ఈశ్వరుడే తనను తాను మూడు రూపములుగా విభజించుకొని సృష్టి, స్థితి, లయములను మూడు కార్యములను బ్రహ్మ, విష్ణు, రుద్రులను నామధేయములతో జగత్కార్యాన్ని నెరవేరుస్తున్నాడు. వారియందు భేదబుద్ధిని ప్రకటించేవారు నిశ్చయంగా రాక్షసులై జన్మిస్తారు. సృష్టి, ప్రళయములు రెండూ కూడా తాబేలు తన అవయవములను సాచుకొనుట, ముడుచుకొనుట వంటివి.

కొందరు సర్వానికి అధిష్ఠానం ఆకాశమే అని, అన్నిటికి అదే ఆశ్రయభూతమని భావిస్తారు. సత్తామాత్రుడు, సర్వాంతర్యామి అయిన ఈశ్వరునికి ఆకాశంతో పనేముంది? ఆయనకు స్థలం కావాలా? ఆయన నుండే ఆకాశం పుట్టింది! చేతికున్న ఐదు వ్రేళ్ళు ఆకాశంతో కూడా కలిపి పంచభూతములు అని భావిస్తే గుప్పిడి తెరిస్తే సృష్టి... మూస్తే ప్రళయం. పరమాత్మనుండి సృష్టి వ్యక్తంకాకముందు ఆ స్థితి యెట్టిది? అప్పుడు ఈ బ్రహ్మాండాలన్నీ ఏమయ్యాయి? ఆకాశం ఎలా పుట్టింది? ఇలాంటి ప్రశ్నలను బోధపరచు కొనటానికి లోకంలోని మీకొక సాదృశ్యాన్ని చెపుతున్నాను వినండి! ముడుచుకొని ఉన్న తామరమొగ్గ చైతన్యరూపుడైన సూర్యుని యొక్క కిరణాల స్పర్శతో వికసించగానే దానినుండే ఆకాశం (చోటు) పుట్టింది. ఆకాశం పుట్టగానే అంతవరకు దాని గర్భంలో బంధింపబడిన (సూక్ష్మరూపంలో ఉన్న) వాయువుకు చలనం ఏర్పడింది. ఉష్ణ వీర్యమే గుణంగాగల పద్మంలో అగ్నితత్త్వం ఉంది. దానిలోని మకరందమే జలం. దాని గంధగుణమే పృథ్వీతత్త్వం. ఈ విధంగా పద్మం సృష్టి కార్యానికి ప్రతీక అయింది. దేవతలకు ప్రీతి పాత్రమైంది. అందువల్లనే శివ–శక్తుల కొలువుకూటమైన సహస్రారాన్ని సహస్రదళ పద్మంతో పోలుస్తారు.

పద్మం వికసించటానికి సూర్యకిరణ చైతన్యాపేక్ష ఉంది. కాని స్వయంగానే చైతన్య రూపుడైన పరమాత్మ నుండి సృష్టి వికసించటానికి వేరే చైతన్యాపేక్ష లేదు! ఇది సృష్టి ఆవిర్భావ కథనం. ఇదే పరమశివ తత్త్వం.

**వరాహావతార వర్ణనం**

మునులారా! మీకిప్పుడు నడుస్తూన్న కల్పాన్ని గురించి, మన్వంతరాన్ని గురించి చెపుతున్నాను వినండి. బ్రహ్మగారి ఆయుర్దాయంలో మొదటి సగానికి ప్రథమ పరార్ధమనియు, రెండవ సగానికి ద్వితీయ పరార్ధమనియు పేర్లు. ఈ సృష్టికి ఆద్యంతములు లేవు. సృష్టి తర్వాత ప్రళయం. ప్రళయం తర్వాత సృష్టి. పునః ప్రళయం – పునః సృష్టి. ఎప్పటికీ తిరగటం ఆగని కాలచక్ర పరిభ్రమణం ఇది. ఇందులో ఎన్నో కల్పాలు, మన్వంతరాలు సాగిపోతూ ఉంటాయి. ప్రస్తుతం ప్రవర్తిస్తూన్న కల్పానికి వారాహ కల్పమని పేరు. ఇందులో కూడా స్వాయంభువ మనువుతో మొదలయ్యే పదునాలుగు మనువులూ ఉంటారు. ప్రస్తుతం వైవస్వత మన్వంతరం నడుస్తూన్నది. మన్వంతరము లన్నిటిలోను సృష్టి సంహార కార్యములు సమానంగానే ఉంటాయి.

గతించిన కల్పమందు ప్రళయం సంభవించగా భూమండలం యావత్తూ అనంతమైన జలరాశిలో మునిగి ఉంది. దానిమీద నారాయణుడు యోగనిద్రలో శయనించి ఉన్నాడు.

నారాయణునకు శయనీయమైన స్థానం కనుక వాటికి నారములు అనిపేరు. నారాయణుని నుండి పుట్టినవి కనుక జలములకు నారములు అనిపేరు. అప్పుడు జనలోకంలో నివసించే నిత్యసిద్ధులు మరియు దేవతలు చేతులు జోడించి నారాయణుని ప్రార్థించగా శివయోగ స్వరూపుడైన ఆ దేవదేవుడు మేల్కొని "పూజ్యురాలైన నా భూదేవి యెక్కడ?" అని దిక్కులను పరికించగా ఆమెస్థితి కానరాలేదు. చింతాక్రాంతుడై తన తండ్రి ఐన శివుని స్మరించగా సలిలమగ్నయైన భూమి కానవచ్చింది, కర్తవ్యం కూడా స్ఫురించింది. వెంటనే నారాయణుడు దివ్యమైన వరాహ రూపాన్ని ధరించి పాతాళంలోనికి ప్రవేశించి తన పంటి కోరలతో ధరామండలాన్ని పైకెత్తి యథాస్థానంలో నిలిపాడు. ఇది వరాహకల్ప సృష్టి కథనం.

### బ్రహ్మసృష్టి కథనం

ఆ నారాయణుడైన విష్ణువే తన విరాట్ స్వరూపంనుండి బ్రహ్మను సృజించి సృష్టిని చెయ్యవలసిందని ఆజ్ఞాపించగా, పితామహుడు అందుకు ఉపక్రమించి ధ్యానమగ్నుడయ్యాడు. ఆ ధ్యానంలో ఆయనకు తమోమోహము (చీకటి), మహా మోహం, తామిస్రము (దట్టమైన చీకటి), అంధము (గ్రుడ్డితనం) మరియు అవిద్య (అజ్ఞానం) అను ఐదు స్థితులు కలిగాయి. "నేను కర్తను" అనే అభిమానంతో ధ్యానం చేస్తూన్న విధాతకు ఐదు విధాలైన సృష్టి గోచరించింది. ఆ సృష్టిని ఆయన అలాగే నెరవేర్చాడు. సృష్టికార్యం అంతా ఒకటే అయినా అవాంతర భేదంచే వాటిలో అయిదు భేదాలు కలిగాయి. ధ్యాన సమయంలో సర్వమైన సృష్టి బ్రహ్మగారి అతిశయాహంకారాలతో కూడిన బుద్ధియందు... కుండలో పెట్టిన విత్తనాలవలె చీకట్లో ఉన్నాయి. ఆయనకు లోపల బయట చీకట్లు వ్యాపించి, కదలిక మరియు జ్ఞానంలేని స్థితిలో ఆయన ఉండిపోయాడు. ఇట్టి తమోగుణ అవస్థలో బుద్ధి, ముఖములు మరియు ఇంద్రియములు కప్పివేయబడిన పర్వతములు, చెట్లు ఉద్భవించాయి.

ప్రథమ సృష్టి ఈ విధంగా ప్రయోజనకారి కాకపోయేసరికి విధాత వ్యాకులచిత్తుడై రెండవసారి ధ్యానం చేశాడు. ఆ సృష్టిలో పశుపక్ష్యాదులు ప్రకటమయ్యాయి. వాటిలో అంతర్గతంగా జ్ఞానం ఉన్నా బాహ్యమునందు కప్పివేయబడి సన్మార్గాచరణ సామర్థ్యం లేని కారణంగా ఆ సృష్టికూడా ప్రయోజనకారి కాలేదు. తిరిగి సృష్టిని గురించి ధ్యానించగా సత్త్వగుణ ప్రధానమైన దేవతా సృష్టి జరిగింది. దేవతల యందు సుఖము, ప్రీతి అధికం. వారికి అజ్ఞానావరణ లేదు. ప్రకాశ స్వరూపులు. ఈ దేవతా సృష్టికి ఊర్ధ్వస్రోతస్సు (ఊర్ధ్వదిశలో ప్రవాహం) అనిపేరు. ఆ సృష్టికూడా వర్థ్యమైంది అని తలపోసి బ్రహ్మగారు ధ్యానం చేయగా

అర్వాక్ స్రోతస్సు (క్రిందికి ప్రవాహం) అనబడే ప్రయోజనకరమైన మనుష్యులు అనబడే ప్రాణుల సృష్టి పుట్టింది. ఈ సృష్టికే అనుగ్రహ సర్గము అనిపేరు. రజస్తమోగుణాధిక్యతగల ఈ మనుష్యులు బహిరంతః ప్రకాశ రూపులు. ఈ మనుష్య సృష్టి విపర్యయము (ఆహారం పైనుండి క్రిందకు ప్రవహించుట), శక్తి, తుష్టి, సిద్ధి అను నాలుగు రూపాలలో చక్కని వ్యవస్థను కలిగి ఉంది. ఈ మానవులందరు కర్మబద్ధులై ఉన్నకారణంగా... ఉదర పోషణార్థమై వివిధ వృత్తులను నెరవేరుస్తున్నా తద్వారా లోక కళ్యాణం కొరకే శ్రమిస్తున్నారు. అంతేకాదు తమ సంపదను నలుగురికి పంచుటయందు ఆసక్తి పరులు. అనగా సంవిభాగ రతులు. ఇందులో కొందరు శీలరహితులై కేవల తిండిపోతులై పశుప్రాయులై సంచరించినా... ప్రాణులలోకెల్ల మానవులు అగ్రేసరులు!

బ్రహ్మయొక్క సృష్టిలో మొదటిది మహత్తత్త్వం. దానినుండి సూక్ష్మ పంచభూతముల సృష్టి. ఇది రెండవది. దానికే భూతసర్గము అనిపేరు. మూడవది వైకారిక సృష్టి. అహంకారము యొక్క ఈ సృష్టికే ఐంద్రియక సర్గము అని పేరు. ఇంతవరకు జరిగిన సృష్టి బుద్ధితో సంపర్కం లేకుండా కేవలం ప్రకృతినుండి జరిగిన సృష్టి. నాల్గవది ముఖ్యసర్గం. ముఖ్యములనగా చెట్టుచేమలు. పశుపక్ష్యాదుల సృష్టి ఐదవది. ఆరవసృష్టి దేవతలు. ఏడవసృష్టి మనుష్యులు. ఎనిమిదవది అనుగ్రహ సర్గం. తొమ్మిదవది కౌమార సర్గం.

ప్రజాపతియగు బ్రహ్మ మొట్టమొదట తనతో సమానమైన మానసపుత్రులను సనకుడు, సనందుడు, సనాతనుడు, సనత్కుమారుడు, ఋభుడు అనువారిని సృజించగా వారు విరాగులై సృష్టియందు శ్రద్ధలేనివారై తపస్సులో మునిగి పోయారు. తన సృష్టి వ్యర్థమైపోయిందే అనే విచారంతో తపస్సుకు ఉపక్రమించిన బ్రహ్మగారికి ఎంతకాలం గడిచినా ప్రయోజనం కలుగలేదు. ఇలా చాలా కాలం గడవగా ఆయనకు దుఃఖం కలిగింది. దుఃఖం నుండి కోపం పుట్టింది. కోపావేశంలో బ్రహ్మగారి కన్నులనుండి అశ్రువులు జారి నేలపై పడగా వాటినుండి భూత, ప్రేతములు పుట్టాయి. వాటిని చూచి విధాత తనను తాను నిందించుకొన్నాడు. ఆయన తీవ్రమైన నిర్వేదాన్ని పొంది మూర్ఛాగతుడై ప్రాణాలను వదిలాడు. వెంటనే బ్రహ్మగారి ముఖం నుండి ప్రాణములకు ప్రభువైన రుద్రుడు ఆవిర్భవించి తనను తాను పదకొండు రూపాలుగా విభాగించుకొని వారితో ఇలా అన్నాడు. "ఓ కుమారులారా! లోకానుగ్రహం కారణంగా నేను మిమ్ములను సృష్టించాను. మీరు సోమరితనం లేనివారై లోకస్థితి, హితముల కొరకు కృషి చెయ్యండి." అంత వారు పరుగులు తీస్తూ

ఏడ్చేరు. ఆ కారణంగా వారికి రుద్రులనే నామధేయం ఏర్పడింది. సకల ప్రాణులలోని ప్రాణులువారే!

బ్రహ్మముఖావిర్భూతుడైన రుద్రుడు దయాంతరంగుడై బ్రహ్మను పునరుజ్జీవింప చేసి, ప్రాణరూపులైన ఏకాదశ రుద్రుల సహకారంతో పునః సృష్టి కార్యాన్ని కొనసాగించవలసిందిగా అనుగ్రహించాడు. కలనుగన్న వానివలె లేచిన బ్రహ్మ ఆనందంతో పరమేశ్వరుని ఇలా ఎనిమిది నామాలతో స్తుతించాడు.

**శ్లో॥ నమస్తే భగవన్ రుద్ర – భాస్కరా మిత తేజసే ।**
**నమో భవాయ దేవాయ – రసాయాంబుమయాత్మనే ॥**
**శర్వాయ క్షితిరూపాయ – నందీ సురభియే నమః ।**
**ఈశాయ వసవే తుభ్యం – నమస్స్పర్శమయాత్మనే ॥**
**పశూనాం పతయే చైవ – పావకాయాతి తేజసే ।**
**భీమాయ వ్యోమ రూపాయ – శబ్దమాత్రాయ తే నమః ॥**
**ఉగ్రాయోగ్ర స్వరూపాయ – యజమానాత్మనే నమః ।**
**మహాదేవాయ సోమాయ – నమోఽస్త్వమృత మూర్తయే ॥**

**తా॥** హే భగవన్! అమిత తేజస్సుడైన సూర్యుని రూపంలో ఉన్న నీకు నమస్కారం. సత్తా (ఉనికి) స్వరూపుడు, జల రూపంలో ఉన్న రసస్వరూపుడు అగు నీకు నమస్కారం. సంహార కాలంలో హింసకుడు, భూమి రూపంలో ఉన్నవాడు అగు రుద్రునకు, నందీశ్వరునకు, కామధేనువునకు నమస్కారం. వసు రూపంలో ఉన్నవాడవు, స్పర్శ రూపంలో ఉన్న వాడవు ఈశ్వరుడవు అగు నీకు నమస్కారం. జీవులకు ప్రభువు, అగ్ని స్వరూపుడు, భయంకరుడు, ఆకాశ రూపుడు, శబ్దతన్మాత్ర స్వరూపుడు అగు నీకు నమస్కారం. సంహార కాలంలో భయంకర రూపాన్ని ధరించే ఉగ్రుడు, సోమయాజి రూపంలో ఉన్నవాడు, శక్తితో కూడియున్నవాడు, అమృత స్వరూపుడు అగునీకు నమస్కారం.

మునులారా! 'నామాష్టకము' అని పిలువబడే ఈ ఈశ్వరస్తుతి బ్రహ్మచే కూర్చబడినది. మహామహిమోపేతమైనది. ఇది మృత్యుభయాన్ని పోగొడుతుంది. ఈ విధంగా స్తుతించి సృష్టికార్యంలో సహకరించమని ప్రార్థించగా "తథాస్తు" అని పలికి అంతర్హితుడయ్యాడు పరమేశ్వరుడు. పిమ్మట పితామహుడు హృష్టుడై సృష్టి కార్యానికి సంకల్పించి ముందుగా మరీచి, భృగువు, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, దక్షుడు, అత్రి, వసిష్ఠుడు,

ధర్ముడు, సంకల్పుడు అనువారిని సృజించాడు. ఈ విధంగా బ్రహ్మకు రుద్రునితో కలిపి సనాతనులు, గృహస్థులు అయిన పన్నెండు మంది పుత్రులు కలిగారు. వారు... దేవ గణములతో కూడినవి, సంతానము గలవి, వైదిక కర్మలు గలవి, మహర్షులచే అలంకృతమైనవి అగు పన్నెండు దివ్యవంశములకు మూలపురుషులయ్యారు. ఆ తరువాత రుద్ర సహాయంతో బ్రహ్మ తన మనస్సును ఏకాగ్రం చేసి తన దేహాన్ని వినియోగించి ముఖంనుండి దేవతలను, పార్శ్వములనుండి పితరులను, పొత్తికడుపు నుండి అసురులను, జననేంద్రియం నుండి మనుష్యులను సృష్టించాడు. విసర్జనేంద్రియం నుండి ఆకలితో అలమటించే రాక్షసులు జన్మించారు. రజస్తమో గుణములు ప్రధానంగాగల నాగులు, యక్షులు, భూతములు మరియు గంధర్వులు ఆయనకు పుత్రులై జన్మించారు.

మునులారా! స్వయంభువు అయిన పరమేష్ఠికి ప్రత్యేక అవయవములు అంటూ ఏమీ లేవు! ఆయన విశ్వరూపుడు. విరాట్టు! అయినా ఉపమా సాదృశ్యంగా సృష్టి క్రమాన్ని చెపుతున్నాను వినండి. ఆయన ప్రక్కల నుండి కాకులను, వక్షస్థలంనుండి పక్షులను, ముఖంనుండి మేకలను, పార్శ్వములనుండి పాములను సృష్టించాడు. పాదములనుండి గుర్రములను, ఏనుగులను, శరభ మృగములను, గవయ మృగములను, లేళ్ళను, ఒంటెలను, గాడిదలను, దుప్పులను ఇతర జాతులను సృష్టించాడు. పంట మొక్కలు, పళ్ళు, దుంపలు ఆయన రోమములనుండి పుట్టాయి. ఆయన తన తూర్పు ముఖంనుండి గాయత్రీ ఛందస్సును, ఋగ్వేదాన్ని, త్రివృత్ మరియు రథంతర సామలను, యజ్ఞములలో ప్రముఖమైన అగ్నిష్టోమమును నిర్మించాడు. దక్షిణ ముఖంనుండి యజుర్వేదాన్ని త్రిష్టుప్ ఛందస్సును, పంచదశస్తోమమును (స్తోత్రరూపమైన మంత్ర సముదాయం) బృహత్ సామను మరియు ఉక్థ్య అనే సోమ యజ్ఞాన్ని నిర్మించాడు. పశ్చిమముఖం నుండి వైరూప్యాది సామలను, జగతీ ఛందస్సును, సప్తదశ స్తోమాన్ని మరియు అతిరాత్రమనే సోమ యజ్ఞాన్ని నిర్మించాడు. ఉత్తర ముఖంనుండి ఏకవింశ స్తోమాన్ని, అథర్వవేదాన్ని, అనుష్టుప్ ఛందస్సును, వైరాజమనే సామను, మరియు ఆప్తోర్యామమనే సోమ యాగాన్ని సృష్టించాడు.

స్థావర జంగమాత్మకమైన జగత్తు మరియు సకల ప్రాణులు గత సృష్టిలో చేసిన కర్మలను అనుసరించి తిరిగి వాటికి అనురూపమైన జన్మలను పొందుతూ ఆ హిరణ్యగర్భుని నుండే ఉద్భవించాయి. పూర్వజన్మ సంస్కారములను అనుసరించియే జీవులకు ఆయా కర్మలయందు ఇచ్ఛ పుడుతూ ఉంటుంది. దేవతలు, ఋషులు మొదలుగా నామరూపాత్మకమైన

ఈ సకల ప్రపంచాన్ని వేదం ఆధారంగానే విధాత సృష్టించాడు. ఈ యావత్తు సృష్టి ఒక మహా వృక్షం వంటిది. దానికి బుద్ధియే స్కంధం (మ్రాను) మరియు కొమ్మలు. ఇంద్రియములే తొర్రలు. మహా భూతములే ప్రమాణం (నిడివి). పరమాణవులే చిగుళ్ళు. ధర్మ-అధర్మములే పువ్వులు. సుఖ, దుఃఖములే దాని ఫలములు. ప్రవాహ రూపంలో నిత్యమైనది అగు బ్రహ్మ అనే వృక్షమును ఆశ్రయించియే ఈ జగత్తు నిలిచి ఉంది. ఆ హిరణ్యగర్భునకు స్వర్లోకమే శిరస్సు. ఆకాశం నాభి. సూర్యచంద్రులు నేత్రములు. దిక్కులు చెవులు. పాదములు భూమి. ఆయన ముఖం నుండి బ్రాహ్మణులు, వక్షఃస్థలంనుండి క్షత్రియులు, ఊరువుల నుండి వైశ్యులు, పాదములనుండి శూద్రులు... ఇలా అందరూ గుణ, కర్మలను అనుసరించి ఆ విరాట్పురుషుని దేహంనుండే ఉద్భవించారు.

మునులారా! మీకొక రహస్యమైన దానిని చెపుతున్నాను. వినండి. ఒకే పరమేశ్వర తత్త్వంనుండి ప్రకటమైన బ్రహ్మ-విష్ణు-రుద్రులు ముగ్గురు. సర్వోత్కృష్టులై సృష్టి, స్థితి, లయములను నిర్వహిస్తూ ఉంటారు. కాని కల్ప భేదాన్ననుసరించి వారిమధ్య తండ్రి-కొడుకుల సంబంధాలు తారుమారవుతూ ఉంటాయి. ఒక కల్పంలో విష్ణువునుండి బ్రహ్మ, బ్రహ్మనుండి రుద్రుడు ప్రకటం కాగా మరొక కల్పంలో రుద్రుని నుండి బ్రహ్మ, విష్ణువులు, ఇంకొక కల్పంలో బ్రహ్మ నుండి రుద్ర విష్ణువులు ప్రకటమయ్యారు. రుద్రుని సహకారం లేనిదే ఈ సృష్టి కొనసాగదు.

ఒక కల్పంలో జరిగిన గాథను చెపుతున్నాను. బ్రహ్మ సృష్టిని చేయమని రుద్రుని ప్రార్థింపగా సంకల్ప మాత్రంచే ముమ్మూర్తుల తనను పోలియున్న అనేకమంది రుద్రులను మరణం లేని వారిని సృష్టించాడు... రుద్రుడు. జగత్తంతా వారిచే నిండిపోయింది. దానికి బ్రహ్మ విస్మితుడై అసంతృప్తిని చెంది ఇట్టి సృష్టి వద్దు. దీనికంటె భిన్నంగా మరణించే స్వభావం కలవారిని మనుష్యులను సృష్టించమని ప్రార్థించాడు. దానికి రుద్రుడిలా అన్నాడు "నా వద్ద అట్టి సృష్టి లేదు. మరణించే సంతానాన్ని నీవే సృష్టించు. ఈ రుద్రులు నాతోనే ఉంటారు. వీరు యజ్ఞభాగార్హులు." - అని పలికి సమాధి గతుడయ్యాడు. నాటినుండి మరణం లేని ప్రజాసృష్టి ఆగిపోయింది.

వెంటనే బ్రహ్మ సృష్టి కార్యానికి ఉపక్రమించినా, ఆ సృష్టి వృద్ధి చెందని కారణంగా స్త్రీ-పురుష సంబంధమైన మైథున క్రియతో కూడిన సృష్టిని చేయ సంకల్పించాడు. కాని

అప్పటికి స్త్రీ అనేదే లేని హేతువుచే పరమేశ్వర సాహాయ్యాన్ని అపేక్షించి తపస్సును ప్రారంభించాడు. ఆయన తపస్సుకు సంతసించి పరమేశ్వరుడు స్వయంగా అర్ధనారీశ్వరుడై సాక్షాత్కరించాడు. ఎప్పుడూ చూడని, ఎన్నడూ ఎరుగని, ఊహకైనా అందని ఆ జగన్మోహన రూపాన్ని చూచి మోకాళ్ళపై వంగి చేతులు మొగిడ్చి ఇలా స్తుతించాడు బ్రహ్మ.

**శ్లో॥ జయ దేవ మహాదేవ – జయేశ్వర మహేశ్వర ।**
**జయ సర్వగుణశ్రేష్ఠ – జయ సర్వ సురాధిప ।**
**జయ ప్రకృతి కల్యాణి – జయ ప్రకృతి నాయికే ।**
**జయ ప్రకృతిదూరే త్వం – జయ ప్రకృతి సుందరి ।**
**జయా మోఘ మహామాయ – జయామోఘ మనోరథ ।**
**జయా మోఘ మహాలీల – జయామోఘ మహాబల ।**
**జయ విశ్వజగన్మాత – ర్జయ విశ్వజగన్మయే ।**
**జయ విశ్వజగద్ధాత్రి – జయ విశ్వజగత్సఖి ।**
**జయ శాశ్వతికైశ్వర్యే – జయ శాశ్వతికాలయ ।**
**జయ శాశ్వతికాకార – జయ శాశ్వతికానుగ ।**
**జయాత్మత్రయ నిర్మాత్రి – జయాత్మత్రయ పాలిని ।**
**జయాత్మత్రయ సంహర్త్రి – జయాత్మత్రయ నాయికే ।**
**జయావలోకనాయత్త – జగత్కారణ బృంహణ ।**
**జయోపేక్షా కటాక్షోత్థ – హుతభుగ్భుక్త భౌతికః ।**
**జయ దేవాద్యవిజ్ఞేయే – స్వాత్మసూక్ష్మదృశోజ్జ్వలే ।**
**జయ స్థూలాత్మశక్త్యేశే – జయ వ్యాప్త చరాచరే ।**
**జయ నానైక విన్యస్త – విశ్వతత్త్వ సముచ్చయ ।**
**జయాసుర శిరోనిష్ఠ – శ్రేష్ఠానుగ కదంబక ।**
**జయోపాశ్రిత సంరక్షా – సంవిధాన పటీయసి ।**
**జయోన్మూలిత సంసార – విషవృక్షాంకురోద్గమే ।**
**జయ ప్రాదేశికైశ్వర్య – వీర్యశౌర్య విజృంభణ ।**
**జయ విశ్వబహిర్భూత – నిరస్త పరవైభవ ।**
**జయ ప్రణీత పంచార్థ – ప్రయోగ పరమామృత ।**

**జయ పంచార్థ విజ్ఞాన – సుధాస్తోత్ర స్వరూపిణీ ।**
**జయాతి ఘోర సంసార – మహారోగ భిషగ్వర ।**
**జయానాదిమలాజ్ఞాన – తమః పటల చంద్రికే ।**
**జయ త్రిపుర కాలాగ్నే – జయ త్రిపుర భైరవి ।**
**జయ త్రిపుర నిర్ముక్తే – జయ త్రిగుణ మర్దిని ।**
**జయ ప్రథమ సర్వజ్ఞ – జయ సర్వ ప్రబోధికే ।**
**జయ ప్రచుర దివ్యాంగ – జయ ప్రార్థిత దాయిని ।**
**క్వ దేవ తే పరంధామ – క్వ చ తుచ్ఛం చ నో వచః ।**
**తథాపి భగవన్ భక్త్యా – ప్రలపంతం క్షమస్వ మామ్ ।**

**తా॥** ఓ దేవా! మహాదేవా! నీకు జయమగు గాక! ఓ ఈశ్వరా! మహేశ్వరా! నీకు జయమగు గాక! సకల గుణాభిరామా! నీకు జయమగు గాక! సకల దేవతాధిరాజా! నీకు జయమగు గాక! స్వభావము చేతనే మంగళములను చేయు ఓ ప్రకృతి నాయికా నీకు జయమగు గాక! ప్రకృతికి అతీతమైన ఓ సహజ సౌందర్య నిధానమా! నీకు జయమగు గాక! అమోఘమైన మహామాయ గలవాడా! నీకు జయమగు గాక! అమోఘమైన మనోరథములు గలవాడా! నీకు జయమగు గాక! అమోఘమైన గొప్ప లీలలు గలవాడా! నీకు జయమగు గాక! అమోఘమైన గొప్ప బలము గలవాడా! నీకు జయమగు గాక! ఓ సకల జగన్మాతా! నీకు జయమగు గాక! సకల జగత్స్వరూపిణీ! నీకు జయమగు గాక! సకల జగత్తును పెంచి పోషించు తల్లీ! నీకు జయమగు గాక! సకల ప్రాణుల హితమును కోరు ఓ తల్లీ! నీకు జయమగు గాక! శాశ్వతైశ్వర్యముగల ఓ శివా! నీకు జయమగు గాక! ఓ మోక్ష నిధానమా! నీకు జయమగు గాక! ఓ శాశ్వతమైన రూపము గలవాడా! నీకు జయమగు గాక! శాశ్వతులైన అనుచరులు కల ఓ శివా! నీకు జయమగు గాక! మూడు ఆత్మలను నిర్మించు దానా! నీకు జయమగు గాక! మూడు ఆత్మలను (ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ) పాలించుదానా! నీకు జయమగు గాక! మూడు ఆత్మలను సంహరించుదానా! నీకు జయమగు గాక! మూడు ఆత్మల నాయికీ! నీకు జయమగు గాక! ఓ శివా! జగత్కారణమగు ప్రకృతి జగద్రూపముగా ప్రకటమగుట నీకంటి చూపుపై ఆధారపడి ఉంది. నీకు జయమగు గాక! నీ నిరసనదృష్టి నుండి పుట్టిన అగ్ని జగత్తును భక్షిస్తుంది. నీకు జయమగు గాక!

దేవతలు మొదలగు వారిచే తెలియబడజాలని స్వరూపముగల ఓ తల్లీ! నీకు జయమగు గాక! సూక్ష్మదృష్టిచే దర్శించబడే ప్రత్యగాత్మయందు చైతన్యరూపంగా ప్రకాశించే ఓ తల్లీ! స్థూలరూపంగా ప్రకటమైన ఆత్మశక్తిని నియంత్రించుదానా! నీకు జయమగు గాక! చరాచర జగత్తును వ్యాపించియున్న ఓ తల్లీ! నీకు జయమగు గాక! ఓ శివా! జగత్తులోని తత్త్వములన్నీ కలిసి నీయందు విలీనమవుతూన్నవి. నీకు జయమగు గాక! ఓ తండ్రీ! సర్వశ్రేష్ఠమగు నీ అనుచర బృందం రాక్షసుల శిరస్సులపై తాండవం ఆడుతున్నారు. నీకు జయమగు గాక! ఆశ్రయించిన వారిని రక్షించే సంవిధానమందు సమర్థురాలైన ఓ తల్లీ! నీకు జయమగు గాక! సంసారమనే విషవృక్షాన్ని వ్రేళ్ళతో సహా పెకలించివేసే ఓ తల్లీ! నీకు జయమగు గాక! హృదయాకాశము అనే స్థానములో ఉపలభ్యమయ్యే ఓ శివా! నీవు ఐశ్వర్యంతో, శక్తితో మరియు పరాక్రమంతో అతిశయించి ప్రకాశిస్తున్నావు! నీకు జయమగు గాక! జగత్తుతో సంపర్కం లేని ఓ శివా! శత్రువుల వైభవాన్ని నాశనంచేసేవాడా! నీకు జయమగు గాక!

ఐదు విధాలైన మోక్షము అను పురుషార్థాన్ని అందజేసి పరమానంద రూపమైన అమృతత్త్వాన్ని అందజేయువాడా! నీకు జయమగు గాక! పంచార్థ విజ్ఞానము అనే అమృతం వంటి స్తోత్రము స్వరూపంగాగల ఓ తల్లీ! నీకు జయమగు గాక! మిక్కిలి భయంకరమైన సంసారమనే రోగాన్ని నయం చేసే శ్రేష్ఠవైద్యా! నీకు జయమగు గాక! అనాదిదోషమగు అజ్ఞానమనే చీకటి గుంపులను పారద్రోలే వెన్నెలవంటి ఓ తల్లీ! నీకు జయమగు గాక! త్రిపురములకు ప్రళయ కాలాగ్నివంటివాడా! నీకు జయమగు గాక! స్థూల, సూక్ష్మ, కారణ దేహములను మూడు విధాలైన బంధాలను నశింపజేయు ఓ తల్లీ! నీకు జయమగు గాక! ప్రథమజీవుడగు హిరణ్యగర్భుని రూపంలో ఉన్నవాడా! నీకు జయమగు గాక! సర్వులకు జ్ఞానమునిచ్చు ఓ తల్లీ! నీకు జయమగు గాక! కోరిన కోరికలను తీర్చే తల్లీ! నీకు జయమగు గాక! ఓ దేవా! నీ సర్వశ్రేష్ఠమైన ధామము ఎక్కడ? తుచ్ఛమైన మా వాక్కులు ఎక్కడ? ఓ భగవాన్! అయినప్పటికి భక్తి పారవశ్యంలో చేసిన నా ప్రలాపమును క్షమించి నన్ను మన్నించు!

మునులారా! బ్రహ్మ చేసిన ఈ స్తోత్రానికి 'అర్ధనారీశ్వర స్తోత్రము' అని పేరు. శివ–శక్తులను (అమ్మను–అయ్యను) కలిపి స్తుతించిన స్తోత్రరాజం... ఇది. దీనికిదే సాటి. దీనిని నిత్యము పఠించిన వారికి భుక్తి–ముక్తులు రెండూ లభిస్తాయి.

బ్రహ్మగారి స్తోత్రానికి ప్రసన్నుడైన పరమేశ్వరుడు ఆయన ఆంతర్యాన్ని ఎరిగి తన శరీరాన్ని రెండుగా విభాగించి వామభాగంనుండి దేవిని సృజించాడు. ఆమె భవుని శరీరంనుండి ఆవిర్భవించిన కారణంగా 'భవాని' అయింది. మాతృరూపంలో సమస్తమైన విశ్వాన్ని కని, పెంచి, పోషించే ఆది పరాశక్తి ఆవిడయే! ఆ శక్తియే బ్రహ్మగారి ప్రార్థనను అంగీకరించి దక్ష ప్రజాపతికి సతీ నామధేయంతో పుత్రికయై ఈశ్వరునకు ఇల్లాలయింది.

**జగత్తు అగ్నీషోమాత్మకం దాని వివరణ**

సూతుడింత వరకు సుధామధురంగా చెప్పిన శివ గాథలను, తత్త్వాన్ని వినిన ఋషులు "సూతా! ఈ జగత్తంతా అగ్నీషోమాత్మకం అంటారు కదా! దాని తత్త్వాన్ని మాకు అర్థమయ్యే రీతిలో వివరించ వలసింది!" – అని కోరగా సూత మహర్షి ఇలా చెప్పసాగేరు.

"మునులారా! ఒకప్పుడు పరమేశ్వరుడు పార్వతికి ఈ విషయాన్నే బోధించాడు. దానిని మీకు ఉపదేశిస్తున్నాను. ఈ తత్త్వాన్ని అర్థంచేసికొని ఆరాధించిన వాని హృదయంలో శివపార్వతులు కొలువై ఉంటారు. శివుని తేజోమయ రూపానికి అగ్ని అనిపేరు. శాంతిరూపిణి, అమృత స్వరూపిణి అయిన శక్తి యొక్క రస రూపానికి సోముడు అనిపేరు. ఈ కారణంగా శివ శక్తులనుండి ఉద్భవించిన జగత్తు అగ్నీషోమాత్మకం అయింది. విద్యాకళ స్వయంగా తేజస్సు. ప్రతిష్ఠాకళయే అమృతం. సర్వ భూతముల యందు తేజస్సు మరియు రసము (సోముడు) ఈ రెండూ ఉన్నాయి. తేజస్సు అనే విద్యాకళ సూర్యుడు మరియు అగ్ని ఈ రెండు రూపాలలోను ప్రకటమవుతూ ఉంది. సోమ సంబంధమైన ప్రతిష్ఠాకళ (రసము) చంద్రుడు మరియు నీరు ఈ రెండు రూపాలలోను ప్రకటమవుతూ ఉంది. తేజస్సు అనేది భూమిమీద అగ్ని రూపంలోను, ఆకాశంలో మెరుపు రూపంలోను ఉంటుంది. ఆకాశంలో సూర్య మరియు నక్షత్రాది గోళాలలో ప్రకటమయ్యే తేజస్సే భూమిమీద అగ్ని రూపంలో దృగ్గోచరమవుతూన్నది. అదే శివ తేజస్సు. ఈ కారణంగానే వేదం ప్రప్రథమంగా "అగ్నిమీళే పురోహితం" అనే ప్రథమ మంత్రంతో శివుణ్ణే కీర్తించింది. ఇకపోతే రసము అనేది తీపి, పులుపు ఇత్యాది ఆస్వాద యోగ్యమైన రుచుల రూపంలో ఉంటుంది.

అగ్నినుండి అమృతము, అమృతంనుండి అగ్ని పుట్టి వర్ధిల్లుతాయి. అగ్ని సంపర్కంచే పచనం కాబడిన ఆహారం ఖాదన యోగ్యమై అమృత రూపాన్ని పొందుతూన్నది. పంటలు బాగా పండితే హవిస్సు (ఆహారం) పుష్కలంగా లభిస్తుంది. వర్షం (రసము) వలన పంటలు

బాగా పండుతాయి. అనగా వర్షం వల్లనే హవిస్సు (ఆహారం) పుట్టుతూన్నది. ఈ విధంగా జగత్తును అగ్ని మరియు సోముడు మాత్రమే ధరిస్తూ ఉన్నారని వేదం పదే పదే కీర్తించింది. అగ్నీ-షోమాత్మకమైన తేజస్సు మరియు రసములే లోకంలో భిన్న రూపాలలో గోచరిస్తున్నాయి. సోముని యొక్క సర్వోత్కృష్టమైన అమృతస్థానం వరకు భూమిమీది అగ్ని ఊర్ధ్వదిశగా ప్రజ్వరిల్లుతుంది. సోముని యొక్క అమృతం, అగ్నికి ఆధారమైన భూమి మీదికి క్రిందికి దిగుతుంది. అగ్నియొక్క గతి పైకి, జలం యొక్క గతి క్రిందికి ఉంటుంది. ఈ కారణంగానే కాలాగ్ని క్రింద ఉంటుంది. శక్తిపైన ఉంటుంది. ఈ మర్యాదను అనుసరించియే పురాణాలలో సూర్యునికి పైన చంద్రుడు (సోముడు) ఉన్నాడని చెప్పటం జరిగింది.

యోగంలో... ఊర్ధ్వగతిగల కాలాగ్నిని (కుండలిని) మూలాధారంలోగల శక్తి ధరించి ఉంది. అదే విధంగా శివశక్తి స్థానమైన సహస్రారం నుండి సోముని అమృత కిరణములు క్రిందకు ప్రవహిస్తాయి. ఇలా శివ-శక్తులు పరస్పరం క్రింద, పైన మరియు పైన క్రింద కూడ ఉంటున్నారు.

జగత్తులో అగ్నిచే అధికంగా దహింపబడిన వస్తువు భస్మమవుతుంది. అగ్నిదగ్ధంకాగా శేషమే భస్మ. భస్మ అగ్ని యొక్క శక్తి కనుక దానికి అగ్నివీర్యము అనిపేరు. అట్టి భస్మను; అమృతమయుడు, రసాధిపతి అయిన సోముని వెన్నెలచే తడుపబడిన దానిని 'అగ్నిరితి భస్మ' ఇత్యాది మంత్రములను పఠిస్తూ ఎవడైతే దేహమంతా ధరిస్తాడో వాడు తప్పక ప్రకృతి శక్తులమీద అధికారాన్ని పొందుతాడు. శివ-శక్తుల అమృతమయమైన స్పర్శను పొందిన వానికి మృత్యువు ఎక్కడుంది? మునులారా! ఈ విధంగా అగ్నీషోమాత్మకమైన జగత్తంతయు శివ శక్త్యాత్మకమే. ఈ తత్త్వాన్ని తెలుసుకొన్న పురుషుడు తప్పక శివ సాయుజ్యాన్ని పొందుతాడు. వానికి పునర్జన్మ లేదు.

**వాగర్థ స్వరూపమైన జగత్తు శివ-శక్తుల సమ్మేళనమే**

మునులారా! శివ-శక్త్యాత్మకమైన ఈ జగత్తును అర్థమయ్యే రీతిలో వివరిస్తున్నాను. వినండి. లోకంలో పేరు (నామము లేక శబ్దము) లేని వస్తువుగాని, వస్తువులేని శబ్దంగాని లేవు. శబ్దం లేకుండ అర్థము, అర్థం లేకుండ శబ్దము ఉండవు. సందర్భాన్ని అనుసరించి శబ్దానికి అర్థబోధ ఉంటుంది. శబ్దార్థములు రెండున్ను ప్రకృతి పరిణామమే! పార్వతీ-పరమేశ్వర స్వరూపమే! శబ్దరూపంలో ఉన్న పరమేశ్వర విభూతి స్థూల, సూక్ష్మ మరియు పర అని మూడు విధాలుగా ఉంటుంది. చెవికి వినబడే శబ్దం స్థూలం. ఆలోచన

(భావ) రూపంలో ఉన్న శబ్దం... సూక్ష్మం. భావాతీతమైనది పరాశబ్దం. శివతత్త్వాన్ని ఆశ్రయించి ఉన్న శక్తికే 'పరాశక్తి' అని పేరు. ఈ శక్తి జ్ఞానశక్తితో కూడి ఇచ్ఛకు బలాన్నిస్తుంది. ఇచ్ఛయే క్రియకు మూలం. శక్తులన్నిటి యొక్క సమాహార స్వరూపమే పరాశక్తి. ఇదే మూల ప్రకృతి. ఇదే 'కుండలిని' శక్తి. ఈ శక్తియే ఆరు విభాగములుగా విజృంభించి ఉంది. వాటిలో మూడు శబ్ద విభాగములు కాగా, మూడు అర్థ విభాగములు. మంత్రము, పదము, వర్ణము ఈ మూడున్ను శబ్ద విభాగములు. భువనము, తత్త్వము, కళ... ఈ మూడున్ను అర్థ విభాగములు. వీటన్నిటికి పరస్పర వ్యాప్యవ్యాపక భావం ఉంది. అక్షరములకే వర్ణములని పేరు. అట్టి వర్ణముల కూడికచే పదములు (శబ్దములు) ఏర్పడుతున్నాయి. మంత్రములన్నీ వాక్యరూపంలో కూర్చబడి పదములచే వ్యాప్తములై ఉన్నాయి. వర్ణములన్నీ భువనముల యందు వ్యాపించి ఉన్నాయి. భువనములన్ని తత్త్వములయందు ఉన్నాయి. ఆ తత్త్వములు కళలయందు ఉన్నాయి. ఈ విషయాలన్నీ శైవాగమాలలో విపులంగా చెప్పబడ్డాయి. కనుక సర్వము పరాశక్తియే. ఆ శక్తి శివతత్త్వంలో ఉనికి కలిగి ఉంది.

మునులారా! పరమ వ్యోమము అని చెప్పబడే పరమేశ్వర ధామను (స్థానమును) శోధించే ఉపాయాన్ని చెపుతున్నాను. వినండి. ముందుగా పంచ భూతముల తత్త్వమును శోధించి (అర్థం చేసుకొని) ఆపై దానికి కారణభూతమైన శక్తిని తెలుసుకొనాలి. శక్తినుండి రుద్రుని వరకుగల బ్రహ్మాండ స్థితిని నివృత్తి కళచే శోధించాలి. రుద్రుని నుండి అవ్యక్తం వరకు గల స్థితిని ప్రతిష్ఠా కళచే శోధించాలి. అవ్యక్తం నుండి విశ్వేశ్వరుని వరకుగల స్థితిని విద్యాకళచే శోధించాలి. ఆపైన శాంతికళ చేతను, ఆపైన పరమ వ్యోమము అనబడే స్థితిని శాంత్యతీత కళచేతను శోధించాలి. వేదం ఎట్టి శాంత్యతీత కళను లక్ష్యార్థంగా చేసికొని... పరమవ్యోమ శబ్దాన్ని ప్రయోగించిందో... ఆ శబ్దానికి తాత్పర్యం నేను చెప్పినదే! అట్టి పరమాత్మకు ప్రకృతి సంయోగంచే ఈ జగత్తు వ్యక్తమైంది. సాధకులు ఈ సృష్టి అంతయు పరమాత్మయందు అధిష్ఠితమై ఉన్నట్లుగా దర్శించాలి. దీనికి భిన్నంగా దర్శించిన వాడు శుద్ధుడు (ముక్తుడు) కానేరడు.

మాయాశక్తి సంయోగంచే మాత్రమే శివ పరమాత్మ గృహస్థు అవుతున్నాడు. శివ సంయోగంచే మాత్రమే ఆమె గృహిణి అవుతున్నది. వారిద్దరి సంయోగంచే పరాప్రకృతినుండి వ్యక్తమైన ఈ కార్యజగత్తు అంతయు వారి సంతానమే అవుతున్నది. ఆయన కర్త. ఆమె

కారణం. ఇద్దరికీ అభేదం. కార్యమైన కుండకు కారణమైన మట్టికి భేదం లేదుగదా! నామ రూపాత్మకమైన ఈ జగత్తంతయు వాక్కు మరియు అర్థము స్వరూపంగాగల ఆ ఆరు మార్గముల వికారము మాత్రమే అని దర్శించండి. సర్వ శాస్త్రములు ఈ ఆరు మార్గముల విస్తారమును మాత్రమే బోధిస్తున్నాయి. ఇది నిశ్చయం. మునులారా! పరమ రహస్యము, అతి గుహ్యము అయిన దానిని మీకు ఉపదేశించాను. ఇదే ముక్తి మార్గం. ఇంతకు మించిన జ్ఞానం లేదు."

**శివతత్త్వోపదేశము**

ఇంతవరకు భక్తి శ్రద్ధలతో ఆలకించిన మునులు జిజ్ఞాసతో సూతుణ్ణి ఇలా ప్రశ్నించారు. "సూత మహర్షీ! శివ గాథలు చాలా విచిత్రంగా ఉన్నాయి! అందులోను ఆయన గృహస్థ జీవన చరితలు మరీ చిత్రంగా ఉన్నాయి. పార్వతీ పరమేశ్వరుల తత్త్వానికి సంబంధించిన విషయంలో మాకు శంకలు లేవు. కాని వారి లీలలను అనుసరించి వారుకూడా సాధారణ జీవులేనా అను సందేహం కలుగుతూన్నది? పరమాత్మ యొక్క పరమార్థ స్వరూపం నిర్గుణమనుట నిశ్చయమే! అట్టిచో ఆయనే తిరిగి సగుణుడు ఎట్లైనాడు? స్వరూపం మార్పులకు లోను కాదుగదా? ఈశ్వర భావము స్వతంత్రము, స్వతస్సిద్ధము అయినట్లైతే ఆయనకు రూపం ఉండటం పొసగదు. రూపం కార్యమే కనుక కారణం ఉండితీరాలి. ఆయనే మూలకారణుడు కనుక ఆరూపం కారణం లేకుండగానే సిద్ధించాలి! ఆయన సర్వ స్వతంత్రుడు కనుక తన ఇచ్ఛచే తన స్వరూపంలో మార్పులను పొందగలడు అని చెప్పే పక్షంలో ఆయన లోకంలో నిత్యములను అనిత్యములుగను, అనిత్యములను నిత్యములుగను ఎందుకు మార్చటం లేదు? ఒకవేళ శివపార్వతులు సగుణ రూపులే ఐతే వారికి కూడ మానవుల వలెనే పరాధీనత తప్పదు! ఒకవేళ నిర్గుణాన్ని ఆశ్రయించియే సగుణం భాసిస్తూన్నది అని చెప్పే పక్షంలో సగుణం యదార్థం కాకూడదు. మిథ్యకావాలి. మిథ్యారూపం వల్ల ప్రయోజనం లేదు. ఎండమావుల్లో తోచే జలభ్రాంతి దాహాన్ని తీర్చనేరదు కదా! సద్వస్తువును ఆశ్రయించుకొని దానిపై మిథ్యాపదార్థం భాసిస్తుంది. చీకటిలో త్రాడును చూచి పాము అని భ్రమించటమే రజ్జుసర్పభ్రాంతి. త్రాడు సత్ కాగా పాము అనే భ్రాంతి మిథ్య. మిథ్య వల్ల ఉపకార, అపకారములు రెండూ లేవు.

ఈశ్వరుడు తన ఇచ్ఛను అనుసరించే శరీరాన్ని పొందుతున్నాడు అని అంటే జీవులకు కర్మను అనుసరించి శరీరాలు పుడుతున్నాయి. అప్పుడు ఈశ్వరుడు కర్మబద్ధుడవుతున్నాడు. ఇది ఆయన స్వతంత్రత్వానికి భంగం! శివుడు కొందరిని రక్షించినట్లు మరికొందరిని

శిక్షించినట్లు ఆయన గాథల ద్వారా అవగతమవుతూన్నది! అట్టిచో ఆయనకు పక్షపాత బుద్ధి, రాగద్వేషాదులు ఉన్నట్లే గదా? శివుడు అనుగ్రహ స్వరూపుడు అయినట్లైతే ఆయన అందరకు భోగ భాగ్యములను, మోక్షాన్ని ఎందుకు ఇవ్వటం లేదు? ఇలాంటి శంకలు మాకే కాదు లోకంలో ఇంకాకొంత మందికి ఉన్నాయి. వారందరు నాస్తికులు కారు. వారిలో ఆస్తికులు కూడా ఉన్నారు. కనుక అనుగ్రహించి సమాధానం చెప్ప వలసింది."

జిజ్ఞాసువులైన మునుల ప్రశ్నలకు సంతసించి సూత మహర్షి తన మనసులో పార్వతీ-పరమేశ్వరులకు మ్రొక్కి, గురువైన వ్యాస భగవానునకు నమస్కరించి ఇలా సమాధానం చెప్పసాగేడు: "మునులారా పూర్వం వాయువు చెప్పిన దానిని చెపుతున్నాను. వినండి. సత్పురుషులను ఆశ్రయించి జిజ్ఞాసతో అడిగిన ప్రశ్నలు నాస్తికతకు నిదర్శనం కాజాలవు! బుద్ధిని అనుసరించి కర్మ, కర్మననుసరించి ఫల రూపమైన సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. బుద్ధిని ప్రచోదనం చేసేవాడు ఈశ్వరుడే! ఆయన అనుగ్రహముంటే సజ్జనులకు సద్బుద్ధి, దుష్టులకు దుర్బుద్ధి పొటమరిస్తుంది. శివుడు జగత్తుపై చూపించే నిగ్రహానుగ్రహ కర్మయందు ఆయన మాయోపాధియే సమర్థమవుతూన్నది. మాయ ఆయన శక్తియే. అది అంతటా వ్యాపించి ఉంది. మాయా సంబంధం లేకుండ నిర్గుణ పరబ్రహ్మకు నిగ్రహానుగ్రహ రూపమైన సృష్టిపాలన కుదరదు. లోకంలో సార్వభౌముని శాసనం (ఆజ్ఞ) ఆయన రాజ్యమునందు అంతటా చెల్లుతుంది! ఆ ఆజ్ఞ దుష్టశిక్షణ-శిష్ట రక్షణా రూపంలో ఉంటుంది. దుష్టశిక్షణ దండన రూపంలోను, శిష్ట రక్షణ కోశము (ధన భాండాగారం) రూపంలోను సార్వభౌముని అధీనంలో ఉంటాయి. కంటికి కనుపించని ఆయన ప్రభుశక్తి ఆయన రాజ్యమంతటా వ్యాపించి ఉంటుంది. ఇట్టి వ్యవస్థలో సార్వభౌమునికి ప్రత్యేకించి రాగద్వేషాదులు దానివల్ల సంక్రమించే పాపపుణ్యములు ఏముంటాయి? సృష్టి నియంత్రణలో శివుని స్థితి అట్టిదే!

లోకంలో అనుగ్రహించే వాని అపేక్ష లేకుండా అనుగ్రహం ఉండదు. సృష్టిలో సకల ప్రాణులకు పరమేశ్వరానుగ్రహం లేనిదే భుక్తిముక్తులు లభించవు. ఆకారణంగా జీవుడు పరతంత్రుడు. ఆజ్ఞలేదా అనుగ్రహం ఈశ్వరుని స్వభావం. కనుక ఆయన స్వతంత్రుడు. సర్వకారణకారణుడగు శివుడు నిర్గుణుడే అయినా... అనుభూతికి అందని వాడేమీ కాదు! పంచేంద్రియ పరిజ్ఞానమునకు అందడు అని మాత్రమే తాత్పర్యం. శివుని సగుణ రూపాన్ని తిరస్కరించటం తాత్పర్యం కాదు! ఆయన సగుణ రూపం నిర్గుణ పరబ్రహ్మకు ఉపలక్షకం (దగ్గరగా చూపించేది) మాత్రమే! అరణిని (కట్టెను) ఆశ్రయించకుండా మనకు అగ్ని

లభించదు. అలాగే సగుణోపాసన లేకుండ మనకు శివానుగ్రహం లభించదు. ఆ సగుణ రూపం మనకు ముక్తి పర్యంతము అనుగ్రహించగల సామర్థ్యం కలదియే!

కర్మఫలం పరిపక్వమైనప్పుడు ఫలరూపంలో జీవులు అనుభవించే సుఖదుఃఖాలకు భోగము అని పేరు. శివునకు కర్మలేదు కనుక భోగం లేదు. హరి, బ్రహ్మేంద్రాది దేవతల యందు దోషం ఉంది కనుక వారు శివుని ఆగ్రహానికి గురైనారు. దుష్టశిక్షణ వలన దోషి పాపముల నుండి విముక్తుడవుతున్నాడు. ప్రజలకు సుఖ, శాంతులు కలుగుతున్నాయి. సాధు సంరక్షణ కొరకు అసాధుత్వాన్ని నివారించాలి. అట్టి ప్రయత్నం సామ, దాన, భేదోపాయములచే సఫలం కాకపోతే దండన మాత్రమే సాధనం. రాజ దండనకు భయపడి మాత్రమే లోకం కట్టుబాటులో నడుస్తూన్నది. శివుడు బ్రహ్మాది దేవతలను శిక్షించటంలో ఆయనకు ద్వేషం లేదు. తండ్రి కుమారుని మంచి భవిష్యత్తును కోరి శిక్షించుటయందు, వైద్యుడు రోగి ఆరోగ్యాన్ని కోరి శస్త్ర చికిత్స చేయుటయందు ద్వేషం లేదుకదా? కొందరికి నిర్దయగా తోచే వారి చర్యలయందు దయ నిబిడీకృతమై ఉన్నది. ఒకవేళ వారు భ్రాంతిలోపడి దయను చూపిన ఎడల అది నిర్దయయే అవుతుంది. కనుక అన్ని పరిస్థితులలోను దయ అభిలషణీయం కాదు.

అపవిత్రులైన వారిపై అనుగ్రహాన్ని చూపి వారిని ఉద్ధరించినట్లుగా కొన్ని శివగాథలున్నాయి. అంత మాత్రాన శివపరమాత్మకు రాగదోషం అంటదు. మలిన బంగారాన్ని అగ్నిలోవేసి కాల్చి శుద్ధి చేసినప్పుడు ఆ మాలిన్యం అగ్నికి అంటదు సరిగదా బంగారం శుద్ధి అవుతుంది. జీవులు ఎట్టి పాపకర్మలను చేసినా శివానుగ్రహంచే పరిశుద్ధులవుతారు. అనుగ్రహానికే ఉపకారము అనిపేరు. అది హితోక్తుల రూపంలో ఉంటుంది. శివానుగ్రహం సర్వులపైన సమానంగానే ప్రసరిస్తుంది. పెద్దల మాటలను పెడచెవిని పెట్టిన కొందరు మలిన మనస్కులు దానిని అందుకోలేరు. దానికి కారణం స్వభావం.

మునులారా! శివానుగ్రహమును పొందటానికి తగిన ఉపాయాన్ని చెపుతున్నాను వినండి. పరోక్షము మరియు అపరోక్షము అని జ్ఞానం రెండు విధాలుగా ఉంది. దృఢంగా స్థిరపడని జ్ఞానం పరోక్షం. స్థిరపడిన జ్ఞానం అపరోక్షం. అపరోక్ష జ్ఞానం లేనిదే మోక్షం లేదు. శైవాగమములు శ్రౌతము మరియు అశ్రౌతము అని రెండు విధాలుగా ఉన్నాయి. వేదముల సారంతో కూడినది శ్రౌతం. స్వతంత్రము మరియు సంస్కారములతో కూడినది అశ్రౌతం. స్వతంత్రమైన శైవధర్మాలు కామికాగమ, యోగజాగమ, చింత్యాగమ, కారణాగమ,

అజితాగమ... ఇత్యాది ఇరువై ఎనిమిది దివ్యాగమాలలో చెప్పబడ్డాయి. వీటికి సిద్ధాంతము అని పేరు. వీటినుండి పుట్టిన తంత్రాంతరములు కోటానుకోట్లు ఉన్నాయి.

వేదముల సారంతో కూడిన శైవధర్మం వందకోట్ల శ్లోక సంఖ్యకలిగి విస్తారంగా ఉంది. దానిలో శ్రేష్ఠమైనది పాశుపత వ్రతం మరియు జ్ఞానం. దీనిని కాలచక్ర పరిభ్రమణంలో శివుడే స్వయంగా యోగాచార్య రూపంలో అవతరించి లోకులకు నేర్పుతున్నాడు. దీనిని సంక్షేపించి చెప్పిన ఋషులు (గురువులు) నలుగురు. రురువు, దధీచి, అగస్త్యుడు, ఉపమన్యుడు అనునని వారిపేర్లు. వీరిలో ఉపమన్యువునకు గొప్ప కీర్తి ఉంది. ఈ పాశుపత సంప్రదాయంలో గురువులు వేల సంఖ్యలో ఉన్నారు. సకల శైవాగమములయందు క్రియాపాద, చర్యాపాద, యోగపాద, జ్ఞానపాదములను నాల్గు పాదములుంటాయి. శ్రేష్ఠమైన పాశుపతవ్రత దీక్షా జ్ఞానాన్ని గీతాచార్యుడైన శ్రీకృష్ణుడు పంద్రెండు మాసములు ఉపమన్యుని సేవించి ఆయన ద్వారా పొందేడు. ఆపై తపస్సాచరించి శివానుగ్రహంతో జాంబవతియందు సాంబుడనే పుత్రరత్నాన్ని కన్నాడు.

**ఏడవదియగు వాయవీయ సంహితలో పూర్వ ఖండం ముగిసినది.**

**॥ శ్రీ కృష్ణార్పణమస్తు ॥**

**॥ శ్రీ సాంబసదాశివార్పణమస్తు ॥**







శ్రీ గణేశాయ నమః

# శ్రీ శివ మహా పురాణము

## వాయవీయ సంహిత - (ఉత్తరభాగం)



శ్లో॥ ఓం నమస్సమస్త సంసార - చక్రభ్రమణ హేతవే ।
గౌరీకుచతటద్వంద్వ - కుంకుమాంకిత వక్షసే ॥

**తా ॥** సంసారము అనే చక్రము తిరుగుటకు కారణమైన వాడును, గిరిజాదేవి యొక్క స్తనద్వయము మీది కుంకుమచే శోభిస్తూన్న వక్షఃస్థలము కలవాడును అగు పరమేశ్వరునకు నమస్కారం.

**గౌరీ శంకరుల విభూతియోగం**

నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుడైన సూతుడు తపోధనులైన మునులతో ఇలా అంటున్నాడు: "మునులారా! పురాణములలోనికెల్ల శ్రేష్ఠము, ఉత్తమము అయిన శివమహా పురాణంలోని ఏడవ సంహిత ఐన వాయవీయ సంహితోత్తర ఖండమును చెపుతున్నాను వినండి. ఈ ఉత్తర ఖండంలోని విషయాలన్నీ ఇంతకుముందు నడచిన ప్రసంగంలో గతార్థమైనాయి. నిజానికి శివతత్త్వం లక్ష సంవత్సరాలు చెప్పినా తరగనిది. అంత వేదరాశి ఆయన మహిమను గానం చెయ్యలేక అలసిపోతే అల్పుడనైన నేనా ప్రసంగించేది! ఐనాకొన్ని శ్రుతి సమ్మతమైన విషయాలను, పరమేశ్వర విభూతిని తదితరమైన వాటిని గూర్చి ప్రసంగిస్తాను.

ఈ సృష్టిలో పిపీలికాది బ్రహ్మ పర్యంతము జీవులందరు పశువులే! తదధిష్ఠానంగా ఉండి నడిపించే శివుడు పశుపతి అని పిలువబడుతున్నాడు. ఈ సృష్టి అంతా ఆయన యొక్క లీల. లీల అనగా ఆయననుండి ప్రవాహ రూపంగా వ్యక్తమైనది అని అర్థం. మన ఇచ్ఛాశక్తి మన శరీరావయవముల మీద ఎలా పనిచేస్తుందో పరమేశ్వరాధిపత్యం సృష్టి మీద అలాటి ఆధిపత్యాన్ని కలిగి ఉంటుంది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశానుడు,

సదాశివుడు వీరైదుగురు ఆ శివుని మూర్తులే. ఈశాన, తత్పురుషాది పంచ బ్రహ్మలు ఆయన స్వరూపములే. ఇందులో శ్రేష్ఠమైన ఈశానమూర్తి ప్రకృతిభోక్త ఐన క్షేత్రజ్ఞుని అధిష్ఠించి ఉంటుంది. తత్పురుష మూర్తి త్రిగుణములను, అఘోరమూర్తి బుద్ధిని, వామదేవమూర్తి అహంకారమును, సద్యోజాత మూర్తి మనస్సును అధిష్ఠించి ఉంటారని శ్రుతి అంటున్నది. చెవి, ముక్కు, శబ్దము, ఆకాశము అను వాటికి ఈశానుడు అధిష్ఠానం. చర్మము, చేయి, స్పర్శ, వాయువు వీటికి తత్పురుషుడు అధిష్ఠానం. కన్ను, కాళ్ళు, రూపము, అగ్ని అనువాటికి అఘోరమూర్తి అధిష్ఠానం. నాలుక, విసర్జనేంద్రియము, రసము, నీరు అను వాటికి వామదేవమూర్తి అధిష్ఠానం. ముక్కు, జననేంద్రియము, గంధము, భూమి అను వాటికి సద్యోజాత మూర్తి అధిష్ఠానం.

ఇంతేకాకుండ శర్వుడు, భవుడు, రుద్రుడు, ఉగ్రుడు, భీముడు, పశుపతి, ఈశానుడు, మహాదేవుడు అను ఎనిమిది మూర్తులు ప్రసిద్ధంగా ఉన్నాయి. ఈ మూర్తులు అధిష్ఠానంగా క్రమంగా భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, క్షేత్రజ్ఞుడు, సూర్యుడు, చంద్రుడు పూజనీయులగుచున్నారు. శర్వుడు అధిష్ఠానం కనుక భూమికి 'శార్వి' అని, భవుడు అధిష్ఠానం కనుక జలమునకు 'భావీ' అని, రుద్రుడు అధిష్ఠానంగాగల అగ్నికి 'రౌద్రి' అని, ఉగ్రుడు అధిష్ఠానంగాగల వాయువుకు 'ఔగ్రి' అని, భీముడు అధిష్ఠానంగాగల ఆకాశానికి 'భీమ' అని సార్థక నామధేయా లేర్పడ్డాయి. ఈ విధంగా సృష్టి అంతా శివాత్మకమే కనుక దేనిని నిరసించినా, నిందించినా అది శివనిందయే అవుతుంది.

జడచేతనాత్మకమైన ఈ జగత్తంతా పార్వతీ పరమేశ్వరుల విభూతియే! విభూతి శబ్దానికి ఐశ్వర్యమని అర్థం. ఆయన నుండి వ్యక్తమైన ఈ సృష్టి ఆయన మహదైశ్వర్యంలో అణవుకూడా కాదు! వ్యక్తమైన దానికే నామరూపాదులుంటాయి కాని అవ్యక్తానికి నామరూపాదులుండవుగదా! అవ్యక్తానికి... అవ్యక్తమనే పేరు. సృష్టికారణమైన మూలప్రకృతి, మాయ, త్రిగుణ అను మూడు పేర్లతో పిలువబడే శక్తి ఏదిగలదో... ఆశక్తి పరమేశ్వరియే! పరమేశ్వరిని ధరించినవాడు పరమేశ్వరుడు. సూర్యునికి సూర్యతేజస్సుకు ఏ విధంగా భేదం లేదో ఆ విధంగానే పరమేశ్వరీ పరమేశ్వరులకు భేదం లేదు. బ్రహ్మయొక్క భార్య (శక్తి) బ్రాహ్మి అని పిలువబడే సరస్వతి. విష్ణువు యొక్క భార్య (శక్తి) వైష్ణవి అని పిలువబడే లక్ష్మి. రుద్రుని భార్య (శక్తి) రౌద్రి అని పిలువబడే పార్వతి. ఇంద్రుని భార్య (శక్తి) ఐంద్రి. అలాగే అగ్ని-స్వాహాదేవి, మనువు-శతరూప, దక్షుడు-ప్రసూతి, భృగుడు-ఖ్యాతి, మరీచి-సంభూతి,

అంగిరసుడు–స్మృతి, పులస్త్యుడు–ప్రీతి, కశ్యపుడు–అదితి, వసిష్ఠుడు–అరుంధతి, అత్రి–అనసూయ... ఇలా లోకంలోని పురుషులందరు పరమేశ్వర స్వరూపములే! స్త్రీలందరు పరమేశ్వరీ స్వరూపములే.

సత్–అసత్, చేతనము–జడము, అక్షరము–క్షరము ఇలా పరస్పర విరుద్ధంగా కనిపించేదంతా ఆయనే! కారణము–కార్యము, బీజము–వృక్షము, జాతి–వ్యక్తి... అన్నీ శివుడే! ప్రధానము, విరాట్, హిరణ్యగర్భుడు, ప్రాజ్ఞుడు, తైజసుడు, విశ్వుడు, తురీయుడు... అన్నీ ఆయనే! ప్రమాత, ప్రమాణము, ప్రమేయము, ప్రమ (జ్ఞానం) అన్నీ ఆయనే! కర్త, క్రియ, కార్యము, కారణము, సాధనము కూడా ఆయనే! అంతర్ముఖుడైన జ్ఞానికి సృష్టి అంతా అర్ధనారీశ్వర విలాసమే! శివుడు ఆయన స్థానం నుండి చ్యుతుడుకాడు. అందుకే ఆయనకు 'స్థాణుడు' అని పేరు. శివ–శక్తులకు ఎన్నడూ వియోగం ఉండదు. వారి తాదాత్మ్యము (సంయోగం) వలన ఆనందం కలుగుతుంది. వారు జగదానంద కారకులు!

మోక్షకారకమైన శైవ ధర్మాన్ని అందులోను శ్రేష్ఠమైన పాశుపత వ్రతదీక్షను లోకంలో వ్యాపింప చేసిన వారు ఇరవై ఎనిమిదిమంది యోగాచార్యులు. వారెవరనగా 1) శ్వేతుడు, 2) సుతారుడు, 3) మదనుడు, 4) సుహోత్రుడు, 5) కంకుడు, 6) లౌగాక్షి, 7) జైగీషవ్యుడు, 8) దధివాహుడు, 9) ఋషభుడు, 10) ఉగ్రముని, 11) అత్రి, 12) సుపాలకుడు, 13) గౌతముడు, 14) వేదశిరముని, 15) గోకర్ణుడు, 16) గుహావాసి, 17) శిఖండి, 18) జటామాలి, 19) అట్టహాసుడు, 20) దారుకుడు, 21) లాంగులి, 22) మహాకాలుడు, 23) శూలి, 24) దండి, 25) ముండీశుడు, 26) సహిష్ణుడు, 27) సోమశర్మ, 28) లకురీశ్వరుడు. వీరంతా వరాహ కల్పంలోని ఏడవ మన్వంతరంలోని వారు. వీరికి ఒక్కొక్కరికి నలుగురు చొప్పున నూటపన్నెండుమంది యోగాచార్యులు శిష్యులు పాశపత శైవాన్ని లోకంలో ప్రచారం చేశారు. వీరంతా సాక్షాత్తు పరమ శివులే!

ఈ పాశుపత దీక్షలో జ్ఞానము, క్రియ, చర్య, యోగము అని నాలుగు పాదములున్నాయి. జీవుడు, బంధము, ఈశ్వరుడు అనువాటి పరస్పర సంబంధాన్ని తెలుసుకొనటానికే జ్ఞానమని పేరు. గురువుకు వశుడై ఆచరించే శుద్ధికి–క్రియ అని పేరు. పూజాదికములకు చర్య అని పేరు. శివునియందే స్థిరమైన చిత్తమును కలిగియుండి ఇతర మనోవృత్తులను నిరోధించుటయే యోగం. సర్వసిద్ధులను ఇచ్చేది 'ఓం నమశ్శివాయ' మంత్రం ఒక్కటే. సప్తకోటి మహామంత్రాలలో ఇది శ్రేష్ఠమైనది. ఈ మంత్రోపదేశమునకు అందరూ అర్హులే!

**శ్రీ శివమహాపురాణ ఫలశ్రుతి**

మునులారా! అతి శ్రేష్ఠమైన ఈ శివమహాపురాణం సమాప్తం కాబోతున్నది. పానీయాలలోకెల్ల శ్రేష్ఠమైనది గోక్షీరం. క్షీరసారమే వెన్న. వెన్నయొక్క సారం ఘృతం. ఘృతం యొక్క సారం తేజస్సు. తేజస్సు యొక్క సారం ఆయువు. అట్టి ఆయువు యొక్క పరమలక్ష్యం శివజ్ఞానం. శివజ్ఞానం యొక్క సారం మోక్ష ప్రాప్తి. మోక్షం యొక్క స్థితి ఆత్యంతిక దుఃఖనివృత్తి రూపము, పునరావృత్తి రహితము అయిన అఖండ అద్వైతానంద శివైక్యమే! ఇట్టి మహోన్నత స్థితికి ఉపాయాన్ని చెపుతున్నాను వినండి! ఇది చతుర్వేద సారం! అష్టాదశ పురాణేతిహాస మహావాక్య తాత్పర్య నిర్ణయం.

పార్వతీ పరమేశ్వరులు చిదానంద స్వరూపులు. ఆనందఘనులు. అమృత మూర్తులు. వారి సంకల్పం నుండి ఈ సృష్టి వ్యక్తమైంది. ఈ జగత్తంతా వారి క్రీడామందిరం. ఆనందహేల! మధురమైన ఖండశర్కరతో చేయబడిన భక్ష్యం మధురంగా ఉండక మరెలా ఉంటుంది? అందుకనే ఈ విశ్వమంతా వారి లాస్య-తాండవ రూపమైన ఆనంద హేల! ఇక్కడ ఈ భూమిమీద దుఃఖానికి తావులేదు! ఎందుకుండాలి? ఏది అలభ్యమో చెప్పండి? వజ్ర, వైడూర్య, మరకత, మాణిక్యాది నవరత్నాలు, రజత, కాంచనాది లోహాలు, దుకూలాది వస్త్రాలు, సుగంధ బంధురమైన పుష్పాలు, మధు నారికేళ, గోక్షీరాది పానీయాలు, పనసాబ్రమ జంబూఫలేత్యాది మధుర ఫలాలు, వ్రీహీ, యవ ఇత్యాది హవిస్సులు, మధుర జలపూర్ణమైన గంగా, గోదావరీ, కావేరీ, నర్మద... ఇత్యాది నదులు, సకలోషధీ సమన్విత నవరత్న నిలయములైన వింధ్య, గంధమాదన, హిమాలయేత్యాది పవిత్ర గిరులు... ఇలా ఒకటేమిటి ఇవన్నీ పరమేశ్వర విభూతులే కావా? ఆయనను కోరటానికి ఇంకేమి మిగిలి ఉన్నాయి? ఒక్కకైవల్యం మినహా! ఈ సృష్టి అంతా ఆనందంనుండే పుట్టింది! ఆనందంలోనే లీనమవుతుంది! ఇది ఉపనిషత్సారం.

ఒకవేళ దుఃఖం ఉంది అని కొందరనుకొంటే: అది 'నేను' అనే అహంకారంనుండి 'నాది' అనే మమకారం నుండి మాత్రమే పుడుతూన్నది. అఖండ చైతన్యం నుండి తనను తాను భిన్నంగా భావించుకొంటూ ఉన్నందువల్ల మనిషిలో భయం ఉత్పన్నమవుతూన్నది. భయమే దుఃఖానికి కారణం. ఈ అహంకారం ఎలా నిర్మూలనమవుతుంది అనే శంక రాగా చెపుతున్నాను వినండి: మానవుడు తన దేహంతో తాదాత్మ్యాన్ని చెందినందువల్ల 'నేను' అనే పరిచ్ఛిన్నభావం పుడుతూన్నది. 'అహం' అనేది చిత్తవృత్తి విశేషం! వృత్తి అనగా

తదాకారకారితం. మనం ఒక వస్తువును వెలుగులో చూచినప్పుడు ఆత్మాధిష్ఠానమైన అణురూపమైన మనశ్శక్తి ఆ వస్తువుపై ప్రసరించి దాని రూపాన్నే పొంది తిరిగి ఆ రూపం మన అంతఃకరణంలో ప్రతిఫలించి బుద్ధి సహాయంతో మనకు ఆ వస్తుజ్ఞానం కలుగుతూన్నది. వృత్తి అంటే... ఇదే! ఈ ప్రక్రియలోనే శరీరమే 'నేను' అనే మిథ్యాజ్ఞానం కలుగుతూన్నది. ఈ మిథ్యాజ్ఞానం ఎలా నశిస్తుందనగా: 'నేను' అనే స్ఫురణ మనలోపల ఎక్కడనుండి పుట్టుతూన్నది అని మనస్సుచే అన్వేషించగా (అహం స్ఫురణ) అది ఎక్కడనుండి పుట్టుతూన్నదో మనస్సు అక్కడనే లయమవుతుంది. వెంటనే 'అహం' అనే పరిచ్ఛిన్నభావం నశించి అఖండాద్వైతానుభవం సిద్ధిస్తుంది. ఈ జ్ఞానం శివుని నుండి కుమార స్వామికి లభ్యమైంది. ఆయన నుండి లోకానికి వెల్లడైంది. అందువల్లనే కుమారస్వామి సుబ్రహ్మణ్యుడైనాడు. సుబ్రహ్మణ్యుడనగా బ్రహ్మవేత్త. మునులారా! ఇంతకు మించిన జ్ఞానం లేదు.

ఇక 'నాది' అనే మమకారం... ఇదెప్పటికీ చావదు! వస్తు సంచయనం (ప్రోగుచేసికొనుట) చేసి దాచి పెట్టుకొనుటే మమకారం! ఈ సంపాదన అనేది ఎప్పటికీ తీరని దాహం. ఆరని అగ్ని. సముద్రం కంటె ఆశపెద్దది. అట్టి ఆశ ఉన్నవానికి సృష్టిలోని సంపదనంతటిని వానికిచ్చినా వాని ఆశ చావదు. అట్టివాడు అంతం లేని ఆశ చేతనే మరణిస్తున్నాడు. నాది అనే మమకారం త్యాగం చేతనే నిర్మూలింపబడుతుంది. మానవుడు త్యాగం చేతనే అమృతుడగుచున్నాడని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. దేనిని త్యాగం చేయాలి అనే శంక రాగా ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనే ఈషణ త్రయాన్ని, ఆపై లోపలి 'అహం'కారాన్ని త్యాగం చేయాలి. ఈ అహంకారాన్ని త్యాగం చేయటమే నిజమైన యజ్ఞం! నిజమైన పూర్ణాహుతి.

**శ్లో॥ ఏతచ్ఛివ పురాణం హి సమాప్తం హితమాదరాత్ ।**
**పఠితవ్యం ప్రయత్నేన శ్రోతవ్యం చ తథైవ హి ॥**
**నాస్తికాయ న వక్తవ్యమశ్రద్ధాయ శఠాయ చ ।**
**అభక్తాయ మహేశస్య తథా ధర్మధ్వజాయ చ ॥**
**ఏతచ్ఛ్రుత్వా హ్యేకవారం భవేత్పాపం హి భస్మసాత్ ।**
**అభక్తో భక్తిమాప్నోతి భక్తో భక్తి సమృద్ధిభాక్ ॥**
**పునః శ్రుతే చ సద్భక్తిర్ముక్తిస్స్యాచ్చ శ్రుతే పునః ।**
**తస్మాత్పునః పునశ్చైవ శ్రోతవ్యం హి ముముక్షుభిః ॥**

**పంచావృత్తిః ప్రకర్తవ్యా పురాణస్యాస్య సద్ధియా ।**
**పరం ఫలం సముద్దిశ్య తత్ప్రాప్నోతి న సంశయః ॥**
**పురాతనాశ్చ రాజానో విప్రా వైశ్యాశ్చ సత్తమాః ।**
**సప్తకృత్వస్తదా వృత్త్యాలభంత శివ దర్శనమ్ ॥**
**శ్రోష్యత్యథాపి యశ్చేదం మానవో భక్తి తత్పరః ।**
**ఇహ భుక్త్వాఖిలాన్ భోగానంతే ముక్తిం లభేచ్చ సః ॥**
**ఏతచ్ఛివ పురాణం హి శివస్యాతిప్రియం పరమ్ ।**
**భుక్తిముక్తిప్రదం బ్రహ్మసంమితం భక్తివర్ధనమ్ ॥**
**ఏతచ్ఛివ పురాణస్య వక్తుః శ్రోతుశ్చ సర్వదా ।**
**సగణస్సుతస్సాంబ శ్శంకరోతు స శంకరః ॥**

**తా॥** హితకరమైన ఈ శివపురాణం సమాప్తమైనది. దీనిని ఆదరంతో ప్రయత్న పూర్వకంగా పఠించాలి అలాగే వినాలి. నాస్తికునకు, శ్రద్ధాహీనునకు, మోసగానికి, శివభక్తుడు కానివానికి, డంబంగల ధార్మికునకు దీనిని చెప్పరాదు. దీనిని ఒక్కసారి విన్నచో పాపం నశిస్తుంది. భక్తిలేని వానికి శివభక్తి కలుగుతుంది. భక్తునకు భక్తి సమృద్ధమవుతుంది. మరల విన్నచో సద్భక్తి, ఇంకొకసారి విన్నచో ముక్తి కలుగుతుంది. కావున మోక్షార్థి ఐన వాడు దీనిని పలుమార్లు పఠించాలి. వినాలి. మోక్షార్థి ఐన సాధకుడు ఈ పురాణాన్ని ఐదుసార్లు ఆవృత్తి చేయాలి. అట్టి వానికి మోక్షం సిద్ధం. పూర్వ కాలంలో చాతర్వర్ణముల వారు దీనిని ఏడుసార్లు ఆవృత్తి చేసి శివ దర్శనాన్ని పొందేరు. అంతేగాక దీనిని భక్తితో వినిన మానవుడు ఇహంలో సకల భోగభాగ్యాలను అనుభవించి అంతంలో ముక్తిని పొందుతాడు. భుక్తిని, ముక్తిని ఇచ్చేది, భక్తిని వర్ధిల్ల చేయునది, వేదంతో సమానమైనది ఐన ఈ శివపురాణం గౌరీ శంకరులకు ప్రియమైనది. పఠనానికి, శ్రవణానికి కూడా సామర్థ్యం లేని అశక్తుడు మనసులో ఒక శుభాన్ని సంకల్పించుకొని కొన్ని గ్రంథప్రతులను మ్రొక్కుగా పంచినా అట్టి భక్తునకు తప్పక శివానుగ్రహంచే అతని సంకల్పం నెరవేరుతుంది.

ఈ శివపురాణం చెప్పిన వానికి, విన్నవానికి, గ్రంథప్రతులను అర్హులైన శివభక్తులకు పంచిన వానికి గణములతో పుత్రులతో మరియు పార్వతితో కూడియుండే శివపరమాత్మ సర్వకాలములలో మంగళములను కలిగించునుగాక!

**శ్లో॥ కించాన్యత్ సస్యపూర్ణా భవతు వసుమతీ నష్టదుర్భిక్షరోగా ।**
**శాంతిర్గోబ్రాహ్మణానాం భవతు నరపతిః పాతు పృథ్వీం సమగ్రామ్ ॥**

**తా॥** ఇక చెప్పవలసినదేమి కలదు? వసుమతి సస్యపూర్ణ యగునుగాక! దుర్భిక్షములు, రోగములు నశించును గాక! గో, బ్రాహ్మణులకు శాంతి కలుగును గాక! ఈ సమగ్రమైన అవనినెల్ల నరపతి రక్షించునుగాక!

**శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం**
**న్యాయేన మార్గేణ మహీం మహీశాః ।**
**గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం**
**లోకాస్సమస్తా స్సుఖినో భవంతు ॥**

**శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః - పృథివీ సస్యశాలినీ ।**
**దేశోయం క్షోభరహితో - బ్రాహ్మణాస్సన్తు నిర్భయాః ॥**

ఇతి శమ్.

**శ్రీ శివమహా పురాణం సర్వము సంపూర్ణము.**

**శ్రీ సాంబసదాశివార్పణమస్తు.**

**శ్రీ కృష్ణార్పణమస్తు.**

**సర్వేజనాస్సుఖినో భవంతు.**

# గద్య

ఇది శ్రీ త్రిలింగ దేశాంతర్గత కోనసీమ మండల పవిత్ర కౌశికీతీర 'బ్రహ్మపురి' నామ విఖ్యాత "పేరూరు" గ్రామోపకంఠ "విశ్వేశ్వరాగ్రహార" గ్రామ అగ్రజన్ముండును, విమల "విశ్వనాథం" వంశ సచ్చరిత్రుండును, కుత్సస గోత్ర పవిత్రుండును, అన్నపూర్ణా–సుబ్బరాయ ద్వితీయ పుత్రుండును, పార్వతీ సహిత శ్రీ విశ్వేశ్వర స్వామి పదసమారాధన తత్పరుండును, నిత్య సాహితీ పఠనాయత్త చిత్తుండును, సంగీత సాహిత్య నృత్య గీత కళాభిజ్ఞుండును, "అలంకృతి" నామ శివస్తోత్ర కృతి విరాజితుండును, సమస్త ఆంధ్ర ప్రబంధ పరిశీలిత "నృత్యకళా ప్రస్తావన" నామ గ్రంథ రచనాభి శోభితుండును, విద్వజ్జన సంస్తూయమాన "సంపూర్ణ హనుమత్ చరిత్ర" గద్య ప్రబంధ నిర్మాణ కుశలుండును, **"సాహిత్య కళానిధి"** బిరుద విభ్రాజ మానుండును, బుధజన విధేయుండును అగు **సత్యనారాయణ మూర్తి** నామ కవి వర్యునిచే రచింపబడిన శ్రీ శివ మహాపురాణము నందు సర్వము సంపూర్ణము.

**సంపూర్ణం.**





దేవనాథ ! మహాదేవ ! కరుణాకర ! శంకర ! ।
ప్రసీద జగతాం నాథ ప్రసీద పరమేశ్వర ॥
ప్రసీద సర్వకర్తా త్వం నమామస్త్వాం వయం ముదా ।
త్వయి భక్తి ర్దృఢాస్మాకం నిత్యంస్యాదనపాయినీ ॥

దేవదేవ! మహాదేవా! కరుణాకరా! శంకరా! ప్రసన్నుడవు కమ్ము. పరమేశ్వరా! సర్వమును చేయువాడవు నీవే. నీకు మేము ఆనందంతో నమస్కరిస్తున్నాం. నీయందు ఎన్నటికీ తొలగిపోని, నిత్యమగు భక్తి దృఢముగా కలుగు గాక!

పుట. 278

మహేశ్వర మహాభాగ శుభాశుభ నిరీక్షక ।
ఆప్యాయాస్మాన్ హి దేవేశ కర్తౄన్ వై వచనం తవ ॥
రూపకోటి సహస్రేషు రూపకోటి శతేషుచ ।
అంతం గంతుంన శక్తాస్స్మ దేవదేవ నమోఽస్తుతే ॥

మహేశ్వరా! మహాత్మా! ప్రాణుల పుణ్యపాపములకు సాక్షివి నీవే! నీ వచనాన్ని పాలించే మమ్ము ఆనందింప చేయి. కోట్లాది రూపాలలో నిన్ను దర్శిస్తున్నాం. కాని నీ విభూతుల అంతాన్ని తెలుసుకోలేక పోయాం.

పుట. 248



రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాదు-29
email : publication@rkmath.org



CONQUER YOURSELF
ISBN 93-83142-62-0
9 789383 142620
www.rkmath.org
Sri Shiva Maha Puranamu ₹ 250/-